महाकविकालिदासविरचितम्

# अभिज्ञानशाकुन्तलम्

काटयवेमविरचितया

वसन्तराजीयाख्यया व्याख्यया समेतम्

అభిజ్ఞాన శాకుంతలమ్


संपादक :

'शिरोमणि:, विद्वान्'

श्री चेलमचेर्ल रङ्गाचार्यः

Retd. Reader, Osmania University

उपोद्घातलेखक :

डॉ. चिवुकुल मार्कण्डेय शास्त्रि (M.A. Ph.D.)

महोदयविरचितेनोपोद्घातेन विभूषित:





आन्ध्रप्रदेश साहित्य अकाडमी

सैफाबाद – हैदराबाद–५०० ००४.



# మాతృజ్యోతి.



గ్రంథకర్త :—

శ్రీస్ చక్రవర్తుల వేంకట వరదాచార్యులు,

శిస్టు : తాడిపత్రి : (అనంతపురం జిల్లా.)



శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః.

# మాతృ జ్యోతి.




—: గ్రంథకర్త :—

వంశపరంపరానుభవ వైద్య,జ్యోతిషరత్న, వాస్తువాచస్పతిః

శ్రీమాన్ తిరుమల నల్లాన్ చక్రవర్తుల

**వేంకట వరదాచార్యులు.**

బొందలదిన్నె పోష్టు, తాడిపత్రి తా॥





ప్రొద్దుటూరు

శ్రీ దుర్గా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

మొదటికూర్పు 500 ప్రతులు

**1964.**




[వెల రూ. 5-00



# రాఘవేంద్ర గురుప్రార్థన.

తే॥ గీ॥ రాఘవేంద్ర గురూత్తమ రాగరహిత
నిన్ను కనుదోయిగానెంచి యున్నవాఁడ
దారి యెటుచూపెదో నీదెభారమయ్య
అవ్యయానంద యతిరాజ దివ్యతేజ॥

కర్మభూమిని కన్నులుకల్గి గ్రుడ్డి
చేయి సాచితి సద్గతి చేర్చుమంచు
చేర్తువో చేర్చవో శరణార్తుఁడయితి
రమ్యగుణ సాంద్రమద్గురు రాఘవేంద్ర॥

కర్మ చీకటులలమిన కారణమున
కన్నులుండియు దారిని గానకుంటి
వెలుగుచూపించి చేర్పవావలను నన్ను
పరమ గుణగణ్య! సన్మాన్య! గురువరేణ్య!॥



శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః.

# విజ్ఞాపన.

పాఠక మహాశయులారా!

నేనీ నవల వ్రాయు ఉద్దేశ్యము ఏమన, సోదర సోదరీ మణులు విద్యాభివృద్ధి, ధనాభివృద్ధి, గృహాభివృద్ధి, వస్త్రభూషణాభివృద్ధిలో ముందంజవేయు చుండిరి, గాని భారత సాంప్రదాయముల ఆహార విహార వ్యవహారములావిగాగల వాటిలో వెనుక పడుటచూచి దైవభక్తి సనాతన ధర్మము, దయ, దాక్షిణ్యము, శాంతము, బంధుమిత్రప్రేమ నీతి నియమము అన్యోన్యత దినచర్య పాప పుణ్య విచక్షణ మొదలగునవి సన్నగిల్లుట చూచి భారతీయ న్యాయములు ఆచరణలు పాశ్చాత్య న్యాయములై అనేకములయిన ఆచార మతములమధ్యా ఎటుపోవుటకు దారిచక్కగా గానరాక కడకు నాస్తిక్యము ప్రబలుట చూచి సద్‌గ్రంథములు ఎన్నో నీతినియమముల ధర్మముల తెల్పగలవి ఉన్నవిగాని వాటినిచూచి గ్రహింపశక్తిలేని స్త్రీలు బాలురు కొలది విద్యగల పురుషులు విద్యరాక ఆచరణ తెలియక సంస్కారములేక సంస్కరించు సత్‌పురుషులు అంచునలేక చెడిపోవు వారినిచూచి ఏవో కొన్ని నాకు తెలిసినవి ఉడతాభక్తివలె హిందూమత సంప్రదాయములగు ఆచరణా విధానములు ఆహార విహార వ్యవహారములు, వస్తుగుణ తత్వము, ధర్మములు నీతులు, నియమములు, దైవభక్తికి కావలసిన శ్లోకములు, కొంత వైద్య విధానము, అన్యోన్యత గృహపరిశుభ్రత, దేహ పరిశుభ్రత, గృహోపకరణ సవరణలు, భార్యా భర్తల ధర్మము సఖ్యత ఆచారము, పాప పుణ్య పరిశీలన మొదలగునవి ప్రేమఘట్టములతో భార్యా భర్తల మధ్య వెలువడించితిని. గురు శిష్య రూపమునగాని తల్లి, పిల్ల రూపమునగాని నీతులు వెలువడి ప్రేమరసమో, హాస్యరసమో ముఖ్యముగాలేకున్న చదువరని భార్యాభర్తల అన్యోన్యత కుదురదు, తెలియదు అవి భార్యా భర్తలనుండే సర్వవిషయములు వెలువడించి వారి వారి మాతృదేవినుండి వారు గ్రహించినట్లు చెప్పించి మాతృజ్యోతియని పేరిడితిని. నవలా రచనకు సామాన్య కుటుంబములలో వాడుకొను భాషయే బాగుండునని కొలదిగా చదువుకున్న వారికి ఈభాషే అర్థమగుటకు సులభముగా నుండు

నని కథకు ప్రాధాన్యత ఇవ్వక సంస్కృతికి ప్రాధాన్యతయిచ్చి ప్రశ్న జవాబులతో కథ పెంచి చేతనయినంతవరకు రచనలో సమయాను కూలముగా సాంప్రదాయములు మొదలగునవి వెలువడించితిని సాహిత్య రంగములో ఇంతవరకూ నాకు ప్రవేశములేదు. నేను ప్రవేసించి సాధించినవి వేరు, మధ్యలో ఎందుకో అకారణముగా ప్రవేశించి సాహసము లేకున్నా సాహసించి నామనోగతమయిన విషయములు చిన్న చిన్న పదములతో నవలా రూపమున తెల్ప నుద్యుక్తుడనైతిని. భావము పరుగిడుచుండ భాష వెన్నాడలేక కుంటుపడినను సర్వజనోపయుక్తముగా నుండునను తలంపుతో అక్కడక్కడికి అతుకు పెట్టగలిగితిని. ఇందులో దైవ ప్రార్థనకు మునులచే మహనీయుల్చే రచింపబడినవి వేదవిహితములుగా నున్నవి. సాంప్రదాయ సిద్ధముగా నున్నవి. శ్రేయోదాయకములని మనము పద్యరూపముననో, శ్లోకరూపముననో తయారుచేసి పెట్టుటచే మముగాదని భావించి వంశ పరంపరగా ఇంటవాడుకలో నున్నవికొన్ని, గ్రంథములలోటినికొన్ని ధ్యానసమయములచేర్చి ఉదాహరణకు భాగవతములో పద్యముల ఎక్కువగా వాడితిని కొంతకథ నడచులోపల మిత్రులు కొందరు పద్యములే వద్దనిచెప్పగా వాటిని తగ్గించి వచనముగానే వ్రాసితిని. ఏవో కొన్ని మాత్రమే కథకు సంబంధించిన పద్యములు, దండకములు వ్రాసి చేర్చితిని. అక్కడక్కడా ప్రేమఘట్టములలో మితిమీరి నడక నడచివుండవచ్చును యుక్తవయసులో ఒకరిని ఒకరు ప్రేమించుట తెలియక సిగ్గుబిడియములకులోనై సంసారభిన్నము చేసుకొని వెనుక చింతించువారిని చూచి కొంతనడక కొన్నిపదములు ముందుకు పోనిచ్చితిని. ఇందుకు స్త్రీలు పాఠకమహాశయులు సోదర భావమున మన్నింప ప్రార్థన. ఇందులో తప్పులు వప్పులుగా భావించి గ్రంథము పలువురకు అందుబాటొసంగి బంధు మిత్రులకు తెల్పి విద్యాభివృద్ధికితోడు భారత సాంప్రదాయాభివృద్ధి లోకజ్ఞాన ఆచరణ, అన్యోన్యతాభివృద్ధి గలుగునట్లు చేయుదురని ప్రార్థన.

ఇట్లు బుధజనవిధేయుడు,

రచయిత.



శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః.

# మాతృ జ్యోతి.

—: ఉషః కాలము. :—





శా॥ శ్రీకష్ణా! యదు భూషణా! నరసఖా! శృంగార రత్నాకరా!
లోక ద్రోహినరేంద్ర వంశ దహనా! లోకేశ్వరా! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా! నిర్వాణ సంధాయకా!
నీకు న్మ్రొక్కెద ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!

స్వామీ! శ్రీకృష్ణా! నీదయాంతః కరుణ పరిభావముచే ఇంతవరకూ క్షేమముగా ఉన్నాము. ఉదయభానుడు, తనలేత కిరణములచే, సర్వజీవరాసుల నెల్లను మేల్కొల్పుచూ ఉదయగిరిపై వేంచేయు చున్నాడు. ఇది మొదలు సాయం పర్యంతము, ఎట్లు కాపాడెదవో ఏమో! వాక్కలహములూ, అపాయములూ, జల అగ్ని సర్ప విష శత్రు పాప హింస పరాభవ గండములలో తగుల్కొనక తప్పి తిరుగవలయునన్న నీ చల్లనిచూపు గావలయును. అట్లుగాక వేరొంతు మార్గమున తప్పించుకొన నలవిగాదు. ప్రభో నీచేయ నా యదృష్టము. ఇహపరములకు నీవేదిక్కు అంటూ శాంతమ్మ తన పడకనుంచీ కృష్ణ కృష్ణాఅని లేచి పడక చుట్టి వారనుంచి కమలా అన్నది.

కమల పలుకలేదు. తిరిగీ రెండు మూడు దఫాలు పిలిచెను. కమల ఇటూ అటూ పొర్లుతూ, ఎందుకమ్మా ఇంత చీకటిలో లేపుతావు అన్నది.

తల్లి శాంతమ్మ ప్రశాంత వదనముతో తల్లీ నేనుకూడా నీ వయసులో మాయమ్మ చెప్పిన మాటలకు జవాబులు చెప్పుచూ నిర్లక్ష్యముచేసి మాట్లాడే దానను. ఇప్పుడు ఆ మాటలు వజ్రపు తునకలవలే నామనస్సులో ప్రకాసించు చున్నవి. అట్లనే నీకు కూడా భవిష్యత్తులో నేను స్మర్ణకు వస్తాను. తల్లీ లే లేమ్మా కృష్ణభగవానుని తలంచుకో సర్వకామదుడు. ప్రపంచకర్త వారిని తలంచక లేవరాదు. ఏ పనీ చేయరాదు. లేచి కాలకృత్యములు తీర్చుకో, రాత్రిలో నాల్గవజామును బ్రహ్మముహూర్త కాలమంటారు. ఈ కాలములో లేచి దైవధ్యానముగానీ, యోగాభ్యాసముగానీ చేసుకొనువారికి ఆయురారోగ్యములు కలుగుటయేగాక కొంతవరకు దైవసాహాయ్యమూ కలుగును. ఈ బ్రహ్మ ముహూర్తకాలములో నిద్రపోవరాదు. నిద్రపోయెడు వారికి పాపము సంభవించును అన్నది శాంతమ్మ.

ఎప్పుడూ దేనికీ ఇది పాపము, ఇది పుణ్యము అంటూ నీవు చెప్పనిదేది పాపమో పుణ్యమో ఎవరు చూచినదీలేదు అన్నది కమల.

శాంత నవ్వుతూ కమలా నాస్తికత్వము మొదలు పెట్టితివా? ఔను నాస్తికుడే ఆస్తికుడయ్యేది. ఆస్తికుడు, నాస్తికుడుగా మారుటరుసు. తెలియ నప్పుడు. అనుభవము లేనప్పుడు. ప్రతిజీవికీ ఇష్టే గన్పడును. పెద్దవారి మాటలతోనున్న అర్థము. సాంగముగా తెలిసిన నాస్తిక్యము నశించునుగాని, అది అర్థము చేసుకొనలేకను, అడిగి తెలుసు కొనలేకను, చక్కని అర్థము చెప్పువారు దొరకకనూ, నాస్తికత్వమేర్పడును. ప్రబలును అప్పుడు మానవత్వము నశించి పశుత్వము సంభవించును. తల్లీ నేను చెప్పుమాటలన్నీ వేదప్రమాణములై హిందూ సాంప్రదాయ సిద్ధములైన వజ్రపు తునకలు. ప్రతియొక్క మాటలో ప్రతి సామెతలో ప్రతి సాంప్రదాయములో ప్రతి ఆచారములో బహు విధములగు అర్థములు ఇమిడి ఉన్నవి. కొన్ని ఆరోగ్యమునకూ, కొన్ని జీవనాధారములకు, కొన్ని మతధర్మములకూ, కొన్ని దేశకాల సంప్రదాయములకు, కొన్ని రాజ్య భద్రతకు, భరతభూమిలో హిందూ మత ధర్మములో ఇమిడి ఉన్నవి. సామెతకూ, మాటకూ ఆచారమునకు కథకూ, పదమునకూ, పద్యమునకూ, ఎన్నో అర్థములు చెప్పువారున్నారు. ఉన్నవి. పాశ్చాత్యులవలె ఉండవు. పెద్దలమాటల శిరసావహించి చేయుచుండిన కొంతకాలమునకు నీకే అవి అర్థము కాగలవు లే అని శాంతమ్మ చెప్పుచుండగా.

కమలలేచి కాదమ్మా నేనొకటడిగిన నీవొకటి చెప్పుచూ, ఎంత చదివితివి! అసలు ఆ మాటకు అర్థమేమిటో బయటికి రాలేదు. ఇంతే మనవారు అడిగినదానికి చక్కని జబాబు చెప్పరు. అందుబాటు చేయరు. గూఢపరతురు. అర్థమడిగితే పిల్లలు మీకెందుకురా అర్థాలు అంటారు. మళ్ళీ అడిగితే పెద్దల నడుగరాదు అంటారు. ఇంకా అడిగితే పొగరుబోతు అంటారు. అక్కడికీ అడిగితే. ఛీ పొమ్మంటారు. ఇది మీ పెద్దల పెద్ద తనము. అన్నది కమల.

శాంత చిరు నవ్వుతో కమలను చూస్తూ, నీకిప్పుడేమి అర్థము కావలెనే అన్నది?

కమల. తల్లిని చూచి. బ్రహ్మ ముహూర్త కాలములో లేవకున్న పాప మంటివే. ఏ యుపకారమూ చేయక. ఎట్లు వచ్చును? ఇది ఎట్లు అపకారమగును? అన్నది కమల.

అట్లయినపిను సూర్యుని జగచ్చక్షువనియు లోకబాంధవుడనియు కంటికగపడు దేవుడనియుఅందురు. అట్టిత్రిమూర్త్యాత్మడగు సూర్యభగవాను డుదయించు వేళకు మానవుడైన వాడు దైవధ్యానమునుసేయక కాలకృత్యాదులు తీర్చుకొనక నిద్రించుట పాపముగాదా లోక హితార్థమై భగవానుడు వేంచేయుచుండ సోమరియై మానవుడు నిద్రించుట పాపముకాదా, అదియుగాక లోకమునకు తండ్రివంటివాడు వారికిరణప్రసారములచేత మనకన్నులకు వెలుగునిచ్చి ప్రతిదేహమున ఉష్ణము చేర్చి జ్ఞానేంద్రియమునొసంగి జీవనాధారమునకుదారిచూపి తన అనంత కిరణ జాలములచేత జగత్తునే మేలుకొల్పి, సర్వజీవరాసులకు అమృత మయుడై లోకరక్షకుడై ఋజుగతి వక్రగతి అస్తంగతి లేక వకక్షణము తప్పక నటించు తేజోనిధిని ధ్యానింప వలదా ఏబంధువైనా ఒకప్పుడు రాక నిరాకరించును గానీ ఈ మహాత్ముడు రాక నిరాకరించినది గలదా, జ్యోతిశ్శాస్త్రమున సూర్యుని పితృకారకుడని సర్వజీవరాసులకు తండ్రి బలము ప్రసాదించుననీ ఆ మహనీయుడు యెంత కరుణించిన అంత పితృధనము, పితార్జిత పితార్జనము పితృబలము చేకూరునని ధర్మచింతన దైవభక్తి దేహబలము నొసంగుననీ, వా రుదయించు నప్పటికే లేచి దిన కృత్యములు తీర్చుకొని. ఆరాధించిన వారికి ఆయు రారోగ్య భాగ్యముల అభివృద్ధి కావలసినంత చేయునని రాజకీయ రంగమున అగ్రస్థాన మొసంగునని యున్నది. ఇక ఆయుర్వేద మనిన రాత్రి నాల్గవ యామములో మేల్కొనియే తీరవలయును. సూర్య కిరణములు ఒకొకటిగా నాల్గవ యామము మొదటి నుంచీ మనల సమీపించును. ఆ కిరణములు సమీపించు సమయమున నిద్రించు చుండిన అవిమనలో చేరక పోవును తెల్లవారి మేల్కొనిన ఒకే తూరి ఎక్కువ వేడియైన కిరణములు

చేరి ప్రకృతికి విరుద్ధమై కంటికిచేటు తెచ్చును బాల్యములో పిల్లలు అద్దాలు వేసుకొనడం అంధులు గావడం కంటి జబ్బులు అనేకముగా రావడం పొరలు, తిమర్లు, చత్వారి, శుక్లాలు వచ్చి చూపుతగ్గి దుఃఖించడం జరుగు తున్నదంటుంది. ఇంకా ఎన్నోనిదర్శనములు ఉండును. మళ్ళీ చూతము లే లేవమ్మా లేచి కాలకృత్యములు తీర్చుకో భగవానుడు సమీపించెను కార్యములు గానీ అన్నది శాంతమ్మ.

కమల తల్లి మాటలకు సంతోషిస్తూ తెలివితేటలకు మెచ్చుకుంటూ, కృష్ణ కృష్ణా అని లేచి పోజూచు చుండెను.

అది శాంతమ్మచూచి కమలా నిత్యమూ చెప్పుచున్నానే ఇంత జ్ఞాపకము లేకుండిన ఎట్లమ్మా పెద్దవారు పిల్లవారి మంచము పరుపు ఎత్తినట్లయిన పూర్వపుణ్యము నశించి రాబోవు కాలములో కష్టములు గలుగును. చేసిన పుణ్యములకు తోడు మరింత సంపాదింప వలయుగాని నశింపు చేసుకొనరాదు. వయసు ఎట్లపెరుగు చున్నదో ఆశలు ఎటు ముందుకు పరుగిడు చున్నవో అట్లే పుణ్యమును అభివృద్ధి చేసుకొనవలయును. పుణ్యము వలన సుఖము పాపము వలన కష్టము సంప్రాప్తించును. మాతృ పితృ గురు దేవ బ్రాహ్మణ గో వృద్ధ సాధువులయందు వినయ విధేయతల చూపి వారి ఆశీస్సుల పొందవలయును. సహపాఠులతో పిల్లలతో ఆనందముగా సహకరిస్తూ గౌరవించి గౌరవింప బడవలయును. ఇట్లు వినుము ప్రహ్లాదుని బాల్యపు నడత.

సీ॥ తనయందు నిఖిల భూతములందు నొకభంగి
సమహితత్వంబున జరుగువాఁడు!
పెద్దలఁ బొడ గన్న భృత్యుని కైవడిఁ
జేరి నమస్కృతుల్ సేయు వాఁడు!
కన్ను దోయికి నన్యకాంతలడ్డంబైన
మాతృ భావముచేసి మరలు వాఁడు!
తల్లి దండ్రుల భంగి ధర్మవత్సల తను
దీనులఁ గావఁ జింతించు వాఁడు!

తే॥ సఖులయెడ సోదరస్థితి జరుపు వాఁడు!
దైవ తము లంచు గురువులఁదలఁచు వాఁడు!
లీల లందున బొంకులు లేని వాఁడు!
లలిత మర్యాదుఁడైన ప్రహ్లాదుఁడధిప!

వింటివా! ప్రహ్లాదుని నడక అందు వల్లనే- చరాచర కర్తయైన శ్రీమన్నారాయణుని అనుగ్రహమును పొందినాడు దీనులగావ భగవంతు డున్నాడని చాటినాడు ఇట్టి నడకను నేర్చుకో వలెను. తల్లీ అన్నదిశాంతమ్మ.

అప్పుడు కమల తాను పండుకన్న పరుపునుచుట్టుచూ అమ్మానన్ను పుణ్యము ఆర్జించుకో మేలుఅని చెప్పు చున్నావే నీవెందుకు చేసుకొనరాదు అన్నది.

అది విని శాంతమ్మ కమలా నేను నీకు బోధించ వలసిన జీవ న్యాయము ఉన్నది. నా న్యాయము నేను చక్కగా నెరవేర్చు కొన్నచో ప్రకృతి మాత యైన ధర్మ దేవత ఆశీర్వ దించును. అమహా తల్లి కరుణ మనుష్యులకు ముఖ్యావశ్యకము కూతురు చెడుగైన మాత తప్పు అని లోకవాడుక వద మున్నది. కూతురు బాధ్యత తల్లి చక్కగా నిర్వహించి సంస్కరించి మిగుల గుణ వతిగా తయాకు చేసి అన్ని పనులు అలవడచేసి కన్యాదానము చేసిన తలిదండ్రులకు కీర్తియు పుణ్యము లభించును. ధర్మ దేవత ఆశీర్వదించును ఈరెంటిచే ఊర్ధ్వలోకమగు స్వర్గలోక ప్రాప్తి గల్గునని పెద్దలనెదరు ధర్మశాస్త్రమున్నది. నీకు బోధించిన పుణ్యము నాకుచాలు తల్లీ నీవు నీ జీవ ధర్మమును తప్పక నటించి ఆచరించి మాకు చేసిన పుణ్యము ఆర్జించి ముందు సుఖపడవలయునని మా ఆశయము ఎంతో శ్రమ ప్రయాసలతో కష్టపడి ఆర్జించిన ధనమూ, పుణ్యము ఇచ్చుట లెస్సగాదు సమయము వచ్చిన ప్రాణము లిచ్చుటకు కూడా సంసిద్ధులమై యుంటిమి దీనికి ఇంటా బైటా బంధు మిత్రులలో అత్త వారింటిలో పేరు ప్రతిష్ఠలు ఆర్జించి నప్పుడు అవిమా చెవుల విన్నప్పుడు శ్రమ తీరును మాఋణము తీర్చిన దాన వగుదువు పాశ్చాత్య న్యాయము వహించిన మాకు బాకీ పడు దువు సంఘమర్యాదలో నీకూ మాకూ చోటులేక, నీవు పోవునదిగాక మమ్మూ నరక లోకము చేర్చెదవు అప్రతిష్ఠల పాలై తలి దండ్రులకు తీరని కళంక మేర్పరచిన స్త్రీ తలి దండ్రులకూ కట్టు కున్న వారికి తోటి సోదర సోదరీమణులకు ఋణపడి రాబోవు జన్మకు ఎవ్వరూ నా యను వారులేక ఏకాకియై దుఃఖించును. ఎందరో నీకంటె కగు పడెదరు చూడు పూర్వజన్మ పాపులు ముందు కను గానక అందరినీ కడజేసి చూతమన్న ఫలము కన్నీరులోముంచి కటిక చీకటిచేసినది. కనుగలిది ముందు జన్మమున్నదనే ఆశతో బ్రతుక వలెనమ్మా అన్నది శాంతమ్మ.

అమాటల వింటూ కమల పరుపు చుట్టి ప్రక్కన పెట్టి ఆలోచించుతూ కాలకృత్యములు తీర్చుకొన పోయెను.

శాంత సమాధానములు చెప్పుతూనే కాలకృత్యములు తీర్చు కొని వచ్చి దేవుని

పీఠముదగ్గర నిల్చుకొని చేతులు జోడించి తలవంచి భయ భక్తులతో దేవా జగన్నాయకా! లీలామానుష విగ్రహా!

శా॥ ఏ పుణ్యాతిశయ ప్రభావముననో ఈ జన్మ మందిక్కడన్
నీపాదంబులు గంటి నిన్నెరిగితిన్ నీవుఁ గృపాళుండవై
నాపై నర్మిలి చేసి మాన్పగదవే, నానా ధనాగార కాం
తాపుత్రాదుల తోడి బంధనము భక్తవ్రాత చింతామణీ!

శా॥ దేవా! నీ చరణ ప్రసాద కణలబ్ధిఁ గాక లేకున్న నొం
డే వెంటఁ జను నీ మహామహిమ నూహింపంగ నెవ్వారికిఁ
నీ వారై చను వారిలో నొకఁడనై నిన్గొల్చు భాగ్యంబు నా
కీవే ఇప్పటి జన్మ మందయిన నొండెందైననో ఈశ్వరా!

దేవా! దీన శరణ్యా! నీదయాంతః కరుణ ఏ జీవిపై కలుగునో ఆ జీవి ఈ లోకములో కోటి సూర్య ప్రకాశమానమై వెలుంగును వెలుగుచున్నది. ఇది తెలియక నేనుచేయు చుంటిని నేనార్జించు చుంటినని నాతెలివితేటలని పొరబడుచు గర్వోన్మత్తులై చేసిన పుణ్యము నష్టము చేసుకొని నిను గానక నీ కరుణకు దూరులై మరుజన్మమున సర్వదారిద్ర్యములతో అటమట పడ బోవు చుండిరి ఇది నీమాయా మహిమ దాని నెరింగి నటించు వారు నీదావునకు వచ్చు చుండిరి ఈ కలి కాలములో ధర్మవ్యతిరేకులై పోవు వారిలో నన్నూ నాకుటుంబమునూ చేర్చక నీచల్లని చూపులతో కాపాడుము జ్ఞాన చక్షు వొసంగి చెంతచేర్చు తండ్రీ అని చెప్పుకొను నంతలో కమల నిత్య కృత్యములు తీర్చుకొని వచ్చెను. కమలను చూచి శాంత దంతధావనమైన దేమమ్మా అన్నది.

ఔను "ముఖ ప్రక్షాళనామమ్మా" అని ముఖము కడిగితిని ఇక "ముఖాలంకార మామ్మా అని బొట్టు పెట్టు కొనవలయును. అని కమల కుంకుమ భరణి తీసుకొని చూపుడు వ్రేలితో బొట్టు పెట్టు కొన పోయెను.

ప్రక్కనే నిలుచుకొని యున్న శాంతమ్మ చూచి కమలా! నిత్యమూ చెప్పవలయునా? కుంకుమను అంగుళీయకపు వ్రేలు మధ్య వ్రేలు బొటన వ్రేలు ఈ మూడు వ్రేళ్లతో ఎత్తి త్రిదేవుల పాదములపై ధ్యానముతో వేయుచూ త్రిదేవులారా! సర్వదానాకు తోడు నీడై ముత్తైదు వతనమును రక్షించి కాపాడ మీరే దిక్కు సర్వదా మిమ్మునమ్మిన దీనురాలను అని నమస్కరించి, మధ్య వ్రేలుకు బొటన వ్రేలు తోడుచేసి ఆ కుంకుమను తీసుకొని మధ్య

వేలుతో బొట్టు పెట్టు కొనవలయును. చూపుడు వేలుతో బొట్టు పెట్టు కొనరాదు తల్లీ బొట్టు పెట్టు కొనుటకు దేవుని చూపడ మునకు కాయ పిందెలను చూపడమునకు పెద్దల చూపడమునకు సున్నము ఆకుకు రాయడ మునకు ఏ పదార్థములలోనైనా రుచి వాసనల చూడడ మునకు చూపుడు వేలును ఉపయోగింపరాదు మధ్య వేలునే ఉపయోగింప వలయును. దైవకార్యములకు అనామికపు వేలు అనగా ఉంగరపు వేలు ఉపయోగింప వలయును పెద్దలు చెప్పెడి మాటల వినవలయు అందులో ఏదో మేలే ఉండునని తలంచ వలయు నీ బుద్ధికి అందినదే ఆచరణ యనియు నీదే జ్ఞాన మనియు తలంచకుము మహ నీయులు ఆచరణలో పెట్టిన పనులలో ఏదో మహత్తరమైన శక్తి ఇమిడి ఉండునని తలం పుము ప్రతి దానికీ అదెందుకనీ అడుగకుము అనిశాంతమ్మ చెప్పుచుండగా తద్విధముగా ఆచరించి కమల.

అమ్మా ప్రతిదీ నీవు తప్పొప్పుల చెప్పకమానవు నేను అడుగక మానను నేను ఊర కున్ననూ నేను ఎవరికైన చెప్పినవారు నన్నడు గకమానెదరా ఏమి వారికి నేనేమి జవాబు చెప్పవలయును అందుకై నిన్నడుగు చుంటిని ఈవేళ్లలో ఉన్న బాగోగుల నీచానీచముల తెల్పిన బాగుండును అన్నది కమల.

శాంత చిరు నవ్వు నవ్వి కమలా ఈలాంటి వాటెకన్నిటకూ చెప్పడము కష్టము వలు వురు వలు విధములగు అర్థములు చెప్పు చుందురు నాకు మాయమ్మ చెప్పినదానిని మాత్రము చెప్పెదను వినుము మానవునకు హస్తము బ్రహ్మ ముద్రిక అనగా ముందు జన్మమున మానవు డొనర్చిన పాప పుణ్యములవల్ల గలుగు సుఖ దుఃఖముల సంజ్ఞా రూప ముగ తెలుసు కొన హస్తమున గీట్ల సమర్చి హస్త సాముద్రికమను పేరుతో ఒక శాస్త్రము రచించి మానవులు సుఖ దుఃఖముల తెలుసుకొను ఉపాయము బ్రహ్మ గల్పించినాడు. హస్తములోనున్న గీట్లను, వేళ్లను చూచి కొందరు మహనీయులు భూత భవిష్యత్ వర్త మాన కాలముల గమనించి, కష్ట సుఖముల తెల్పుచుందురు. హస్తములో చూపుడువ్రేలు మిగుల ప్రశస్తమైనది. ఈవేలు ఎవరికి పొడవై వేలి క్రిందిభాగమున కండరము బలిష్ట మై దిన్నెవలెనుండి నిలువుగీట్లు ఒకటి రెండు మూడు ఉండునో వారికి ధనము, ధాన్యము బంగారు గృహము బంధు మిత్రులు సత్సంతతి దైవభక్తి దానము యాత్రాఫలము పుణ్యము పుణ్యకార్యాచరణ విద్య వినయము ఇటువంటివి ఎన్నోగలుగు నందురు. నవగ్రహములే లోకముల లోకమునగల ఎనుబదినాల్గుకోట్లజీవరాసుల గతులుతప్పకరక్షించను, శిక్షించను పుట్టింపను, గిట్టింపను భగవంతుడు వీరికే శక్తినొసంగి నియమించెనందురు. వీరు తొమ్మిది

మంది లేక ఏకార్యమూ చేయరు. లోకమునకూ, లోకులకూ ముఖ్యులూ వీరిపనులు ఆశ్చర్యములు, అజేయములు. తూ. చా. తప్పకుండా చేసినది చేయింతురు: వీరు తొమ్మిది మందిలో గురువు అగ్రిగణ్యుడు. మంచివస్తువులకు అధినాయకుడు. గురువనగా పవిత్ర మయిన శబ్దము దైవసమానమైనది. వారములలోకూడా గురు వారమునకు చాలా గౌరవ మున్నది. వేళ్ళలో చూపుడువేలు గురు స్వరూపమగుటచే ఏకార్యమునకూ వాడరా దందురు. మధ్యవేలు శనిగ్రహాధిపత్యముగలది. శని నీచపదార్థములకు నీచస్థానము లకు అధినేత. మానవ కార్యములకు వాడిననూ వారు కోపగింపరు. వాడవచ్చునందురు. వారికినైచ్యమే. ఉచ్చగాబట్టి నైచ్యము నీచముగా భావింపరు. కుంకుమ పెట్టుకొనుటకు మధ్యవేలునే ఉపయోగింపవలయు నందురు. దేవునికి గంధము కుంకుమ పెట్టుటకు అ ర్చనసేయుటకు అంగుళీయకపువేలు, బొటనవేలు, మధ్యవేలు వాడవలయు నందురు. ఇందులోకూడా కొందరు కొన్నివిధములగు మార్పులజూపినారు. చూపుడువేలు అనివాడు చున్నారే చూపడమునకు మాత్రము పనికిరాదా అనరాదు. ఈ వేలికి చూపుడువేలని వాడుకున్నదిగాని ఆవేలితో దేనినీచూపరు. దేవుని కంఠహారములో ఒక పచ్చఉండిన అదిగో అక్కడున్నదని వేలితో చూపరు. వక్షస్థలములో హారమునకు మధ్యలోఉన్నది చూడమని మాటల గుర్తుతోనే సమర్థింతురు. అట్లెన్నడూ చేయకుము. పెద్దలు దూషిం తురు. పెద్దవారి మాటల అచరణలో ఉంచుకొమ్ము తప్పొప్పులు వారిపైనే ఉంచి ఆచ రించుట శ్రేయము. అన్నది శాంతమ్మ.

అమ్మా నేను నిన్నడుగక పోయిన నాకు తెలియుటెట్లు? సందేహము తీరుటెట్లు? నేనొకరికి చెప్పుటెట్లు? తెలియని వారికి తెలుపక పోయిన తెలియుటెట్లు? తెలియనివారికి ఎదిరించి అడుగు వారికి నచ్చచెప్పగల ధీమంతులు లేకపోవుటచేత మనసు తికమకలై మంచిదారి కనుగొనలేక తిరుగుకొనలేక, బుద్ధికి అందక నాస్తిక్యములో పడుదురు. మన సుకు నచ్చచెప్పగల మహనీయులు, గ్రంథములు, యువకులు, యువతులకు ముఖ్యము అవి ఉండిన కొంత నయముగా నుండునన్నది కమల.

కాను తల్లీ యౌవనములో యువకులకు, యువతులకూ తెలియ చెప్పగలవారు తెలి యచేయు గ్రంథములు అందుబాటులో అర్థము చేసుకొనగలవి లేకనే దేవుడూ దైవమనే భావము సన్నగిలి ధర్మమడుగంటి దయా దాక్షిణ్యములు నశించి భారత దేశగౌరవము, భారతీయనీతి, భారతీయ సాంప్రదాయములు శూన్యమై పాశ్చాత్య న్యాయములు ప్రబలి రెంటికిన్ చెడిన రేవనైతి నను సామెతగా ఏ నీతికీ, ఏ న్యాయమునకూ, ఏ మర్యాదకూ

ఎక్కక కట్టూ బొట్టూ బొట్టూకూడా జారవిడచి పిచ్చిముగ తిరుగవలసి వచ్చినది అన్నది శాంతమ్మ.

ఔనమ్మా మూఢత్వమూ మూర్ఖత్వమూ తెలియకనే ఉంచేది. తన మనస్సుకు తెలిసిన విల ఉండును. మూఢత్వ మూర్ఖత్వముల నశింప చేయునది విద్య; లేక విని కిడి ఈ రెండూ లేకున్న పై రెండూ తప్పవు అన్నది కమల.

విద్యలో భౌతిక విద్య జీవనోపాధికి మాత్రము పనికి వచ్చును. ఆధ్యాత్మిక విద్య అన్నిటిని చక్కపరచి, ఈ జన్మనూ రాబోవు జన్మనూ శుద్ధిపరచి, ఇహ పరములలో వెలుగు నిచ్చును. మూఢత్వ మూర్ఖత్వముల తొలగించి జ్ఞానశక్తి నిచ్చును. పాప పుణ్య ములను పట్టాలు వైతొలగకుండా బండి నడిపించి గమ్యస్థానము చేర్చునన్నది శాంతమ్మ.

ఔను తెలియచెప్పితేకదా తెలిసేది కనియో, వినియో, చదివియో మానవుడుచక్క పడవలయునని నీవేచెప్పితివే కననిది, విననిది, చదువనిది రావలయునన్న గమనమునకు పూర్వజన్మ సంస్కారముండవలయునన్నావుగా అన్నది కమల.

ఔనమ్మా చెప్పిన మాటలు ఆచరణలో ఉంచుకొను వ్యక్తులున్నచో చెప్పెడి వారుందురు. ఎదిరించి చిన్నా పెద్దా తారతమ్యములెంచక అదెందుకు, ఇదెందుకు, దీనికి అర్థమేమి దీనివల్లమేలేమి అని నాస్తిక్యము మాట్లాడు వారికి అర్థములు చెప్పగలరా చెప్పు టకు సాధ్యమా పెద్దవారు చెప్పినమాటల లక్ష్యముగా పెట్టుకొని ఆచరణలో ఉంచు కొన్న బాగుండునుగాని ఎదిరించి మాట్లాడిన ఏమి చెప్పగలరు. అన్నిటకూ అర్థములు చెప్పు లోకానుభవజ్ఞులు, గ్రంథశోధకులు, శాస్త్రజ్ఞులు దొరుకుటకష్టము. అట్టి వారైన చెప్పగలరు. అట్టివారి స్నేహము కావలయునన్ననూ పూర్వజన్మ సుకృతముండవలయు నన్నది శాంతమ్మ.

కమల తల్లిమాటలను విని దేవుని పీఠముదగ్గరకుపోయి మోకరించి తలవంచి నమ స్కరించి లేచి నిలుచుకొని చేతులు జోడించి "యాకుందేందు" అన్నది.

వెంటనే శాంతమ్మ కమలనుచూచి కమలా! రేపు నీకు భర్త వచ్చినప్పుడు నీభర్తను ఫలాహార తాంబూల నమస్కారములతో గౌరవించి నిన్ను తలంచకనే ఉండిన నీ మన స్సెట్లుండునో గమనించు. నిన్ను గౌరవించి, నీ భర్తను గౌరవించకపోయిన వారికెట్లుండు నో పరికించు. భర్తను ముందుగా గౌరవించి, తన్ను గౌరవించిన తనకుకూడా సంతోష ముండును. భర్త ఆజ్ఞలేక భార్య ఏమీ చేయజాలదు. స్త్రీ ధర్మము భర్త ఆజ్ఞానువర్తినియై

నడచుచే. పురుషుడు స్త్రీపైన ఎప్పటికీ అధికారి అనియేచెప్పవలయును. క్రిమి కీటక పశు పక్ష్యాదులు మొదలుకొని చూడుము. మగవాటి ననుసరించియే ఉన్నట్లు కన్పడు చున్నవి. ఇది దైవనిర్మితము. పురుషుడులేక స్త్రీలేదు రక్షకుండు లేకున్న క్షణములోనే భక్షకుడు వెన్నంటును. స్త్రీకి బెల్లమునకు వచ్చెడి ముప్పువచ్చును. ఆ మహా తల్లికికూడా రక్షకుడుగా బ్రహ్మ ఉన్నాడు. వారి చెప్పుచేతలలోనే ఈమె ఉండును. నీవు ధ్యానించిన వచ్చుటకు ఏవయినా ఇచ్చుటకూ వారి యాజ్ఞ ఉండవలయునో లేదో గమనించు భార్యా భర్తలు ఒకరిని పిల్చి అన్నముపెట్టిన మరొకరు ఏమగుదురో ఆలోచించు ఒకరిని భూషించి ఒకరిని దూషించి నట్లగును. ఒకరు దీవించిన మరొకరు దూషింతురు. దీవనతో విద్యా ధన దేహ సంపదలు గలిగిననూ రసికుడూ యౌవన వంతుడయిన భర్త లభించక దుఃఖించవలసి వచ్చును. దంపతుల విడటీకి పూజింపరాదు. బ్రహ్మ సృష్టికర్త ఆ సృష్టియైన బొమ్మకు సరస్వతి జ్ఞానము ఇవ్వవలయును. బాల్య యౌవన, కౌమార వృద్ధాప్యములలో ఆయా సమ యములకు కావలసినంత అనుభవమునకు తగినంత దేహశక్తి దారఢ్యముల ఉమా మహే శ్వరులు ఇవ్వవలయును. ఆయా సమయములకు కావలసినంతసంపద పరిపాలనాశక్తి లక్ష్మీ నారాయణు లివ్వవలయును. ఈముగ్గురిని జంటలుఎడబాపి సేవించినవారు సన్యాసులు, సన్యాసినులు అయిపుట్టుదురు. స్త్రీలేకపురుషుడూ, పురుషుడు లేక స్త్రీ రాణించరు. ఇహ ములో సుఖము లేదు. అట్లు విడివడినవారు దుఃఖింతురు విడిబడియూ దుఃఖించనివారు పకం బుద్ధులు వారుమహనీయులు. ఎవరిని గొల్చిననూ భార్యాభర్తల గొల్వవలయును తల్లితండ్రీ అన్నారు. కన్నది తల్లీ, పోషించినది తండ్రియగుటచే తల్లీ తండ్రీ అన్నారు. పూజించు నప్పుడూ, ధ్యానించు నప్పుడూ, సేవించునప్పుడూ పురుషునే ముందు తీసుకొనవలయును. తల్లికికూడా పూజనీయుడు, వందనీయుడు, భర్తతనకన్నా పెద్ద అందువల్ల తండ్రినేముందు పూజింపవలయును. నమస్కరింప వలయును అన్నది శాంతమ్మ.

కమల శాంతమ్మను చూచి అమ్మా స్త్రీలు స్త్రీదేవతల సేవించుట చాలదా? పురు షులతో ఏమిపని. పురుషులు పురుషుల సేవిస్తారు దీనిలోతప్పేమీ అన్నది.

శాంత నవ్వుతూ, కమలా స్త్రీకి స్త్రీలే అవశ్యకమో, పురుషులు అవశ్యకమో కొలది కాలములోనే తెలియగలదు లెమ్మ. దేహబలమూ, ధనబలమూ, జ్ఞానబలము ఉన్నదిగదా ఒకరితో మనకేమిపని అని అనుకొని ఉందువు. వేరొకరిని ఆశించక ఈ మూటితో సుఖ పడలేవు. ఆ ఆశించు బలము వారియందు ఉన్నది. అది స్త్రీకి అవశ్యకము అది గాక వేరొక మార్గమున సుఖపడలేవు. స్త్రీకి పురుషుడూ, పురుషునికి స్త్రీ ఆవశ్యకము గాబట్టి స్త్రీ పురుషులను సేవింప వలయును. స్త్రీకి దేహజ్ఞాన ధన బలములు త్రిదేవు లొసంగి

ననూ, పురుషబలము నొసంగవలదా త్రిమూర్తులు. పురుషునికి దేహజ్ఞాన ధన బలములు త్రిమూర్తులొసంగిననూ, స్త్రీబలము త్రిదేవులివ్వవలదా ఒకరిని సేవించే ఒకొక బలము గలిగి రెండవ దానికై దుఃఖించుచూ, ప్రజలు అల్లాడు చుండుట ఈ ముప్పురిని సేవించిన ధన్యాత్ములు ఏకొరంతలు లేక ఇహ పరములం సుఖింతురు. పుట్టింపను బ్రహ్మ, పోషింపను హరి, లయింపను హరుడు. అయిఉన్నారు. వీరికరుణలేకున్న పశుప్రాయులగు తలిదండ్రులకు పుట్టించును బ్రహ్మ. సమయమునకు తగినంత ధనము చేకూర్చుడుహరి. సమయమునకు చావనిచ్చును హరుడు. దేహమూ జ్ఞానమూ ధనమూ సర్వులకు కావలసినవే గాన ముప్పుర సతీ పతుల ధ్యానించుట, పూజించుట, సేవించుటశ్రేయమన్నది శాంతమ్మ.

ఒకరిని ధ్యానించుట కష్టముగా ఉంటే ముప్పురిని ధ్యానించమంటే అయ్యో పనేనా అన్నది కమల.

ఔను తలంచుటే నీకు కష్టమైన పోషించుటా సర్వకాల సర్వావస్థల కంటికిరెప్ప వలె చూపెట్టి ఉండుట వారికి కష్టముగాదా, కష్టమని సోమరులై మైథున నిద్రాహారములే నమ్మి కాలము వృథాత్రోసి దైవసేవ సేయక తిరిగినవారే కుడువకూడూ కట్ట బట్టాలేక నాయనువారంతకూలేక అటమటపడుతూ పూటదరిద్రులై ఏమిచేయుటకు ఎటుపోవుటకు దారిగానక కుళ్లుచుండువారు కంటికగపడలేదా?

సీ॥ నడువ కాళ్లునులేక కడుకష్టములబడి కంట నీర్వెట్టెడి కుంటివారు
వినె చెవుల్ లేకను వినుగెత్త హృదయంబు శివుడా యికెట్లను చెవుటివారు
నోటమాటాడగ మాటలురాక చేసైగతో బ్రతికెడి మూగవారు
పుడమి ఫాలముసోక నడువవీల్లేకను గోడుగోడున ఏడ్చు గూనివారు
తే॥ కూటి గుడ్డకు మొగమోచి క్రుళ్లువారు బుద్ధి బలమును లేనట్టి మొద్దువారు
పాపఫలమున బుట్టినవారుగారె బుద్ధి నూహించి చూడుమీ శ్రద్ధతోడ॥

అన్నది శాంతమ్మ.

కమల తల్లిమాటలకు ఆనందపడుతూ, ఆలోచించుతూ భక్తితో

—) దండకము (—

శ్రీ భారతీనాథ, సద్భక్తమందార సత్యాత్మకోద్ధార
వేదాంత సంచార సర్వాఘ సంహార సన్మౌనిచిత్తప్రసారా విచారా.

విలోకింపవే జ్ఞానదీప్తిఁ బ్రసాదింపవే యాపదల్
బాపవే దీనుడఁ గావవే నీమదాసాను దాసుండగా చూడవే.

నిన్ను పూజించుటఁ నిన్ను ధ్యానించుటన్
నిన్ను సేవించుటన్ గల్గు తప్పొప్పుగానెంచవే.

నాదుబుద్ధిఁ సదామంచిమార్గాన పోవంగ నీ నీడనిల్వంగ నిఁ చూడగోరంగ
సత్యంబె పల్కంగ సద్వృత్తినుండంగ సద్గోష్ఠిచేరంగ వీక్షింపవే నఁ కటాక్షింపవే.
తల్లి శ్రీ శారదాదేవి తోగూడి మాతండ్రి
యాశీర్వదింపఁగదే రాగదే.

ఆయురారోగ్య భాగ్యంబు లియ్యంగదే జ్ఞానసౌభాగ్యముఁ దేహదారుఢ్యముఁ
భక్తివైరాగ్యముఁ శక్తిసామర్థ్యముఁ సాహసౌదార్య సంపత్తు లియ్యంగదే.
భావనాతీత ధాతా విధాతా నమస్తే నమస్తేనమః

శ్లో॥ యా కుందేందు తుషారహారధవళా యాశుభ్రవస్త్రాన్వితా
యా వీణావర దండ మండితకరా యాశ్వేత పద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిర్దేవైఃసదా పూజితా
సా మాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా॥

అన్న కమలనుచూచి శాంతమ్మ నవ్వుతూ కమలా నిశ్శేష జాడ్యాపహా అని సరస్వతిని ధ్యానించు చున్నావే ఏ జాడ్యమని భావించితివన్నది.

జాడ్య మనగా దేహజబ్బు అన్నది కమల.

కాదు జబ్బు అనగా మూడు విధములు .దేహజబ్బు మనోజబ్బు మనోదేహములకు రెంటికి సంబంధించి సుఖనిరోధకమగు దారిద్ర్యజబ్బు ఈ మూటెకు ముగ్గురు అధిపతు లున్నారు. ఇప్పుడు నీవు ధ్యానించిన తల్లి మనోజాడ్యమగు అజ్ఞానము పోగొట్టి జ్ఞానము నివ్వగలదు. ఈమె ఇచ్చెడి ధనము జ్ఞానధనము ఈమెకు జ్ఞానముపై సర్వాధికారము లున్నవి. ఈమె అనుగ్రహము సంపాదించిన జ్ఞానము దానివల్ల సకలవిద్యలు విద్యలవల్ల.

తే॥ విద్యవలనను వినయంబు వినయమునను బడయు పాత్రత పాత్రతవలనధనము
ధనము వలనను దానంబు దానివలన ఐహికాముష్మికంబులనందు నరుడు.

అన్నారు పెద్దలు జ్ఞానము ఎల్లరకు ముఖ్యావశ్యకము జ్ఞానము లేనివారిని పశు ప్రాయులందురు. నీవు ఈ మహాతల్లిని ధ్యానించు చుండిన తప్పక బుద్ధికిగల జాడ్యమగు

అజ్ఞానమును పోగొట్టి గ్రిహణశక్తి, జ్ఞాపకశక్తి ఇచ్చును మరువవద్దు మూడు వేళల ధ్యానించుము అనుచుండగా కమల ఇట్లని ధ్యానించెను.

శ్లో॥ శాంతాకారంభుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం లక్ష్మీ
కాంతం కమల నయనం యోగిహృద్ధ్యాన గమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం

శ్లో॥ వందేలక్ష్మీం పరశివమయీాం శుద్ధజాంబూనదాభాం
తేజోరూపాం కనకవసనాం సర్వభూషోజ్జ్వలాంగీం
బీజాపూరం కనకకలశం హేమపద్మం దధానామాద్యాం
శక్తిం సకలజననీం విష్ణు వామాంక సంస్థాం

అని నమస్కరించినది కమల.

శాంతమ్మ కమలనుచూస్తూ అర్థమయినదాతల్లి, ఈమె ధనాధికారిణీ అష్టైశ్వర్యములకు ఐహికాముష్మికములకు ఆటపట్టగు ధనమునివ్వగలదు. ధనముపై సర్వాధికారము ఈ మహాతల్లికిగలదు. ఐశ్వర్యము పొందవలయునన్న లక్ష్మీ కటాక్షము కావలయును. ఈ సతీపతుల కటాక్షము లేక గుడ్డి గవ్వయైనను చే పట్టుటకు నలవిగాదు ధనము మానవులకు ముఖ్యాంగము అన్నది శాంతమ్మ.

కమల అమాటలు వింటూ భయ భక్తులతో తిరిగీ ప్రార్థింప సాగెను.

శ్లో॥ వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందే పన్నగ భూషణం మృగధరం వందే పశూనాంపతిం
వందే సూర్యశశాంక వహ్నినయనం వందే ముకుందప్రియం
వందే భక్తజనాశ్రియంచ వరదం వందే శివం శంకరం॥

శ్లో॥ ఓంకార పంజర శుకీం ఉపనిష దుద్యానకేళీ కలకంఠీం
అగమ విపినమయూరీ మార్యామంతర్విభావయే గౌరీం॥

అని నమస్కరించినది కమల.

శాంతమ్మ భక్తిపారవశ్యముతో తలయూచుతూ, కమలా ఈమహాతల్లి ఎవరని తలంచితివి ఈమెయే ఆరోగ్యప్రదాయిని. ఆరోగ్యమును, దేహబలమును, ప్రసాదింప వలయునన్న సర్వాధికారము ఈమహా తల్లికి ఉన్నది. ఈ దంపతుల కరుణా కటాక్షము

బడయక ఆరోగ్యము బలము సంపాదించుట కష్టము ఆరోగ్యమూ బలమూ సర్వజీవులకు అవశ్యకము త్రివిధశక్తులలో తనుశక్తి పేరిది. జ్ఞానశక్తి భారతీ బ్రహ్మలది. ధనశక్తి లక్ష్మీనారాయణులది. ఈత్రివిధశక్తులూ మానవులకు ముఖ్యము. ఈ త్రివిధశక్తులకై ముమ్మూర్తుల సతులతో మూడు వేళల మరువక ధ్యానించుట శ్రేయము మత కర్తల మాటల జోలికి పోక ముప్పురికీ ఆతిథ్యమిమ్ము పూజింపుము. మూడు శక్తులూ భ్రమరకీటక న్యాయముగా నీలో ప్రవేశించి ఇహ పరములలో తోడ్పడి సర్వసౌఖ్యముల చేకూర్చును ధనముండి జ్ఞానములేక, జ్ఞానముండి ధనములేక, ఈరెండూ ఉండి, ఆరోగ్య బలములేక, బాధపడు జీవుల చూడుము. ఈ ముప్పురిని సమానముగా చూడని దోషముపట్టి దోషులై దుఃఖించు చున్నారు. ఒకటుండిన ఒకటిలేక చింతించు చున్నారు. ఇందులో మర్మము జ్యోతిశ్శాస్త్రజ్ఞులకు తెలియును. లగ్నపంచమ భాగ్యాధిపతుల కలయిక లేని జీవి బ్రతికి ఫలము లేదని చెప్పుదురు. ముప్పురిని ధ్యానించిన జీవి మనోవాక్కాయముల ఏకీభవింపచేసి ముప్పురిని పూజించి శక్తి కొలది. ఆహారము నివేదన చేసిన జీవి ముప్పురిని సమానముగా చూచిన జీవి లగ్నపంచమ భాగ్యాధిపతులు కలయిక గల సమయ ముల తల్లిగర్భ కుహరమునుండి వెలువడి త్రివిధ సౌభాగ్య ములతో సుఖపడు నందురు. మనో వాక్కాయములకు వాటి కర్మలకూ ఈ ముప్పురే అధిపతులు మనస్సుకుబ్రహ్మ, వాక్కునకు విష్ణువు, కాయమునకు రుద్రుడు మరియు దేహమున గల వాత పిత్తశ్లేష్మములకు వీరే అధిపతులు వాతమునకురుద్రుడు, పిత్తమునకుబ్రహ్మ. శ్లేష్మమునకువిష్ణువు. వాతోష్ణములకు మధ్యనున్న పిత్త కారకుడగు బ్రహ్మ పుట్టుకలో పోషణలో విష్ణువును చావులో రుద్రునీ అనుసరించు చుండును. వైద్యులువాత పిత్తమనీ ఉష్ణశైత్యమనీ చెప్పుచుందురు. వాతోష్ణముల మధ్యలో పిత్తమున్నట్లు హరిహరుల మధ్యలో జమా ఖర్చులగు చావు పుట్టుకల చూపించుచూ బ్రహ్మ ఉండును. మరియు దేహములో రసమనియు రక్తమనియు శుక్లమనియు మూడు రసములున్నవి. ఈ రసములలో అన్నరసమునకు రుద్రుడును, రక్తమునకు విష్ణువును, శుక్లమునకు బ్రహ్మయు అధిపతులు. మరియు ఆహారకోశములో అన్నరసము తయారు చేయుటకు రుద్రుడును, ఆరసమును రక్తముగా హృదయములో తయారుచేసి సర్వనాడులకు వ్యాప్తి చెందింప చేయ విష్ణువును, ఆ రక్తమును శుక్లముగా తయారుచేయ ప్రజాపతి అధిపతులుగా నున్నారు. మరియు సత్వ రజస్తమోగుణములు మూడు మనలో నిమిడి ఉన్నవి. వాటిలో సత్వగుణము విష్ణువనియు, తమోగుణము రుద్రుడనియు, రజోగుణము అజుడనియు చెప్పుదురు. మరియు పౌరుష జ్ఞాన కీర్తులలో పౌరుషమురుద్రుడనియు, జ్ఞానము బ్రహ్మఅనియు, కీర్తి విష్ణువనియు చెప్పుదురు మరియు ఊర్ధ్వకాయమని మధ్యకాయమని అధఃకాయమని మూడు భాగములుగా దేహము ఉన్నది. ఊర్ధ్వకాయమగు శిరోభాగమును పదకొండు కోట్ల దేవతలతో మెదడు నాశ్రి

యించి విష్ణువును మధ్యకాయమగు ఉదర భాగమున పదకొండు కోట్ల దేవతలతో కుక్షి నాశ్రయించి రుద్రుడును, అధఃకాయమగు కటీతటము నుండి పాద పర్యంతము పదకొండు కోట్ల దేవతలలో ప్రజాపతి నాశ్రయించి బ్రహయు వెరసి ముప్పది మూడు కోట్ల దేవతలతో ముమ్మూర్తులు ఆ పాదమస్తకము కాపాడు చుందురు క్షణము ఏమరక నుందురు మరియు కన్నులుమూడు జ్ఞానచక్షువుతో. కర్ణములు మూడు మూడు మూడుగా ఎన్నో ఉన్నవి. మూడు లేనిదేదిలేదు. ముమ్మూర్తుల స్థానములగు తను పంచమ భాగ్యస్థానాధి పతుల కల యిక జరిగే గొప్పగొప్ప మహనీయులు మతకర్తలు రాజులు రాజకీయ వేత్తలు కవులు గాయకులు పండితులు ధనికులు జన్మించు చుండుట సరస్వతి జ్ఞాన ప్రదాయిని లక్ష్మి ఐశ్వర్య ప్రదాయిని పార్వతి ఆరోగ్య ప్రదాయిని ఈ త్రిదేవులు త్రిమూర్తుల భార్యలు ప్రథమ కింక రులు ఎవ్వరికి ఏ అధికారమున్నదో అది కోరిన సులభముగా ఇవ్వగలరు మరొకటి కోరిన అంతో ఇంతో ఇప్పింపగలరేగాని సమగ్రముగా ఇవ్వజాలరు. వారి వారి శక్తిని వారుప్రసా దించుటకు వెనుదియ్యరు ఈ త్రిశక్తులకుమించిన శక్తి ప్రభుశక్తి దానికిత్రిమూర్తుల ఆరాధింప వలయు లేదా సూర్యు నర్చించ వలయు వారియందు ప్రభుశక్తి త్రిమూర్త్యాత్మకమై ఇమిడి యున్నది. గాని స్త్రీశక్తి వెన్నంటక లోపించును పీరు ముగ్గురు ఏకీభవించి ఇచ్చిన ప్రభు శక్తికిగానీ మోక్షమునకుగానీ కొదువలేదు. త్రిమూర్తుల త్రిదేవుల ఒకే భావముతో తల్లి దండ్రులుగా భావించి త్రిసంధ్యల మనోవాక్కాయ కర్మల ఎక్కువ తక్కువలుగా భావింపక ధ్యానించి ఆతిథ్యమిచ్చిన వారు అర్చించినవారు మోక్ష సామ్రాజ్య శక్తుల బడయుదురు. సరస్వతివల్లఅజ్ఞానము, లక్ష్మివల్లదారిద్ర్యము, పార్వతివల్ల అనారోగ్యము పోగొట్టుకొని ధన జ్ఞాన ఆరోగ్యముల బడసి సుఖింప వలయునన్న మతపిచ్చిమాని ముమ్మూర్తుల ఆరాధించిన దేవత్వము సమీపించి సుఖింప గలవు అన్నది శాంతమ్మ.

దేవత్వ మనగా ఏమిటిదమ్మా అన్నది కమల.

కమాలా ఈ ప్రపంచమున రెండు విధములుగా జీవరాసులు గాన వచ్చును ఏవనగా పశు పక్షి క్రిమి కీటకములు ఒకటి, మానవులు ఒకటి, మూడుపది దేవతలు, పశు పక్షి క్రిమి కీటకములు మైథున నిద్రాహార భయములు మినహా మరేమీ తెలియవు. దీనితో అవి సర్వత్రా పాపమునే అనుభవించు చున్నవందురు ఇక మానవు డన్ననో మైథున నిద్రాహార ములు గాక జ్ఞానముపైన నుండుటచే సుఖ దుఃఖముల రెంటెను అనుభ వించుచున్నాడు. పాప పుణ్య మిశ్రితుడు మానవుడు. దేవతలన్ననో శుద్ధ పుణ్యులు. అనగా పశు, పక్షి, క్రిమి, కీటకములు శుద్ధపాపులనియు మానవులు పాప పుణ్య మిశ్రితులనియు దేవతలు శుద్ధ పుణ్యులనియు పెద్దలు చెప్పుదురు. పుణ్యము ఎక్కువ చేసిన వారే

గొప్ప గొప్ప విద్యావంతులు ధన వంతులు పెద్ద పెద్ద ఉద్యోగులు భూస్వాములు రాజులు నిరోగులు రూపవంతులు గాయకులు కవులు పండితులు. పాపము ఎక్కువ చేసినవారు జ్ఞాన హీనులు నిర్ధనులు విద్యావిహీనులు రోగులు కురూపులు అంగవిహీనులు అవుచున్నారు. మానవుడు పుణ్య మార్గమునే అనుసరించి నడుచుచుండిన దేవత్వము సమీపించును. లేక పాప మార్గము ననుసరించిన మానవత్వము నశించి పశుత్వము సమీపించును. ఈ మార్గ ములతెలిసి నిత్యకృత్యముగా ఒళ్లు వంచి బుద్ధి గలిగి సోమరిగాక పెద్దలు చెప్పిన మార్గ ముల ననుసరించి, ఈసడించు కొనక విసుగు చెందక ఆచరణ విధానముల మరువక ఆచరించు, చుండిన దేవత్వము సమీపించును అందులో సర్వవిధ సౌఖ్యములూ గలుగును మరచి సోమరియైన సర్వదారిద్ర్యములూ తన్నాశ్రయించును.

కం॥ దానవు లమృతము ద్రావఙబూని పయోరాశిద్రచ్చి పొగిలిన మాడ్కిఙ
శ్రీనాథ పరాఙ్ముఖులగు హీనులు పొందంగ జాల రిష్టార్థంబుల్.

అనగా అణువో పరమాణువో దైవశక్తిని సంపాదింపక దూరుడైన మానవుడు సౌఖ్య ములు పొందజాలడని అర్థము. భగవంతునికి దూరము కాకూడదు సమీపింప వలయును. సమీపింప చేసు కొనవలయును అన్నది శాంతమ్మ.

అమ్మా భగవంతుని సమీపింపవలయునన్నను, సమీపింప చేసుకొన వలయునన్నను అవునా దీనికి సాధన ఏదయినా ఉన్నదా అన్నది కమల.

కమలా భగవంతుడుసర్వప్రపంచవ్యాపి తనశక్తి అంతటా వ్యాపించియున్నది. నీవేమి చేసిననూ, నీవేమిఇచ్చిననూ, నీవేమితలచిననూ, నీవేమిఅన్ననూ సర్వముతెలుసుకొనగలుగు వారివిషయముగాక వేరొకవిషయమయినవా టెను సర్వమువ్రాసి పెట్టుచునులుతొమ్మండుగురు ఉన్నారు వీరుఅజేయులు చేసినదే చేయించుచుందురు, తిన్న దేతినిపించుచుందురు, చూచినదే చూపించుచుందురు వీరేనవగ్రహములు. వీరిదృష్టిని దాటిపోవుట మహాకష్టము వీరు పాప పుణ్యముల కట్టి కుడుపు చుందురు. వీరికి లోపడనివారే మహనీయులు, వీరికిలోపడక దాటి పోవలయునన్న దైవ శక్తిని ఆర్జింపవలయు, ఆ శక్తి ఆర్జింపవలయునన్న దైవ సేవ చేయ వలయు నిత్యకృత్యముగా హిందూసాంప్రదాయసిద్ధముగా ఏ ఏ వేళల ఎట్టి పద్ధతితో నడువ వలయునో అట్లు నటించిన సర్వము తనజీవితములో తనకు చేకూరును. ముందు జన్మకు ముందుతానిల్చిసర్వము చేకూరచేయును. తనకు అండగా చిల్చుకొని తొమ్మండుగురి శక్తినీ అణచి తనశక్తినిప్రసాదించి ప్రసారించును. ఆమహనీయుని శక్తిగలిగినవారే పౌరుష జ్ఞాన కీర్తులుగల పుణ్యమూర్తులు. ఆ శక్తికి దూరులైనవారే సర్వత్రా దరిద్రులు. దారిద్ర్యమనగా తను దారిద్ర్యం, ధన దారిద్ర్యం, జ్ఞాన దారిద్ర్యం, కళత్ర దారిద్ర్యం, పుత్ర దారిద్ర్యం,

మాతృ, పితృ, గురు, దేవ దారిద్ర్యం అని పలుపిధ దారిద్ర్యములతో అటు మట పడుతూ అల్లాడుచుందురు.

తే॥ తనరుభక్తిని మృచ్ఛిలాదారు రచిత రూపములయందుగాని నిర్మలమయిన
సలిలములయందుగాని సుస్థలములందుగాని పూజింపవలయు సక్రమలనాభు.

మట్టితో, రాయితో, కర్రతో, లోహములతో చేయబడిన బొమ్మలగాని రంగులతో వ్రాయబడిన పటములనుగాని, మంచిచోట అగ్రస్థానమున నియమించి దీపములు రెండుగానీ లేక ఒకటిగానీ రెండు వత్తులువేసి వెలిగించి సువాసన ద్రవ్యములగు హోమవత్తులు గంధపుముద్ద సాంబ్రాణి మొదలగునవి ఉంచి తాంబూలముపెట్టి దైవ యోగ్యములగు ఆహారము అనగా పండ్లు, బెల్లము, చెక్కర, పాలు శక్తికొలదిపెట్టి శక్తికొలది ధ్యానించి, సాష్టాంగ దండప్రణామము లాచరించుచుండిన దైవము తప్పక నీ ఇంటప్రవేశించి నీకన్నివిధములగు సుఖముల సమకూర్చును. త్రిసంధ్యల తప్పకచేయుచుండిన కొంతకాలమునకు భగవంతుడు బంధు రూపమై మిత్ర రూపమై జ్ఞానరూపమై నీనాటి విపత్తుల ఆనాడే తొలగించుచూ, అంగరక్షకుడై కాపాడగలడు. సమీపింపవలయునన్ననూ, సమీపింప చేసుకొనవలయునన్ననూ ఇదియే ముఖ్యమయిన మార్గము. దైవానుగ్రహములేక దారియేలేదు అన్నది శాంతమ్మ.

అమ్మా! దైవముగాక మళ్ళీ ఈ తొమ్మిదిమందిని తెస్తివే వీరెవరే అన్నది కమల.

కమలా ఈ తొమ్మిదిమందిని నవగ్రహము లందురు. వీరిని దైవము చరాచరము కాపాడుటకు, లయింపచేయుటకు ముఖ్యాంగముగా నియమించెను. వీరిలో ముఖ్యముగా అద్దరిని మాత్రము చూచుచున్నావు. వీరిని సూర్య చంద్రు లందురు. వీరు లోకమునకు ముఖ్యులు, మాతృ పితృ కారకులు. వీరివల్లనే జీవులు పుట్టుట, గిట్టుట దైవసమానులని, హిందువులు సూర్యుని, మహమ్మదీయులు చంద్రుని సేవించుచున్నారు. ప్రతిమానవుడు, హిందువు సూర్యోదయ మగునపుడు శుచిర్భూతుడై సూర్యునికి ఎదురుగ నిల్చుకొని

శ్లో॥ ద్విభుజం పద్మహస్తంచ వరదం మకుటాన్వితం
ధ్యాయే ద్దివాకరం దేవం సర్వాభీష్టప్రదాయకమ్.
శ్లో॥ బ్రహ్మస్వరూప ఉదయే మధ్యాహ్నేతు మహేశ్వరః
అస్తకాలే స్వయం విష్ణుఃత్రయీమూర్తి ర్దివాకరః

శ్లో॥ నమస్సూర్యాయ కవయే నమో నారాయణాయచ
నమోనమః పరేశాయ తేజో రూపాయతేనమః.

తండ్రీ లోకబాంధవా నీదయ నాయదృష్టము నిన్ను మరువను, నన్నుమరువకుము అని నమస్కరించి తన పనిమీద తానుపోవును. ఇంకా అభివృద్ధి గోరువారు అష్టోత్తరములు, సహస్రనామములు, కవచములు, స్తోత్రములు చెప్పుదురు. కటువయిన ఫలాహారములుగాక పండ్లు, పాలు, చక్కెర, గోధుమలతో తయారు చేసిన ఫలాహారములు అర్పింతురు. ఈ భగవానుని నమ్మి సేవించిన వారే రాజులు, రాజకీయ ఉద్యోగులు, ప్రజారక్షకులు. వీరెట్లు లోకమును రక్షించు చుండిరో వీరిని నమ్మిన సేవకులుకూడా ప్రజారక్షకులై సుఖపడు చుండిరి. రేపటినుంచీ నీవుకూడా ఈపని పూర్తిచేయుము అన్నది శాంతమ్మ.

అమ్మా మిగతావారుమాత్రము పూజనీయులుగారా అన్నది కమల.

కమలా వారు పూజనీయులైననూ, వీరిరువురి శక్తి అపారము. దేహమునకు కన్నులెట్లో గ్రహములలో వీరట్లు కాలచక్రమునకే అధినాయకులు. వీరు సర్వగ్రహములకు మూలము వీరులేక లోకములేదు వీరియందు విష్ణుశక్తి ప్రబలముగా నున్నది అందువల్ల ప్రతిమానవుడు పూజించును, నమస్కరించును, ధ్యానించును అన్నది శాంతమ్మ.

అమ్మా సూర్య భగవానుని ధ్యానించు సమయములో అందరిని ధ్యానించుట మంచిదని తలంతును. అట్లచేయరాదా అన్నది కమల.

చేయవచ్చును వీరు ప్రతి మానవునికీ అవసరమే వీరిని ధ్యానించి నమస్కరించుట క్షేమమే అయితే ఇట్లని ధ్యానించు

శ్లో॥ నమస్సూర్యాయ సోమాయ మంగళాయ బుధాయచ
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవేనమః.

అని ముందునమస్కరించి అటుపై సూర్యభగవానుని ధ్యానించు కానీ గృహకృత్యములు ముందునిర్వర్తించు అటుపై మాతము అని శాంతమ్మ చెప్పగా, కమల పోయి చీపురుకట్ట తీసుకొని కసువు ఊడ్చ ప్రారంభించెను.

కమలా వేగిలేచినది మొదలుకొని అస్తమానము పడుకొనువరకు ప్రతి స్త్రీ పంచమహా పాతకము లొనర్చవలసి వచ్చును. వీటిని ఏనాటివి ఆనాడు పోగొట్టుకొనుటకు దైవ ప్రార్థనముఖ్యము. త్రోయుట, దంచుట, విసురుట నూరుట, కాల్చుట ఈ అయిదు చేయుటవల్ల క్రిమి, కీటకములు ఎన్నో నశించును. సస్య నాశనమగును ఆ పాప పరిహారమునకై మొదటనే దైవముతో చెప్పుకొనుట శ్రేయము.

శ్లో॥ వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీచ నందకీ
శ్రీమన్నారాయణో విష్ణుర్వాసుదేవోభి రక్షతు.

దేవా ఈ దినము పంచమహాపాపములు చేయప్రారంభము ఇందులోవచ్చు పాపముల హరించి నన్నురక్షించ నీదేవంతు అని చెప్పుకొని పనిప్రారంభింప వలయునమ్మా అన్నది శాంతమ్మ.

కాలుతీసి కాలుపెట్టేటప్పటికి పాపము వెన్నంటేటట్లు ఉన్నదే ఎన్నాళ్లని ఇట్లు చేయవలెనమ్మా ఇది కొనసాగేదేనా అంటూ చిరునవ్వుతో భగవంతుని ధ్యానించి పంచమహాపాపములచెప్పుకొని చీపురుపట్టి గృహములో త్రోయనారంభించెను కమల.

తాను చెప్పుటకు కమల విసుగుచెందినదని తలంచి శాంతమ్మ కమలనుచూచి కమలా, సోమరులై వేసటపడి కొనసాగదని జుగుప్సచెంది జీవ ధర్మచ్యుతులైన వారినికనులతోచూడు యోచించి గమనించు, గమనించి వేసటచెందక ఆచరణ విధానము అమృతమనితలంచి ఆచణమరువక తలవాకిట ముందుకసువూడ్చి కలాపి చల్లి ముగ్గులుపెట్టి అటుపై ఇంటిలోచూచుకొమ్ము అన్నది శాంతమ్మ.

ఇంటిలో ముందుత్రోయరాదచేమమ్మా అన్నదికమల.

ఔను తెల్లవారకమునుపే బయటికసువుత్రోయుటయు నీళ్లచల్లడము ముగ్గులు పెట్టడము కావలయును. లేకున్న పాపమన్నది శాంతమ్మ.

ఏమి పాపము ఎవరికి ఏమి అపకారముచేయలేదే అన్నది కమల.

ఔను సూర్యుడు ఉదయించిన వెనుక కసువూడ్చుట, నీళ్లుచల్లుటా వారిపై త్రోయుట, చల్లుటేయగును. కాని వేరొండుగాదు అశుభ సమయములలో ఎప్పుడయినా చల్లుదురు. అట్లుచల్లరాదు. దీన శుభమునకు మారు పాపము వెన్నంటును. సూర్యకిరణములపై కలాపుచల్లుటచే పాపము తప్పదందురు. సూర్యుడు ఉదయిం

చువేళకు ఏ ఇంటిముంద నీళ్లుచల్లి ముగ్గులుపెట్టి ఉందురో వారిని ఆశీర్వదించి శుభ ములచేకూర్చును. పొద్దుకెదురుగ కల్లాపుచల్లుట కసువుతోయుట ఎదురుగా నిలుచుకొని పలుతోముట, ఎదురుగకూర్చొని మలమూత్రవిసర్జనసేయుట, ఉమ్మివేయుట మిగులపాపము. ఉదయించక మునుపే కార్యముల నిర్వర్తించిన వారికి ఆయురారోగ్యములు గలుగునని పెద్దలందురు. సూర్య భగవానుడు కూడా ఆశీర్వదించును. ఆచరణవిధానము మానవులకు అమృతమువంటిది. కానీ ముందుపనికానీ అని శాంతమ్మ వంటగదికి పోయెను. కమల ఇంటిముంద కసువూడ్చి, కల్లాపుచల్లి పెట్టుచుట్టూ బాగా అలికి ముగ్గులుపెట్టెను. ప్రాకారముముందు ఇరువంకల రామబాణము చెట్లును, ఆచెట్ల రెంటికి మధ్య కాగితాలపూలతీగె అల్లి బిల్లిగా నల్లుకొని వింతగానున్నది దారి కిరు ప్రక్కలా పారిజాతము సంపెగ మల్లె జాజి గన్నేరు తులసీ మొదలగు పూలచెట్లు ఉన్నవి. చెట్ల చుట్టూ ముగ్గులుపెట్టగా చిన్న ఇల్లు అయినను చాలా అందముగా నుండెను. చూచి తలయూచి లోపలికి పోయి గృహములో కసువూడ్చి వాకిండ్ల కడపలకు ముగ్గులుపెట్టి శుభ్రముగా చేతులు, కాళ్లు కడుగుకొని వచ్చి పచ్చని గోమయముతో బృందావనముచుట్టూ అలికి మంచి మంచి ముగ్గులు బియ్యపు పిండితోపెట్టి ప్రదక్షిణచేసి తలవంచి సంజ్ఞారూపముతో నమస్కరించి పోయి స్నానముచేయ నీళ్లను చెంబుతో ఎత్తుకొని

శ్లో॥ గంగా గంగేతియోబ్రూయాత్ యోజనానాంశతైరపి
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి.

శ్లో॥ గంగా సింధు సరస్వతీచ యమునా గోదావరీ నర్మదా
కృష్ణా భీమరథీచ ఫల్గు సరయూ శ్రీగండకీ గోమతీ
కావేరీ కపిలా ప్రయాగ నిరతా వేత్రావతీత్యాదయో
నద్యః శ్రీహరి పాదపంకజ భవాఃకుర్వంతుమాం మంగళమ్.

అని తలపై నీల్లు పోసుకుంటూ, తల్లీ గంగా పరమపావనీ నేను నీవరకూ వత్తునో లేదో నీయనుగ్రహమున్న ఈ కూపజలమే పరమపావనమై నా పాప పంకము శుభ్రమొనర్చును నీయనుగ్రహము నాపైచూపుము తల్లీ నిన్ను మరువను అంటూ స్నానము చక్కగాచేసి ఒల్లు, తల చక్కగా పొడిగుడ్డతో తుడుచుకొని కీలు గంటువేసుకొని పొడివస్త్రము ధరించి దేవుని పీఠము దగ్గరకుపోయి నమస్కరించి మూడువేళ్లతో కుంకుమ ఎత్తుకొని త్రిదేవులస్తుతించి పాదములపైవేసి ముప్పురపాద

ములపైనున్న కుంకుమనుతీసి కలిపి బొట్టుపెట్టుకొని నమస్కరించి శ్రీదేవి అష్టోత్తర ములు చెప్పుతూ మాలిన్య ద్రవ్యములతీసి పటముల బాగా తుడిచి దీప స్తంభములు సెమ్మెలు కర్పూర హారతితట్ట తీర్థముంచు గిన్నె ఉద్ధరిణి మొదలగు వాటిని బూడిదతో బాగాతోముకొనివచ్చి యథాస్థానములలోపెట్టి దేవునిముందు నీళ్లుచల్లి గుడ్డతో తుడిచి అష్టకోణములతో ముగ్గుపెట్టి దీపములు ఇరువాగుల రెండువత్తులతో వెలిగించి పూలబుట్టి తీసుకొని పెద్దచెంబుతోనీళ్లు చేసుకొనిపోయి బృందావనముదగ్గర దీపము వెలిగించి ఊదుకడ్డీ వెలిగించి, నీళ్ల తులసిమొదట పోయుచు

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతాః
యదగ్రే సర్వవేదాశ్చ తులసీం త్వాం నమామ్యహం.

అని పోసి నమస్కరించి పూలుకోసుకొనివచ్చి పై శ్లోకముతో మొదట మధ్య పైన పూలనుపెట్టి కుంకుమవేసి చేతులు జోడించుకొని

శ్లో॥ నమస్తులసి సర్వజ్ఞే పురుషోత్తమ వల్లభే
పాహిమాం సర్వపాపేభ్యః సర్వ సంపత్ప్రదాయిని!

కవచం॥ తులసి శ్రీమహాదేవి నమః పంకజ ధారిణీ
శిరోమే తులసీపాతు ఫాలంపాతు యశస్వినీ
దృశౌమే పద్మనయనా శ్రీసఖీ శ్రవణేమమ
ఘ్రాణంపాతు సుగంధామే ముఖంచ సుముఖీమమ
జిహ్వామే పాతు శుభదా కంఠం విద్యామయీ మమ
స్కంధౌ కల్హారిణీపాతు హృదయం విష్ణువల్లభా
పుణ్యదామే పాతుమధ్యం నాభిం సౌభాగ్యదాయినీ
కటిం కుండలినీపాతు ఊరూ నారద వందితా
జననీ జానునీపాతు జంఘే సకలవందిత
నారాయణ ప్రియాపాదౌ సర్వాంగం సర్వరక్షిణీ
సంకటే విషమే దుర్గే భయే వాదే మహాహవే
నిత్యం హిసంధ్యయోఃపాతు తులసీ సర్వతః సదా
ఇతీదం పరమం గుహ్యం తులస్యాః కవచామృతం
కన్యార్థీ చండికాగేహే శత్రుహత్యై గృహేమమ
శ్రీకామో విష్ణుగేహే చోద్యానే స్త్రీవశాభవేత్
కిమత్రబహూనోక్తేన శృణుసైన్యేశ తత్త్వతః

యం యం కామమభిధ్యాయేత్తం తంప్రాప్నోత్యసంశయం
మమగేహ గతస్త్వంతు తారకస్యవధేచ్ఛయా
జపంస్తోత్రించ కవచం తులసీగత మానసః
మండలాత్తారకం హన్తా భవిష్యసి నసంశయః

మాతా తులసీ నీయనుగ్రహమునకై దినదినమూ ప్రార్థించుచుంటిని నీ కన్న బిడ్డవలె కనికరించి కాపాడుమని కొంచెము చక్కెర ముందుంచి ప్రదక్షిణచేసి మోకరించి తల భూమినోక నమస్కరించెను.

అంతలో శాంతమ్మ లోపలనుంచీవచ్చి కమలా రేపు శుక్రవారము తులసి కోయరాదు. ఈనాడే కొన్నిదళాలు ఎక్కువగాకోసి తడిగుడ్డలోచుట్టిపెట్టు సోమ వారమునకు ఇవ్వవలసిన అధికారము శుక్రవారమున కిచ్చినారు సోమవారము లక్ష్మీకరమైనది శుక్రవారమెందుకనిరో ఏనాడుమారెనో తెలియదు అయినాపెద్దల ననుసరించుటే ఉత్తమము కోసిపెట్టుమని అటుచూచెను పొరకగోడకు నిలబెట్టి ఉండెను. కమలా పొరకగోడకు నిలబెట్టవద్దని ఎన్నోమార్లు చెప్పితినే మరచేపోతు న్నావే పొరకా, చేటా గోడకునిలబెట్టుట కూడదు. ఇది ఇంటఅశుభము జరిగినరోజు లలో కొందరుచేయుదురు గాన అట్లునిలబెట్టరాదు పండబెట్టే ఉంచవలయును. చేటపై పొరకఉంచుట రెండూ ఒకచోట అంచిపెట్టుట కూడదు వైరవర్గముగలవస్తువుల ఒకచోటఉంచుటచే గృహచ్ఛిద్రములేర్పడును. రోకలి నిలబెట్టుట రోటికి అంచిపెట్టుట రోటిపైపెట్టుట గంధపుసానపై గంధపుచెక్క పెట్టుట మెట్లజత తిరుగవిడుచుట పాత్రల బోర్లించిఉండుట మంచము వెల్లకిలవేయుట ఇసురాయిగుంజను ఊడగొట్టిపెట్టక అట్లనేపెట్టుట ఇంటిలోబూజి వ్రేలాడుచుండుటచూచి తియ్యక ఊరకుండుట మూలలకు కసువూడ్చి ఎత్తకుండుట గూళ్లలో ఉగాదిఇంటి పొ నెలలపర్యంతము కసువూడ్చక ఉంచుట ఇల్లుమాసి నల్లగ గుహవలె ఉండిననూ సున్నముగొట్టక ఉంచుట ముక్కా మొఱ్ఱిపోయిన పాత్రిలూ మృత్పాత్రిలు విక్రయించక పారవేయక వాడుకొనుట పాతపొరకలూ పాతచేటలు పాతచెప్పులూ పనికివచ్చునని గూళ్లలో దాచిఉంచుటా ఇల్లుఅలకక నిరాకరించుట అలికి ముగ్గుపెట్టకుండుట ప్రతిదినమూ ఇంటిముందు నీళ్లు చల్లి కడపలలికి ముగ్గుపెట్టకుండుట అస్తరవేసిన వస్త్రములు ధరించుట తలవిరబోసు కొని ఇల్లాలుఇంటిలో పచారుచేయుట ఇల్లాలు మలినవస్త్రధారిణియై తలదువ్వకొనక మాపూరమ్మలాగ ఉండుట పీటలు నిలబెట్టిఉండుట పాత్రిలుపాచిబట్టిననూ తోమక

వాడుకొనుచుండుట భోంచేయుతట్టల ఆహారపదార్థములపై మూయుట పాలు, మజ్జిగ వెన్న తినుబాండారములపై ఎంగిలిపాత్రల ఉంచుట చెప్పులువేసుకొనిఇంటిలోపచారు చేయుట భూమినిదున్నుకుంటూ నడచుట కడపలపై నిల్చుకొనుట కడపపైకాలుపెట్టి దాటిపోవుట కడపలకు కాలూని నిల్చుకొనుట కాలుపెట్టి ఒరులతో మాట్లాడుట గృహము ప్రవేశించునపుడు తలవంచక ప్రవేశించుట అరికాలునవ్వపెట్టిన కడపలకు వేసి రాకుట, గోకుట కడపలపైతుమ్ముట కడపలపై అపానవాయువులు విడుచుట రోళ్లపైకూర్చొనుట కాలూనిదంచుట రోకలిపై కూర్చొనుట కాలితో త్రోయుట దేవుని దీపమునకన్నాముందు ఇంటిలో దీపము వెలిగించుట అస్తమానమయినతోనే మంచములు వంచక ఉంచుట సంధ్యవేళలో పండుకొనుట సూర్యోదయమున నిద్రించుట సంధ్యవేళలలో ఇంటియజమానిగాని, యజమానురాలుగాని దైవధ్యానము సేయక పోవుట ఇరుగు పొరుగువారితో సంధ్యవేళల పొద్దుపోక మాట్లాడుట కన్నీరు సంధ్యవేళపెట్టుట కలహించుట దురాలోచనలు సేయుట సంధ్యవేళ వాకిలినానుకొనినిల్చి వీధిని చూచుచుండుట అశుభములగుమాటలు అనగా గృహమునుకొంపఅనడం ఎక్కడ. చచ్చెదననడం పండ్లుకొరకడం లేనిది ఉన్నట్లు ఉన్నదిలేనట్లు వాదులాడడం ఒకరిపై ఒకరు అసూయ గలిగినవారు ఇంటనుండడము వారివస్తువులవారు దొంగలించడం వాదులాడడము కలహించి పస్తుపండడము ఇంకా కొన్ని నీచకార్యములకు నెల వౌసంగడము బహిష్టదోషమనక ఇంటిలో సకలపదార్థముల తగలడము చావు, పురుడు, లెక్కగొనక సంచరించడం సంగమానంతరం స్నానముచేయక రోజులకొలదీ ఉండడము తలమాసి వలువలుమాసినవారు ఇంటనుండడము నిరంతరము అపోములు పలుకు చుండడము భోజనాదులలో పంక్తిదోషమేర్పడడము దాచుకొనితిన డం పశువులు ఆహారవిహారములులేక కంటనీరు పెట్టడము వివాహముగువారు వీడు మీరి ఇంటకంటనీరుపెట్టడం కామాతురులై ధర్మరహితులుగావడం ఎక్కువకోర్కెలతో పింఛ్లగమవగా అవివాహితులు కామాతురులై ఇంటనుండ యజమాని తలచకనే తాను సుఖపడుచుండడము ఇంటలోపముల పంక్తిదోషముల దైవకార్యముల వస్త్రలోపముల వలపులోపముల వరులదుఃఖముల గమనించక యజమాని ఉండడము సూర్యోదయమగునప్పుడు అస్తమానమగునప్పుడు సంధ్యవేళలందును ఈసమయముల వాకిండ్లు మూయడము దైవనివేదనలేక కుడువడంవల్ల లక్ష్మీనివాసమగు ఇల్లు అలక్ష్మీనివాసమై మూదేవత గృహములో నివసింప చోటేర్పడి గృహచ్ఛిద్రములు రోగములు అంతఃకలహములు ధనధాన్యవ్యయము మనోవ్యథ దంపతులమధ్య వాదు. అప

వాదులువేర్పడుతూ దారిద్ర్యమునకుదారితీసి కులక్షయమగును. వీటెనుచక్క దిద్దుకొని సమర్థించుకొని శ్రద్ధతో నడువవలసినది స్త్రీ అశ్రద్ధ వహింపరాదు. గృహచ్ఛిద్రము మనశ్ఛిద్ర మేర్పరచి, మనశ్ఛిద్రము మానవుని మసిచేయును. అశుభములు నోటపలుకుట అశుభసూచకములు ఇంటనుండుట ఇంద్రునకైనా పనికిరావు. కుల నాశనమో ధననాశనమో చేయును. జ్ఞాపకముంచుకొని పనులుచేయవమ్మా అని పొరకను సర్ది లోపలికి పోయెను శాంతమ్మ.

కమల అమ్మమాటలనువిని తల్లీ తులసీ ఇందుకే నిన్నుదినదినమూ ప్రార్థిస్తూ ఉన్నానమ్మా తప్పుచేయ చేయిపోవు లోపలనే ఒప్పుజ్ఞాపకమునకు వచ్చునట్లుగా సమయస్ఫూర్తి జ్ఞానము దయచేయుమని అట్లుదయచేసి ఉండిన మామయ్మ రాబోవు అత్తచార్జీపుచ్చుకోదుగదా అమ్మతోనే ఇట్లున్నదే అత్తతో ఇకెట్లుండునో జ్ఞానమివ్వకున్న గంగేగతితల్లీ. చేజారుట, మాటజారుట, కాలుజారుట, కానకుండుట, మరచిపోవుట, గుడ్డతొలగుట కంటమూచుట పొరపాటుగలుగుట అందరికీఉండును. ఉండునని తలంచువారుండరు వీటినిసమర్థించుకొని నిలుచుకొనుటకు నీయనుగ్రహముకావలయును లేకున్న ఇంటాబైటా కంట నీరే పొరక నిలబెట్టినందుకు ఎంతపురాణమైనదో చూడు ఈమెతో నాకు చెప్పించకపోతే నీవే సెలవిచ్చిన బాగుండునే నీచల్లనిమావు ఉండిన నామనస్సుకే సర్వమూతోచును. నాకు సమయస్ఫూర్తిజ్ఞానమిచ్చి రక్షించుతల్లీ అంటూకొన్నిదళములుకోసి అందులోకొన్నితడిగుడ్డలోచుట్టిపెట్టి సరస్వతీఅష్టోత్తరము

సరస్వతీ మహాభద్రా మహామాయా వరప్రదా,
శ్రీప్రదా పద్మనిలయా పద్మాక్షీ పద్మవక్త్రికా. ౧
శివానుజా పుస్తకభృత్ జ్ఞానముద్రా రమా పరా,
కామరూపా మహావిద్యా మహాపాతకనాశినీ. ౨
మహాశ్రయా మాలినీ చ మహాభోగా మహాభుజా,
మహాభాగా మహోత్సాహా దివ్యాంగాసురవందితా. ౩
మహాకాళీ మహాపాశా మహాకారా మహాంకుశా,
పీతాచ విమలా విశ్వా విద్యున్మాలా చ వైష్ణవీ. ౪
చంద్రికా చంద్రవదనా చంద్రలేఖా విభూషితా,
సావిత్రీ సురసాదేవీ దివ్యాలంకారభూషితా. ౫
వాగ్దేవీ వసుధాతీవ్రా మహాభద్రా మహాబలా,
భోగదా భారతీభామా గోవిందా గోమతీశివా. ౬

జటిలా విన్ధ్యవాసా చ విన్ధ్యాచలవిరాజితా,
చండికా వైష్ణవీ బ్రాహ్మీ బ్రహ్మజ్ఞానైకసాధనా. ౭
సౌదామినీ సుధామూర్తి స్సుభద్రా సురపూజితా,
సువాసినీ సునాసా చ వినిద్రా పద్మలోచనా. ౮
విద్యారూపా విశాలాక్షీ బ్రహ్మజాయా మహాఫలా,
త్రయీమూర్తిః త్రికాలజ్ఞా త్రిగుణా శాస్త్రరూపిణీ. ౯
శుంభాసురప్రమథినీ శుభదా చ స్వరాత్మికా,
రక్తబీజనిహంత్రీ చ చాముండా చాంబికా తథా. ౧౦
ముండకాయప్రహరణా ధూమ్రలోచనమర్దనా,
సర్వదేవస్తుతా సౌమ్యా సురాసురనమస్కృతా. ౧౧
కాళరాత్రీ కలాధారా రూపసౌభాగ్యదాయినీ,
వాగ్దేవీ చ వరారోహా వారాహీ వారిజాసనా. ౧౨
చిత్రాంబరా చిత్రగంధా చిత్రమాల్యవిభూషితా,
కాంతా కామప్రదా వంద్యా విద్యాధరసుపూజితా. ౧౩
శ్వేతాననా నీలభుజా చతుర్వర్గఫలప్రదా,
చతురానన సామ్రాజ్యా రక్తమధ్యా నిరంజనా.
హంసాసనా నీలజంఘా బ్రహ్మవిష్ణు శివాత్మికా,
ఏవం సరస్వతీదేవ్యా నామ్నామష్టోత్తరం శతమ్. ౧౪

ఇతి సరస్వత్యష్టోత్తర శతనామస్తోత్రం సంపూర్ణమ్.

చెప్పుచూ పూలు కోసుకొనిపోయి దేవునిదగ్గర నిలుచుకొని లక్ష్మీ అష్టోత్తరము

వందే పద్మకరాం ప్రసన్నవదనాం సౌభాగ్యదాం
భాగ్యదాం హస్తాభ్యా మభయప్రదాం
మణిగణై ర్నానావిధైర్భూషితామ్,
భక్తాభీష్ట ఫలప్రదాం హరిహరబ్రహ్మాదిభి స్సేవితాం
పార్శ్వే పంకజశంఖ పద్మనిధిభి ర్యుక్తాం సదాశక్తిభిః.
సరసిజనయనే సరోజహస్తే ధవళతరాంశుక గంధమాల్యశోభే,
భగవతి హరివల్లభే మనోజ్ఞే త్రిభువనభూతికరి ప్రసీద మహ్యమ్.
ప్రకృతిం వికృతిం విద్యాం సర్వభూతహితప్రదామ్,
శ్రద్ధాం విభూతిం సురభిం నమామి పరమాత్మికామ్.

వాచం పద్మాలయాం పద్మాం శుచిం స్వాహాం స్వధాం సుధామ్,
ధన్యాం హిరణ్మయీం లక్ష్మీం నిత్యపుష్టాం విభావరీమ్.
అదితించ దితింబీప్తాం వసుధాం వసుధారిణీమ్,
నమామి కమలాకాంతాం కామాక్షీం క్రోధసంభవామ్.
అనుగ్రహపదాం బుద్ధి మనఘాం హరివల్లభామ్,
అశోకామమృతాం దీప్తాం లోకశోకవినాశనీమ్.
నమామిధర్మనిలయాం కరుణాం లోకమాతరం,
పద్మప్రియాం పద్మహస్తాం పద్మాక్షీం పద్మసుందరీం.
పద్మోద్భవాం పద్మముఖీం పద్మనాభప్రియాం రమాం,
పద్మమాలాధరాం దేవీం పద్మినీం పద్మగంధినీం.
పుణ్యగంధాం సుప్రసన్నాం ప్రసాదాభిముఖీం ప్రభాం,
నమామి చంద్రవదనాం చంద్రాం చంద్రసహోదరీం.
చతుర్భుజాం చంద్రరూపామిందిరా మిందుశీతలాం,
ఆహ్లాదజననీం పుష్టిం శివాం శివకరీం సతీం.
విమలాం విశ్వజననీం పుష్టిం దారిద్ర్యనాశనీం,
ప్రీతపుష్కరిణీం శాంతాం శుక్లమాల్యాంబరాం శ్రియం.
భాస్కరీం బిల్వనిలయాం వరారోహాం యశస్వినీం,
వసుంధరాముదారాంగాం హరిణీం హేమమాలినీం.
ధనధాన్యకరీం సిద్ధిం స్త్రైణసౌమ్యాం శుభప్రదాం,
నృపవేశ్మగతానందాం వరలక్ష్మీం వసుప్రదాం.
శుభాం హిరణ్యప్రాకారాం సముద్రతనయాం జయాం,
నమామి మంగళాం దేవీం విష్ణువక్షస్స్థలస్థితాం.
విష్ణుపత్నీం ప్రసన్నాక్షీం నారాయణసమాశ్రితాం,
దారిద్ర్యధ్వంసినీం దేవీం సర్వోపద్రవవారిణీం.
నవదుర్గాం మహాకాళీం బ్రహ్మవిష్ణుశివాత్మికాం,
త్రికాలజ్ఞానసంపన్నాం నమామి భువనేశ్వరీం.
లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం,
దాసీభూత సమస్తదేవవనితాం లోకైకదీపాంకురాం.
శ్రీమన్మందకటాక్షలబ్ధవిభవ బ్రహ్మేంద్రగంగాధరాం,

త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియాం.
మాతర్నమామి కమలే కమలాయతాక్షీ,
శ్రీవిష్ణుహృత్కమలవాసిని విశ్వమాతః.
క్షీరోదజే కమలకోమలగర్భగౌరి లక్ష్మీః,
ప్రసీద సతతం నమతాం శరణ్యే.
త్రికాలం యో జపేద్విద్వాన్ షణ్మాసం విజితేంద్రియః,
దారిద్ర్యధ్వంసనం కృత్వా సర్వమాప్నోతి యత్నతః.
దేవినామసహస్రేషు పుణ్యమష్టోత్తరం శతం,
యేన శ్రియమవాప్నోతి కోటిజన్మదరిద్రతః.
భృగువారే శతం ధీమాన్ పఠేద్వత్సరమాత్రకం,
అష్టైశ్వర్యమవాప్నోతి కుబేర ఇవ భూతలే.
దారిద్ర్యమోచనం నామ స్తోత్ర మంబాపరం శతం,
యేన శ్రియమవాప్నోతి కోటిజన్మదరిద్రతః.
భుక్త్వా తు విపులాన్ భోగానస్యాస్సాయుజ్య మాప్నుయాత్,
ప్రాతఃకాలే పఠేన్నిత్యం సర్వదుఃఖోపశాంతయే
పఠంస్తు చింతయే ద్దేవీం సర్వాభరణభూషితామ్.॥

శ్రీలక్ష్మ్యష్టోత్తరశతనామస్తోత్రమ్ సమాప్తమ్.

చెప్పుచుండెను.

అంతలో శాంతమ్మవచ్చిచూచి కమలా భక్తి భయము శ్రద్ధ వినయము విన మ్రత ఉండవలయునమ్మా. కొంచెము దూరమునుండి ధ్యానించవలయును. నోటి తుంపర నోటివాసన వారికి తగులకూడదు పెద్దవారికే ఎంతోదూరముండి మాట్లాడు దుము దైవముదగ్గర ఎట్లుండ వలయునో చూడుము. తుమ్మువచ్చిననూ దగ్గువచ్చి ననూ ప్రక్కకుమళ్లి హస్తము అడ్డము పెట్టుకొనిగాని గుడ్డఅడ్డము పెట్టుకొనిగాని దేవునిదగ్గర వంటదగ్గర చేయవలయును. భరించరాని అపానవాయువు వచ్చిన ప్రక్కకుపోయి రావలయును. ఆవులింపువచ్చిననూ ప్రక్కకుతిరిగి చేయిమూసుకొని ఆవులించ వలయును. పడిసెముపట్టి చీమిడివచ్చునది ఎగచీదుకొనుచు చేతతుడుచు కొనుచు అక్కడనేచీది పైపంచెకో పిరుదులకో తుడుచుకొని చేతులు కడుగుకొనక అక్కడఉన్నవస్తువులతగలరాదు. ప్రక్కకుపోయి చీది చేయికడుగుకొని రావలయును

పంచమలములు పంచమూత్రములు వీటి ఎడ జాగ్రత్తలేకున్న పాపమువచ్చును. పంచమలములనగా మలము, కంటిపుసి, చీమిడి, గల్ల, గుబిలీ, ఈ ఐయిదూ మలములు. మూత్రములనగా మూత్రము, చమట, కన్నీరు, ముక్కునీరు, ఎంగిలి ఈ అయిదూ మూత్రములు వీటిని ఒకరికి కానరాకుండా విసర్జించవలయును ఈ అయిదు స్థానముల చేయితగిలిననూ కడుగుకొనక పాకపదార్థముల దేవునివస్తువుల తగులరాదు ఒకరివి ఒకరు చూచిన అసహ్యించుకొందురు. దానివల్ల పాపమావహిల్లును మానవులకడనే జాగ్రత్తపడిన దైవముయెడ ఎట్లుండవలయునో చూడుము తల్లీ దీనికై కొందరు తాంబూలము ఏలకులూ మొదలగు సుగంధ ద్రవ్యముల నోటఉంచుకుని గానీ నమిలి వెడల నుమిసి గానీ బాగాపుక్కిలించిగానీ ధ్యానింతురు. ఇది ఒకతీరు కొంచెముతలవంచి భయభక్తులతో ఏకమనుస్సుతో ధ్యానించుమని లోపలికిపోయెను శాంతమ్మ.

కమల ఉమా అష్టోత్తరము

ఉమాకాత్యాయనీగౌరీ కాళీహైమవతీశ్వరీ,
శివాభవానీరుద్రాణీ శర్వాణీసర్వమంగళా. ౧
అపర్ణాపార్వతీదుర్గామృడానీ చండికాంబికా,
ఆర్యాదాక్షాయణీచైవ గిరిజా మేన కాత్మజా. ౨
స్కందమాతా దయాశీలా భక్తరక్షాచసుందరీ,
భక్తవశ్యాచలావణ్యానిధిస్సర్వసుఖప్రదా. ౩
మహాదేవీభక్తమనోహ్లాదినీ కఠిన స్తనీ,
కమలాక్షీ దయాసారా కామాక్షీ నిత్యయౌవనా. ౪
సర్వసంపత్ప్రదాకాంతా సర్వసంమోహినీమహీ
శుభప్రియా కంబుకంఠీ కల్యాణీ కమలప్రియా. ౫
సర్వేశ్వరీ చ కలశహస్తావిష్ణుసహోదరీ,
వీణావాదప్రియా సర్వదేవసంపూజితాంఘ్రికా. ౬
కదంబారణ్యనిలయా వింధ్యాచలనివాసినీ,
హరప్రియా కామకోటిపీఠస్థా వాంఛితార్థదా. ౭
శ్యామాంగా చంద్రవదనా సర్వవేదస్వరూపిణీ,
సర్వశాస్త్రస్వరూపా చ సర్వదేశమయీ తథా. ౮



పురుహూతస్తుతాదేవీ సర్వవేద్యాగుణ ప్రియా,
పుణ్యస్వరూపిణీవేద్యాపురుహూతస్వరూపిణీ. ౯
పుణ్యోదయానిరాధారాశునాసీరాదిపూజితా,
నిత్యపూర్ణామనోగమ్యానిర్మలానందపూరితా. ౧౦
వాగీశ్వరీనీతిమతి మంజుళా మంగళప్రదా,
వాగ్మినీవంజుళావంద్యా వయోవస్థావివర్జితా. ౧౧
వాచస్పతిర్మహాలక్ష్మీ ర్మహామంగళనాయికా,
సింహాసనమయీ సృష్టిస్థితిసంహార కారిణీ. ౧౨
మహాయజ్ఞా నేత్రరూపా సావిత్రి జ్ఞానరూపిణీ,
వరరూపధరాయోగా మనోవాచామగోచరా. ౧౩
దయారూపాచ కాలజ్ఞా శివధర్మపరాయణా,
వజ్రశక్తిధరాచైవ సూక్ష్మాంగీ ప్రాణధారిణీ. ౧౪
హిమశైలకుమారీచ శరణాగతరక్షణీ,
సర్వాగమస్వరూపాచ దక్షిణాశంకరప్రియా. ౧౫
దయాధారా మహానాగధారిణీ పురభైరవీ,
నవీనచంద్రమశ్చూడప్రియా త్రిపురసుందరీ. ౧౬

(ఏవమష్టోత్తరశతం ఉమానామ్నాం ప్రకీర్తితమ్.)

చెప్పి కుంకుమ చేతపట్టుకొని

శ్లో॥ కుంకుమం కామదం దివ్యం కుంకుమం కామరూపిణం అఖండ
కామసౌభాగ్యం కుంకుమం ప్రతిగృహ్యతామ్

అని అంగుళీయకపువేలితో కుంకుమ త్రిదేవులకు పెట్టి పుష్పములు తీసుకొని.

శ్లో॥ మందార పారిజాతా దీన్పాటలీం కేతకీం తథా మరువా
మోగరం చైవగృహాణాంశు నమోస్తుతే.

అని పుష్పముల తులసినీ త్రిమూర్తులకూ త్రిదేవులకూ పెట్టి నమస్కరించి అమ్మా అన్నది కమల.

శాంతమ్మ తయారు అయిన కాఫీని గిన్నెతో తెచ్చి దేవునిముందు పెట్టిపోయెను.

కమల చేతులు జోడించుకొని త్రిలోకపాలకులారా! పురాణదంపతులారా ఈ

దాసురాలిచ్చు కాఫీ పరిగ్రహించి ఆశీర్వదించుడు అనిమోకరించి నమస్కరించి లేచి కొంచెము కర్పూరము తట్టలోపెట్టి ముట్టించి.

శ్లో॥ కల్యాణాద్భుతగాత్రాయ కామితార్థప్రదాయినే
శ్రీమద్వేంకటనాథాయ శ్రీనివాసాయ మంగళమ్.

అని మంగళహారతి తట్టను మూడుమార్లుత్రిప్పి క్రింద పెట్టునంతలోపల శాంతమ్మవచ్చి చూచి.

ఎడమనుంచీ కుడికి త్రిప్పవలయునమ్మా కుడినుంచీ ఎడమకు త్రిప్పరాదు అపసవ్యమంటారు. మహమ్మదీయులట్లు ప్రవర్తిస్తారు మనము అపసవ్యమన్న దానిని సవ్యమంటారు. అదీ ఒకమతము సవ్యముగా త్రిప్పమని శాంతమ్మ లోపల పోయెను.

కమల తిరిగి నమస్కరించి లేచి తప్పులుక్షమించుడు తలిదండ్రులారాయని చెంపలువేసుకొని ముప్పురి పాదములపైన పెట్టిన పూలను తులసిని కొంచెము కొంచెముగా తీసుకొని కన్నులకద్దుకొని కొప్పులో పెట్టుకొని అమ్మాఅన్నదికమల.

శ్రీరాఘవేంద్రార్పణమస్తు.





# మాతృ జ్యోతి.

## :ప్రాతఃకాలము.:



కరకర ప్రొద్దుపొడుచుచుండగా శాంతా అంటూప్రక్కఇంటి కనకమ్మ ప్రహరి లోపలికి వచ్చి చూచెను. అక్కడ ఇరువాగుల సాలుగానున్న పూల చెట్లకు చల్లిన పచ్చనిరంగుపేడనీళ్లకు అచ్చుగుద్దినట్లు వేయబడిన ముగ్గులకు ముగ్ధయై ఆశ్చర్యపడి అబ్బా ఏమందముగా ఈవేళకే తయారుచేసినావే అమ్మా, గృహలక్ష్మిఅంటే నీవేనే నీకే ఈపేరుతగునంటూ ఇంటిలో ప్రవేశించెను.

శాంతమ్మ కనకమ్మను చూచి ఏమిటిది వదినా అంటూ ఉన్నావేఅన్నది.

కనకమ్మ శాంతమ్మను చూస్తూ శాంతం నీ ఓర్పు ఏమే ఈవేళకే కల్లాపుచల్లి ముగ్గులుపెట్టి ఇంటా, బైటా లక్ష్మికరముగా చేసిపెట్టినావు. గృహలక్ష్మిఅనగా నీవే నమ్మా మాఇంటికి పెండ్లివారు వస్తారు ఈనాడు ఇంటిముందు పేడనీళ్లుచల్లీ ఇల్లు అలికినారు ముగ్గులువేయమంటే మాచేతగాదు, మాచేతగాదు అనేవాళ్లేగాని ముందుకు వచ్చేవాళ్లు ఒక్కరుకూడాలేరు ఇట్లాటివాటికి పిల్చెననుకొనకుండా వచ్చి రెండు ముగ్గులుపెట్టిరావే పుణ్యముంటుంది అన్నది కనకమ్మ.

వదినా నేనుకాదే ముగ్గులువేసినది నీమేనకోడలు ఇంట్లోఉన్నది పిలుచుకపో కావలసినన్నీవేస్తుంది అన్నది శాంతమ్మ.

కనకమ్మ ఆశ్చర్యమభినయిస్తూ ఏమీ ముగ్గులువేసినది కమలా ఎంతబాగున్నవే అచ్చొత్తినట్లూ అప్పుడప్పుడూ చూస్తున్నానేగాని నీవేవేసినావనుకుంటూ ఉన్నానే

అయితే కమలను బాగా తయారుచేసినావే. అయినా అన్నీనేర్పిన అమ్మవు నీవుండ పిల్లకు కొదువా అంటూవంటఇంట్లోకి పోయిచూచెను.

కమల శిరస్నానముచేసిన వెంట్రుకలు కీలుగంటువేసుకొని దేవుని కెదురుగా నిల్చుకొనిఉండెను. శాంతమ్మ దేవునిపీఠము దగ్గరకుపోయిమోకరించి నొసలుభూమికి తగులునట్లు నమస్కరించి లేచి చెంపలువేసుకొని దేవుని పాదములపైనున్న తులసిని కొంచెముతీసుకొని కన్నులకద్ది గంటులోపెట్టుకొని కాఫీగిన్నెయెత్తుకొనిపోతు వదినా కాఫీ తాగుదమురా అంటూ వంటగదికి పోయెను.

కమల కనకమ్మను చూచి ఏమి అత్తా ఏమి కావలయునన్నది చిరునవ్వుతో.

ఆ ఏమికావలెనా కమల కావలయును కమలపై ఆశతో వచ్చినాను అన్నది కనకమ్మ.

నవ్వూ హేళనా పొడువూకలిపి కమల కనకమ్మనుచూస్తూ అయ్యో కమల కావలెనా కావలెనంటే కమల ఎత్తు కనకం పోయవలయును అత్తా ఊరక కమల వస్తుందా అయినాకనకమ్మగారికి కనకవర్షం కురిపించే కనకయ్యగార్లు ఉంటారులే ఈలాంటి కమలలు ఎందుకు అని హేళనగా మాట్లాడుతూ అత్తా కాఫి తాగుదమురా అంటూచేయిపట్టుకొని పిలుచుకొని పోయి కూర్చుండుమన్నది కమల.

కమలా ఈనాడు మా ఇంటికి వచ్చి ముగ్గులువేసి వస్తానంటే కాఫీ త్రాగుతా నాపై ప్రేమ ఉంటేచెప్పు త్రాగుతానన్నది కనకమ్మ.

నీకు ప్రేమలేకున్ననూ నాకుప్రేమ ఉన్నదిలే అత్తా త్రాగు వస్తానన్నదికమల.

సరేనంటూ శాంతమ్మ చేతికాఫీ నందుకొని త్రాగుతూ శాంతం ఈవేళకే అన్నీ నిత్యకృత్యములుతీర్చుకొని స్నానము పూజ కాఫీ అయినవనిన ఘిమ్ముల ఏమనవలె మమ్ముల నేమనవలె చూడుపోపోయి ఇంకా నిద్రలేవనివారూ కొందరున్నారు. పొయ్యిముట్టించను స్నానమైతేగా స్నానాల గదిలోకి పోతే ఒకగంట కాలమౌతుంది స్నానముచేసివచ్చి తీడితీడి చీరగట్ట అర్ధగంట అవుతుంది, తలదువ్వి బొట్టుతీర్చను కాలుగంట అవుతుంది, పొయ్యిముట్టించి నీళ్లగిన్నె పెట్టేటప్పటికి కాలుగంట అంతా అయ్యేటప్పటికి ఎనిమిదో తొమ్మిదో గంటకొట్టుతుంది. మీదీఆచరణే మాదీ ఆచరణేనా మానవత్వముండపనిలేదా ఈనాడు నాలుగు ముగ్గులువేయమంటే ఇంటివాండ్లకు

అంతకూరావు, వచ్చినవారికి మరంతకూరావు మాకోడలో చుక్కలుపెట్టనూ తుడ చనూ, తుడచనూ పెట్టను అదిహూడలేక నీవయిన జ్ఞాపకమువచ్చి వచ్చి చూడగా నాయాత్మకు సంతోషమైనదమ్మా ఎందుకు ఉంటే కాల్చనా చేతగాని దద్దమ్మలు అన్నీ నేర్చుకున్న ఇల్లాలే ఇల్లాలు. చూడు మీ ఇల్లు ఎట్లున్నదో ఇంద్ర వైభవముతో ఉన్నది. అంటూ కాఫీత్రాగినది కనకమ్మ.

కమల తాను కాఫీత్రాగి, కనకమ్మ చేతిలోగ్లాసును తీసుకొనిపోయి కడుగు టకు చేయిసాచినది.

నేను కడుగుతానన్నది కనకమ్మ.

అత్తా మీఇంటికోడలిపై అంత కనికరముంటే ఉండనీ ఈకోశలు పెద్ద వారు కడుగుతుంటే చూచి ఊరుకొనలేను తేఅంటూ తీసుకొని పోయి కడిగి తెచ్చి పెట్టెను కమల.

కనకమ్మ కమలను చేయిపట్టుకొని రాపోదమన్నది. శాంతమ్మపొమ్మన్నది కనకమ్మ కమలను పిలుచుకొని పోయి అందరినీచూచి ఇదుగోవచ్చినది చూడండే ఆడదిఅంటే ఇట్లుండవలె ఈవేళకే ఇంటిపనులన్నీచేసి శిరస్నానముచేసి పూజచేసు కొని కాఫీనాకుయిచ్చి తానుత్రాగి వచ్చినది. చూడూ మనఇంటిలో ఇప్పటికీపోయిలో పిల్లిలేవలేదు అముగ్గుపిండిబుట్ట ఇటు ఇవమ్మా అంటూ తీసుకొని కమలచేతికి ఇచ్చెను.

కమలకు పదునాల్గుఏడ్లవయసువుండును. చాలాస్ఫురద్రూపిణి ముఖములో చంద్రకళలుట్టిపడినట్లున్నవి. కనుసోగలు దీర్ఘములై తీర్చిదిద్దినట్లున్నవి ముఖసరోవర ములో వికసించిన తెల్లతామర పుష్పములా అనునట్లు చారడేసి కన్నులూ అ నును పైనబుగ్గలూ దొండపండు చాయగల పెదవులు నగుమొగము ఈఅందమునకు వన్నె తెచ్చు ఉంగరములు తిరిన నల్లనివెంట్రుకల కీలుగంటు పిరుదులపై చిందులాడ లేతచిగుళ్లలాంటి పాదములు సోయగమునకు ప్రథమసోపాన మిదియనితెల్ప తొల కరిమెరపువంటి మేని చాయతో సర్వాంగసౌష్ఠవములు కలిగియున్నదిగాని ఏవీ సొత్తులులేవు. లేకున్ననూ అంగసౌష్ఠవములే అలంకారములై ఉన్నవి. కమల చేతికి ముగ్గుపిండి బుట్టతీసుకొని ఇటు అటు నలుప్రక్కలచూచి ప్రహరిలో ముందుభాగ మున ఎక్కడెక్కడ ఏముగ్గు ఉండవలయునో అముగ్గును అందరు చూచుచుండగనే బలుపింతలుగా ఆశ్చర్యపడగా పెట్టెను. వాకిటిముందు ఒకపెద్ద కమలమువేసి

అక్కడనుంచీ బియ్యపు పిండినూరి కలిపిన నీటితో దొడ్డి వాకిలిపర్యంతము మధ్యలో రత్నకంబళమువలె చిత్ర విచిత్రముగ గీట్ల నమర్చి దానికిరువాగుల తీగె వరుసలు మధ్యలో ముగ్గులు రకరకముల కమలముల తీర్చెను. వాకిండ్ల కిరుప్రక్కల చిత్రముగా కమలములవేసి ఇంటి మధ్యలో వగడసాల పెద్దముగ్గువేసెను. ఈముగ్గుల నన్నిటనుచూచి అందరూ ఈఅమ్మాయి డ్రాయింగు నేర్చుకున్నదా ఎవరిఅమ్మాయి అని పూర్తి వివరముల నడుగసాగిరి. ఇల్లుఅంతా ఒకగంటకాలములో ముగ్గులతో నిండెను పాలీసుచేసిన నల్లబండలపైన ముగ్గులుతెల్లగా అచ్చోత్తినట్లుండి చాలాఅందముగా చూచువారికి హృదయానందమగు చుండెను.

కమల కనకమ్మనుచూచి. అత్తా ముగ్గులు చేతనైనంతమట్టుకూ పెట్టినాను ఇంకవస్తా నన్నది.

కనకమ్మ వెంటనేవచ్చి కమల చేయిపట్టుకొని నన్నుమాత్రము కాఫీత్రాగు వస్తానని కాఫీత్రాపి నీవుమాత్రము కాఫీత్రాగకుండా పోతావా అని పిలుచుకొని పోయి వంటగదిలో కూర్చుండబెట్టి ఫలాహారము కాఫీఇచ్చెను.

కమల ఫలాహారము పుచ్చుకొను చుండగా.

రాగమ్మ కమలనుచూచి కనకం ఈ అమ్మాయి కావలసినవారు అంటివే నీ కొడుకునకు ఎందుకు చేసుకొనలేదు. ఎంతదూరమోపోయినావు ఎందుకమ్మా మంచి రూపము గొప్పతెలివి ఇటువంటిఅమ్మాయి కోడలవుటకన్నా, వేరేభాగ్యము కావలెనేమే ధనము ఉన్నవారింటి అమ్మాయి అయినసరియా పనీ, పాటా, వంటా, వార్పా, రాపనిలేదాచూడూ ఈ వచ్చిన ఆడువారిలో ఒకపనిఅయినా చేతనగునేమో తలలు దువ్వి పిన్నులువేయ పౌడరుకొట్టి స్నోరుద్ద తీర్చి తీర్చి గుడ్డలుకట్టి అద్దాలువేయ, చెప్పులు తొడుగ వచ్చీరాని ఇంగ్లీషు మాట్లాడ చేతిగుడ్డ బిగంచెవులు నడుములో చెక్కి అటు ఇటు పచారుచేయ చేతనగునుగాని సమయము వచ్చినప్పుడు పనిప్రారంభిస్తే ఏపనియైనా చేయగల అమ్మాయి ఒకరైనా ఉన్నారేమోచూడు చేతనగునేమోచూడు ఐశ్వర్యవంతులైతే పనులు నేర్చుకొనక సోమరితనం వహించడమా ఐశ్వర్యము శాశ్వతమా సమయము వచ్చినప్పుడు ఏకార్యమైనా వెనుదియ్యక చేయగల గృహకార్యకలాపములు వంటలు ప్రతిస్త్రీకివచ్చియే ఉండవలెనమ్మా. ఒరులతో చేయించుకొనడమునకుకూడా పనితెలిసినవారికీ రానివారికీ భేదముండును. ఇవి చూడపనిలేదా పిల్ల అయితేసరి, డబ్బులు చేతపడితేసరి, పదిడబ్బులకు ఆశపడెదరేగాని పనీ, పాట,

వచ్చునాలేదా వంటావార్పూ తెలుసునాలేదా ఇంటినెత్తము మంచిదాకాదా ఆడపిల్లల వంశమా మగపిల్లల వంశమా తెలిసిగల వంశమగునాకాదా వంశపరంపరలో మగడుమిగిలి ఆలు ఆలుమిగిలి మగడు ఉంటారు వారిసంగతేమి ఆయుర్దాయములో ఎంతవరకూ ఉండు వంశమూ గ్రామము పేరు ఎట్టిది. తల్లిగారి వంశమేమి ఈలాంటి విషయముల విచారించుటమాని డబ్బువిమిఇస్తారు వెనుకఎంతమట్టుకు ఆదాయం ఉండును. అన్నతమ్ములున్నారాలేరా చిక్కులకు ఛిద్రములకు ఆదుకొనుబలముండునా లేదా అని విచారించే లోభదేవృళ్లు తయారైనారు. ముందుడబ్బుకై గడ్డితిని వెనుక రూపములేదని మగడు బుద్ధిలేదు మర్యాదతెలియదు చిన్నపెద్ద తారతమ్యములు అసలే తెలియవని మామా పనిచేతగాదని మాటవినదనీ ఎదిరించుతుందనీ ఏదిచెప్పినా చేతగావంటుందని పగలునిద్రపోతుందని పెకటికోనిద్రలేవదనీ ఒళ్లువంచిపనిచేయదనీ ఏదిచెప్పినాజవాబు చెప్పుతుందనీ అమ్మగారినడిగి ఏమీతెలేని దద్దమ్మఅని ఎప్పుడూ సింగారించడమేనని ముందుపాదచూపూ వారచూపూ ఆపైపంట్లుకొరకడం మొటికలు విరువడం మాట్లాడక బిగువుచూపడం ఏదిఅడిగినా నాకుతెలియదమ్మా అనడం ఆటు పిమ్మట మాఖర్మమమ్మా మాకువ్రాసినాడమ్మా ఆపాడుబ్రహ్మవాళ్లపాడుగాను. చెప్పి చెప్పి చెరచిరమ్మా మంచిమంచిచోట్లన్నీపాడుచేసుకొని పోయిపోయి వల్లకాట్లోపడినామమ్మా అయిరామాపారబ్ధం అని వాపోతూ ఇరుగుపొరుగువారికి వెళ్లబోసి రచ్చకెక్కించి మగనికి రగులుకొల్పి అమృతాన్ని హాలాహలముగామార్చి నిరంతరమూ రుద్రకాళివలె కేకలుపెట్టే అత్త తయారవుతారు ధనికులఇంట్లోపిల్ల ధనముతెచ్చినపిల్ల పండాహ్వారాలుకాదని చాకిరీచేయించు కున్నదేగాని చేసినదికాదని తెలియదనిలేదా అదిపిల్లలగనిన ఏమార్కెట్టులో పెట్టినా అమ్ముడుపోనప్పుడు నిలవరమైనప్పుడు అమ్మ బాగుంటేగాపిల్లలు అష్టడపోయేది. అనిమొత్తుకునేది ఇదివిద్యావంతులకు శ్రీమంతులకు ఉండేరోగము వరకట్నండూరకపోదు కట్టికుడుపుతుంది కని పెంచి విద్యాబుద్ధులుచెప్పి పదునాలుగేండ్లు అగచాట్లుపడి అనుభవించుపొమ్మని చేతికందించువానిని అనుభవించినందుకు రూకలుఇమ్మనే మగవారికి సాలమ్మా అని పేరుపెట్టుకొనుదాక ఆడపిల్లలే అప్పుడు ధర్మమూ అధర్మమూ కష్టమూ సుఖమూతెలుస్తుంది. అందుకేనే ఆడవారు ఎక్కువయింది రేపుతెలుస్తుందిలేకనకం పదివేలకు ముప్పైవేలు ఖర్చుపెట్టవలె చిత్రగుప్తుడువ్రాసిపెట్టిఉంటాడు. మనకలం ఆడకపోయినా వానికలం ఊరకుండదు. రూపాయలు వడ్డీతోఇవ్వవలసివస్తుంది కాళ్లముందు చూపులుచూడవద్దు కాలము వస్తుంది నిజమయినఅత్తగాని మగవాడుగాని ఈలాంటి పిల్లలవేనవేలిచ్చి అయినాకొన

వలెనే ఈమెకుపిల్లలుపుట్టిన వజ్రములేగాని పిల్లలా లోకముకన్నుల కద్దుకొనదేమే వస్తువు పండకమునుపే ఇస్తావా ఇస్తావా అంటూచేతులుసాచరా కనకం ఇటువినూ ముందు ఓలికాలంలో ఒకాయనకు నలుగురువరుసగా కూతుళ్లేపుట్టినారట వారువత్సరా నికొకరుపుట్టినవారు ఏడేండ్లుపెద్దపిల్లకు అయినదిమొదలు వేయిరూపాయలకు ఒకరి వంతున నలుగురిని నాలుగేండ్లకు ఓలి తీసుకొని ఇచ్చి ఆ డబ్బుతో కొంతముందుకు వచ్చినాడట. అత్తవారింటినుండి ఆపిల్లలు జాబులువ్రాయిస్తే ఇప్పుడు రాను వీలులేదు మరొకప్పుడువస్తాను ఆపనులున్నవి ఈపనులున్నవని వారిమాటే మరచేవాడట ఆ నలువురివెనుక ఇల్లాలికి సంతతి ఆగిపోయినది నిరాశచెందినాడు. ఏడేండ్ల తదుపరి భార్యనెలముట్టు తొలగినది. ఆదినాల్లో మగవారే వంటచేసేవారట ఆదినం జ్ఞాపక ముంచుకునేవారు ఆదినం వచ్చినది. ఆమె బైట ఎందుకో నిల్చుకొనిఉండగా ఆయన చూచి సరే వచ్చేదినం వచ్చినదని వంతువచ్చినదని షష్టిపంచకట్టి వంటగదిలో పనిప్రారంభించినాడు. ఆమెవచ్చిచూచి ఏమండీఅన్నది. ఆయన ఎగా దిగా చూచి నాడు లేదండి నెలతొలగింది అని చిరునవ్వు నవ్వినదట. అబ్బా అని కనువూడ్చే పొరక జారవిడచి పరుగెత్తివచ్చి ఆమె కడుపు పట్టుకొని పరాలబొజ్జ వజ్రాలబొజ్జ వేయి రూపాయలు ఈబొజ్జలో దినదినాభివృద్ధిగా పెరిగినక్షేమని సంతోషపడుతూ పిసికిచూస్తు అయ్యో నావరాలూ ఇన్నాళ్లు ఎక్కడున్నావే వెంటనేవచ్చిఉంటే అన్నా డాయన ఈ మాటలకు ఆశ్చర్యపడుతూ నవ్వుతూ ఆమె ఇప్పటికి ఏడేండ్లు అయి వుండును. వేయి రూపాయలు ఓలి వచ్చిఉండుననిగదా మీ ఆలోచనా ఆనందం ఇప్పుడానంద పడినట్లుగాదు ముందున్నది ముప్పతిప్పలు అన్నదట అట్టి ఓలి కాల మంతరించి వరకట్నంకాలంగామారింది ఓలికాలాన్నైనా ఎదిరించవచ్చు పురుషునికి వివాహముకాకున్నా పైనఉండనేఉన్నది దానిపైన సన్యాసము కావలసినంతాఉన్నది ఏవిధంగామారినా ఏమనిఅడిగేవారేలేరు కన్యకు వివాహముగాకపోతే సంఘములో తలవంపులు ఆకాలానికన్నా ఈకాలమేచెడ్డదనవచ్చును. ఇదిమాత్రము ఎన్నాళ్లులే తొందరలో ఏదోవిధంగా మార్పుకలుగుతుంది అన్నది రాగమ్మ.

కమల నవ్వుతూ అవ్వాఇటువిను మాఅత్తగారిపేరు కనకమ్మ. మామగారిపేరు సుందరశాస్త్రి రెండుపేర్లూకలిపితే కనకసుందరం అవుతుందిగాని రూపసుందరం గాని జ్ఞానసుందరంగానికాదు జనజనమని కనకవర్షం కురిపిస్తేగాని కనకసుందరం గార్లుకన్నెత్తిచూడరు. వీరుధనికులు మానాన్న జ్ఞానసుందరం మానధనులు అన్నది కమల.

ఆమాట కనకమ్మకు సూటిగా తగిలి కమలను చూచి అందుకుంటివి గదే కమలా అదును దొరికితే అతుకు బాగా వేసేటట్లు ఉన్నావుగదే. అక్కా నీకొడుకున్నాడే చూడు చూతము బాగా ఉంటుంది అన్నది కనకమ్మ.

కనకం నీవు చెప్పినదనుకా ఉంటావా ఇదే నా కోడలు ఇంతకన్నా రూపము బుద్ధికుశలత ఓర్పు ఎక్కడ తెస్తావే వెతుకుతూనే ఉంటిని ఈ నాటకి నాకోర్కె పండినది. ఈనాడే నిశ్చయము చేసుకుంటాను అన్నది రాగమ్మ.

అంతలో సుందరశాస్త్రిగారు బయటనుండీ వచ్చి చూచి తన కోడలే ఆ విధంగా ముగ్గులుపెట్టినదని తలంచి ఇందిరా ఎంత బాగా ముగ్గులు పెట్టినావమ్మా మానవులలో ఎట్టివారున్నారు ఇది విధి విలాస మంటూ లోపలికి పోగా రాగమ్మ శాస్త్రిమాటలువిని శాస్త్రిగారూ ఈముగ్గులను పెట్టి ఇల్లు శుభకరమొనర్చినది అలంకారముచేసినది మీకోడలుగాదు. మాకోడలండీ ఇటుచూతువురా అని కమలను చూపించెను.

కమల చిరునవ్వు నలుమూలల నలముకొన నవ్వుచు శాస్త్రిగారిని చూచెను. శాస్త్రి కమలనుచూచి ఓ మాకమలే మాకమలకు అన్నీవచ్చు వాళ్లవంశము విద్యావంశము అందులో రూపదేవత మిశ్రమై ఉన్నది ఆవంశములో జ్ఞానప్రదాయిని సరస్వతీ, ఆరోగ్యప్రదాయిని శాంకరి పట్టుగా కూర్చొని ఉన్నారు అన్నాడుశాస్త్రి.

ఐశ్వర్యప్రదాయిని పట్టుగా మీఇల్లు ఆశ్రయించి ఉందికదా మామయ్యా అన్నది కమల.

అదుగో కొంచెము సందువొరికితే అతుక్కుంటుంది సమయస్ఫూర్తిజ్ఞానము వీళ్లదే ఈమె ఏ ఇంటికిపోతుందో ఆ ఇల్లు పరమ పవిత్రమౌతుంది సర్వకార్యములు సర్వధర్మములు తల్లికి తెలియనివిలేవు అవి అన్నీనేర్పిఉండును. అదుగోచూడు నేను వచ్చినంతనే లేచినిలుచుకున్నది. పెద్దవారికెదురుగా కూర్చొనరాదని అగ్రస్థానము లందు పద్మాసనస్థయై కూర్చొనరాదని భయభక్తులతో సంచరించవలెనని పెద్దవారికి గౌరవమియ్యవలెననీ పెద్దవారున్నచోట వెళ్లిపోవునపుడు తలవంచి వస్త్రము జాగ్రతగా పట్టుకొని ఒళ్లువంచి వెళ్లవలెననీ తల్లినేర్పు చూడు మిగతావారు ఎట్లున్నారో అగ్రస్థానమలంకరించి కాళ్లూచుతూ ఒకతె, పద్మాసనస్థయై మరొకతె, మాఅమ్మాయి

చూడు పడక కుర్చీలో పండుకొని పైనకాళ్లుపెట్టి పండ్లు ఇగిలిస్తూ ఉందిచూడు ఆ వేషం కూతురు చెడుగైన మాతతప్పు అన్నారు, తల్లికితెలిసి ఉండినదాన్ని పిల్లకు నేర్పిస్తుంది తల్లినేర్పే పిల్లకు అంటూ శాస్త్రి కమలనుచూచి మాకమల పాటబాగా పాడగలదు విన్నాను ఆమహాతల్లి శారద కచ్ఛపిమీటుచూ పాడినట్లే.

ఉ॥ భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్
భూషితకేశ పాశమృదు పుష్పసుగంధ జలాభిషేకముల్
భూషలుగావు పూరుషుని భూషితుచేయు పవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించునన్నియుఙ్!

చూడు భూషణములకూ, వస్త్రములకూ, కొదువేమయినా వున్నదేమో వీరికి ఆమెచూడు వస్త్రభూషణములు లేకున్నా పవిత్రమైనజ్ఞానము రూపము ఉండుటతోటి ఎంతరాణించుచున్నదో ఈ రెంటికీతోడు గానమూ ఉన్నది ఈబంగారు ఎవరిసొత్తౌతుందో ఏమో వానిది అదృష్టము. ఎంతధనముండేమేమి మగవానికి ఈ ధనానికి అన్నీకిందు అన్నాడు శాస్త్రి.

ఆ ఆ అగండిమామయ్యా కవిత్వం అమవూ, అజ్ఞాలేకుండా పోతూ ఉంది మైమరచి వెళ్లుతూ ఉంది భావోద్రేకమా అన్నది కమల.

ఆ భావోద్రేకమూకాదు కామోద్రేకమూకాదు. ఉన్నదే అన్నాను అన్నాడు శాస్త్రి.

అంతలో అక్కడున్న వారందరూ ఏదీ ఒకటిపాడు కమలా అని తొందరపెట్టగా కమల శాస్త్రినిచూచి మామయ్యా నేను పాడుట ఎప్పుడు వినిఉంటివి నాకు పాడుటనిన తలనొప్పే అన్నది కమల.

కమలా నేను వినలేదు చూడలేదు. అనుకుంటివా భువనేశ్వరీ దేవాలయములో అష్టోత్తరము రాగయుక్తముగా చెప్పగా అందరూ సెబాష్ అనిమెచ్చుకొనలేదా అది విని అందరూ ఇంకొకటి చెప్పమనికోరగా భువనేశ్వరిపై ఒకటి రెండు పాటలు పాడలేదా ఒక్కటిచెప్పు నీతోటి వారికందరికీ బుద్ధిరానీ నిన్నుచూచియైనా అచరణ సవరించుకోనీ కానీ ఒకటిచెప్పు ఈపాడు చెవులతో విందాము నీవాక్స్థానములో

సరస్వతీ నివాసమేర్పరచుకున్నది. కానీ తల్లీ అన్నాడు శాస్త్రి. అప్పుడక్కడున్న వారందరూ కదియబడి అడుగగా కమల గారికి నవరత్నమాలికాస్తవము కల్యాణీ రాగము ఆదితాళముతో పాడనారంభించెను.

వాణీం జితశుకవాణీ మళికులవేణీం భవాంబుధి ద్రోణీం
వీణాశుకశిశుపాణీం నతగీర్వాణీం నమామిశర్వాణీం
కువలయదళనీలాంగీం కువలయరక్షైక దీక్షితాపాంగీం
లోచనవిజితకురంగీం మాతంగీం నౌమిశంకరార్ధాంగీం
కమలాం కమలజకాంతాం కలసారసదత్తకాంత కరకమలాం
కరయుగళ విధృతకమలాం విమలాం కమలాంకచూడ సకలకలామ్
సుందరహిమకరవదనాం కుందసురదనాం ముకుందనిధిసదనామ్
కరుణోద్దీపిత మదనాం సురకుశలాయాసురేషు కృతదమనామ్
అరుణాధరజితబింబాం జగదంబాం గమనవిజితకాదంబామ్
పాలిత సుతజనకదంబాం పృథులనితంబాం భజేసహేరంబామ్
శరణాగత జనభరణాం కరుణావరుణా లయాబ్జచరణాం
మణిమయ దివ్యాభరణాం చరణాంభోజాత సేవకోద్ధరణామ్
తుంగస్తనజితకుంభాం కృతపరిరంభాం శివేన గుహడింభామ్
దారితశుంభనిశుంభాం నర్తితరంభాం పురోవిగతదంభామ్
నతజనరక్షా దీక్షాం దక్షాంపత్రిత్యక్ష దైవతాధ్యక్షాం
వాహీకృతహర్యక్షాం క్షపితవిపక్షాం సురేషు కృతరక్షామ్
ధన్యాం సురవరమాన్యాం హిమగిరికన్యాం త్రిలోకమూర్ధన్యామ్
విహృతసురద్రుమవన్యాం వేద్మివినాత్వాం నదేవతామన్యామ్
వీతాం నవమణిమాలాం పఠంతిభక్త్యేహాయేపరాశక్తిమ్
తేషాంవదనే సదనేనృత్యతి వాణీరమాచపరమముదా!

అని కమలపాడగా అక్కడఉన్నవారందరూ తలలు ఊచుతూ సెభాష్ అన్నారు అంతలో శాస్త్రి రాగమ్మనుచూచి విన్నావేమమ్మా ఆ మృదుత్వము కంఠ స్వారస్యము ఆ పదవిమర్శ జ్ఞానము ఇవిఅందరికీ ఉండవలెనంటే ఉండగలవా పూర్వజన్మ సుకృతజీవులు ఈలాంటివారిని చూచి అయినా జీవితాన్ని సవరించు కోరు మూఢులు అన్నాడు శాస్త్రి.

ఔనుశాస్త్రిగారూ మీరెందుకు సవరించుకోకూడదు వజ్రాన్ని కాలదన్ని గాజురాయిని ఆసిస్తూ ఉన్నారే అన్నది రాగమ్మ.

ఆమాట నీచెల్లెలికిచెప్పు మాటవింటేగా అనుభవిస్తే తెలుస్తుందన్నాడు శాస్త్రి.

రాగమ్మలేచి కమలా పోదముపా అన్నది.

కమల లేచినిలుచుకున్నది.

శాస్త్రి రాగమ్మనుచూచి కమల ఇంటికి పోతూ ఉన్నావేమమ్మా కమలపై మనసు పోలినట్లున్నదే అన్నాడు.

ఔనండీ మందార మకరంద మాధుర్యమునుగ్రోలు మధుపంబుపోవునే మదనములకు అన్నారు మందారపుష్పరసముద్రావుతుమ్మెద ఉమ్మెత్త పూలపై వాలదు ఎవరికి ఏవస్తువపై ప్రీతిగలదో ఆవస్తువును వెతుకుతూనే వుంటారు పనికిరానివస్తువు కేల పారేడుతారు మీరు మీవస్తువను వెతకినారుగా నావస్తువులు మా కమలయందు వున్నవి భగవంతుడు చూపించినాడు అంటూ కమలా పోదముపా అన్నది రాగమ్మ.

కమల కనకమ్మదగ్గరకుపోయి వస్తాఅత్తా అన్నది. కమలా మధ్యాహ్నము ఇటువచ్చిపోతల్లీ కొంచెము పనివున్నదన్నది కనకమ్మ.

కమల సరేవస్తానత్తా అని శాస్త్రిగారినిచూచి మామయ్యా వస్తానన్నది.

శాస్త్రి తలవంచుకొని రాగమ్మమాటల నాలోచిస్తూ ఊఁ అన్నాడు. కమల రాగమ్మను పిలుచుకొనిపోతూ వుండగా పెండ్లికి వచ్చిన ఆడవాళ్లు పది పదహైదు మంది వారివెంటపోయిరి.

శ్రీ లక్ష్మీ నృసింహార్పణమస్తు.





# పరాత్పర జ్యోతి.

## —: సంగమకాలము. :—

ఆ ఇల్లు చిన్నదైనను ముందుసాలుకుఉన్న చెట్ల అందముతో క్రింద ఉన్న శుభ్రితాలంకారములతో శోభాయమానముగా ఉండెను. లోపలప్రవేశించినతోడనే శాంత అందరినీచూచి కమలా ఆ చాపలు వేయమ్మా అన్నది.

కమల చాపలువేయగా శాంతకూర్చోండమ్మా అన్నది. అందరు కూర్చున్నారు.

ఏమమ్మా పెండ్లికి వచ్చినారా వారికి మీరు ఏమికావలె నన్నది శాంత.

నా చెల్లెలేనమ్మా కనకమ్మ మా ఊరిలోనేవారు ఇప్పుడు సంబంధముచేస్తూ ఉన్నది. వీరందరూ శాస్త్రిగారికి కనకానికి కావలసిన బంధువులే నన్నది రాగమ్మ.

శాంత వంటపనిలో అటూ ఇటూ తిరుగుతూ, కమలా ప్రాతఃకాలమతిక్రమించుచున్నది. నాకు వంటపని ఉన్నది వీరుధనికుల ఇంటికి పెండ్లికివచ్చి బీదవారి ఇల్లు చూచిపోను వచ్చినారు. వారిని విచారించు అమ్మా అన్నది.

అంతలో రాగమ్మ శాంతమ్మను చూచి లేదులేదు చూచి పోవుటకు రాలేదు తిష్ఠవేసి కూర్చొనుటకే వచ్చినాను. మధ్యాహ్నము భోజనముకూడా ఇక్కడనే అన్నది రాగమ్మ.

శాంతమ్మ నవ్వుతూ, కానీ పిన్నమ్మా మాకు కలిగినదీ -ఈ పూటచేసినది. నీవు ఉండవలెగాని తప్పక పెట్టెదను ఉండు పిన్నమ్మా అన్నది.

శాంతా సమయము వచ్చినప్పుడు దైవమువావి వరుసలుకూడా తామంతటఅవే వరుగెత్తుకొని వస్తూఉండునన్నారు అట్లనే కమలనన్నుచూడగనే అవ్వాఅన్నది ఇక్క

డికివస్తే పిన్నీ అని నీవు పిలుస్తూ ఉన్నావు ఇంక మీ ఇంటిఆయన అక్కా అంటాడో అమ్మా అంటాడో చూడవలెనన్నది రాగమ్మ.

శాంత వింతబోయి ఏమీ అట్లంటూ ఉన్నావే నేను పిన్నీ అని పిలువకూడదా అన్నది నవ్వుతూ శాంత.

అనకూడదనికాదు ఉదయమే కమలను చూచినేను ఏమనితలచినానో అప్పటి నుంచీ దానికి శుభసూచకములు అన్నీ తటస్థమగుచున్నవి. మీ కుటుంబమును నేను ఎన్నడూ చూడలేదు విననూలేదు ఈనాడుచూచినాను విన్నాను చాలాసంతోషమయి నది. శాంతా గృహిణి అంటే నీవేనే చూడు ఇల్లు ఎంత శుభ్రముగా పెట్టుకున్నావో సామానులు ఎంతజాగ్రత్తగా ఉంచినావు పాత్రల ఎంతశుభ్రముగా తోమినావు ఎక్క డెక్కడ ఏమి పెట్టవలయునో అవి అంతభద్రముగా, శుభ్రముగా, పెట్టినావమ్మా నాకెంతో సంతోషమైనది. అంటూ దొడ్డిలోపలికిపోయెను. ముందుగానే కమలతో అందరూ కలసిచూస్తూఉండి. రాగమ్మపోగానే అందరూవచ్చిరి కమలా దొడ్డి దండిగా ఉన్నదికదే ఏమేమి చెట్లుఉన్నవి అన్నది రాగమ్మ.

చూతువురా అవ్వా అదుగో వాకిలిముందు ఇరువాగుల అంగరక్షకులవలె వార్జీపుచెట్లురెండు, వీటిగాలివాసన మంచిదని ఇంటిముందుగానీ, వెనుకగానీ ఉంటే శుభమని సన్నపిల్లల వైద్యమునకు పనికివచ్చునని వేసినారు అక్కడనుంచీ దారికి ఇరువాగుల పదహారుచెట్లు ఇటు ఎనిమిది అటుఎనిమిది సన్ననిమ్మవి వేసినాము ఇవి వేసి పదిసంవత్సరము లయినదట మాఅన్న షష్టపారములో చేరిన సంవత్సర మేనట మాఅన్న కాలేజిలో చేరునప్పటికి ఖర్చులకు కావలసినంత డబ్బువస్తూ వచ్చి నదట మాకు ఈచెట్లు కల్పవృక్షములు కష్టపడి వాటిని బ్రతికించు చున్నాము అవి మమ్ముల బ్రతికించు చున్నవి. ఇది గజనిమ్మ, ఇది ఉసిరిక, ఈరెండుచెట్లూ మాకు సంవత్సరమునకు కావలసినన్నికాయలు ఊరగాయకు కాయగలవు అదిమామిడి ఇవి ఊరగాయకు ఉపయోగించినన్నీ ఉపయోగించుకొని మిగిలినవి. విక్రయింతుము ఈ మూడుచెట్ల మిగులుకాయలను విక్రయించి ఆడబ్బుతో ఊరగాయకు కావలసినసరుకు లకొందుము ఇది కూకుడుచెట్టు ఈచెట్టుకాయలు శిరస్నానమునకు మాకు మాబంధు మిత్రులకుకాగలవు ఎఱ్ఱఅవిసెచెట్లురెండు వీటిఆకు, పూలు, కాయలు, కూరకుశ్రేష్ట మట మునగచెట్లురెండు ఈచెట్లఆకు, కాయలు, కూరకువాడుకుంటాము విక్రయము

నకు ఇస్తాము అదిపనసమాను. ఆకులు విస్తళ్లకు పనికివచ్చును కాయలు కూరకు పండ్లుతినను మిగులునవి విక్రయింతుము చెట్లు ఇంతమాత్రము ఉన్నవి. ఇదిద్రాక్ష తీగె ఈద్రాక్షను మాగినది. కొంత ఎండించి కొంత దైవనిదేదనచేసి మేముతింయము ప్రహరీకి చెట్లమధ్యలో ఇరవై పెద్దవంగచెట్లు, పది పెద్దటొమేటాచెట్లు, పదిబెండ, అవసరపుబెండచెట్లు, ఒక్కటిపొట్ల ఒకటి నేతిబీర, ఒకటిచిక్కుడు, ఒకటిసొర ఒకటి పెద్దకాకర, ఒకటిబూడిదగుమ్మడి, ఒకటితియ్యదొండ బచ్చలితీగెలు ఇంతమాత్రమే అవ్వా ఆకులు అవి కంబాలపెద్దకొయిగూర కొత్తిమేర, మెంతిచుక్కపొదిన, ఆకులు ఇంతమాత్రమే ఈతీగెలు ఆకులవల్ల ఇంటిఖర్చుపోను అవులకు మేతకొనడమునకు కొంతతోడ్పడును. మూడుఆవులు మూడుదూడలు వున్నవి పాలు మా ఇంటిఖర్చుకు పోను మిగిలినవి అమ్మగా చెట్లకు కావలసినంతా చెక్కవచ్చును అవులతోచెట్లు చెట్లతో అవులు ఈరెండిటతోమేము ఏలాటితొందరలేక జీవిస్తూవున్నాము మేముగాక అవుల అవ్వఒకాయమవున్నది. కుక్కలు రెండు వున్నవి ఈతోటను కంటికి రెప్పవిధముగా కాపాడుతూవుండును ఇక్కడఎవ్వరినీ చేరనివ్వవు వీటిఖర్చులు ఇందులోనే పోవును దేవునికిముందు మానవులకువెనుక అన్నట్లు ఇంటిముందు భాగములో పూలచెట్లు దేవునికీ ఇంటి వెనుకభాగములో కాయలచెట్లుమాకు నియమించుకున్నాము దేవునికి కావలసినన్నిపూలు మాకుకావలసినన్ని కాయలు ఇవిదొరకరాలేమ అవ్వా మాకాయల చూచి దేవుడు కావలసినన్నీ కాయలు ఇచ్చినాడు ఇటు చూడుమని చేతులు చూపెమ కమల.

రాగమ్మ కమలచేతులచూచి ఆశ్చర్యముతో ఎంతకష్టపడినావే అమ్మా అన్నది.

ఆశ్చర్యపడిన రాగమ్మనుచూచి కమల అవ్వా నాకేకాదు అమ్మకునాన్నకు అన్నకు అవులఅవ్వకు ఇంకాఎక్కువగా చేతులకు భుజములకు కాయలున్నవి నీళ్లచేది చేది కాయలుకాచినవి ఈకష్టము చూడలేక దేవుడు ఇప్పుడు ఎలెక్ట్రిక్ పంపు ఇచ్చి నాడు ఇదిఆరునెలలుగా పనిచేయు చున్నది. ఈవిద్యుచ్ఛక్తి మావిపత్తుల కొంతతొల గించినది ప్రతిసంవత్సరము మూడువేలకు తగ్గకుండా ఒకకాపు రెండవకాపుఅందులో అర్ధమునకు తగ్గకుండా ఫలము వస్తూవున్నది. అన్నచదువు అయిపోయినది ఇంక అనునంతలో రాగమ్మ చిరునవ్వు నవ్వుతూ.

ఇంకనీపెండ్లి వున్నదికదా పరవాలేదు కష్టేఫలీ అన్నారు. కష్టపడినారు సుఖ పడగలరు మీఅమ్మఅన్నిహంగులకు తగినమనిషి ఆమెవల్ల మీఅందరూ సుఖపడగలరు

అనుచుండగా రాగమ్మ ధ్వనివిని సుముఖీ, ధుర్మఖీ, పరుగెత్తుకొని వచ్చెను. రాగమ్మ భయపడెను కమలనుచూచి దుర్ముఖి దూరముగా కూర్చొనెను సుముఖి సమీపమునకు వచ్చి తోకఊచుతూ నాలుకను ఆడించుచూ కుశలప్రశ్నచేయుచూ తన స్నేహశీలము ఆనందము వెలిబుచ్చెను.

కమల సుముఖినెత్తి పైచేయిపెట్టి దువ్వుచూ ఈమె మా అవ్వ ఏమీ అనకూడదు అని చెప్పుచుండ.

కమలా అని శాంతమ్మపిల్చి రెండు నిమ్మపండ్లు కోసుకొని అవ్వనూ అందరినీ పిలుచుకొని రామ్మా అన్నది.

ఆధ్వని విన్నంతనే సుముఖీ దుర్ముఖీ పరుగెత్తుకొనిపోయి శాంతమ్మ చెంత చేరెను.

కమల నిమ్మపండ్లను రెండుకోసుకొని అందరినీచూచి పోదమురాండీ అని ముందుపోవుచుండ అందరూ ఆశ్చర్యనిమగ్నులై హృదయానందముతో కమల వెనువెంటపోయి వంటగది చేరిరి.

శాంతమ్మ పానకము పిసికి శొంఠి, మిరియాలు, ఏలకులు, దంచినపొడి కొంచెము పానకములోవేసి నిమ్మరసము మోతాదుపిండి వడియగట్టి గౌరవార్థకముగా ఒక్కొక గ్లాసువంతున అందరికీ ఇచ్చెను.

ఎందుకింతపని పెట్టుకున్నావమ్మా ఔను గౌరవనీయుల పంథా ఇది ఇంటికి వచ్చినవారిని లెక్కచేయక కూర్చుండుడని చెప్పుటకూడామాని బధిరాంధశవమువలె నీల్గుకొని సాగనంపువారు కొందరు పూర్తివివరములు తెలుసుకొని కూర్చుండుడని చెప్పక సరేపోయిరండను మధ్యజీవులు కొందరు ఇంటికి వచ్చినవారిని గౌరవించి గౌరవింప బడవలెనని భూతదయతో ప్రేమనువెలిబుచ్చి తనకులేకున్నా కీర్తిగౌరవ ప్రతిష్ఠలకై ఒరులకిచ్చుచూ ఎవరైనా బంధుమిత్రులువస్తే ఎట్లనని ఒకవస్తువుకు రెండు వస్తువులు గృహోపకరణములు సంపాదించి వారుతినువస్తు సముదయముల దాచి ఉంచి ఒరులకు పెట్టి గౌరవించి గౌరవింపబడగలరు పూజించి పూజింపబడగలరు కీర్తినీపుణ్యాన్ని ఆర్జింపగలరు. ఇదిమానవలక్షణం ఈలక్షణాలు స్త్రీలకు ముఖ్యముగా ఉండవలయును గృహిణి ఒకతూరిపట్టు పదితూర్లుయజమానికిచెప్పి తెప్పించుకొనును

దాచిపెట్టి సమయములగుర్తెరిగి వాడుకొనును చూడు ఒకేతూరి ఇంతమందికి గ్లాసులు ఆర్జించివుంచినావు ఇట్లే అన్నివస్తువులు వుండునని గ్రహించు కున్నాను స్థితిగతులు వున్ననూ గృహిణిమూఢజీవిని అయినా యజమాని పరమలోభిఅయినా గృహోపకరణములు గౌరవములోపించునట్లుచేయును గౌరవము కావలయునన్నవారు ఇరువురలోఒక్కరయినావుండిన కొంతనయముగావుండును గృహిణితోనే గృహస్థునకు గౌరవము మానవులుపేటిలో వెనుకపడరాదు. తినితినక అయినా మిగిలించి గృహమూ, గృహోపకరణములు చక్కపెట్టుకొని గౌరవించి గౌరవింపబడవలయును. శాంతా కొందరు వస్త్రాలే భూషణమని గౌరవమని విలువగలవి కొంటూ చక్కగా వాడుకొనుపద్ధతి తెలియకపాడుచేసుకుంటూ ధనము వ్యయమొనర్చుకొని గృహమూ గృహోపకరణములు లేనివారుకొందరు శక్తికిమితిమీరిన ఆహారములు తింటూపండుగలని పర్వాలని తీర్థయాత్రలని తిరుణాళ్లని రైళ్లకు బస్సులకూ ధనము ధారబోస్తూ జమాఖర్చులు తెలియక బీడీ, సిగరేటు, నశ్యము, అకూ, పొగాకు మొదలగు దురభ్యాసములకులోనై దినదినాభివృద్ధిగా అభ్యాసముపెరిగి పెనుభూతమై బాధించునను సూక్ష్మగ్రాహితలేక తమశక్తినితాము తెలుసుకొనలేక తారుమారై ధనవ్యయముతో ధనము మిగులక గృహమూ, గృహోపకరణములులేక అగౌరవముతో చింతించువారు బీదతనమునుండీ లేవలేనిస్థితిలోవున్నారు. శాంతా మీరుఅట్టిదుర్గుణ పిశాచములనుండీ తప్పి తిరుగునట్లు గన్పడుతున్నది నీపేరు మీయమ్మతెలిసినట్లు పెట్టినది ప్రశాంతమైన హృదయమమ్మానీది నీయట్టిస్త్రీని బడయుటకు పురుషుడు ముందుజన్మలో ఎంతోతపస్సు చేసిఉండవలయును. భార్యాం పుత్రాంశ్చపుత్రికాం మిత్రాణిపాతు సతతం నఖిలాంగం హరిప్రియా చెడితేశనిప్రియా అన్నారు. భార్యాపుత్రులు పుత్రికలు బంధుమిత్రులూ సోదర సోదరీలు తల్లిదండ్రి మొదలగువారు శ్రేష్టులుగావలయునన్న ముందుజన్మలో యజమాని పుణ్యముచేసి ఉండవలెను లేకున్న శనిప్రియులై, బాధించి వేదింతురన్నారు. మీఇంటఉన్నవన్నీ లక్ష్మీకరముగానేఉన్నవి. ఇంతకూ మీఇంటిఆయనచేసిన పుణ్యములపంట చక్కగానే పండినది ఆరుగుణములు గలిగినఇల్లాలు పిల్లలు ఇంతకన్నా ఏమి కావలయును. కొడుకు ఎట్లున్నాడో ఏమో చూడలేదుగాని చూచినవన్నీ బాగున్నవమ్మా అన్నది రాగమ్మ.

కమల ఆ మాటలువిని వెంటనే వరప్రసాద్ ఫోటోను రామశాస్త్రిఫోటోను తెచ్చిచూపెను రాగమ్మచూచి తలయూచి వీనిముఖములో చంద్రికళలు ఉట్టిపడినట్లున్నవే పేరుఏమి పెట్టినావన్నది రాగమ్మ.

అన్న పేరు వరప్రసాదు నాన్న పేరు రామశాస్త్రి అన్నది కమల.

ఏ ప్రసాదేవీడు అన్నది రాగమ్మ.

పిన్నీ నాకు వివాహమైన మూడుసంవత్సరముల పర్యంతము సంతతిలేదు అప్పుడు సత్యనారాయణ వ్రతము చేసితిమి అదివరకే నిత్యకృత్యముగా పూజచేసుకొను నప్పుడు చెప్పుకొనునప్పుడు లక్ష్మీనారాయణులారా నాకుసంతతి ఇచ్చితిరేని తమ వరప్రసాదమున పుత్రుని మాతల్లి లక్ష్మీ వరప్రసాదమున పుత్రికను ఇవ్వండి దుష్పుత్రులు, దుష్పుత్రికలు. వద్దుస్వామీ లేకున్ననూమానె మీసేవచేసుకొంటూ కాల ముగడిపెదము నీవల్ల నందయశోదలు ఆనందపడినట్లు ఇరువురిని మాత్రమేదయచేసే యుడు చాలు దుస్సంతతి ఎంత ఉన్ననూ ఏమి మేలుస్వామీ యశోవంతులై విద్యా వంతులై రూపవంతులై ఆయురారోగ్య ఐశ్వర్యవంతులై వయోవృద్ధబ్రాహ్మణగురు మాతృపితృ బంధుమిత్రుల యెడవినమ్రులై భక్తిశ్రద్ధలతో నిన్నుమరువక పూజించు వారిని దయచేయుడు అని చెప్పుకొనుదాననుపిన్నీ ఆ వ్రతముచేసినరాత్రి నిద్దరలో వృద్ధదంపతులు ఇద్దరువచ్చి ఇదిగో వీడు నాకొడుకు పెంచుకోమని మగపిల్లవానిని ముసలాయన ఇచ్చినాడు ఇదిగో నాకూతురు పెంచుకోమని ముసలాయమ ఆడపిల్లను ఇచ్చినది. కూతురూ కొడుకూ కావలెనని నిత్యమూ అడుగుతున్నావుగా నీవడిగినట్లే అనుకున్నట్లే వీరుకాగలరు పొమ్మని అంతర్ధానము నందినారు నాకు వెంటనే మెల కువ వచ్చినది స్వప్నము నిజమోకాదో అను సందేహమున్నను సంతోషము పట్టలేక వెంటనే మీతమ్ముని లేపి చెప్పితిని అప్పటికి రాత్రి నాల్గవయామము నడచుచుండెను.

ఆమాట విన్నతోడనేవారు సంతోషపడి శాంతా నీవు అదృష్టవంతురాలవు భగవంతుని అనుగ్రహము సంపాదించుకున్నావు వారి వరప్రసాదమున గలుగు సంతతిలో ఏ కొరంతలూ ఉండవు మానవాతీతులుగా నుందురు ఉత్తముడు ఒక్కడైననూచాలు అప్రయోజకులా అంగహీనులా రోగగ్రస్తుల కోపగ్రస్తుల అధమాయుర్దా యుల మతిభ్రష్టులా మానహీనులా కని అగచాట్లపాలై అల్లాడు తలిదండ్రుల చూచు చున్నాముగా భగవంతుడు వారిలోమనల చేర్పక మంచి సంతతినిచ్చి మన్నించినాడు మనము విపత్సముద్రము దాటినట్లే భగవదనుగ్రహము బడసిన స్త్రీ నాకు ఇల్లా లగుట నాపుణ్యము భార్యవల్లభర్త భర్తవల్లభార్య పునీతులవుదురన్న, మాటవాస్తవము నీవల్లనావంశము పావనమైనది బీజమునకన్నా క్షేత్రము మంచిదై ఉండవలెనన్న

పెద్దలమాటకూడా వాస్తవమే నీబలవంతముతో వ్రతము నీ పట్టుదలతోపూజ నీ నిర్బంధముతో నియమము ఉన్నానేగాని నాయంతకునేను ఉన్నవాణ్ణిగాను గృహిణి వల్ల గృహస్థుడు బాగుపడునుగాని గృహస్థునివల్ల గృహిణి బాగుపడుటకష్టము యిది నాయదృష్టమంటూ లేచినారు. నేను మొద్దుబారినదానివలె అట్లే కూర్చొని ఉండి కొంతసేపటికిలేచి స్వామీ నీదయఅంటూపోయి స్నానముచేసి నేను పూలుకోసికట్టితిని వారు దేవునిదగ్గర మలిన వస్తువులుతీసి దీపముల వెలిగించి కేశవనామములతో అర్చనచేసి పుష్ప మాలాలంకృతులచేసిరి కొంచెము చక్కెర నైవేద్యముపెట్టి కర్పూరహారతి ఇచ్చెను ఇరువురమూ చేతులు జోడించుకొని.

తే॥ మిమ్ము నెప్పుడు దలతుము మమ్ము మీరు
వత్సలతచూచి బ్రోవగావలయు నెపుడు
భువనరక్షకులారయో పుణ్యులార
ధర్మవిమలారా మాతలిదండ్రులార!

అని నమస్కారము చేసితిమి.

అట్లు లక్ష్మీనారాయణ వరప్రసాదముతో కలిగినారు కాబట్టి మనుమని పేరు లక్ష్మీనారాయణ వరప్రసాదనియు లక్ష్మీనారాయణ భిక్షం అని ఈమెపేరు పెట్టు కున్నాము ఈమెపేరు భిక్షం బాగలేదని కమలా అని అందరూపిలుచు చున్నారు శ్రీవారు దీవించిన రీతిగానే పేరు అన్ని అందములూ అన్ని అంగములూ మమ్ముల ఆనందపెట్టుచున్నారు దైవమును నమ్మినవారికి కొదువలేదనుమాట వాస్తవము వాణ్ణి చూచినప్పుడంతా ఆ సత్యనారాయణమూర్తిని ఈమెను చూచునప్పుడు తల్లి లక్ష్మీ దేవిని చూచినట్లే నామనసుకు తోచును. ఈ ఇరువురిని చూచుకొనుచూ కాలము త్రోయుచున్నాము ఇంతవరకూ మంచిపేరు ప్రతిష్ఠలనార్జించినారు పూవుపుట్టినతో డనే తావిగొల్పు నన్నట్లు ఏ అప్రతిష్ఠల పాలుగాకుండా దినదినాభివృద్ధిగా ముందుకు వచ్చుచున్నారు అన్నదిశాంత ఈ ఇరువురి తదుపరి సంతతిలేదా అన్నది రాగమ్మ.

శాంత చిరునవ్వుతో ప్రశాంతవదనముతో పిన్నీ మంచివారిని ఇద్దరిని దయ చేయమని ముందు ఎట్లుకోరితినో అట్లే ఇంక సంతతివద్దని ప్రతిదినమువారికి చెప్పు కొనక శయనించునదిలేదు ముందుకోరికను నెరవేర్చినదేవుడు ఈకోరికను మాత్రము నెరవేర్చడాఏమి వారియాజ్ఞలేక ఏదీకాదని నానమ్మకము అదియుగాక ఋతుసమయ

ముల సంగమము తప్పించుట స్త్రీధర్మము నీ తమ్ముడుకూడా నామాట ననుసరించ గలడు ఈ ఇద్దరినీ పోషించుటే మాకు కష్టమయినది. ఎక్కువకని దారిద్ర్యమనుభ వించుటకన్నా పాపమున్నదా కామమునకు దాసులమై కన్నపిల్లలు కూటికి గుడ్డకు మొగమువాచి ఏడ్చుచుండ చూచుట మంచిదా పిన్నీ కామమును కట్టలేక కన్నపిల్లల పట్టలేక కటకటపడు కష్టజీవుల కన్నీరు చూస్తున్నాముగా పోషించేశక్తి ఉండిననూ ఒకనియమము ఉండవలయును. దేనిలోగాని నియమ బద్ధులుగానివారు కడకు దుఃఖింతురు వది పందిపిల్లలకన్నా ఒక ఏనుగపిల్లమేలు చచ్చినా బ్రతికినా వేనవేలు చేస్తుంది. చూడయింపిస్తుంది పేరుతెస్తుంది ఏనుగపిల్లకే ప్రయత్నము చేయవలయు గాని పందిపిల్లలకై పాటుపడరాదు ఎందుకు ఆ పాడుజీవులు తల్లినెత్తురుకు తండ్రికష్టా నికి చీడపురుగులు నెత్తురుపంచి యిచ్చి తొమ్మిదినెలలుమోసి ఆస్తులు పస్తులుఉండి. తిని తినక సాకినందుకు ఫలముఉండ పనిలేదా పురుషులకేమి వారి ఆతురత వారిది పైనవచ్చు కష్టములకు పాత్రులుగారు స్త్రీమేల్కొని గట్టిపట్టుతో నడువవలయు నన్నది శాంత.

ఆ మాటలకు రాగమ్మ అశ్చర్యమభినయించి శాంతా ఏమినేర్చినావే ఎంతఓర్పే నీలాటిస్త్రీలు ఉండిన మానవలోకము మాధవలోకమగుతుందే ఏముందీ కోరికే ప్రపంచాన్ని అభివృద్ధిచేసేది నీకోరిక ప్రతివారికిఉంటే కొంతకాలానికి దేవత్వము గల మానవులు ఉత్పన్నులగుతారన్నది రాగమ్మ.

ఔను పిన్నీ కామదేవతను రెచ్చగొట్టు రోజులేయివి కామదేవతను రెచ్చగొట్టి నియమములుతప్పి నటించి నిర్వీర్యులై క్షయవ్యాధికిచిక్కి ప్రజలకు ప్రభువులకు పనికిరాక యమలోకమానకు పాపిపోయినట్లు అస్పత్రులకు పోతూఉన్నారు. వీర్య బలమే సప్తధాతువులకు అంగరక్షఅట్టి వీర్యమును దుర్వ్యయము చేయరాదు నియమ బద్ధముగానుండవలయును. నిర్వీర్యునకు సంతతిగలిగిన రోగగ్రస్తులు పిదపదేహాలు బుద్ధిహీనులు పాపచిత్తులు మానహీనులు పుట్టుదురు. వంశమేచెడిపోవునను తలంపు స్త్రీకిగానీ పురుషునకుగాని వుంటేగా పిన్నీసర్వాంగ సౌష్టవములుగలిగి చంద్రబింబ మువంటివారు సంతతికావలెనంటే దేవుడూ, దైవమూ నియమము కావలయును వున్నంతవరకు సుఖమనుభవించవలెనంటే తనపతినితాను కాపాడుకొనుధీమా వుండ వలె కర్షకుడు పశువుల కాపాడుకొనునట్లు సతిపతిని కాపాడుకొనవలె కర్షకునికి పశు వులు రోగగ్రస్తములైనా సతికిపతి రోగగ్రస్తుడైనా దుఃఖముగాక సుఖముండగలదా

ఇది తెలుసుకొని స్త్రీ కంటికి రెప్పలాగా పతినీ సంతతినీ కాపాడవలయు లేకున్న అటు పెనిమిటినీ ఇటు సంతతినీ చెరిచి తాము చెడును. పిన్నీ కుటుంబమును లోకమును బాగుపరచుటకుగాని ఓగుచేయుటకుగాని స్త్రీలోనే ఉన్నది. దానికి నిదర్శనము నీ మనవని మాట్లాడించిచూడు తెలుస్తుంది. త్రిదేవులు ముప్వురూ వానియందు ఉన్నారో లేదో పరీక్షించు నీ తమ్ముడు సంపాదించిన ధనము న్యాయమైనది. అన్యాయార్జితముగాదు దానితో మేము సంపాదించిన శుక్ల శోణితములు అమృతము దానితో తయారయిన ఈపిల్లలు దేవతా సములు ఇట్లు కష్టపడి న్యాయముగా సంపాదింపవలయును అన్నది శాంత.

శాంతా నీలో ఎన్నిధర్మములు ఎంత శాంతము ఇమిడిఉన్నవే ఔను స్త్రీ ఓర్పుతో ప్రవర్తిస్తేనే మంచి సంతతీ మంచికాపురం ఉండేది. శివాజీని గన్నదీ తల్లే గాంధీని గన్నదీ తల్లే, కుష్టురోగినీ, మతిభ్రష్టునీ, గురుద్రోహినీ గన్నదీ తల్లే తల్లి అయినంత మాత్రమున తల్లిగాదు. కడుపుపండిన మాత్రాన పంటగాదు అన్నది రాగమ్మ.

ఔను పిన్నీ మంచి గమనించి నడువడమే మానవత్వం కామమును అరికట్టి కట్టుకున్నవాణ్ణి కన్నబిడ్డల కాపాడినదే స్త్రీ, కన్నబిడ్డల సర్వసమర్థులగాచేసి కీర్తి గడించినదే తల్లి సతీపతులు ధర్మబద్ధులై నియమవ్రతులై స్నేహ భావముతో సాగించినదే సంసారము అన్నారు పెద్దలు వారి ననుసరించి చరించుటే మంచిదని నా భావం అన్నది శాంత.

శాంతా మీఇంటి ఆయన ప్రసాదు ఎక్కడ అన్నది రాగమ్మ హైదరాబాదు రేడియో స్టేషనుకు ఇద్దరూ పోయినారు. ఈనాడు మీ మనవడు కన్యకాధర్మము అనే వ్యాసములో కొన్ని పద్యములు ఆరుంకాలుగంటకు చెపుతాడు వినమన్నది శాంత.

అయితే చదువేమైన దన్నది రాగమ్మ.

బి. ఎ. అయినది ఇంకా చదువమన్నాము. వాడు చాలు నంటూఉన్నాడు.

అయితే గాయకుడు కవీ కూడానా.

ఔను పిన్నీ స్కూలునుంచీ ఇంటికి వచ్చినది మొదలుకొని రాత్రి పదకొండు గంటల పర్యంతము తెలుగు, సంస్కృతము వాళ్లనాన్న చెప్పేవారు. వాడుచేసే

సరస్వతీపూజ మితి మేర లేనిది వాడు మాటలు నేర్చుకొనేటప్పుడే వాళ్ల అప్పనేర్పు వజ్రకవచము. త్రిసంధ్యల సరస్వతీ ధ్యానము చేస్తేనే కాఫీ అర్చనచేస్తేనే అన్నము లేకుంటే లేదని గట్టి కట్టడి చేసేవారు బడికి పోయేటప్పుడు పలకా పుస్తకములు అక్కడపెట్టి నమస్కారముచేసి పోతాడు వచ్చినతోనే నమస్కారము చేస్తాడు. విద్యాభివృద్ధి అయ్యేకొద్దీ ధ్యానాభివృద్ధికి తగు శ్లోకములు, అష్టోత్తరాలు ఇస్తూ ఏడవ యేట ఉపనయన మయ్యేటప్పటికి శారదా మంత్రము ఉపదేశించి దానికితోడు సహస్రనామము చేయమని చెప్పినాడు ఈ నాటికి అదేరీతిగా చేయుచున్నాడు. ఆ మహాతల్లి వానిజ్ఞానేంద్రియములో నెలవేర్పరచు కున్నది. ఆ మహాతల్లికి వానికి భేదములేదు వానిని చూచువారు శారదాదేవి రా వీడు అంటారు. బాల్యములో పిల్లలకు తగురీతులనేర్పు ఉండవలె పిన్నీ చూడూ బాల్యములో తండ్రి నేర్పిననేర్పు వానికేర్పు ఎంతపని చేసినదో బుద్ధివచ్చి రాకమునుపే మానవ పద్ధతులన్నీ నేర్పవలె మానవత్వములో దైవత్వం అణువో పరమాణువో కలిస్తేనే మజా అన్నారు. పిల్లలందరికీ బాల్యములో సరస్వతీ ధ్యానము ముఖ్యావశ్యకము తలిదండ్రులు చేయక పోయినా విద్యాభ్యాసకుల నిర్బంధముతోనైనా చేయించవలె బ్రాహ్మీబ్రహ్మ వ్రతము సంవత్సరమున కొకతూరి వారిచే చేయించవలె అందుకే పదమూడు ఏండ్లకే గొప్ప గొప్ప కవులలో, గాయకులలో మంచిపేరు ఆర్జించినాడు. సంగీతముకూడా సూక్ష్మముగా వచ్చినది అంతా ఆ మహాతల్లి శారదాదేవిదయ ఈమె మాత్రము తెలుగు, సంస్కృతము, ఆంగ్లము కొంతవరకు చదువు కున్నది. వీణ చక్కగా వాయించ గలదు, పాడగలదు ఇంటిపనులన్నీ బాగాతెలుసు వీటికన్నిటికి మూలము దైవబలము ఇంతవరకు ఏకొదవా రానీయక కాపాడు చున్నాడు. దైవము ఇంక ఇరువురి వివాహములు శ్రీవారిపైనే ఆధారపడిఉన్నవి. వారిదయవారి ఇష్టము అన్నది శాంతమ్మ.

రాగమ్మ నవ్వుతూ శాంతా అభారము నాపైపెట్టి నీభారము వదలుకో తానమాడబోయిన తీర్థమెదురయ్యే నన్నట్లు నాకు మీరు దొరికినారు. నేను ఇప్పుడు రెండు సంవత్సరములుగా కన్యకకై వెతుకుతూ ఉన్నాను గాని మనసుకు నచ్చిన సంబంధము దొరుకలేదు. నాకు ఒకడే కుమారుడు లక్షరూపాయలకుపైన ఆస్తి ఉన్నది. పైగా కావలసినంతా తరిభూమి ఉన్నది ఇది చూచి ఇరవైవేలు ముప్పైవేలు వరదక్షిణ ఇస్తామని తిరిగి తిరిగీ వడిబడు తున్నారు. నాకు నచ్చలేదు అసలు వానికి నచ్చనే నచ్చదు. మంచి రూపము, మంచి వంశము, మాతృభాషా, రాజభాషా కొంతవరకు వచ్చివుండడము వంశములో సంపూర్ణాయుర్దాయము, రోగగ్రస్తులు

గాక సుజ్ఞానులయిన వంశముగా ఉండవలెనని మావానికోరిక మాకు డబ్బుతో పనిలేదు ఇక్కడ ఇటువంటి వారున్నారని కనకం ఒకనాడుకూడా నాతో అనలేదు ఇప్పుడు కనకం కుమారునకు ఇస్తూఉన్న అమ్మాయిని ఇరవైవేలు ఇచ్చి, ఇస్తామని రెండు ఏండ్లుగా చెప్పుతూ వచ్చినారు నాకు అక్కరలేదని వాడంటూ ఉన్నాడు మా సంబధము కుదరక ఇక్కడ పదివేలు యిచ్చి ఇస్తూ ఉన్నారు. మా వాడు బి. ఏ. ప్యాసయి ఒక సంవత్సరమైనది. సంగీతములో, సాహిత్యములో మంచిపేరు గడించినాడు వానికోరిక ఫలించు వరకు పడచువాడుకాడు చూస్తూచూస్తూ ఏ అప్రయోజకులలోనైనా దిగునో ఏమో ఏ అడవారైనా మోసముచేసి పిల్లవాని చెరుతురో ఏమో వానికోరిక ఫలించకపోయి అందరూ నగుదురో ఏమోనని భయముగా నుండెను. భగవంతునిపైన భారమువేసి అహర్నిశము దైవమునే దలచుకునేదానను ఈ పెండ్లికి నేను రాదలచు కొనలేదు. శాస్త్రిగారు నిర్బంధము చేసినారు కనకం నిష్టూరము చేసినది. అందువల్ల వచ్చినాను ఇప్పుడు చూడగా దైవమే నన్ను ఇక్కడికి తెచ్చినట్లున్నది మిమ్ముల నందరినీ వాడు రేపు చూచినాడంటే మీ ఇల్లు విడువడు మిమ్ముల వదలడు వాడు రెండేండ్లుగా తిరిగినందుకు భగవంతుడు మంచిదారి చూపినాడు అనుచుండగా,

కమలవచ్చి అమ్మా ఎడమకన్ను ఊరక అదురుచున్నదే ఎడమభుజము అదరుచున్నది. అప్పకూ అన్నకూ, అక్కడ ఏమైనదో అన్నది.

శాంత చిరునవ్వు నవ్వుతూ కమలా స్త్రీలకుఎడమకన్నూ, ఎడమభుజమేగాదు ఎడమభాగమున అవయవములు అదరిన శుభమనిచెప్పలేదా ఎడమభాగమున అదురుట శుభసూచకము తల్లీ మంచిసమయమునకే చెప్పితివి అవ్వ నీ విషయమే మాట్లాడుతున్నది. నీ శుభసూచన చూడగా నిశ్చయముగా నే ఉన్నట్లున్నది. అప్పకూ అన్నకూ భయములేదు చూచువారు కాచువారు వారి వెను వెంటనే ఉందురు. అన్నీ వారే చూచుకొనెదరు నీవూ నేనూ కాపాడలేమమ్మా వారి వారి సత్కర్మ కాపాడను దుష్కర్మ దుఃఖపెట్టను వెంటనే ఉండును. ప్రకృత సత్కర్మచేదోడై వాదోడై చేయూత నిచ్చుచుండును. పో దేవుని కార్యము చూడుము మధ్యాహ్నము కావచ్చినది వంట తయారైనది అన్నది శాంత.

ఆ మాట వింటూ కమల పోయెను. పెండ్లింటి వారందరూ పోయిరి రాగమ్మ శాంతను చూచి,

శాంతా మా వానిని చూచి అందరూ ఏమి పెండ్లి విషయము ఏమీ అనుకో లేదే అంటూ ఉంటారు వాడు ప్రతివానితో,

కం॥ నీరే ప్రాణాధారము
నోరే రసభరితమైన నుడువుల కెల్లన్
నారే రత్నము నరులకు
చీరే శృంగారమండ్రు సిద్ధము సుమతీ

అన్నారు అట్టి రత్నము దొరికినప్పుడు పెండ్లి.

కం॥ మనుజుడు నేర్పరియైతే
గౌనవలెరా మంచి ముద్దుగుమ్మను లేదా
ముని వృత్తినుండి మోక్షము
గనవలెరా కుందవరపు కవి చౌడప్పా॥

అని పెద్దవారన్నారు ఈరెండే మానవునికి ముఖ్యము అట్లుదొరకాల పెండ్లి జరగాల లేకుంటే వుండనే వున్నది జపమాల అంటూ నవ్వుతూ వుండేవాడు మన కమల అన్ని హంగులా మావానికోరిక ప్రకారం సర్వాంగ సౌష్ఠవములతో వున్నది. విద్యా, జ్ఞానము కావలసినంతా వున్నది. మాకష్టము తీరినదమ్మా అన్నది రాగమ్మ.

రేపు నీతమ్ముడు వస్తాడు ఏమైనాచెప్పు నీ ఇష్టమన్నది శాంత.

రాగమ్మ ఆశ్చర్యముతో ఏమే నాతో మాట్లాడుతూనే వంటఅంతా చేసితివే అన్నది.

ఏమున్నది పిన్నీ బీదవారి వంట పంచభక్ష్య పరమాన్నములైతేకదా ఆలశ్య మయ్యేది ఆయాకు, యీయాకు, అకాయ యీకాయ వుడుకబెట్టి తినేవారి వంటకం ఏమున్నదని నవ్వుతూ అమ్మా మీయంతవారితో సంబంధము చేయుటకు మాకుశక్తి వున్నదా నెయ్యము, వియ్యము, కయ్యము సరిసమానమే సౌఖ్యమన్నారు. శక్తికి మితిమీరినకార్యము చేటుదెచ్చునన్నట్లు వుండదా అయినా శ్రీవారిఇష్టము వారిపిల్లల వారే చూచుకుంటారు. ఇంతవరకూ పెరటిలోనున్న కల్పవృక్షములు పదహారు పిల్లవాని చదువు చెప్పించ ఆదరువుచూపినవి ఇంక అవే యీ అమ్మాయి పెండ్లి

చేయవలయును. ఇప్పటికి చిల్లిగవ్వకూడా డబ్బు చేతలేదు యీసారి కాపుఅందినప్పటికిగాని మా చేతగాదు.

తే॥ భువనమున పూర్వసంభృత పుణ్యరాశి
యగుచు నుదయంబు గాంచిన సుగుణనిధికి
వనము పురమగు బరులాత్మ జనములగుదు
రవనినిధి రత్నపరిపూర్ణయై ఫలించు॥

అన్నారు పూర్వజన్మ సుకృతానుసారముగా యీచెట్లు మాకు ప్రాణాధారములైనవి పిల్లలూ మేమూ యీచెట్లపై అధారపడి వున్నాము అన్నది శాంతమ్మ.

రాగమ్మ తలఊపుతూ, ధైర్యోత్సాహములు పెనగొనగా శాంతా ఆదుర్ద ఇంక మానుకో, మనకు కావలసినంతా భగవానుడు ఇచ్చినాడు ఇరువుర పెండ్లిండ్లు నాపైననే భారము ఉండనివ్వు.

కం॥ మానుష దేహము గలుగుట
భూనాయక దుర్లభంబు పుట్టినమీదః
దానము పరోపకారము
భూనుత కీర్తియునువలదె పురుషునకెందుః॥

అన్నారు ధనము ఉండి సక్రమ పద్ధతితో నడువనివారు జీవన్మృతులు, కీర్తి గౌరవ ప్రతిష్ఠలు భూతదయ పరోపకారము లేని ధనము వ్యర్థము.

కం॥ జననీ జనకుల వృద్ధుల
తనయుల గురు విప్రసాధు దారాదులనే
జనుడు ఘనుడయ్యు బ్రోవక
వనరును జీవన్మృతుండు వాడు ధరిత్రిః॥

మాతృ, పితృ, వయోవృద్ధ, గురుదేవ బ్రాహ్మణ దారాపుత్ర పుత్రికా బంధు మిత్ర సాధు సజ్జనులను ధనికుడై చక్కగా పోషించనివాడు జీవముండి చచ్చినవాడే నన్నారు. మాకు ధనమున్నది మీధనముతో పనిలేదు ఉన్నవారు లేనివారిని కాపాడుట, ఆశ్రయమిచ్చుట మానవధర్మము.

నదాన దోషేణ భవద్దరిద్రో దరిద్రదోషేణ కరోతిపాపం అన్నారు. ధన ముండి దానము పరోపకారము చేయని దోషమువల్ల దరిద్రత వస్తుందని దరిద్ర తతో పాపము చేరుతుందని అన్నారు. విన్నాము కన్నాము విని కని పొరబడుట ఎందుకు నీకూతురు నాకు కోడలై, నా కొడుకు నీకు అల్లుడైనప్పుడు మాధన మొకటి, మీధన మొకటీ ఉండదు. ఎక్కువ ఉన్నవారు కొరతపడిన వారికి సర్దుకొన జీవ న్యాయము ఉన్నది కదా అన్నది రాగమ్మ.

పిన్నీ దైవము మనుష్య రూపముగా సహాయ పడునను వాక్యము నిశ్చ యము భగవంతుడు మానవుని రక్షించు భారము వహించి నప్పుడు మానవునికి భారమైనదేదీ లేదను కుంటాను నిన్నుదైవమే ఇక్కడికి తెచ్చెనో ఏమో లేకున్న అంతమాట నీనోట వస్తుందా వేనవేలు వరదక్షణ తెమ్మను దినాలలో భారమంతా నాదేనని ధనమక్కర లేదని బీదలకు ఆశ్రయమిచ్చే ధర్మ హృదయులు గలుగ వలెనంటే సామాన్యమా జీవితాంతము వరకు మా కుటుంబము ఇది నిజమైతే బాకీ పడుతుంది పిన్నీ అన్నది శాంతమ్మ.

శాంతా అట్లేమీ ఉండదు ఇది మానవ ధర్మము పుట్టి నందుకు పెట్టినదే సాక్షి పెట్టినందుకు పుట్టినదే సాక్షి అన్నారు పెట్టి పుట్టినవారే శ్రీమంతులు పెట్టక పుట్టినవారే పుట్టు దరిద్రులు నీవు పెట్టి పుట్టినావు మానవ ధర్మమెరిగి ఆచరణా విధానము మరువక త్రిమూర్తుల త్రిదేవుల త్రిసంధ్యల అర్చిస్తూ, ఉన్నావు దైవ శక్తిని ఆర్జించి నప్పుడు ఏకొరత ఉండక వేళకు సర్వమూ సమకూర్చు భారము తానే వహించును భయము ఉండదన్నది రాగమ్మ.

ఇంతలో కమల పెండ్లివారిని సాగనంపి కాళ్లు కన్నులు చేతులు కడుగుకొని పోయి దేవుని దీపములు వెలిగించి పూల మాలలను త్రిమూర్తులకు త్రిదేవులకు వేసి కొన్ని పూలను కేశవ నామములతో పాదములపైన పెట్టి ఊదుకడ్డీలు ముట్టించి త్రిప్పి పెట్టి చేతులు జోడించుకొని,

ముందు బ్రహ్మను ధ్యానించి అటుపై,

శ్లో॥ శుక్లాం బ్రహ్మ విచారసార పరమా మాద్యాం జగద్వ్యాపినీం
వీణాపుస్తక ధారిణీమభయదాం జాడ్యాంధ కారాపహాం హసే

స్ఫాటికమాలికాం విదధతీం పద్మాసనే సంస్థితాం వందే తాం
పరమేశ్వరీం భగవతీం బుద్ధిప్రదాం శారదాం!
శ్లో॥ సరస్వతీ త్వియందృష్టా వీణా పుస్తక ధారిణీ హంస వాహన!
సమాయుక్తా విద్యా దాన కరీమమ!
ప్రథమా భారతీనామా ద్వితీయాచ సరస్వతీ తృతీయా శారదా
దేవి చతుర్థా హంస వాహినీ!
పంచమాజగతి ఖ్యాతా షష్ఠా వాగీశ్వరీతథా కౌమారీసప్త
మాప్రోక్తా అష్టమా బ్రహ్మచారిణీ!
నవమా బుద్ధిధాత్రీచ దశమా వరదాయినీ ఏకాదశా క్షుద్ర
ఘంటా ద్వాదశా భువనేశ్వరీ!
బ్రాహ్మీ ద్వాదశనామాని త్రిసంధ్యం యఃపఠేన్నరః సర్వసిద్ధి
కరీతస్య ప్రసన్నా పరమేశ్వరీ!
సామే వసతు జిహ్వాగ్రే బ్రహ్మరూపా సరస్వతీ!

సరస్వత్యష్టోత్తరస్తోత్రం చెప్పి
విష్ణు ధ్యానంచేసి లక్ష్మీ అష్టోత్తరము చెప్పి

శ్లో॥ నమస్తే సర్వదేవానాం వరదాసి హరిప్రియే యాగతిస్త్వత్ప్ర
పన్నానాం సామే భూయాత్త్వ దర్చనాత్!
విశ్వరూపస్య భార్యాసి పద్మే పద్మాలయేశుభే
మహాలక్ష్మీ నమస్తుభ్యం సుఖరాత్రిం కురుష్వమే!
వర్షాకాలే మహాఘోరే యన్మాయా దుష్కృతం కృతం సుఖ
రాత్రిః ప్రభాతేద్య తన్మేలక్ష్మీం వ్యపోహతు!
యారాత్రిః సర్వభూతానాం యాచదేవేష్వవస్థితా సంవత్సర
ప్రియా యాచసామ మాస్తు సుమంగళా!
మాతాత్వం సర్వభూతానాం దేవానాంసృష్టి సంభవా ఆఖ్యా
తా భూతలేదేవి సుఖరాత్రి నమోస్తుతే!
దామోదరి నమస్తేస్తు నమస్త్రైలోక్య మాతృకే
నమస్తేస్తు మహాలక్ష్మీ త్రాహిమాం పరమేశ్వరీ!
శంఖ చక్ర గదా హస్తే శుభ్రవర్ణే శుభాననే మమహ్యాష్టవరం

దేహి సర్వసిద్ధి ప్రదాయిని!
నమస్తేస్తు మహాలక్ష్మి మహాసౌఖ్య ప్రదాయిని సర్వదాదేహి
మే ద్రవ్యం దానాయ సుఖహేతవే!
ధనం ధాన్యం ధరాం హర్షం కీర్తి మాయుర్యశః శ్రియం తుర
గాన్ దంతినః పుత్రాన్ మహాలక్ష్మి ప్రయచ్ఛమే!
యన్మయా వాంఛితందేవి తత్సర్వం సఫలం కురు నబాధ్యతాం
కుకర్మాణి సంకటాన్మేని వారయ!
న్యూనం వాప్యతులం వాపి యన్మయా మోహితం కృతం
సర్వం తదస్తు సంపూర్ణం త్వత్ప్రసాదాన్మహేశ్వరి!

కవచం.

కవచం॥ శ్రీమహాలక్ష్మీః శిరః పాతు లలాటే మణిపంకజే
కరదేశేరమాపాతు నేత్రే రక్షే హరిప్రియా!
నాసికా మవతాదంబా వాచంవాగ్ రూపిణీసదా
దంతాన్నవతు జిహ్వాంచా అధరోష్ఠే హరిప్రియా!
చుబుకం వరదాపాతు గళం గంధర్వసేవితా
వక్షః కుక్షి కరం పాయుం పృష్ఠమ వ్యాద్రమాస్వయం!
కటిమూరు ద్వయం జానూజంఘే పాదద్వయం రమా
సర్వాంగ మింద్రియం ప్రాణం పాయా దాయా సహారిణీ!
సప్తధాతూన్ త్వచంవాపి రక్తశుక్ల మయాన్మమ
జ్ఞానవృద్ధి మనోత్సాహాన్ సర్వాన్మేపాతు పంకజా!
మమ ముక్తించ యుక్తించ సర్వాన్మేపాతు సేందిరా
మమాయు రవతాం లక్ష్మీం భార్యాం పుత్రాంశ్చ పుత్రికాః!
మిత్రాణిపాతు సతతమ ఖిలాంగం హరిప్రియా
పాతకం నాశయేల్లక్ష్మీః మమారిష్టం హరేద్రమా!
మమారి నాశనార్థాయ మహ్యాం దద్యాద్బలంమృధే
సర్వాభీష్టంచ మేదద్యాద్ పాతుమాం కమలాలయా!
యయిదం కవచం నిత్యం రమాయాః ప్రయతః పఠేత్
సర్వసిద్ధి మవాప్నోతి సర్వసౌభాగ్య దాయకః!

నిత్యకారుణ్యలలితాం కస్తూరీ లేపితాంబికాం!
సర్వమంత్రమయీంలక్ష్మీం స్తుతిశాస్త్రవిభూషితాం
సర్వరూపీం బ్రహ్మమయీం దేవీం లోకకుటుంబినీం!
దుష్టమృత్యూపశమనీం కష్టదారిద్ర్యనాశనీం
గ్రహపీడోపశమనీం దుర్గాంలక్ష్మీం నమామ్యహం!

అని నమస్కరించి వందేశంభు ముమాపతిం అని మహేశ్వర ధ్యానముచేసి.

శ్లో॥ ఉద్యద్భాను సహస్రకోటిసదృశాం కేయూర హారోజ్జ్వలాం
బింబోష్ఠీం స్మితదంత పంక్తిరుచిరాం పీతాంబరాలంకృతాం
విష్ణుబ్రహ్మసురేంద్ర సేవితపదాం తత్త్వస్వరూపాంశివాం
మీనాక్షీం ప్రణతోస్మి సంతతమహం కారుణ్యవారాం నిధిమ్॥
ముక్తాహారలసత్కిరీట రుచిరాం పూర్ణేందు వక్త్రప్రభాం
శింజన్నూపుర కింకిణీమణిధరాం పుష్పప్రభాభాసురాం
సర్వాభీష్టఫలప్రదాం గిరిసుతాం వాణీరమాసేవితాం॥ మీనాక్షీం॥
శ్రీవిద్యాం శివవామభాగనిలయాం హ్రీంకార మంత్రోజ్జ్వలాం
శ్రీచక్రాంకిత బిందుమధ్యవసతిం శ్రీమత్సభానాయికాం
శ్రీమత్షణ్ముఖ విఘ్నరాజజననీం శ్రీమజ్జగన్మోహినీం॥ మీ॥
శ్రీమత్సుందరనాయకీం భయహరాం జ్ఞానప్రదాం నిర్మలాం
శ్యామాంబాం కమలాసనార్చితపదాం నారాయణస్యానుజాం
వీణావేణుమృదంగ వాద్యరసికాం నానావిధాడంబికాం॥ మీ॥
నానాయోగి మునీంద్ర హృద్యవసతిం నానార్థ సిద్ధిప్రదాం
నానాపుష్పవిరాజితాంఘ్రియుగళాం నారాయణేనార్చితాం
నాదబ్రహ్మమయీం పరాత్పరతరాం నానార్థతత్త్వార్థికాం
మీనాక్షీం ప్రణతోస్మి సంతతమహం కారుణ్యవారాం నిధిమ్॥

కవచం॥ శృణుదేవి ప్రవక్ష్యామి కవచం సర్వసిద్ధిదం
పఠిత్వా పాఠయిత్వాచ నరోముచ్యేత సంకటాత్!
అజ్ఞాత్వా కవచందేవి దుర్గామంత్రం చయోజపేత్
సనాప్నోతి ఫలంతస్య పరం చనరకం వ్రజేత్!
ఉమాదేవీశిరః పాతు లలాటే శూలధారిణీ

చక్షుషీఖేచరీపాతు కర్ణౌ చత్వరవాసినీ!
సుగంధా నాసికేపాతు వదనం సర్వధారిణీ
జిహ్వాంచ చండికాదేవి గ్రీవాం సౌభద్రికాతథా!
అశోక వాసినీచేతోద్వౌ బాహూవజ్రధారిణీ
హృదయం లలితాదేవీ ఉదరం సింహవాహినీ!
కటింభగవతీదేవీ ద్వావూరూ వింధ్యవాసినీ
ఏవం స్థితాసిదేవీ త్వంత్రైలోక్యేరక్షణాత్మికా!
రక్షమాం సర్వగాత్రేషు దుర్గేదేవి నమోస్తుతే!!

త్రిదేవీ త్రిమూర్తులారా సర్వదామమ్ము అనుగ్రహింపుడు.

అని నమస్కరించి లేచి చెంపలు వేసుకొంటూ మూడు ప్రదక్షిణలుచేసి తిరిగి మోకరించి నమస్కరించెను.

శాంత తయారు చేసిన పదార్థముల కొంచెము కొంచెము ఒక గిన్నెలోవేసి నెయ్యి పాలు కొంచెమువేసి కలిపి పొయిలో నిప్పులను ముందుకు త్రోసికొని చేతులు జోడించి దేవా సర్వభక్షకా నీ అనుగ్రహము స్త్రీలకు ముఖ్యము వేగలేచి నది మొదలు నీచెంత నిలువవలయును. నీదయలేకున్న జీవితము క్షణభంగురము తండ్రి తప్పుల ఒప్పులుగా భావించి కాపాడుము.

తే॥ పక్వమైన పదార్థముల్ పరమభక్తి
ముందు నీకిచ్చి పిదప గోవిందుకిత్తు
ప్రీతిగైకొని రక్షింపు ప్రీతిహోత్ర
దేవకార్య ధురంధర దివ్యతేజా॥

అని నమస్కరించి అగ్నిలోవేసి తిరిగి నమస్కరించి పదార్థములు అన్ని ఎత్తుకొనిపోయి దేవుని ఎదుట పెట్టెను కమల తీర్థము పదార్థములపై ప్రోక్షించి (చల్లి) పురాణ దంపతులారా త్రైలోక్య పాలకులారా తెలియకచేసిన తప్పులను మన్నించి స్వీకరించుడు అని మోకరించి నమస్కరించి లేచి కర్పూరమువెలిగించి మంగళ శ్లోకముచెప్పుతూ హారతి ఇచ్చి క్రిందబెట్టి.

తే॥ మిమ్ము నెప్పుడు దలతుము మీరు కరుణ
మమ్ము మీవారలనుడెప్డు మరువబోక
ధర్మమతులార త్రైలోక్యధాములార
భువన రక్షకులారయో పుణ్యులార॥

అని నమస్కరించి లేచి అమ్మా అని పిలచెను శాంతవచ్చి నమస్కరించి పై పద్యము మనసులో చెప్పుకొని తిరిగి నమస్కరించి తీర్థము పుచ్చుకొను చుండగా.

అమ్మా పిల్లవాండ్రు పెద్దవారికి తీర్థము ఇవ్వరాదా అన్నది.

ఔను తల్లీ పెద్దవారిచే పిన్నవారు తీసుకొనుట మంచిది చిన్నవారిచే తీసుకున్న చిన్నవారికి మంచిదికాదు తీర్థము పుచ్చుకొను నప్పుడు తీర్థము ఇచ్చువారు శ్రీవారే నని తీర్థము శ్రీవారి పాదతీర్థమేనని భావించి భక్తులు నడుమువంచి వంగి చేతిపై పైటచెరుగు స్త్రీలు అంగవస్త్రము పురుషులు వేసుకొని వేసిన తీర్థము కన్నులకద్ది పుచ్చుకొని చేతిని గుడ్డకుఒత్తెదరు తీర్థపు చుక్కలు క్రింద పడరాదని భావము భక్తి శ్రద్ధలతోవంగి చేసాచి చిన్నవారికడ పెద్దవారుచేయుట చిన్నవారికి పావమని నాభావము తీర్థము ఇచ్చువారు వయసులో పెద్దవారయ్యే ఉండవలయును. లేదా అంతటిశక్తి సామర్థ్యములు వారియందు ఉండవలయును కానీ పట్టుమని కమలకు తీర్థముఇచ్చి పదార్థములు ఎత్తుకొని పోయెను.

కమల కొన్ని పదార్థములు ఎత్తుకొని శాంత వెంట వంటగదికి పోయెను.

ఈ కార్యక్రమము చూచి రాగమ్మ శాంతా ఈపద్ధతి చాలా బాగున్నదమ్మా మానవులకు ఉండవలసిన పద్ధతి ఇదే.

కం॥ వాదములు వేయునేటికి
వేదోక్త విధిఁజరించు విబుధుడు గృహమం
దాదరమున నారాయణ
పాదంబులు గొలిచి ముక్తిపథమునకేగుఁ!

అన్నారు పెద్దలు శాంతా! ఇదే భక్తిపంథా ఎక్కడ ఏవేళ ఏమి చేయవలయునో అవి చక్కగా చేయుచూ వచ్చిన అంతకన్నా ఫలమేమున్నది ఇదే గృహ

ధర్మము గృహిణి కుండవలసిన పద్ధతి ఇదే ఇట్టి పద్ధతి ననుసరించిన వారికి ఏ కొరంతలు ఉండవు యిహపరముల రెంటెకు భగవానుడుతోడై, నీడై, తనవాడై, రక్షింప గలడు. ఈ పద్ధతులన్నీ అడుగంటే కలికాలము ప్రారంభమైనది ప్రతి గృహమునా ఈకార్యాచరణ ప్రతి గృహిణీ ఆచరణలో ఉంచిన కవీ, కాలమూ విరుగుడై లోకము స్వర్గతుల్యము కాగలదు దైవమిచ్చిన పదార్థముల దైవవినియోగముచేసి భక్షించిన సకాల వర్షములు చాలి మిగులునన్ని పంటలు చక్కని సంతతి సకాల విహార వ్యవహారములు శతాయుర్దాయములు గలిగి సర్వ సౌభాగ్యములతో ప్రభువులకు ప్రజలకు అన్యోన్య మిత్రత్వమై భూమి కామధేనువు కల్పవృక్షము కాగలదు దైవసమర్పితమైన భుక్తశేష పదార్థములవల్ల తయారైన శుక్ల శోణితములు అమృత తుల్యములై అకాలసంతతి నివ్వక సకాలమునకు పౌరుషజ్ఞాన కీర్తులతో బ్రతుకు ధర్మసంతతి నిచ్చును సర్వసమృద్ధిగా పాడి పంటలతో సస్యశ్యామలమై భూమి కామధేను వగును అది అడుగంటుటతో టి కలిదేవుడు వెన్నంటి సప్తవ్యసనములకు లోనగు సంతతి గల్పించి భావోద్రేకముతో కామోద్రేకముతో భావ విభేదములతో మతోద్రేకములతో భాషావైషమ్యములతో అవివేకములు గల్పించుకొని వైరములు సృజించుకొని పాడు గండని రెండు హస్తములు పైకెత్తి దీవించునన్నారు ఇంటింట గృహిణి ఈధర్మముల అవలంభించిన పురుషులు జ్ఞానధనులై సమయస్ఫూర్తి జ్ఞానముగలిగి ధనమార్జించి కీర్తి గౌరవములతో శతాయుర్దాయము గలిగి జీవింతురు నీచులు, అంగహీనులు, అధర్మచిత్తులు అవినీతులు రోగగ్రస్తులు పుట్టరు. శాంతా నాకు అరవై ఏండ్లు వయసు ఉన్నది గాని నేను తిరిగి చూచిన చోట్లలో ఎక్కడా ఈ పద్ధతిలేదు వారికి శక్తి లేదు మైథుననిద్రాహారములనమ్మి పశుప్రాయులై బ్రతుకడమేగాని ఈవిధ మవలంభించి యిహపరములలో సుఖపడు వారులేరు.

కం॥ దమమును శౌచము తపమును
శమమును మార్దవము కృపయు సత్యజ్ఞాన
క్షమలును హరిభక్తియు హ
ర్షము నిజలక్షణము లగ్రజాతికి నధిపా!

అన్నారు పెద్దలు ఈలక్షణములన్నీ మానవులకుండ వలసినవి ఇవి అందరికీ అలవడిననాడే అందరూ సుఖింప గల్గుగుట అన్నది రాగమ్మ.

ఔను పిన్ని తలిదండ్రులు బండెడంత ఆశతో కనిపెంచి తిని తినక ఆర్జించి వృద్ధాప్యమున సర్వస్వమూ చేతిలో పెట్టితే వాళ్ల కన్నులకు కంపకొట్టి నోటికి దుమ్ముకొట్టి అనుభవించుతూ ఇది ధర్మమా నాయనా అంటే కావలసినదవుతుందనే సంతతిని తలిదండ్రులు దూషింపక పోతారా అదేవిధిగా దైవము సర్వస్వము సృజించి చేతికిచ్చి నాకుపెట్టి మీరూ తినమన్న పదార్థముల సర్వమూ వారికి చూపకనే తినిన వారూరకుందురా కడుపుకాలదా దూషించరా వారి దూషణ ఊరకపోతుందా అతివృష్టి అనావృష్టుల గలిగిస్తుంది అప్రయోజకుల అనామికుల విప్లవకారుల పుట్టిస్తుంది భావవిభేదాల సృజిస్తుంది రోగగ్రస్తుల కోపగ్రస్తుల నేరగ్రస్తుల ప్రబలిస్తుంది బద్ధద్వేషులజేస్తుంది పరస్పర విభేదములతో పాడుచేయిస్తుంది ఊరకపోదు మాతృ పితృ వయోవృద్ధగురు దేవబ్రాహ్మణ గోసాధు సజ్జన స్త్రీ బాల దూషణలు పోవు తప్పక ఫలిస్తాయి ఇక హత్యలన్నలో ఉండనే ఉన్నవి.

కం॥ దేవతలకు నగ్రపుసం
భావన నుపహారమిచ్చి పదపడి గుడువం
గావలయు నట్లుసేయని
ధీవిరహితు డసురయగుట తెల్లంబధిపా!

అన్నారు అసురులై ఒకరి ఉసురు ఒకరు పోసుకుంటూ అసూయా పరగ్రస్తులై పాడుగాగలరు ఇవి ఎరింగి వారి పదార్థముల వారికి ముందు అర్పించి తాను తిని ఆ రక్తబిందువులతో సాలూ మూలా ఎరింగి సంతతిని కని పెంచవలయు చూడు శివాజీని తల్లి జీజీబాయి ఉగ్గుపాలతో ధర్మమూ దయ దాక్షిణ్యము సత్యము శౌచమూ శీలము దైవము అనే బలౌషధముల నూరి కలిపి నోట ముక్కుల వచ్చు పర్యంతము పోసి మ్రింగ కుండిన ముక్కు బిగబట్టి చెంపలుకొట్టి భయపెట్టి పోసి పెంచి తయారుచేసి వేషభాషల లోపించకుండు నట్లోనర్చి ఆశీర్వదించినది పేరుగడించినది అట్లే తల్లి తనయుని పెంచి ప్రభువుల కర్పించిన ప్రభుభక్తి పరాయణులై రాజ్యము రామరాజ్యముగా చేయగలరు చిరకీర్తి నార్జింపగలరు ప్రజాసంస్థలకిచ్చిన లోకమాన్యులై వన్నెగడింతురు ప్రజలలో సుప్రసిద్ధనాయకులై చచ్చి బ్రతికినవారిలో చేరుదురు సిగ్గుచేటుగా అవినీతులగని పెంచిన అటు ప్రభువులకు ఇటు ప్రజలకు కంటక ప్రాయులై కన్నవారికి పుణ్యఫలమునకు మారు పాప ఫల మిత్తురు ఇంతకూ తల్లి తయారు చేయుటలో ఉన్నదీ అన్నది శాంత

రాగమ్మ ఆశ్చర్య మభినయిస్తూ శాంతా ఇది నిశ్చయము తలిదండ్రులు జ్ఞాన వంతులై ధర్మము ననుసరించి అభివృద్ధికి తెస్తేనే పిల్లలు కామోద్రేకులై కని పారవేస్తే వారిగతేమి కావలయును కని పెంచలేని పాపము రాదా అట్టివారు పిల్లలు కలుగని తెరువాలో చించుపేశ్రేయము భ్రూణ హత్యలు చేయుట మహాపాప ము ఈ పాపము మరుజన్మలో గర్భసమయముల శిశువు వెలువడక గంటలూ రోజులు గడచి కడకు ప్రాణహానిని గల్పించు నందురు కని సాకలేక సంతతిని కడ గండ్ల పాలు చేసినవారికి మరు జన్మకు అరువను పిల్లలే లేకుందు రందురు ఈ కామమువల్ల గలుగు కష్టములు ఇన్నీ అన్నీ అని చెప్పనలవిగాదు ఆకలి రుచి ఎరు గదు నిద్ర చోటెరుగదు కామము కష్టమెరుగదంటారు కామము కష్టములకు మూలమని కారడవులకు పోయిననూ ఆకలి దప్పుల నణచిననూ కాయకసురుల సేవించిననూ పట్టి బాధింపక విడువదు అన్నది రాగమ్మ.

ఈ మాటలవింటూ చిరునవ్వు నవ్వుతూ శాంత రాగమ్మను చూచి పిన్నీ మధ్యాహ్నమయినది లే కాళ్లు చేతులు కడుక్కొందువు భోంచేసి మాట్లాడవచ్చును లే అన్నది.

సరేనని రాగమ్మ కాళ్లు కడుక్కొన బచ్చలికి పోయెను.

శాంత విస్తళ్లను నీళ్లు చల్లి తుడుచు చుండెను.

బ్రాహ్మ బ్రహ్మార్పణమస్తు.





# మాతృ జ్యోతి.

## —: మధ్యాహ్నము. :—

విస్తళ్లకు చోట్లు పరిశుభ్రముచేసి రెండు విస్తళ్లను వేసినది శాంత.

రాగమ్మ పాద ప్రక్షాళనము చేసుకొని వచ్చి కూర్చొనెను శాంత ముందుగా ఉసిరిక ఊరగాయ వడ్డించి పిన్నీ ఇది ఉసిరిక ఊరగాయ దీన్ని వైద్యులు ఎక్కువగా వర్ణిస్తారు ఆమలకము అమృత తుల్యమంటారు పైత్యహరము జ్ఞానవృద్ధి జీర్ణకారి రసమూ రక్తమూ వీర్యమూ శుభ్రము చేసి మంచి బలము నిచ్చునంటారు ఇది గజనిమ్మ ఊరగాయ ఇది పైత్యహర మంటారు రక్తశుద్ధిచేసి పేగుల తిత్తిని శుభ్రపరచుటలో మంచి దంటారు ఇది మామిడి దీనిని మేము అంతగా వాడుకోము నూగులనూనె ఆవపిండీ వేయవలసి వచ్చును దీనితో ఉష్ణాధిక్యమై దేహమునకు తప్పక అనారోగ్యము గలిగించు నందురు ఇది చింతకాయ మామిడి కాయకు తమ్ముడు ఇది నిర్వీర్యులగా తయారు చేయును శాస్త్రానికని ఎవరైనా అడుగు తారని కొంచెముగా పెట్టినాను ఇది అల్లము పచ్చడి ఇది ఆహార కోశమునకు చాలా మంచిది జీర్ణకారి అజీర్ణరోగులకు ముఖ్యము ఇది వంకాయ బెండకాయ పొడికూరలు ఇవి వీర్య వృద్ధిని చేయును బలము నిచ్చును ఇవి నిత్యమూ తిన్ననూ మంచిదే నంటారు టానిక్కులు లేహ్యాలు తినుటకన్నా వీటినే తినిన వాడెకన్నా బలమునిచ్చు నంటారు ఈ రెండెనూ ఎన్ని రూపములుగా మార్చిననూ రుచికరములుగానే ఉండును ఇది మెంతి ఆకు పప్పు ఇది చలువచేయును రుచిగలిగించును వీర్య వృద్ధి చేయును ప్రతి ఇంటా పెంచవలసిన ఓషధి ఎక్కువగా వాడుట క్షేమము చలువ నిచ్చును అంటూ కూరలూ ఊరగాయలు వడ్డించి అన్నము పెట్టి నెయ్యివేసి ఇంక భోంచేయి పిన్నీ అన్నది శాంత.

రాగమ్మ భోంచేస్తూ శాంతా నీకు శాంతపేరు చెల్లునే ఎన్ని పదార్థములు చేసి నావే ఔను.

కం॥ క్షమ గలిగిన సిరిగలుగును
క్షమ గలిగిన వాణిగలుగు సారవస్త్రభయుక్తా
క్షమ గలుగ దోన గలుగును
క్షమ గలిగిన మెచ్చుశౌరి సదయుడు తండ్రీ!

అన్నారు ఓర్పు ఎంత పనినైనా సాధిస్తుంది. ఇవి అన్నీ మన దొడ్డిలో పండిన వేకదా అన్నది రాగమ్మ.

ఔనమ్మా ఇంటికి దండిగా దొడ్డి ఇల్లాలికి దండిగా ఓర్పు ఉంటే ఈలాటి పదార్థముల దండిగా పండించుకొని దేవునికి పెట్టి మనము తిని ఇతరులకు దానము చేయవచ్చును చెమటోడ్చి కష్టించి పండించిన పదార్థములపై ప్రీతి ఎక్కువగా నుండును దైవనివేదన దానము చేయుటచే పుణ్యము కలుగును దేహపరిశ్రమ వల్ల ఆరోగ్యమూ లాభమూ ఉండును వీటిని చూచిన ఇంటి యజమానికి సంతోషమూ ఉండును యజమాని ముందుకు త్రోవమార్గము చూపిన వారమూ అవుదుము పెరటిలోకి పోయిన సంతోషమూగాను ఉండును ఇంటి వారు వీధికి పోక పనిలేనప్పుడు ఆపని చూచు చుండెదరు షికారని వాకింగ్ అని అప్రయోజకముగా కాలము వ్యర్థ పుచ్చరు మావారు చెట్లకు నీళ్లు పోస్తూనే పిల్లలకు చదువు చెప్పినారు పని చేస్తూనే సహస్రనామ పారాయణములు చేసినారు పిల్లలకు నేర్పినారు నిద్రపట్టకపోతే రాత్రి వేళకూడా అక్కడే ఉంటారు ఆచెట్లే మాకు ప్రాణాధారము వాటివల్లనే మేము ముందుకు రాగలిగినాము అని చెప్పుచుండగా శాంతమ్మ.

రాగమ్మ చారువరకూ వచ్చినది అది చూచి శాంతమ్మ టోమేటోపండ్ల చారు వేసినది.

కలుపుతూ రాగమ్మ శాంతా అమృత మున్నట్లున్నవే పదార్థములు అన్నది.

అమ్మా పదార్థములు అమృతముగా తయారు చేసినది నేనుకాదు యజ్ఞేశ్వరుడు ఆయనకుచేసిన పదార్థముల ముందుగా ఎవ్వరు అర్పించు చుందురో వారిబుద్ధియందు

తానేనిల్చి ఆ యా పదార్థములకు ఏమేమి ఎం తెం త కావలయునో అంత వేయించును అమ్మతోప మానముగా పదార్థముల తయారు చేయించును కాటుపోవుట పొంగిపోవుట చెడిపోవుట బుద్ధి పొరపాటుతో ఒకసారి వేయవలసినది రెండు సార్లుగావేసి పదార్థము చెడగొట్టుట వేసినాసని వేయకపోయి రుచి చెడిపోవుట కొంత ఉడికి కొంత ఉడకక పోవుట గుడ్డలు కాలుట చీర లంటుకొని చచ్చుట అంటించుకొను బుద్ధి పుట్టుట చేతులు కాలుట కుండలు పచ్చి పోవుట పగిలి కాళ్ల మీదపడి బొబ్బలు పోవుట ఒత్తిగిలపడి క్రింద పోవుట కడకు ఇంటి వారితో చీవాట్లు పెట్టించి కంట తడిపెట్టించుట ఈలాటి బాధల తనకు పెట్టనివారికి నీవ మైనవి తనలో వేయు వారికి కల్పించునట నేను మాఅమ్మతో ఉన్న దాదిగా వారికి సమర్పించుచునే ఉన్నాను ఆ అగ్నిదేవుడు నాకు ఏలాటి బాధగానీ ఇంతవరకూ కల్పించలేదు పిన్ని చేసిన పదార్థముల వారికి అర్పించు చుండిన దినదిన క్రమేణ లేని వారికి కూడా పదార్థముల అభివృద్ధి నిచ్చునట రుచిని గల్పించునట దరిద్రతను నశింపు చేయునట యజ్ఞేశ్వరునికి అర్పించు వారికి భగవంతునికి నివేదన చేయు వారికి ఆహారమునకు ఏనాటికి తక్కువ రాదని మా అమ్మ చెప్పినది పదార్థములు సంపాదించుకొను శక్తిలేక ఒకటుండి ఒకటి లేక తనకు భక్తితో సమర్పించు వారిని ఆశీర్వదించి శక్తిపరులచేసి పదార్థలోపముల తీర్చి బాగు పరచునట.

కం॥ దళమైన పుష్పమైనను
ఫలమైనను సలిలమైన బాయనిభక్తిన్
గొలిచిన జనులర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేనుపభుజింతున్

అన్నాడట భగవానుడు లేనివారు లేనట్టే అర్పించి ఓపయామయ్య మాకు నీకిచ్చు శక్తిలేదు శక్తి ఉన్నది మరువక ఇస్తూ ఉన్నాము దయతో స్వీకరించు తండ్రీ ఇహ పరములకు నీవేమాకు తోడు అని అర్పించు ఇల్లాలి ఇల్లు బంగారమగు తుంది అన్నది మా అమ్మ ఈ ఇంటికి నేనువచ్చు నాటికి ఆహారపుకొరత ఉండినది. అది మాయమ్మతో చెప్పి చింతించితిని అమాట విని మా అమ్మ శాంతా నీవు శ్రద్ధా భక్తితో ఎంగిలీ మంగలం లేకుండా శుభ్రముగా ఉన్నంతలో తయారుచేసిన పదార్థ ములు యజ్ఞేశ్వరునికీ భగవంతునికీ సమర్పించు చుండిన ఏకొర్తంతా నీకు లేదు రాదు. పోవమ్మా ఇచ్చెడివానిని మరచి బీదలు ఇచ్చిన వానిని మరచి ధనికులు

దెబ్బ తింటూ ఉన్నారు వారిననుసరించక ఉన్నదానిని మరువక ఇచ్చుట నేర్చుకున్న లేవన్నదానిని ఇచ్చుట శ్రీవారి వంతుగా నుండును అభారము వారిపై పెట్టుము మేతవేసిన *ఆవు పాలు పిండును మేతవేయని అవు కాలతన్నును ఇది చూచినవేగా ముందు నేను ఈ ఇంటికి వచ్చినప్పుడు ఇక్కడా అట్లేఉండినది. ఆ సర్వకామదుని వల్లనే తీరి అన్ని కార్యములు అయినవి తల్లీ భయపడక భగవంతుని అనుగ్రహముపొందు నీకు అన్నియెడలా అన్నికడలా తోడునీడై కాపాడును అన్నది. అమ్మమాటను మరువక ఆదేవిధముగా చేయుచూ వచ్చినాను మాకొరతలు దినదినమునకూ తీరుతూ వచ్చినవి.

కం॥ అతిథి జనంబులభక్తి౽
సతతము పూజించి యుచితసత్కారములు
న్నతి నడుపు సజ్జనులు శా
శ్వతకీర్తులు ధరణిబడయ జాలుదురనఘా॥

అన్నారు అతిథులకు పెట్టిన పుణ్యమూ కీర్తి ఉన్నప్పుడు భగవంతునకు యజ్ఞేశ్వరునకు పెట్టిన ఎట్లు లేకుండును. భగవంతుడే అతిథియైతే బలము కొరతా అన్నారు. పెద్దలు భగవంతుని నమ్ముకొని భారము అయనపైన వేసి నడచితే సర్వమూ చేకూరును అంటూ రాగమ్మకు అన్నము వడ్డించి మీగడతోటి పెరుగును దండిగా వేసెను.

రాగమ్మ భోంచేయుచూ శాంతా ఇది అవు పెరుగు కదా అన్నది.

ఔనమ్మా త్రిదేవులవలె మూడు ఆవులు ఉన్నవి ఆ కామధేనువులవల్ల మా కడుపు చల్లనగు చున్నది. నేను ఈ ఇంటికి వచ్చునప్పుడు మా నాన్న ఒక చూటి ఆవును ఇచ్చినాడు వచ్చిన నాలుగు అయిదు మాసములకు ఒక పెయ్యదూడను ఈనినది కావలసినంతా మేతా తవుడు కడుగునీళ్లు ప్రీతిగా పెట్టి నిత్యమూ కాళ్లకు పసపు పూసి కుంకుమపెట్టి కామధేనువుగా భావించి ప్రదక్షిణ నమస్కారములుచేసి పాలు పిండుకునేదాన్ని దండిగా పాలుఇచ్చేది దూడను దొడ్డిలో విడచితేబాగా ఆడుకుంటూ ఉండేది ఆవును కాపరికి తోలియిచ్చువేళ తల్లీ గోమాతా తిరిగి చక్కగా ఇంటికిరా మందను విడిచి పోయితివా మరుగు పడియెదవు మరుగు పడితివా తిరిగి రాలేవు

జాగ్రత్తగా రా తల్లీ అంటూ దేవుని దగ్గరకుపోయి గోవిందా నీ గోవును విడచు చున్నాను. నీ ఇష్టము గోవూ మేము నీ పరిపాలనలోని వారమే కాపాడుట నీవంతే యశోద నీకు రక్ష కట్టినది నేను నీకు చెప్పి గోవుకు రక్ష కట్టుతున్నాను యశోద కట్టిన రక్ష నిన్నెట్లు కాపాడినదో నీరక్ష గోవునట్లు కాపాడవలయు తండ్రీయని ఒక త్రాటిని మెడకు కట్టేదానిని తిరిగి యింటికి వచ్చినతోడనే త్రాటిని విడచి ఎత్తిపెట్టే దాన్ని ఇట్ల ఒక ఆరునెలలు జరిగినది ఒకరోజు మూడు గంటలనుండీ గాలీ వానా అసాధ్యముగా ప్రారంభించినది ఆ వాయువేగము చెప్పనలవిగాదు ఎక్కడ చూచినా వెల్లువలై నీరు పారుచూ చెట్లు, కొమ్మలు, విరిగిపడుచు ఇండ్లూ గోడలు కూలిపోవుచు మేఘార్భటులతో మెరుపులతో రివ్వుమని వీచు ఝంఝూమారుతముతో భయంకరమై గుండెలవియు నట్లుండెను మీతమ్ముడు బయట పల్లెకు పోయివుండెను. నేను ఒక్క దానినే ఈకొంచెము ఇంటిలో వాకిండ్లు మూసుకొని భయపడుతూ ఉన్నాను రాను రాను గాలి ఎక్కువాయను మేఘ గర్జారవములు అంతకంతకూ మిక్కుటమాయను అంధకార బంధురమౌనట్లు మేఘము లలము కొనియెను అవుగానీ మీ తమ్ముడుగానీ రాలేదు ఇట్లే చింతిస్తూ ఉంతగా అస్తమానమై మనిషి మనిషికగుపడని స్థితి ఏర్ప డెను దూడ అమ్మా అని అరువసాగెను నాకుమరింత భయమాయను సహాయము ఎవ్వ రూలేరు ఏమీ తోచలేదు దుఃఖము మాత్రము వద్దన్ననూ వచ్చుచుండెను దూడను పట్టుకొనిపోయి దేవుని దగ్గర నిలచి స్వామీ త్రిలోక పాలకా మా యిరువురకూ దిక్కెవ్వరు ఇప్పుడు పాలకొరకైదూడ అరచు చున్నది.

పలుకు తోడులేక నాకు భీతిగానున్నది ప్రకృతి క్షణ క్షణమునకు భయంకర ముగా మారుచున్నది. మా వారు ఏమి బాధపడు చున్నారో వారు వచ్చుచుండి నడి దారిలోచిక్కి ఏమయిరో నాకు ఇక్కడ తోడులేరని ఎంత పరితపించు చున్నారో గోమాత దారితప్పి వేగదూడకై వెతలు పడుచూ దారిగానక ఎంత దుఃఖించు చున్నదో ఇప్పుడు ఈ ఆపత్కాలములో నీవు తప్ప మాకెవ్వరూ దిక్కులేరు తండ్రీ అని వెక్కి వెక్కి ఏడ్వసాగితిని అరచి అరచి దూడ అక్కడనే పండుకొనెను. నేను కూర్చొని తండ్రీ దయామయా నిన్ను నమ్ముకొన్నవారికి దిక్కునీవగుదందురే నాకు తోడు గల్పింపవా ఈ రాత్రి గడచి నేను బయట పడుటెట్లు పాలు త్రాగు దూడ ప్రాణము రక్షింపవా తల్లీ సర్వమంగళా నా హృదయావేదన నీవెరింగీ ఇట్లేల ఊరకుండెదవు మీరు రక్షింపరాని పరమ పాపినా ఎనుబది నాల్గు లక్షల జీవ రక్షకులకు మమ్ము

కాపాడుట ఒక భారమా ఈ కటిక రాత్రిలో ఒంటి జీవినై దిక్కులేక దుఃఖింపు చుండ కంట చూతురా అంటూ ఏడ్చుచూ క్రిందపడి కన్ను అంటించినాను అప్పటిలో ఎవరో ఒక అడ మనిషి వచ్చి వాకిలి తట్టి నన్ను పిలిచి నట్లైనది లేచి చూచితిని అక్కడ ఎవరూలేరు జోరుమని గాలి వాన శబ్దము వినబడుచున్నది. ఎవరూలేరే అనుకొను నంతలో అమ్మా అని తలవాకిలిదగ్గర పిలుపు వినబడెను అప్పుడు తటా లున వాకిలి దగ్గరకుబోయి ఎవరు మీరు అన్నాను.

ఆవ్యక్తి వణుకుచూ అమ్మా నేను ఒక అనాథను గాలి వానలో తడిసి చలికి ప్రాణము పోవుచున్నది. తలదాచుకొన చోటిచ్చి ప్రాణరక్షణ చేయి తల్లీ నిన్నా భగవంతుడు కాపాడుతాడు అన్నది.

ఆ వణుకుతో మాట్లాడు మాటలు విన్నతోడనే ఎవరో ఏమోనను భయము విడచి తలుపు తీసినాను అడమనిషి నడు ప్రాయముగలది పూర్తి వణుకు చున్నది కృంగి పోయినది చూచిన తోడనే జాలిగలిగి లోపలికి రమ్మన్నాను ఆమె వచ్చెను ఆమె వెంటనే నిండు పూలుతోనున్న కుక్క ఒకటి ఇంటిలోపలికి దూరెను అదిలించి తిని అది పోలేదు ఒక మూలకు పోయి తోక ఆడించుచూ నిలుచుకొనెను ఆ వచ్చిన అయమ నన్నుచూచి అమ్మా ఉండనీ పాపము నేనీ వానలో దొరికి నప్పటినుండీ నావెంటనే ఉన్నది నేను ఎక్కడికి పోయినా అక్కడంతా వచ్చుచున్నది. వాన పోయిన దనుకా ఉండనీ తల్లీ అన్నది అదివిని నేను నాకు తోడులేరని భగవంతుడు ఈమెనూ ఈ కుక్కను పంపినట్లున్నది ఉండ నిమ్మని తలంచుకొని ఒక పాత చీర తెచ్చి అమెకు కట్టుకోమని ఇచ్చి బొగ్గుల కుంపటి వెలిగించి ఆమె దగ్గర పెట్టితిని ఆమె ఇదిచూచి నీ ఇల్లు బంకారుగానూ ఆశ్రయమిచ్చి రెండు ప్రాణుల కాపాడినా వమ్మా భగవంతుడు నిన్ను నీకుటుంబమును సర్వదా కాపాడుతాడు దిక్కులేని ప్రాణులకు ఆశ్రయ మిచ్చునదే జీవధర్మము పరోపకారము చేసినదే దేహము అతిథులకు ఆతిథ్యమిచ్చి తిన్నదే అన్నము వారి పాదస్పర్శన అయినదే గృహము అన్నారు నీవు ఈనాడు నాకాశ్రయమిచ్చినది. నాజీవితములో మరువలేను ఏమీ మేలు చేయలేను నీవూ నీభర్త సంతతీ కలకల లాడుతూ చిరకాలము బ్రతుకుమని దీవించగలను ఇంతే నామేలు తల్లీ అంటూ కాచుకొంటూ ఉండెను శునకము ఒక మూల పండుకొనెను గంట చూడగా అప్పటికి పది అయి ఉండెను కొంతభయము

తీరెను గాని అవు రాలేదు మా వారూ రాలేదు నేను ఆమెను చూచి అమ్మా మీది ఏవూరు ఇక్కడికి ఏమిపనిగా వచ్చిఉండినావు అన్నాను. ఆమె కొంచెము నెమ్మది చెందినది గాబట్టి జాలిగా ఇట్లనెను అమ్మా నా కథ అంతా చెప్పిన పెద్దరామాయణము కాగలదు నాకు ఎవ్వరూ నాయను వారులేరు లేక ఏకార్యమూ చేయుటకు దేహమనారోగ్యమై భిక్షచేసుకుంటూ కొన్ని తీర్థయాత్రలు తిరిగితిని అనేకమయిన విపత్తులకు లోనైతిని సుఖములేదు ఈ రోజు ఉదయము ఆ నదీతీరములో స్నానము చేయు చుండగా నా పాత గుడ్డల మూటెను ఏమోఉన్నదని అపహరించినారు సరే ఇక్కడికీ నాకర్మము పోలేదని తలంచి సాయం సమయమునకు ఇక్కడికి చేరులో వల ఈ గాలీ వానా చిక్కించు కున్నది. ఎటు పోవుటకు తోచలేదు తెలియలేదు నాలుగైదు చోట్లకు పోయినవారు ఉండనివ్వక పోయినారు చావిడో సత్రమో ఉండు నని వస్తూ ఉండగా ఎక్కడా తటస్థ పడలేదు ఇండ్లకు ఎక్కడి వారక్కడ తలుపులు మూసినారు అప్పటిలో ఎవ్వరో ఒకాయన ఎదురై మీ ఇల్లు చూపి అక్కడ పిలువమన్నాడు పిలిచి చూతమని పిలిచినాను మీరు వచ్చి వాకిలి తీసి నాప్రాణము రక్షించినారు నేనేగాక నిండు చూలుతోనున్న ఆ కుక్కకూడా బ్రతికినది భగవంతుడు నీలాంటివారికి ఐశ్వర్యమివ్వక నీచులకూ లోభులకూ డాంభికులకూ భూతదయా రహితులకూ కార్పణ్యులకూ పాపులకు ఇచ్చి ఉంటాడు వారిలీలవారికే ఎరుక నీకడుపు చల్లగానూ నూరేండ్లు బ్రతుకు తల్లీ అన్నదామె అదివిని నేను అన్నాను.

కం॥ మానుషదేహము గలుగుట
భూనాయక దుర్లభంబు పుట్టినమీదన్
దానము పరోపకారము
భూనుతకీర్తియునువలదె పురుషునకెందున్॥

అన్నారు పరోపకారముచేయని మనుష్యులు ఉండీ చచ్చినవారే యగుదురు వారు జీవచ్ఛవములు వారికి ముందున్నది ముసళ్ల పండుగ ఇల్లూ వాకిలీ భూమీ బుట్రా ధనమూ ధాన్యమూ లేక కూటికీ గుడ్డకూ మొగమువాచిన తలిదండ్రులకు పుట్టి నాలుగుచెరుగులు ముడివేసిన జోలెతో ఇంటింటి కడపలు ఎక్కుచూ దిగుచూ చీవాట్లుతిను నప్పుడు గ్రహించు కొనగలరు అప్పుడూ అని అనిపించు కుంటారు దానితో పశు పక్ష్యాదులలో పుట్టుదారి తీస్తారు వారిని తలంచుటతోటి వారిని తాకుటతోటి మనకు కూడా పాపము వచ్చును వారికి భూతదయా పశ్చాత్తాపములుండిన

ఈలోకము ఇంద్రలోకము ఎందుకుకాదు వెఱ్ఱితల్లీ వారికి ఎంత కలిగిననూ ఇంకా చేకూర్చవలయుననే ఆశ వారిని విడువదు కోటీశ్వరుని ఇంటిప్రక్కననే కూటికి లేని వాడుండ చూచుచునే ఊరకుండునుగాని ఉపకృతి పరమాణువు కూడా చేయజాలడు అది గ్రహించి ఈ జన్మలో ఒరులకు ఉపకారము చేసినవారే అష్టైశ్వర్యములతో సుఖపడుతూ యజ్ఞయాగాది క్రతువులు ధర్మసంస్థాపనలుచేయు పుణ్యాత్ములు ప్రకృతిలో మానవులకు సహాయము చేయగల యంత్రసాధనల కనిపెట్టి ఇచ్చుమహనీయులు రాజులూ గొప్ప గొప్ప ఉద్యోగులూ ధనికులూ అయి పేరు ప్రఖ్యాతి నార్జించి సుఖపడు చున్నారు అందరూ ఉపకార హీనులే అయిన ప్రపంచము చాలా వెనుక పడును అందరూ ఉపకారమే చేయువారైన ఈ లోకము ఇంద్ర లోకమే యగును ఉపకారము ముందుకు నెట్టును ఉపకారహీనత వెనుకకు నెట్టును పరోపకారమువల్ల పుణ్యమూ పుణ్యమువల్ల సుఖమూనని తెలియుటే గొప్పతనము అమ్మా నీకు ఎవరూ లేరను చున్నావు నాదగ్గరనే ఉండు నీకు అన్నమూ గుడ్డకహా కావలసినది అవి కొరత లేకుండా ఏలాటి కష్టములేకుండా కాపాడెదను ఉండు మా ఇంట్లో నాకు తోడు ఎవరూలేరు మాకు ఒక ఆవు ఉన్నది దానిని చూపెట్టుకొని వుంటే చాలునమ్మా ఈనాడు ఆవు రాలేదు దూడకు పాలులేదు పాపము దూడపై ప్రేమతో ఎక్కడ ఆవు అల్లాడు చున్నదో ఏమో అమ్మ రాకపోయెననీ దూడఅరచి అరచి పండు కొన్నది. నోరులేనిది నా హృదయము దీనిని చూచి కరిగి నీరైపోవు చున్నది ఏమి చేయుటకూ శక్తిలేదు మా వారు కూడా ఇంత వరకూ రాలేదు ఎక్కడున్నారో ఏమయినారో ఈ గాలీ వానా ఇంకా నిలువ కున్నది అని దీనతగా అన్నాను అదివిని ఆమె.

అమ్మా అయ్యగారు మగవారు వారికేమీ భయము ఉండదు ఇక ఆవు అన్ననో ఎక్కడో తలదాచుకొని ఉండును తెల్లవారి చూతము నీయట్టి ఇల్లాలి వస్తువులను కాచి రక్షింప భగవంతుడు కంకణము కట్టుకొని ఉన్నాడు తల్లీ భయము లేదు అన్నము తిన్నావోలేదో తినుపో నేను ఉన్నాను ఇక్కడ అన్నది.

నేను భోంచేయుటకు బుద్ధిపుట్టలేదు ఎంత నిబ్బరము తెచ్చుకుంద మన్నను మనసుకు ఆవూ వారూ జ్ఞాపకమునకు రాక మానరు వచ్చినంతనే దుఃఖము రాక మానదు ఇట్టిస్థితిలో అమ్మా నాకు అన్నము తినఇచ్ఛగలుగునా అన్నాను.

ఆమె నవ్వుతూ అమ్మా పారబ్ధమునకు అందరూ తలవంచ వలసినదే.

కం॥ కర్మమున బుట్టుజంతువు
కర్మమునను వృద్ధి బొందు కర్మమున చెడుఁ
కర్మమెజనులకు దేవత
కర్మమె సుఖదుఃఖములకు కారణమధిపా॥

అన్నారు కర్మమనగా సత్కర్మ దుష్కర్మ రెండున్నవి గదా దుష్కర్మ ఎదురైనప్పుడు ఎక్కడ పోయినను ఇంట ఉండినను కష్టములు తప్పించు కొనలేము సత్కర్మ తటస్థ పడినప్పుడు విపత్తులో ఇప్పుడు నాకు నీవు ఆశ్రయ మిచ్చినట్లుండును ఆ కుక్కకు కూడా సత్కర్మ తటస్థ పడికదా నావెంట రావడము నీవు రానివ్వడము జరిగెను లేకున్న నాగతేమి జరుగును. దానిగతేమగును అట్లే అయ్యగారికి కూడా సత్కర్మ తోడ్పడ ఉండును వారికి భయమణు మాత్రముకూడా ఉండదు పోయి భోంచేయి తల్లీ.

శ్లో॥ వనే రణే శత్రు జలాగ్ని మధ్యే మహార్ణవే పర్వత మస్తకేవా
సుప్తం ప్రమత్తం విషమస్థితంవా రక్షంతి పుణ్యాని పురాకృతాని॥

అన్నారు మానవుడు విపత్కాలముల ఎదిరించి రక్షించు కొనవలయునన్న సాధ్యముకాదు పూర్వపుణ్య సుకృతఫలము ఎదిరించి రక్షింప వలయును లేదా ప్రకృతము చేయుచున్న సుకృతమైనా తోడ్పడవలయు మానవుడు విపత్తును ఎదిరించ సాధ్యమా కాదు మాయకు చిక్కి భ్రాంతిచెంది మోహమునకులోనై దుఃఖింతుమేగాని ఏమీ చేయలేము పో తల్లీ అన్నిటకూ భగవాను డున్నాడు అన్నది.

అయ్యో ఇప్పటికీ ఆవు రాకపోయె దేవునికి దినమూ అర్పించు పాలు ఈ నాడు లేకపోయె కొంచెము చక్కెర నైనా నివేదన చేస్తామని లోపలికి వచ్చి కాళ్లు కడుగుకొని చెక్కెర తీసుకొని పోయి దేవుని పీఠముపై పెట్టి దేవా జగన్నాయకా అన్నాను వాకిట దగ్గర ఆవు అమ్మా అన్నది. అది విన్నతోడనే లాందరు తీసుకొని పోయి వాకిలితీసి చూతుగదా ఆవుల కాపరి నిల్చుకొని ఉన్నాడు ఆవు వాకిలి దగ్గర ఉన్నది లోపల వచ్చెను ఏమప్పా ఇంతవరకు ఆవు ఎక్కడ ఉన్నది అన్నాను

ఆవు మీదేకదమ్మా అన్నాడు ఔనప్పా అన్నాను కాపరి వెంటనే వెళ్లిపోయినాడు ఆవుకు గుడ్డతో వళ్లుతుడుచ పోయినాను వెంటనే ఆమెవచ్చి అమ్మానేను తుడుస్తాను గుడ్డ నాచేతికి ఇమ్మని బలాత్కరించి తీసుకొని వళ్లు అంతా తుడిచినది లేగదూడ అరువసాగెను దూడను పాలు త్రాగ విడచి గిన్నెతీసుకొని వచ్చి పిండుకొన నిలచి తిని అది ఆమెచూచి అమ్మా నాకు పాలు పిండుకొను అభ్యాసమున్నది నేను పిండి ఇస్తాను తెమ్మని నేను పిండమనినవి పిండిఇచ్చెను అవితీసుకొని కాచ ప్రారంభించి తిని ఆమె ఆవుకు మేతవేసెను పాలుకాచి దేవుని దగ్గరవుంచి కొంచెము చక్కెర పెట్టి సర్వేశ్వరా దయామయా మీ అనుగ్రహముతో ఆవువచ్చి చేరెను పాలు పితికి కాచి తెచ్చితిని పరిగ్రహింపుడు తండ్రీ మీరు గ్రహించి విడిచిన భుక్తశేషమును గ్రహించు మీ సేవకుడు ఇంకనూ రాలేదే.

నేనెట్లు భోంచేతును నామనస్సెట్లు కుదురుపడును మాతా పతి విపత్తులో తగుల్కొనెనని తెలిసినప్పుడు పతి దూరమైనప్పుడు పతినిరాదరణ చేసినప్పుడు వ్యాధిగ్రస్తుడైనప్పుడు కోపగ్రస్తుడైనప్పుడు స్త్రీహృదయము ఎట్లుండునది నీకు తెలియదా తల్లి కనికరము కలుగదా కన్న బిడ్డనుకాదా లేగమూడ మనస్సు కుదురు పరచిన మీకు నేను భారమైతినా అని దుఃఖముతో నమస్కరించి లేచునప్పటికి వాకిలి తట్టినారు ఎవరప్పా అన్నది ఆమె నేనే వాకిలి తీ అన్నారు వెంటనే పరుగెత్తుకొని పోయి తలుపు తెరచినాను మీతమ్ముడు అప్పుడు నాకు సంతోషము ఇంతని చెప్పనలవిగాదు వారికి కట్టుకొనుటకు తుడుచు కొనుటకు పంచలు తెచ్చిఇచ్చి దేవుని దగ్గరకు పోయి స్వామీ మీసేవకుడు వచ్చినాడు మీమేలు మరువలేను తండ్రీ నాదేహమున్నంతవరకు సోమరినిగాక దేహము దాచుకొనక మీసేవ ముప్పొద్దులా చేసెదను తలి దండ్రులు మీరేనని సర్వదా భావింతును అని నమస్కరించు లోపల ఆనంద బాష్పములు అయి దారు చుక్కలు భూమిపై బడినవి వెంటనేపోయి కుంపటితెచ్చి కాచుకొమ్మని మీతమ్ముని ఎదుటపెట్టి కాచుకోండి నేను అన్నం వడ్డించెదను అని పోయి విస్తరివేసి అన్నము వడ్డించితిని వారుదేవుని దగ్గరకు పోయి నమస్కరించి పాలు దేవునికి సమర్పించినావా అన్నారు. ఔను ఇప్పుడే సమర్పించినాను అంతలో మీరు వచ్చినారు. దిక్కులేనివారికి దిక్కు భగవంతుడు అన్నమాట నిశ్చయము అన్నాను ఏమి ఏమిజరిగినదీ అంటూ వారు భోంచేయ ప్రారంభించినారు జరిగినకథ అంతా చెప్పుచూ కొంచెము బియ్యము కడిగికుంపటిలో

పెట్టిలాను వారు భోంచేసి లేచు వేళకు అన్నము అయినది నేను భోంచేసి ఆమెను కాళ్లుకడుగు కొమ్మన్నాను అమ్మా నీవు భోంచేసి మిగిలినది ఈ కుక్కకు కొంచెము వేయితల్లీ మాట్లాడ నోరులేనిది పూర్వజన్మ కర్మజీవి నింపుహూలుతో నున్నది నాకులేకున్ననూ పరవాలేదు ఎక్కడనుండీ వచ్చినదో నీవు ఆశ్రయ మిచ్చినావు తలదాచుకున్నది. ఈరెండు ప్రాణుల కర్మవాతబడకుండా కాపాడి నావు అన్నది నేను విడకుండా అన్నము తిరిగీ చేసినాను ఇద్దరికీ కాగలదు లెమ్మ న్నాను మీ తమ్ముడుకూడా పోవమ్మా భోంచేయి పో అన్నాడు ఆమెలేచి కాళ్లుకడుగు కొని వచ్చినది అన్నం వడ్డించినాను ఆమె భోంచేస్తూ.

కం॥ పెట్టిన దినముల లోపల
నట్టడవులకైనవచ్చు నానార్థములు౽
పెట్టని దినముల కనకపు
గట్టెక్కిననేమిలేదు గదరాసుమతీ॥

అన్నారు ఇది వాస్తవమైన మాట తల్లీ చావనున్న నాకు దలదాచుకొనచోటు ఉదయ మాదిగా అన్నములేక అటమట పడుతున్న కడుపుకు అన్నం తడిసి గడగడ వడకుతున్న దేహమునకు పొడిగుడ్డఇచ్చి రక్షించినావు నీమేలు ఈజన్మలో మరు వను నీరుణము తీర్చుకొనలేను. ఈ కష్టములో ఈనాడు సహకరించిన మీకు నేచేయునది ఏమీలేదు ఆయురారోగ్య భాగ్యములతో సుపుత్ర పుత్రికల గని మాలాటి పాపజీవులకు ప్రాపైఉంండ ఆశీర్వదించగలను తల్లీ అంతకు మినహా ఏమీచేయ జాలని దీనురాలను. అంటూ భోంచేసినది మిగిలిన అన్నము కుక్కకు వేసినాను అది తిని మావారి చెంతకుపోయి తోకత్రిప్పుతూ నిలుచుకున్నది మావారికి జంతువుల పెంచుటనిన బహుప్రీతి వారుదానిని నిమురుతూ ఎక్కడిదిది చాలబాగున్నది దీనికి అన్నము చక్కగా వేస్తూఉండు ఈనిన పిల్లలు చాలాబాగా ఉండును. పెంచు కుందాము అంటూ నా కొరకై పంపిన మనిషిఏడీ రాలేదే మీయమ్మగారి ఊరినుంచీ అతను ఎప్పుడు వచ్చినాడు అన్నారు.

ఆమాట విన్నతోడనే నాకు వింతై మీరనునది ఏమిటిదీ అన్నాను వారు నాతట్టు చూస్తూ లాందరుఇచ్చి నీవు మనిషినిపంపలేదా అన్నారు లేదే అన్నాను అయితే అతను ఎవరూ నేనుపల్లెలో కూర్చుని వచ్చుటకు వీలులేక ఉండుటకు

ప్రాణము కుదుట పడక సర్వేశ్వరా గాలీ వానా ఎక్కువాయను ఉరుములూ, మెరుపులూ, భయంకరముగా నున్నవి. అంధకార బంధురమై ప్రకృతి అయోమయముగా నున్నది నీవుదక్క నాభార్యకు వేరు దిక్కులేరని చింతించుచున్న సమయమునకు వాకిటదగ్గర అయ్యా అన్నాడు ఎవరునీవు అన్నాను నన్ను అమ్మయ్యా పంపినది. నాది మీ అత్తగారి ఊరు నాపేరు వాసుదాసు మనము పోవువరకు ఆమెకు తోడు మావారిని ఉంచినాను వాన అనక లే పోదము అమె అన్నము ఇంకా తినలేదు రండీ తొందరగా అన్నాడు అక్కడున్నవారు వానవెలుచునట్లులేదు. పొమ్మన్నారు నేనులేచి వాకిలి తీసిచూడ లాందరు చేతబట్టుకొని మొబ్బుకన్నా నలుపుగల దీర్ఘ కాయుడు నిలచుకొనిఉండెను నన్నుచూచి ముందుదారిపట్టెను ఆయన నడువను నేను గునకపరుగు పరుగెత్తను ఇంతలో వాన కొంచెమట్లు తగ్గెను గాలి కొంచెము సంది చ్చెను ఒకరితో ఒకరము ఏమీ మాట్లాడలేదు ఒకముక్కాలు గంటలోపల వచ్చినాము ఇంటి దగ్గరకువచ్చి కొంచెము అక్కడపని ఉన్నది వస్తాను మీరు పదండి అని నన్ను వాకిలిముందు విడచి తిరిగివచ్చిన దారినే పోయినారు మలవిసర్జనకేమో పోతూవున్నాడని అనుకొన్నాను. ఇంతవరకూ ఆయనమాటే మరచినాను అన్నారు అప్పుడునాకు ఆశ్చర్యమై నాకుతెలియదండీ ఇదివింతగా నున్నది భగవానుడే అయి వుండవచ్చును లేకున్న ఈ అర్ధరాత్రిలో మీ దగ్గరకు వచ్చువారెవరు నేను తోడు లేక భయపడి దేవుని దగ్గర ఏడ్చినప్పుడు ఈమె వాకిలిదగ్గర అమ్మాఅన్నది వాకిలి తీసినాను ఈమెవచ్చినది ఈమెతో ఆ కుక్కవచ్చినది ఈమె తోడైనప్పటినుండీ కొంతదిగులు తగ్గినది దూడకొరకై ఆవుకొరకై వున్నదిగులు ఆవువచ్చినతోనే పోయినది పాలుదేవునికి అరగింపుచేసి నమస్కరించు నప్పటికి మీరువచ్చినారు మీరు ఇంటినుండీ పోయినది మొదలుకొని ఇంతవరకూ ఎవరినీ నేను చూడలేదు ఎవరూ రాలేదు ఇదిదైవ చిద్విలాసముతప్ప వేరొందులేదు అన్నాను వారు ఆలోచించుచూ ఔను భగవంతుని నమ్మినవారికి భయము ఉండదని పెద్దలు చెప్పినది వాస్తవము.

ఆ॥ నాకుమేలుగోర నాభక్తులకెకాని
భక్తజనులకేన పరమగతియు
భక్తుడెందు జనిన పరతెంతు వెనువెంట
గోవు వెంటతగులు కోడెభంగి॥

ఆ॥ తనువు విడచితనదు తనయులచుట్టాల
అలి విడచిసంప దాలివిడచి
నన్నెకాని అన్యమెన్నడు నెరుగని
వారి విడువనెట్టి వారినైన॥

అన్నాడు భగవానుడు మరెవ్వరున్నారు మనలాటి దీనులకాపాడ వారేదిక్కు అనుచుండగా వారు ఆమె వారిని చూచి.

నాయనా ఆ దయామయుని లీలలు విచిత్రములు భక్తులకొరకై ఎట్టి ఇక్కట్టు లైననూ పడగలరు వారిలీలలు నాకెంతో అనుభవము ఎన్నోసార్లు మనుష్యాకార మున మేలుచేసి ఇక్కట్టులనుండీ రక్షించి మాయమైనాడు తెలుసు కొనలేదు జరిగి పోయిన తదుపరి తెలుసుకొని దుఃఖించినాను అన్నది ఆమె ఆమెను మావారుచూచి.

ఇంటి దగ్గర మావారిని మీవారికి తోడుగాపెట్టి వచ్చినానన్నారే వారి వారేనా మీరు అన్నారు మావారు.

ఔను నాయనా వారి వారిలోచేర్చి చూడకపోయిన ఇప్పటికెన్నడో యమా లయమునకు అతిథిగా పోవలశినదానను కాశీలో ఒకప్పుడు సూర్యగ్రహణమురోజు స్నానము చేయుచుండగా మొసలి కాలుబట్టి ఈడ్చుట అందరూ చూచినారు కాలుబట్టి ఈడ్చుట తెలుసుగాని అటుపై నాకేమితెలియదు తెలివివచ్చి చూచునప్పటికి వేనవేలు మనుష్యులు నాచుట్టూ ఉన్నారు. అదిచూచి ఏల నాచుట్టూ మీరున్నారు నేనెట్లుఇక్క డికి వచ్చినాను అన్నాను వారు నాకు నమస్కారముచేస్తూ అవ్వా నీవు పుణ్యాత్మ రాలవు మొసలినిన్ను ఈడ్చుకున్న తోడనే ఒకాయన ఎగిరినీటిలో మునిగి క్షణములో విడిపించుకొని నిన్నుచంకన ఇరికించుకొని ఈమహాప్రవాహము ఈదితెచ్చిగట్టున పరుండబెట్టినాడు వారిని చూచిన మానవుడుగా తోచలేదు దీర్ఘదేహముతో ఉక్కు మనిషివలె ఉన్నాడు ఈమెను కొంచెము రక్షణచేయండీ అని విశ్వేశ్వర అలయము ప్రక్కపోయినాడు నీవు పరమపావనివి భక్తురాలవు నీపాదములంటిన మాపాప పంకిలముపోయి పావనమౌతామని దిక్కుతెలియకుండా నాచుట్టూచుట్టి పాదముల మీదపడువారు పాదములంటి కన్నులనద్దుకొనువారు డబ్బుతోచినంతా అక్కడ బెట్టి నమస్కరించువారు చెప్పనలవిగాక రెండు మూడు గంటలకాలము నడచినది ఈ వార్త ఊరంతాబ్రాకి తండోప తండములై లక్షలాదిజనము నాచుట్టూ మూగినది.

నేను వారిబాధకు తాళుకొనలేక లేచిచేతులు జోడించుకొని విశ్వేశ్వరా దయామయా పోయినదానిని పోనివ్వక ఇంకాకష్టములు పడుమని కాచిరక్షించితివా నీసాన్నిధ్యమున ఈపరమపావని గంగలో నేనుదేహము విడచుటకర్హురాలను కాదని తలంచితివా నేనుఇంకా కష్టములుపడుచుండ చూడవలయునని కోరికఉన్నదా నేనుపోవుట నీకుఇష్టములేదా నాకష్టము లింకాగట్టెక్కలేదా కాలము ఇంకామిగిలినదా నాకన్నీటితో నీపాదములింకా తడువలేదా చేసినకర్మము ఇంకాతీరిపోలేదా విశ్వమయా నీయాజ్ఞలేక యమాలయములకు అతిథిగానన్ను వారు పిల్చినారేమోకదా ఔను నీయాజ్ఞలేనిది చీమకూడా చావదనుమాట వాస్తవము వారేపొరబడినారు అంట్టూ వెఱ్ఱిమొఱ్ఱిగా మాట్లాడుచూ పోవనెంచి కాలుముందుకు సాచితిని అక్కడ ఉన్న వారందరూ అవ్వా డబ్బులు అంటూతెచ్చి నాచేతిలోపెట్టిరి డబ్బుచాల పోగయినది అది తీసుకొని విశ్వేశ్వరుని గుడికిపోయి వారికర్పించి ప్రదక్షిణనమస్కారములుచేసి వెలుపలికివచ్చి కూర్చుంటిని వేనవేలు ప్రజలు మాత్రమునన్ను విడువలేదు. అటుపై రెండు మాసములు ఉంటిని సకల సౌకర్యములు ప్రజలు కల్పించు చుండిరి తదుపరి ఒకనాటిరాత్రి ఉమామహేశ్వరులు స్వప్నములో సాక్షాత్కరించి నీసేవ మాకు చాలు ఇంకనీవు ఇక్కడనుంచీ జగన్నాథమునకు వేకువ ఝాముననే లేచిపో నీకు తోడుదీడ గల్పించినామని అంతర్ధానమైనారు లేచిచూడ ప్రక్కన ఇరువురు దంపతులు మూటెముల్లెకట్టుకొని పోతూ అవ్వావస్తావా అన్నారు ఎక్కడికి నాయనా అన్నాను జగన్నాథమునకని వారన్నారు స్వప్నమునాకు జ్ఞాపకము వచ్చినది. తోడు కల్పించినా మన్నారుగా ఇదేతోడు అయి ఉండవచ్చునని ఎంచి లేచి వస్తాను నాయనా అని గుడ్డలమూటెను సంకనపెట్టుకొని సత్రమునుండి వెలుపలికివచ్చి విశ్వేశ్వరుని గోపురముచూచి మాతా పితరులారా మీయాజ్ఞ ప్రకారము వెళ్లుతున్నాను ఈ దీనురాలిని ఒక కంటచూచు చుండుడని మొకరించి నమస్కరించి రెండు చుక్కలకన్నీటిని విడచి తప్పులక్షమింపుడని చెంపలువేసుకొని గంగను తలంచి పావనీమాతా ప్రభువు ఆజ్ఞఅయినది పోవుచున్నాను. దయదలంచుమని నమస్కరించి ప్రమథగణ నాయకులారా క్షేత్రపాలకులారా భక్తులారా తలిదండ్రుల ఆజ్ఞ అయినది. వస్తాను నాయనలారా అని వారికి నమస్కరించి ఆదంపతుల వెంటవెళ్లినాను వారే భోజనపానాదుల విచారిస్తూ ఒక నెలలోపల దారిన వింతా విశేషముల తీర్థముల చూపిస్తూజగన్నాథ పట్టణ సమీప

మునకు తీసుకవెళ్ళినారు అక్కడ ఒకాయన ఎదురై ఈ దంపతులచూచి నవ్వుతూ క్షేమమా అన్నాడు క్షేమమేనని ఒకరిని ఒకరుచూచి నవ్వుకొని ఈమెకు వసతులు కొంచెముచూచి పెట్టండీ మాకుకొంచెము పని ఉన్నది. తిరిగీవచ్చి కలుసుకుంటాము అని ఆయనకుచెప్పి అవ్వా ఏమిభయములేదు వీరివెంటనో సర్వవిధముల సహాయము చేస్తారు వీరికి తెలియనివారు తెలియని చోటూలేదు. సాయంత్రము నిన్నుకలుసుకుంటాము అన్నారు. వారికి నేనునమస్కరించి నాయనా సర్వవిధాల సహాయమిచ్చి ఇంతవరకూ నన్నుచేర్చినారు ప్రత్యుపకారము ఏమీచేయలేని దీనురాలను ఇదేనేను చేయునది. అని తిరిగీ నమస్కరించినాను ఆ దంపతులు ఇరువురు నన్నుచూచి నవ్వుతూ మాపని ఇదే అవ్వా దిక్కులేనివారికి సహాయపడుతూ ఉంటాము నమ్మి మావెంటవచ్చు వారిని తప్పక గమ్యస్థానము చేర్చుతాము అన్నివిధాలా సహాయపడుతాము ఇదుగో ఈయనా అట్టివాడే మామనిషికే తెలుస్తుంది అని వెళ్లినారు ఆయననన్ను పిలుచుకొనిపోయి ఒక సత్రములో ఒకాయనకు వప్పచెప్పి వెళ్లుతూ అవ్వా ఈమె నీకు సహాయమై అన్నీచూపించి భోజన పానాదులు విచారించగలదు. నేను అప్పుడప్పుడూవచ్చి విచారించుకొంటూ ఉంటానని ధైర్యము చెప్పిపోయినాడు ఆమెనన్ను వెంటబెట్టుకొనిపోయి స్నానమూ దేవునిదర్శనము చేయించి సత్రముచేర్చి ఆహారము తెచ్చిఇచ్చినది. ఆరాత్రినాకు తోడుగా పండుకున్నది ఆరాత్రి స్వప్నములో నావెంట వచ్చినవారు గన్పడీ అవ్వా మావంతు అయిపోయినది ఇక జగన్నాథుని వంతు ఉన్నది. నీకన్నివిధములా సహాయము ఇస్తాడు నిర్భయచేతస్కవై సుఖముగానుండుమన్నారు నేను నమస్కరించినాను వెంటనేవారు ఉమామహేశ్వరులై అశీర్వాదిస్తూ భయపడకుము నీవెంటనే ఉన్నాడు నిన్నుగాచువాడంటూ అంతర్థానమైనారు. ఆ సమయానికి నాకుతోడుగా పండుకున్నామె అవ్వా లే స్నానానికి పోదామన్నది. ఇట్లే సర్వతీర్థయాత్రలు దైవసహాయముతో చేసితినిగాని వారునావెంత ఉన్నంతవరకు మానవులని వారు పోయినవెనుక దైవమని దుఃఖించుచునే వచ్చినాను ఇప్పుడు వానలోతడుస్తూ చలికి ప్రాణము పోతూఉండ ఒకాయన ఎదురై ఈ ఇంటివారిని పిలిచి లోపలికి పోవమ్మా రానిస్తారు అనివెళ్ళిపోయినారు. నేనువాకిలి దగ్గరకు వచ్చివాకిలితట్టి అమ్మా అన్నాను. ఈ మహాతల్లి వచ్చి వాకిలి తీసినది వారి వారి ఇంటికే వారి వారిని చేర్చినాడు ఇదివారిలీల నాయనా మానవులము మనము తెలుసుకొనలేము అన్నది ఆమె.

నాకు ఆశ్చర్యమై ఆవునుతోలి తెచ్చినది ఆ దయామయుడే అయి ఉండవల యును లేకున్న ఆవులకాపరి యేమి ఈ కటికచీకటిలో వానలో వెతకి తోలుకొని రావడమేమి అన్నాను.

అందుకు సందేహము ఉండదు వారే ఈపని చేసిఉందురు.

కం॥ ఇందుగల డందులేడని
సందేహమువలదుచక్రి సర్వోపగతుం
డెందెందు వెతకిచూచిన
నందందేగలడు దానవాగ్రణిపించే॥

అన్నాడు పరిపూర్ణుడు ఆప్తే అంతటావాత్మై అందరి కష్టసుఖముల నెరింగి తన్ను నమ్మినవారి కష్టముల గాదురుకుంటూ తోడునీడై సర్వకాల సర్వావస్థల వెన్నంటే ఉండునన్నమాట వాస్తవము చూడు ఈనాడు మననిమిత్తమై ప్రకృతి ఈతిబాధల కోర్చి ఎంత నాటకమాడినాడో నమ్మినవారి కేనాటికీ కొదువరాదు భయములేదు.

క॥ నీదిక్కుగాని వారిక
నేదిక్కునులేదు వెతకనిహపరములందున్
మోదింప దలచువారికి
నీదిక్కేదిక్కునమ్మ నీరజనాభా॥

అన్నారు ఎవరుదిక్కుగా నుండినను ఆపత్కాలములలో రక్షింపజాలరు భగవంతుడే దిక్కుగానుండ కంటిని రెప్పగాచిన రీతి కాపాడగలడు వారిని దిక్కుగా చూచినవారే బలవంతులు పుణ్యమూర్తులు అన్నారు మావారు.

హృదయము కరిగి కంటనీరు పెట్టుచూ సర్వేశ్వరా నా కొరకై ఎంతటి కష్టపాటు పడినావు తండ్రీ దిక్కులేక భయపడి నీతో చెప్పుకున్నాను గాని వానలో తడుచుతూపోయి మావారిని పిలుచుకొని రమ్మనలేదే ఆవును తోలుకొని రమ్మనలేదే ఎంతపనిచేసితివి ఆపద్బాంధవా మానవులు చేయుపనినీవు చేసితివా మా కొరకై మానవుడవైతివా ప్రకృతి ఈతిబాధలకు లోనైతివా ఔను ఇనుముతో అగ్నికి సమ్మెటపోట్లు నిన్ను నమ్మినవారివల్ల నీకు అగచాట్లు బలుపాట్లు

ప్రభూ తప్పును మన్నించుమని అనుకొంటూ ఉండగా ఎడమకన్ను అదరెను ఎడమభుజము పదేపదే అదరెను మావారినిచూచి ఎడమకన్నూ ఎడమ భుజమూ అదురుచున్నదండీ అన్నాను.

స్త్రీలకు ఎడమ భాగములో ఏ అవయవములు అదిరిననూ శుభమే ఇంత కన్నా శుభము కావలెనా శుభవార్తనిచూపు పదిలముగా మనకైనున్నదని భద్రి పడినది. రుజువైనది ఇక అనుమానములేదు ఎందునా మనకు భయములేదు పో పడకవేయి ఆమెకు పరుచుకొననూ కప్పుకొననూ ఇప్పు ఒంటిగంట అయినది అన్నారు.

ఆమెకు పరుచుకొన కప్పుకొన ఇచ్చి చోటు చూపి మాకు పడక వేసుకొన పోయి నాను ఆమె పండుకొనచోటు చూచుచుండగా మావారు ఆమెను చూచి.

అమ్మా దక్షిణము తలబెట్టి పండుకో దానధర్మము చేయకున్నా దక్షిణము తలబెట్టి పండవున్నారు అన్నారు మావారు.

అది ఆమెవిని చిరునవ్వు నవ్వుతూ నాయనా పలువురు పలువిధముల చెప్పు తారు ఎవరిమాటని వినవలయును ఉత్తరమునకు కాళ్లు సాచరాదు కాటికి కాళ్లు సాచినట్లగును. ఉత్తరానికి తలపెట్టమంటారు ఒకరు ఉత్తరానికి తలబెట్టిపండె సైంధవుడు చచ్చినది నీవూ అట్లే చస్తావు వద్దు అంటారు మరొకరు తూర్పుభూమి తగ్గు పరమట ఎత్తు గాలీ నీరూ ప్రవహించేది. పరమటనుంచీ తూర్పుకేకదా పర మట తలబెట్టి పండమంటారు ఇంకొకరు పరమట తలబెట్టితే సూర్యుడు ఉదయించు తట్టు కాళ్లు కాగలవు వద్దుఅంటారు మరీ ఒకరు గాలిననుసరించి పండుకొనుట మంచి దంటారు వైద్యులు గాలికి ఎదురుగా తల ఉంచి పండుకున్నట్లైన పునికకు గాలిఎక్కువ తగిలి దానితో మెదడు ఉడుకై తెల్లవారి పునిక నొచ్చుటా తలబరువగుట పడిశేము పట్టుటా, ఉష్ణాధిక్యమగుటా, కన్నులు కలకరేగుటా, మనోవికాసము తగ్గుట, దేహమూ మనస్సు మజ్జుగా నుండుట, సంభవించు నంటారు. గాలికి ఎదురు కాళ్లు ఉంచి పండిన ముక్కులా, నోట వచ్చుశ్వాసకు గాలి ఎదురగుటచే గాలి తిత్తు లకు శ్రమ ఎక్కువగుననియు నోరు ముక్కులు ఆరిపోవుననియు కప్పుకున్న

కట్టుకున్న గుడ్డలు వైతొలగుననియు ఊపిరి చక్కగా లఘువుగారాక నిద్రగాఢముగా పట్టదనియూ సక్రమముగా నిద్రరానందున స్వప్నములు ఎక్కువగా వచ్చుననియు గాలికి అడ్డము పండుకొన్నచో దేహమంతటాగాలి తగిలి ఆరోగ్యముగా నుండును గాలిననుసరించి పండమంటారు వైద్యులు అన్నిటికూ గాలి ననుసరించుట ఒకటి అష్టదిక్కులలో పరమట ఉన్నతము గాబట్టి పరమట తలబెట్టి పండుకొని సూర్యోదయము గాకమునుపే లేచుట రెండు ఇవి ముఖ్యములని నాభావము భావ విభేదములతోటే ఇన్ని భాషలు ఇన్ని మతములు ఇన్ని కులములు ఇన్ని ఆచారములు ఇన్ని వ్యవహారములు ఇన్ని ధర్మములు ఇన్నికట్లు ఇన్నిజుట్లు ఇన్ని బొట్లు అయినది. భావ విభేదము లేనివాడు భగవంతుడు ఒక్కడే నాయనా అంటూ పరమట తలఉంచి పండుకొనెను ఆమె ఆమెను చూచి మావారు.

అమ్మా ఇంటికి తలవాకిలి ఉత్తరము ఉండుటచే గాలివసతీ, శాస్త్రసమ్మతీ, రెండూ కుదిరినవి కదమ్మా అంటూ మావారు పండుకొన వచ్చినారు వచ్చినన్ను చూచి శాంతా.

తే॥ తథ్యము వచింతు పక్షపాతమునగాదు
నిఖిలజగముల యందిది నిక్కువంబు
తొయ్యలుల కన్నరమ్య వస్తువులులేవు
వారలే కష్టములకెల్ల కారణములు॥

అన్నారు చూడు నీవిక్కడ ఉండబట్టి వర్షములో పెనుగాలిలో కష్టమనక వచ్చితిని నీవులేకున్న అక్కడేఉండి అన్నములేక మలమలమాడే వాడను వచ్చునంతవరకూ కష్టము చేరినతోడనే ఆనందము పురుష జీవితమునకు జీవకళస్త్రీ అమృతముపోసి చాకుటకు హాలాహలము పోసి చంపుటకు కర్త ఇప్పుడు అమృతమయివై కనుమూసి కనుదెరచులోపల బయటపడిన కష్టముల అన్నిటా మరచి పోవునట్లు సర్వవిధ సౌకర్యముల చేకూర్చి సంతోషపరచితివి ఇల్లాలనగానీవే ఇల్లూ, ఇల్లాలూ ఉండుటవల్ల లాభములేదు నీయట్టి ఇల్లాలుగలదే ఇల్లు నీయట్టి సుగుణవతిని బడసినవాని అలే ఇలాలు.

ఆ॥ పడతినొక్కదాని విడచి ఇంచుకయమృ
తంబులేదు భువి విషంబులేదు
అమృత లత లతాంగి అనురాగవతియైన
గాక మెలగెనేని గరళవల్లి॥

అన్నారు. శాంతా నీవునాకు ఇల్లాలుఒకటేకాదు కల్పవృక్షమూ కామధేనువు అనవలయును నేనెంతో పూర్వపుణ్యము చేయుటచే లభ్యమైనావు నీవు లేకున్న భగవంతుని పంపి నన్ను వెతికించి చేరతీసుకొన వలయునన్న సామాన్యమా సామాన్యులకు సాధ్యమా సావిత్రి యముని ఎదిరించి పతిని బ్రతికించుకున్నది. సుమతి ప్రొద్దు పొడువకుండాచేసి భర్తను బ్రతికించు కున్నది. బ్రతికించు కొనుటయే గాక పునరుద్ధరించు కున్నది. నీవన్ననో భగవంతునే వెతుకపంపి భర్తను చేరవేసు కున్నావు ఈ మానవ లోకములో ఈ కలికాలములో ముందు వారికి తీసిపోని వనితామణు లున్నారని ఎడతట్టి నిల్పినావు.

సీ॥ విభుడు పతితుడైన వెలది పాతివ్రత్యమహిమ పుణ్యుచేసి మనుపవలయు॥

అన్నది శాస్త్రము అన్నారు మహనీయులు అన్నదానికి అన్నట్లే నన్ను తరింప చేసినావు నీవల్లనేను భగవద్ చిద్విలాసము కన్నులార పొడగన్నాను ఉన్నాడా లేడా అను సందేహము సర్వమూ నిర్మూలమై బుద్ధి పవిత్రమై స్థిరస్థాయికి వచ్చి స్థిరమైనిల్చినది. నాజీవితములో గొప్ప మార్పు గల్పించినావు నన్నుద్ధరించినావు శాంతా నీయట్టి ఇల్లాలిని సంపాదించుకున్నవాడే నిశ్చయమైన మొగవాడు అన్నాడు.

నేను నవ్వుతూ మితిమీరి భావోద్రేకముతో పోతూ ఉన్నాడని నోరు మూసినాను. వారునాచేయిని తీసి తన చేతపట్టుకొని.

లేదుశాంతా నిశ్చయముగా త్రిదేవీ స్వరూపమై వెలుగొందు నీయట్టి ఇల్లాలిని చేసుకున్నవాడే ధన్యాత్ముడు మరియూ మొగవాడు అన్నాడు.

నవ్వుతూ లేకున్న అన్నాను.

జీవన్ముక్తుండు వాడు ధరిత్రిన్ అన్నారు.

కవిత్వము ప్రారంభించి నట్లున్నదే అన్నాను.

లేదు శాంతా కవిత్వము గాదు.

కం॥ మనుజుడు నేర్పరియైతే
గొనవలెరా మంచి ముద్దుగుమ్మనులేదా
ముని వృత్తినుండి మోక్షము
గనవలెరా కుందవరపు కవిచౌడప్పా॥

అన్నాడు అట్లకాదు మంచి ముద్దుగుమ్మను అనగా మంచి రూపవతి మంచి వయసుగలది అని అర్థము ఒక్కరూపముగాదు. సర్వవిధములగు గుణములలో మేలు రూపవతిని చేకొన్నాను లేదా ముని వృత్తినుండి మోక్షము గనవలెరా నన్నాడు ముని వృత్తిలేకనే జప తపాదులులేకనే మోక్షమునకు నన్నూ నాసంతతినీ నా పరివారమునూ చేర్చగల శక్తిమతిని రూపవతిని అనాయాసముగా చేకొన్నాను రెండు తెరవులే కవులు పేర్కొన్నారు. రెండుగాదు రెండునూర్ల తెరవులలో వేల తెరవులలో ముందుకు సాగినాను ఇక దినదినాభివృద్ధిగా ముందుకు పోగలనని నా నమ్మకమని అన్నారు.

నేను వారి పాదములొత్తుచూ ఏల ఈనాడు ఇంత స్తోత్రము చేస్తూ ఉన్నారు అన్నాను.

ఔను ఈ లోకములోనున్న గాజురాళ్ల కువ్వలో వజ్రము కాన వచ్చిన దంటే వింతగాక మరేమున్నది. ఇంతవరకూ ఈ గాజురాళ్ల కువ్వలో నీవూ ఒక టను కున్నాను ఈనాడు గాజురాయికాదు వజ్రమని తేలింది. నాసంతోష ప్రవాహము మేరదప్పి పరుగిడు తున్నది అన్నారు.

నేనేమీ చేయలేదండీ మా అమ్మచెప్పిన విధముగా అచరణా విధానము మరువక చేయుచూ మీరే భగవంతుడు భగవంతుడే మీరని మనసిచ్చి మిమ్ముల సుఖపెట్టి సుఖపడ వలెనని భగవంతు డిచ్చినభర్త నాపుణ్యములవంట మీరేనని భగ వంతుడు ఇవ్వవలె భర్తతేవలె భార్యాపిల్లలు తినవలెనని ఇచ్చినవారికి తెచ్చినవారికి పెట్టి మిగిలిన భుక్తశేషమును భుజించవలెనని ఇచ్చినవారికి తెచ్చినవారికి పెట్టక తిన్నట్లైన వారు ఇచ్చుటలేదు వీరు తెచ్చుటలేదు ఇచ్చుటా తెచ్చుటా లేకున్న ఇజిగి చచ్చుటే నిజమని తెలుసుకొని శ్రీవారిసేవా, మీసేవా, మరువకచేస్తూ దాచకుండా

ఈ దేహసౌష్ఠవములు మీకు ఈ దేహసేవ వారికి ఇవ్వవలెనను తలంపుతో సర్వదా మీ ఇరువురనే హృదయాంతర్గతమునచేర్చి స్థిర చిత్తనై ఉన్నాను ఇంతకు మినహా ఏ తపస్సూచేయ లేదన్నాను.

అ మాటలు విని సంతోషముతో నన్నువడిలోకిలాగి కౌగలించుకొని శాంతా భగవంతునే వశ్యము చేసుకున్న నీకు భర్తవశ్యుడగు టెంతపని భర్తవశ్యుడు కాలేదని మందులు మాకులుపెట్టి పిచ్చి పట్టించువారు చంపువారు దూరమగువారు దూషించు వారు ఏడ్చువారు ప్రాణ హత్యలు చేసుకొనువారు పరారగువారు భరణము పట్టు వారు పుట్టినిల్లుచేరువారు ఉన్నారు. భగవంతునే వశ్యుని చేసుకున్న భర్తఎంచు పొగలడను ధీమాగల వనితఏదీ ఈ దారినిచూపి అత్తవారింటికి పంపు అమ్మఏదీ స్త్రీకి దైవబలమే బలము బలము సంపాదించి బాగుపడుమని తెల్పు వక్తఏదీ స్త్రీ జీవితము ఇట్ల నడుపవలె ఇట్ల నడువవలె ఇట్ల ఉండవలె ఇట్ల చేయవలెనని తెల్పు వృద్ధపుణ్యాంగన ఏదీ భర్తకడలస్త్రీ ఇట్ల నడువవలె ఇట్ల ఉండవలె ఇట్ల చేయవలె ఇట్ల మెలగవలె ననితెల్పు వృద్ధపుణ్యాంగన ఏది పుత్రికలను పుత్రకులను ఇట్ల పెంపవలె ఇట్ల ఉంచవలె ఇట్ల పంపవలె ఇట్ల పెంచవలెననుతెల్పు వృద్ధనారీమణు లేరీ లేరు లేకనే నీయట్టి వనితామణులు కొరతపడిరి తెల్పు వారుండిన తెలిసివర్తించి భగవతీ భగవంతుల తలిదండ్రులుగా చేసుకొని కావలసిన వన్ని అడిగి ఇప్పించు కొని సర్వకోర్కెల తీర్చుకొందురు సర్వసౌఖ్యములతో తులతూగుదురు చెప్పువారు లేకనే చెడిపోవుచున్నారు ఎట్లో చక్కని దారిగల్పించుకొని భగవంతుని నీవానిగా చేసుకున్నావు నీవల్లనేను ధన్యుడ నైనానని భక్తిపారవశ్యముతో కంటనీరు విడచి నారు అవినా వక్షోజములపై పడినవి చూతుగదా కండ్ల నిండుకూ నీరు నిండుకొని ఉన్నది. ఏలమీరు ఈనాడు ఇంత భక్తిపార వశ్యులరై కంటనీరు పెట్టుచున్నారని పైటచెరుగుతో కంటనీరు తుడిచి లేవ పోయినాను. వారు తీరని ఆనందముతో కౌగలించుకున్నారు. పిన్నీ దయాదాక్షిణ్యములు గలిగి చనువిచ్చి ప్రేమస్వరూపులై చిలుకకు తెచ్చిపెట్టురీతి తెచ్చి నోటికందిచ్చి పలచి పలపించుకొను శక్తిగలిగి తన దేహ దారుఢ్యబల సంపత్తుల తనకే అర్పించునను నమ్మకముగలభర్త వడిలో కౌగి లిలో ఉన్నస్త్రీసుఖము నీకుచెప్ప నక్కరలేదు. మోక్షమునకన్నా మిన్న అన వచ్చును అట్టి ఆనంద మనుభవించు నన్ను చెక్కిళ్ల నిమురుచూ శాంతా భీమజరా సంధ యుద్ధములో భీముడు రాను రాను నిస్సారుడైపోవ కృష్ణుడు అర్జునుని శక్తి

తనశక్తినీ భీమునందు ప్రవేశింపచేసి జరాసంధుని భీముచేత చంపించినాడట అట్లే నీవు నా పూర్వజన్మ సుకృతశక్తికితోడు దైవశక్తినిపంపి నేనెదిరించి పోరాడు ధారిద్ర్య జరాసంధుని రూపు మాపించితివి నీశక్తి నాయందు పంపినావని ఇప్పుడు తెలిసినది. నిన్ను చేపట్టకముమపున్న శక్తికీ ఇప్పటి శక్తికీ తారతమ్యము ఇప్పుడు గమనించితిని భీముడు తనశక్తే జరాసంధుని చంపినదని గర్వించినట్లు గర్వించి ఉంటిని గర్వము ఈనాటితో నిర్మూలమైనది. ఇంటికి ఇల్లాలు వచ్చినా గాటికిఎద్దు వచ్చినా దొంతికి కుండవచ్చినా అదృష్ట మరదృష్టములు ఉండు నంటారు నీవు పూర్ణముగా అదృష్ట వంతురాల వంటూకన్నీటి బిందువులు రెండు విడచినాడు. అవి నా చెంపలపై పడినవి చూచి కంటినీరు తుడుచుచూ స్వామీ ఏల ఈనాడు మీరు ఇట్లైతిరి రుణానుబంధరూపేణా పశు పత్నిసుతాలయా అన్నది తెలిసీ ఇట్లు నెవ రెందుకు అప్రయోజకులు కొందరు భార్య వచ్చినప్పటినుండీ బాగలేదనీ అస్తీ పోయెననీ బిడ్డలులేరనీ మరదృష్టవంతురాలని గొడ్డురాలని ఆడి పోసుకొనువారు విడుచువారు తిట్టువారు కొట్టువారుకడకు కడగండ్లపాలుచేయ బ్రతుకుపైరోసి అగంతుక మృత్యువులపాలు అయ్యేవారు ఉన్నారు ఈ పశువు వచ్చినప్పటినుండీ నష్టమేననీ పిల్లలకు తల్లులకు బాగలేదనీ తోటిపశువులకు దెబ్బగా నున్నదనీ కడకు నష్టముతోనైనా అమ్మువారున్నారు. ఈ ఇల్లు బాగలేదనీ అచ్చిరాలేదని డబ్బుకూడ లేదనీ పిల్లలు బ్రతుకలేదనీ కూడిరాలేదనీ డబ్బునిలువలేదనీ అమ్ముతూ ఇల్లువిడచి ఇల్లు పిల్లి పిల్లల మార్చినట్లు ఇల్లిల్లూ తిరుగు వారున్నారు పుట్టిన పిల్లలంతా అప్రయోజకులని అనామకులని అంగహీనులని దుష్టులని భ్రష్టులని దూషించి దుఃఖపడు వారున్నారు ఇవి అన్నీ పురుషుని పూర్వజన్మ సుకృత దుష్కృత ఫలములని తెలియక మందబుద్ధులై మతిభ్రష్టులై పలుకు ప్రజల ననుసరించెద రెందుకు పురుషుడొనర్చిన పుణ్యఫలముతో మంచివి పాపఫలముతో చెడ్డవి దాపురించునని తెలిసి శాంతిచెందక దూషించి మరుజన్మకు మరింత తెచ్చుకొందురు మంచి చెడ్డల రెంటెను సృజించుకొను తలంపు మనలోనున్నది. మనమేకర్తలము చూడండి మీరు చేసిన పుణ్యముల పంటనేను నేనుచేసిన పూజాఫలభాగ్యము మీరు నా పూజాఫలము మంచిదిగాక పోయిన నా కష్టసుఖముల మీరు గమనించరు నాపై ఇంత దయాదాక్షిణ్యములు పెంచరు నాపై ఇంతప్రేమ నిలువదు ప్రీతిగలుగదు నన్ను ఆదరించరు ఇది దీనికికారణము మీరుచేసిన పుణ్యఫలము లేకున్న మీకష్ట సుఖముల గమనించనియిల్లాలు వచ్చును శక్తిసార్థ్యములహరించి శక్తిలేనివారని కడకుద్రోయును

సంపాదించలేని జీవచ్ఛవమని చీదరించును భర్తయను గౌరవము విడచి భయ భక్తులులేక ఎదిరించి వీధికెక్కి గయ్యాళి దాపురించును నీతినియమములులేక దేవుడూ దైవమనునదిలేక పిల్లల నోటిలోమన్ను నమ్మినభర్తకు దుమ్ముకొట్టి తెచ్చినది తింటూ చాలలేదని చావుకు తెగించి మాట్లాడు రాక్షసి వచ్చును. మీరు పుణ్య మూర్తులు మీ ఆలు పిల్లలు యిల్లు వాకిలి పశుసంపద పాడిపంట మంచివికాక చెడ్డవి ఏలవచ్చును యిది మీయదృష్టము యిది నాయదృష్టము అదృష్టములేకున్న మీయట్టి కరుణామూర్తులు దొరుకరు తెలియక కొందరు స్త్రీలు భర్తబాగలేడనీ ఆదరించడనీ ప్రేమించడనీ కనికరించడనీ కోర్కెతీర్చడనీ తలిదండ్రులు బుద్ధిలేనివారై నాకిరని ఎక్కిళ్లుబట్టి ఏడ్చుచూ దూషించి మరింత తెచ్చుకుందురు బుద్ధిలేక ముందుజన్మలో తానుచేసిన పనియని తెలుసుకొని భగవంతునికి భగవతికి కనికరము గలుగునట్లు చెప్పుకొని ముందుజన్మ కర్మను పోగొట్టుకొను ప్రయత్నములు చేస్తూ అనురాగప త్రియై భగవంతుడిచ్చినది నేనుచేసినది. యింతేనని నిర్వ్యసనముతో మనుట శ్రేయ మన్నారు అన్నారు.

ఔను నీయట్టి శాంత చిత్తులకు గుక్కతిప్పుకొను శక్తి ఉండును అందరికి ఉండునా.

కం॥ రక్షకులు లేనివారల
రక్షించెదననుచు చక్రి రాజైయుండన్
రక్షింపుమనుచు నొకనరు
నక్షము ప్రార్థింపనేల యాత్మజ్ఞులకున్॥

అన్నారు ఒక మానవుని ఆశ్రయించి ఛీ ఛా అని అనిపించు కొనుటకన్నా దయామయుడు భగవంతుడు ఆయననే ఆశ్రయించి ఆయన ప్రాపు సంపాదించిన సర్వమూ చేకూరునని వారిప్రాపు సంపాదించు కున్నావు వారిప్రాపు గలుగుటచే నీకీలోకమున ఏకొరవా గలుగదు లోకరక్షకుని అనుగ్రహము సంపాదించుకున్న లోకమున కొదువ గలదా అన్నారు.

ఔను కష్టసుఖములు పాపపుణ్యములు భర్తపైనా భగవంతునిపైనా పెట్టి పాలు విడువక చక్కగా నడుచుచుండిన ధర్మబద్ధుడై భగవంతుడు ప్రేమబద్ధుడై భర్త

కట్టు పడెదరు అన్నారు. అమాట త్రికరణ శుద్ధిగానమ్మి ఆచరణలో ఉంచుకున్నాను. అంతకన్నా వేరేమీ చేయలేదన్నాను. సాలూ మూలా తెలిసి చక్కగానడిచి సర్వేశ్వరుని అనుగ్రహము సంపాదించినసాధ్వి యిల్లాలు అయినది. యింక ఈ భూలోకమే స్వర్గలోకము ఈకుటీరమే వైకుంఠము ఈసుఖమే నాలోకమునగల అప్సరసలతోటి సుఖము అప్సరసలకురూపము ఒక్కటేగలదు గుణములేదు నీకురూపమూగుణమూ గలదు వారిశక్తి సామర్థ్యములు కాముకుల కట్టివేయగలవు నీశక్తిసామర్థ్యము సర్వశక్తిసముపేతుడగు భగవంతునే కట్టివేసినది. వారిమనసులు నిలకడలేనివి నీమనసు నిలకడకలిగినది. వారిని కాముకులు పొగడుదురు నిన్ను పుణ్యాంగనలు ధర్మపరాయణులు పొగడుదురు వారు కాముకుల వశముచేసుకుందురు నీవు భగవంతుని వశపరచుకున్నావు వారికి సతీపతీ న్యాయమున్న నీవు సతీపతీ న్యాయము నీటుగా పాలించినావు వారు చిత్తచాంచల్యాలు నీవు చిత్తశుద్ధివి వారు వేశ్యలు నీవుధర్మపత్నివి వారిని కాముకులు గౌరవింతురు నిన్ను ధర్మమూర్తులు పుణ్యమూర్తులు నిర్మలాత్ములు త్రిదేవులు త్రిమూర్తులు గౌరవింతురు వారికి నియమ వ్రతములులేవు నీవునియమ వ్రతవు వారు కాముకుల సంతోషపెట్టుదురు నీవు భర్తనూ భగవంతునీ సంతోషపెట్టుదువు వారు నాకలోకనివాసులు అయోని సంభూతలు నీవు భూలోకములో భారతభూమి నివాసివి మానవాంగనవు మానవాంగనవయ్యు దైవశక్తినార్జించి దైవమునే వశపరచు కొనుటచేత అప్సరసలకన్నా, దేవాంగనలకన్నా, మిన్నయనదగి ఉన్నావు అప్సరసలకొరకై స్వర్గలోకనివాసము కొరకై యజ్ఞయాగాది క్రతువులు అనేకముగా పట్టుదలతోచేసి తలనేలమోపిన దనుకా కష్టపడుదురు యిదియొకవెఱ్ఱిపని ఎట్టికష్టములనైనాపడి నీయట్టి యిల్లాలిని సంపాదించుకున్న భుక్తినీ, ముక్తినీ, శక్తినీ, కల్పించి. నాకలోక సుఖము భూలోకములోనే చూపించగలదు ఏకపత్నీ వ్రతుడై చక్కగా దినచర్య భక్తిశ్రద్ధలతో చేయుచూవచ్చిన లభింపగలదు ధర్మ అర్థకామమోక్షముల చేకూర్చగలదు. యిదితెలియక ఏమేమో చేతురు వట్టి చత్తమనుష్యులు అన్నారు భావోద్రేకము భక్తిపారవశ్యత ధర్మము మిళితము చేసి హృదయానందముతో పదేపదే అన్నారు.

నేనువారి చుబుకమంటుచూ హృదయానందముతో వారి అందరి మాట అటుండనిండు మీరు మాత్రము గొప్ప పుణ్యాత్ములు భగవంతునితో మాట్లాడినారు కన్నులారా చూచినారు ఈనాడు ఈ పట్టుదల వహించినారు ఎందుకోఅని నవ్వినాను.

వారు నాచెక్కిలి నొక్కుతూ శాంతా ఈపట్టు పిపీలికాది బ్రహ్మపర్యంతము గల జీవరాసులకు అన్నిటికీగలదు ఈపట్టు వలననే అన్నిజీవులాకట్టివేసి జంటయే పంటచేనని జంటతో ఆశీర్వదించినాడు భగవంతుడు ఆమాటల పాటించి జంటచేసు కోగా పూర్వజన్మ కర్మమున కయ్యానికి కాలుదువ్వ గయ్యాళి గంపలు బుద్ధిబొత్తిగా లేని పురుష వృషభులు ఒకరి కొకరుతోడ్పడి సంసారములో అంతూ వంతూ దొరు కక చేతికి పట్టుకొమ్మా కాలుకు పెట్టుకొమ్మాలేక త్రిశంకస్వర్గమై అటమటపడీ తలబరువై దారేషణా ధనేషణా పుత్రేషణా మంచిదికాదని సన్యసించి తిరిగే మధ్యా హ్నమునకు దారా పుత్రాదులతోనున్న వారినే అన్నానికి ఆసించి చేయిసాచెదరు యోగులై జోగులై విరాగులై బైరాగులై నీయట్టి ఇల్లాలు తోడైన ఇటు ఏడులోకాలలో అటు ఏడులోకాలలో లేని సుఖాలు ఇక్కడేఉండును అందరూ కుటుంబీకులే సన్యా సులులేరు సాధువులులేరు అతివృష్టి అనావృష్టి లేదు జంటలోనేఉంది రక్తి, విరక్తి జంటలోనేఉంది శక్తి, ముక్తి, ఈషణ త్రియములు వదలి యోగియై అవధూతయై స్వర్గానికి పోయినను అక్కడా ఆడవారితోనే సుఖము ఆనందము ఆడవారికి మొగ వారితోనే సుఖము.

తే॥ కుటిల వాదియు పరవంచ కుండుఁగాదు
నెమ్మి నెవ్వాడు యువతుల నిందసేయు
ఇంద్రలోకము తపసులకెల్ల ఫలము
స్వర్గముననున్న వారలచ్చరలుగారె॥

అన్నారు పుణ్యాత్ములకే పూబోండ్ల సుఖము అన్నారు.

ఉ॥ కమ్మని దండలున్ సురటిగాడ్పులు వెన్నెలయుఁ బరాగపుం
జమ్మును మంచిగంధమును సన్నపువల్వలు సీధుపానముఁ
దమ్మికొలంకు మేడయును తామరసాక్షులనంగనోప్ప భో
గమ్ములు పుణ్యవంతులకు గానిలభింప వటంద్రుదుధీమతుల్॥

అంటూ ముఖములో ముఖము చేర్చినాడు కొక్కరో కోయని కోళ్లు కూసినవి అదుగో నాలుగవ యామము ధర్మ విరుద్ధమంటూలేచి వనమాలీ గదీశార్ఙ్గీ అనితలంచి భగవంతునికి నమస్కరించి వారిపాదములంటి కన్నులకు అద్దుకొని నమస్కరించి

పోయి ముఖప్రక్షాళనము చేసుకొనివచ్చి దేవునికి నమస్కరించి అవతలి ఆవరణము లోపలికి పోయితిని ఆమెలేచి కూర్చొని ఉండెను చూచి ఏమమ్మా అప్పుడేలేచినావే అన్నాను.

ఆమెనన్నుచూచి ఔను తల్లీ నాలుగవ యామమైనది మొదలుగా నిద్రరాదు భగవధ్యానము చేసుకుంటూ ఉంటాను అన్నదామె.

మంచి మార్గమమ్మా అంటూనేను చీపురు తీసుకొని బైటఊడ్చుటకు పోయి తిని వెంటనే ఆమెవచ్చి చేయి సాచి అమ్మానేను తోస్తాను తెమ్మని చీపురుకట్ట తీసు కున్నది.

ఇది ఉత్తమ లక్షణమను కున్నాను చీపురు ఇచ్చినీళ్లూ పేడా తెచ్చినాను ఆమెకల్లాపు చల్లినది ముగ్గు పెట్టినాను.

అవుదగ్గర ఆమె శుభ్రము చేసినది చూతుముకదా కుక్క రెండు పిల్లల -ఈను కున్నది. చాలా అందముగా నున్నవి ఇల్లు శుభ్రము చేయగా నేను పోయినాను ఆమె ఆవుకు నీళ్లుత్రాపి మేతవేసినది నేనుఇల్లు అలికి ముగ్గుపెట్టి స్నానము చేసితిని వారులేచి నిత్యకృత్యములు తీర్చుకొని స్నానము చేయపోయిరి నేను పాలగిన్నె ఆమె చేతికిఇచ్చి అగ్నిదేవుని ప్రార్థించి పోయి ముట్టించి కాఫీకి నీళ్లుపెట్టి పూలకై ఇంటి ముందుకు పోయితిని ఆమె పాలుపిండి అమ్మాపాలు అన్నది. నేను పాలుతీసుకొని ఇంట్లోపెట్టి పోయి పూలనుకోయుచుండ ఆమె తోడుపడెను అట్లనైన నేను పోయి కాఫీచేస్తాను అన్నాను ఆమె పొమ్మన్నది నేనుపోయి కాఫీచేసినాను అంతలో వారు స్నానము చేసివచ్చి దేవునిదగ్గర మాలిన్య వస్తువులతీసి దీపములు వెలిగించి ప్రాతః కాల సంధ్యావందనము చేసినారు నేనుకాఫీ ఎత్తుకొనిపోయి దేవునిదగ్గరపెట్టి పూల బుట్టి తెచ్చిఇచ్చినాను కేశవనామములతో అర్చించి కాఫీ దేవునికి నివేదన చేసినారు నేను ఆమెనుచూచి కాఫీత్రాగుదువు లెమ్మని దేవునికి నమస్కరించి కాఫి వారికిఇచ్చి ఆమెకిచ్చి నేను త్రాగినాను ఆనాటినుండీ మా ఇంటిలోనిలచి పోయినది. ఆ ఆవు రెండు పెయ్యదూడలను -ఈని అటుపై కోడెలనే -ఈనినది అవిమంచి వెలకు అమ్మి నాము ఇప్పుడు మూడు ఆవులు కోడెదూడలనే -ఈనినవి ఆమె ఆవులయెడ మంచి శ్రద్ధగా చూడగలదు. నాకు తల్లికన్నా మిన్నగానున్నది. ఈ ఇంటిని అభివృద్ధి

చేసిన వారిలో పశ్రిధమురాలు ఆమె ఇప్పుడున్న కుక్కలురెండూ దానిసంతతే మాకు అంగరక్షకులవలె ఉన్నవి ఆమె సహాయమువల్ల ఆవుల అభివృద్ధివల్ల ఈ ఇల్లూ ఈతోటా అయినది. తోటవల్ల పిల్లల విద్యాభివృద్ధి అయినది ఆమెమాకు కల్పవృక్షములాగా ఉన్నది భగవంతుడు మాకు ఆమె సహాయము ఇప్పించినాడు ఆమెకు మేమూ మాపిల్లలూ ఋణపడినాము ఆమె మానవాంగనకాదు దేవాంగనవలె నున్నది లేకున్న అశాంతమూ, భక్తి, అదయా మానవులకు ఉండునా తల్లికికూడా పిల్లలపైన అశాంతము ఉండదు శాంతమైన హృదయము ప్రశాంతమైన సుఖము.

కం॥ భూతముల వలననెప్పుడు
భూతములకు జన్మమరణ పోషణములు ని
ర్ణీతములు సేయుచుండును
భూతమయుం డీశ్వరుండు భూతశరణ్యా!

అన్నది భాగవతము అట్లే ఈజీవులకు తోడు ఆజీవి ఆజీవికితోడు ఈజీవులుగా తోడు చేసినాడు సర్వేశ్వరుడు ఆనాటినుండీ గోసంరక్షణా గృహసంరక్షణా శిశుసంరక్షణా నిర్వహిస్తూ మాకు తోడునీడై ఉన్నది. పిల్లల ఇంతముందుకు తెచ్చినది ఆమే భగవంతుడు ఆమెకు తగినట్లు పేరుపెట్టించినాడు కరుణ ఆమెపేరు కరుణ కరుడు గట్టి ఆమెయందే ఉన్నది. బాగా చదువుకున్నది విధవ పాపము అర్ధవయసు ఉన్నది అనునప్పటికి రాగమ్మ భోంచేసి చేయికడుగుకొని కూర్చొని ఆశ్చర్య పడుతూ ఉంది.

శాంతా ఇంక పోవమ్మా చాలా పొద్దుపోయెను అన్నది శాంత కమలను పిల్చి అవ్వకు తాంబూలము ఇవ్వమంటూ తాను భోజనమునకు కూర్చొనెను.

రాగమ్మకు కమలతాంబూలము తెచ్చిఇచ్చి ఆకులుతుడిచి ఈనెబుతీసిఇచ్చెను.

రాగమ్మ కమలనుచూచి కమలా మీయమ్మకు ఎంత శాంతమే ఎంతఓర్పు ఉన్నదే ఎన్నికూరలు చేసినదే ఎంతబాగున్నవి వంట ఇల్లు ఎంత శుభ్రముగా పెట్టి ఉన్నది పాత్రలు ఎంతబాగా శుభ్రము చేసినది.

కం॥ తనకోపమె తనశత్రువు
తనశాంతమె తనకురక్ష దయచుట్టంబౌ
తనసంతోషమె స్వర్గము
తనదుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ!

అన్నారు శాంతము ఓర్పు మానవులకు అంగరక్ష అందులో కుటుంబికి ప్రాముఖ్యము గృహిణి అంటే మీయమ్మే గృహిణి అన్నది రాగమ్మ.

కమల నవ్వుతూ అవ్వా.

కం॥ బుద్ధియు ధృతియును నీతియు
శ్రద్ధయు సన్నుతియు క్షమయు శాంతియుననగా
వృద్ధశ్రమ ఏడ్వురుమద్
వృద్ధిప్రద దేవతలు శ్రుతిస్మృతికథితల్॥

అని దేవేంద్రునకు లక్ష్మి చెప్పినట్లుగా భాగవతములోనున్నది. నాయభివృద్ధి గోరువారు ముందు పెద్దలవలన గ్రంథశోధనవల్ల బుద్ధిబలము సంపాదించుకొని ధైర్యముతో మనస్సును దుశ్చేష్టలకు పోనివ్వక బిగియపట్టి నీతి నియమములకు లోనై కీర్తిగౌరవముల పొందవలయునను ఆశయముతో శాంతమయిన హృదయముతో ఓర్పుగలిగి పెద్దలకడ భగవంతునియెడ భయభక్తులుగలిగి షట్కర్మల దిన దినమూ సోమరితనము వహింపక ఆచరణలో ఉంచుకొని నన్ను మరువకుండు వారికి మాతృదేవినై సకలైశ్వర్యముల నొసంగి అహర్నిశమూ కంటికి రెప్పవలె కాపాడెదను అన్నదటతల్లి లక్ష్మి షట్ కర్మలనగా స్నానము, సంధ్య, జపము హోమము, దేవపూజ, ఆతిధ్యము, స్త్రీపురుషులకు ఇరువురకూ ఉన్నవి అందులో స్త్రీలు ఆచరించు విధము ఏవన ఒకటి స్నానము. రెండు సంధ్య అనగా ఉదయ మధ్యాహ్న సాయంతనముల దేవుని స్తోత్రము తప్పక చేయడం. మూడు జపము అనగా వేగిలేచినదిమొదలు కార్యకలాపములకడచేయు స్తోత్రము. నాల్గు హోమము పరిశుద్ధముగాపదార్థములు తయారుచేసి అగ్నిహోత్రునకు అర్పించుట. అయిదు దేవ

పూజ. తులసినీ, పూలచెట్లను శ్రద్ధగా పెంచి పూలను తులసినీకోసి భక్తితో ఆసక్తితో దేవునికి పెట్టి నమస్కరించడము ఆరు అతిథ్యము చేసిన పదార్థముల మిగుల భక్తి శ్రద్ధలతో దేవునికి అర్పించి అడిగిన అతిథులకు ఉన్నదానిలో ఇంత పెట్టడము ఇవి స్త్రీలు చేయు షట్ కర్మలు ఇవి ఆరూ మరువని మహాతల్లి ఇల్లు బంగారు మయమౌ తుందన్నారు. ఆయమ ఎట్టికార్యమైనా సాధింపగలదన్నారు ఈ షట్ కర్మ సాధనా బలముతోనే సావిత్రి యముని ఎదిరించి గతప్రాణుడైన పతిని బ్రతికించు కున్నది. అపుత్రకుడైన తండ్రికి నూర్గురు కుమారుల జడయ చేయగలిగినది రాజ్యచ్యుతులై అంధులైన అత్తమామలకు తిరిగీరాజ్యమూ కన్నులూ గలుగ చేయ కలిగినది అరుం ధతీ వసిష్ఠమహర్షి పెట్టిన పరీక్షనుగెల్చుటకై ముల్లోకములుగడగడలాడించి ముప్పది మూడుకోట్లదేవతలు ముమ్మూర్తులు సతీసమేతులైవచ్చి వసిష్ఠునకు ఇల్లాలుకాతగుదువని ఆశీర్వదించు వరకుచేసి మహర్షిని మెప్పించి పరీక్షనునెగ్గి పెండ్లియాడినది. ఈషట్ కర్మా చరణవల్లనే సుమతి ప్రొద్దునే పొడువకుండచేసి మాండవ్యమౌని శాపగ్ర స్తుడగు పతిని బ్రతికించుకొని పునరుద్ధరించు కొన్నది. ఈదినచర్య వల్లనే అనసూయ త్రిమూర్తుల పసిపాపలుగ చేసుకున్నది. త్రిదేవులకు పతిభిక్ష పెట్టినది ఈ అచరణా విధానమువల్లనే సాధ్వీమతల్లులై భరత భూమిని ప్రఖ్యాతి బడసిన వారందరు ఈ షట్ కర్మ విధానము వల్లనే ఈదినకర్మలో సర్వేశ్వరుడు కంటికగుపడక పరమాణు స్వరూపుడై దినదినాభివృద్ధితో మేరునై సర్వమూ చేకూర్చు నన్నారు. తిన్నఇంటి వాసాలెంచు వాడుగాడు తన్ను నమ్మినవారిని చేవిడుచు వాడుకాడు అన్నారు అని మా అవ్వ చెప్పినది. స్త్రీ తన చాకచక్యముతో ప్రేమతో లాలనతో మొగని మెప్పించి ఏపనినైనా చేయించవచ్చునన్నది. మాఅవ్వ మాయమ్మ మానాన్నతో మాతో ఒంతపని చేయించినదో చూడు వ్యాయామమువల్ల దేహారోగ్యమని చెమట పోయడమువల్ల దేహము జకారుగా నుండునని ఆయుర్ వృద్ధియని పటుత్వమని వ్యాధులకు లొంగని దేహమౌతుందని జరశీఘ్రముగా సంభవింపదని స్థౌల్యవ్యాధి చెంత చేరదని (లావుఅగుట) పురుషులు వ్యాయామము లేకున్న బూరుగ చెట్టువలె తేలిక యగుదురని ధైర్యోత్సాహములు ఉండవని చెప్పుతూ అనాయాసముగా ఇంత పనిచేయించినది స్త్రీలు భర్త చనువు సంపాదించుకొని పశవర్తునిగా చేసుకొని తన కొరకుగాక పిల్లలకొరకై గృహరక్షణకై గృహోప కరణములకై కీర్తి గౌరవములకై ఎంత దాస్యము చేయించుకున్ననూ తప్పు లేదనియు పురుషుడు ఎంత వీరాధివీరుడై

నను, రాజైనను, రైతైనను, గృహమునకూ గృహిణికీ దాస్యము చేయవలసినదే ననియు స్త్రీ ఎంత చదువుకున్నదైనా ఎంత రూపము ఉన్నదైనా ఎంత ధనము తెచ్చినదైన గృహమునకు గృహస్థునికి దాస్యము చేయవలసినదేననియు ఒకరికి ఒకరు దాస్యము చేయుటలోనే ప్రేమగల్గుననియు ఒకరికి ఒకరు మనసిచ్చుటలోనే మరులు గలుగుననియు ఒకరి కష్టసుఖములు ఒకరు పంచుకొనుటలోనే వలపు గలుగుననియు ఒకరి కొకరు సహకరించుటే సంసారమనియు అవ్వ అమ్మకు చెప్పతుంది అమ్మ నాన్నకు మెత్తగ చెప్పిచేయిస్తుంది చేస్తుంది ఆహారలంచమిచ్చి నాతో అన్నతో చేయిస్తుంది. ఈ నేర్పంతా అవ్వలోనేఉంది అన్నది కమల.

రాగమ్మ ఆశ్చర్యపడుతూ కమలా అవ్వ చెప్పినదంతా అక్షరము తప్ప కుండా అంతా నేర్చుకున్నావుకదే ఔను కన్నదానినీ విన్నదానినీ కంఠస్తము చేసిన రాగల కాలములో రాణించగలవు ఇది ప్రతిజీవికీ ఉండవలసిన విధి దీనితో రాణింతురు మనుష్యులు చదివినది విన్నది అర్థము చేసుకొని అర్థమైనది ఆచరణలో ఉంచుకొనడమే గొప్పతనము అట్లు ఆచరించనివారే బుద్ధిహీనులు అన్నది రాగమ్మ.

కమల రాగమ్మనుచూస్తూ ఔను అవ్వా బాల్యములో కన్నదీ విన్నదీ నేర్చు కొనవలయును బుద్ధిబలము ఉపయోగము చేయవలయును. ముందు గృహకృత్యము లతో గృహచ్ఛిద్రములతో చింత ఏర్పడుతుంది ఏమీ చేయలేము ఇప్పుడే కాలము గదా అన్నది కమల.

ఔను కమలా కన్నతల్లి ప్రక్కవిడచి కట్టుకున్నవాని ప్రక్కచేరులోపల కావలసినంతా విద్యా బుద్ధి నేర్పు ఓర్పు సంపాదించి ఉండవలయును లేకున్న తల్లికి రెండు పిల్లకు పన్నెండు వడ్డైన అవుతుంది అప్పుడు చింతిస్తే ఏమీలాభము ఇన్నిటకూ మీయమ్మ కల్పవృక్షము మీయవ్వ కామధేనువు ఉండబట్టి లోకజ్ఞానము శాస్త్రజ్ఞా నము అంతానీలోనే ఉన్నట్లున్నది. లేకున్న ఏమైఉండునో ఈవయసుకే ఇంతజ్ఞా నము ఉండవలయునంటే ఇంటి యజమానురాలి ఘనత చెప్పనక్కరలేకనే తెలి యును తల్లి తప్పులు తల్లి ఒప్పులు పిల్లలో కానవచ్చునందురు. దీనికి నీవేప్రత్యక్ష సాక్షివి అన్నది రాగమ్మ.

ఔను ఇదినిజము మాయవ్వ ప్రతిదినము భాగవతము చదివిన దనుక విడు వదు చదివినదానికి బాగాఅరము చెప్పతుంది అందువల్ల భాగవతములో కథలన్నీ

బాగా తెలుసును ఇంక వస్తుంది. ఒక గంట అయినా చదివినదనుకా వదలదు అంటూ ఉండగా శాంత ఫోంచేసి చేయి తుడుచుకుంటూ కమలా మీ యవ్వ ఈనాడు ఇంకారాలేదేమమ్మా అంటూ అక్కడికి వచ్చెను.

వచ్చిన శాంతను రాగమ్మచూచి శాంతా కూతురిని అప్పుడే సవ్యాప సవ్యముల పరోక్ష అపరోక్షముల సవ్యసాచివలె తయారుచేసి నావే భాగవతము అంతా కంఠస్థమై లోకజ్ఞానము శాస్త్రజ్ఞానము సంపూర్ణముగా ఉన్నట్లున్నదే అన్నదిరాగమ్మ.

ఔనమ్మా ఆమెకు ఎటుచూచినా చెప్పువాడమే అయినాము ఇంకా చక్కగా నేర్చు కొనదు అన్నది శాంతమ్మ.

అంతలో అవుల తోలుకొని కరుణ వచ్చెను కమల వెంటనేపోయి అవుల కట్టివేసెను సంకనఉన్న పేడపుటికను కరుణ దొడ్డిలోపెట్టి చేతులు కడుగుకుంటూ కమలా అక్కడఉన్న మేతనుతెచ్చి ఆవులముందు వేయమ్మా అన్నది.

ఆమె ధ్వనివిని దుర్ముఖి, సుముఖి, తోకలు ఊపుచుకుంటూ వచ్చి నిలచెను

ఏమి ఈనాడు ఆవుల దగ్గరకు రాలేదే ఎక్కడున్నారన్నది కరుణ.

ఈనాడు కొత్తవారు కమల చుట్టూఉన్నారు అందుకొరకై ఆమెను చూపెట్టు కొనియే ఉన్నవి అన్నది శాంతమ్మ.

ఔనా అంటూ వారెనుచూచి కరుణచిరునవ్వు నవ్వినది.

అవి అదిచూచి ఇంకా దగ్గరకువచ్చి తోకలు ఆడించ సాగినవి. అంతలో కమల అవులకు మేత వేసివచ్చి అవ్వా ఈరోజు కొత్తవారు వచ్చినది చూచినవి. నన్ను ఒక్కటి చూపెట్టుకున్నది. ఒకటి తోటలోకి ఇంటిలోకి తిరుగను మొదలు పెట్టినది. ఏమిఎత్తుకొని పోతారో ఏమిచేస్తారో అని వారెకు భయముగా నున్నది అన్నది కమల.

కమలా అందుకేనా ఏమారకుండా ఇవి చూపెట్టి ఉన్నవి. కుక్కలకుచూడే ఎంత తెలివి ఉన్నదో అన్నది రాగమ్మ.

శౌనమ్మా కుక్క విశ్వాసముగల జంతువు అన్నముపెట్టినవాణ్ణి తన్ను కొట్టిన వాణ్ణి ఎంతకాలమయినా జ్ఞాపకముంచు కుంటుంది. తిర్యగ్వర్గ జంతువులలోచేరి కూడా పెట్టినవాణ్ణి మరువదు మానవులు జ్ఞానము ఉండియు తిన్నఇంటి వాసాలెంచుట మేలుచేసిన వానిని పెట్టినవానిని మరచుట ఉపకారికి అపకారము చేయుట స్నేహముచేసి సిరినో స్త్రీనో అపహరించుట చేయుచురు. కృతజ్ఞతచూపితే కృతఘ్నత చూపుతారు విశ్వాసములో అప్రియోజక మానవులకన్నా శునకమే కడుశ్రేష్ఠము వేమనయోగి అందుకే మానవులకూ జంతువులకూపోల్చి తెలిపినాడు.

ఆ॥ కుక్కతిన్నవాడు గురులింగ జంగంబు
పందితిన్నవాడు పరమయోగి
ఏనుగతిన్న ధీరుఁడెంత సుజ్ఞానిరా
విశ్వదాభిరామ వినరవేమా॥

అన్నాడుచపలచిత్తానికి కుక్కకుపోల్చినాడు కుక్కకుస్థిరమైనబుద్ధిలేదు. నీవట్లగాక స్థిరమైనచిత్తము ఏర్పరచుకొని స్థిరమైన వాడెవడో స్థిరమైనదేదో తెలుసుకొని స్థిరముగాదైవమునేనమ్మి వేషముతోగాక ఆచరణలో జంగమయ్యావు కమ్మన్నాడు. మదమునకు పందినిపోల్చినాడు. నన్నా నేనా అనక నాకన్నా గొప్పవారు నాకన్నా తెలిసినవారూ నాకన్నాజ్ఞానులు విద్యావివేకవంతులు ధనికులూప్రజ్ఞావంతులుగలరని భగవత్సృష్టిలో నేనొక పరమాణువని మదమువిడచి సంచరిస్తూ సుస్థిరప్రజ్ఞగలిగి పరమయోగివిగమ్మన్నాడు. క్రోధమునకు ఏనుగకుపోల్చినాడు పెట్టినవానినికొట్టిన వానినిబాగాతెలుసుకోగలదు ఏనుగ కొట్టిన వానిని కొట్టవలెనని ఏండ్లపర్యంతము జ్ఞాపిపెట్టుకోగలదుగాని పెట్టినవానికి పెట్టుటసున్న అట్లకొట్టినా తిట్టినా క్రోధగ్రస్తుడవుగాక నాకర్మమని ముందుజన్మలో చేసినది తీరిపోయినదని తీరిపోవుటచే పీడ పోయినదని అన్నదానిని అన్నందుకు కొట్టినదానికి కొట్టినందుకు చింత ఎందుకని కర్మచేసినదే చేయించునని చేశావ్ బోసేశావ్ అన్నసామెతను జ్ఞాపకము చేసుకొని తెలిసి స్థిరచిత్తుడవై క్రోధమును చంపుకొని సుజ్ఞానివి కమ్మన్నాడు. అనగా ఏమానవుడైనా చపలచిత్తమును చంపుకొని బుద్ధిబలముతో మదమను పందిని క్రోధమను ఏనుగను హరించి సర్వభారములు భగవంతునిపైనుంచి చేతనైన ఉపకారములు చేయుచూ అపకారములుమాని ఉన్నవారే మహనీయులు అన్నారు. ఈ జీవులు

ఏజన్మలో బాకీ పడినవో ఈజన్మలో తీర్చుచున్నవి వనాన్ని గృహాన్ని కంటిరెప్ప వలె కాపాడుతున్నవి. బాకీపడి తీర్చకపోయిన కుక్కైకోడై పశువై పెద్దకొడుకువై తీరుస్తావుపో అంటారు. అణువుబాకీ పడిననూ ఏదోఒక రూపముతో తీర్చవలయు నంటారు. బాకి ఎట్లో ఇప్పుడే తీర్చుకుందామను మనుష్యులు కొరతపడినారమ్మా పశుపక్ష్యాదుల చూచి పాపులగు రోగులా అంగహీనులా దరిద్రులా నాయను వారులేని నాయట్టి వారలా చూచి తెలుసుకొనలేరు ఎంతనీచకార్యములకైనా దిగుతారు బుద్ధికి బుద్ధిచెప్పలేరు ఊరక కష్టములేక అన్నీ సమకూరాలని సర్వమూ తమకే ఉండవలె ననీ ఆశపడుతారు అన్యాయములు చేస్తారు అవతలికష్ట తెలుసుకొనలేరు ఈకుక్కలకు మనము దయతోవేళకు అన్నమువేస్తే తినవలె లేకున్న పస్తుండవలె అడుగుటకు నోరులేదు నోటిబలముతో అందరికీ అపకారముచేసి అపనిందలపెట్టి అర్థమునకు అపార్థములుచెప్పి న్యాయము అన్యాయమని అన్యాయము న్యాయమనివాదించి అపద్ధములు సాక్షీలుచెప్పి ఇక్కడిమాటలు అక్కడా అక్కడిమాటలు ఇక్కడా చెప్పి తగాదాలు కల్పించి ఒరుల పరాభవించి తిట్టి అపద్ధసాక్ష్యములుచెప్పి కొంపలు తీసి ఆలుదగ్గర ఓకటి మొగనిదగ్గర ఒకటిచెప్పి ఇహటీకి సామ్రాజ్యమేలుతూ రామ రామ యని నోటపలుకని పలుగాకులై అందరినీ నోరుమూయించిన దుష్కలము ఒక దానికొకటితోడై నోటచేసినపాపము కాబట్టి నోరులేని జీవులైపుట్టి దుఃఖింపవలసి వచ్చినది. ఇదితెలిసి మనముజాగ్రత పడవలయును శుద్ధపాపఫలము చాలాకష్టము ఈశుద్ధ పాపులగు జీవరాసుల చాకడములో లవుకికముగా వర్తించవలె అడుగలేవు ఆకలి అనలేవు అన్నీమనము తెలుసుకొని అకారమే వేరుగాని ఆత్మ మనవంటిదేనని అన్నమూ నీరూ పెట్టవలయును లేకున్న యజమానికి పాపము తప్పదు అన్నది కరుణ.

అమ్మా చాలా పొద్దుపోయినది లే మళ్లీ మాట్లాడవచ్చు నన్నది శాంత.

కరుణ కాళ్లు కడుగుకొని దేవుని పీఠమువద్దకుపోయి చేతులు జోడించుకొని తండ్రీ లోకరక్షకా

తే॥ నిన్నునెప్పుడు దలచెద నన్ను నీవు
వత్సలుడవయి వీడు నావాడనంగ
వలయుజుమ్మయ్య మరువక వాసుదేవ
దేవ దేవ మునీశ్వర భావనీయ॥



కం॥ నీపాద కమలసేవయు
నీపాదార్చకుల తోటి నెయ్యమును నితాం
తాపారభూత దయయును
తాపస మందారనాకు దయసేయగదే॥

అని మోకరించి నమస్కరించి తీర్థము పుచ్చుకొని భోంచేయ కూర్చొనెను.

ఇది అంతా చూస్తూ ఉన్న రాగమ్మ కమలను చూచి కమలా ఈమె చాలా యోగ్యురాలుగా వున్నదే పాపము అంటూ మధ్య ఇంటిలోపలికి పోయెను.

కమల చాపతెచ్చివేసి కొంచెముసేపు భుక్తాయాసము తీర్చుకో అవ్వాయని చిన్నపీటను తలగడకు తెచ్చి ఇచ్చెను.

రాగమ్మ ఆశ్చర్య పడుతూ పడుకుంటూ తల్లీ అంటూ తలవాల్చెను.

కరుణ భోంచేసి చేయికడుగుకొని చేయితుడుచుకొంటూ శ్రీరామచంద్రా అంటూ వచ్చి వనమాలీగదీ అనేశ్లోకము పఠించుచూ కూర్చున్నది. అంతలో కమలవచ్చి కొంచెముసేపు పండుకో అవ్వా అని చాపతెచ్చి పరచి వకపీటతెచ్చి యిచ్చెను దయామయా నీదయ అంటూ కరుణ పండుకొనెను.

కమలపోయి అంట్లపాత్రల తోముచూ శంకరులవారు రచించిన మహిషాసురమర్దనీస్తోత్ర వృత్తముల హిండోల్ రాగము ఆదితాళముతో పాడుతూవుండెను.

అయిగిరినందిని నందితమోదిని విశ్వవినోదిని నందినుతే
గిరివరవింధ్య శిరోధినివాసిని విష్ణువిలాసిని జిష్ణునుతే
భగవతిహే శితికంఠకుటుంబిని భూరికుటుంబిని భూరికృతే
జయజయహే మహిషాసురమర్దని రమ్యకపర్దిని శైలసుతే
అయిజగదంబ కదంబవనప్రియ వాస విలాసిని వాసరతే
శిఖరిశిరోమణి తుంగహిమాలయ శృంగనిజాలయ మధ్యగతే
మధుమధురేమధు కైతవభంజిని కైటభభంజిని రాసరతే॥ జయ॥
కలమురళీవర వాజిత కూజిత కోకిల మంజుళ మంజురతే
మిళిత మిళింద మనోహర గుంభిత రంజిత శైలనికుంజగతే

మృగగణభూత మహాశబరీగణ రింగణసంభృత కేళిభృతే జయజయహే॥
కటితటనీత దుకూల విచిత్ర మయూఖనురంజిత చంద్రకలే।
నిజకనకాచల మౌళిపయోగత నిర్జరకుంజర భీరురుచే॥
ప్రణతసురాసుర మౌళిమణిస్ఫుర దంశులతాగ్రిక చంద్రరుచే॥ జయ॥
విజితసహస్ర కరైకసహస్ర సుధాసమరూప కరైకనుతే।
కృతసుతతారక సంగరతారక తారకసంగర సంగనుతే॥
గజముఖ షణ్ముఖ రంజితపార్శ్వ సుశోభితమానస కంజపుటే
జయజయహే మహిషాసురమర్దిని రమ్యకపర్దినిశైలసుతే॥

శాంత బావిదగ్గరగుడ్డలుపిండి ఆరవేసి వచ్చికూర్చొని అకువేసుకొవ ప్రారంభించెను. అంతలో కమల అంట్లుతోమి వచ్చికూర్చొనెను. కరుణలేచి కమలా ఏదీ భాగవతము తేవమ్మా చదువుదువు అన్నది. కమలలేచిపోయి భాగవతము తెచ్చి కరుణకు దగ్గరగాకూర్చొని చదువ ప్రారంభించెను.





# మాతృ జ్యోతి.

## —: అపరాహ్నము. :—

శా॥ శారద నీరదేందు ఘనసారపటీర మరాళమల్లికా
హారతుషారఫేన రజతాచల కాశఫణీశకుందమం
దార సుధాపయోధిసిత తామరసామర వాహినీశుభా
కారత నొప్పునిన్ను మదిగాన గనెన్నడు గల్గుభారతీ॥

అని సరస్వతీ ధ్యానపద్యము చదివినది. కరుణవిని భాగవతము చదువు నప్పుడు శ్రీకృష్ణ ధ్యానము ముఖ్యముతల్లీ మొదటి పద్యము చదువమ్మా అన్నది.

శా॥ శ్రీకైవల్య పదంబుచేరుటకునై చింతించెదన్ లోక ర
క్షైకారంభకు భక్తపాలన కళా సంరంభకుꣳ దానవో
ద్రేకస్తంభకు గేళిలోల విలసద్దృగ్జాల సంభూతనా
నాకంజాత భవాండకుంభకు మహానందాంగనా డింభకుꣳ॥

అని కృష్ణధ్యానముచేసి యెక్కడ చదువుమంటావు అవ్వా అన్నది కమల.

యశోద కృష్ణుని రోటికికట్టినది కదానిన్న యీనాడు అక్కడనుంచే చదువమ్మా అన్నది కరుణ.

సరేనని కమల ప్రారంభించెను.

ఆ॥ పట్టియల్లబోటి పట్టియాతండని
గట్టితలపుతోడ గట్టెగాక
పట్టికడుపు పెక్కుబ్రహ్మాండములుపట్టు
టెరిగెనేని తల్లియేలకట్టు

అని నిదానముగా విమర్శగా రాగయుక్తముగా చదివినదివిని రాగమ్మలేచి కూర్చొనెను కరుణ అపద్యములోగల అర్థమునకు తలయూచుతూ శాంతా వింటివా యశోద యెంతవెఱ్ఱిదో కృష్ణుడు తనకుమారుడనియే భావించుచున్నది. పాలుత్రాగెడు నాడే పూతననూ శకటాసురుని చంపెను. తృణావర్తుని తృంచెను అయిదేడులకు లోపలనే చిలిపిచేష్టలు తుంటుకులు ధూర్తకార్యములు యెన్నోచేసెనని గోపికలు చెప్పగా విన్నది. నోటిలో బ్రహ్మాండము తానేచూచినది మానవాతీత కార్యకలాపములు చేయుచుండ యెన్నో ప్రత్యక్షముగా చూచినది. భగవంతుడను భావములేక తనపట్టియేనని పట్టి రోటికి కట్టినది యెంతఅమాయకు రాలనవలయునో చూడు ఇదియే భగవత్ చిద్విలాసము తానైమాయను నశింపచేసి మానవుని చెంతకు తీయవలయునే గాని తన మాయను జయించువారు దేవ దానవ మానవులలో నెవ్వరూ గన్పింపరు.

అని చెప్పుచుండ రాగమ్మ కరుణనుచూచి అమ్మా వక్కని గన్నాకూడా యిట్లుండవలయు పుత్రోత్సాహము పుత్రానందము చెప్పవలయునా తలిదండ్రులు బ్రహ్మకూకటి దాటెదరు యెందుకు ధృతరాష్ట్రుడు గాంధారిగన్నారు నూర్గురుని ప్రయోజనమేమి వారికన్నులెదుటే పెరుగుట, విరుగుట, చూచి దుఃఖించి దిక్కులేక ఘోరారణ్యములకుపోయి దిక్కులేని చావుచచ్చిరి.

తే॥ పౌరుషజ్ఞానకీర్తుల బరగెనేని
వానిసంపదయొకపూట యైనచాలు
ఉదరపోషణమాత్రమీ యుర్విమీద
కాకిచిరకాలమున్న నేకార్యమగును॥

అన్నారు కాకి వెయ్యేండ్లు బ్రతుకుతుంది ఏమిమేలు పౌరుషజ్ఞానకీర్తులుగలవా బ్రతికి సార్థకమేమి తలిదండ్రుల రక్తము పంచుకొని పుట్టినందుకు పౌరుషము, జ్ఞానము, కీర్తి, సంపాదించి వారిని చిరకీర్తివంతుల చేయువాడు ఒకడైననూచాలు అనామకులు యెందుకుతల్లీ వట్టి దండము. అట్టివారైతే దండధరుడొకడు కాబట్టడు అని నమస్కరించినది రాగమ్మ.

కరుణ నవ్వుతూ రాగమ్మవంక పరిశీలించి అమ్మా దయామయుడు భగవంతుడు అయనను ఏదికోరిననూ ఇవ్వగలడు మనకర్మ ప్రబలమై యిప్పుడివ్వకున్నను మరుజన్మకైననూ యివ్వగలడు అయనకు కామితార్థఫల ప్రదుడను. బిరు

దముగలదు మహాతల్లులుమహాపురుషులుకోరితపస్సుచేసి భార్యనుభర్త-భర్తనుభార్య యిరువురు సంతతిని బంధు మిత్రులను సంపాదించుకునెదరు వారికోరికల ప్రకారము భగవంతుడు అనుగ్రహించి యివ్వగలడు అట్టి సంతతి యిహములో గౌరవనీయులై దేవ భూసురవయోవృద్ధ ఆశీర్వాదములపొంది. శిధిలదేవాలయముల ధర్మ సత్రముల బావుల, కోనేర్ల, చెరువుల, బాగుచేసి కట్టి తలిదండ్రుల పేరునిల్పి కీర్తి వంతులవుదురు మాతృ పితృరుణము తీర్చి పుణ్యవంతులై ప్రజోపయోగ కార్యముల నిగ్రహించి దైవకార్యముల శిరసావహించి నెరవేర్చి చచ్చి బ్రతికినవారగుదురు బ్రతికిచచ్చిన వారిని గనుటకన్నా లేనిదియెంతోమేలు సంతతిలేదని పుణ్యకార్యములుచేయుట తీర్థ యాత్రలు తిరుగుట వ్రతములుచేయుట అతిధులకు అన్నమిచ్చుట ధర్మకార్యములలో పాల్గొనుట బీద కన్యలకు వరుల, వరులకు కన్యకల యిప్పించి ధనవ్యయముతాను భరించి వివాహములు చేయించుట అతిఆశ విడచుట దైవచింతనసేయుట కడకు మిగిలినది. వీదరిద్రులకో ప్రజోప యోగములగు స్కూళ్లకో, శిథిలదేవాలయాలకో, ధర్మసత్రములకో, యిచ్చి ధర్మాత్ము లనిపించుకొందురు. అనిపించుకొని కన్ను మూయుదురు ఇది శ్రేష్ఠము మరికొందరు. స్వీకారమని దత్తని తెచ్చిపెట్టి అనేక మయిన చిక్కులకులోనైవారిని అనేకమయిన బాధలపెట్టుతూ భావవిభేదములతో రెంటెకు-చెడిన రేవడనయితినంటూ దుఃఖపెట్టి దుఃఖపడుతూ పాపము మూటగట్టు కొని ఆశాపిశాచము వెంటబెట్టుకొని అంతరిస్తారు. వంశనాశన వస్తుసామగ్రిలో బడ బానలమున్నదని యెవరూ తెలుసుకొనలేదు తిరిగీవంశనాశనమో ధనవ్యయమో వున్నదని అప్రయోజకులు అవినీతులు ఆచోటపుట్టి అన్యాయ కార్యక్రమములకై సప్తవ్యసనములకై ధనము హతమౌతుందని యెరుగరు పుణ్యకార్యములుచేసి పలు వురతో పూజ్యులనిపించుకొని కనుమూస్తే తిరిగీవచ్చువేళకు కావలసినంతా వుంటుందని చెప్పువారు చేయువారులేరు. యిల్లెటములో కొంతవిలువగలదుగాని స్వీకారములో ఛీకారమే అయినా వారితోమనకెందుకు శాస్త్రజ్ఞులు జ్యోతి శాస్త్రజ్ఞుల యిష్టం వారియిష్టం.

ఆ॥ కడుపుబదరగాగ కొడుకులగనుకంటె
తల్లికొకడెచాలు బల్లిదుండు
త్రిదశగణముగన్న యదితిగానుపుదీర
జిన్నిమేటిపడుగు గన్నయట్లు॥

అన్నారు తల్లికన్యాత్వము పాడుచేసుకొని రక్తమునాశముచేసుకొని అస్తులు వస్తులుపడి కన్నఅవస్థలకులోనై అప్రయోజకుల కనుటన్నా దైవముతో చెప్పకొని

తగుసన్నాహములు చేసుకొని ప్రయత్న పూర్వకముగా కష్టమనక నియమబద్ధమై అదితి వామనుని గన్నట్లు దేవకి కృష్ణుని గన్నట్లు కౌసల్య రాముని గన్నట్లు అంజనీదేవి హనుమంతుని గన్నట్లు అంతవెనక్కుపోవు టెందుకు లోకమాన్య గంగాధరతిలక్, గాంధి, జవహర్‌లాల్, రాజేంద్రప్రసాదు, రాధాకృష్ణ, రాజగోపాలచార్యులు, సుభాసుబోసు, భగవత్ సింగ్ మొదలగు రాచకార్య ధురంధరులు శివాజీ, రాణాప్రతాపసింహ మొదలగు మతోద్ధారకులు దేశోద్ధారకులు యెందరో వున్నారుచూడు అట్టివారిని కంపేచాలదా తలిదండ్రులపేరు సార్థకముకాదా పేరుప్రఖ్యాతి యీలోకములో యెంతకాలముండునో అంతకాలము స్వర్గలోక సుఖమువున్నదన్నారే యిట్టి మహాత్ముల యిట్టి వీరుల యిట్టిమేధావుల యిట్టిరాచతంత్రజ్ఞుల యిట్టికార్యధురంధరుల కనుటకు తల్లులు యెన్నిజన్మలు తపస్సు చేసినారో ఏమో యిట్టి జగజ్జట్టీల కొడుకులుగా గని శాశ్వతకీర్తిని గడించవలయునన్న సామాన్యమా సాధ్వీమతల్లులు కన్నులు తెరచితే సాధ్యమే సాధ్యము కానిదేదీలేదు తల్లిపిల్లకు దినచర్య దినచర్యకుతగ్గ విధానములు షట్కర్మాచరణ దానికికావలసిన మంత్రతంత్ర సామగ్రియిచ్చి చక్కగా తయారుచేసిన వాటెబలముతో మంచిభర్తను మంచిపుత్రపుత్రికలను సర్వసౌభాగ్యములను సమకూర్చుకొని పుట్టినింటిని, మెట్టినింటిని, స్వర్గలోకము పొలిమేరదాటువరకు నెట్టగలదు. అషట్కర్మ సాధనలనేర్పు షాధ్వీమణులు వెనుకపడినారు వారువెనుక పడినమేమున్నామని వృద్ధనారీమణులు నిలచి కన్నులు తెరచి స్త్రీలువెనుక పడకూడదని తలచి పరోపకారార్థ మిదంశరీర మని పదిమంది పిల్లలనయినా తయారుచేసి చేసినపుణ్యము చిత్రగుప్త బ్యాంకిలో పెట్టుకొని భారతనారీ మహత్తు విపత్తుల పాలయినదని కన్నతల్లులకు కన్నెపడుచులకు చేయూతనొసగి ప్రతిస్త్రీని తిరిగిమేల్కొల్పి పాశ్చాత్యపశున్యాయ ప్రవర్తనా పిశాచముల పొలిమేర గెట్టువరకు మెడబట్టి నెట్టవలె వీరనారులని పతివ్రతలని ప్రతిభావంతులని పాశ్చాత్య దేశములు పల్కిమెచ్చవలె అట్లచేయవలె నన్నది కరుణ.

కరుణా యీవృద్ధనారులు పనిపాటాలేనప్పుడు ప్రక్కయింటివారివో, యెదురింటివారివో, గృహచ్ఛిద్రముల హరికథా కాలక్షేపముగా చెప్పుచుంటారుగాని మంచీ, చెడ్డాచెప్పి మనిషిని నియమబద్ధుగా తయారుచేస్తామనరు యింకపడుచు పిల్లలో ఆ సినీమాబాగున్నది. యీ సినీమాబాగున్నదని కాలక్షేపము చేస్తారుగాని వృత్తినో భక్తినో, వకరికొకరు చెప్పుకొని బాగుపడదామనిగాని భవిష్యత్తులో ముందుకువస్తా

మనిగాని తలంపరు పెద్దవారు పిన్నవారికి ఏవయినా పాటలో పద్యాలో స్తోత్రాలో ధర్మాలో నీతులో నియమాలో వ్రతాలోచెప్పి పుణ్యము కట్టుకుందాము జీవితాంతమువరకు నన్ను జ్ఞాపకము చేసుకుంటూ వుంటారు. వారూ వకరికిచెప్పుతారు వకరితోవకరు అభివృద్ధికి వస్తారని తలంచనే తలంచరు. వింటే అవినీతులు భోధించే కులటలు గలరన్నది రాగమ్మ.

రాగమ్మా పాపము పుణ్యము అనేపట్టాలపై బుద్ధి, ధృతి, నీతి, శ్రద్ధ, సన్నతి, క్షమ, సత్యం, దైవం. అనే యీ యెనిమిది చక్రాల యింజను ప్రజలు కూర్చున్న బండిని లాగుతూవుండినది. ఆచక్రాలు కాలానుగుణ్యముగా సొట్టతిరిగి పట్టాలు వైతొలగి క్రిందపడినది యింజను డ్రైవర్లుగా పనిచేసే కవి పౌరాణికుడు గాయకుడు నటకుని తిరిగీ చక్రాలను చక్కచేసుకొని యింజన్ను పట్టాలపైకియెత్తి కవిముందు పౌరాణికుడు వెనుకకూర్చొని మధ్యలో గాయకుని నటకుని కూర్చుండబెట్టి ముందు విధముగానడిపితే బండిమొదట మామూలుతో పరుగిడుతుంది. ప్రజలు గమ్యస్థానముచేరుతారు బండి స్వస్థానము చేరుతుందిగాని ముసలమ్మలు పెద్దమ్మలు చెప్పితే కుదురుతుందా మనమంటామిగాని కవి వ్రాయవలె పౌరాణికుడు చెప్పవలె గాయకుడుపాడవలె నటకుడు ఆడవలె ప్రజలు వినవలె బాగుపడవలె, సంఘాలుగాని, సామ్రాజ్యాలుగాని, రాజ్యనిబంధనలుగాని, ప్రజలకట్టివేయలేవు. ప్రజలహృదయాలు ధర్మపంథాలో నడిపించుయోధులు, కవులు, పౌరాణికులు గాయకులు నటకులు వీరుకండ్లు తెరువాల బాగుపడాల నన్నది కరుణ.

యివన్నీ ఏమయినాగానీ యీ వరకట్నంతో కన్నతలిదండ్రుల కన్నీరు కాలువలై పారుతూవున్నదమ్మా అన్నది రాగమ్మ.

రాగమ్మా వరకట్నం పూరకపోతుందా గృహిణి త్రిదేవి సాధనా సంపత్తితో శక్తినార్జించి పిల్లలకునేర్పిన వారూ, శక్తినార్జించుకొని బుద్ధిబలముతో దైవబలముతో పేదయనక గుణవంతుని రూపవంతుని కట్నములేకుండా వరునిచేపట్టి కాపురము చక్కగా చేసుకొగలనని దలిదండ్రులపై వూమకొనక హైఆర్పుకొనక విసుగుచెందక కాలమును యెదిరించి ధైర్యోత్సాహములతో ముందుకు నడువగలనను కన్యలు తలిదండ్రులతో కట్నమిప్పించి తాళికట్టించుకొని కాళ్లుపట్టుటకన్నా పేదయై తన్ను ప్రేమించిన యువకునికి ధర్మమని రేయింబవళ్లు రెక్కలువిరచి కష్టముచేసి కాపుర

ముచేస్తూ సత్సంతతినిగని సత్కీర్తిని బడయవలయు ననుకన్యలు కాలమును కాలదన్ని దారిద్ర్యమును యెదిరించి కట్టుకున్నవాణ్ణి కన్నబిడ్డల కాపాడగలననుధీమాగల కన్నెపడుచులు, నేను పుట్టకమునుపే భర్త పుట్టివుండును. బ్రహ్మ వ్రాసి వుండును, భయమెందుకని రూపయౌవన వయోగుణములుగల పేదవానినే చేపట్టి సుఖపెట్టి పుణ్యమార్జించి కీర్తి నిలబెట్టవలెనను కన్యలు జీవన్యాయమును బంధుధర్మమును విడువక హెచ్చుతగ్గుల పాటించక ధర్మమే జయమని బంధుప్రేమ వీడుట భావ్యముగాదని సాహసించి చేసుకొని ప్రఖ్యాతివహింతునను కన్నెపడుచులు కలిగిననాడు ముందుకువచ్చి నిలచిననాడు తలిదండ్రులు అట్టివారికి సహాయమిచ్చిననాడు పేదకేయిచ్చి కన్యాదానముచేసి పుణ్యమార్జింప వలయునని తలిదండ్రులు దలచునాడు లంచమిచ్చి తాళిగట్టించుకోనని కన్యలు పట్టుపట్టిననాడు బీదబ్రహ్మచారికి కన్యాదానము చేసియిచ్చి పుణ్యమార్జించుకొని మరుజన్మకు రూపవిభ్రమ కళానైపుణ్యవతిని భార్యగాబడయవలెనను తలంపుగల పురుషులు ముందుకువచ్చిననాడు కట్నమురాశా పిశాచము కూలిపోగలదు అన్నది కరుణ.

కరుణా స్త్రీలవల్ల అంత ఘనకార్యము కాగలదంటావా అంతశక్తి స్త్రీ లలో ఉన్నదంటావా అబలలే అంతత్యాగము చేస్తారా అన్నది రాగమ్మ.

రాగమ్మ స్త్రీలు అబల లంటావా స్త్రీలోవున్న శక్తినిగమనించలేవా ప్రేమ అను మహాశక్తి నొక దాని సృజించి బ్రహ్మ స్త్రీలయందువుంచి యెనుబదినాల్గు కోట్ల జీవరాసుల దానితో బంధించినాడు స్త్రీయందా పరాశక్తి పదిలముగా వున్నది. ప్రేమ శక్తితో పురుషులను పరాశక్తితో పరబ్రహ్మను బంధించి రాజ్యము లేలవచ్చును. రాజ్యములు కూల్చవచ్చును. ధనికుని పరిదరి దామోదరునిగా మార్చవచ్చును. దరిద్ర్యుని ధరణీపతిగ మేలింపవచ్చును సూర్యుని అటు నిల్పవచ్చును అర్ధరాత్రి పొద్దు పొడిపింప వచ్చును. రాగమ్మ స్త్రీలు యీరెండుశక్తులు తెలిసి ప్రయోగించిననాడు అటో శక్తులకన్నా హైడ్రోజిన్లకన్నా మిన్నై మిన్నూ మన్నూ ఏకముచేయ గలవు యింకొకటి విను శ్రీమహావిష్ణువు దేవదానవులకు అమృతము పంచియిచ్చుటకు తనకు శక్తిలేక యోచించి కుదరదని స్త్రీ రూపము యెత్తి దానవులనోట తాల్చినమన్నుగొట్టి దేవతలకు కడుపునింపి ఉక్కు రక్కసులనుండి జారుకున్నాడు స్త్రీలో ఇంతపదిలమయిన శక్తి వున్నదని చాటిననాడు. రాగమ్మా గమనించి వర్తించిన ఆశయములు పండించు కొనవచ్చును భగవంతుని బంధించవచ్చును పర్వ

సౌఖ్యములు పొందవచ్చును లోకముతో శబాస్ అనిపించు కొనవచ్చును స్త్రీలాశక్తి నార్జించిననాడే ప్రపంచము స్త్రీ లాశక్తి ప్రయోగించిననాడె కలి కాలిరుగుట కట్నం వైతొలగుట క్షామము లడుగంటుట అన్నది కరుణ.

కరుణా స్త్రీ ప్రేమలో అంతశక్తి వున్నదంటావా ప్రేమకు అందరూ లోపడుతారంటావా అన్నది రాగమ్మ.

ఓహో స్త్రీ మాయాశక్తిలో గలశక్తిని గమనించలేదే.

ఆ॥ కాముగెలువవచ్చు కాలారిగావచ్చు
మృత్యు జయముగలిగి మెరయవచ్చు
నాడు వారిచూపు టంపరగెలువంగ
వశముగాదు త్రిపురవైరికైన॥

అన్నారు శ్రీ మహావిష్ణువెత్తిన మోహినీ అవతారమునుచూచి మూడు కన్నులవాడు ముల్లోకముల చూచువాడు యిద్దరాండ్లవాడు కంటిమంటతో కాము కాల్చినవాడు పరమయోగి జోగి అయిన శివుడు ఆమెనుచూచి శివమెక్కి చిందులు త్రొక్కి వెన్నంటి పరుగెత్తి తాళలేక తహతహపడి మోకాళ్లవరకు మోకాళ్లనుంచి పాదములవరకు యింకేమి చెప్పుదులే అట్లుచేసుకొని పరాభవపడి చెంపలు వేసుకొని తలవంచినాడట కంటిమంటతో కాముని కాల్చినవాడు కంటితళుకు నోర్వలేక పోయినాడంటే యీమానవులు నిల్వగలరా అందరూ మానవప్రవరులే ననుకున్నావా యీశక్తికిలో పడనివారు చక్రబుద్ధులు అట్టివారు లక్షలలో కోట్లలో వకరుండ వచ్చునన్నది కరుణ.

అంతలో పెండ్లియింటివారు పదిమంది ముత్తయిదువులు వచ్చిరి కమల లేచిపోయి రెండుచాపలు తెచ్చివేసెను. కూర్చుండుడమ్మా అని శాంతమ్మ చెప్పగా అందరు కూర్చొనిరి.

అమ్మా పిల్లకు కొంచెము చెప్పు పేరుయిప్పటి ఆడవాండ్లు. వేగి లేచినతోడనే కాఫీ వేసి మగవారు పలుతోముట ఆలశ్యమయిన ముందుగనే తాము తాగి వస్తే ఉడుకుకాఫీ లేకుంటే చల్లటి కాఫీ మళ్లీమళ్లీ నేను కాచేదాన్నికాదు అంటూకసువూడ్చ ప్రారంభము చేసేవారు సబ్బులు రిబ్బన్లు పౌడర్లు స్నోలు జాకెట్లు బాడీలు పిన్నులు

రంగురంగుల చీరలు కుచ్చుళ్లు వాసన నూనెలు వాలుజడలు కీలుజడలు రెండుజడలు చుట్టు జడలు వింత వింతల గంట్లజడలు కొత్త కొత్త గంట్లు నిడిపావట పక్కపావట వింత వింత సొత్తులతో కాలము గడుపుతూ స్త్రీ ధర్మము గృహ నిర్వాహణ పతి భక్తి నిత్యకృత్య కార్యకలాపముల సాధనలు మరచి కాలము గడుపు విలాస వతులు విజ్ఞాన మతులు పిల్లలకు పాలిచ్చిన దేహము చెడునను ప్రజ్ఞామతులు పిల్లల పెరవారికి చాకనిచ్చు దయా మతులు తనకర్మమని తెలుసుకొనక తాళిగట్టిన వానిపైబడి యేడ్చి తూర్పారబట్టు అమృతమయులు ఆస్తి పాస్తులు తిని తినక కూడ బెట్టి కన్నకొడుకును పెంచి పెద్దచేసి తనచేతికి వట్టియిచ్చిన అత్త మామల అడి పోయు సిద్ధహస్తులు పెద్దవారను భావమువిడచి పెద్దరికాలుచేయుచూ పెరటిలో అత్తను బోకులు తోమనను ధర్మదేవతలు అణుమాత్రమేని పాపభీతిలేని అతివా శిరోమణులు ఏమిచెప్పిననూ పెడచెవినిబెట్టి యీసడించి ఇది అతివా లోకమను సుజ్ఞానమతులు తన అధర్మము అన్యాయము అట్టిగట్టుకొని వుండగా పెరవారికి తప్పొప్పుల తీర్పుదిద్దు ధర్మస్వరూపిణులు సినీమారంగముల చూచి చిందులు త్రొక్కుచూ నడచు కామినీ భామినీమణులు వినవే కొంచెము చెప్పుతల్లీ నీవు చాలా మంచిదానవుగా నున్నావు అన్నది రాగమ్మ.

అక్కడ కూర్చున్న వారందరూ వకరి మొగము వకరు చూచి నవ్వుకు న్నారు కరుణ అందరినీచూచి రాగమ్మదిక్కుమళ్ళి చిరునగవుతో రాగమ్మ యిది కలియుగము యీయుగములో సర్వమానవులు ధర్మశూన్యులై నడువవలసిన విధి కాబట్టి వీరూ అదే మార్గముబట్టి నడచు అభ్యాస మయివున్నది. వారిదేమితప్పు గృహిణీ ధర్మ ముపదేశించు సాధ్వీమతల్లులు అడుగంటుటయే దీనికి కారణము అట్టి మహాతల్లులు ప్రజలు నంతవరకు యీకామినీ కాముక ప్రపంచ భూతమంత రించదు సప్తవ్యసనములలో యీకామినీ వ్యసనము మహా ఘోరమయినది దీనికి లోనై తపోధనులుకూడా తారుమారయినారు దీనికి హృదయములో చోటిచ్చిన అంతమగునంతవరకు పోనివ్వక సాధించును యిప్పటి యీవేషములు మొగవారిని మొదలంట నశింపుచేయు మృత్యు స్వరూపములు యీవేషములతో చిరునగవులతో వాల్గంటిచూపులతో చేసైగలతో కంటిరెప్పలార్చుటతో కనుసోగ లెగరవేయుటతో నాల్కను త్రిప్పుటతో పైటను మార్చుటతో తొలగించుటతో చేతులెత్తి నీల్గుటతో వస్త్రము వైతొలగించుటతో తలగోకుటతో పెదవు లప్పళించుటతో పదే పదే పరికించి

కుచ కుంభములంటుటతో కులుకులతో తళుకులతో బెళుకులతో చలోక్తులగు మాటలతో యువతులు తిరుగుటవల్ల యువకులు చూచుటవల్ల వారికి మన్మధావస్థలు మనసులో గలిగి కామినీ భూతము సోకి మనసుతో ఆ పాదమస్తకము వ్యాప్తిజెంది అనేక మయిన సంకల్పములతో నిద్రబట్టకుండుట నిద్రపట్టక పోవుటచే ఉష్ణమై ఉష్ణాధిక్యముతో మనశ్చాంచల్యము గలుగుట దానితో అరుచి అకాలభోజనము దానితో చిక్కిపోవుట కార్యకలాపములపై జీవితముపై విసుగువుట్టుట దానితో శిగ్గు విడచుట చిత్త విభ్రమము గలుగుట మూర్ఛనొందుట మరణమునకు యత్నించుట ప్రాణములు గోల్పోవుట జరుగును. వారి నారీతిగా చేసిన పాపము వీరి నాక్రమించి శ్వేతప్రదరము రక్త ప్రదరము రజఃశూల కుక్షిశూల గలిగించును. వీరినీ మోహినీ భూతము సోకి అట్టిబాధకే లోనుగా చేయును. భూతమని పీడయని దయ్యమని వలుపాట్లకు లోనుచేయును. యిదితెలియక వారినిబాధించి వీరుబాధపడుదురు. పురుషులకడ స్త్రీలు కడు జాగరూకతతో మెలగవలయు లేకున్న పాపము తప్పదు స్త్రీ లోకమునకు మాతృవు శత్రువు అన్నారు మాతృ రూపము మరుగైన శత్రురూపమై లోకమునే చెరచును. స్త్రీ శృంగారించుకొని వీధికి పోని రోజులవి శృంగారించుకొనక వీధికి పోని రోజులివి అప్పటి శృంగారము తన పతిప్రీతికొరకు యిప్పటి శృంగారము విలువకొరకు డాంబికము కొరకు స్త్రీలు రూపము దాచుకొని తిరుగవలయు నేల చూస్తూ మాటాడవలయు అణిగి మణిగి సంచరించవలయు విచ్చలవిడిగా తలయెత్తి తిరుగరాదు. యువకులుండు చోట్లలో లౌకికముగా నటించవలయును. అకారణముగా పెద్దగా పలువురు వినునట్లు నవ్వరాదు శబ్దమగునట్లు నడువరాదు ప్రక్కచూపులతో చూడరాదు అన్నారు పెద్దలు పురుషులున్నచోట స్త్రీలు లౌకికముగా నడుచుకొనవలయును పురుషులు స్త్రీని గన్నతోనే ఆ పాదమస్తకమువరకు యెంత పెద్దవారయినా చూడకమానరు వారి కంటికి యెక్కడా చోటివ్వరాదు అట్లు చోటిచ్చిన వర్ణనచేయ మనసు పరుగిడును దాన పాపము సంభవించును యిరువుర పాప మావహించును ఉత్తమ లక్షణాలు గలస్త్రీ తల్లితో సంస్కారమయిన స్త్రీ అట్లు నటించదు తల్లి ననిపించదు మగనిపేరు రప్పించదు.

సీ॥ నిలయము పాటించి నిర్మలదేహయై శృంగారమే బ్రొద్దుజేయ వలయు
సత్య ప్రియాలాప చతురయై ప్రాణేశు చిత్తంబు ప్రేమరంజింపవలయు
దాక్షిణ్య సంతోష ధర్మమేధామల దైవతమని ప్రియు దలపవలయు
నాథుడే పద్ధతి నడుచునా పద్ధతి నడచి పద్బంధుల నడపవలయు॥

ఆ॥ మార్దవమున పతికి మజ్జన భోజన శయనపానరతుల జరపవలయు
విభుడు పతితుడయిన వెలదిపాతివ్రత్య మహిమ పుణ్యుజేసి మనుపవలయు॥

అన్నది శాస్త్రము ఆరీతిగానే ఆచరణ విధానము నవలంబించి నటించు స్త్రీలు యిందు అంయ ఖ్యాతి వహింతురంమరు. యిందుకు వక నిదర్శనము చెప్పుతా విను.

మా వూళ్లో వకఅమ్మాయి యస్. యస్. యల్. సీ. చదువుకున్నది చాలా అందముగా వుంటుంది. అద్దాలువేస్తుంది చూచేవారికి మరింతసేపు చూస్తామనిపిస్తుంది ఆపిల్లకు అత్తా మామా మాత్రమే వున్నారు వారుకూడా మంచివారు మంచివంశము వారికి మాగాణి భూమి కావలసినంతా వున్నది. పిల్లవాడు స్ఫురద్రూపి మంచివాడు శాంతవాది తల్లీతండ్రీ గురువు దైవము అనేభావము గలవాడు. బంధు మిత్రులలో గౌరవింప బడువాడు బి. యస్. సీ. చదువుకున్నాడు హైస్కూల్ లో పనిచేస్తాడు. కట్నము ఆశకూడా లేకుండా పిల్లబాగున్నదను తలంపుతో పెండ్లి చేసుకున్నాడు పిల్లవాని తల్లి దండ్రీ సొంత గ్రామములో భూములు చూచుకుంటూ వుంటారు పిల్ల వాడు హోటలు భోజనము తింటూ టవున్లో వుంటాడు ఆ పిల్లవాడు భార్యను పిలు చుకొని టవునుకుపోయి బాడుగయింట్లోదిగి యింక మనకాపురము సాగిస్తాము యింటికి వంటకు ఏమికావలయునో చూడమన్నాడు అతనిపేరు రాము. ఆమెపేరు సరోజ.

దేనికండీ అన్నది సరోజ
వంటకు యింటికి అన్నాడు రాము
వంటమనిషి యెవరున్నారు ఇక్కడ అన్నది సరోజ
యెవరున్నారు మనమే అన్నాడు రాము
మీకు వంటచేసేది తెలుసునా అన్నది సరోజ
నీకు తెలియదా అన్నాడు రాము

నాకురాదండీ మా యింటిదగ్గర ఇద్దరు వదినెగార్లు మాఅమ్మ వున్నది వారే వంటచేసేవారు నేను బడికిపోయి రావడము వార్తా పత్రికలు చదువడము నవ ల్సులు ఏవయినా చూడడము తప్ప మరేమీ చేసేదాననుగాను వారునాకు చెప్పే

వారుగారు మా యింటికి నేనొక్కదాననే ఆడబిడ్డను అన్నది సరోజ.

రాముకు గుండె గుభేలు మన్నది. తలతిరిగినది తలవంచుకొని మీ యమ్మ కొద్దిపాటైనా పనులు నేర్పలేదా అన్నాడు రాము.

పనులు చేసే యింటికే యివ్వకూడదు అని మా అమ్మ పట్టు. మా నాన్న అంతే అయినా మా నాన్న అప్పుడప్పుడూ వంట చేసేది నేర్చుకొమ్మనేవాడు నేను చెవున పెట్టుకునే దాన్నిగాను అన్నది సరోజ.

అయితే యిప్పుడు మనకు భోజనముయెట్లా అన్నాడు రాము.

హోటలు లేదా అన్నది సరోజ.

హోటలు భోజనము యిద్దరికి యెంత అవుతుందని మనము యేపరిస్థితిలో వున్నామని తెలుసుకొనక మాట్లాడిన యెట్ల అన్నాడు రాము.

హోటలు గాకపోయిన వంటమనిషిని యెవరినైనా చూడండీ అన్నదిసరోజ.

మనిషి జీతము భోజనము యేమవుతుందని అన్నాడు రాము.

ఏమయినాగానీ దానికివెరచితేకాపురమెట్లు భోజనముకావద్దా అన్నది సరోజ.

మనకు వచ్చే జీతములో యింటి బాడుగపోను భోజనఖర్చులకే సరిపోవును వంట మనిషికి యెక్కడ నుండీ తెచ్చి యియ్యవలయు నంటావు అన్నాడు రాము.

యింటికి వ్రాస్తామూ మామగారు పంపరూ అన్నది సరోజ.

మీ మామగారా మా మామగారా, మీ మామగారు పంపరు వారు భూమిప యిన ఆధారపడేవారు మితముగాఖర్చుపెట్టేవారు భూ జీవనులుయెక్కువఖర్చుపెట్టరు. మితముగానడుస్తారు. మా మామగారైన వకీలు చురాదాయము యెక్కువగా వచ్చుచుండును అందులో మూలధనముకూడా వున్నట్లున్నది అట్లయితే జాబువ్రాయి పంపుతాడు అన్నాడురాము.

నేనుయెందుకు వ్రాస్తాను మానాన్న యెందుకిస్తాడు వరకట్నం క్రింద మూడువేలు డబ్బు యిచ్చినాడు ముప్పైతులాల బంగారునగలు నాకు చేయించినాడు పెండ్లితానే చేయించినాడు ఇదిచాలక యింకా జాబువ్రాస్తే మూతిమీద కొడ్తాడు అత్తగారు పంపడము అల్లుడుగారు తినడము మంచి మాటేనన్నది సరోజ.

మీ మామగారికి వ్రాస్తే నీయార్జన యిద్దరి అన్నానికి చాలదా చాలకపోయిన యింటికిరాండీ అంటాడు. యింటికి పోయిన సాటివారిలో అవమానముగా వుండును మరెట్ల చేస్తామంటావు అన్నాడు రాము.

యెట్లచేసేది ముందు తెలియదా ఈ జీతములో కాపురము చేసేది కష్టము పెండ్లి చేసుకోరాదు చేసుకుంటే బీదింటి అమ్మాయిని చేసుకోవలె పెద్దింటి అమ్మాయినిచేసుకుంటే కష్టాలుంటాయి కాపురము సాగదు అని మీ బియ్యే చెప్పలేదా అన్నది సరోజ.

ఔను పెండ్లిమాట మాట్లాడే టప్పుడే మీకు వంట వాడున్నాడాలేడా యిద్దరికి చాలేటంత జీతము వస్తుందాలేదా ఆస్తీ పాస్తు లెంతమాత్రము ఆలినిచాకే అంతస్తు వున్నదాలేదా అని మీ ఎస్‌ఎల్‌సీ యెందుకు అడక్కూడదు అన్నాడు రాము.

మా నాన్న అడిగి నాడనుకున్నాను మీ పరిస్థితులు చూడడానికి నేను రాక పోవడమేతప్పు మానాన్న అమ్మపైన ఆధారపడడమే పొరపాటు అన్నది సరోజ.

ఔనూ మానాన్న అమ్మ చెప్పినారు చదువుకున్నపిల్ల వద్దురా చట్టాలు అడుగుతుంది. యెగనీల్గుతుంది అందులో వకీలు యింట్లో అమ్మాయి లా బాగాతెలిసి వుంటుంది వాటముతప్పితే రంగమెక్కించుతుంది బీదలింట్లో చేసుకోమన్నారు. నేను పొరబడినాను ఆడదీ అంటే వంట వచ్చివుండదా అనుకున్నాను. మగవారిని వక విధముగా గౌరవిస్తుంది కుటుంబము బాగా రక్షించు కుంటుంది. లవుకికముగా నటిస్తుంది పదిమందిలో గౌరవము తెస్తుంది తెలిసి తిరుగుతుంది పదివిషయాలుతెలిసివుంటాయి సుఖపెడ్తుంది చదువుకున్న స్త్రీఅయితే అని అనుకున్నాను. లామాట్లాడుతుంది. మగవాణ్ణి వంటచేయ మంటుంది కుర్చీలో కూర్చొని చలాయిస్తుంది అనుకొనలేదు వంటచేసేది మీ అమ్మాయికి వస్తుందారాదా చెప్పినమాట వింటుందాలేదా అని ముందు అడుగక పోవుట నాపొరపాటే అయినా యింకొక యేర్పాటుచేసుకుందాము పదహైదు రోజులు ఒక ముసలామెను వంటనేర్పేటందుకు పిలుచుకుందాము యేవోకొన్ని పదార్థములు నేర్చుకుంటే అటుపైని వకటొకటే వస్తూవుంటాయి అన్నాడు రాము.

నన్ను నేర్చుకొమ్మంటారా ఆ మసి అంతా పూసుకొని వేషము వేసుకొమ్మంటారా అందుకేనా చదువుకున్నదాన్ని పెండ్లిచేసు కొనడము అంతశక్తిలేని వాడవు నన్నేల చేసుకొంటివి వంటచేయను వడ్డించను బోకులు తోమను నీళ్లుచేదను నీళ్లు మోయను యేదోవక పశువును తెచ్చుకోకూడదు. నాలాంటి విలాసవతిని విద్యావతిని

యెందుకు తెచ్చుకొంటివి నేనొక పెద్దవాడనని పెద్ద బియ్యేనని హ్యాట్, బూట్, సూట్ వేసుకొని చేతులూస్తూ సూట్ జోబీలో చేతులు దూర్చుకొని పచారుచేస్తూ మూడువేలు కట్నము తీసుకున్నారే పెండ్లాన్ని కూర్చుండబెట్టి చాకలేరూ చాకలేని దద్దమ్మలకు కట్నమెందుకు అని మూతిప్రక్కకు త్రిప్పుకున్నది సరోజ.

మీనాన్న యిచ్చిన కట్నం మాబాకీలకు యిచ్చుకోలేదు పెండ్లి ఖర్చులకు వాడుకోలేదు చదివిన చదువులో జమకట్టుకోలేదు మానాన్న బాకీయిచ్చి బాండునూ వ్రాయించు కోలేదు కట్నంమేము అడిగివుండిన తప్పక కావలెనని యిరవై వేలు యిచ్చువారు దండిగా వుండినారు అడిగివుండిన మీ నాన్నకూడా యిచ్చివుండేవాడు మేము అడుగలేదు అడుగకనే మూడువేలు మీనాన్న బలవంతంచేసి యిచ్చినాడు అట్లనే తెచ్చి నీపేరుతో బ్యాంకిలో వేసినాను నీఅంచునే పెట్టుకో మాకెందుకు నీ సొత్తుఅని రాము బ్యాంకీ క్యాష్ బుక్కు పెట్టెనుంచీ తెచ్చి చూపించియిచ్చి యిరువురము పొరపాటు పడినాము. యెవరము సర్దుకొనుటకు వీలులేని పరిస్థితులేర్పడినవి దీర్ఘముగా ఆలోచిస్తేగాని యీ పరిస్థితి కుదురుపడదు. యిప్పటికి హోటలుకు పోయి భోజనముతెస్తా కూర్చొనివుండుమని చెప్పి హోటలకుపోయి యిద్దరికి భోజనము తెచ్చినాడు యిద్దరు భోంచేసినారు వెంటనే రాము స్కూలుకు పోయి నాలుగు రోజులు సెలవు తీసుకొని వచ్చినాడు సాయంత్రమయినది యిరువురి ఆలోచన తెగలేదు వకరితో వకరు మాటాడలేదు రాము కడకు ఆలోచించి తెంచుకొనెను. సామ దాన భేద దండనో పాయముల నాల్గిటలో దేని నుపయోగముచేస్తే బాగుంటుంది సామముతో దానముతో కుదురునట్లు తోచుటలేదు. దెబ్బతో పాయముతో సాధించిన ప్రేమనశించి నమ్మకముచెడి జీవితాంతము వరకు దుఃఖ భాజనమగును. భేదనో పాయమే యుక్తమని భావించి బజారుకుపోయెను. సరోజ యిట్లని ఆలోచించెను యీ నాడులొంగి వంటచేయ ప్రారంభించిన జీవితాంతమువరకు చేయవలసినట్లే వుండును. యెట్లనయినా వంటమనిషిని ఏర్పాటు చేయువరకు పట్టువుండవలసినదే. ఆడదిపుట్టినది మొగవానికి లొంగి నడియింటిలో కూర్చొని చెప్పిన దంతా చేసుకుంటూ బిడ్డల కంటూ యంత్రములాగా వుండవలసినదేనా స్వాతంత్ర్యములేదా స్వాతంత్ర్యములేని జీవితము యెందుకు స్త్రీ లేకున్న పురుషుడు మాత్రము ఏమిచేయగలడు అర్ధము హక్కులు స్త్రీ లకు యెందుకులేవు అనే నవీనస్వాత్ర ధర్మములు అనంతముగా హృదయావేదనలో గల్గుచున్నవిగాని ధైర్యము మాత్రము నిలువలేదు

మొండికి అస్లే పడుకొని వుండెను. అంతలో రాము బజారునుండి పూలు పండ్లు తెచ్చి పెట్టెను.

సరోజ వాటెను కన్నెత్తియైనా చూడక పండుకొనే వుండెను. రాము తిరిగి హోటలుకు పోయి యిద్దరికి భోజనము పట్టుకవచ్చి నీళ్లుతెచ్చి భోంచేతువు లెమ్మనెను. నాకు అక్కరలేదు మీరు భోంచేయండి అన్నది అట్లైతే నాకూ అక్కర లేదు అయినా యిద్దరమూ పస్తుండుటకన్నా భోంచేసి ఏదోవక భావాన్ని తేల్చు కొందాము లేలెమ్మని చేయిపట్టిలేపి నీళ్లుపెట్టి విస్తరలేసి యిరువురకు అన్నము వడ్డించి కూర్చొమ్మని తానూ కూర్చొని భోంచేసి తనవిస్తర తానుతీసివేసి శుద్ధిపెట్టి వచ్చి దూరదూరముగా రెండుపరుపులువేసి కూర్చొన్నాడు. సరోజ భోంచేసి వచ్చి పరుపుపైన కూర్చున్నది. రాము సరోజను శాంతముతో చూస్తూ చిరునగవుతో నాకుజీతము యెక్కువయిన దనుక నీవు తల్లిగారి యింటివద్దనే వుండు యింకొక యాభైరూపాయలు జీతము యెక్కువయిన తరువాత జాబువ్రాస్తాను అన్ని ఏర్పాట్లు చేసిపెట్టాను. అంతవరకు ఓపిక పట్టి నీవు అక్కడనేవుండుట మంచిది అయిదు గంటలకే బస్సు వున్నది పోదాము విడిచిపెట్టి వస్తాను యిష్టములేని సంసారము చాలా కష్టముగా వుండును పండుకోమని వాకిలివేసి పండుకున్నాడు.

సరోజ మనస్సు పరిపరి విధముల పరుగిడ జొచ్చెను. వుండి వంట చేసేదా లేకపోయి తల్లిగారియింటవుండేదా రెండేదార్లు గాన వచ్చుచున్నవి ఏదారి మేలు అని యోచించిన యోచనకు అందలేదు వకప్రక్క కోపము, వకప్రక్క దుఃఖము వచ్చుచుండ యిటు అటు పోర్లుతూ వుండెను.

రాముకూ నిద్ర పట్టలేదు శాంతముతో జయించవలెనా. కోపముతో సాధించవలెనా అనే ఆలోచనలు సాగుతూ వుండగా అయిదు గంటలు కొట్టెను రాములేచి ముఖ ప్రక్షాళనం చేసుకొని సరోజా లేచి ముఖము కడుక్కొని గుడ్డలు పెట్టెలో పెట్టుకో కాఫీ తీసుకొని వస్తాను కాఫీతాగి బస్సుకు పోదాము అని హోట లుకు పోయినాడు.

సరోజ లేచి దినకృత్యములు తీర్చుకొని నెత్తిదువ్వి బొట్టుపెట్టి గుడ్డలు పెట్టెలో పెట్టుకొని ఆలోచించుచుండెను అంతలో రాము యిడ్లీ కాఫీ తెచ్చియిచ్చి జాగ్రతగాకానీ టయమయినదని డబ్బు పర్సు జేబీలో పెట్టుకొన్నాడు. అంతలో బండివచ్చి యింటిముందు నిల్చింది సరోజా యిడ్లీతిని కాఫీత్రాగిందికానీ హృదయా వేదనమాత్రము ఆగలేదు. పోవలెనా వుండవలెనా యిక్కడేవుండి సాధించవలెనా

వూరికి పోయి సాధించి లొంగదీయవలెనా అనే ఆలోచనలు అమితముగా వచ్చుచుండెను. రాము పెట్టె తీసుకపోయి బండిలోపెట్టి బీగము చేతికి తీసుకొనెను. సరోజపోయి బండియెక్కెను రాము యింటికి బీగమువేసి బండిలో కూర్చొనెను. బండి రెండు నిమిషములలో బస్‌స్టాండు చేరెను బండిదిగి బస్సులో కూర్చున్నారు వంటిగంట కంతా వూరుచేరినది బస్‌స్టాండులో బండి మాట్లాడి కూర్చొమ్మని పూలు పండ్లు కావలసినన్ని తెచ్చి బండిలోపెట్టి వకీలు భుజంగరావు యింటి దగ్గరకు పోనియవయ్యా అని బండివానికి చెప్పి సరోజనుచూచి నాకుపనివున్నది కొంచెము చూచుకొని వస్తాను నీవు పొ అన్నాడు సరోజ పలుకలేదు బండిపోయి భుజంగరావు యింటి ముందునిల్చినది సరోజ బండీదిగెను బండివాడు పెట్టె పూలుపండ్లు యింటిలో పెట్టి వెళ్లిపోయెను సరోజ పోయి కాళ్లుకడుగుకొని మంచినీరు త్రాగి వచ్చికూర్చొనెను తల్లీ వదినెగారు అన్నగారు తండ్రీ దిగ్భ్రమ వహించి చూచుచుండిరి తల్లి సరోజ దగ్గరకు పోయి ఏమమ్మా నిన్ననేమేము వచ్చినాము వెంటనే వచ్చినావు ఏమిజరినది ఆయనయేడీ అన్నది బస్సుస్టాండు వరకువచ్చినాడు అక్కడ వున్నాడో పోయినాడో అన్నది సరోజ దీనవదనముతో నేలచూస్తూ కంటినీరు పెట్టినది తల్లి దగ్గర కూర్చొని ఏమిజరిగినదో చెప్పు అమ్మా అని తొందర పెట్టగా అక్కడ జరిగినదంతా చెప్పినది అందరూ ఆశ్చర్య పడినారు భుజంగరావు సరోజను చూస్తూ కాదమ్మా వంటచేయక యింటి పనులు చేయక తినికూర్చుండ వలయుననియా నీయిష్టము ఇది ఏమి బుద్ధి మీయమ్మ చేయడములేదా మీవదినెగారు చేయడములేదా మగవాడు ఉద్యోగము చేయ పోవడములేదా కష్టపడక డబ్బు పూరకవస్తుందా మగవాడు కష్టపడినపుడు ఆడదియెందుకు కష్టపడకూడదు కట్టుకున్నవానికి కాచిపోయక కన్నబిడ్డలకు పాలీయక సాకకవున్న ఆడదివుండీ ఏమిమేలు లేకఏమికీడు అని అంటూవుండగా సరోజ కంటనీరు పెట్టుతూ తుడుచుకుంటూ మంచిచోటు వెతకియిచ్చినావు లేప్పా ఏమీలేని వాళ్లు మంచిమంచి చోట్లువెతకి యిస్తూవుంటే మీరు కావలసీ వెతకి నన్ను యిచ్చినారు చాలు నావిధి యిట్లున్నది మీరేమి జేయగలరన్నది సరోజ.

నీకు లోకజ్ఞానము తక్కువై వున్నదమ్మా నీకన్నా మేలు చోటుయెవ్వరికీలేదు నలభైయెకరాలు తరిభూమి వున్నది. ఆభూమి రెండులక్షల వెలజేస్తుంది రెండులక్షలు వకఉద్యోగి సంపాదించ వలెనంటే యెంతకష్టమోచూడు ఉద్యోగము నమ్మక ఇంతన్నా యెవ్వరున్నారమ్మా మీయన్నగారికి పదివేలు వంతుల వరదక్షిణ మిచ్చినారు బి ఎ చదువుకున్నారు. ఇంట్లోపని చేయడములేదా నీవు చదువుకున్నదేమి

మయినదికాదు. వుండవచ్చు పోవచ్చు యిది స్థిరాస్తి నమ్మకమయినది ఇంత ఆస్తికి అతను వక్కడు బాగా చదువుకున్నాడు మంచిరూపము మంచిశాంతము బుద్ధిమంతుడు. ఇంతకన్నా యెవ్వడున్నారమ్మా మీయన్నగారికి పదివేలు వంతున వరదక్షిణ యిచ్చినారు. బి. ఎ. చదువుకున్నారు ఇంట్లోపని చేయడములేదా నీవు చదువుకున్న దేమి వదినెగారు చదువుకున్నదేమో చూడు. మన ఆస్తేమి మనమేమి నీకన్నా వంతు ప్రకారము చూస్తే నీ అన్నగారే తక్కువ రూపములో ఆస్తిలో సమస్తమయిన విషయాలలో మీ అన్నగారికన్నా రాము పెద్దవాడే ముందు పోయిన శ్రీరామునకి రాముడు తీసికోనివాడు. అట్టివాడు మొగవాడు దొరికితే యింకావులిస్తే ఏమి చేయాలనమ్మా. దుర్మార్గుడయితే నిన్ను తెచ్చి యిక్కడ పడచిపెట్టిపోతాడా. నిర్బంధించి కన్నవస్థలాపెట్టి యీకంటి నీరు ఆకంటికి, ఆకంటి నీరు యీకంటికి పోసి ముప్పుతిప్పలాపెట్టి ముచ్చెరువుల నీళ్లు తాగింపునుగాని అమ్మగారి యింటిదగ్గర విడచిపెట్టుతా కూర్చుందువుపో అని యింటివరకూవచ్చి పడచిపోతాడా యీవరకే సన్నయెముకలు విరిగి వుండును. అట్టివినయ విధేయతలు శాంత సుస్వభావము, రూపము, ఆస్తిపాస్తులు, విద్య వుండువారు అరుదు. అట్టివాడు మన యింటికి అల్లుడౌట మన అదృష్టము. భార్యకు తగ్గ భర్త, భర్తకు తగ్గ భార్య కుదిరినారు అని మేము సంతోషించినాము అందరు అనుకున్నారు. వచ్చిన అదృష్టాన్ని కాలదన్ని చేతులార చెరచుకొను వారున్నారేమమ్మా. లోకమును పరిశీలించ నక్కరలేదా పరమ కాఠిన్యుల కట్టుకున్నవారు, మూఢుల మెడనవేసుకున్నవారు, అష్టకష్టాలతోనున్న దరిద్రులకు యిల్లాలయినవారు, రెండోపెండ్లి మూడోపెండ్లి నాల్గు అయిదు పెండ్లిండ్లకు పోయి సంసారముచేయువారు సప్తవ్యసనములతోపాడై పోవువారికి గృహిణి అయినవారు, కుంటి కురూపులచేసుకున్నవారు, రేయింబవళ్లు రెక్కలు విరచి కష్టముచేసి కట్టుకున్నవానినే సాకువారు, తినతిండిలేక కట్టబట్టలేక కటకట పడువానికి భార్యయై భరింపరాని కష్టాలు పడువారు వుంటే సర్వ విషయములలో అందరి కన్నా మిన్నగా నున్నవాడే నచ్చకపోయిన యిక మన్మథునే తేవలయునని లెక్చరిస్తూ వున్నది విని, అన్నగారు వదినెగారు ముసిముసి నగవులు నగుతూ యింట్లో తిరుగుతూ వుండిరి తల్లి కూర్చొని వినుచుండెను అంతలో గుమాస్తా సుబ్బారావువచ్చి సార్ జాబు అని భుజంగరావుగారి చేతికి యిచ్చెను యెవరిచ్చిరి అని అనసూయమ్మ అడుగగా అల్లుడు రామారావుగారు యిచ్చి బస్సులో వూరికిపోయిరమ్మా అన్నాడు సుబ్బారావు అందరు వింతగా నున్నదే అన్నారు. భుజంగరావు జాబువిప్పి చదువ

నారంభించెను. అందరు నిలిచి వినుచుండిరి సరోజ తలవంచుకొని కూర్చొనివుండెను.

బ్రహ్మశ్రీ వేదమూర్తులగు మామగారి దివ్యసన్నిధానమునకు 'రాము అనంత దండ ప్రణామములొనర్చి విన్నవించుకున్న విజ్ఞప్తి. ఉభయకుశలోపరి సాంప్రదం.

మా అత్తగారు, మీరువచ్చిన మరునటిరోజు మేమిరువురము గుంటూరికి పోయి తిమి స్కూల్ లో జాయిన్‌కావడమునకు అక్కడ జరిగిన విషయాములన్నీ మీకుమార్తె వల్ల తెలిసివుండును. నాకు వచ్చే నూరురూపాయల జీతములో వంటమనిషిని పెట్ట వలయుననిన అకష్ట నిష్ఠూరములు తమకే తెలియును చాలని దానికి మానాన్నగారిని అడుగుటకు నాకుయిష్టములేదు. ఉద్యోగమే వద్దన్నారు కావలెనని పట్టుపట్టివచ్చిచేరి యిప్పుడు డబ్బుతక్కువగానున్నదని తిరిగీ వారిని అడుగుటకన్నా ఉద్యోగము విడచు టయే మంచిది. వివాహము చేసుకొని కొంతకాలము వంటరిగా నుండిన గృహము చిక్కులు మనోవ్యాకులతలు లేకుండునని తలంచి ఉద్యోగములో చేరితిని. యిప్పుడు జీతము చాలదని విడచుటకు యిష్టములేదు. యింకా కొన్ని డిగ్రీలుపొంది. జీతము హెచ్చు చేసుకొని వంటవానిని యేర్పాటు చేసివచ్చి పిలుచుక పోతాను. అంతవరకు తమరు శాంతముతో కుమార్తెను చూడవలయును. నాజీతములో అర్ధము పంపుతూ వుంటాను తమరు అన్యథా భావింపవద్దు తమసంతతిలో నన్నూ వక్కనిగా భావించ ప్రార్థన సర్వమూ తెలిసిన తమకు యెక్కువలు వ్రాయ నశక్తుడను క్షేమములు పదే పదే తెల్పకోరుచున్నాను. బావగారికి అక్కగారికి అత్తగారికి నావందన శతములు తెల్ప ప్రార్థన.

యింతే అనేకదండ ప్రణామములు. ఇట్లు

భవత్ ఆశీర్వచనాభిలాషి.

చి॥ రాము

**24—3—61**

అని చదివి నిర్విణ్ణుడయినాడు భుజంగరావు. అందరూ కంటనీరు పెట్టినారు యెక్కడవారు అక్కడపోయినారు సరోజకు మాత్రము హృదయము కరుగలేదు. కానీ మాతమనేభావము గట్టిగా నున్నది లేచి పోయి స్నానముచేసి సింగారించుకొని వంటరూముకు పోయినది వదినె శివప్రియ అన్నము వడ్డించినది. భోంచేసి చేయి తుడుచుకుంటూ పైమిద్దెకుపోయి మంచముపై పండుకొనెను. యింటిలో యెవరూ

మాట్లాడలేము. మంచివానికి మంచిభార్య దొరుకదు. మంచి దానికి మంచిమగడు దొరుకడు. యిది దైవచిద్విలాసమో లేక వారి పాపమో అని అనుకుంటూవుండి పోయినారు. మరుసటిరోజు సాయంత్రము మనసు సరిగాలేక సినీమాకు పోయింది సరోజ. భుజంగరావు సాయంత్రము ఆరుగంటలకు యింటికివచ్చి సరోజ యెక్కడ అన్నాడు యెవరూఏమి పలుకలేదు. అంతలో భార్య అనసూయమ్మవచ్చి అది విన దండీ దానిపట్టు దానిదేను. సినీమాకువద్దంటే పోయింది అన్నది.

భుజంగరావుకు వళ్లుచెరామని నీవుయింక కరుణపెడచి బాగా తగిలేటట్లు మాట్లాడు దీనికి తలతగిలితేగాని సంసారానికిపోదు. ఆయన మంచివాడు యీదయ్యో ము ఆయనకు దాపురించినది అంటూ కోడండ్లనుపిలిచి మీరుదాన్ని అభిమానించవద్దు మాట్లాడవద్దు అన్నమువేయవద్దు దానికి తలతగిలేటట్లు ఏటుమాట పోటుమాట బాగ తగిలించండి. అప్పటికి తెలివొస్తుంది అన్నాడు భుజంగరావు. కోడండ్లు శివప్రియ, హరిప్రియ మామగారిని అత్తగారిని చూస్తూ మామా మేము అంటే బాగుంటుందా అన్నారు. కొంపకే అపకీర్తి తెస్తుంటే బాగుంటుందా యెట్లో వారికితెచ్చి వాటిస్తే బరువు తగ్గుతుంది. లేకున్న అవమానముతప్పదు అందరి తలలూ వంచుకొన చేస్తుంది అన్నాడు భుజంగరావు.

నేనేమిచేతునండీ యెంతోచెప్పి చూస్తూవున్నాను వంటరాకపోతే పదినాళ్లు వదినెగారితో వంటరూములో వుండినేర్చుకోపోమ్మా అంటేజీవితములో తానువంటే చేయదంట వకేపట్టు ఏమిచేయమంటారు అన్నది అనసూయమ్మ. అంతలో కుమార్లు శివప్రసాద్ హరిప్రసాద్ వచ్చి అమ్మా యింక యీమెతో అవమానుషములు ప్రారంభమవుతాయి. వకటియని ఏమీ అనక పెంచిన దోషము యింతవరకూ వచ్చి నదని తెలుసుకో లేకుంటే వంటరిగా సినీమాకు పోతుందా ఆడది సిగ్గూ బిడియము విడిచితే గాడిద అవుతుందన్నారు. తను చెడినదిగాక వరుల చెరుస్తుంది యిట్లాటివారి వల్ల మూడుకావురాలు చెడుతాయి అన్నాదు యీలాంటి భ్రష్టులు తయారయ్యే లోకము యీగతికి వచ్చినది. అంటూ భోజనమునకుపోయి భోంజేసివచ్చి యెక్కడి వారక్కడ పడుకున్నారు తల్లి మాత్రము యెదురుచూస్తూ వాకిట దగ్గరపడుకున్నది సినీమా విడువగానే సరోజ వచ్చి వాకిలితట్టినది అమ్మవిని పోయి వాకిలి తీసినది సరోజ కాళ్లు చేతులు కడుగుకొని వచ్చి తల్లివడ్డించగా భోంచేసి పోయిపడుకున్నది. యిట్ల వక మూడుమాసములు గడచెను. బుద్ధిమాత్రము కుదరలేదు నెలనెలకు తప్ప

కుండా నలభైరూపాయలు మణీయార్డరు రాము చేస్తాడు. తీసుకుంటుంది పూలకు సినీమాలకు పౌడర్లకు స్నోలకు యీలాంటి విలాసవస్తువులకు ఖర్చుపెట్టుకుంటూ వుంటుంది యెవరినీ ఏమీ లెక్కపెట్టదు యిదిచూచి ఇంట్లోవారికందరికీ అసూయ పెరిగింది బైటవారికందరికీ హేళనయింది. భుజంగరావు నన్ను వకనాడు పిల్చి కరుణా నీవైనా చెప్పరాదా సరోజకు అన్నాడు. వూరకచెప్పితే వింటుందేమండీ యిట్లాటివారికి యింటబైట మంగళహారతి అయితేగాని కాదండీ అన్నాను. అయితే ఏమిచేయమంటావు అన్నాడు. ఏమీచేయవద్దు అనసూయమ్మను అమ్మగారియింటికి పొమ్మనండీ నేను ప్రక్కయింటి సీతమ్మ యిక్కడకొట్లాట పెట్టుకుంటాము ఆమాటలు ఆమెకు శూలాలై తగులుకుంటాయి అంతటితో దిమ్మువిడుస్తుంది అన్నాను. అట్లయితే యిప్పుడే పొమ్మంటాను అని భుజంగరావు లోపలికిపోయి భార్యతోచెప్పినాడు ఆమెవచ్చి కరుణా యెట్లనో వకట్ల పుణ్యముకట్టుకోతల్లీ. యిప్పుడే పోతానని తనతల్లిగారియింటికి పోయినది. నేను పోయి సీతమ్మతోచెప్పగా ఆయమనవ్వి బాగా పన్నినావే పన్నకమంటూ సరేనన్నది కొంతసేపటికి నేను ముందువచ్చి కూర్చున్నాను సరోజ కుర్చీలోకూర్చొని కాళ్లూచుతూ నవల్సు చదువుచుండెను. కోడండ్లు ఆకువేసుకుంటూ ప్రక్కన కూర్చొనివున్నారు మగవారుముగ్గురు కోర్టుకు పోయినారు మధ్యాహ్నము వేసవికాలము అంతలో సీతమ్మవస్తూ శివా యీప్రక్కయింటి పాడుముండ వుందా అన్నది.

వున్నానురావే ముసలిముప్పున కులికే సీతాకోకచిలుకా అన్నాను.

ఏమి కులుకుతూవున్నానే భర్తలేని భ్రష్టముండాఅంటూ వచ్చికూర్చున్నది నేనుకూర్చొమ్మని చూడవే హరీ దీనికిదెబ్బైఏండ్లువున్నవి ఆపూలు ఆసొత్తులు ఆబొట్టు ఆచీర ఆపాపట ఆఅందము అచందము అన్నీ పదహారుఏండ్ల పడుచుపిల్లకుకూడాలేవు పడుచులాగ ముస్తాబై యెట్లవచ్చిందో కొడుకులకూ కూతుళ్లకు పిల్లలు వాళ్లకు పిల్లలు అయ్యేకాలమువచ్చింది దీనికెందుకే యింతకులుకు అతగానికి యెనభైఏండ్లువున్నాయి యింకా కుసకుసమాట్లాడడం వేషమువేయడం ప్రక్కలోకూర్చోవడము పంక్తికి లించడం దీనిశిగ్గు బొగ్గైపోను అన్నాను. సీతమ్మ తోకతొక్కిన పాములాగ అందుకున్నది.

ఓసి పుట్టుముండా నీకేమితెలుసునే లోకజ్ఞానము, లోకసుఖము, మొగనిసుఖ మంటే బొత్తిగాయెరుగవు. ముందుజన్మలో మొగనినెత్తిన మొద్దులుపెట్టి ప్రక్క రుచులు మరగి సంసారమంటే యెరుగక సానివేషమువేసుకొని అత్తా మామను లెక్కపెట్టక ఆత్మీయుల గౌరవము మంటగలిపి చిన్న పెద్దలను న్యాయములేక కడుపే కైలాసమని కన్నబిడ్డల కాలదన్ని దేవుడు దైవము అనే చింతలేక ధర్మాధర్మముల యెగరజిమ్మి పాపపుణ్యముల పారదోలి తిరిగినందుకు ఫలము అనుభవించుచున్నావే చేసినంత మహాదేవ. అని చేసుకున్న మగడు తీరిపోయె అత్తమామలు మరదులు బావగారు వారిసంతతి అసలేలేదు తల్లిగారివంక వురువేలేరు వంటి పక్షివై నాయను వారులేక దుర్బలమై దుఃఖించుచుంటివి సంపాదించి పెట్టువారులేక చచ్చుచుంటివి, పురుషసుఖములేక కుళ్లుచుంటివి, నీలాంటి పాపజీవి ననుకొంటివా కావలసినంతా పుణ్యముచేసినానే పురాణదంపతుల్లాగ భార్యాభర్తలము వున్నామే పూర్వపుణ్యము చేసినామే పుట్టుముండా అన్నది సీతమ్మ.

ఓసి ముసలితొత్తా భారతమంత చదివితివిగదే నేనంటే ముందుజన్మలో పాపముచేసినదాననే యిప్పుడు మగడుండీ వస్తుపండుకునే బుద్ధిలేని పలుగాకులు ఆప్త బంధువులుండి కలహించుకొని వకరికొకరు కానిమూఢులు అసూయా పరగ్రస్తులై యెప్పుడూ వకరినియేడ్పించు దుర్నయులు మగనినెత్తిన మంటబెట్టి వూరుదిరుగు పాపచిత్తులు అహర్నిశము అత్తమామలతో మగనితో కలహించు కలహాకంఠులు మగనితోపనిలేక కడుపారదిని కావలసినంత శృంగారించుకొని సినిమాలకుపోయి వచ్చి కంటార నిదురపోవు పాపిముండలు యెందరో వుండగా నన్నంటావేమే ముసలిబసివి అన్నాను.

సరోజ యీమాటలకు రోషగించుకొని మీరిద్దరు యిక్కడనుంచీ లేచిపోయి మీయింటిదగ్గర పోట్లాడుకోండి అని మూతి ప్రక్కకుతిప్పుకున్నది. ఆమాటలవిను పించుకొనక సీతమ్మ మొగడు చచ్చినముండా మోడమిడిచిన యెండా బహు తీవ్రత అన్నారు అన్నది సీతమ్మ.

అట్లకాదే మొగునివిడిచినముండా మోడమిడిచినయెండా వుండగా మొగుడు చచ్చినముండతోనేమే అన్నాను అమాట సరోజకు శూలమైతగిలి తలదిరిగినది ముఖ మువంచినది అదిచూచి నేను శివప్రియా యీముసలిబడవకు యింకా సాయంత్ర

మయ్యేవేళకు పూలుతెప్పిస్తాడు ఆముసలిమొగడు. యిది బాగాశింగారించుకొని మొగని ముందు ముసలి కులుకు చూపిస్తుంది తానే స్నానముచేయిస్తుంది తానే అన్నముపెట్టు తుంది తానే కాళ్లుపట్టుతుంది తానేపరుపువేస్తుంది. విసురుతుంది తాంబూలందంచి యిస్తుంది శిగరేటు ముట్టించియిస్తుంది దుస్తులుతెచ్చి తగిలించుతుంది నిద్రపుచ్చుతుంది కాఫీమొదలగు ఆహారములు తానేస్వయముగా ముందుగా తెచ్చియిస్తుంది. ఆపిచారణ ఆప్రేమ అయానందము చెప్పతరముగాదే వగసిబడవలే చేయక పశువులై పోతూ వుంటే యీముసలితొత్తు కెక్కడనుంచీ వచ్చిందోప్రేమ చెప్పనలవిగాదే అన్నాను. అదివిని సీతమ్మ రోషమువచ్చినదానిలాగ ఓసిదరిద్రపుముండ నీవు ముందుపుణ్యము చేసి వుంటేగదేమే మొగనికి సపర్యలుచేసి చేయించుకునేది ముందుచేయక యిప్పుడు చేయకవున్న సన్యాసివి. నీకుయీగతులుగాక వేరే శుభాలెట్లువచ్చునే నేను ముందూ పుణ్యముచేసినాను యిప్పుడుచేయుచున్నాను. చేయబోతాను మొగవాడు పెండ్లిచేసు కొని ఆడదాన్నితెచ్చుకున్నది యెందుకనుకున్నావు కష్టపడి సంపాదించి తెచ్చి పీట వేసి కూర్చుండబెట్టి పెట్టేటందుకనుకున్నావా ముండా. అట్లకాదు సహధర్మిణీ అని స్త్రీకిపేరున్నది. సంపాదించి తెచ్చినదాన్ని సక్రమముగా శక్తిని గమనించి సవరించి సపర్యచేయుచు సంతోషపెట్టి సంతోషపడుతూ కష్టములకు తోడ్పడుతూ ఏ అను మానములకు ఆస్పదమివ్వక నాభార్యకన్నా మంచిది లేదను ప్రేమ గలుగునట్లు చేసుకొని మరులుగలిగించి ప్రేమించి ప్రేమించ చేసుకొన్నచో స్వర్గలోకముగా భూలోకము మారును లేకున్నయిల్లు నరకలోకముగాను యిల్లాలు యముడుగాను బిడ్డలు యమదూతలుగాను యిల్లాలికోపము మృత్యువుగాను అగుపడును. స్త్రీ యొక్క ప్రేమే మగవారికి మరులు మందు. స్త్రీచేయు పరిచర్యప్రేమలే అతని వుత్సాహమునకు ఆర్జనకు మూలము స్త్రీ యిదితెలియక శ్వేతవరాహములాగ తిని మైథున నిద్రాహారములే నిజమని తైతక్కలాడు జీవులు నీలాగ తయారౌదురే మోపీ. తొంబైయేండ్ల పర్యంతము ఆలుమొగలువుండి పురాణదంపతుల్లాగ ఆనంద పడుటకు నీయింటిమట్టిగడ్డ అనుకున్నావా స్త్రీ పెనిమిటికి అండగానిల్చి కష్టముల కోర్చి తనకడుపుదాచుకొని పెనిమిటి కడుపుచూచుకొని కడుపునపుట్టిన బిడ్డలకన్నా మిన్నగాచూస్తూ కంటికిరెప్పలాగ కాపాడుతూ మనోవాక్కాయ కర్మలానమ్మి పతి ప్రాణమే తనప్రాణమని షట్కర్మల మరువక కాలమునడపిన సుమంగలియై నావలె చాలాకాలము బ్రతుకుతుంది సర్వసుఖముల పొందుతుంది సత్సంతతిని కంటుంది లక్ష్మీదేవివలె మునిమనవలతో జీవించుతుంది దంపతీసమేతముగా స్వర్గలోకము

చేరుతుంది పెద్దలమాట పెడచెవినిబెట్టి తుంటరియైన ఏకాకి నీవలె అధఃపతన మౌతుంది సతీపతులు ఒకరికష్టములు ఒకరుపంచుకొని ఒకరిసుఖము ఒకరికిస్తూ ఒకరినొకరు నమ్మి ధర్మచ్యుతులుగాక నడచిన ధర్మదేవత వారినాశీర్వదించును దేవతాసములై చాలాకాలము జీవించి పుణ్యలోకమున కేగుదురు యెదుటివారిని చూచి అయినా నేర్చుకో అన్నది సీతమ్మ.

ఓసేయ్ ముసలితొత్తా మొగుడుండే మొద్దుముండలు వినక చచ్చిపోతూవుంటే మొగుడుచచ్చినదానికీ ధర్మాలెందుకే ఆపీఠిలోచెప్పు చెవుల్లేనివి వింటాయి అన్నాను.

చెవులుండేటివి వినక చెడిపోతూవుంటే చెవులులేనివి ఏమివింటాయే సన్యాసీ అన్నది సీతమ్మ.

ఓసి ముసలిముండా నీతో యెవరుమాట్లాడుతారు పోవే భాగూతం చదువు తావు అన్నాను.

ఆమాటకు కోపమువచ్చిన దానిలాగ సీతమ్మ కండ్లురిమి ఓసి పాపీ ముసలాయనవుండగా ముండనెట్లౌతానే త్రిదేవుల ముప్పురిని త్రిసంధ్యల సేవిస్తూ సుమంగలీత్వము కాపాడుమని సుమంగలినై మృతినొందవలెనని ఆమహాతల్లుల కోరుతున్నాను దుఃఖముతో విధవత్వముతో యీజీవిని వారు వుండనివ్వరు నీవలె పరమ పాపినై మిగలను ముందుజన్మలో మగని విడచినదాన్నికాను సిగ్గులేక తిరిగినదాన్నికాను మూడువిడచిన సిఖండినిగాను పుట్టినింటికి మెట్టినింటికి మంటపెట్టిన దాన్నికాను కట్టుకున్నవాణ్ణి విడచి కడికూడా చేపట్టినదాన్నికాను నాకెందుకొస్తుందే విధవత్వము కానని మాటాడుటకు నాసుమంగలీత్వము నాబహుకుటుంబము నాపతి ప్రేమ నిదర్శనము నాభార్య నాపిల్లలు అనే ఆశతో ఆర్జించి తెచ్చేమగవానికి కండ్లు కప్పితిని తెరచాటుగ ఆటలాడిన బడవాల చూడు మగడుచచ్చినది బిడ్డలులేనిది సదా రోగిది గూనిది గుడ్డిది కట్టబట్ట తినతిండి లేనిది పంటిది కురూపిదిగాపుట్టి యెట్లఅల్లాడుతున్నారో చూడు పెద్దలమాటవినక పెడచెవినిబెట్టి ధర్మాధర్మ విచక్షణజ్ఞానములేక పెరిగిన లోకకంటకులు వీరువున్ననూ లేకున్ననూ ఒకటే పశువులకూ వీరికి భేదమేలేదు అన్నది సీతమ్మ.

ఒసేయ్ ముసలీ నీమొగుడులాంటి మొగుడుదొరికితేకదేమే ఆటలాడేది అందరికీ ఆ అదృష్టము వుండబనిలేదా అన్నాను.

ఒసే బసివీ అన్నముచేస్తే అవుతుందా వూరకుంటే అవుతుందా ఆడదాని నగవులు చలాకీ విలాసము హొయలు కులుకు చమత్కారము నడక వాల్గన్నుల వైఖరి సైగలు సోయగము యింతేల స్త్రీసర్వసౌష్టవములు లాఘువములు చేసుకున్న వాని కొరకయ్యా లేక పీధినపోయే వారికొరకయ్యా యీప్రయోగము లన్నీ పురుషుని బంధించి సర్వకార్యముల నెరవేర్చుకొనుటకై భగవంతుడు స్త్రీలో సృష్టించినాడు. స్త్రీకి శక్తియిదే యీశక్తి ఆటంశక్తికన్నా బలమయినది. దీనితో రాజును పదభ్రష్టునిగా చేయవచ్చు పండితుని మతిభ్రష్టునిగా చేయవచ్చు మహావీరుని అనాదనుగా చేయవచ్చు తపస్విని తారుమారు చేయవచ్చు నూరేడుల వయోవృద్ధుని న్యూనతకు తేవచ్చు ఓ బికారీ యీశక్తి సామర్థ్యములతో వర్తిస్తూ ప్రయోగిస్తూ సేవచేస్తూ తనకింపుగానడుస్తూ తప్పటడుగువేస్తే దబాయిస్తూ నవ్విస్తూ వుంటే ఆరామచంద్రుడు యీసీతమ్మ చేతిలో కీలుబొమ్మయినాడు వూరకేకాలేదు మూతి బిగించుకోని తనశక్తిని లోన నిముడ్చుకొని యీసడించుకొని మూతితిప్పుకొని మూగిదానిలాగ బ్రతికి సచ్చినదానిలాగ పిలిచినా పలుకక బిగువుచూపి వుంటే నెత్తిన మన్నుపడివుండు కాపురము సుఖము చెల్లా చెదురైవుండు స్త్రీ పీటెవల్ల తన సుఖముతానే చెరచుకొనును. చెప్పువారులేక కొందరు రోషముతో కొందరు పట్టుదలతో కొందరు చెప్పుడు మాటలతో కొందరు బాల్యమాదిగ తల్లితో తదితరులతో సంస్కరింపబడక కొందరు చేయలేక కొందరు పుట్టుకే అట్టిదైన మతిభ్రష్టులు కొందరు అసూయా చిత్తులు కొందరు తెరచాటువారు కొందరు తెలియనివారు కొందరు సిగ్గు బిడియము గలిగి చెప్పుకొనలేక చలాకీ చూపలేక కొందరు చెడిపోవుచున్నారు. వారిని సామ దాన భేదనోపాయములతో సరిచేసుకొన వలయునుగాని చతుర్థోపాయము అపాయము. పశుప్రాయము ప్రేమనశించి దానితో సంఘ వ్యాఘ్రము ముందు జీవచ్ఛవము లవుతారు ప్రయోజనములేదు ఒసేయ్ ఏకాకీ మన బాణప్రయోగములతో మగవాని మెత్తపరచి బంధించి ఆటాడించుకుంటే ఆనంద ముండికాని వేరేతోవలన్నీ కుక్కతోక బట్టి గోదావరి యీదినట్లే ఏమే పలుగాకీ ఊకొట్టవు అన్నది సీతమ్మ.

బాణాలేమిటే బసివీ మన్మథ బాణాలా అన్నాను.

ఒసేయ్ మగనితో కాపురమేడ్చి చక్కగా తీరిన కొయ్యవయితే నీకు తెలిసి వుండునే యిటువిను.

చిరునగవులతో మెట్టెల రవళితో గాజుల గలగలతో వచ్చేమగనికి స్వాగత మిచ్చేవాయువ్యాస్త్రం.

దానికి లొంగక ముందుకువచ్చెనా

చిలుక పలుకులతో ప్రేమచూపులతో వయ్యారాలతో వ్యవహారాలతో మాట్లాడించే అగ్నేయాస్త్రం.

దానిని లెక్క పెట్టక కాలదన్నెనా.

పరిచర్యలతో ఫలహారాలతో టీ కాఫీ తను తాగిపే వాటితో గుంమ్మైపోయే ఐంద్రాస్త్రం.

దానిని యెగరజిమ్మి ముందుకునడచెనా.

అధరామృత పానంబులతో అలింగన సౌఖ్యంబులతో పరమానందము జెందించే యా బ్రహ్మాస్త్రం.

దానికిజంకక కాలుపెట్టెనా.

కుచ కుంభంబుల స్పర్శనతో చుంబన ప్రతి చుంబాదులతో మైమరపించే పాశుపతాస్త్రం.

దానికి వెరగందక వెన్నివ్వక పోయినచో.

యెనుబదినాలుగు లక్షల జీవుల యాసట పడకను, ఆడించే, పాడించే నారాయణాస్త్రం.

దానిని యెగరూడి వెనుదిరుగక వచ్చెనా.

పదములరెంటెను చేతులబట్టీ కంటినీటితో కాళ్లను తడిపీ కదలనివ్వనను శరణ్యాస్త్రం.

దీనిని కాలదన్ని పోవు మానవుడు వుండడు. పోయెనా వాడు కఠిన హృదయముగల కరకు రక్కసుడు ఇవేనే స్త్రీప్రయోగించే బాణములు. వీటెధాటికి కాలకరుడుకూడా తోకదూడించి పిక్కబలము చూపవలసినదేనే మతిభ్రష్టా అన్నది సీతమ్మ.

అతుకులువేయను అతుకులు విరచను బాగనేర్చుకున్నావు లేవే. అయినా వకీలుభార్యవూ ఆర్గ్యుమెంటు చేస్తావు వినేవాళ్లు వుండబనిలేదా యింక పోవే ముసలి దయ్యమా అన్నాను.

పోతాలేవేముండా కాఫీవేళ అయినది ముసలాయనకు కాఫీయీవలె నన్నది సీతమ్మ.

హే అదుగోచూడవే హరీ మనిషి యిక్కడున్నా మనసెక్కడుందో క్షణ కాలం చూడకుంటే కండ్లల్లో మెదులుతా డతగాడు. వసగల వడుచులే ప్రక్కల వడి పాడౌతుంటే ప్రక్క విడువనంటుందీ బక్కది ముసలికోతికి దీనికెందుకే యింతచింత అన్నాను. అంతలో సరోజ ముఖము చిన్నచేసుకొని తలవంచుకొని చిన్నగ జారు కొని పైమిద్దెకు పోయెను.

మేము వకరి ముఖము వకరు చూచుకొని నవ్వుకున్నాము.

హరిప్రియా, శివప్రియా, సీతమ్మను నన్ను చూచి బాగావన్నుకము వన్నినారే అత్తా. మాట్లడినట్లులేదు నేర్చుకొని చదివినట్లున్నది అన్నారు. అంతలో అందరము కాఫీటయమయినదని లేచి పోయినాము శుభం భూయాత్.

సరోజాపైకిపోయి మంచములో వరువుపై బోర్లపండుకొని మగని విడచినది పుట్టినింటికి మెట్టినింటికి మంటపెట్టునది మూడువిడచినది వసగల వడుచుది ఆత్మీయుల హతము చేయునది. అనే మాటలు హృదయారోదన చేయుచుండ దుఃఖమొక వంక రోషమొకప్రక్క వేధించ దిక్కుదోచక కంటనీళ్లు పెట్టుతూ ఆలోచించ సాగెను. పట్టుదల, రోషము విడచితే గాని కట్టుకున్నవారితో సుఖపడలేను నాకున్న పట్టుదల వారికున్న నాగతి అధోగతే కాగలదు. వారిహృదయము మంచిదయ్యే నెల నెలకు తప్పకుండా నలబైరూపాయలు వంపుతున్నారు. వారూ నాయట్టివారే అయివుండిన యెన్నియిక్కట్టులపాలు చేసివుందురో ప్రక్కన వరుండికూడా బలాత్కరింపక, భంగపరచక పల్లెత్తు మాటయినా అనక చేయెత్తికొట్టక యింట విడచిపోయినాడు. వారుపాపభీతి గలవారు. నేను పాపభూయిష్ఠను. నాపట్టు వది మంది వింటే చీవాట్లు. వారి పట్టువింటే పదిమందికి ఆశ్చర్యము. వారిని పురుష శ్రేష్ఠుడంటారు. నన్ను మతిభ్రష్టు నంటారు తెలుసుకోలేక నెత్తికితెచ్చుకున్నాను.

తెలిసి పొరపాటును దిద్దుకొని పోయి కాళ్ళమీద నయినాపడి కనికరము గలిగించి కలుసుకుంటేనే చిచ్చు చల్లారేది. లేకున్న నాజీవితమే పాడౌను. నేను పాడయినది గాక యిరువాగుల రెండు కుటుంబములలో చిచ్చుచెలరేగి కడకు పాడుచేసిన దాననగుదును కళంకమేర్పరచిన కటికరక్కసినగుదును.

నేను లొంగిపోవునది శత్రువుకుకాదు భర్తకు. భర్తకుభార్యలొంగి నడచుట హిందూ మతసాంప్రదాయ సిద్ధమయినది తప్పుగాదు తప్పని వప్పుకొని తగదన్ననూ కాదన్ననూ కన్నీటి తోనయినా వప్పించుకొనినచో తీరవలయునని నిర్ధారణ చేసుకొనువేళకు శివప్రియ కాఫీతీసుకొనివచ్చి చూచెను. కన్నీటికాల్వలతో తల ప్రక్కకు చేసి కనుమూసి పండుకొనివున్నది. సరోజా లేమ్మా కాఫీ యిదుగో అన్నది శివప్రియ. వద్దువదినా అన్నది సరోజా

వకరిమాటలతో ఏమమ్మా వాళ్ళపనిలేక పోట్లాడినారు పోండమ్మా అనుటకు సీతమ్మఅత్త గౌరవస్థురాలు చదువుకున్నది పెద్దది సర్వవిషయములలో సమర్థురాలు. పొమ్మనుటకు యెట్లౌతుంది లోక రామాయణము నవ్వుతూ మాట్లాడినారు అవి నీకేతగిలినవి ఏమిచేయమంటావు సరోజా. లోకములో స్త్రీలకు కాలు కదిలిస్తే తప్పు, కాలుమారిస్తే తప్పు, అందరికీ వీరిపైనే కన్నులేవమ్మా అట్లరోషము పెట్టుకొనరాదని లేవనెత్తి కాఫీగ్లాసు బలవంతముతో చేతికిచ్చి మాడీ కిందదొడ్డిలోకి పారచూచెను. సరోజను చూతువురమ్మని సైగచేసి చూపించెను. హరిప్రసాద్ హరిప్రియను వెన్నంటి చెట్లచూట్టూ పరుగెత్తించుచూ త్రిప్పుచుండెను. హరిప్రియ నవ్వుతూ చిక్కక జంపిళ్లు పెట్టుతూ దొరుకక దొరుకక కొంతసెపటికి దొరికెను. ప్రసాద్ పట్టి యెత్తుకొనిపోయి దొరుకవా చెప్పినమాట వినవాయని చెంపలుకొట్టుచూ చిలిపిచేష్టలు యెన్నోచేయుచుండెను. హరిప్రియనవ్వుతూ తళుకులు చూపుతూ ప్రసాదు చిలిపిచేష్టలకు చేతులు అడ్డుపెట్టుతూ ఫలాహారము తినిపించుచుండెను. ప్రసాదు ఫలహారము తిని నీళ్లు అన్నాడు. తెస్తానన్నది హరిప్రియ వద్దు అధరామృత పానమే చాలునంటూ వడిలోకి లాగినాడు ప్రసాదు. హరిప్రియకన్ను కిటికీపైపడి అదుగో అక్కా సరోజా అన్నది. ప్రసాదు యెగచూచినాడు. శివప్రియ సరోజప్రక్కకు సర్దుకున్నారు. అంతలో మాడీకి మరొక ప్రక్కన దొడ్డిలో అయ్యయ్యో అయ్యయ్యో అనే ఏడ్పు వినబడగా శివప్రియ ఆప్రక్కకు పోయి చూచెను. అంతలో సరోజ పోయెను ఒకాయన కాలు ముందుకు సాచివుండెను. ఒకతను కాలికట్టు విప్పి

చూచుచుండెను. ఆయమ అతన్నిచూచి అయ్యో మీచేత చేయించుకొనవలసివచ్చనే ఏమి చేతునండీ భగవంతుడు దిక్కులేనిదానికి నాకే యీ బాధపెట్టినాడు అంటూ కండ్లనీళ్లు పెట్టుకొని తుడుచుకొను చుండెను. అతను నవ్వుతూ కష్టాలు సుఖాలు రెండూ మోసే దానికేగా నిన్నుచేసుకున్నది. ఇదే హిందూ మతములో వున్న వివాహమర్మం. కష్టమువస్తే ఒకరి కొకరు సాయపడేటందుకు, సుఖం వస్తే ఆనందపడేటందుకు వివాహం అనే ముడిపెట్టినది. హిందూధర్మ, కష్టాలను సుఖాలను పంచుకుంటామని కష్టాలలో వకరి నొకరు విడువమని కన్నుపోయినా కాలుపోయినా అంగహీనములేగాక నిరంతర రోగియైన వకరినొకరము విడిపోమని పెండ్లినాడు మనము దేవుని యెదుట అగ్నియెదుట పెద్దలయెదుట ప్రమాణం చేసుకున్నాము. యీనాడు యెట్లు తప్పుతుంది. ఏల కష్టపడతావు అంటూ కాలికట్టు విప్పి కురుపును కడిగి మందువేసి కట్టుకట్టినాడు. ఆమె అతని కాళ్లమీద చేతులుపెట్టి కన్నులకద్దుకొని మీరుణముయెట్లుతీర్చేది అన్నది. అతను నవ్వుతూ యెట్లనా మంచిబుద్ధి, విజ్ఞానము, రూపము, ధర్మము, యోగముగల ఒక కుమారుని కని యివ్వ నీరుణము తీరుతుంది అన్నాడు.

అయ్యోమీకు పుత్రానందమయినా గలిగిస్తామంటే అదికూడా భగవంతుడు దూరముచేస్తూన్నాడే. ఏమిచేతునండీ యెట్లామిమ్మల సుఖపెట్ట లేకున్నానంటూ కంటనీరుపెట్టినది. అదిచూచి అతను తిక్కదానా ఏడుస్తా వెందుకే నాకొస్తే ఏడ్వాల నీకొస్తే ఏడుస్తా వెందుకే కష్టాలన్నిటాయెదిరించి నిన్నుయీసంసారాన్ని యిటు కాసినుండీ రామేశ్వరమువరకూ, రామేశ్వరమునుండీ కాసివరకు మోయగల మొగవాణ్ణివుండగా నీకెందుకే భయము. ఏడ్వవద్దు వచ్చిన కర్మలు యెప్పటికీ వుండవు ధైర్యముతో యెదయిచ్చి యెదిరించినిల్చితే చెప్పకనే పోతాయి అంటూ నవ్వుతూ యెత్తుకున్నాడు. ఆమెరెండు చేతులామెడనుచుట్టి పట్టుకున్నది. అతను యింటిలోకి యెత్తుకొనిపోయినాడు శివప్రియ సరోజనుచూచి చూచినావా సరోజా ఆనందాలకై యెత్తుకపోయేవారు మొగవారే. అగచాట్లలో యెత్తుకపోయేవారువారే వారులేక మనము ఏమిచేయలేము, యిప్పుడు ఆయన మాటాడిన మాటల విన్నావా కష్టసుఖాల యెదుర్కొమటకయ్యే వివాహం నిజము సరోజా యిరువురు తెలుసుకున్న వారు గాబట్టి కష్టములోకూడా సుఖమూప్రేమ వున్నది చూడు. వకరు తెలిసినవారు వకరు తెలియనివారూ వున్నాకూడా యింత సుఖముండదనుకుంటాను. వీరు యిద్దరూ తెలిసినవారేగాబట్టి కష్టములోకూడా సుఖమే కన్పడుతున్నది. భార్యా

భర్తలంటే యిట్లుండవలె. నీయత్తగారిదే నాకూవచ్చివుండే సరోజా సీతమ్మఅత్త పుణ్యముకట్టుకోక వుండిన సర్వనాశనమయి వుండెని చెప్పుతావిను.

మీయన్న వకనాడు తన ఆనందంకోసం నన్ను కాఫీ త్రాపమన్నాడు చేతులు న్నాయిగా త్రాగండీ అని వక చూపుచూచినాను. అట్లయితేనాకొద్దు అన్నాడు వద్ద కుంటేపొండీ అంటూ పాపము పసిపిల్లవాడు త్రాపకుంటే త్రాగలేడు కొత్తకొత్త అల వాట్లు వస్తుంటాయి అంటూ పోయినాను ఆమాటపైన త్రాగకుండా లేచిపోయినాడు నేను వచ్చిచూతుగదా కాఫీత్రాగలేదు సరేయెన్నాళ్లు వుంటాడో చూతామనుకున్నాను రెండునాళ్లు అట్లనే గడచిపోయినది పలుకరించినను పలుకలేదు పట్టుపట్టినాడు మూడవనాడు అన్నముకూడా అత్తతో పెట్టించుకున్నాడు. అదిచూచి నాకు రోషము వకప్రక్క దుఃఖము వకప్రక్కవచ్చినది. పట్టువిడచి ఆయన్ను అనుసరించాలనా పట్టునుసాధించాలనా అనే ఆలోచన మేరమీరెను ఆమధ్యాహ్నం భోంచేసి పడుకొని కంటనీరుపెడుతున్న సమయానకు సీతమ్మ అత్తవచ్చిచూచి ఎలశివా యేడుస్తున్నా వు. అనద్ని ఏమీలేదన్నాను. పొరపాటు పడుతున్నావు అది ఏమిటోచెప్పితే నేను అనుభవజ్ఞురాలను. అనుభవముచెప్పి సరిచేస్తాను చెప్పు అని బలవంతంచేసింది. దాచకుండాచెప్పినాను. ఆనాడు అయత్తచెప్పిన మాటలు యీ నాటికి మనసులో పాదుకున్నవి. నా జీవితాన్నే బాగుపరచినవి. ఆనాడు భగవంతుడు ఆమెను పం పిన్లేకున్న ఆరాత్రికి చచ్చిపోదామని నిశ్చయముచేసుకున్నాను. అంతపట్టులో ఆమె మాటవిని బాగుపడినాను. అపట్టువదలి ఆ సాయంత్రం కాఫీ తీసుకొని పోయి యివ్వ పోయినాను వద్దన్నారు నవ్వుతూ. త్రాపుతానన్నాను. యీలాంటి పట్టుయిక పట్టనని ముందు వట్టుపెట్టుకొని త్రాపితే త్రాగుతానన్నారు. నోటిదగ్గర గ్లాసువుంచి ఏమి వట్టుపెట్టుకొమ్మన్నారు అన్నారు అన్నాను. నాపై వట్టు పెట్టు కొమ్మన్నారు. మీపై వట్టుపెట్టుకొనుట మంచిదికాదు. నాసాక్షిగానని నాపైనే పెట్టుకుంటానన్నాను. ఎందుకట్లా అన్నారు. ఏనాడయినా తెలిక పొరపాటుతో పట్టుదల వస్తే ఆకష్టము నాకే కలుగవలయునుగాని మీకు తగులరాదు, తప్పు నేను చేయడం కష్టం మీకు కలుగడం భావ్యంకాదు అని వకచేత గడ్డం పట్టుకొని వకచేత గ్లాసు నోటికందించి అతి దీనతగా కంటనీరు పెట్టినాను. అదికంటచూచి మీ అన్న గ్లాసు తన చేతికి తీసుకొని నన్ను అంచుకు తీసుకొని యెందుకు ఏడుస్తావు అన్నాడు. మీరు రెండురోజులుగా కాఫీ త్రాగలేదుగా అన్నాను. త్రాగనందుకు కంటనీరు పెట్టేదానివి ఆనాడా పట్టెందుకు అన్నాడు. తెలియక పట్టుపట్టితే తెలి

సిన మీరెందుకింత సాధించినారు అన్నాను. నీలో పట్టుదల యెంతమాత్ర మున్నదో చూతమని పరీక్షించుటకు అన్నారు. తెలియనివారిని పట్టుకొని పరీక్షిస్తే సుఖముదూరము చేసుకొని వరుల దుఃఖపెట్టడమో లేక రోషముతో చావుకే తెగించి తెలియక వృథాగా చావడమో సిద్ధిస్తుంది అన్నాను. జాగ్రతలోనే తెలుసుకొని దారికి వచ్చినావే పరవాలేదు అన్నారు. సీతమ్మ అత్తవల్ల బాగుపడినాను. లేకున్న యీవేళకు నాశవాన్ని చూచి దుఃఖపడేవారు. అటు తల్లిదండ్రులూ, యిటు మిమ్ముల దుఃఖసాగరములోముంచి కలకాలము నోటిలోనంతా కరుగుతూ మిమ్ముల కరిగిస్తూ అంతర్గత పిశాచినై ఆహ్లాదిస్తూ వుండవలసినవిధి యేర్పడివుండు నన్నాను. అయితే సీతమ్మఅత్త ఉపాధ్యాయినిదై నిన్ను బ్రతికించినదన్నమాట అంటూ ముఖము ముఖములోచేర్చి చూస్తూ స్త్రీలకు కోపమూ, పట్టుదల, అసూయా, అన్యాయము, అధర్మము వుండరాదు, వుండిన అధఃపతనము చేస్తుంది. తన్నుచేసినదిగాక యితరుల కూడా బలిచేస్తుంది అని ఉపాధ్యాయిన చెప్పినదా తెలుసుకున్నావా. అని చిలిపి చేష్టలు చేస్తూ నీవు త్రాపకుండిన నేను త్రాగెదను తాగ్రిగమంటూ త్రాగపోయాడు. నేనాగ్లాసును చేతికి తీసుకొని త్రాపినాను. అర్ధము త్రాగి అర్ధాంగికి అర్ధమంటూ చేతికియిచ్చినాడు. ఆనాటినుండీ యెంతో ఆనందముగా అనుభవజ్ఞులముగా కాలము గడుపుతూ వున్నాము. పురుషుల మనసెరింగి నడచి నడిపించుకుంటే ఆనందం వుంది. అంటూ శివప్రియ మిద్దెపైనుండీ దిగిపోయెను. సరోజ రేపు తప్పక పోయేతీరవలయునని నిశ్చయము చేసుకొని గుడ్డల మడతలు వేసి పెట్టెకు పెట్టుకుంటూ నాకొరకై యెంతదుఃఖపడినాడో పాపము యీ పాపమంతా నన్నే ఆశ్రయించి బాధించును. యింక వకక్షణమయిననూ వుండకూడదు. అని గుడ్డలు పెట్టెలోపెట్టి సామానులు చిత్తులలోకి సర్దుకొని కూర్చొనెను. అంతలో ఆరుగంటలాయెను. శివప్రియ దిగిపోగానె హరిప్రియ చూచి యేమయినదన్నది. శివప్రియ నవ్వుతూ అయింది మంగళహారతి చీరలు మడతవేస్తూ వున్నట్లున్నది మామ సాయంత్రంవస్తే యేమవుతుందో నని యెవరి పనిమీద వారు పోయినారు. భుజంగరావువచ్చి సోపాలో పడక కుర్చీలో కూర్చున్నాడు. అంతలో సరోజ వచ్చి చూచి అప్పా రేపు ఉదయయే నన్ను విడచి వస్తువుపా అన్నది. భుజంగరావు సరోజను ఆశ్చర్యముగాచూస్తూ యేమమ్మా యింట్లో యేమన్నారు అంటూ శివప్రియను పిలిచి ఏమమ్మా యింట్లో యేమి జరిగినది. యీమె పోతానంటూ వున్నదే అన్నాడు.

ఔను మామా యీ కరుణ, సీతమ్మ యింత పని చేసిపెట్టినారు. వారిద్దరు నవ్వుతూ కొట్లాడడము అనుకోరాని మాటలన్నీ అనుకొనడము. అవి అన్నీవిని యీమె కోపగించుకోవడము జరిగింది. మే మేమీ అనుకొనలేదంటూ లోపలికి పోయి వకరిని వకరు చూచుకొని నవ్వుకున్నారు. భుజంగరావు కొడుకును పిలిచి యీమెను బజారుకు పిలుచుకొనిపోయి గుడ్డలు యేమికావలెనో తీసుకొనిరాపొమ్మ న్నాడు. నాకు యేమీవద్దప్పా అన్నీవున్నాయి అన్నది సరోజ. పోమ్మా తెచ్చుకోపో అన్నాడు భుజంగరావు. మొన్ననేగా తెచ్చుకున్నాను. వద్దు అన్నది సరోజ.

మీ అమ్మరానీ పోదువు అన్నాడు భుజంగరావు.

లేదు రేపు పోయి తీరవలయు. మీరు రాకపోయిన నే నే వెళ్లుతానంటూ

మిద్దెపైకి పోయెను సరోజ.

శివప్రసాద్ నవ్వుతూ నాన్నా గుడ్డలు తెమ్మంటావా అన్నాడు. తీసుక రమ్మన్నాడు భుజంగరావు. బజారుకు పోయి నాల్గు మంచి చీరెలు, యెనిమిది రవికెలు, వకజత పంచెలు, వక కండువాపంచె, చొక్కాలు నాల్గు పెకుమంచిగుడ్డ పూలు పండ్లు ఆకులు వక్కలు పచ్చి పసుపు కొమ్ములు మొదలగునవి సమస్తము తీసుకవచ్చినాడు శివప్రసాదు. శివప్రియ అన్నీ వక చిత్తిలోపెట్టి కట్టి వేసినది. ఆరాత్రి నడచెను. రాత్రి నాల్గోజాముకేలేచి కాలకృత్యములు తీర్చుకొని స్నాన ముచేసి కాఫీచేసి తండ్రిదగ్గరకు పోయి లేపినది సరోజ.

ఏమమ్మా అన్నాడు భుజంగరావు.

నాలుగున్నరగంట అయినది నాన్నా లే కాఫి త్రాగి పోదాము. బస్సు టయ మయినది అన్నది సరోజ. భుజంగరావు లేచి దినకృత్యములుతీర్చి స్నానముచేసి వచ్చినాడు. సరోజ కాఫియిచ్చినది. కాఫీత్రాగుచూ కోడండ్రు కానరాక, లేచి నారా లేదా అని పిలిచినాడు. పడకటింటినుండీ లేచివచ్చిది శివప్రియ. వెంటనే శివప్రసాదు వచ్చినాడు. జట్కాతీసురమ్మన్నాడు భుజంగరావు. శివప్రసాద్ బజా రుకుపోయినాడు. సరోజ పెట్టె పరుపు కొన్నిచిత్తులు తెచ్చి వసారాలో పెట్టెను. భుజంగరావు చొక్కావేసుకొని డబ్బుతీసుకొని బెత్తముతీసుకొని పోయి వసారాలో

నిల్చెను. యిదంతా శివప్రియచూచి ఆశ్చర్యపడినది. అంతలో బండివచ్చి నిల చెను. సామానులు తానే తీసుకొనిపోయి బండిలోపెట్టెను. కొన్ని సామానులు శివప్రసాద్ పెట్టెను. రాత్రి సీలుచేసినచిత్తిని శివప్రియ తెచ్చియివ్వగా భుజంగ రావు తీసుకొని పోయి బండియెక్కెను. సరోజ లోపలికిపోయి తల్లిపోటోకు నమ స్కరించి, వదినెగారికి, అన్నగారికి చెప్పివచ్చి బండియెక్కినది. బండికదిలి బస్సు స్టాండుకుపోగా సమయానకు బస్సువుండెను. బస్సుయెక్కి వంటిగంటకు వూరు చేరినారు. శివప్రసాదు కాఫీ తాగుతూ శివప్రియ, హరిప్రియ, హరిహరప్రసాదు తో చూచినారా,

కం॥ నయమున బాలుంద్రావరు భయమునను విషంబునైన భక్షింతురుగా
నయమెంత దోషకారియొ భయమే వుండంగవలయు భార్యలయందున్

అన్నాడు అందరు నవ్వినారు. శివప్రియ వారగంటచూస్తూ నవ్వినది. అవమాన ముగలుగుటతో యెంతబాగు పడినదో చూచితిరా, యిట్లగుట కారణము మనమిచ్చి నచనువే. చనువు పిల్లవారియందు విషప్రాయమగును అన్నాడు శివప్రసాద్.

హరిప్రియా మీబావ పద్యము విన్నావా. బాలురయందున్ పోగొట్టి భార్య లయందున్ అన్నారు. భార్యల భయపెట్టుటతోనే, భావుల్లో చెరువుల్లో, అగ్ని లో పడిచచ్చుట, విషము తినిచచ్చుట అవుతూ వుండేది. యిది తెలియదేమో నన్నది శివప్రియ.

వారు బుద్ధిలేని దద్దమ్మలు. కోపము ఉప సంహరించుకోలేని కోతులు. మొండిపట్టుతో పట్టునెగ్గకపోయెనని కడకు యేడ్చే కొయ్యలు, అప్రయోజకులు, చచ్చి సాధించేదేమిటి నయముతోనో, భయముతోనో, ప్రేమతోనో చాలుకు తెచ్చుకొని సర్వసౌఖ్యముల ననుభవింప వలయునేగాని, జీవితాన్ని నాశనము చేసు కొని యేమిచేయవలయును, యిది బుద్ధిలేనిపని నీవు మాత్రము అట్లెన్నడు చేయ వద్దు నిన్ను విడచి వక్కక్షణముకూడా నేనిక్కడ వుండలేను. అన్నాడు శివ ప్రసాదు. అందరు నవ్వుకున్నారు.

బస్సు స్టాండులోదిగి, జట్కాలో తండ్రి కూతురు ముందు వున్నయింటిదగ్గ రకుపోయి బండిదిగి విచారించగా రామారావుగారు స్కూలుకుపోయినారు అన్నారు

భుజంగరావు అదేబండిలో స్కూలుకుపోయినారు. సరోజ వసారాలో సామానులు పెట్టుకొని కూర్చొన్నది. చుట్టుపక్కల ఆడవాండ్రుచూచి యేమమ్మా రామారావుగారుగారికి యేమికావలె మీరు అన్నారు. మావారేనమ్మా అన్నది సరోజ. మీకు దేహస్థితి బాగున్నదా అమ్మా పాపము యిక్కడికి వచ్చిన మరునాడే ఏదోబాధ గలిగినదట వెంటనే వూరికి పోయినారు. ఆయనచాలా మంచివాడు. ఆలుమగలు యిద్దరు బాగవున్నారు. మంచిజత కుదిరినది అంటే యేదో వక కష్టము పెట్టివుంటాడమ్మా పాడు బ్రహ్మ అని అక్కడికి వచ్చినవారన్నారు. ఔనమ్మా, అన్నది సరోజ. నాచెడ్డ చెప్పక దాచి గౌరవమును కాపాడినాడు. ఆయన నాయట్టి తీవ్రవాదే అయివుండినా, యీపాటికి యీవీధి వారందరు యిక్కడ గుంపుచేరి వుందురు. అవమానమై తలవంచవలసి వుండును. కాపురము భిన్నమై రెండు కుటుంబములకు గుండెపై సమ్మెట దెబ్బగా వుండును. మంచివాడు గనుక అవమానము తప్పి పోయినది. యెట్లోమేలుకున్నాను. యిక కన్నుమూయను. అనుకునే సమయమునకు బండివచ్చి ఆగెను. రామారావు బండిదిగివస్తూ సరోజ ముఖము చూచెను. సరోజ చిరునవ్వునవ్వి తలవంచుకొనెను. రామారావు బీగము తీసి లోపలికి పోయెను. సామానులు తీసుకొని సరోజ భుజంగరావు లోపలికి పోయిరి రామారావు మామగారికి వకకుర్చీచూపి కూర్చొమ్మని చెప్పి పెద్ద చెంబుతో నీళ్లు తుండు పంచెతెచ్చి మామగారికి యిచ్చి మంచినీళ్ల చెంబు గ్లాసు తెచ్చి టేబిల్‌పై పెట్టెను. యింతలో సరోజ కాళ్లు ముఖము కడుగుకొని వచ్చి మంచినీళ్లు త్రాగుచుండెను. రామారావు హోటలుకు పోయెను. సరోజ వంట రూములో చూచెను. పాలు కాఫీపొడి చక్కెరవుండెను. పోయిముట్టించి కాఫీచేసి తండ్రికి యిచ్చెను. అంతలో రామారావు హోటలునుంచి రెండు క్యారియర్లు భోజనము యెత్తించుకొని వచ్చెను. సరోజ గ్లాసుతో కాఫీ తెచ్చి నవ్వుతూ రామారావుకు అందిచ్చెను. ఏమి కాఫీ చేస్తివా వరే చాలావింతగా వున్నదే మసి కాలేదా అన్నాడు. రాము మీరునిత్యమూ చేసుకుంటూ వున్నారుగా మీకుమసి అవుటలేదా నేనెందుకు చేయకూడదు అయినా చచ్చినపామును కొట్టుట మంచిదికాదు కొట్టకండీ అన్నది సరోజ.

రామారావు నవ్వుతూ గ్లాసును కడుగ పోయినాడు.

వెంటనే గ్లాసును తీసుకున్నది సరోజ.

కడుగుతాను నేనన్నాడు రాము.

ఆరోజులు మారినాయండీ క్షమించండి తప్పు చేసినాను. తప్పని గ్రహించు

కున్నాను. రోగి యిప్పుడు నీరోగి అయినది అన్నది సరోజ.

ఏమిజబ్బా అన్నాడు రాము.

అవును యిక్కడ అందరికీ మీరే చెప్పినారుగా జబ్బుగావుండి పోయినదని అంటూ నవ్వినది సరోజ.

రాముకు పరమానందమై సరోజ యెందుకో చాలా మారి పోయినావే అని నవ్వినాడు రాము.

అవును మూడు ముఖాల రాయినయినా రుద్దగా రుద్దగా చాలుకు వస్తుందిగా తమశాంతమే ననుమార్చినది యింక తమదయ నాయదృష్టము అంటూ వినమ్రతగా మాటాడినది సరోజ.

సరే బ్రతికినాము పట్టుదలా ఢాకినీభూతము పారిపోయి పాటున పడినాము అని నవ్వుతూపోయి మామగారిని భోంచేతువు రమ్మని పిలిచి ఆకువేయ పోయినాడు.

నేను వడ్డిస్తాను మీరూకూర్చొండి అన్నది సరోజ.

యిద్దరు కూర్చొండి నేనువడ్డిస్తా నన్నాడు రాము.

భుజంగరావు నవ్వుతూ మీరు కూర్చొండి సరోజ వడ్డి స్తుందన్నాడు.

సరోజ నవ్వుతూ రెండు విస్తళ్లువేసి మంచినీరు పెట్టి మీరూ కూర్చొండి అన్నది.

నేను భోంచేసినాను యింతలో మళ్లీ భోజనమా అన్నాడు రాము.

కొంచెము భోంచేయండి అంటూ చేయిపట్టి కూర్చొండబెట్ట సాగెను. అంతలో భుజంగరావు కూర్చొండి కొంచెము తీసుకోండి అన్నాడు.

సరోజ చేయివిడువక మీరు భోంచేయకపోయిన నాకూవద్దు అన్నది. సరేనని కూర్చున్నాడు రాము యిద్దరికీ వడ్డించినది సరోజ రామారావు వద్దన్నను యీ

కొంచెము యీ కొంచెమంటూ వడ్డించు చుండెను. భుజంగరావు ఆశ్చర్య పడు చుండెను. యిద్దరు భోంచేసి చేయికడుగు కున్నారు. తండ్రికి వకటువ్వాల యిచ్చి వకటువ్వాలతో రాము చేయితుడిచెను. సరోజ రాముకు చాలా వింతాయెను. రాము తెచ్చిన తమల పాకులు వక్కలు సున్నము తెచ్చి బెబులుపై పెట్టి తండ్రిని వేసు కొమ్మని తాను భోంచేయ పోయెను. పోయి రాము భోంచేసిన విస్తరలో వడ్డించు కొనుచుండెను. అది రాము చూచి ఏమి విస్తరలేదా అని పోయిచూచి ఆకుతెచ్చి యిదిగో అన్నాడు వద్దులేండీ చూచినాను అన్నది. యెంగిలి యంచు కన్నాడు నేనంతా మీయెంగిలేనని తెలుసుకున్నాను. యింక అనకండీ అన్నది నవ్వుతూ సరోజ. రాము సరోజ ప్రక్కన కూర్చొని చాలా మారినావు సరోజా యీ ట్రయినింగుకు యెక్కడ పోయివుండినావు బాగా తయారయినావే యింక యీయిల్లు స్వర్గలోకము నీవు శారదవు నేను బ్రహ్మను యింక ప్రజలు సృజింప పడుతారు అన్నాడు రాము. సరోజ చిరునవ్వు నవ్వుతూ వాల్ గన్నుల తళుకు మెరుపులాగ రాముపైపంపి ప్రజలకన్నా ముందు. ప్రజా పోషణకర్తవ్యము చూడండీ అంటూ నవ్వి తలవంచుకుని మామగారితో మాట్లాడ పోండి అన్నది. రాములేచి రైటు రైటు అంటూ వీపునతట్టి మామగారి దగ్గరకు పోయి నిలుచు కున్నాడు కూర్చోండీ అన్నాడు భుజంగరావు రాము కూర్చున్నాడు అంతలో సరోజ భోంచేసి ఆకుయెత్తి శుద్ధిపెట్టి చేయి తుడుచుకొంటూ వచ్చినది. రాము వక పిల్లవాని పిలచి యీక్వారియర్లు హోటల్లోయిచ్చి రాత్రికి ముగ్గురికి భోజనము కావలయునని నేనుచెప్పినట్లు చెప్పు అబ్బాయి అన్నాడు నేను చేస్తానువద్దనండీ బజారుకు పోయి సామానులు తీసుక రండీ అన్నది సరోజ.

వంట చేసేది వచ్చునా అన్నాడు రాము ఆమాటతో భుజంగరావు చిరునవ్వు నవ్వుతూ తలవంచుకున్నాడు.

ట్రైనింగు పోయి వచ్చినావా అన్నారుగా ట్రైనింగ్ అయినాను. మీరు యింటి సామానులు తెచ్చే ట్రయినింగు ప్రారంభించండి అన్నది సరోజ.

నేను వంటచేసేది సామానులు తెచ్చేది. నీళ్లుచేదేది. కాఫీ చేసేది. బాల్య ములోనే ట్రైనప్ అయినాను చక్కగా కావలసినవన్నీ ఆడవారి నడుగకనే తేగలను ప్రప్రథమములో చేసేవంట మీ నాన్నగారుకూడా భోంచేయవలయును. యెంత మాత్రము తయారయినావో చూడవలయునని రాము డబ్బు తీసుకొని బజారుకు

పోయెను. భుజంగరావు సరోజను చూచి సరోజా రాము యెంతశాంతవాదో చూచి తివా మహాకరయిన యెంతగలాటా చేసివుందురో, యెంత కటకట పెట్టి వుందురో, యెంతమంది మధ్యస్థము కావలసి వుండునో యేమేమి చేసివుందురో, కన్న అవస్థలు పెట్టి యీ కంటినీరు ఆకంటికి పోసివుందురు. యీతడు దైవసమానుడు. అల్లుండ్ర కున్న అప్రయోజకపు బుద్ధులు యితనిలో అణు మాత్రముకూడా లేవు అత్తమామల కన్న తలిదండ్రుల వలెను. బావమరదుల సోదరుల వలెను. వారిభార్యల సోదరీల వలెను. వారిబంధువుల తనబంధువుల వలెను. వారిగ్రామస్థుల తనగ్రామస్థుల వలెను. చూచు సహృదయుడు బుద్ధిమంతుడు. సాత్వికుడు శాంత చిత్తుడు తల్లిదండ్రులు అట్టివారే వరకట్నం మాటే తలపెట్టలేదు. కడకు నే నేమివ్వబోతే వద్దన్నారు. బలవంతముచేయగా యిది మరుజన్మకు బాకీ, బాకీ తీసుకొనుటకు యిప్పుడు మాకులేకున్నగదా పురుషుడు కన్య తలిదండ్రులకే పదిరూకలిచ్చి చేసుకొనుట ధర్మము కని, చాకి, పెద్దచేసి అనుభవించు కొమ్మని యిచ్చినవారి ఋణము తీర్చుకొనుట ధర్మముగాని కట్నము పుచ్చుకొనుట ధర్మముగాదు. పురుష శ్రేష్ఠుల లక్షణముగాదు దీనితో స్త్రీ సంతతియెక్కువ గలిగి ప్రకృతం కన్య తలిదండ్రులు పడే చిక్కులకన్నా యెక్కువ పడవలసి వచ్చు. భావ్యముకాదు వద్దన్నారు. నేను బలవంతముచేసి మీరు అడిగివుండిన యెంతో యీ వలసివుండినది. ప్రకృత కాలధర్మమునుబట్టి చంద్రునికి నూలు పోగన్నట్లు అల్లుడు ఆడబిడ్డకు యీ సంతోషకాలములో చేతిఖర్చులకుగాను మీరు పెట్టకుండా యీ మూడు వేలు యిస్తున్నాను గాని కట్నంక్రిందగాదని యిచ్చినాను. అక్కడ అందరూ బంధువులు అబ్బాకొడుకుల యిద్దరిని చూచి ఆశ్చర్య పడినారు వీళ్లనడవడికను. యోగ్యతను. అణకువను. బంధుప్రేమను చూచి ఆశ్చర్య పడనివారు వక్కరులేరు. నిగర్వులన్నారు యిప్పటికాలములో అల్లుడు అని వకగడ్డి పోచనుయిరచి అక్కడవేస్తే అది యెగిరెగిరి పడుకాలము అత్త మామల అనాథలక్రింద అప్రయోజకుల క్రింద అనామకుల క్రింద జమకట్టి లెక్కలోపెట్టని కాలము ఆలు అనగా వక విలాసవస్తువని భావించే కాలము అల్లుడనగా హరి హరాదులకన్నా మిన్న అనేకాలము యిట్టి కాలములో యింత శాంత హృదయుడు ధర్మమూర్తి అల్లుడుగా దొరుకుట మాపూర్వ జన్మ సుకృతము నీపూర్వ పుణ్యఫలము సరోజా తన్ను కన్న తలిదండ్రులు ఆలునుకన్న తలిదండ్రులు సమానులని ఆలు తనకష్ట సుఖముల అర్థము పంచుకొను అర్ధాంగి యనియు అత్తగాని బాధించి పురుష వేశ్యలాగ తెచ్చుకున్న తిరిగీ బాకీ పడుతా

మనియు వారిని బాధించిన మనల బాధించువారు వెంటనే వస్తారనియు తెలియక ధర్మచ్యుతులై సవారీతోలు చౌటబుద్ధులు యెందరో వున్నారు. అట్టివారు అత్తవారి యింటికి పోయి అధికారము చూపిన కూర్చున్న చోట్లలో స్థలపవిత్రత కొరకు నీళ్లు చల్లుతారు. అప్రయోజకుడు వచ్చెనని దుఃఖపడతారు. ఆదుఃఖము వెన్నంటి వచ్చి చిచ్చై వంశవృక్షానకుగల తల్లివేరును దహింపచేయును. యీసూక్ష్మము తెలియక అత్తవారనే అశ్వముపై కూర్చొని సవారీ చేస్తారు. ఆత్మీయులకన్నా అలివంకవారే తన సతీసుతుల కాపాడ దక్షత గలవారు. అవ్వ, తాత, మామకన్నా కనికరము తన ఆత్మీయుల కుండదని గ్రహింపలేక ముందు చూపులేక బాధిస్తారు. చేసినదంతా తన కొచ్చిన అల్లుండ్రతో చేయించు కుంటారు.

అమ్మా రాము అట్టి అప్రయోజకుడుగాడు అన్ని అందాల అన్ని చందాల చెల్లిన పురుష శ్రేష్ఠుడు యితని సుఖపెట్టిన సుఖపడెదవు యితని దుఃఖపెట్టిన పాప భూయిష్ఠవై పశుజన్మ మెత్తగలవు పోయినది పోని యికనైనా సవరించుకొని సుఖ పడు మన్నాడు భుజంగరావు.

అది అంతా వింటూవున్న సరోజ ముఖమెత్తి నాన్నను చూచి కాస్త సేపు పడు కోనాన్నా అంటూ మంచము వంచి పరుపు వేశినది భుజంగరావు పడుకున్నాడు. సరోజ లోపలికి పోయి పాత్రసామానులు సరిచూచి అన్నీ వకచోటపెట్టి పెరటి లోకిపోయి నీళ్లుచేది పోసి అన్నానికి కూరకు పాత్రలు రెండు చక్కగా తోముకొని వచ్చువేళకు రాము సర్వసామానులు తీసుకొని వచ్చెను. సరోజ అన్నియెత్తి పెట్టుచూ ట్రయినింగు బాగా అయినారే కరివేపాకు నుంచీ సర్వము తెచ్చినారు. అన్నది. ఔను భర్త అనగాఏమి గృహకర్త అనగా ఏమి సంసారమనగా ఏమి అనునవినాకు సర్వము బాగా తెలుసు ట్రయినింగు ఏనాడో అయినాను భార్య అనగాఏమి గృహిణి అనగా ఏమి సంసారి అనగాఏమి అనే విషయాలు తెలియక స్వర్గముచూపి నరకములో పారవేసినట్లు నన్ను పారవేసి మూడునెలలు ట్రైనింగుకు పోయివచ్చినావు యిప్పుడు బాగాతెలుసు కున్నావు తెల్పుకున్నావు స్త్రీ బుద్ధి హాలా హాలమునకు అమృతమునకు మధ్య విహారభూమి రాణించెనా అమృతము చిలికించును. రోషించెనా హాలాహాలము కురిపించును. అన్నారు పెద్దలు యిప్పుడు బోధపడినది. అనుభవమయినది అన్నాడు రాము.

తెలియక అమృతము హాలాహల మయినదానాడు తెలిసి హాలాహలము అమృతమయినదీనాడు యింక అమృతము హాలాహలముగ స్వర్గము నరకముగా గాకుండా దేవుని వేడుకుంటూను మిమ్మలనే నమ్ముకుంటాను. నాయిల్లని చేసు కుంటాను. అన్ని కష్టముల పంచుకుంటాను. నాసర్వము మీరే ననుకుంటాను. అని వక చిరునవ్వు నవ్వినది సరోజ.

దొండపండు వంటి పెదవులతో నాడిమీ బీజములవంటి దంత ధావళ్యముతో, కలువలలాంటి కన్నులతో, మెరుపులలాంటి కంటి తళ్కులతో, చిలుక పలుకుల వంటి పల్కులతో, నిలువు టద్దముల వంటి చెక్కిళ్లతో, పూర్ణచంద్రుని ధిక్కరించు ముఖమండలమునుండి వెల్వడు అమృత కిరణములకు సముద్రము పూర్ణిమనాడు ఉప్పొంగినట్లు రాము మనోస్సముద్రము ఉప్పొంగి చెలియలి కట్టదాటి పైబడి లాగి బాహువులమధ్యలో బిగించి విపరీతమగు అలలరాపిడితో ముంచివేసినది. ఆ చల్లగనములో బాహువుల మధ్య కనుమూసినది సరోజ.

రాము ప్రేమ జలధీ తరంగములు తండోప తండములుగా ఆపాదమస్తకము స్పర్శించి విమర్శించి తమ ఉధృతముల చూపుతూ కొంత సేపటికి తమగమ్యస్థానము చేరుకున్నవి. సరోజ అనుధృతముల ఊరవడికిసైచి తెప్పరిల్లుకొని కను విప్పి చూచినది. రాము ముఖ మండలము తనముఖ మండలముపై చల్లదనము చూపుతూనే వున్నది.

దంత ధావళ్యమునకల్లు వెల్గుతో కన్నులు మూతపడ చిరునవ్వు నవ్వుతూ లేతచిగుళ్లలాంటి మెత్తని హస్తములతో చెంపల నిమురుతూ వక్షోజములవాడి ఉరస్థలమునకు చూపుతూ తలయెగర వేయుచూ వాల్‌గన్నుల తళ్కుతో మృధు మధుర స్వరముతో మెల్లగా దొండపండు వంటి పెదములు చలింప వంట వద్దా అన్నది సరోజ.

వంటకావలె వంటమనిషీ కావలెనన్నాడు రాము.

చచ్చి బ్రతికినదాన్ని ధర్మచ్యుతులై తిరిగీ చావతన్నెదరా. ధర్మమా ధర్మమని దాపున చేరిన దారకు దాపు యివ్వరా శరణని చెంత చేరిన యిల్లాలికి శరణ్యమివ్వరా భారత భూమిలో శరణన్న శత్రువునుకూడా కాచిన వీరు లున్నారే

మీరు భరత పుత్రకులుగారా. భార్యయన భరింప తగినదని తెలియదా మనసు కరుగలేదా మీమనసును కరిగించు అంగసౌష్ఠవములు విలాసము నాలోలేదా అని గాఢాలింగనముతో భుజముపై తల వాల్చినది సరోజ.

తెలిసిన అలితో కాపురము స్వర్గతుల్యము. యింక నీతోటి లోకము నాకు నాకలోకము మాటల చాతురీ మహిమతో నన్ను ముగ్ధునిగాచేసి హృదయము కరిగించి హృదయములో కల్పుకున్నావు ఏక హృదయమైనది తనువులు రెండు హృదయము వకటే యీటతోటి నాకలోక పొలిమేరదాటి సత్యలోక పొలిమేరలో పాదముంచినాను యింక నాజీవితము గృహము అమృత మయముకాగలదు షట్కర్మ విధాన విమానమున గూర్చొని అరిషడ్ వర్గముల ఊర్ధ్వగతిచేసి భూర్భు వస్సువర్లోకములదాటి పోగలము పైలట్ లేక ఏమానము పోక మనసు నిలక పొద్దుపోక తకమికలై తారుమారై వెఱ్ఱి మొఱ్ఱి కలలకంటూ వున్ననన్ను కనువిప్పి కనక పర్వతమెక్కించి నావు.

అనునంతలో రెండు చేతులా నోరుమూసి ఆనందమున మైమరచి వచ్చి వాక్ఝురీ ప్రవాహములో మళ్లీ అమాట అననని అనండీ. ఏనాటికీ అననండీ నా హృదయావేదన పోతుంది అనండీ అంటూ జాలిగా రాము కంటి చూపులో చూపు కలిపి గడ్డము పట్టు కున్నది సరోజ.

అబ్బా నీకు నీతిగరపిన ఉపాధ్యాయినికి నాపదివేలనమస్కారములు సరోజా తల్లి దండ్రులకన్నా గురువుమిన్న అన్నదిందుకే. యీ అతుకును యింక హరిహరా దులు కూడా విప్పలేరు. ఉపాధ్యాయిని అతుకులో వున్నది బ్రతుకు అన్నాడు రాము.

ఆమెపేరే కరుణామయి నాయట్టివారి నెందరినో బ్రతికించి బాగుపరచినది. ఏదీ కానీ అనను అనండీ వకతూరి అనండీ అని మెడ చుట్టివట్టి తిరిగి కంటి తళ్కు మెరుపు రాము ముఖమునకు పంపినది సరోజ.

రాము చిరునవ్వు నవ్వుతూ వంట మనిషి కావలెనని యింక అనను వంట నేర్చుకొని తెలివి తేటలు మూటగట్టుకొని దయా ధర్మములు చంక పెట్టుకొని వలపు చూపులు ప్రేమ భాషలు కట్టి గట్టుకొని నీతి నియమముల నెత్తి నెత్తుకొని

ఓర్పు నేర్పు వకప్రక్క నుంచుకొని కాలు కాలు కొట్టుకుంటూ కట్టుకున్నవాని కాపురముచేయ మంచి కన్నెపడుచు వచ్చిందిగా యింక అనను. మళ్లీ మళ్లీ అనను. అని యెత్తి పొడచను. అంచుకొచ్చిన వారిని యెత్తి పొడిచేది అధముడు అంటూ అధరామృతమాన పోయినాడు రాము.

సుకానితో సర్వసిద్ధమైన నావ ప్రమత్తుడై, యౌవన బలసంపదల్ ప్రజ్వలింప యెప్పు డెప్పుడని సర్వ సంసిద్ధుడైయున్న నావికుడు విశాలమయిన సముద్రమూ వున్నది. యెంత దూరమయినా నావ నడువవచ్చు యిప్పటికి నావ నాపి హృదయ మాపి, కాలుసాపి. వక ముసలామెను. పాత్రలు తోము పట్టుకరాండి అన్నది సరోజ.

సరే హృదయమా మూడునెలలు ముప్పు తిప్పలుపెట్టి ముచ్చెరువుల నీళ్లు త్రాపిన హృదయావేదనమా యింక మూడు గంట లాపలేవా. అమృతాబ్ధిలో అపరంజి బంగారు నావపై అమృత కిరణుడు రోహిణీ సహితుడై మృదు మధుర గానము చేయుచూ చిరుగజ్జియలు ఘల్లు ఘల్లుమన చిందులు త్రొక్కుచూ హావ భావములతో నటింప నీట ప్రతిఫలింప నావ నడువగలడు. అని అంటూ వుండగా సరోజ రాము నోటిని రెండు చేతులతో మూసి తన యెఱ్ఱటి పెదవులు చలింప తెల్లటి దంతములు జ్వలింప ఫక్కున నవ్వుతూ కవనము వ్రాయగలరా కానీ వ్రాయుటకు కాలము వున్నది. పెద్దవారు బైట ఉన్నారు. చూచుకొని వాడు కొనండి అంటూ ముసలామెను మరచితిరా అన్నది సరోజ.

వైసువారు ముందుండగా ముసలివారు ఎట్లు జ్ఞాపకమునకు వొత్తురు అన్నాడు రాము

పట్టు తప్పించుకొని సరే పోయిరాండి అన్నది సరోజ.

రాము బైటికి పోయెను. సరోజ పొయ్యి ముట్టించి వంటకు పాత్ర యెక్కించి యెంత అన్యాయము చేసినాను యెంత సుఖము పోగొట్టుకున్నాను. మూడు నెలలు నరక మనుభవించి నేననుభవించినదిగాకా పాపము వారిని యమ యాతనలో పెట్టినాను. నాపట్టుదల యింత చేసినది. స్త్రీకి పట్టుదల కోపము కూడదు. యివిలేని వారిదే సుఖము. సుఖమిచ్చి, సుఖపడ వచ్చును. సేవచేసి, చేయించు

కొనవచ్చును. మాటవిని వినునట్లు చేసుకొనవచ్చును. తినిపించి, తినిపించు కొనవచ్చును. ప్రేమించి ప్రేమింప చేసు కొనవచ్చును. పలికి పలికించు కొనవచ్చు యింత సూక్ష్మములోవున్న ఆనందము పెరచుకొని దుఃఖపడితిని, దుఃఖపెట్టితినని అనుకొంటూ బేడలు గిన్నెలోపోసి కడుగువేళకు రాము ముసలాయమను పిలుచుకొని వచ్చెను. సరోజ పాత్రలు వంట యింటిముందు వుంచి అవ్వా పాత్రలు తోముతావా అన్నది. తోముతానమ్మా అంటూ తీసుకొని పోయి దొడ్డిలో తోము చుండెను.

యింకా ఏమికావలెనో చూడు బజారుకు పోవుదని వున్నది. అన్నాను అటూ యిటూ చూచి అన్నీ తెచ్చినారే యింకేమివద్దు అన్నది సరోజ.

రాము బజారుకు పోయి హోటల్లో మైసూరుపాగు, జాంగ్రి, బిస్కోట్, వడ, బోండా, కావలసినన్నీ తీసుకొని పాలు వేయించుకొని అయిదు నిమిషములలో వచ్చెను. భుజంగరావు నిద్రలేచి కూర్చొని వుండెను.

సరోజా మీ అప్పను పిలిచి యీ ఫలాహారము యివ్వమని చేతికి యిచ్చెను రాము.

యింత ఏలతెచ్చినా రన్నది సరోజ.

పదహారు ఏండ్లువాకి సంతరించి విద్యాబుద్ధులుచెప్పి డబ్బులు ఖర్చుపెట్టి పెండ్లి చేయించి పిలుచుకొనివచ్చి సుఖపడుమని బిడ్డను విడచిపోవు మామగారిని మానవుడని తలచినవాడు మానవుడుకాడు దయ్యము. అత్తమామల భగవత్స్వరూపముగా భావించి పూజించ వలయునని ధర్మశాస్త్రము. మా అత్తమామల నేను నీ అత్తమామల నీవు గౌరవించాల పూజించాల తెలుసా. కని పెంచి పెద్దవానిచేసి విద్యాబుద్ధులు చెప్పించి సుఖపడమని నీచేతిలోపెట్టి సర్వసంపదల నర్పించి అన్నిటపై అధికారమిచ్చి చేతులు వెనుక పెట్టుకున్న అత్తమామల గౌరవించి పూజించుట ధర్మముకాదా యిదితెలిసి బ్రతికిన వారికి యిహపరముల రెండిటిలో సౌఖ్యము చిరకీర్తి పుణ్యము వుండు నన్నాడు రాము.

సరోజ చిరునవ్వుతో రాముని చూస్తూ యెవరి ధర్మమువారు చక్కగా నెరవేర్చు కొందాము. యిప్పటికి మీమామగారిని పిలువండి. అని రెండు విస్తళ్లువేసి, ఫలాహారము పెట్టెను. కాఫీచేయ నీళ్లు యెక్కించెను. రాము భుజంగరావును చూచి మామా యిక్కడ పిలుస్తారు అన్నాడు.

మీరే పిలువండి నన్నేల కలుపుకుంటారు అంటూ మంచినీరు తెచ్చిపెట్టినది సరోజ. భుజంగరావు లేచి వచ్చినాడు.

అప్పా ఫలాహారము తీసుకుందువురా అన్నది సరోజ.

యిప్పుడేమి ఫలాహారమమ్మా అంటూ వంట రూములోపలికి పోయినాడు భుజంగరావు.

కూర్చోండి అన్నాడు రాము.

మీరూ కూర్చోండి అన్నది సరోజ.

యిద్దరు కూర్చున్నారు యింత యెందుకు పెట్టినావమ్మా అన్నాడు భుజంగరావు.

మామగారు వచ్చినారు. గౌరవించుటకు యిల్లుగాదు. ఏమి చేయుటకు వలనుగాదు వసతిలేదు అని హోటలుకు పోయి తెచ్చినారు నాన్నా అన్నది సరోజ.

ఔను మగవాడులేని యిల్లు మఠము. ఆడదిలేని యిల్లు అడవి, అన్నారు మామా, యిక అడవి అమర భూమిగా మారుతుంది. యీసారి మీరువస్తే అన్నీ మాయింట్లో వుంటాయి, ఆడదిలేనియింటికి అయ్యార్ హోటలు అమరభూమి కామధేనువు, కల్పవృక్షము అన్నారు. ఆ అమరభూమి నుంచీ సప్లయ్ చేసు కున్నాము అన్నాడు రాము. భుజంగరావు, ముసిముసి నగులు నగుతూ ఔను. వంటరిగా నున్నప్పుడు ఏమివుంటాయి నేనూ బాల్యములో చదువుకునే టప్పుడు యిట్లే కష్టపడినాను అన్నాడు.

పెండ్లి అయిన వెనుక, పెండ్లాము కోపానలమున కింధనమై కష్టపడ లేదుకదా, అంటూ మా అత్తమంచిది అన్నాడు రాము.

ముగ్గురు ఆమాటకు నవ్వినారు, నవ్వుతూ భుజంగరావు దారలేని తిండి దయ్యాపు తిండిరా అన్నాడు వేమన దారకు, ధవుడు, ధవునికి, దార పోషణ కర్త వ్యము లేకున్న దయ్యాపు జీవనమవుతుంది. అదితెలిసి జీవించిన వారిదే సుఖము అంటూ ఫలాహారముచేసి మంచినీరు త్రాగినారు. అంతలో సరోజ కాఫీ తయారు

చేసి యిరువురకూ యిచ్చినది. తాగుతూ భుజంగరావు రాముని చూచి యింట్లో మీ అత్తలేదు. సరోజ వుండి వుండీ హఠాత్తుగా తెల్లవారి పోయే తీరవలయు నంటూ పట్టు పట్టినది. ఆమాటపయిన తక్షణము బయలుదేరి వచ్చినాము. రేపువెళ్లుతాను. నిన్ను నీమేలు నాజీవితములో మరచిపోను. మరొకరైన మా సరోజ చేసినపనికి మమ్ముల యెంతో అపనిందల పాలుచేసి వుందురు. రచ్చల కీడ్చి రాజకీయ రంగములో దింపి నానా అవస్థల పాలుచేసి రెండు కుటుంబములకు అగ్నిరగుల్చి జీవితములే దుఃఖ భాజనముగా మార్చి వుందురు. నీవు దైవసమానుడవు మానవాతీతములగు గుణములన్నీ నీలోవున్నవి. మా సరోజ తప్పులను, మా తప్పులను. జ్ఞాపక ముంచుకొనకు శాంతమే మానవునకు అంగరక్ష.

కం॥ తనకోపమె తనశత్రువు
తనశాంతమె తనకురక్ష దయచుట్టంబౌ
తనసంతోషమె స్వర్గము
తనదుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ॥

అన్నారు. శాంతము కార్యసాధన చేయుగలదు. నీవు శాంతముతో వుండుట వల్ల సరోజ తన తప్పును తాను తెలుసుకొని వచ్చి దాపుచేరినది. శాంతుడవు గాబట్టి దండించక దాపు యిచ్చినావు, అపకారికి ఉపకారమే చూపి ఆదరించినావు, ధర్మమూర్తివి మీయిరువురిని చూసి నాకు పరమానంద మయినది మా కుటుంబ ములో రగులుకున్న అగ్ని యీనాటితో ఆరిపోయినది. యీమె నడకను చూచి మీ అత్త సగము కృశించి పోయినది. యీమాట విన్నతోడనే తన ఆనందమునకు మేరవుండదు. యెగిసి మిన్నందుకుంటుంది. వెంటనే వస్తుంది. యిట్ల యీమె మారుతుందని యెవ్వరము భావించలేము. తలంచనూలేము. ఇది అంతా దైవచిద్విలాసమన్నాడు భుజంగరావు.

రాము నవ్వుతూ యిది యేమంత అనుకొన తగిన కార్యముకాదు తెలియక ఏమేమో చేయగలము, పట్టుదలపై మంచి చెడ్డల గుర్తింపక ఏమేమో పాట్లు పడగలము అవిఅన్నీ తలచుకొనరాదు. వెనుక తప్పొప్పుల తెలుసుకొని చేసిన వారే పశ్చాత్తాప పడగలరు.

కం॥ ఉపకారికి నుపకారము
    విపరీతము గాదుసేయ వివరింపంగా
    నపకారికి నుపకారము
    నెపమెన్నక చేయువాడు నేర్పరిసుమతీ॥

అన్నారు. అపకారికి అపకారము చేసిన ఆ కలహం అంతమగు వరకూపోదు. ఓర్పుతో ఉపకారము చేయుటో వూరకుండుటో మంచిది. యీ పద్ధతి నాన్నగారిది. నేనూ ఆపద్ధతినే అనుసరించుతూ వుంటాను. యిక్కడ యిట్లయినదని మా అమ్మకు నాన్నకు తెలియదు. కోపలు యిక్కడనే వున్నదనుకొనుచున్నారు. అప్పు డప్పుడూ మాయిద్దరికీ ఫలాహారములు పండ్లు పంపుతూనే వున్నారు. యిద్దరిపే వకడనే చక్కగా మిగలకుండా స్వాహాచేస్తూ వున్నాను. యింటికి వకతూరి వచ్చి పొమ్మంటూనే వున్నారు. నేను పనివున్నదని సెలవు దొరుకలేదని యిరువురము క్షేమముగా వున్నామని మీరు రావద్దని జాబులు వ్రాస్తూ వున్నాను. నెలకొకతూరి యింటికి పోయి వచ్చేవాణ్ణి యింతవరకూ పోలేదు. యిక పోబోతానన్నాడు రాము. అది విన్నతోడనే భుజంగరావుకు హృదయము కరిగి తలదిరిగి కంటినీరు వెలువడి నది. సరోజకు అవమానము దుఃఖము ప్రేమ వకేతూరి ఆవేశమై పైబడి ఉక్కిరి బిక్కిరిచేసి నలిపినవి. వాటిలో ప్రేమే పైకొని మిక్కుటమై పోయి రామును కౌగలించుకొని ఆతనిలోనే ఐక్య మగుదామను కొన్నది గాని తండ్రిఅడ్డు వుండుటచే భావోద్రేకము ఆపలేక కన్నీటితో తలవంచి నిల్చినది పాపము.

రాము చిరునవ్వు నవ్వుతూ, ఆడవారితప్పులు మగవారు, మగవారి తప్పులు ఆడవారు బయట పెట్టుకున్న సంఘములో లోకువ కాగలరు. హేళనకు రాగలరు. సవరించు కున్నవారే సజ్జనులు తెగతెంపుకున్నవారే నిర్భాగ్యులు యీలాంటి విషయాలు బాల్యమాదిగ మానాన్నవలన విన్నాను. గాబట్టి ఓపిక పట్టినాను సంఘ వ్యాఘ్రమునకు నేను బలిగాక సరోజను కానివ్వక గట్టున పడినాను. నావస్తువ గట్టిదయిన యెక్కడా పోదని రుణముండిన తప్పక యిల్లు చేరునని ముందు జన్మఖర్మను ప్రకృతము చేయు సత్కర్మతో యెదిరించి బాగు పడవల యునని నానమ్మకము అన్నాడు రాము. భుజంగరావు తలయూచి నిజముగా నీవు రాముడవే లేకున్న నీకీశాంత ముండదు. మా సరోజ చేసిన పుణ్యముల పంటవీవు నిన్ను నీమేలును, అజన్మాంతము మా కుటుంబము మరువలేదు. అని లేచిపోయి

మంచముపై కూర్చున్నాడు. సరోజ హృదయానందము పట్టలేక కాఫీ గ్లాసును తెచ్చి యింకా కొంచెము త్రాగండి అన్నది నవ్వుతూ యింక వద్దన్నాడు రాము.

అగరానిది, ఆపరానిది, నిల్పరానిది, సైచరానిది చేసిన యీ యిల్లాలిపై వచ్చు కోపసాగరమునే దిగమ్రింగిన అపర అగస్త్యులవారికి సంఘ వ్యాఘ్రమునుండీ తప్పించి గట్టుచేర్చిన దయామయులకు యీ కొంచెము కాఫీ భారమా మీచేతులతో త్రాగక పోయిన నాచేతులలో త్రాగండి అని నోటి కందిచ్చినది సరోజా. వద్దు అన్నాడు రాము కొంచెముగా నాయానందము కొరకు త్రాగండి కొంచెము త్రాగియిస్తే త్రాగుతాను లేకుంటే పట్టు పట్టుతాను. అంటూ చేయి పట్టుకొని త్రాపినది సరోజ. వక గుక్క త్రాగి గ్లాసు తీసుకొని సరోజకు త్రావ పోయినాడు రాము. వద్దు మిమ్ముల దుఃఖపెట్టిన దుర్మార్గు రాలను. యిప్పటికే ఋణపడినాను. యింకా ఋణపడుతాను. చేసిన ఋణము తీర్చుకోనివ్వండి అటుపై చూతమని తాగినది నవ్వుతూ, రాము బయటికి పోయినాడు గంట అయినది. వంటా తయారయినది చేతులు శుభ్రము చేసుకొని ముఖము కడుగుకొని వచ్చి తలదువ్వి, జడవేసి, పూలు పెట్టి, కుంకుమ తీర్చిదిద్ది మంచి చీరనుకట్టుకొని సంజె దీపము వెలిగించ చూచె. నూనేలేదు వత్తులకు పత్తిలేదు. యిటు అటు చూచుచుండగనే రాము నూనె నెయ్యి పెరుగు పాలు ఆకులు వక్కలు పండ్లు పూలు, పత్తి, దీప ప్రమిదెలు, పూదుకడ్డు, కర్పూరము క్షీరకాబ్ధిలో లక్ష్మీ సమేతుడై శేషతల్పమున వరుండు విష్ణుపటము పిల్లవానితో యెత్తించుకొని వచ్చి సరోజ ముందు వక్కొకటే పేర్లు చెప్పుతూ పెట్టెను. సరోజ అప్పుడు వికసించిన పూలగుత్తిలాగువున్న ముఖముతో చిలుక పలుకులతో, చిరునవ్వుతో, సంసారము సంపూర్ణ సంగ్రహముగా ఆకు విడువకుండా చదివినట్లున్నదే. నేను తెలియని దానినైనను. అన్నీ తెలిసినమీరు వున్నారు. యింక భయములేదు చూచినాను. నూనె వత్తులు ప్రమిదెలులేవు అన్నది సరోజ.

రాము సరోజను చూస్తూ యిల్లాలు వుంటేగా యివన్నీ వచ్చేది. యిల్లు ప్రకాశించేది యిల్లాలు రాలేదు. యివన్నీ తేలేదు. యిల్లాలు వచ్చింది యిదంతా చేరింది. యింక కానీ. డో అంటూ వక గూటిలో పీటవేసి పీటపై పటము పెట్టినాడు. సరోజ దీపము వెలిగించి పూలుపెట్టి పూదువత్తులు ముట్టించెను. రాము కాళ్లు కడుగు కొనివచ్చి పండ్లు, పాలు, చక్కెర, దేవుని యెదుటబెట్టి స్వామీ యింతవరకూ

యిల్లాలులేక దీపము కూడా వెలిగించలేదు. యిల్లాలువస్తే మీరురప్పిస్తే నిత్యమూ పాలు చక్కెర పండ్లు, పెట్టుతాను. అని నిత్యమూ చెప్పుతూనే వచ్చినాను. యీ నాటికి మీ అనుగ్రహము గలిగింది. యిల్లాలు వచ్చింది. దీపము వెలిగింది. నామాట ప్రకారము పాలు చక్కెర పండ్లు తెచ్చి తమకు సమర్పించినాను. ఇదుగో స్వామీ యీమే నాయిల్లాలు అని ముందుకు తీసుకొని యిక నిత్యమూ మూడువేళల దీపము వెలిగించి ఏమిచేసిన ఏమితెచ్చిన ముందు మీకు సమర్పించి వెనుకనాకు పెట్టి పిదప తాను గ్రహిస్తుంది. తయారై వచ్చింది ధర్మాల పుట్టియ్యింది. నన్నొక కంట యీమె నొకకంట చూడండి, ఏమితెలియని ముద్దరాలు అబల బాలయెట్లు కాపాడెదరో యీనాటికి యీ పదార్థముల స్వీకరించి ఆశీర్వదించుడు, మీవర ప్రసాదమున నక్క కుమారుని దయసేయుడు అకుమారుని పై ప్రేమతోనైనా వుంటుంది. అనునంతలో సరోజ రెండు చేతులతో నోరుమూసి, స్వామీ యిప్పుడే వద్దు వీరు మీవలెనే దయామయులు. శాంత హృదయులు వీరి అనందము కొంత తీరనీ కన్యాత్వముతోనే ఋణముతీర సేవచేయనీ. వెంటనే తల్లినైతే యిరువుర సుఖము నశించి కష్టమేర్పడును. యిప్పుడు తెలియక యెడబాటై దుఃఖపడితిని తెలిసి యెంతోకాలము యెడబాటు కావలసియుండును. యింక క్షణకాలము యెడ బాటు సహించలేను. చాలాకాలము వరకు సంతతివద్దు స్వామీ బాల్యములోనే కన్యాత్వము నశింపై పిల్లల తల్లినైతే సుఖమేమున్నది, దయామయీ ఇందులో నీకు తెలియని దేమున్నది తల్లీ, కన్య వెంటనే తల్లిగామారుట, పురుషుడు చేసిన పాపమనెదరు, పెద్దలు అవిషయము తెలియక మాటాడిన మాటను లెక్క పెట్టవద్దు తల్లీ, అని నిండు పూర్ణచంద్రుని లాంటి ముఖముతో రాముసు చూచి నవ్వి దేవుని దిక్కుమళ్లి చేతులు జోడించి దయామయులారా పురాణ దంపతులారా తెలియక నేనెన్ని చేసినను యిప్పుడు, చేరదీసి సహించినట్లే జీవితాంతము వరకు యీనాటి ప్రేమ వీరికి నాపై వుండునట్లు ఆశీర్వదించుడు, అని సాగిలపడి మోకరించి నమస్క రించి లేచి రాము పాదములు తగులునట్లు శిరమువంచి నమస్కరించెను. రాము చేతులు పట్టుకొనిలేపి చేరతీసుకొని సరోజా యింక నామాట తప్పకుండా శ్రీవారు యిచ్చినది, మనకు కలిగినది మూడు వేళల వీరికి పెట్టుతూవుండు యిక యిది నీవంతు, తేకుంటే నాదితప్పు, పెట్టకుంటే నీదితప్పు మనతప్పొప్పుల గమనించి దండించే వారు వీరే చూడు. అమహాతల్లి లక్ష్మీదేవి తననాథుని యెట్ల అనుసరించి నదో వారి కుటుంబము యెంత అనందమయినదో గమనించితివా అన్నాడు రాము.

ఔను పోగొట్టుకున్న వస్తువను. చేచిక్కించు కున్నాను. యిక ప్రాణ మున్నంత వరకు జారవిడువను. మనో వాక్కాయ కర్మల వారి సాక్షిగ యిక మరువను. అని కంటనీరు పెట్టుకున్నది సరోజ.

రాము అదిచూచి మీది పంచెతో కంటనీరు తుడుచుచూ యెందుకిది సరోజా అన్నాడు రాము.

తప్పు చేసినందుకు అన్నది సరోజ.

ఆనందములో దుఃఖమా అన్నాడు రాము.

ఆనందము దుఃఖముగా మార్చి పాపము కట్టుకున్నందుకు పశ్చాత్తాపము ప్రాయశ్చిత్తము అన్నది సరోజ.

రాము మరింత సరోజను చేర తీసుకొని చెక్కులు నిమురుచూ దేహమునే మరచి సరోజా యెంతలో యెంత మార్పు చెందినావు. బంగారును వెలిగారముతో అతికినట్లు మాటకు మాట యెంత బాగఅతుకుతున్నావు. నీ హృదయములో చోటివ్వు అక్కడనే నివసిస్తాను. యికబైట బ్రతుక లేనంటూ ముఖము ముఖము లోన చేర్చ బోయినాడు

సరోజ చేయి అడ్డుపెట్టి దైవము అన్నది. రాము సరోజను విడచి చెంపలు వేసుకొంటూ మైమరచితాను స్వామీ మా నినులనుండి వెల్వడు మోహినీ భూతము సోకి మానవుడు మైమరచినట్లు నిన్నుదలంచుచూ మైమరువలేదు. స్త్రీ ప్రేమలో చిత్తము నిమగ్నమయినట్లు నీ ధ్యానములో నీ పూజా విధానములో సేవలో నిమగ్నత నొందలేదు. మీరున్నారను మాట మైమరచి మోహభూతమునకు లొంగి మోసపోవు చుంటిని. మానినియే మేల్కొల్పెను. అట్లే శ్రీవారి చింతనలో స్త్రీవారి చింతనెందుకురా అనరే. స్త్రీ శక్తికన్నా నీ శక్తి, చిన్నదంటారా కాదంటారా, యిప్పుడు యిటు మా సరోజశక్తి అటు తమశక్తి యీ మధ్యలో నాశక్తిని యెటు లాగెదరో ఏమిచేసెదరో తమరిచ్చునది ముక్తి, యీామెయిచ్చునదిరక్తి ముక్తివీడితే రక్తి రక్తివీడితేముక్తి రెండూ సిద్ధించేదెట్లు తండ్రీ ఏమీధర్మబద్ధయై దారవెన్నంటితే రెండూ వుండునంటారా, అవును రెంటెను చేపట్టినవారే పురుష శ్రేష్ఠులు. మా సరోజ తనధర్మము తాను తెలిసి వర్తిస్తేనాకు రెండు దొరుకగలవంటారా, నిజమే

ఉపాధ్యాయుని చెంత సకల ధర్మములు, సకల మర్మములు, సకల సకల కర్మములు తెలుసుకొని, నేర్చుకొని అధికారపత్రిక చేకొనివచ్చి వకటోకచో జారీ చేయుచున్నది. సెహాస్ అనిపించు కొనుచున్నది. యికపాత్రో చిత్యము గాకుండా కథరక్తి చెడకుండా, అరక్తి కొట్టకుండా హావ భావములతో చక్కగా పోషించి మృదు మధురముగా పాడి ఆడి ప్రజల మెప్పించగలరు. బహుమతి యిచ్చుటలో వెనుదీయకుడు. మాయిరుపురలో మార్కులు సరోజ కేయిత్తురేమో స్త్రీ యని, అబలయని, రెండు మార్కులు యెక్కువ యిస్తామని మీరు తన్ను నమ్మిన తరుణులు స్త్రీలు గాబట్టి మా తల్లిమనసు అక్కడే సోలును. మా సరోజకే మార్కులు యెక్కువగును. పురుషుడు యెంత ఆడినా యెంత పాడినా మెప్పు బడ యుట కష్టము. స్త్రీ షట్ కర్మానిది నే దినేఅనుకథను చక్కగా సాలు విడువకుండా చదివితేచాలు కావలసినన్ని మార్కులు యిచ్చి శాశ్వత మయినదీ చెడనిధియగు ముక్తి బహుమతి తప్పక యిస్తారు. సరోజాకాని కథ అరక్తి కొట్టకుండా చక్కగా చదువు ముక్తినీదే అన్నాడు రాము.

మాతా మగవారి మాటలు వింటివా పదిచోట్ల తిరిగి, పది మాటలునేర్చి కట్టుకున్న భార్యనే మాటలతో కట్టివేయ చూస్తారు. నలుగోడల మధ్యలో బంధించి నదిగాక మాటలలోకూడా బంధింప చూస్తారు. వదగకొడ్తారు. ఓడకొడ్తారు. అన్నిటకు అన్ని జవాబులిచ్చు సమయస్ఫూర్తి జ్ఞానమూ యివ్వకున్న మాగతేమి తల్లీ సమయస్ఫూర్తి జ్ఞానమిచ్చి మీ కాపురములాగ, మా కాపురము కలకలలాడు నట్లు ఆశ్వీదించుడు. ధర్మచ్యుతనుగాక మీదాపేప్రాపని నమ్మి సంచరిస్తానన్నది సరోజ.

అమ్మకు ఆడబిడ్డలపైన ప్రేమ యెక్కు వన్నారు. మగబిడ్డలపైన ప్రేమ తక్కువన్నారు. అయ్యకూడా అమ్మమాటనే అనుసరిస్తాడన్నారు. యిద్దరు అక్కడే తూలితే ఆడబిడ్డ తూకము యెక్కువగుతుంది. తల్లి మగబిడ్డల గతేమికావలె. మగ వానికి గతి అవేనంటారా అలుగాకపోతే అగచాట్ల పాలేనంటారా అన్నీనేర్చిన అలు దొరికితే, యిహమూ పరమూ, వున్నదంటారా, భుక్తి, ముక్తి, రక్తి చూపగల యిల్లాలే నీ యిల్లాలు అని అంటారా. సరోజ పలుకలేదు. వీరు మౌనము అంగీకార సూచకమన్నారు. యింకనాకు కొదువలేదు ప్రేమాను రక్తి భుక్తినివ్వనీవు, ముక్తి నివ్వవారు నాకేమికొదువ వారికి నమస్కార మొగడే.

శ్లో॥ మాతాత్వంచ పితాత్వంచ భ్రాతాత్వంచ ప్రభుర్మమా
త్వమేవశరణం ప్రాప్తం రక్షమాం కరుణానిధే!

అని సాగిలపడి నమస్కరించెను. ప్రక్కనే సరోజ సాగిలపడి నమస్కరించెను. యిరువురు లేచి చెంపలు వేసుకొనిరి. సరోజ దోసిలియొగ్గెను. రాము పూలదండ కొంచెముతుంచి దోసిలిలో వేసెను. సరోజ కన్నుల కద్దుకొని శిరమున ఉంచుకొని తిరిగి దోసిలియొగ్గెను. రాము యింక ఏమికావలెనన్నాడు అర్చకుల వారికి తెలియదా ఔను కొత్త అర్చకులు కొత్త సేవకులు కన్నుల కద్దుకొని పూసుకొనునది ఒకటి, కన్నుల కద్దుకొని శిరమున ఉంచుకొనునది ఒకటి, కన్నులకద్దుకొని భక్షించునది మరొకటి. గంధము, పూలు, పండ్లు పూసేది మోసేది మేసేది అంటారు. యింకొకటి రావలయునన్నది నవ్వుతూ సరోజ. ఓహో సేవకాధర్మమూ మర్మమూ బాగా తెలిసినట్లున్నదే అంటూ రెండుపండ్లుతీసి చేతిలో వేసినాడురాము అగ్నిదేవుడు యిటు మానవులకు అటు దేవతలకు మధ్యలో సంధిచేసి పూజనీయుడయినట్లు యిటు దాసులకు అటు దైవమునకు మధ్యలో వుండు తమరు వారిలాగ పూజనీయులే అగ్నిదేవునికి అర్చకులకు ముందు నమస్కరించక పోయిన కార్యభిన్నముచేసి కర్తలకు చక్కగా ముట్టచెప్పరు సఫలము కాగలది విఫలమౌతుందన్నారు. నానమస్కార మందుకొని ఆశీర్వదించండి అని చిరునవ్వునవ్వుతూ నమస్కరించినది సరోజ శీఘ్రమేవ సుపుత్రావాప్తిరస్తు అని అక్కడున్న పూలు నాల్గుయెత్తి నెత్తిపైవేసినాడు రాము. సరోజ లేచి ఆ పూలను యేంచి నలుగురు కొమరులుకావలెనా అంటూ పండువల్చి నోటికందించినది నవ్వుతూ. రాము పండునమిలిమ్రింగి చూడుస్వామి వలచితే వైకుంఠం లేకుంటే అనేవేళకు పండునోట్లోపెట్టి చేయిమూసి దయామయులారా యిట్లే యెల్లప్పుడు ఆనందముగా నుండునట్లు మమ్ము ఆశీర్వదించుడు. అంటూ భోజనమునకు వేళ అయినదేమో మామగారిని పిలచి కూర్చొండి వడ్డిస్తాను అన్నది సరోజ. యిరువురు పోయి భోజనమునకు లెమ్మన్నారు భుజంగరావును. సరోజ నీళ్లుతెచ్చియిచ్చినది కాళ్లుకడుగుకొని భుజంగరావు వచ్చినాడు. యిద్దరు కూర్చున్నారు సరోజ వడ్డించినది భోంచేస్తూ రాము వంటరాని వారివంట యెంతరుచిగానున్నదో చూడండి ఆడవారిమాటలమృతము ఆడవారిచేయి అమృతమయము వారిమాటలో వారిహస్తములో అమృతముపెట్టే ముల్లోకములఅల్లాడిస్తున్నాడు భగవంతుడు అన్నాడురాము. భుజంగరావు భోంచేస్తూ వంటచాలా బాగున్నది రానురాను యింకాబాగుంటుంది యీనాడేయీమె

పంటచేయడము అన్నాడు. మూడునెలలు ట్రైనింగై యింతమాత్రము చేయలేదా అంటూ సరోజను వారగంట చూచెనురాము. సరోజ చిరునవ్వునవ్వెను. రాము భోంచేసిలేచి మామగారికి మధ్యహాలులో మంచము పరుపువేసి మంచినీళ్లచెంబు గ్లాసు తలభాగములోన, వకపెద్దచెంబుతో నీళ్లు కాళ్లభాగములోనపెట్టి కప్పుకొనుటకు దుప్పటికాళ్లభాగములో వుంచెను. బేటరీ వకటి తలదిండుక్రింద పెట్టెను. కుర్చీలోకూర్చున్న భుజంగరావు రాము ఓర్పునుచూచి మెచ్చుకొనుచూ ఆలోచించి మంచినీళ్లు సమీపములో వుండవలశినదే. ప్రతిదినమూ అవశ్యకము గాకపోయినా ఏనాడోవకనాడు కావలసివచ్చును. కావలసినపుడు వెతుకులెందుకని అచరణగా వుంచినాడు. మూత్రవిసర్జనకు పోయివచ్చి కాళ్లు కడుగుకున్నప్పుడు పుక్కిలించి మూయుటకు కావలెనని కొందరు పెట్టెదరు. ఇదియొక మంచిఅలవాటే మూత్ర విసర్జన చేయడములో చిత్తికి కాళ్లమీద పడునని యు లింగమః కడుగకపోయిన అమంగళమని అచారహీనమని దుర్గంధమగు వాసనని ధర్మసూత్రజ్ఞులు మూత్ర విసర్జనచేసి కాళ్లుకడిగి పుక్కిలించి కాళ్లతడి బాగతుడిచి పడుకున్న దేహము శాంతముచెంది నిద్రచక్కగా వచ్చునని ఆయుర్వేదశాస్త్రజ్ఞులు చెప్పుదురు. భోంచేసినప్పుడు మలమూత్ర విసర్జనలు చేసినప్పుడు మూడుమార్లు పుక్కిలించి యుమ్మి వేయుట, కాళ్లుకడుగు కొనుట గుక్కెడునీళ్లు త్రాగుట అచారమునకు ఆరోగ్యమునకు మంచిదని శాస్త్రజ్ఞులు చెప్పుదురు అదేవిధిగా ఆచరణలో వుంచినాడు రాము. మంచి వారినడక యిట్లుంటుంది. పైబరువై పరులకు ఉపకారము చేయలేక తానుఆచరించ లేక మూడుపనులకే పనివచ్చు మూఢులు మూర్ఖులు వున్నారు యెందుకు భూభారమునకే యీతడు అన్నివిధములా ముందుకు పోవు మార్గములు గానవచ్చు చున్నవి. అంటూ వచ్చి మంచములో కూర్చొని చీకటిలోలేచి పోవలెనంటే అభ్యంతరము లేకుండా లైటుకూడా పెట్టినాడు. మావారూవున్నారు ఎందుకు బుద్ధిలేనిదద్దన్నలు అంటూ ఆలోచన చేయుచుండెను. అంతలో రాము మరొక గదిలో మంచములు పరుపులు వేసి నీళ్లువుంచెను. యింతలో సరోజ భోంచేసి గోమయముతో శుద్ధిపెట్టి పాత్రలనన్నిటి సవరించి వచ్చిచూచెను. మంచమువేసి అన్ని అమర్చినాడు రాము. అదిచూచి యిహపడుకో అప్పా అన్నది సరోజ. పడుకుంటాను అయిదు గంటలకు యిక్కడనుంచీ బస్సుపోతుందిగదా దానిలో వూరికి పోతానమ్మా మొర్నాడు కోర్టుపని వున్నది. తప్పక అక్కడవుండవలయు నన్నాడు భుజంగరావు. అంతలో రాము వచ్చి నాలుగునాళ్లు వుండండి మామా అన్నాడు.

లేదు మరొకతూరి వచ్చి పదిరోజులు వుంటాను. నేను పోయి మీఅత్తను పంపుతాను అన్నాడు భుజంగరావు. సరేనన్నది సరోజ. భుజంగరావు పడుకున్నాడు అప్పటికి తొమ్మిదిగంటలు కావచ్చినది సరోజ. పడకగదిలో ప్రవేశించి చూచెను. మంచములు వేసి పరుపులు పరచి నీళ్లతోసహా ఉంచబడి వుండెను. వెనుదిరిగి వంట గదికి పోవుచూ క్రొత్త సంసారముగాబట్టి నేనుచేయవలసిన పనులు వారేచేసినారు. పాలనీళ్ల న్యాయముగా కలిసిమెలసి వారికార్యముల పీను, పీరికార్యముల వారు చేసుకొను వారిదే కాపురము. నేను భోంచేసి వచ్చులోపల మా అప్పకు పరుపువేసి తనకు వేసుకొన్నారు. మామకు అల్లుడు చేయవచ్చు. అల్లునికి మామ చేయుట ధర్మవ్యతిరిక్తమని తెలిసినవారు. తెలిసి గర్వమును విడచి ధర్మమును ఆచరణలో వుంచుకున్నవారు. భార్యకు సైదోడుభర్త, భర్తకు సైదోడు భార్య యని గ్రహించిన శాంతహృదయులు గాబట్టి తానే స్వయముగా మంచము పరుపువేసి నీళ్లతోసహా పెట్టినారు. యిలాంటిభర్త దొరకుట నాపూర్వ పుణ్యము. అన్నిపనులు భార్యపైనే అతికిపెట్టి అన్యాయమనక దయాదాక్షిణ్యములేక అక్కరతీర్చుకొని అవతల పొమ్మను కఠినహృదయులు కరకు రక్కసులు. స్త్రీకి లభ్యమగుట స్త్రీ చేసిన పాపము. ముందుచేసిన పాపమునకు కోపము తోడుచేసుకొనక నాకర్మమని కష్టమనక యెమరీదిన వారికి యెట్లాటిభర్త తోడవుతాడు. యిప్పుడు పొరపాటుపడక మనోవాక్కాయ కర్మలు వారికే అర్పించి వారిమన్ననలందిన మరీజన్మకు ఇట్లే వుంటుంది. తలిదండ్రులు మొదలగువారు యెందరుమారినా భార్యాభర్తలు మారరని పెద్దవారు అంటారు. ఒకరికొకరు చేసిన ద్రోహముతో మరుజన్మలో బద్ధవైరులై సంసారము, ప్రేమ పాడుచేసుకొని విడివడి దుఃఖింతురంటారు. పూర్వపుణ్యానుసారముగా చెప్పువారు దొరికినారు విన్నాను. కన్నాను బాగుపడినాను. యికజన్మలో పొరపాటుపడను. పట్టుదలను కోపమును చంపి ఓర్పుతో నేర్పుతో సంసారముచేస్తూ సంతోష పెట్టుతాను, సంతోషపడతాను నంటూ పండ్లు ఫలాహారము పాలు వక్కపొడి ఆకులు సున్నము తీసుకొని పడకగదికి పోయెను. తలవాకిలివేసి రాము శయన గృహములో ప్రవేశించి మంచముపై కూర్చుండెను. వాలుజడ నల్లత్రాచు వలె వక్షోజములపై చిందులాడ తలలోపూలవాసన ఘుమ్మని మందిరాంగణము నాక్రమింప ముఖచంద్రుని వెన్నెలలు అమృతమయమై ఆవరింప చిరునవ్వుతో నాలుగున్నర గంటకు అలారము పెట్టండి. కాఫీవేసి యిస్తాను మీమామగారిని విడచి వత్తురు అన్నది సరోజ. మంచిదంటూ రాము అలారము పెట్టినాడు. సరోజ తమలపాకులకు యీనెలలుతీసి సున్నమురాచి వక్కపొడిపోసి పెద్దపాణాబిడాచుట్టి తట్టలో

పెట్టెను. అంతలో రాముమంచములో కూర్చున్నాడు. సరోజ రాము పాదములకు నమస్కరించినది.

యెంమకీ మ్రొక్కులు తప్పులు చేయననియూ చేసినవి క్షమింప మనియూ అన్నాడు రాము.

తెలిసి తప్పులుచేయను తెలియకచేసినవి క్షమించండి. క్షమించి అర్ధాంగికి మంచములో అర్ధము చోటిచ్చి ఆదరించండి. ఆదరణతో ఆనందముతో అనురాగ ముతో యిచ్చిన ఫలాహారముల అరగించండి పాల నీళ్ల న్యాయముగా కలిసి ప్రేమతో యిచ్చిన పాలను స్వీకరించండి పసందుగా పక్వకముగ పరిమళద్రవ్య ములచేర్చి చుట్టి నోటికందిచ్చిన పాకాబిడా న్యాయమయితే అంతా నమిలిమ్రింగండి న్యాయము కాదని మీ మనసంటే అర్ధాంగికి అర్ధమివ్వండి. మనవి విని చిత్తగించండి అని అర్జీదాఖలు చేసుకున్నాను అన్నది సరోజ నవ్వుతూ.

నీ అర్జీని బుట్టదాఖలు చేయను. భార్యపెట్టుకున్న అర్జీలను పరికించక గమ నించక విచారించక అన్యాయముగా బుట్టదాఖలుచేయు ఆఫీసరు అధముడు. అధము లలోచేరను అగ్రస్థానమునే ఆక్రమిస్తాను. ఆలికి మంచములో అర్ధభాగమిచ్చుట లెక్కగాదు అంకస్థలమే యిస్తాను వక్షస్థలములో అర్ధభాగమిస్తాను హృదయములో చేరుకొనచోటిస్తాను. కనేది వినేది తినేది అనుభవించేది అర్ధమిస్తాను తలిదండ్రుల భక్తిశేషమగు సర్వవస్తు సముదయములలో సంపూర్ణమగు హక్కు యిస్తాను. కోరిన కోర్కెల చెల్లిస్తాను అంటూ వుండగా యీ అణువు ఆగేగమ్యస్థానమెక్కడా అన్నది సరోజ. నిలువుటద్దముల్లాగ నిగనిగలాడే చెక్కిళ్లు గమ్యస్థానమన్నాడు రాము.

అయ్యో నిలువులో నున్నగా జారిపోతా యేమోనన్నది నవ్వుతూ సరోజ జారిపోకుండా ఉక్కుకోరలలాంటి కోరల కరిపిస్తానన్నాడు రాము. కోరలపదునులో పగిలిపోకుండా గుంతలుపడకుండా పలుకులు లేవకుండా మసకలుగాకుండా చెక్కు చెదరకుండా మెరుగువాడకుండా నిలువుటద్దాల వాడుకోండి. మీసీడనందులో చూచు కోండి రేపటికుంచుకోండి అన్నది సరోజ.

వాడకుండా వైనముగా వాడుకుంటా. రేపటికికొంచెము వుంచుకుంటా నంటూ చేరదీసి అంకస్థలము చేర్చుకొని వక్షస్థలమునకు వాల్చుకున్నాడు రాము. ఫలా

హారము పండ్లు, నోటికందిచ్చుచూ రుచిగానున్నవా అన్నది సరోజ.

పదార్థమేరుచి. అందులో ప్రక్కలో కూర్చొని పండువంటి వడుచు భార్య తినిపిస్తూవుంటే పరమానందముగాక వేరేమున్నది. సరోజానీవు ఆచరించే ఆచరణలు చూస్తే సంసారములోగల సారమంతా సంగ్రహించి బాగసంస్కరింప బడినట్లు వున్నది యెక్కడనో యీసంస్కారము అనుభవము అన్నాడు రాము.

అనుభవముగలిగి అన్నీతెలిసిన పెద్దముత్తయిదువులవద్ద కన్నతల్లికడ సంస్కారము అన్నీచదివి అనుభవము కొరకై కోరి వీరితెచ్చుకున్న తమకడ అనుభవము యింకా అంతోయింతో తెలియకపోతే నేర్చుకొనేవారు తమరున్నారుగా అని నోటికడ్డముగా పైట చెరుగు పెట్టుకొని వాల్గంట చూచినది సరోజ.

ముందు అనుభవజ్ఞులచే సంస్కరింప బడలేదన్నమాట అన్నాడు రాము.

క్రొత్తలో ముందు వెనుకలు తెలియక సందేహ మొకప్రక్క సిగ్గుబిడియములు మరొకప్రక్క వుండి నాభర్త నాకుటుంబమనే భావము తెలియక పోయిన కాలమది. నాకుటుంబము నాభర్త అని తెలిసి వర్తించే రోజులివి. భార్యాభర్తల మధ్యలోగల బాంధవ్యము ఆనందము తెలియని రోజులవి తెలిసి, వచ్చిన రోజులివి. అందువల్ల నాలో మార్పుగల్గినట్లు తమకుగన్పడు చున్నది. అని చిరునవ్వు నవ్వినది సరోజ.

అయితే తెలిసి నాఉదరపోషణ భారము వహించి నావన్నమాట అన్నాడు

ఔను నాసర్వభారములు నిర్వహించినప్పుడు మీఉదరపోషణ భారము, నేనెందుకి నిర్వహించకూడదు అన్నది సరోజ. అయితే పెనిమిటి ఉదరభారము భార్యపై ఆధారపడి ఉన్నదనియు పురుషుని ఆనందమే స్త్రీ ఆనందమనియు పురుషుని జీవమే స్త్రీజీవమనియు తెలుసుకున్నా వన్నమాట అన్నాడు రాము.

ఔను మీ ఆరోగ్యమే నాభాగ్యమనియు, మీ ఆనందమే నాయానందమనియు, మీ ఆనందములో నాయానందము మిశ్రమమై లీనమై యున్నదనియు తెలుసుకున్నాను. చేజారినది పట్టుకున్నాను మీరు ముందుజన్మలో చేసిన పాపమువల్ల

పట్టుదలగల యిల్లాలువచ్చి కొంచెము దుఃఖపడినారు. వెంటనే సుకృతఫలము అందు కొని పట్టుదల ఘాతమునకు పంచాక్షరీ మంత్రమై పారదోలినది. పునరుద్ధరింపబడి నది నేనుమ్ముందుచేసిన సుకృతఫలము చాలామంచిది. అని తనలేత చిగుళ్లలాంటి చేతులతో చెక్కులనంటినిమురుతూ మంచి పురుషుడు మంచిబుద్ధిగలవారు మంచి విద్యావంతులు శాంతచిత్తులు ఘాతదయా పశ్చాత్తాపముగలవారు. దయామయులు ధనికులు దాతృత్వముగలవారు, ఆరోగ్యముగలవారు. కావలెనని మంచిపూజలు చేసినాను సంపాదించుకున్నాను. మీరు చేసినపూజలో తొలుత కొంచెము చెడ్డ వుండినది. నాబుద్ధినిమార్చినది నాపూజాఫలములో ఏకొరంతలులేవు. మిమ్ముల మార్చలేదు. నాపూజాఫలము మీరు, మీ పూజాఫలమునేను మీ పూజాఫలములో ఏవోకొరతలు వుండినవి. నా పూజాఫలములో ఏకొరంతలులేవు. అంటు భుజముపై తలవాల్చినది సరోజ.

యిట్లత్రిప్పి, అట్లత్రిప్పి, నాకేచుట్టితివే ముందు దోషినీనైను. యిప్పుడు దోషివిపీవు అన్నమాట. సెబాష్ నాపూజాఫలమునీవు. నీపూజాఫలమునేను అని బాగా తేల్చుకొని తెలుసుకున్నావన్నమాట. సరోజా యజ్ఞయాగాది క్రియలుచేసి నాకలోక ములోనున్న అప్సరసల పొందపోవుచున్నారు పెద్దవారు. నేనో ముందుజన్మలో చేసివచ్చి యిక్కడనే అప్సరసలకన్నా మిన్నయగు యిల్లాలితో ఆనందపడుచున్నాను. వారికన్నా మిన్ననేనే అన్నాడు రాము.

ఔను కవుల కందని ఊహలు కలలెజగతి అన్నారు. ఊహలలో ఉయ్యాల లూగుతారు కవులు. అంటూ తమలముసేయని నోరును అని మొత్తిచ్చి నవ్వినది సరోజ. అవతలగీటు చదువమన్నాడు. రాము రాదు అన్నది సరోజ.

అయితేనేను పూరిస్తానంటు.

రమణుల చనుమొనలమీద రాయని మేనుఞ కమలములులేని
కొలకును హిమధాముడులేని రాత్రి హీనము సుమతీ అన్నాడు.

సుమతి, అనే రాముని సరోజచూచి చిరునగవుతో రెండు చేతులతో ముఖము కప్పివుచ్చు కొన్నది. సిగ్గు నభినయించెదవా బిడియముతో బిగువుచూపెదవా అంటూ రెండు చేతులా బలవద్గమనముతో రెండుచేతుల ప్రక్కకులాగి ముఖము ముఖములో చేర్చుపోయినాడు రాము.

మంచినీరు వద్దా అన్నది సరోజ.

అధరామృత మున్నదిగా.

ఆ॥ చదువులందు పాడి మొదవులందును స్త్రీల
పెదవులందు రాజ్య పదవులందు
ఆశలేనివార లవనిలోలేరయా అన్నాడు వేమన మరియు

ఆ॥ పనసతొనలకన్న పంచదారలకన్న
జుంటితేనెకన్న జున్నుకన్న
చెరుకురసముకన్న చెలిపెదవి తీపురా అన్నాడు.

నారరత్నము నరులకు అన్నాడు సుమతి అన్నాడు రాము.

ఆ నారీరత్నము చెడితే అన్నది సరోజ.

నారీమృత్యువు నరులకు అన్నాడు రాము.

పకపక నవ్వి సరోజ చెక్కులు నిమురుతూ వాల్గంట చూచుచూ తెలిసి నటించితే అన్నది సరోజ.

నారేరత్నము నరులకు అంటూ అధరామృతమాన పోయినాడు రాము.

అధరము వదలండీ అమృతము తెచ్చియిస్తానని లేచిపోయి పాలుతెచ్చిత్రాగిపి సర్వతో భద్రముగా చుట్టబడిన పాన్-బీడాచూపి.

శ్లో॥ తాంబూలం కటుతిక్త ముష్ణమధురం క్షారం కషాయాన్వితం
వాతఘ్నం క్రిమినాశనం కఫహరం దుర్గన్ధనిర్నాశనం వక్త్రస్యాభ
రణం విశుద్ధికరణం కాగ్నిసన్దీపనం తాంబూలస్య
సఖే త్రయోదశగుణం స్వర్గేపితేదుర్లభాః అన్నారు.

తాంబూలము కారము, చేదు, తీపు, వగరు అను రసములు కలదిగను ఉష్ణముగను క్షారయుక్తముగను వాతఘ్నముగను క్రిమిఘ్నముగను కఫహరముగను దుర్గంధమును పోగొట్టునదిగను ముఖమునకు అలంకారము నొసంగునదిగను నోటిని శుద్ధము చేయునదిగను తాంబూలమునందుగల యీపదమూడు గుణములు స్వర్గము నందుకూడా దుర్లభములు అన్నారు అన్నది సరోజ.

వరె వరె వరే వకపదము పోగొట్టి అర్ధము చదువుతావా. కామాగ్ని సందీపనం అనలేక పోయావా.

శ్లో॥ ప్రత్యుషసి భుక్తసమయే వరయువతీనాం సంగమే విరమే
విద్వద్రాజ సభాయాం తాంబూలం యోనఖాదతిసపశుః॥

ప్రాతః కాలమునందును, భోజనానంతరమునను స్త్రీ సంగమమునందును, సంభోగాంతమునందును, విద్వద్రాజ సభలయందును. తాంబూలచర్వణము చేయనివాడు పశువు అన్నారు. వరయువతీ నాం సంగమే అని చేయి పయికెత్తి వకచేయి చెంపనపెట్టి రాగముతీయ బోయినాడు రాము.

ఆ ఆ ప్రక్కన పెద్దలున్నారు. ప్రేమతత్వం పెరగనీకండి సంగీతాలకు సాహిత్యాలకు సమయముకాదు చెంపన చేయిచేర్చకండి, అంటూ పాకాబిడాతెచ్చి నోటిలోపెట్టి గడ్డముక్రింద చెతులుంచి నాసగమో అన్నది సరోజ.

ఇదుగో నీసగమంటూ అర్ధము పంటితో కత్తిరించుకొని అర్ధము సరోజ నోటిలోవుంచి ఏదయినా చెరర్ధమేనా అన్నాడు రాము.

ఔను అర్ధాంగిని ఏదితెచ్చినా ఏదివచ్చినా ఏదిచేసినా ఏదిచెందినా చెరిఅర్ధం అన్నది సరోజ.

అకునములుతూ మేను నిమురుతూ నేను నవ్వితేనన్నాడు రాము నేనూ నవ్వుతానన్నది సరోజ కోర్కెకోరితే నన్నాడు రాము కోర్కె తీర్చుతానన్నది సరోజ యింతలో నాల్గుగంటలయి అలారము గడగడమన్నది. సరోజ ముఖము వాడ్చినది యెందుకట్లముఖము మార్చితివన్నాడు రాము.

ఏముంది యెప్పుడో పోయింది ప్రొద్దు అన్నది సరోజ.

సుఖములో ప్రొద్దుగానరాదు. దుఃఖములో ప్రొద్దుగానచ్చును. దుఃఖములో వకరోజు వకయుగమగును సుఖములో వకయుగము వకరోజగును ఇది ఏమివింత అన్నాడు రాము అవునంటూలేచి రాముపాదములు నొసలంట నమస్కరించినది సరోజ.

ఏలనమస్కరిస్తావు. యీనాటి ప్రేమఘట్టాలు ఏనాటికీ యెడతెగకుండా వుండునట్లు ఆశీర్వదించమనియా అన్నాడు రాము.

సరోజ ముసిముసి నగవులతో దీవించు పేగాదు కనీ కానక కాలూచేయి తగిలి వుండవచ్చు తెలిసీతెలియక జబాబులిచ్చి వుండవచ్చు కోరినకోర్కెల తీర్చలేకపోయి వుండవచ్చు యెంగిలీమంగలం తగిలివుండవచ్చు దాసురాలి తప్పులు దండముతో క్షమించండీ అని పెద్దవారు యెక్కినమంచము యెక్కినాను. ప్రక్కనపండినాను పెద్దవారి ఆదేశముతో అంకస్థల మలంకరించినాను. తప్పులక్షమించమని నమస్కరించినాను క్షమించినారా చెప్పండీ అని చేతులు జోడించి నవ్వినది.

క్షమించు నేరములుగావు. చేసినది చేయించుకొని అప్పుతీర్చ వలసినదే అన్నాడు రాము.

వడ్డీతో అప్పు రేపుతీర్చుతాను. యిప్పటికి సెలపియ్యండీ అని హొయలుతో వాల్గంటచూపుల బరపి పోబోయింది సరోజ.

రాముచేయిబట్టి ఆపి భుజములపై రెండుచేతులువేసి సరోజా యీనాడు నీచదువు సార్థకమయినది. చదువును చాలుగా పంపినావు. సాధించి సాహసించి హిందూమతధర్మమును త్యజించి సంచరించుటకు కాదని గ్రహించుకొని చక్కని జబాబులిచ్చి సంతోషపెట్టి సర్వవిధములా సుఖపెట్టి సతీపతి న్యాయమెరింగి సౌఖ్యమిచ్చి సౌఖ్యపడి చదువును సార్థకముచేసినావు చదువుకున్నభార్య జన్మ జన్మానికీ వద్దన్ననోట చదువుకున్న భార్యే కావలె. సర్వసౌఖ్యములు పొందవలెననిపించినావు చిలుకపలుకులవలె మైమరపించు మాటలతో కర్ణానందము పుష్ప సుగంధ ద్రవ్య పరిమళములతో ఘ్రాణానందము, మధురపదార్థ క్షీరపానీయ తాంబూలచర్వణములతో, జిహ్వానందం వయసు హొయలుతో, వాల్గంటితళుకుతో, దేహసౌష్ఠవముతో నయనానందము ఆలింగన చుంబన కుచకుంభ స్పర్శనతో దేహానందమునిచ్చి జీవుని పంచేంద్రియములద్వారా బ్రహ్మానందములో చేర్చినావు. సురతసుఖ సోపానముల ద్వారా చూడరాని లోకాలచూపినావు. యింక ఏకొరంతలులేవు పరమానందము మహదానందము బ్రహ్మానందమంటూ చుబుకముచేత నంటినాడు రాము.

మీ ఆనందములో మామగారికి కాఫీ మరచినారా వద్దా పొరగడుపున. పంపుతారా అన్నది సరోజ.

కాళ్లు కాళ్లు కొట్టుకుంటూ కన్నకూతురిని కాపురానికి పిలుచుకవచ్చిన మామగారిని బరిగడుపున పంపినవాడు దుఃఖపెట్టి పరాభవించి తగుమర్యాదచేయక అల్లునిగర్వముచూపి సాగనంపినవాడు మానవుడుకాడు. మానవాకృతిగల స్వేతవరాహము కఠిన హృదయముగలకు రక్కసుడు. అన్నాడు రాము.

ధర్మాలుచేప్పేవారు దారనెందుకు బాహూ మధ్యములో బంధించినారు చెయివదలండీ కాఫీచేస్తానంటూ చేయివిడిపించుకొని ధనము దేహము దాచుకొని తిరగండీ దేహము భార్యదొంగలిస్తుంది. ధనము సర్వులు దొంగలిస్తారన్నారు. దోపిడీ జరుగకుండా కాచుకోండీ అని వాల్ గంటితళ్లు వైనంగా రాముపై బరపి వెళ్లిపోయినది సరోజ.

రాము బండీవానికై బయటికిపోయినాడు. సరోజ ముఖప్రక్షాళనము చేసుకొని పొయ్యి వెలిగించి నీళ్లుపెట్టి భుజంగరావును లేపినది. భుజంగరావు లేచి పలుతోమి వచ్చి ప్రయాణమయినాడు. అంతలో రాము పలుదోముకొనివచ్చి కాఫీ అయినదా అన్నాడు. అయినది మీకొరకైయెదురు చూస్తూవున్నది. అన్నది సరోజ. అట్లయితే రమ్మను అన్నాడురాము. వస్తూవున్నదంటూ యిద్దరికీ టేబిల్ పై కాఫీపెట్టినది. సరోజ. యిద్దరు కాఫీ పుచ్చుకున్నారు. బండివచ్చినిల్చినది. సామానులేమయినా వున్నవా అన్నాడురాము. ఏమీలేవన్నాడు భుజంగరావు. ఏదోవకమూటె తెస్తివి గదప్పా అన్నది సరోజ. అదినీదేనంటూ మీఅమ్మను రెండుమూడు రోజుల్లో పంపుతాను. నేనువస్తానమ్మా అన్నాడు భుజంగరావు. సరోజ సరేనంటూ పోయి తండ్రి పాదములకు నమస్కరించినది. రాము సరోజ మ్రొక్కిలేవకమునుపే తానూ సాగిలపడి నమస్కరించినాడు. యిరువురను చూచి భుజంగరావు అబ్బురపడి ఆనందభాష్పములు తుడుచుకుంటూ ఆశీర్వదించి పోయివస్తానమ్మా అన్నాడు. ఊఁ అన్న సరోజ. రాము ముందు బయలుదేరగా భుజంగరావు వచ్చి బండియెక్కినాడు రా బండి యెక్కుచూ వాకిలివేసుకొమ్మన్నాడు మీరు నిలువండి నేను బస్సుయెక్కగలః పరవాలేదు అన్నాడు భుజంగరావు వాకిలి వేసుకుంటాను భయములేదు పోయిరం అన్నది సరోజ. బండి బయలుదేరి స్టాండుచేరెను. భుజంగరావు బస్సులోకూర్చొ

క్షద్రము పోయివస్తానన్నాడు. పరవాలేదు పోయిరండి అన్నాడు రాము. బస్సు బయలుదేరింది రాముతిరిగి వచ్చినాడు. సరోజ వాకిలివేసి పోయి మూట ఏమిటా అని కుట్టువిప్పినది అందులో నాల్గు పట్టుచీరెలు నాల్గు మంచిరవికెలు, ఒక జత మంచికట్టుపంచెలు, జరీ కండువా పైపంచఒకటి రెండువందల రూపాయలు ఒక జాబువుండెను. జాబువిప్పిచదువ ప్రారంభించెను.

చిరంజీవి రామారావుకు మంగళాశీర్వచనము ఉ॥ సా॥ మాచెల్లెలు చేసిన కార్యమును గురించి ఏమి చెప్పుకొనుటకు వీలులేక యింతవరకు నిన్నుచూడలేదు యిందునుగురించి క్షమించు. యీనాడు దైవానుగ్రహముతో ఆమె ప్రయాణమైవచ్చినది. చదువుకున్నవాడవు శాంతచిత్తుడవు వివేకజ్ఞాన విచక్షణ గలవాడవు. నీకు చెప్పనక్కరలేదు. యీమెతప్పులను మాతప్పులను క్షమించి స్వీకరించ నేను మా కుటుంబమువారెల్లరు ప్రార్థించుచున్నాము. యింతే మంగళాశీర్వచనములు.

ఇట్లు మీబావ
శివప్రసాద్

అబ్బా స్త్రీసర్వులకూ అమృతము. చాలుదప్పితే విషము. స్త్రీవల్ల తలిదండ్రులకు, అన్నతమ్ములకు, అక్కచెల్లెండ్రకు, వదినెమరదండ్లకు, బంధుమిత్రులకు, గౌరవము, అగౌరవము సంభవించును. స్త్రీతనజీవిత నాటకములో లయతప్పినా, శృతితప్పినా, హావమాగిన, భావమాగినా, పాటతప్పినా, పథముతప్పినా, రసము తప్పినా, అన్ని అందాల అన్నిచందాల అందరితో పోరే యీపాత్ర పోషణే మహా కష్టకము. చక్కగా పోషిస్తే సైఅంటారు, చాలు తప్పితే చాచాఅంటారు. నిజమెరింగి కష్టసుఖాలుతెలిసి మాటాడరు. కాకులవలె వ్యాకుల పడెదరేకాని కారణమేమో తెలుసుకోలేరు. యింటాబైటా అనిపించుకొనకుండా వుండాలంటే గౌరవముతో బ్రతుకాలంటే అందరి గౌరవము కాపాడాలంటె తనపాత్రపోషణ తాను చక్కగా నెరవేర్చుకొనుట ఒకటి, పతి ఆదరణ సంపాదించుకొనుట మరొకటి, భగవతీ అనుగ్రహము సార్జించుట యింకొకటి, వుండవలయును. యీమూడులేకున్న ముప్పుతిప్పలేనని తలంచుకొను వేళకు రాము వచ్చి వాకిలి తట్టినాడు. యెవరండీ అన్నది సరోజ. యింటి యజమానిని అన్నాడు రాము. యింటి యజమానురాల నంటూ వాకిలి తీసి లోపలికివచ్చినది. రాము లోపలికివచ్చి యీయింటి యజమానురాలెక్కడ అన్నాడు. యజమానికి యెదురుగనే వున్నదంటూ కండువా పంచెవిప్పి మెడలోవేసి విజ్ఞాపన అంటూ జాబు చేతికిచ్చి నమస్కరించెను. ఏమిటిదీ అంటూ

రాము చదివెను. సరోజ నవ్వుతూ చదివినారా బావగారిప్రార్థన. మా కుటుంబము వారి ప్రార్థన అంగీకరించి మీ అర్ధాంగి మనవి ఆలకించి యీజతపంచెల మీరు పంపిన డబ్బుల మీ అర్ధాంగితోసహా స్వీకరించండి అని నవ్వినది సరోజ.

ఏమిటిడీ సరోజా యెందుకుతెచ్చినావు యిట్లతేవచ్చునా అన్నాడు రాము.

యిట్లచూడండీ మీయిల్లాలికి యెట్లాటి మస్తులో నాల్గుపట్టుచీరలు నాల్గుపట్టు రవికలు డబ్బుకువడ్డీ అన్నియిచ్చినాడు. తనచెల్లెలు అత్తవారింటికి కాపురానికి పోతూ వున్నదనే ప్రేమహడావిడిలో మీబావ మాఅన్న అయిన శివప్రసాద్‌గారు పంపుకున్న కానుకలు.

మానాన్న కొడుకును పిల్చి యీమెను పిల్చుకొని బజారుకుపోయి కావలసిన గుడ్డల తీసియివ్వ పొమ్మన్నాడు. నాకు అక్కరలేదన్నాను. అటుపై నాకు తెలియదు యీ కూర్చిన మూట మానాన్న తెచ్చినాడు ఏమిటో అనుకున్నాను. యిప్పుడు విప్పి చూతుగదా యివన్నీ వున్నాయి. యిదంతా మాఅన్న చేసినపని నేను యిక్కడికివస్తే తనకెంత ఆనందమయినదీ వీటితో తెలియుచున్నది. నోరుతెరచి అడిగితే పట్టుమని పదినయాపైసలు యిచ్చేవాడుకాడు. చెల్లెలు చేసిన అమానుష పిశాచము బాధించి వేధించి సాధించి పోతూవుండగా పట్టుచీరల పట్టురవికల యిచ్చి పొలిమేరదాటించి నాడు. పాపము బావమరది శాంతమునకు మెచ్చి కండువాల కట్టుపంచెలా పెట్టి పంపినాడు. యీ శాంతము యింకెంతతెస్తుదో. కావలెనంటే యిచ్చేవారులేరు కానుకూడా వద్దంటే కట్టి నెత్తినపెట్టేవారున్నారు. యింకాచూడండీ మీశాంత మెత పనిచేసిందో అని తనపెట్టె దగ్గరకు పోవు సరోజను చూచి నాశాంతమేమయినా తేనీ నీపిశాచాన్ని మాత్రము పంపవాకు అని నవ్వినాడు రాము.

అయ్యయ్యో యిక యీపిశాచాన్ని పంపితే జన్మములేదు యిప్పటికె యింటి వారందరూ సగమయిపోయినారు పాపము నీశాంతము మాకుటుంబానికి అమృతము పోసింది. నన్ను బ్రతికించుకున్నది. లేకువ్న అంతాదుఃఖమే మీశాంతాన్ని వేనోళ్ల పొగడవలె మిమ్ముల యికెన్నినోళ్లనో నాకు తెలియదు, మాఅన్నగారు చెల్లెలను పరిగ్రహించే నిమిత్తము పారితోషికముఃతో డబ్బుకువడ్డీతో రెండునూర్లుగా పరి గ్రహించండీ. చిత్తగించండీ అంటూ పంపుకున్నాడు తీసుకొనండీ అంటూ చేతిలో పెట్టి తమరు నెలనెలకూ పంపినడబ్బు ముల్లెగట్టుతూ మాఅమ్మయిచ్చిన డబ్బు

ఖర్చుపెట్టుతూ వచ్చినాను. బరణంపంపినట్లు విడాకులు పుచ్చుకున్నదానికి పంపినట్లు పంపుచుండినారుగా మీరు. పంపినడబ్బు వచ్చినప్పుడంతా నాతోమాయింట్లో యెవ్వరూ మాట్లాడరు. మీమంచినిగురించి నాచెడ్డనుగురించి వ్యాఖ్యానాలుచేస్తూ వుండేవారు. అదివిని నామనస్సు పరిపరివిధములా వడుగిడుతూ పోవలెనా, వుండవలెనా అని చర్చించుచుండేది. మీరు వకతూరి వచ్చివుండిన వచ్చేదానను మీరువచ్చుటకు తీరనిసమస్యఅయినది. ఇదంతా నాకర్మఫలము దీన్ని యెత్తిపెట్టండీ అంటూ డబ్బు చేతికిచ్చి గుడ్డలు యెత్తుకపోయి అలమారులో పెట్టినది. ఇది అంతా చూచి రాము ఆశ్చర్యపడినాడు. అంతలో తెల్లగ తెల్లవారినది. పొరక తీసుకొని చాకిరీమనిషి ప్రత్యక్షమయినది. సరోజ లేచి నీళ్లపొయ్యి అంటించి వంటరూములో పాత్రలను బయటపెట్టి వంటరూము శుభ్రిపరచెను. అంతలో పాత్రల శుభ్రపరచి తెచ్చి వుంచిరి సరోజ స్నానముచేసి కాఫీవేయ ప్రారంభించెను. రాము స్నానముచేసివచ్చి దేవుని దగ్గరదీపము వెలిగించి పూదువత్తులుముట్టించి ధ్యానముచేయుచుండెను. సరోజ కాఫీ తెచ్చిపెట్టి దేవునికి నైవేద్యముచేయండీ అన్నది. రాము నివేదనచేసినాడు. సరోజ నమస్కరించి కాఫీగిన్నె యెత్తుకపోయి గ్లాసులో పోసి ఆర్చితెచ్చి యిచ్చెను.

రాము త్రాగుతూ ఆడవారు అమృతహస్తులు ఆహారముచేయుటము ఉగ్గుపాలతో వచ్చినదీ అన్నాడు.

పదినాళ్లు అలవాటుపడనీండి చక్కగాచేస్తాను. ప్రథమములోనే హేళన చేయకండీ అన్నది సరోజ.

హేళనకాదు యిప్పుడు నేను గృహస్తుడనయినాను యిల్లు పావనమయినది దుఃఖము సుఖముగా మారినది. నాకష్టము నీవుతీసుకున్నావు. నీకష్టము నేను త్రాగుతున్నాను. అన్నాడు రాము.

సరోజ నవ్వుతూ కాఫీత్రాగుతూ ఏమికష్టమూ అన్నది సరోజ.

యిప్పుడు నేనుచేసిన పూజాఫలములో సగము పంచుకున్నావు. నీవు కష్టపడి చేసినకాఫీలో సగము యిచ్చినావు యిట్లు పంచుకొని పంచియిచ్చేవారు లేక మూడు నెలల నుంచీ అవస్తపడినాను. అవస్థపడినా అమృతమయమై ఆలువచ్చినది. అన్నిటా అరితేరి అవతారమెత్తిన అరుంధతిగా అన్నాడు రాము.

అయ్యో నేనెట్లయినా సరే. మీరు మాత్రము వసిష్ఠులుగాకండి తెల్లగడ్డము చూచి సహించలేను అన్నది నవ్వుతూ సరోజ.

రామునవ్వుతూ సరే నేను స్కూలుకుపోవువేళకు వంటతయారవుతుందా అన్నాడు. ఓరడీ అన్నది సరోజ. రాము మణియార్డరుఫారము తీసి వ్రాసి రెండు నూర్లరూపాయలు బావకు పంపడమునకు పోష్టాఫీసుకు పోయెను. సరోజ శ్యామలా దండకము శివరంజనీ రాగముతో తాళయుక్తముగా చెప్పుకొంటూ చారు, వంకాయ పులుసు, చామగడ్డ పొడికూర, మామిడల్లము, పచ్చడి, అన్నముచేసి, దేవుని దగ్గర దీపముయెలిగించి పదార్థములు అన్నీ అక్కడపెట్టి చేతులు జోడించి ధ్యానము చేయుచుండెను.

రామువచ్చి కాళ్లుకడుగుకొని మడుగుపంచెనుకట్టి వంటశాలకు పోయి చూచెను. సరోజ ధ్యానము చేయుచూ చిరునవ్వు నవ్వినది. రామునవ్వుతూ రైట్ రైట్ నిన్ను నీకార్యములా మెచ్చుకోవలసినదే గృహలక్ష్మి అనే బిరుదు యివ్వవలసినదే నంటూ దేవునికి నివేదనచేసి మంగళహారతియిచ్చి నమస్కరించెను. సరోజ మోకరించి దేవునికి రాముకు నమస్కరించి చేయిపట్టెను. రాము వింతగా చూస్తూ సెబాష్ అంటూ తీర్థమువేసెను. సరోజ కన్నులకద్దుకొని పుచ్చుకొని తిరిగీ నమస్కరించి పదార్థముల తీసుకొని వెనక్కు మూడడుగులుపెట్టి పోతూ ఏమిమంత్రము చెప్పుతూ నాకు తీర్థమువేసినారు అన్నది నవ్వుతూ.

ఓపురాణ దంపతులారా తమకు నేను యీయింటిలో చేరినది మొదలుకొని ఏనాడుగాని పిల్చి యింత అన్నముపెట్టినదిలేదు. మీకు పెట్టక తిన్న అన్నము అన్నముకాదంటారు. అజ్ఞానాన్ని అనారోగ్యాన్ని సృష్టిస్తుందంటారు. అష్టదరిద్రాన్ని తెస్తుందంటారు యీజన్మకు గాక మరుజన్మకు మరింతకల్పిస్తుందంటారు యివన్నీ తలచుకొని యిల్లాలువచ్చేదెన్నడూ యింటి దీపం వెలిగేదెన్నడు వంటచేసి మీకుపెట్టే దెన్నడు మీదయసంపాదించేదేన్నడూ అని యింకా యెన్నెన్నో కలలకంటూ ఆతురత పడుతూ వుండేవాన్ని. యీనాడు అమృతతుల్యముగా అన్నము తయారుచేసి నివేదన చేయండీ అనే యిల్లాలువచ్చినది. వచ్చినా శబరి అవతారంయెత్తే అవతారంకాదు. స్వామీ అంటే మీకు తెలుసునో లేదో బాగున్నదా లేదా. ఉప్పువున్నదాలేదా, కారము సరిపోయినదాలేదా, అని కొంచెము రుచి తమకన్నాముందు చూచే రకం

కాదన్నమాట అన్నీ తెలిసి ఆరితేరివచ్చిన ఆడది. అన్నమాట. యిక నిత్యమూ భయ భక్తులతో యీలాగ చేసి పెట్టుతూవుంటుంది. చేచాచి అడిగితే వక అబ్బాయిని తోడుగావుండటానికి ముద్దు ముచ్చటలతో మురిసిపోవటానికి తొందరగా దయ చేయండీ అని అడిగి అదేమంత్రాన్ని ఉపయోగించినాను అన్నాడు రాము.

అంతలో పీటా ఆకు వేసి కూర్చోండి అంటూ వడ్డించినది. రాము భోంచేస్తూ వుండగా సరోజ చిరునవ్వునవ్వుతూ అన్నము తింటూవుంటే అడ్డమువచ్చే అయ్య గారు లేరని చింతగావున్నదా వున్నారు తొందరగావస్తారు రామప్రసాదమంటూ యెత్తిస్తాను వారువచ్చేవేళకు వస్తుసామగ్రికై డబ్బును ఆర్జించే వైనము ఆలోచించండి లంచాలుకొట్టి లాభాలు తీసి బ్రతికించేవైనం వద్దు. అవి అలూపిల్లలభాధిస్తాయి కష్టపడి చెమటూడ్చి తేచ్చేదేచాలు.

ఆ॥ గంగగోపాలు గంటెడైననుచాలు
కడివడైననేమి ఖరముపాలు
భక్తిగల్గుకూడు పట్టెడైననుచాలు ॥వే॥ అన్నారు.

భగవంతుడిచ్చినది చాలు. ఉద్యోగానికి కావలసినది విద్య దైవశక్తి దీనినే అదృష్టమంటారు. విద్యను అభివృద్ధిచేయండి చేసి ధర్మంగా డబ్బును ఆర్జించి ఆలుపిల్లల సాకండి. యిహంలో పరంలో సుఖముంటుంది ఏమంటారు అన్నది సరోజ.

లంచాల్తో మోసాల్తో పనిలేదు యెంతమందివచ్చినా భయములేదు మాయమ్మా నాన్నా మీయమ్మా నాన్నా వున్నారుగా కొందరిని అటు అబ్బా జేజీకి, కొందరిని యిటు అవ్వా తాతకు పంచిపెడ్తాము అన్నాడు రాము.

మీరు తయారుచేయడము వారికి బరువుపెట్టడమునా ఇదెక్కడ నేర్చు కున్నారు అన్నది సరోజ.

ఔను మనవల పై, మనుమరాండ్ర పై, అవ్వా తాతాకు, జేజీ అబ్బకు చాలా ప్రీతి మనము వుండనివ్వమన్నను వుండనివ్వరు. అన్నాడు రాము.

అంతలో భోజనమయినది. చేతికి నీళ్లుయిచ్చి చేయి కడుగుకొను వేళకు తుండుపంచెతెచ్చి చేయితుడిచెను సరోజా. రాము చొక్కావేసుకొనెను. సరోజ పాక్ బిడాచుట్టి రామునోటికి అందిచ్చెను. రాము స్వర్గము స్వర్గలోకము అంటూ వస్తానన్నాడు. సరోజ నవ్వుతూ యీస్వర్గాన్ని స్వర్ణాన్ని మతిలో వుంచుకొని చేసేపని చెప్పేచదవు మరచిపోయేరు. స్వర్ణం స్వర్గం యిక్కడనే వుంటును. పరవాలేదు పంతులుగారు అంటే యెట్లుండవలయునో తెలుసా. పిల్లలున్నంతకాలము పంతులను మరువకుండా వుండునట్లు చేసుకొనవలయును. వారిజీవితకాలమంతా పంతులు మంచివారని జ్ఞాపకము చేసుకొనునట్లు చెప్పవలయును. వారు పెద్దపెద్ద ఉద్యోగులయినప్పుడు కూడా మరువకుండా వుండునట్లు చేయవలయును. వారి అభివృద్ధిగోరి బాగా చెప్పవలయును చెప్పినా అదేజీతం, చెప్పకున్నా అదేజీతం హాజరయితే సరీ క్లాసులో వుంచేసరి యిచ్చేది సర్కారు. తినేది ఆలుపిల్లలు అన్నారా ప్రజాద్రోహం రాజద్రోహం విద్యాద్రోహం సంభవించి మీపిల్లలుమొద్దులు అయ్యేదో, మీరే ముందు జన్మకు బుద్ధిలేని మొద్దుదద్దమ్మలయ్యేదో తప్పదు. యింకా పిల్లలతో మతిభ్రష్టనీ ముక్కోపివి అని మూర్ఖుడని సోమరియని, దురభ్యాసకుడని, ధూర్తుడని, దుష్టుడని, చక్కగా చెప్పడని పిల్లలతో అనిపించుకొని అధికార గర్వముతో అవకతవకలు చేసితిరా వుండనేవున్నది. పిల్లలందరినీ తనపిల్లలగా చూడవలెను. రానివారిని పిలిచి నచ్చచెప్పవలయును. జీవితములో యెక్కడగుపడినా నమస్కారమనునట్లు చేసుకొనవలయును. పెట్టినవారిని తిట్టినవారిని చదువుచెప్పినవారిని చెప్పనివారిని ఏమానవుడు యెప్పటికీ మరువడు. తమరు పిల్లల మనలులో యెవరిగాచేరుదురో నన్నది సరోజ.

మంచిచెడ్డల మధ్యలోవున్నాను, బడిపిల్లలకు, పంతులను నేను. పంతులకు పంతులవు నీవు. ఇందుకే చదువుకున్నయిల్లాలు కావలెననేది, మంచిచెడ్డల చెప్పుతూ మనసులోగల మైలకడుగుతుందన్నారు. యింక చెడ్డను విడచి నీమాటల బుద్ధికెక్కించుకొని మంచిలోచేరి పుణ్యమార్జిస్తాను. పిల్లల అభివృద్ధికి తెస్తాను కీర్తిని చేరతీస్తామ నాకదేవరా పిల్లలుంటారుగా మొద్దు దద్దమ్మలయితేయెట్ల వేళ అయింది వస్తాను సార్ అన్నాడు రాము.

సరోజ మీ నవ్వుతూ శుభంగాపోయి సుఖంగారాండి సార్. చూపెట్టుకొని వుంటుంది యెపోయెదురు చూస్తూవుంటుంది అని మనసులో పెట్టుకోండి సార్ అన్నది.

నవ్వులోవుంది నరుని బ్రతుకు అంటూరాము పోయినాడు.

సరోజ భోంచేసి యింటిపనులు సవరించి చాపవేసి కూర్చొని తమలము సేయుచూ యెంతో ఆనందముగా సాగిపోయే సంసారాన్ని కాలదన్ని పోయి కట్టుకున్నాను పాపము అంటూ కొంచెమునేపు తలవాల్చి లేచెను. మూడుగంటలయి వుండెను లేచి కాఫీ చేసి తా)గి గుడ్డల పిండి ఆరవేసి తలదువ్వి బొట్టుపెట్టెను. యింతలో కసువూడ్చు పనిమనిషివచ్చి కసువూడ్చెను. ఆమెతో ఆమాట యీమాట మాట్లాడు తుండగనే అయిదు గంటలాయెను.

రాము స్కూలు విడచి పూలు పంప్లు తీసుకొని వచ్చి సరోజా తెచ్చినాను అన్నాడు రాము.

ఏమిటివి అన్నది సరోజ నవ్వుతూ.

అన్నిహంగులా అందాన్ని దీర్చిదిద్దుకున్న తమపరి అమర్చుకునేవి ఆనంద మిచ్చేవి అంటూ పూలను నెత్తిలోపెట్టినాడు రాము.

సరోజ నవ్వుతూ ఆడవాళ్లకు పూలను మొగవాళ్లు పెట్టుతారా అన్నది.

యీ అందమూ యీచందమూ యీహావమూ యీభావమూ యెవరికొరకో అన్నాడు రాము.

అందం చందం హావం భావం తమకొరకే అన్నది సరోజ.

యిదంతా నాకొరకైతే నాకొరకై నేను పూలు యెందుకు పెట్టకూడదు. నాకొరకై నేను ఏమయినా చేసుకోవచ్చు అన్నాడురాము.

ఔను తల్లీదండ్రీ యిచ్చుకున్నారు, తమరు తెచ్చుకున్నారు మధ్య నా దేము న్నది ఆడమంటే ఆడవలె పాడమంటే పాడవలె నన్నది సరోజ నవ్వుతూ.

ఆ ఆ అదేతక్కువ అష్టభోగములలో యేడువున్నవి. వకటి తక్కువే అను కొంటూవున్నాను ఆకాస్త ఆశతీరిస్తే నాకింకేమీకొదువ వుండద న్నాడురాము.

తోజయ్యేకొద్ది మోజు యెక్కువౌతుందన్నారు. ఊ అదేదో కొంచెము సెల వియండీ విందాము అన్నది సరోజ.

యేమున్నది అన్నీ మనకున్నవే అన్నము అన్నమున్నది కావలసినంత. వస్త్రము వస్త్రసుఖము కావలసినంతావుంది. గంధము గంధమేమి సెంటు మొదలగు సువాసనలు యెన్నోవున్నవి.

పుష్పము పుష్పములు నిత్యము తెచ్చుకొను శక్తివున్నది. తెస్తా యిస్తా ధరిస్తావ్ చూస్తా సువాసన అఘ్రాణిస్తా. పానుపు పరుపు మంచము దిండు మొదల గునవి వుండనే వున్నవి. తాంబూలం వద్దన్నా శ్లోకాలు చదువుతావు విశేషమయిన సుగుణాలు చెప్పుతావు. పాఁబీడాచుట్టి తినిపిస్తావు. స్త్రీ స్త్రీగా నీవుండనే వున్నావు అన్నాడు రాము.

సరోజ నవ్వుతూ నేను స్త్రీగా నగుపడుతూనే వున్నానా అన్నది.

స్త్రీగా వకటేకాదు శ్రీగానూ వున్నావు. సంపద్వ్యక్తమగు సిరులన్నీ నీలో వున్నవి గానీ అన్నాడురాము. గానీయెందుకు అవక్కటీ ఏదో సెలవిండీ విందాము అన్నది సరోజ.

ఏమున్నది నీవన్నదే స్త్రీగానము అన్నాడు రాము.

తమసెలవయితే ఆ కొదువా తీరుస్తాను. అష్టైశ్వర్యములు కోరకపోయితిరే పాపము అంటూ రాముపైన కంటి మెరుపు పంపినది సరోజ.

ఆమెరుపు వెలుగు హరించీ నవ్వుతూ వాటెలోనా పకటే తక్కువ అది యింకా కొలదికాలములో తీరుతుంది అన్నాడు రాము.

అదీ కొంచెముచెప్పండి విందాము అన్నది సరోజ.

ఏమున్నవి దాస దాసీ జనము వుండనే వున్నారు. దాసీ జనము నీకు దాసులు నాకు కొదువేమున్నది. యిక బంధు మిత్రులు కావలసినంతమందీ వున్నారు.

ధనమూ ధాన్యము యీరెండూకూడా భగవంతుడిచ్చినంతా వున్నవి. యిక వాహనమా సైకల్ వుండనేవున్నది. కారు కావలెనంటే వస్తుంది వద్దంటే పోతుంది. యిక యెనిమిదోది కొలదికాలములో రాగలదు అన్నాడు రాము.

ఏమిటిదది చెప్పండీ, ఊఁ చెప్పండి విందాం అన్నది సరోజ.

అది నీలోవున్నది పుత్రుడూ పుత్రుడు అంటూ నవ్వినాడు రాము.

నవ్వుతారెందుకూ అదెంతపనీ తమనుండీ వెళ్ళదీ నానుండీ బయల్వడీ వస్తాడు తొందరపడకండీ ద్వాదసినాటి పాయసాన్ని అసిస్తే ముందున్నది ఏకాదశి అన్నట్లు తల్లినై నేను, పిల్లడైవాడు తే తే అంటూ నట్టింట కూర్చుంటే తహతహ పడతారు. తల్లడిల్లుతారు తల్లీ పిల్లను చాకేతాహతు ముందు సంపాదించండీ తల్లీపిల్లా తెమ్మంటుంటే తిన్నగా జారుకునే అన్నగారిలాగా తయారుకాకండి. యిప్పటినుంచే యం. ఏ. కి కృషిచేయండి నాకృషిలో ఏలోపము వుండదు. తమ ముద్దుముచ్చటలు తీరుస్తాను అన్నీ వున్నాయి ఆనందమంతా నాదేనని హాయిగా యిప్పటికీ యీకాఫీత్రాగండి అంటూ కాఫీతెచ్చి యిచ్చినది సరోజ.

ఆనందమంతానాదే పరమానందం బ్రహ్మానందం మహదానందం అంటూ కాఫీత్రాగినాడు. యిట్లానందముగా ఆనాడు కాలము నడచినది.

భుజంగరావు మధ్యాహ్నము వేళకు పోయి పూజ చేసెను. అనసూయమ్మ యిల్లుచేరివుండెను. పోయిన త్రోడనే అదృష్టాగా ఎదురెక్కివచ్చి ఏమిజరిగినది. అంటూ చుట్టూ నిల్చుకున్నారు అక్కడ జరిగినవన్నీ చెప్పుచూ అతడు మనకు అల్లుడుకాదు దైవము. ఆశాంతము మర్యాదా అణుకువా ప్రేమ యెవరికున్నది. యింత వయసయినది నాకులేదు. ఆబాల్యములో అతనికి ఆశాంతము వుండవలయునంటే సామాన్యముకాదు. చక్కగా సంస్కరింపబడినాడు. యింతకూ మనము ముందుచేసిన పూజాఫలము మంచిది. అయినా తలిదండ్రులు ఉత్తములు వారు తయారుచేసిన వస్తువది. అందులో ఏకొదువా వుండదు, మనకొక తీరని కళంకము మోయలేని బరువు. మెడన పడివుండెను ఏదేవుని దయచేతనో మన పుణ్యముచేతనో మనము మన కుటుంబము బయటపడినాము. పడినదిగాక ప్రబలముగా ముందుకు వచ్చి గౌరవప్రతిష్ఠలు నిల్పేసూచనలు గన్పడుచున్నవి. యిక్కడనుంచీ పోయినది మొదలుకొని పదిమంది పిల్లలతల్లిలాగున తయారై యెంతోసంతోషముగా వకరినొకరు ప్రేమిస్తూ యిద్దరూ అంత వద్దికగావున్నారు. అతడు మంచి ప్రేమగలవాడు శాంతవాది. అందుచేత క్షణములో అతుక్కున్నారు. అంతులేని ప్రేమగలిగింది యీ అతుకు యింక బ్రతికినంతకాలము వూడిపోక వూడలుపారగలదు. చూడు పండ్లు వూలు ఆకులు పక్కలు వకబుట్టికొని అన్నీపెట్టి తెచ్చి నాముందు పెట్టినాడు యెందుకిదంతా అంటే అమ్మకు వదినెగార్లకు సరోజ పంపినది అన్నాడు.

అల్లునికుండే గర్వాలు అణుమాత్రముకూడా అతనిలోలేవు. కన్న కొడుకులకన్నా మిన్న అనవచ్చును. యిద్దరు పిల్లవున్నారుగదా ఏనాడయినా అంతప్రేమగా విచారించి వుండరనుకుంటాను. యిదంతా సంస్కారములోవున్నది. ప్రేమమయం ప్రపంచం అన్నారు. వకరినొకరు ప్రేమించడం వకరి పనిని వకరుపంచుకొనడం వకరికష్టముల వకరు యెదొర్కొనడము వకరుతినేది వకరికి పంచి ఇవ్వడం వకరినొకరు గౌరవించడం వకరినొకరు ఆదరించడం వకరికొకరు ఉపకరించడం వకరితో నొకరు కలిసి మెలసి పాలనీళ్లన్యాయముగా సంచరించడం కుదిరినదే బంధుత్వం యీగుణాలన్నీ రాములో తిష్ఠవేసి కూర్చున్నాయి. తీర్చిదిద్దినారు తలిదండ్రులు యీకరుణ సీతమ్మచేసినపని చక్కగా కుదిరినది అన్నాడు అందరూ సంతోషముతో నవ్వినారు ఆదేసమయానకు సీతమ్మ నేను అక్కడికి పోయినాము అందరూ మమ్ముచూచి నవ్వినారు. ఏమి మమ్ముచూచి నవ్వుతారే అన్నాము మీ పుణ్యమా అంటూ నవ్వుతున్నాము అన్నారు. ఏమీ అన్నాము సర్వము చెప్పినారు. అందరము సంతోషముతో అంతేచాలు ననుకున్నాము.

పిల్లలు మంచివారేనమ్మా తల్లులు చెప్పచేతగాక తీర్చి దిద్దలేకపోవుటే దీనికి కారణం అన్నాను.

నాచేతనేమౌనమ్మా ఏవో చెప్పతగ్గమాటలు చెప్పినాను గాని మీవలె చెప్ప నాచేత నేమౌనమ్మా యెట్లో పుణ్యముగట్టుకున్నారు ఆమే వకయింటి యిల్లాలయినది. మాకష్టము తీరినది మీరు చేసినమేలు మరువమమ్మా అన్నది అనసూయమ్మ.

దైవానుకూల్యముంటే దారికొస్తారు దారివిడువరు దారి కాని దారి బట్టితే దాపు యిచ్చేవారెవరమ్మా మగవాడు మాటను, స్త్రీ శీలము దాచుకొని వుంటే ఏనాటికైనా ముందుకువస్తారు కలుసుకుంటారు కాపురము చేసుకుంటారు మనసు మనసులో కలిసి పోతుంది. మగవాడు మాటవిడచినా, స్త్రీ శీలమువిడచినా చిక్కే యీచిక్కు తీరేది కాదు మాటమరువలేదు శీలమువిడువలేదు కలుసుకొనక యెక్కడ పోతారు నేర్పుతో ఓర్పు, ఓర్పుతో కాపురము, నేర్పులేక వేనవేలు స్త్రీలు చెడి పోవుచున్నారన్నాను.

కాదే పశువుకైనా పదిమార్లు తిండిపెట్టితే పదమని మెడిమెలు త్రొక్కుతూ వెంటవస్తుంది మనిషి మనిషిని నమ్మరారేమే మనసు కరిగేటట్లు స్త్రీయో లేక

పురుషుడో చేస్తే మమతా మరులు పుట్టదా మానవత్వం లేతా యిరువురు అట్టివారే అయితే వుండనేవున్నది. భూలోకస్వర్గం అన్నది. సీతమ్మ అంతేనమ్మా వుంచేది అంటూ అందరమూ పోయినాము.

రెండవరోజు ఉదయం తొమ్మిదిగంటలకు పోష్టుపీవన్ వచ్చి శివరావు యెవరూ అన్నాడు. ఏమి అంటూ యింటిలో నుంచి శివరావు వచ్చినాడు. మణి యార్డరు ఫారము వకజాబు చేతికియిచ్చినాడు పోష్టుపీవన్. జాబు విప్పిచూచు చుండగా వ్రాలు వేయండీ మళ్లీ చదువుకుందురు అంటూ రెండునూర్ల రూపాయల నోట్లు చేతికియిచ్చినాడు పీవన్. వ్రాలుపెట్టినాడు శివరావు. అంతలో భుజంగరావు వచ్చి ఏమిటదీ అన్నాడు. శివరావు జాబు చదువప్రారంభించెను. యింటిలో అందరూ వినుచుండిరి.

బ్రహ్మశ్రీ వేదమూర్తులగు బావగారికి. అనంతదండ ప్రణామములు ఉభయ కుశలోపరి సాంప్రదం మామగారు మీచెల్లెలు సుఖముగా వచ్చి వూరు చేరినారు. తమరు గుప్తదానముగా నాకు చెల్లెలికి గుడ్డల పంపుతూ అందులో డబ్బునుకూడా పంపినారు. తమ ఉదార స్వభావము మరువతగినదికాదు. మరువలేము యీస్వభావము మానవులలో వుండుటరుదు సరోజ నేను పంపినడబ్బును కాసుఖర్చుచేయ కుండా ముల్లెకట్టి తెచ్చినది. నాడబ్బు నావస్తువ సక్రమముగా తయారై సాలుమూలా తెలుసుకొని యిల్లుచేరినవి బాకీలేదు తమరు పంపినడబ్బును తిరిగీ పంపినాను. అన్యథా తలంపక తీసుకొన ప్రార్థించు చున్నాను. మీలాంటి దయామయులు గౌరవనీయులు నాకు లభ్యమగుట నాపూజా ఫలమనుకున్నాను. అత్తమామగారికి అక్కగార్లకు చిన్నబావకు మానమస్కారములు. తెల్పకోరుచున్నాము అందరికీ నమస్కారములు తెల్పమన్నది సరోజ. యింతేనమస్కారములు.

ఇట్లు భవత్ ఆశీర్వచనాభిలాషులు.

రాము, సరోజ.

అనిచదివినాడు. అందరు ఆశ్చర్యపడినారు. సంతోషపడినారు యెక్కడి వారు అక్కడ పోయినారు.

అక్కడ రాము శయన గృహములో కూర్చొని యం. ఏ. కి కావలసిన పుస్తకాలు చదువుతుండగా సరోజ పాలగ్లాసు పాన్‌బిడా తీసుకొనివచ్చి ఏమి చేస్తున్నారు అన్నది.

ఏమున్నదీ నీయాజ్ఞను కొనసాగిస్తూ వున్నాను. భార్యమాటభర్త, భర్త మాటభార్య వినేతీరాలన్నావుగా. విన్నాను కష్టపడి చదువుతున్నాను. నాముద్దు చెల్లించకపోతె మనసారా నీముద్దు చెల్లించనన్నావుగా, నీమాటకు యెదురా అన్నాడు రాము నవ్వుతూ.

ఔను భర్తగౌరవముతోనే భార్యగౌరవము. పురుషుడు దాస్యోద్యోగం చేస్తుంటే స్త్రీదాసిగాక రాణీ అవుతుందా. మీభర్త ఏమిచదువువున్నాడు ఏమిపని చేస్తారు ఏమి ఆర్జిస్తారు. అని సాటివారు సాటివారిలో అడిగితే గౌరవమయిన చదువు ఉద్యోగం వుంటే తొందరగా వినకున్నా చెప్పుతారు. హీనమయినదయితే ఏదోలేండీ అన్నానికి గుడ్డకు కొదువరాకుండా చేస్తారు అంటూ మూతి ముడుచుకొని జారుకుంటారు. చింతిస్తారు పురుషుని అనాథగా భావిస్తారు ధనములో విద్యలో రూపములో ఉద్యోగములో బలముగలవారి భార్యలు బలవంతులై కొంచెమడిగితే కొసవరకూ అడక్కసు చెప్పుతారు. స్త్రీకి పురుషబలమే బలము. పురుషుని గౌరవమే గౌరవము, పురుషుడు దేనిలోనో వకదానిలో ప్రజ్ఞావంతుడుగా ఉంటే భార్యకు ఆనందంవుంటుంది. పదిమందిలో చెప్పుకుంటుంది. అప్రయోజకుడయితే అనాథ అయితే ఏమి చెప్పుకుంటుంది. తన వ్రాతకు చింతిస్తుంది. రోషి అయితే దుఃఖిస్తుంది మతిభ్రష్టు అయితే దూషిస్తుంది. అట్లనే స్త్రీలయందు పురుషులకూ ఆశవుంటుంది. నాభార్య అపనిచేస్తుంది యీపనిచేస్తుంది యిదితెలుసు అదితెలుసు నని చెప్పుకొంటూ ఆనందిస్తారు. యింకా శీలవతి అనురాగవతి అనుకూలవతి అయితే అతని జీవితమంతా ఆమెయందే వుంటుంది. స్త్రీ పురుషులు దేనిలోనయినా వకదానిలో ప్రవీణులై వుండవలయు, అందరూ దానికై ప్రయత్నము చేయవలయు. ధనానికో విద్యకో ప్రయత్నము చేయుటమానరాదు. మైథున నిద్రాహారములు మూడుతప్ప మరేమీ తెలియని అప్రయోజకులెందరో వున్నారు. వారు జీవచ్ఛవాలై వారుల చూచి దుఃఖించుటో దూషించుటో చేయుచుందురు. మీరు రేపు యం. ఏ. పరీక్ష అయితే నాసంతోషానికి మేరే వుండదు. నామనసే మీహృదయములో చేరుకుంటుంది. పదిమందిలో గర్వించి తిరుగుతుంది గౌరవనీయులలో చేరినానని గంతులేస్తుంది. మీరుపిలిచి పిలువకమునుపే పలుకవలె ననిపిస్తుంది. ప్రేమా ప్రీతీ యేకమై పంచేంద్రియములనే మరచి పారవశ్యనై ప్రక్కనే వుండవలె ననిపిస్తుంది అంటూ నవ్వుతూ పాలనుతెచ్చి త్రాగండీ అన్నది సరోజ.

ఏల యీనాడు యిట్లయిచ్చుచున్నావే అన్నాడు రాము.

పాన్‌బిడా నోటికందించినది నవ్వుతూ సరోజ.

ఏమో వుందిరా రామూ అన్నాడు నవ్వుతూ రాము.

యీనాడు పంచాంగం చూచినారా అన్నది సరోజ.

పడకటింటిలో పంచాంగమేమిటే అన్నాడు రాము.

పంచాంగములో వుంది పరమ రహస్యం అంటూ తల వొంగరవేసి నవ్వినది సరోజ.

ఆరహస్యమేమిటో చెవుకొరక్కుండా చెవిలో చెప్పు. గోడకు చెవులుంటాయి వింటే పేదంతా విన్నట్టే ఏడిపించే వూరంతా వున్నట్టే నంటూ అందుకు పోయోయి నాడు రాము.

పరవాలేదు కొంచెము దూరముగానే వుండండి చెవిలో వేస్తా తొందర పడకండీ అంటూ పండుగలు పర్వదినాలు పిల్లలకు చెప్పుతుంటారా తమరు పంతులుగారుగా భౌతికములో అధ్యాత్మికము కలుపకూడదంటారా బాల్యములో చదివినవి మరచినానంటారా దినశుద్ధికూడా తెలియదంటారా లేక తెలుసునంటారా తెలిసితే యీనాడు తిథిఏమోచెప్పండి చూతాము అన్నది నవ్వుతూ సరోజ.

ఓ చతుర్ముఖ బ్రహ్మ ఆశారదాదేవినే యిక్కడ పంపినట్లున్నదే లేక నీముఖ ములలో వకటిట్ల త్రిప్పినావా యీనీతులు, నియమాలు, వ్రతాలు, వక్కప్రొద్దులు, జపాలు, తపాలు, పండుగలు, పర్వాలు, పూజలు, పునస్కారాలు యీవయసులోనే మాయిల్లు చేర్చినావేమయ్యా స్వామీ అయ్యో యింకకాదు. పండుగలు పర్వాలు ప్రక్కన వేసుకొని నీతులు నియమాలు జపాలు తపాలు బుద్ధిలో పెట్టుకొని వ్రతాలు వక్కప్రొద్దులు పూజలు పునస్కారాలు తలక్రింద పెట్టుకొని నోటిలో కరక్కాయ ఉంచుకొని కాళ్లుముడుచుకొని కండ్లుమూసుకొని వచ్చిరాని నిద్దురతో వాసుదేవా, అంటూ పండవలసిందే ప్రక్కమెదిలితే ఆ అగండీ అనేబాబతే యింక కాదు రానురాను ముదిరేపనే అన్నాడు రాము నవ్వుతూ.

పండుగలు పర్వాలూ లెక్కపెట్టక నీతికి నియమానికి కట్టుపడక దైవము దైవయోగ్యదినముల మతిలోవుంచక తిరిగెడువారికి డాక్టర్లు మెడలో వేసిన టీ బీ

బోర్డును చూడలేదు బుద్ధిలేని దద్దమ్మలకని వద్దురా దేవుడా అనే మాటలు చెవుల పడలేదా, అదట్లు వుండనీ పర్వదినాలుచెప్పండీ విందాము. యింతచదువు చదివి పర్వదినాలే తెలియదంటారా హిందూ మతముపైనా హిందూ సాంప్రదాయముల పైనా విశ్వాసము లేదంటారా పూర్వార్థాలు విడచి ఉత్తరార్థాలే మంచివంటారా అన్నది నవ్వుతూ సరోజ.

మా హేట్, బూట్, సూట్, కోట్ చూచి పండుగలు, సర్వాలు, తిధులు, తీర్థాలు, అడిగేవారు అంచుకుకూడా రారు. వీరికి తెలిసి వుండవని వారికే తెలుసు నన్నాడు రాము.

పూర్వాచారాల విడచి ఉత్తరాచారాలు మరగి హిందూ మతమునే విడచుతారా అట్లు చేయకండి చేసినవారిని కొంచెమట్లు చూడండీ యోచించండీ అన్నది సరోజ.

చూచేదేమిటిది యిటు యేడులోకాలకు అటు యేడులోకాలకు బాటవేయ ప్రారంభించినావు. బాట వేయడములో భర్త గంపలు మోయలేక వేకువనే వేయలేక చెప్పేపని చేయలేక కష్టానికి తాళలేక బుద్ధినిపట్టలేక కష్టపడే కాలమువచ్చింది కాస్త కనికరముండనీ పండగలంటే పర్వాలం టేతెలియని పసివాణ్ణి అటు ఆంగ్లేయ న్యాయాలకు యిటు హిందూన్యాయాలకు మధ్యలో యెటు పోవుటకు కనుగానని అంధుణ్ణి. హేట్, బూట్, సూట్, కోట్. మోజు చత్వారిలో తిరిగే బాల్యచాపల్యుని పట్టుకొని కట్టుకొని హిందూమత అహారసువాసన పెట్టి యిస్తా రమ్మంటూవున్నావు. కానీ కట్టివేయ వట్టువేయ కట్టుకున్నవారిమాట కాదనరాదని ముందే మెడకు తలుగు పెట్టినావుగా అన్నాడు రాము.

ఔను నోటిలో వేలుపెట్టితే కొరకలేని పిల్లవాడు తాకు తప్పు తెలియని చిన్నవాడు పండుగా పర్వం తెలియని పసివాడు పాపము పడుచుపిల్లల చూస్తే పండ్లికిలించేది ఏమోనని దగ్గరకొస్తే బాహువుల మధ్యలో బంధించేది బాగాతెలుసు మిగతా వేమీతెలియవు అంటూ తలతిప్పుతూ నవ్వినది సరోజ.

తెలియకున్నా తెలియచెప్పె వృద్ధనారివి నీవున్నావుగా అన్నాడు రాము.

నేనొక వృద్ధనారిలాగా కన్పడుతున్నానా అన్నది సరోజ చిరునవ్వుతో నీవు వృద్ధనారివి గాకున్నా బుద్ధివృద్ధనారీత్వము వహించినదిగా అన్నాడు రాము.

తెలియవంటే చెప్పుతాను తెలిసిన్నంటే చెప్పండీ అంటూ కొంటెపు నవి ఎంచినది సరోజ.

తెలియవు తెలియ చెప్పితే నచ్చచెప్పితే ఎంటా చెప్పు అన్నాడు రాము.

చెప్పుతా వినండీ మాయింటికి శంకరశాస్త్రి అని ఒకాయన వస్తూవుంటాడు. మాయప్ప వారికి యెన్నెన్నో ప్రశ్నలు వేస్తుంటారు. వాడు ఏరూపముననో ఒక రూపమున నచ్చచెప్పుతూవుంటారు. అవి మాయింటివారంపరము ఆచరణలో వుంచుకుంటాము ఏమంటారా పండుగలు పర్వములు అందులో పంచపర్వములు అన్నారు. పంచ పర్వములనగా కృష్ణపక్షాష్టమి కృష్ణపక్షచతుర్దశీ అమావాస్య పున్నమ సంక్రాంతి యీదినములలో చంద్రబలము వుండదన్నారు. అమావాస్య నాడు సూర్యుని వెనుకకు చంద్రుడు పోవుటవల్ల ఏకరాసిలో ఏకనక్షత్రములో యిద్దరు వుండుటవల్ల సూర్యునిచేత చంద్రబలము నశింపై యుండుననియు పౌర్ణమి నాడు సూర్యుని కెదురుగ చంద్రుడుండుటవల్ల యిరువురకిరణములు సంక్రమించి యెదిరించి చంద్రబలము నశింపై యుండుననియు చంద్రుడు క్షీణుడగుటకు కృష్ణపక్షాష్టమి ప్రథమ దినమగుటవల్ల సూర్యుని సమీపించుటవల్ల అష్టమి కూడదనియు చతుర్దశి అమావాస్య వంటిదేననియు అన్నారు. యిక సంక్రాంతి అనగా మకర సంక్రాన్తిపండుగ ఉత్తరాయణమునకు ప్రథమ దినం యీదినమునుండీ ఆరు మాసములు పుణ్యదినములన్నారు. పుణ్య దినములకు ప్రథమదినం ప్రథమమున మకరరాశిలో శ్రవణానక్షత్రమున విష్ణువు అంత్యమున మిథునరాశిలో ఆరుద్రా నక్షత్రమున శివుడు. మధ్యలో వృషభరాశిలో రోహిణీ నక్షత్రమున బ్రహ్మ వున్నారన్నారు. మొదట విష్ణువు. అఖరున శివుడు మధ్యలో బ్రహ్మ యీపుణ్య కాలమునకు అధినాయకులు సూర్యుడు మిథునము దాటువరకు మంచికాలమన్నారు. పుణ్యము చేయుటకు తపస్సు చేయుటకు తీర్థయాత్రలు సేవించుటకు మరీమంచి దన్నారు. యీసంక్రమణములు మాతృపితృ తర్పణకాలమన్నారు. యీ దినములలో దైవధ్యానము శ్రేయమన్నారు. సంక్రాంతితో సంక్రమణములు పన్నెండు యివినెలకొకటివచ్చును. మేషసంక్రమణము మొదలు మీన సంక్రమణమువరకు పన్నెండు. యీదినములలో సూర్యుడు ఒకరాశినుండి మరొకరాశికిపోవును. యీ దినములుకూడా పర్వదినములు మాతృ పితృ తర్పణకాలములు అన్నారు. రాశి సంధికాలము సూర్యునిలో గుణము సంక్రమముగా నుండును. యీదినములలో

సంగమము పనికిరాదన్నారు. వ్యతిరేకించిన అక్షి బలము కుక్షిబలము దేహబలము క్షీణమగు సంతతిగలుగునన్నారు. చంద్రబలము లేకున్నదినముల మైథునము సర్వ నాశనమో లేక రూపహీనమో బుద్ధిమాంద్యమో అధమాయుర్దాయమో తప్ప దన్నారు. దేహమునకు ముఖ్యములయిన అంగ బలకారకులు దుర్బలులగుటవల్ల యీకాలములు పెద్దలు వర్జించిరన్నారు. యిందుకు తమరేమన్నారు అన్నది సరోజ నవ్వుతూ.

గేయం॥ పెద్దలమాట పెరుగన్నం చిన్నలమాటలు చిత్రాన్నం
మధ్యవయసులో మాటలుసున్నం అన్నారు
నామాట వినేవారెవరు యెగురూ పెంటిగువ్వ యెగిరిపోతూవుంటే
పోతుగువ్వ వెన్నంటే యెగురుతుంది
జంటపక్షులూ వెంటనంటే వుండవలె నన్నాడు రాము.

యింకపండుగలు విన్నారా అన్నది సరోజ.

యిప్పుడు నీవయసెంతా అన్నాడు రాము.

పద్దెనిమిది అన్నది సరోజ.

నీబుద్ధివయసో అన్నాడు రాము.

మీరేచెప్పండి వింటా అయినా వృద్ధనారినన్నారుగా అన్నది సరోజ.

వృద్ధనారిని వయసు వరుడు చేసుకుంటే ప్రేమించి వెన్నంటే వుంటుంది చెప్పినమాట వింటుంది వృద్ధవరుని వయసు పడుచు చేసుకుంటే ప్రేమించి వెన్నంటే వుంటాడు చెప్పినమాట వింటాడు అన్నారు. వయసు వరుడను వృద్ధ నారిని చేసుకున్నాను నన్ను వెన్నంటక వెంటరమ్మంటావే అన్నాడు రాము.

వృద్ధవరుని వయసు పడుచు చేసుకున్నదని నావెంటనే రాండి ధర్మవ్యతి రేకములో దించలేదుగా వినండి.

చైత్రశుద్ధపాడ్యమి ఉగాది పండుగ శుద్ధనవమి శ్రీరామనవమి యీరెండు యీమాసములో ముఖ్యముగా ఆచరిస్తారు. యిక వైశాఖమాసములో శుద్ధ తదియ అక్షతదియ పౌర్ణమి వ్యాసపున్నమ దీనినే మొలకలపున్నమా అంటారు వీటను

కొందరు మాత్రము ఆచరిస్తారు. జ్యేష్ఠమాసములో ఏమీ లేవు ఆషాఢమాసములో శుద్ధమందు భీష్మైకాదశి దీనిని ఏకాదశిపండుగ అంటారు దీన్ని అందరూ ఆచరిస్తారు. యిక శ్రావణమాసము శుద్ధమందు నాగులచవితి గరుడపంచమి బహుళమందు గోకులాష్టమి లక్ష్మీనోములు వున్నవి. శనివారములు ఆచరిస్తారు, భాద్రపద మాసములో శుద్ధచవితి వినాయకచవితి శుద్ధ చతుర్దశీ అనంత పద్మనాభచతుర్దశీ వినాయకచవితి అందరూ ఆచరిస్తారు. ఆశ్వీజము యీమాసము ప్రథమమునుండి నవరాత్రిళ్లు త్రిదేవీ పూజలువున్నవి. హిందువులకు గొప్పపండుగ తొమ్మిది రోజులుగాక పదియవనాడు విజయదశమి ఆయుధ పూజ త్రిదేవీ ఉపాసనలతో బాగా ప్రతియొక్కచోట జరుగును. యీమాసము బహుళ చతుర్దశినాడు నరక చతుర్దశీ అమావాస్య దీపావళీ అమావాస్య యీరెండు రోజులు అందరూ పండుగ ఆచరింతురు. మరి కార్తీకమాసము శుద్ధద్వాదశిని చిలుకద్వాదశి అన్నారు. యిది కొందరు మాత్రము ఆచరింతురు. యీమాసములో సోమవారవ్రతములు ఆచరింతురు. మార్గశిర శుద్ధమందు సుబ్బారాయషష్ఠి యిది కొందరు మాత్రము ఆచరింతురు. యిక పుష్యమాసము యీమాసములో ధనుర్మాసమువచ్చును. యీ ధనుర్మాసము మార్గశిరమునుండి వకప్పుడు ప్రారంభమగును. ఎందుకనగా ధనుస్సంక్రమణము సూర్యుడు ధనుస్సు ప్రవేశించినది గాబట్టి అధికమాసములవల వెనుక ముందువచ్చు చుండును వైకుంఠ ఏకాదశి యీధనుస్సులో మొదటి ఏకాదశి యీఏకాదశి వైష్ణవులకు ముఖ్యము ధనస్సు విడచి సూర్యుడు మకరము ప్రవేశించు. నాడు మకరసంక్రమణము యీపండుగ మూడుదినములు వుండును. ధనస్సు ఆఖరుదినము భోగిపండుగనియు మకర ప్రారంభమున మకర సంక్రమణమూ సంక్రాంతి పండుగనియు మరుసటిరోజు పశువుల పండుగనియు ఆచరింతురు యిది హిందువులకు ముఖ్యమయినది ఉత్తరాయణ పుణ్యకాలమని దానములు ధ్యానములు ముఖ్యముగా చేయుదురు. యికమాఘశుద్ధసప్తమి రథసప్తమి బహుళ చతుర్దశీ శివరాత్రి వచ్చును. యిది శైవులకు ముఖ్యము సర్వులు కూడా జాగరణ చేయుదురు. యీ మాసములో ఆదివారస్నానములు చేయుదురు. అశ్వత్థనారాయణ పూజలు జరుగును. ఫాల్గుణ మాసములో పండుగలేమీలేవు యివిగాక సోమ మంగళ శుక్ర వారవ్రతములు, జయంతులు, తిరునక్షత్రములు, జాగరణలు, ఏకాదసులు, యింకా వున్నవి. యివన్నీ దైవసేవా దైవధ్యానము దైవపూజా దినములు హిందువులై హిందూదేశమున జన్మించినందుకు కొన్నియైనా ఆచరణలో

వుంచుకొని ఆదినము మధుర పదార్థమేదయినా చేసి నీచపదార్థముల వర్జించి భక్తితో యిష్టదైవమునో యిలువేల్పునో ఆయాపండుగలకు అధిపతులగు దైవములనో ధ్యానించి పూజించి శక్తికొలది పండ్లు పూలు పదార్థములు నివేదనచేసి భుజించి ఆనాడు మైథునము మానుకొమ్మన్నారు పెద్దలు. తమరేమన్నారు అన్నది నవ్వుతూ సరోజ.

యివన్నీ జ్ఞాపకము పెట్టుకొనవలసినది యెవరూ భార్యా, భర్తా అన్నాడు రాము.

యివన్నీవుండవలసినది స్త్రీలకే పురుషులకు జ్ఞాపకమున్నా వారితొందరలో చెప్పరు నియమబద్ధులుగారు యింటిలోవుండి పండుగలూ పర్వాలూ చూచుకొని ఆచరించుకొనుటకు పంచాంగం యింటిలో సర్వులకూ దేహారోగ్యము తెలుసుకొని వంటావార్పూచేసే టందుకు వస్తుగుణం వైద్యం భర్త ఆర్జించిన డబ్బును చక్కగా తగురీతి సెలవుచేయుటకు లెఖ్ఖాచారము. గృహము గృహోపకరణములు చక్కగా వుంచుకొనుటకు ఓర్పు నేర్పు పిల్లల పెద్దల చక్కగా నడుపుటకు లోకజ్ఞానం బంధువులలో మిత్రులలో ప్రజలలో పరివారములో గృహయజమానిలో నడుచు టకు లవుకికము స్త్రీసంపాదించుకొనవలయునని తెలుసుగాని పట్టుపట్టితే ఆనాడెట్లా అని సందేహం అన్నది సరోజ.

స్త్రీకి పురుషునికన్నా కామము యెనిమిదిరేట్లు యెక్కువన్నారు. నీవే ధర్మబద్ధవైతే యింక అధర్మబద్ధుడనై ఓడిపోయి గడ్డము పట్టుకొని అడుక్కునేది చెరుగుపట్టుకొని చేతులడ్డముపెట్టి వెంటతిరిగేది నేనా కానీ చూతమన్నాడు రాము.

యీమాటపైన వుండేచాలు నేనై వెంటతిరుగునంతవరకూ ఉద్రేకము ఉపసంహరించుకుండేచాలు పంచాంగము తిప్పేది నేనేగా పంచాజ్ఞము వెంబడీ నేను. నావెంబడీ తమరు నడిస్తే ముద్దు ముచ్చటలతో ముమ్మూర్తుల పోలికతో ముచ్చరితల్లుల ఆశీస్సులతో ముద్దతయారై ముందుకు వస్తుంది మురిసి పోతారు. నియమబద్ధులుగాక పోతిరా హద్దుమీరి నడచువారిని దండింపబడునని బోర్డుపడు తుంది లోకముతీరు వెనుదిరిగిచూడండీ అంటూ రెండుచేతులూ రాము గడ్డముక్రింద పెట్టి కొంచెమటు తలపైకి యెత్తి కన్నులలోకి చూస్తూ చిరునవ్వు అంకురింప

హృదయానందముతో కట్టుకున్న వారి ఆరోగ్యమునకై కలిగే పిల్లలదేహ సౌభాగ్యమునకై కామము స్త్రీలు దిగమ్రింగాలన్నారు. పసిపిల్లల ఆరోగ్యం పతిదేహారోగ్యం సతి చేతిలోవున్నదన్నారు బాగా సింగారించుకొని భర్తకు యెడమీయక కామము అణంచి కన్నులు త్రిప్పి తళుకులు చూపి ధర్మము వ్యతిరేకిస్తే వారే వయ్యామౌతుంది దయితౌతుంది అన్నారు. రైతుబిడ్డ పాడి, పశువు కడుపు తన కడుపు కన్నా బాగా చూస్తుంది. రెండు పూటలే పాలు పిండుకుంటుంది. యెప్పుడంటే అప్పుడు పిండక నియమముగా నిల్పుకుంటుంది. దూడకు కావలసినన్ని పాలు విడుస్తుంది. తిండీ తీర్థం ఏవేళకు ఏదిపెట్టవలయునో ఆది పెట్టుతుంది. యీనీ పోయేటప్పుడు వంటిపూటకే సంతోషిస్తుంది. మధ్యలో జబ్బూ జ్రావస్తే తనకొచ్చినట్టే భావించి బాగుచేయిస్తుంది పశువుబాగుకై అటమట పడుతుంది పాలకై యిన్ని బాధలభరించి బాగుపడుతుంది కానీ ముంత తీసుకొని పొరుగింటికి చల్లకైపోదు. కన్నా కాటిక చెడకుండా ఆవూ, దూడా మెతకుండా పండకు వెలితిపడకుండా యింటికి తక్కువగాకుండా చూస్తుంది. అట్లే పతిని పసిపిల్లల చూస్తూ వారి దేహారోగ్యం వారిమనోభావం తెలుసుకొని స్త్రీలు నడుచుకోవలె, నడిపించుకోవలె లేకున్న పురుషుడు యిల్లువిడచి ఏటికి పోవుటో యిజిగి చచ్చుటో వూరువిడచుటో రోగమని చెప్పుటో పనిలేనిపనులకు పారిపోవుటో సిగ్గువిడచి వెన్నుచూపుటో పౌరుషానికి మంగల కత్తులు మ్రింగి టీ, బీ, బోర్డు మెడకుతగిలించుకొని కన్నులు త్రిప్పితే బోర్డు చూపించుటో తప్పదన్నారు. కొండంత దేవునికి కొండంత పత్రి యెవ్వరు పెట్టగలరు అని నవ్వినది సరోజ.

అమృతములాంటి అలిమాటలకు ముగ్ధుడై రాము టీ. బీ. కి దీనికి సంబంధమున్నదంటావా సరోజ అన్నాడు.

ఔను మీకు తెలియదూ ఐతే వినూ అంటూ వారగంట అదొక వైఖరిగా చూస్తూ చిరునవ్వుతో అన్నం అన్నరసం, అన్నరసముతో రక్తం, రక్తముతో క్రొవ్వు, క్రొవ్వుతో శుక్లం యీనాల్గుటితో శుక్లము ఖర్చయ్యేకొద్దీ క్రొవ్వు వెన్నంటవలయు, క్రొవ్వు ఖర్చయ్యేకొద్దీ రక్తము వెన్నంటవలయు, రక్తము ఖర్చయ్యేకొద్దీ అన్నరసం వెన్నంటవలె, అన్నరసం వెలితి పడకుండా ఆహారం అలు అందిస్తూనే వుండవలె. యిట్లు వకదానికొకటి వెన్నంటక పోయిన సప్త ధాతువులు సంగ

మానంతరమున శోషించును. శోషించుటవల్ల నిద్రాహారములు అరుచితో శోషతో తక్కువగును. వీటితో మరింత సప్తధాతువుల బలము క్షీణించి శోష గలుగును. దానితో గాలితిత్తులు గుండె మూత్రకోశము మెదడు ఉడుకెక్కి పతలాలై నిరుత్సాహమేర్పడును. దీనితో గుండె వేడియై దగ యిచ్చును. దానితో గొంతులో పలుకు లేర్పడి పొడుచుకొనుచూ దగ్గువచ్చును. దగ్గుతో గుండెకు, గాలితిత్తులకు శ్రమ యేర్పడి మరింత వుడుకై గల్ల యేర్పడును. హృదయమునుండి దుర్గంధమగు వాసన యేర్పడును. లోపలినుండి వచ్చెడిగాలి చాలా వేడిగావచ్చుటవల్ల గళము ముక్కులు అరి పోవును. దప్పి యెక్కువగును. అస్థులలో ఉడు కేర్పడును. మూత్రము వచ్చగా అగ్నిరంగుతో వచ్చును. యిట్టిసమయములో మనసు పట్టలేక మమత నాపలేక సంగమముచేసిన మరింత యెక్కువగును. ఇది యొక విధము. ఉష్ణాధిఖ్యతవల్ల పైత్యమై అన్నము పోక నిద్రరాక దేహము శుష్కింప దానిలో సంగమ దోషము గలిగి మరింత ఉడుకై సర్వాంగములు దుర్బలమై గాలితిత్తులు గుండె మూత్రకోశము ఉడుకేర్పడి, ఉడుకుతో గళము అరిపోతూ పొడిదగ్గు గలుగును. దగ్గువల్ల దొమ్మకు శ్రమగలిగి వేడియై గల్ల యేర్పడును. దీనిలో ఆహార విహార వ్యవహారములలో లోపించి క్షయకు మార్గ మేర్పడును. టి బి బోర్డు వడును. మూలము అతిగా శుక్లనష్టమై ఉడుకేర్పడి, ఉడుకును సమర్థించుకొన లేని లోపము, యీ లోపము తానుగాని, అమ్మో, అలో గాని తీర్చిన క్షయలు లేవు అక్షయలులేవు. యీ విషయాలు మా ఆచార్యులవారు మావదినె గార్లకు నూరిపోస్తూ వుండేటప్పుడు నేనూ విన్నాను. వారు మాకు తండ్రివంటివారు యే విషయమయినా దాచక చెప్పుతారు. నేను వచ్చునప్పుడు గౌరవార్థముగా పంచల జిత, పండ్లు, పూలు, టెంకాయ, తాంబూలం పెట్టి వారికిచ్చి నమస్కారము చేయమన్నాడు మా అప్ప. నేనట్లచేయగా నేను చెప్పినమాటలు నిన్నువెన్నంటి నీమనసున స్థాయిగా నిల్చి ధర్మమును బోధించుగాత. అని ఆశీర్వదించినాడు. పోయి వస్తా స్వామీ అని చేతులు జోడించగా వారు చిరునవ్వుతో అమ్మా నా మాటలు జ్ఞాపకమున్నవా. రాము ప్రాణము, మానము నీ చేతిలో నున్నవి. అలువై మానము, అమ్మవై ప్రాణము కాపాడు. మట్టి బీజమై వంశమును పెంచు. భార్యా రూపవతీ శత్రుః, తప్పితే మృత్యుః అన్నారు. నీవు రూపవతివి మరింత జాగ్రత వుండవలయును. జ్ఞానము ఉపయోగించి రాము వంశ వృక్షమును తలిదండ్రుల కన్న బిడ్డల కంటికి రెప్పలాగ కాపాడు. పుట్టినింటివి, మెట్టినింటివి కీర్తి గౌరవ

ములు నీచేతిలో నున్నవని చేయి సాచినాడు. నిల్చుతానని చేతిలోచేయి వేసినాను. వారి మాటలు వజ్రపు తునకలై నా దేహములో నాటుకొనియున్నవి అన్నది సరోజ.

ఆచార్యా నీకు నా జోహారులయ్యా! శిష్యుని ఏలాగా తయారు చేసినారు. తమరు పెద్ద ఆచార్యులై చిన్నాచార్యులగా తయారుచేసి పంపినారు. మీమాట యీ ఆచార్యులవారు యెట్లు జవదాటరో మీ శిష్యులైన యీ ఆచార్యులవారి మాట నేనూ జవదాటను స్వామీ అని రాము అనుచుండగా సరోజ నవ్వుతూ రెండుహస్తములతో నోరు మూసి నన్ను పురుషుల్లో చేరుస్తున్నారా ఆచార్యు లంటారా అన్నది సరోజ.

ఓ స్త్రీలలో పురుషులు, పురుషులలో స్త్రీలు వున్నారు. సర్వ విషయములు తెలుసుకొని సంఘములో వేలు చూపించు కొనక పురుషుని లాగ సర్వ కార్యములు నెరవేర్చుకొని శీలవతియై యజమానికి సైదోడై, చేదోడై, వాదోడై, మంత్రియై మంచి మార్గములో మగని నడుపుతూ కష్టములకు వెన్నియక యెద యిచ్చి నిల్చి సంసారము నడిపే స్త్రీని స్త్రీ అంటారా? అనేవారు బుద్ధి హీనులు. నేను అనను పురుషుడే నంటాను. తల్లి దండ్రుల, దారా పుత్రాదుల, సోదరీ సోదరుల బంధుమిత్రుల కాయ కష్టమో మనః కష్టమో చేసి సాకలేక సోమరియై సప్తవ్యసనములకు లోనై తిండిపోతై వకరికష్టము వకరి ఆకలి వకరి దుఃఖము తెలుసుకొనక శుంఠయయిన మగవానిని మగవాడనే వాడు మతిభ్రష్టు. మోసము, దగా, చోరతనము, అవినీతి అబద్ధాలు నేర్చుకొని లోకవంచకుడై, లోకకంటకుడై తిరిగే పశువుల మగవాడనేవాడు మానహీనుడు. పర దారలకు, పరాన్నములకు, పరుల సొత్తుకు పాకులాడు వారిని మగవాడనేవాడు మతిహీనుడు. నిశ్చయమయిన మగవాడు యీ నడతలకుపోడు. పరులచే నింద్యుడుకాడు. వృత్తినో, ఉద్యోగముననో జీవిస్తాడు. యిలాంటివారిని ఆడవారిలో చేర్పవలయును. వీరు పురుషాకృతిగల స్త్రీలు. పౌరుషము, జ్ఞానము, కీర్తి చేపట్టి ప్రజ్ఞా వంతులయిన స్త్రీలు, స్త్రీయాకృతిగల పురుషులు. నిన్ను పురుషులలో జమకట్టుకున్నాను అన్నాడు రాము.

నన్ను పురుషులలో జమ కట్టి, తిరిగీ వివాహము చేసుకుంటారా ఏమి అన్నది సరోజ నవ్వుతూ.

లేదు లేదు బుద్ధి పురుషులా, దేహము స్త్రీల ననుసరించినావు. యిట్లు రెం

డూగల స్త్రీ దొరుకుట పురుషుని అదృష్టము. రెండూ నీలోగలవు వేరే స్త్రీలు అక్కరలేదు అన్నాడు రాము.

బ్రతికినాను ఎప్పుడు యేదోవకటి చెప్పుతూనే వుంటుంది పాడుబోకి యని నిట్టూర్పు విడిచే విజ్ఞానవంతు లున్నారు. వారిలాగా అనరుకదూ అంటూ సమీపించి పాదములపై చేయి పెట్టినది నవ్వుతూ సరోజ.

అమగో అజ్యానికి అగ్నిచూపుతున్నావు. పొలతి దావ వహ్ని పురుషుడాజ్య ఘటంబు కదియకుండరాదు. కదిసెనేని అన్నాడు రాము.

ఔను ఆజ్యానికి అగ్ని చూపి కరిగించితేనే సువాసన వెలువడేది. పేరిన నెయ్యి సువాసన తనలో నిముడ్చుకొని వుంటుంది. పండుగకన్నా ముందురోజే కావలసినవన్నీ తెచ్చుకున్నట్లు శుక్రవారము రేపని గురువారమే తులసిని కోసినట్లు రేపు పర్వదినము గాబట్టి పతియాజ్ఞ సతి యీనాడే తీసుకునుచున్నది. ఓన్న వించు కున్నదని నవ్వుతూ పైట నోటి కడ్డు ముంచుకున్నది సరోజ.

అనగా పర్వదినము రేపయితే పరమ ధర్మాలు యీనాడే వెల్వడినాయన్న మాట అంటూ చిల్పిచేష్టలు చేయ ప్రారంభించినాడు రాము. యిట్లు సుఖప్రదముగా అనాడు కాలము నడచి పోయినది.

మరునాడు శుక్రవారము మధ్యాహ్నము సరోజ శిరస్నానము చేసి తలవెంట్రుకలు కీలుగంటు వేసుకొన్నది. వెంట్రుకలు నల్లగ పొడవై పిరుదుల వరకు వ్రేలాడుతూ, వెన్ను భాగమునంతయు నాక్రమించి నిగ నిగ లాడుతూ వుండెను. ముఖ మండలమున తెల్లతామరలవలె సోయగమిచ్చు కన్నులకు భ్రూమధ్య స్థానమున చంద్రవంకలాగ తీర్చి దిద్దిన కుంకుమ బొట్టునకు స్వయం ప్రకాశమున దొండపండు రంగు ధిక్కరించి తాంబూల చర్వణమున మరింత వన్నె గడించు అధరములకు ఉల్లిపొట్టు వన్నె సన్నని వలువమేని చాయలో లీనమగుచుండ కంఠమున స్వచ్ఛమయిన కెంపులతో చేయబడి మిరిమిట్లుగొల్పు నూటయెనిమిది సన్నని పగడములచే బంగారు తంతెతో బాగా అల్లబడిన దండయు, వృద్ధ పుణ్యాంగనా స్వయంసిద్ధమై పసపుతో రుద్ధి తాళిగూర్పబడిన నూలుత్రాడు వక్షోజములపై చిందులాడ అప్పుడు అవనికి దిగివచ్చిన అచ్చరలాగ సరోజ ప్రకాశించు చుండెను. మూడు గంటలకు ఫలాహారము, కాఫీ చేసి ఆహారమయింది అయ్యగారు రావచ్చునన్నది సరోజ.

సెలవు దినములలో కూడా శ్రమ యనక శ్రద్ధగా చదివే విద్యార్థిని కాని, విద్యార్థిని చదువాగిపోతుంది, ధార నిల్చిపోతుంది, మనసు మారిపోతుంది, రస ము విరసమౌతుంది, అమృత హస్తములతో ఆహార పదార్థముల నెత్తుకొని అవ నికి దిగి వచ్చిన అచ్చర లాగ యిక్కడనే అవతరిస్తే బాగుంటుం దనుకుంటా నన్నాడు రాము.

ఊఁ అవతరిస్తా అన్నీ తెస్తా యివతలికి రాకుండే అంతేబాబు నంటూ గది లోపలికి ఫలాహారము, కాఫీ తీసుకొని పోయెను సరోజ.

చదువు సంధుపడుతుందంటావా అన్నాడు

ఊఁ తమరు చదివే చదువు నాకు తెలుసులే రేపు ఏమే రెంపికపోయి వచ్చి నానే అనే పద్ధతిలే యిది. పిల్లవాళ్లకు రెండూ చేస్తావుగా పెద్దవారికి యెందుకు చేయకూడదంటారు. అది నాయిష్టం అనకండే. సేవకుడు దొరికెనని రాత్రిం బవళ్లు అంతులేని పని గల్పించి అన్నిటకు వాడుకొనకండి. దయా, దాక్షిణ్యముం చండీ విరామ మియ్యండీ అంటూ పకోడా కొంచెము తుంచి ఉర్లగడ్డ పొడీకూర కొంచెం ముందువుంచి నోటి కందిచ్చెను సరోజ.

ఆహారము అమృతోపమానముగా నున్నది. అహోయెంతరుచి అన్నాడురాము.

ఔను అమృత హస్తములతో అమృతోప మానముగా ఆహారము తయారుచేసి అలే తినిపిస్తూవుంటే, అయ్యగారి ఆనందం యేమిచెప్పవలెనే ఇంద్రలోకం పోయి నట్లూ, అప్సరసలతో తిరిగినట్లూ, కామోద్రేకము కనులగప్పి కనుమూసినట్లూ, కనులు తెరిచేటప్పటికి కులకాంత యెదుట యిక్కడ వున్నట్లూ వుంటుందిలే ఊఁ తినండీ అంటూ యిచ్చుచుండెను సరోజ.

అయ్యో తిరిగినట్లూ అనకపోతే కలిసినట్లూ అన కూడదూ అన్నాడు రాము.

అయ్యో పొరపాటు కలిసి మెలసి పులిసినట్లూ, అనవలసింది యింక అంటాను అన్నది సరోజ నవ్వుతూ.

నీకో అన్నాడు రాము.

నాచేతులు మీరు వాడుకొంటూ వున్నారుగా అన్నది సరోజ.

అయితే బయలు నాచేతులిస్తానని పుస్తకము క్రింద పెట్టినాడు రాము.

సరోజ నవ్వుతూ పోయి తనకూ ఆహారము అక్కడికే తెచ్చుకున్నది.

ఒకరిచేతులు ఒకరికి యిచ్చుకుందామా అన్నాడు రాము.

యెవరివి వారికుండనీండి ఒకరివి ఒకరికివస్తే వైనం తప్పుతుంది శివమెక్కు తుంది. మీచేతులు వూరకుండవు చిలిపిచేష్టలు చేయ సిద్ధమౌతాయి. చిలిపిచేష్టల్లో చిందులూ శివాలూ ప్రారంభం అవుతాయి. తమచేతులు తమరే ఉపకరించుకొనండి వూరకుంటారు. అంటూ సరోజ తింటూవుండగా రాము ఉర్లగడ్డకూర అయిపోయి సరోజ దగ్గరవున్న ఉర్లగడ్డకు చేయి పెట్టినాడు. సరోజ రెండుచేతులతో రాముచేయి పట్టుకొని వద్దు యెంగిలి భుక్తశేషము. పాపము నాకు పాపమంటగట్టుతారా అన్నది సరోజ.

పాపమేమీ నాయెంగిలి నీవు తింటూవున్నావుగా నీయెంగిలి నిత్యమూ అధరపాన రూపమున వాడుకొంటూవున్నానుగా అన్నాడు రాము.

మీవయసుకన్నా చిన్నవయసు దానను అందులో స్త్రీని భుక్తశేషమును తింటూ జీవించవలసిన ధర్మము. న్నవారి యెంగలి పెద్దవారు తిన్నట్లైన చిన్న వారికి పాపము సంభవించి ఆయుక్షీణ మగునన్నారు. అందువల్ల పిల్లలకుకూడా యెంగిలిపెట్టరు. తినరు నాయెంగిలి మీరు తింటే నాకు పాపము పాపమువల్ల నాకు అయుక్షీణము నా ఆయుక్షీణము చేస్తారా అందుకు మీ మనసు వప్పుకుంటుందా పాపము వద్దు వేరేతెస్తాను చేయికడుగుకోండి అని చేయికడిగి వేరే తెచ్చివేసి.

కం॥ పొగగోవికి సతి మోవికి
నగణితముగ నూరభావి కమృతంబునకుఙ
తగనుచ్ఛిష్టము లేదని
ఖగ వాహనుతోడ గరళ కంఠుడు పలికెఙ॥

అన్నాడట వక మహాకవి. అవుచ్ఛిష్టము అనుకొనరానిది యెంగిలి కాదు యిట్లె న్నడూ చేయవద్దు భుక్తశేషమును. యెంగిలిని భర్తకు పెట్టిన భార్య నరకము తప్పక ననుభవించునన్నారు. అంటూ తిని చేయికడుగుకొని రాముకుచేయికడుగుకొన

నీళ్లుయిచ్చి కాఫీ చల్లార్చి యిచ్చి కాఫీ త్రాగు, లోపల ఒక్కపొడి కొంచెము తెచ్చి చేతిలో పెట్టెను.

రాము నములుతూ ఒక్కపొడి చాలా బాగున్నది యెట్లుతయారు చేసినావు అన్నాడు.

అన్నిటిలో తయారయివస్తేనే గృహిణీ బిరుదువచ్చేది. లేకున్న గూబ బిరుదయిస్తారు. ఒక్కలు బాగా కందులంత పగులకొట్టి నెయ్యివేసి, కొంచెముగా వేయించి కొబ్బెర తురుము సన్నగావట్టి పాతిక భాగముకలిపి కొంచెము చక్కెర నున్నగనూరినది యాలకలు లవంగాలు జాజికాయ నున్నగనూరి తగుమోతాదు కలిపి ఒకసీసాకు పోసి మూతపెట్టిన బాగుండును. యింకా కొంచెము పచ్చ కర్పూరముకూడా కల్పుకొనెదరు. సున్నము కూడా తయారుచేసినాను. సున్నము పూరపోసి యెక్కువగా నీళ్లుపోసి కలియబెట్టి వడియగట్టి అట్లే వుంచిన నీరుతేరును. వాటెను పారబోస్తూ మోతాదుగా గట్టిపడనిచ్చి దానిలో కొంచెము పచ్చకర్పూరము వేసి పన్నీరు తగుమోతాదు కలిపి నల్లటి సీసాలో వేసి మూతపెట్టివుంచిన చాలాబాగవుండును. దేహారోగ్యమూనిచ్చును. అంటూ కన్నుల తళుకుతో హావ భావములతో చిలుక పలుకులతో తలత్రిప్పుతూ మాట్లాడు మాటలకు ముగ్ధుడై మైమరచి పైటను చేతికందుకున్నాడు రాము.

సరోజ మాటల సందడిలో మైమరచివుండి తటాలున మేల్కొని ధర్మవ్యతిరిక్తమా అంటూ వాకిలి ప్రక్కచూచి ఏమప్పా అని పైట లాగినది.

యెవరో వచ్చినారని భావించి రాము పైటవిడచినాడు.

సరోజ పైటవిడిపించుకొని సవరించుకొంటూ దూరముగా నిల్చి చిరునవ్వుతో పొడచూపు చూస్తూ ధూర్త గోపాలుడవయ్యేదవా, ముందుడుకులు చేస్తావా చేదుడుకులు చేయవద్దని చెంపలుకొట్టి యశోద చెప్పలేదూ. ఔను అమాయకురాలు అందులో పల్లెపిల్ల దానిలో గొల్లపిల్ల గృహస్థాశ్రమ ధర్మములు గృహధర్మములు చక్కగా తెలిసివుండవు లేకున్న కొడుకని కనికరించి కట్టివేసి కొట్టలేక పోయింది సంస్కారము చక్కగా చేయలేక పోయింది. తాలిటిజంపునా విడిచింది యిష్టమొచ్చినట్లు తిరిగినావు, చిలిపిచేష్టలు యెన్నో నేర్చుకున్నావు, నేర్చుకున్నవి దాగుతాయా

దారపైనకూడా జారుతాయి దాపు నున్నదని ధర్మవ్యతిరిక్తులై పగలనక దారపైనే చేయి చాచుతారా అన్నది సరోజ.

యెవరో వచ్చినట్లు నటించి చేజిక్కిన తాకిటిని యెగరగొట్టి దూరమున్నానని రెచ్చగొట్టు తున్నావా యెవరూలేని యెడారని తెలియదూ యెంతపోగలవు అచ్చము అచ్చరవంటి మచ్చెకంటి పిచ్చల విడిగా స్వేచ్ఛావిహారము చేయుచుంటే ఇనుప గోచులు పెట్టిన మునులకైన మనసు నిలుపంగ వశమౌనె మగువచూడా అంటూ చేయి పైకెత్తి రాగము తీస్తూ వెన్నంటినాడు రాము.

అయ్యో అయ్యో ఆపద్బాంధవా ఆర్తశరణ్యా ధర్మవ్యతిరిక్తుడై పగలనక కామభూత మావహించి కట్టుకున్న కులకాంతపైన కాటుకు కిరికినాడు స్వామీ దారే ధర్మపత్నే పగటివేళ నింద్యమే దేహమున కనారోగ్యమే ఉష్ణాధిక్యమై ఉపద్రవ ములకు దేహములో చోటేర్పడు సూర్యభగవానుడు వీడు క్షమించని చిట్టాలో వ్రాసిపెట్టునే అనే నీతి నియమముల మరచి ధర్మదూరులై ధూర్త గోపాలుడై దారనే వెన్నంటినారు. స్వామీ ధర్మచ్యుతులై వెన్నంటు నాభర్తబారినుండి తప్పిం పవా యెందరినో భక్తుల కాపాడినారే ప్రభూ అంటూ టేబిలు కుర్చీల చుట్టూ తిరుగుతుండెను సరోజ.

కామినీ రావణుని కంటబడిన రంభవిధమున వంటరివై యింట దొరికితివి నీకు యిక్కడ అపుయిచ్చు అత్తమామలుగానీ వృద్ధ నారులుకానీ వయోవృద్ధులు కానీ కన్నవారుకానీ లేరు. కాముకునికి కన్నుకప్పి శ్రీరంగనీతులు నియమములు చెప్పి యెన్నాళ్లని జారుకోగలవు. రావణుడు రంభకుచేసిన చేతవ నీకుకాగలదు చూడుము అటుపై శపించెడు నలకూబరుడెవడో చూత మంటూ వెన్నంటి కుర్చీల చుట్టూ తిప్పి పట్టుకొనచూచుచుండెను రాము.

ఓ ఆర్తశరణ్యా వృద్ధపరాశరులవారు యిస్తే పగలు మచ్చగంధిని కోరితే అయ్యో పగలే కన్యనే ధర్మవ్యతిరిక్తమే దయలేదా ధర్మములేదా స్వామీ అనగా మచ్చగంధిని సుగంధిగా పగలు చీకటిగా మార్చినారట కన్యాత్వము చెడక సకలైశ్వర్యములతో తులతూగు పృథివీపతినే పతిగా బడయగలవు. పోమ్మని ఆశీర్వ దించినాడట వీరికాశక్తి వున్న మార్చుమనండి ఆశీర్వదించమనండి మాటవింటాను. ఆపని చేతగాకున్న యీపని చేతగాదని కాస్తచెప్పండి ఓ ఆర్తత్రాణ పరాయణా

అనాడు ద్రౌపతికి మానభంగము గాకుండా కాపాడలేదా వేదవతికి అగ్నిదేవుని అపరుపుగ పంపలేదా అబలలైన ఆపవారికి ఆపదప్పు నీవుకావా పగలూ రాత్రి యని గమనించక దేహారోగ్యముల తెలుసుకొనక అప్పము అప్పరయన మప్పు కంటి యని పవహార్వన్నె పసిండి బొమ్మయని కపియై కాముకుడై పాకమై కామ పిశాచము సైదోడుతో దండెత్తి వెన్నంటి భపుని బారినుండి తప్పింపవా. మర్కా నుని శాప భూత భయమున మొరపిడి పేపః అంబరీషుని రక్షింప పంపిన సుదర్శ నము పంపి కాము పిశాచమును. సంహరించి నాభర్తను నన్ను ధర్మబద్ధుల చేయవా తండ్రీ లోకరక్షకా అన్నది సరోజ.

సుదర్శన భయమున పరుగెడీ ముల్లోకములూ మూలపురుషులూ మర్కాసుడు చూచినట్లు చూస్తాను రమ్మను ఏదీ నీకు అడ్డు గలిగిన రమ్మనూ అంటూ వుర వడీగా తిప్పుచుండ సరోజ జుంపిళ్లు పెట్టుచూ.

ఓభగవతీ నీవైనా రక్షింపవా స్త్రీ చిత్తము నీకు తెలియవా తల్లీ పురుషులు కామోద్రేకులై కామదాసులై బలాత్కరించినను బ్రతిమాలినను కన్నీటితో కాళ్లు కడిగియైనా పగలు మానభంగము కావద్దన్నావే సర్వాంగసౌష్టవములు కన్నుల చూచిన పతిప్రేమ తగ్గునన్నావే దేహమును కాపాడమన్నావే ధర్మవ్యతిరిక్త మన్నావే పతిప్రాణ మానములకాపాడీ నీప్రాణమానముల కాపాడుకొని ధర్మ బద్ధవై బ్రతుకమన్నావే ధర్మవ్యతిరిక్తవైతే పిడిలో కనుపూప్పు దుఃఖజీవివై పుట్టగల వన్నావే అత్తమామలో వృద్ధనారులో వయోవృద్ధులో కన్నవారలో లేనియింట కామాతురులై పగలనక రాత్రియనక వంటరియైన యిల్లాలివై మగవారు దండెత్త గలరు శుక్ర నీతి ఉపయోగించి బారుకొమ్మన్నావే ఎట్లా జారుకొనేది తల్లీ త్రిశూల ధారిణివై వచ్చి మా మధ్యలో నిల్చి కామభూత ఉన్మోన్మత్తము చల్లచేయవా మాట వినలేదని మరింత కోపోద్దీపితులై వున్న మనస్సును శాంతింపచేయవా తల్లీ మిన్నూ మన్నూ పకమౌతున్నవి కన్ను లెట్టిగొతున్నవి. కాముపిశాచ బాధభరింపలేకున్నారు. దయామయీ ఆలసించిన కాగల కార్యము కాకమానదు.

శా॥ లావొక్కింతయులేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్దప్పెను మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరంబెరుగ మన్నింపన్ దగున్ నామొరన్
రావే యిశ్వరి కావవే జనని సంరక్షింపు శూలాధరీ॥

అని నవ్వుతూ చెప్పేనంతలో సరోజా అన్నది తలుపుతట్టి అనసూయమ్మ.

త్రిశూలధారియై పిల్లను కాపాడు తల్లివచ్చినది యింక విడువరూ అంటూ పరుగెత్తిపోయి వాకిలి తీసినది సరోజ.

అనసూయమ్మ ప్రత్యక్షం మీ అత్త వచ్చిందిరాండీ అన్నది సరోజ.

రాము చిరునవ్వునవ్వుతూ వచ్చి అంతాబాగున్నారా అత్తా అన్నాడు.

అంతా బాగున్నారునాయనా అంటూ పోయి కాళ్లుకడుగుకున్నది.

అనసూయమ్మ మంచినీళ్లుతెచ్చి యిచ్చినది సరోజ త్రాగి వచ్చికూర్చున్నది అనసూయమ్మ.

సరోజా కాఫీ ఉన్నదో లేదో చూడు అన్నాడు రాము.

వున్నదంటూ తెచ్చి యిచ్చినది సరోజ.

అనసూయమ్మ త్రాగి తాను వూరినుంచి శుభంగా కూతురికి తెచ్చిన పిండి వంటలు, పచ్చి పసుపు, కుంకుమ, ఆకులు, వక్కలు, పండ్లు, పూలు, రెండు రవికెలు బుట్టనుండి తీసిపెట్టి యెత్తిపెట్టు తల్లీ అన్నది.

సరోజ తల్లికి మొకరించి నమస్కరించి లేచి పూలు, పండ్లు, తాంబూలం, పసపు, కుంకుమ దేవునిదగ్గర పెట్టి పిండి వంటలు వారగా వుంచి, ఒకటి మైసూరు పాగుబిళ్ల, ఒకటి లడ్డువుంట తీసుకొని గ్లాసుతో మంచినీరుయెత్తుకొని రాము చదువు కొంటూవున్న గదికి పోయి టేబిలుపై వుంచి, త్రిశూలధారి ప్రత్యక్షం చూచినారా యెప్పటికైన ధర్మ దూరులై దారను బాధిస్తే ప్రత్యక్షవుతుంది భద్రం అని నవ్వు తూ పాపము కామ ఉష్ణోద్రేకముతో కన్నులెఱ్ఱనై వళ్లు వేడియై మైమరచి కష్టపడి నారు. మోహినితో ఈశ్వరుని కైనంతపనీ అయినది. వారి పరాభవము పదు నాలుగు లోకములకూ తెలిసినది. తమ విషయం తాళిగట్టిన తరుణికే తెలిసినది వారికన్నా తమరే పుణ్యులు. కోపగించకండి కాలమున్నది, కాంతవున్నది కొం చెము ఓపిక పట్టండి, కొంచెము ఉష్ణ శాంతికై ప్రీతిగా అత్తగారు కొత్త అల్లునికై తెచ్చిన అహారము ఫలాహారము కొంచెము అరగించండి ఉద్ధృతము తగ్గుతుంది

ఉష్ణశాంతి గలుగుతుంది మనసు కుదురౌతుంది, మమత అగుతుంది. అంటూ పైపై సూరుపాగు కొంచెము తుంచి నోటిలోపెట్టింది సరోజ.

రాము నములుతూ మామగారి ఆర్జనతో అత్తగారి కష్టముతో తయారయిన ఆహారం వారిరువురి శుక్ల శోణితములతో ఆర్జనతో కని పెంచి పెద్దచేసిన దానము అలు నాపాలు చేసినారు వారికి చాలా ఋణపడుతాను. వారి ఋణం తీర్చే దెట్లా అన్నాడు రాము.

అన్నీ ఆర్జించి అన్నిటపైనా అధికారమిచ్చి నట్టింట పీటవేసుకొని కూర్చొని తినమని సర్వాధికారాలు సమర్పించిన అత్తా, మామా ఋణము నేనెట్ల తీర్చవలెనం టారూ అన్నది సరోజా.

అన్నీ సంపాదించి సర్వవస్తుసముదయములపై మాకున్న అధికారము యీ నాటితో నీకర్పించినాము నీవనుభవించ వచ్చునని సర్వాధికారములు సమర్పించిన అత్తా, మామకు సేవా కష్టమర్పించి కని పెంచి విద్యాబుద్ధులు చెప్పించి నీచేతిలో వడవేసిన వారికన్న కొడుకునకు మనసిచ్చి దేహసౌఖ్యవముల నర్పించి వారి వంశవృక్షమునకు మంచికొడుకుల కూతుళ్లి కని సమర్పించితే నీరుణం తీరుతుంది నారుణమో అన్నాడు రాము.

అత్తా, మామా కనిపెంచి విద్యాబుద్ధులుచెప్పి పెద్దచేసి కన్యాదానంచేసి కాపురంచేసుకో చేయించుకో కావలసిన సుఖ మనుభవించుకో వంశవృక్షము పెంచుకో కొట్టక తిట్టక మెడబట్టి నెట్టక దయా దాక్షిణ్యముతో దాపై ప్రాపై, రక్షించుకొమ్మన్నారు. దానికి వ్యతిరిక్తముగాక నటించితే మీరుణం తీరుతుంది. అత్తా మామా ఋణంతీరుస్తారా అప్రయోజకుల విధముగా.

గీ॥ అలుకన్న అధమ అవనిలో లేదయా విశ్వదాభిరామ వినరవేమ॥

అంటారా, మా నాన్న ఆర్జనతో అమ్మపెట్టిన ఆహారంతో దేహన్ని పెంచి ధర్మబద్ధనై దేహన్ని దుర్వ్యయము చేయక మీ చేతుల్లో పెట్టినాను. సుఖపడీ, సుఖ మిమ్మన్నాను. అటుపై తమదయా నాయదృష్టము. నాకు దానంచేసిన తమదేహ న్ని దుర్వ్యయముచేయక పెండ్లినాటి మాటపై నిల్చితే పెద్దవారు అవుతారు. చిత్ర గుప్తుని చిట్టాలో దాఖలుగారు అన్నది సరోజ.

వారి రుణం తీర్చేది అట్లకాదే నీతో సంతోషంగా కాపురం చేయడం సత్సం తతిని కనడం కావలసినంతా ఆర్జించడం అత్తవారిసొత్తు నాశించకుండా బ్రతుకడం, సొత్తుకు సొత్తు పదిసొత్తులు పెట్టుకొని పచ్చగా వారి యింటికి నీవు పోవడం, పిలుచుకపోతా అమ్మాయిని అని అన్నంతనే పిలుచుక పొమ్మనడం, ప్రీతిగా యిచ్చిన దానికే సంతోషించడం, నీకారడ్డు కవద్దు కన్నీళ్లతో పోక కలకలమని కలయికగా పోవడం, కలయికగా కాపురం నడపడం, నాకిదివ్వు అదివ్వుమని బాధించక పోవడం మా యత్త, మా మామ, నా భర్త, నా పిల్లలు అని ప్రేమతో పామరముతో నీవంటే వాడువింటే రుణం తీరుతుంది. ఇదీ దీని సూత్రార్థం అంటూ ఏకదీక్షగా అట్లే పైకి చూచినాడు రాము.

ఎందుకట్లా చూస్తారు అన్నది సరోజ.

ఏమిలేదు మా ప్రక్క యింటిలో జరిగే అత్తా కోడళ్ల భారత యుద్ధం అగుపడుతూవుంది నా గుండె గుబేలు మంటుంది. అలా అమ్మా జరిపే దుర్యోధన, భీమ గదాయుద్ధంలో దూరీ విడిపించుటకూ లేదు, దూరముండుటకూ లేదు వాడు పడే అగచాట్లు జ్ఞాపకమునకువచ్చి సినిమారంగం అగుపడుచున్నది అన్నాడు రాము.

యిప్పుడు యెట్ల గానవచ్చినది అన్నది సరోజ.

అలా అంటే ఇట్లుంటే ఇంతకన్నా ఆనందం ఏలోకంలో కూడా వుండదు. అట్లుంటే నరకం యిక్కడే వుంటుంది. వాణ్ణి చూచి కొంతకాలం నేనూ వద్దురా పెండ్లి అనుకున్నాను. ధైర్యంచేసి చేసుకున్నాను కడకు అనుకున్నంత అయి హాలాహలము అమృతమయింది. అమృతము అమృతముగా వుంటుందో హాలాహలముగా మారుతుందో ఏలేవానికెరుక అని ఆలోచిస్తాను అన్నాడు రాము నవ్వుతూ.

సరోజ రాము ఎదపై చేయిపెట్టి అయ్యో గుండేలు తీవ్రంగా కొట్టుకొనుచున్నవే భయపడకండీ అమ్మ అతిక్రమించీ శృతి తప్పి అపశృతిలో పడినా అలు సవరించుకుంటుంది. లేండీ అమ్మ అలు మధ్య అగచాట్లు వుండవు. అమితంగా ఆలోచించకండి మతిభ్రమగలిగి జ్ఞాపకశక్తి తగ్గిని. అమృతము హాలాహలమయి హాలాహలం అమృతమయింధి యింక ఆమృతము హలాహలముగా మారదు హద్దుమీరదు తమరు మాత్రము హద్దుమీరి నడువకండి. అంటూ చిరునవ్వు

నవ్వుతూ, చల్లపడినారా యింకా కొంచెము తెమ్మంటారా అంటూ రాము, చెంపన చేయిపెట్టి చూచి పాపం అర్ధం చల్లబడింది యీ అర్ధం సూర్యాస్తమానంతో చల్ల బడుతుందేమో అయ్యో పాపం ఆ కామఘాతం చేసినపని యిది అని నవ్వినది సరోజ.

చల్లబడటమేమిటి ఆపాదమస్తకము అంతా ఆలుచేసే సేవకో అట్టే కరుడు కట్టి పోయింది యింకేముందీ అన్నాడు రాము.

ఔను ఆదరణిస్తే ఆదరిస్తే చేరదీస్తే మనసుయిస్తే మగువ నమ్మి సేవ చేస్తుంది. మనసు యిస్తుంది బెదిరిస్తే, గదిరిస్తే, కోపగిస్తే, చెంపకేస్తే, మనసిస్తుందా కౌగలిస్తుందా మనసు చింతలో మనిషి వంతలో అన్నది సరోజ.

అన్నీ సరే కాళ్లకాళ్లు కొట్టుకొంటూ కన్నతల్లివస్తే తిన్నావా తింటావా అనక మొగనితో నవ్వులూ ముద్దులూనా బుద్ధివుందా అన్నాడు రాము నవ్వుతూ.

అయ్యో బుద్ధిమంతులు శుద్ధజ్ఞానులు అత్తను చూచి, క్షేమము అడిగి అడుగక మునుపే యిక్కడ చేరినారే వచ్చివుండేది మీయత్తగా మాయత్తగా దే మీయత్తగారి యోగక్షేమములు మీరు చూచుకోండి మాయత్తగారి కథ నేనుచూచుకుంటాను అన్నది సరోజ.

మా యత్తగారి క్షేమము మీ యత్తగారి క్షేమము చూచుకొనే పెత్తనము నీదేగా తెమ్మంటే తేవడం ఒద్దంటే పూరకుండడం నాపని గృహలక్ష్మివి నీవున్నావుగా అన్నాడు రాము.

గృహాంగణములో తక్కువెక్కువలు గృహిణి చూచుకొని యెవరికి చెప్ప వలెనంటారూ అన్నది సరోజ.

గృహస్థునికి అన్నాడు రాము.

గృహాంతర్గతమున గృహిణి గృహబాహ్యాంతరమున గృహస్థుడు కార్య కలాపములు చూచుకొనవలయు నంటారా అంటే సాయంత్రమునకు కూరగాయలు వీమీలేవు కొత్తగా అత్తగారు వచ్చినారు గృహిణి మనవి ఆలకించి చిత్తగించి గృహస్థ

ధర్మమవలంబించి చిత్తిచేతపట్టి పర్సు జోబీలోపెట్టి బజారుదారిబట్టి మార్కెట్టులో కాలుబెట్టి కావలసినవి కొని చిత్తిలోపెట్టి హాటా హాటిగా రండీ లేండీ అని చేయి పట్టుకొని వయ్యారముగా చూచినది సరోజ.

శహభాష్ చూచావే చూపూ యెదనదూరి దూసుకొని వెన్నున వెళ్లిపోయిందే యీగాయం మానేదెప్పుడు అన్నాడు రాము నవ్వుతూ.

గేం॥ కాలం మంచిది కలిసొస్తే
కలలే నిజమై కనిపిస్తే
గాయం మాయం మాపటికే

అని సరోజ ఫక్కున నవ్వి గృహస్థ ధర్మమవలంభించరా అన్నది.

గృహస్థ ధర్మమవలంభిస్తే గృహచ్ఛిద్రములు వెన్నంటే వుంటాయన్నారు. అయినా అయిపోయినవెనుక చెప్పి అగచాట్లు తేవద్దు. పదార్థము యింకా నాన్నాళ్లకు వుందనగానే బోర్డుకు యెక్కించి చెప్పి పుణ్యము కట్టుకో. కుండ పోయి మీదపెట్టి ఊ తే లే అని ప్రాణంతీయవద్దు అన్నాడు నవ్వుతూ రాము.

గృహచ్ఛిద్రములు గృహస్థుని చెవులకెక్కించను గృహ ధర్మములు తెలియని గూబనుకాను. గృహధర్మములు బాగాతెలుసు తమపరకు ఏమీరావు దిగులు పడకండి బైటపనికికూడా భార్యనే పంపు భర్తలున్నారు. తమరు మాత్రం నామనవి చిత్తగించి వారిలో ఏకీభవించకండి అరం భారం నాపైనే వేస్తే తప్పక అవమానుషాలు వస్తాయి. కొంచెము బజారుకు పోయే భారంపెట్టుకోండి అన్నది సరోజ.

అరం నీపైనా భారం నాపైనా పెట్టుకుందామా అన్నాడు రాము.

ఔను నాపని నేనూ మీపని మీరూ చక్కగా చూచుకుంటే సంసారం చాలు దప్పకుండా సాగిపోతుంది. సర్వేల్లో, శహబాష్ అనిపించుకుంటాము తమకు చాలూ మూలా చక్కగా తెలుసుగా. దిద్దుకుంటారు అన్నది సరోజ.

హద్దుమీరి నడిస్తే, దిద్దుకునేదీ రుద్దుకునేదీ వుంటుందా గుద్దుకునేది తప్ప అన్నాడు రాము.

దిద్దుకునేది తెలిస్తే, గుద్దుకునేది వుంతమ. దిద్దుకునేది తెలిసేవద్దు చెడకుండా రద్దులేకుండా వద్దకే రప్పించుకున్నారుగా దిద్దులు, రద్దులు, గుద్దులు, యింట్లో వుంటే వీరి పారవేయండి యింక మనకొద్దు అంటూ చేయి పట్టుకున్నది సరోజ.

రాము లేచి వెంట పోయినాడు వంట యింటిలో అన్నివస్తువులూ చూచి అన్నీవున్నవి కూరగాయలొకటే తక్కువ మీయత్తగారికి మీరేమి తెప్పుకుంటారో తెప్పుకోపోండి అన్నది సరోజ.

మాయత్త పోషణా మీయత్తపోషణా నాపోషణా నీచేతిలోనే వుండే అనాడే అంతా అర్పించిందిగా మీయత్త అన్నాడు రాము.

అయ్యో నాకేమి యిష్టంలేదండీ అన్నది సరోజ.

ఆ అ అత్తయిచ్చిన అధికారం అంతా అప్పుడే మరచితివా సమస్తము నేను తెచ్చివేసినా యింటిలో వుండినా ఆకుదగ్గర గరిటదగ్గర అధికారం నీకే యిచ్చిందిగా మీయత్త మాయత్తప్రాణం మీయత్తప్రాణం కడకు నాప్రాణం నీగరిటా అధికారంలోనే వుందిగా అన్నాడు రాము. యిద్దరూ ఫక్కున నవ్వినారు పండుకొనివున్న అనసూయమ్మ యీనవ్వులో మేలుకొన్నది.

నాగరిటపైనా నాపైనా అంత మీకు అపనమ్మకముంటే తమరే అత్తగారికి వడ్డించుకోండీ అన్నది సరోజ.

అత్తగారికి మామగారికి నాలుగువడ్డించే అప్రయోజకులలో నన్ను యీనాటికీ చేర్చకు అమ్మా నాన్నకు అత్తా మామకు భేదమేమిలేదని తెలుసుకున్న అబ్బాయిని బాగా పెద్దలతో సంస్కారముయిన సంసారిని అమ్మ నన్నుగన్నది. అత్త నిన్ను గన్నది. అమ్మగన్నది అత్తగన్నది అతుకుపడి అతుక్కపోయి ఒకటయినవి. యీ వకటిలో అమ్మ యెవరూ అత్త యెవరూ రెండూ వకటే అమ్మా అత్తా వకటై అలూ మొగుడూ వకటై మామా మామా వకటై రథమునడిపితే రాయల్ విమానము పోయినట్లు వెలుగుకన్నా శబ్దవేగమునకన్నా మిన్నగా రుయ్‌మని రోదసీ కుహరము దాటి రోహిణీ నక్షత్రములో వున్న స్వర్గలోక నివాసియగు స్వయంభువు కడకు వెళ్ళిపోతుంది మంచి వారికందరికీ గమ్యస్థానమదే. గరిటలో మాత్రము ఘనత చంపవద్దన్నాడు రాము.

పంచాయుధ పరిపాలనాశక్తి గృహపాలనాశక్తి ప్రభుశక్తి ననుసరించి వాడు కొనుశక్తి మాఅమ్మగట్టిగా మంత్రోపదేశము చేసింది సంహారము ఉపసంహారము రెండూ తెలుసు మంత్రశక్తి మితిమించి బ్రహ్మకూకటి దాటినది పరవాలేదన్నది సరోజ,

అయ్యో మీపంచాయుధములలో దేనినయినా కోపశక్తి అవేశమయినప్పుడు మాయత్తపైనగాని మీయత్తపైనగాని నాపైనగాని ప్రయోగించవద్దే భద్రము అన్నాడు రాము.

పంచాయుధములనగా ఏవోతెలుసునా అన్నది సరోజ.

పంచాయుధములెందుకు దశాయుధము లనవచ్చును పొరకా, చేట, కొరవి, గరిటా, రోకలీ, చేత్రాడు, త్రెడ్డు, గుండ్రాయి, కత్తిపీట, కడకు శ్రీమహావిష్ణువు చేతిలోగల చక్రాయుధము లాంటి పెద్దమూకుడు యీలాటి సాధన యంత్ర మంత్రములు నీచేతిలో వున్నవిగా అన్నాడు రాము. యిద్దరు నవ్వినారు యీ మాటలు నవ్వులువింటూ అనసూయమ్మ ఆనంద పడుతూ వుండెను.

పాలనాశక్తి ప్రభుశక్తి అంటే అర్థం అన్నది సరోజ.

యింటియజమాని ఆజ్ఞ ననుసరించి గృహ పరివారమునకు పంచి పాలించు కొనడం ఒకటి శక్తికి మితిమీరి వచనముచేసి పాడుచేయడం పాయబెట్టడం పార వేయడం చేయక ప్రభుశక్తి గమనించి అనుసరించి నడుచుకొనడం భవిష్యత్తును పరికించడం భద్రతగా నడువడం అన్నాడు రాము,

అయ్యో ఆడవారి పనులన్నీ అయ్యగారికి అనుభవములో ఉన్నట్లున్నవే అంటూ నవ్వినది సరోజ.

అనుభవము నీతోనే అదివరకెన్నడూలేదు చక్కగా బ్రహ్మచర్య మనుభవించినాను. అన్నంతలో నోరుమూసుకొని సరోజ చేయి తల్లి తట్టు చూపుతూ ఆ ఆ కవనం కాలు జారుతుంది. ప్రక్కవారి ననుసరించి పదాలు ప్రాసాలు వాడండి అన్నది సరోజ.

కుర్రోణ్ణి పసగల పడుచువాణ్ణి కాలుజారనిస్తానా పట్టుభల్లాకపట్టుగా వుంటుంది. అంతకూ జారితే సమర్థించుకుంటాను నోరు జారను కాలుజారను చేయిజారను. బుద్ధిబలంలేని దద్దన్నను గాను చెప్తూతావిను భార్య అనేది నాకూ వకటి వస్తుంది. అదిమెట్లాటిది వస్తుందో ఏమో పెళ్లివాని కెరుక బాహుబల మున్నదివస్తే బాహుబలం దేహబలమున్నదివస్తే దేహబలం మంటలమారిదివస్తే శాంతిబలం మాటలమారిదివస్తే మాటలబలం నీతినియమాలు బలంవున్నదివస్తే నీతి నియమాలబలం చదువుబలంగలదైతే చదువుబలం సాధించేదయితే సామంతో సాధించేబలం ఖర్చుపెట్టేదయితే సంపాదించేబలం దేనిలోనయినా అలుకు వెన్నీ కుండా యెదయిచ్చి ఎదిరించేబలం ఉండవలె కావలెనని బుద్ధిబలం దేహబలం విద్యాబలం ఉద్యోగబలం అర్జించిపెట్టుకున్నాను. అంగబలంలేక అర్థబలంలేక అన్నిటకు అలిసీద అధారపడే అయ్యగారినా తలంచవద్దు నీవుయెట్ల ట్రిప్పుతాయించి త్రిప్పితే అట్ల ఆడతాను యెట్లనడిపిస్తే అట్ల నడుస్తాను జవినకయెట్ల పలికిస్తే అట్ల పలక వాయిస్తాను. జవినక పలకశృతి అపశృతిగాకుండా లయ అవులయగాకుండా వకటై మేళవిస్తే మూలపెద్దమ్మతల్లి ఉల్లాసముగా ఉబ్బూతలాగుతుంది. వరాల వర్షం కురిపిస్తుంది. ఆవర్షబిందువులకు భూమి సశ్యశ్యామలమై మొలకలెత్తి పెరిగి పెద్దదై ఫలిస్తుంది. ఫలించిన ఫలం సంకటొస్తుంది అన్నాడు రాము.

ఫలంకొరకు పరితాప పడుతూవున్నారు పాపం ఫలం సత్ఫలంకాక దుష్ఫలం ఆయితే అయ్యగారికి అప్పుడూ తెలిసేది అన్నది సరోజ,

నావలె వస్తే అవుతారో నీవలె వస్తే అవుతారో కాస్త చూడు అంటూ దేవుని పీఠము ప్రక్కమల్లి ఓస్వామీ వంట చేయలేనని అయ్యగారిని విడచి అమ్మగారి యింటికి పోయి అయ్యగారిని నా నా తిప్పలు పెట్టే ఆడపిల్లను మాత్రము పుట్టించ వద్దుస్వామీ అమ్మా నా అను నంతలో సరోజపోయి రాము నోరుమూసి ఓస్వామీ ఏదో తెలిసో తెలియకో వంటచేయనని అన్నంత మాత్రము లోనే ఎట్లోవకట్ల సవ రించుకొని చాలుకు తెచ్చుకొనక యింతేచాలునని అమ్మగారి యింట విడచి కట్టుకున్నదాని కంటనీరు పెట్టించి బెదిరించి రాబట్టుకొనే అమిత శాంతవాదిని మాత్రము పుట్టించకు స్వామీ ఏదో పడుచుపిల్లా కోరింది కొన్నాళ్లయినా కోర్కె తీరుస్తామనక పట్టు పట్టి పట్టు చెల్లించుకునే గట్టివాళ్లు వద్దు స్వామీ అన్నది సరోజ.

స్వామీ అనాడు బలవంతముచేసి బాహుబలమున్నదని భార్యపై అధికార మున్నదని చతుర్థోపాయము చూపి వుంటే యీనాడు యింత ప్రేమ యెట్లవుంటుంది స్వామీ కొట్టినవాణ్ణి, తిట్టినవాణ్ణి, అవమానము చేసినవాణ్ణి, అనరానివి అన్నవాణ్ణి యే జీవి అయినా మరుస్తుందా. భార్య అని చీటికి మాటికి హేళన చేయడం, అన రానిమాటలనడం, బాధించడం, వేధించడం, శోధించడం, పరాభవించడం పనికి రాదన్నారు. ప్రేమ మారుతుంది మనసిచ్చి మాటాడదు మనసారా ప్రేమించదు కృత్రిమ నటనతో కుళ్లిపోతుంది

కం॥ ఎవ్వడు తప్పులు వెతకెడి
నప్పురుషుని గొల్వగూడ దదియెట్లన్నన్
సర్పంబు పడగ నీడను
కప్పవసించిన విధంబు గదరా సుమతీ॥

అన్నారు పెద్దలు. సామముచేతనే కార్యము సాధించుకో బాగు పడతావు అన్నారు నీతికోవిదులు. అందువల్ల సామముతో సాధించుకున్నాను. పదార్థము చెడక పరిపక్వములో వున్నది ఇందులో తప్పేమున్నది స్వామీ అన్నాడు రాము.

తప్పు వప్పు నిదానముగా కూర్చొని రాత్రికి తేల్చుకుందాము యిప్పుడు బజారుకు పోయిరాండి వంటకావలెనన్నది సరోజ.

యిరుసున కందెనలేనిది పరమేశ్వరుబండియైన బారదు సుమతీ అన్నారు కందెనలేనిది బండినడువదు కందెన ఏమయినా అన్నాడు రాము.

చిన్నఅత్తగారియిల్లువుందిగా అయ్యర్ హోటలు కందెన బాగా వేసుకోండి అన్నది సరోజ.

అయ్యయ్యో అలు యింటవుండగా అయ్యర్ హోటలుకు పోతే పాపంతప్పదు ఏవితిన్నా అర్థాంగికి అర్థం యివ్వకపోతే చిత్రగుప్తుని చిట్టాలో దాఖలవుతాడు. అన్నీ నాచేతిలో ఉన్నవిగదా యజమానిన్ని నేనుగదా ఆడవారికి తెలియదుగదా అని హోటళ్లలో తెగతిన్నివస్తే మరుజన్మకో లేక యీజన్మలోనేనో బాగాచేసుకొని తిని కుండా చట్టీ బాగాకడిగి బోర్లించి ముక్కుతూ మూల్గుతూ తలకు పసపు పట్టి

వేసుకొని ముసుగువేసి పండుకొని మూల్గే భార్యాపుర మవుతుంది. గోదుమ రవ్వ శనగపిండీ చక్కెర నూనె ఏమిచేసిరావంటే అయ్యో శనిగపిండి డబ్బా మూతపెట్టో పారపొసై పోయింది పిల్లి మలమూత్ర విసర్జన చేసింది అందుకని పారపోసినాను గోధుమరవ్వ చాలా పురుగుబట్టి పోయినందే కడుగునీళ్ల బానలో పోసినాను, నూనె పోడికూరలు యెక్కువచేయుటముతో అయిపోయింది. యెక్కువగా కాఫీవేయుటముతో చక్కెరా అయిపోయుందనుకొండి అని దిష్టులేకుండా నూరు మాటాడకుండా చెప్పుతూ ఆమెంపయిట్ల పట్టుకరాంచి కాళ్లు పదపోతూ వున్నవి ఆయాస మధికమవుతూవున్నది. అదేమో దీనిగా వున్నవి అయ్యో ఏమి చెప్పమంటే నాబాధ నాకేతెలుసు నల్లబా ముసుగుపెట్టి పండుకునే మూలపెట్టమ్మ వాపురిస్తుందే మంచాలు మోయిస్తుంది. వంటచేయిస్తుంది. నీళ్లు మోయిస్తుంది. కడకు ఆస్పత్రి పీటీలు మోయిస్తుంది. అప్పో ఆయుర్కీ హోటల్ వద్దు అగచాట్లకు లొంగమిపద్దు అన్నాడు రాము.

మొగనికి పిల్లలకు పరివారమునకు పెట్టక తిన్న ఆడవాళ్లా అన్నది సరోజ.

వారిని యింతవరకూ చూడలేదా ఏహాకిలి పట్టినంత లావై నడువలేక ఆయాసమునకు ఆగలేక తను భారం తనకే బరువై అయ్యో, లావు యెట్లతగ్గేది డాక్టరుగారూ అని అడిగితే డాక్టరు యెగా దిగా చూచి క్రొవ్వుపదార్థములగు పాలు పెరుగు నెయ్యి చక్కెర వంటకములు మాని రాగిరొట్టె గోదుమరొట్టె తింటూ వ్యాయామము చేయండి అంటారు పకారపున క్రొవ్వు తీయించుకొమ్మంటారు మరొకాయన దీవరోగులకు నెత్తురు యివ్వండీ బరువు తగ్గుతారు అంటారు. యింకొకాయన ఏ గుజ్జపు బండిలోదూర్చినా వెనక్కుపో ముందుకురా అంటూ వానితో వకపోరు ఆయుర్వేద వైద్యుల నడితే ఉదయ సాయంత్రముల తేనె కొంచెము చల్లనీళ్లలో వేసి త్రాగండీ దంచేది విసిరేది చేదేది పూడ్చేది వంగేది లేచేది వంట చేసేది వక్కప్రొద్దులుండేది అభ్యాసం చేయండి ఆహార వాంఛ కొంచెము తగ్గించండి అంటారు యింక జ్యోతిష్యుల నడిగితే అయ్యో తల్లీ యింట్లో అందరినోట్లో దుమ్ముకొట్టి నోటిపిచ్చి పూరా పట్టి అంతా నీవే తిన్నావు ముందుజన్మలో అతిన్న తిండి అంతా అక్కడ మరుగైనా యిక్కడ బలరూపమై స్థౌల్యముగా లావుగా అందరికీ గన్పడుతున్నది. నీకుకూడా యెకసెక్కెముగా నున్నది. దీన్ని పోగొట్టు

కొనవలెనంటే నీవుతీసుకునే ఆహారములో అర్ధము చిన్నపిల్లలకు బీదపిల్లలకు పంచిపెట్టు పాపము వైతొలగుతుంది. మందులతో మాకులతో కాదంటారు ముందు చేసిన పాప ఫలభారము బహు భారము అంటారు. ఇదీ దాచుకొని దొంగతిండితిన్న ఆడవారికి యమదండన అను నంతలో సరోజ నవ్వుతూ కాఫీతెచ్చి యిచ్చెను. రాము త్రాగుతూ ఇదిగో నాకివ్వకుండా నాభాగం నాకు చెల్లించకుండా తిన్నావా ఈయింట్లో వాకిండ్లు చిన్నవి భద్రం సుమా అన్నాడు రాము.

సరోజ చిరునవ్వు నవ్వుతూ హొయలుగా ముఖమువంచి చూస్తూ కండ్లు త్రిప్పుతూ బజారుకు పోతారా లేదా అన్నది. పోతానంటూ పోయినాడు రాము.

అంతవరకూ వింటూ ఆనందపడుతూవున్న అనసూయమ్మ లేచి సరోజా రాము యెంతమంచివాడో చూడవే ఆ సత్ప్రవర్తన అనడక ఆమంచి ఆశాంతము ఆవాక్చతురత అవోర్పు అనేర్పు యెవరికి వున్నవే నీప్రాప్తము మంచిదే అమ్మా యీలాంటివాణ్ణి విడచి వుండ మనసెట్లువుట్టెనే అయినా విధికృతము తప్పింప యెవరితరము ఇప్పటికైనా కలుసుకొని కలయికగా కాపురము చేస్తూవున్నావు కండ్లారా చూచినాను చెవులారా విన్నాను మనసు కుదుట పడింది ఆనందమయింది ఇంక నాకేమీ కొదువలేదమ్మా నీభయమే నన్నహర్నిశమూ బాధిస్తూ వుండెను యీ నాటితో బాధతగ్గెను భారం వదలెను అన్నది అనసూయమ్మ.

సరోజ నవ్వుతూ అమ్మా.

కం॥ బిసరుహ గర్భుని లిఖితము
మసిబొట్టా తుడిచిపెట్ట మాధవుకైనన్
నొసటి కనువేల్పుకైనను
నొసలంగా పోవుతొంటి నోము ఫలంబుల్!

అన్నారు అయినా నావ్రాత నాపూజాఫలము మంచిది కాబట్టి బ్రతుకు చెడకుండా అతుకుపడింది. మీఅల్లుడు చిత్తశుద్ధి గలవారు ప్రజ్ఞానిధి భౌతికశక్తికి చోటివ్వక ఆధ్యాత్మిక శక్తినే నమ్మి దానినే ఆదర్శ ప్రాయముగా వుంచుకొని ఆచరణలో ఏలోటూ రానివ్వక నడుచుకొను బుద్ధిశాలి సతి కష్టసుఖముల గమనించి కష్టమును సగపాలు పంచుకునే పతి నాలోనే ఏలోటైనా వుండవలసినదే గాని వారిలో ఏలోటూ వుండదు. వారు దైవశక్తిని దాపుచేర్చుకున్నారు.

ఆవెలుగును ఏచీకటీ యెదిరించలేదు యిట్టివారు నాకు భర్తకావడం పూర్వము నేనుచేసిన పుణ్యము అన్నది సరోజ.

ఔనమ్మా పూర్వపుణ్యము లేక స్త్రీకి యిలాంటి భర్త దొరకదు పుణ్యమే సుఖము పాపమే కష్టము తెలిసినట్లేవుంది. అంటూ ఏదీ నూనె తీసుకరామ్మా తలమవ్వుతాను అన్నది అనసూయమ్మ.

సరోజ సరేనని నూనే మవ్వెస తల్లిదగ్గరవుంచి కూర్చొనెను. అనసూయమ్మ తలమవ్వుతూ సరోజా ప్రతిదానికీ అట్లజబాబు యివ్వవద్దుతల్లీ ఆయన ఏమయినా అనుకొనడా అన్నది.

సరోజ నవ్వుతూ అమ్మా అడిగినదానికి చక్కగా జబాబు యిచ్చే నేర్పు వుండవలయునే లేకుంటే బుద్ధిలేని దద్దమ్మనుకుంటారు. వారికి యెకసెక్కెము గాకుండా హేళన లేకుండా చక్కగా సరిపోయే విధముగా మాట్లాడే విధము తెలిసి మాట్లాడితే ఏమీ వుండదు అడ్డా దిడ్డముగా అప్రయోజకముగా మాట్లాడితే అగచాట్లొస్తాయి అన్నీ అవుతాయి తెలిసి వర్తిస్తే ఏమీ వుండవు. మీఅల్లుడు రసికుడు కావ్యజ్ఞానం, లోకజ్ఞానం, వున్నవారు. తనదగ్గర విలాసముగా వర్తిస్తే శృంగారముగా ప్రవర్తిస్తే, వినోదముగా హావభావ నటనా చతురతతో నటిస్తే ఆనందిస్తారు ఇది యొక అప్రయోజకురాలు అనుకొని దుఃఖించే వారు కారు. అట్టివారు వేరు. వారొక అప్రయోజకులు, అనామికులు. స్త్రీ తన చాకచక్యము, చలాకీ, నేర్పు, కూర్పు, విలాసము, యెవరికడ చూపవలయు, యెవరిచాపున జేరవలయు, యెవరితో ఆనందపడవలయు యెవరితో ముచ్చటలు పడవలయు యెవరితో ఆటలు, పాటలు సయ్యాటలు ఆడవలయు యెవరి హృదయములో చోటేర్పరచుకొనవలయు యెవరితో సుఖ, దుఃఖముల చెప్పుకొనవలయు యెవరిని మనసార ప్రేమించి ప్రేమింప బడవలయు నను విషయములు తెలియక భార్యను దూరము చేసుకొని భయపెట్టి భర్తయింట వుంటే మేలా లేకుంటే మేలా అనే విషయాలు తేల్చుకొనలేక కుమిలి కుమిలి దుఃఖించేలాగున చేసుకుంటారు. వకరితో వకరి విషయాలు చెప్పుకొనక చెడిపోతారు. మీఅల్లుడు అదద్దమ్మల్లో పెద్దమ్మల్లో చేరడు విలాస పురుషుడు అన్నది సరోజ.

అనసూయమ్మ ఆనందపడుతూ సరోజా స్త్రీకి ముఖ్యముగా వుండవలసినది వకటి భర్త హృదయములో అనుమానమునకు చోటేర్పరచ కుండుట శీలవతి అనే నమ్మకము వారి హృదయములో గట్టిగా నుండుట యీ రెండూ సంపాదించుకొనిన వారు మనసిచ్చి నటింతురు. నమ్మి సంచరింతురు. స్త్రీకి ఇవి ముఖ్యములు భర్త హృదయములో అనుమానమునకు అస్పద మేర్పడినా, దుశ్శీలయని మనసుకు తోచినా అగ్నిపర్వతములు చెలరేగినట్లే అన్ని ఆశలూ అడుగంటినట్లే సర్వావయవములు కృశించి నశించినట్లే. తాను కట్టిన శృంగార గగనసౌధములు కూలినట్లే తన భవిష్యత్ ఆశారేఖలు మాసినట్లే మనోప్రపంచము వెలుగు దివ్వె ఆరి చిమ్మ చీకటులలముకొన్నట్లే గన్పడి కడకు తపించి కృశించి నశించి ప్రాణావసిష్టులై దూరస్తులగుదురు తల్లీ అనుమానమునకు అస్పదమివ్వక పతి అదరణ సంపాదించుకొని బ్రతుకుటే పడతికి ముఖ్యము. పతి హృదయములో చిచ్చు చెలరేపవలయునన్న క్షణముపట్టదు తనకన్నుల యెదుట పరపురుషుని వ్యామోహ మయిన చూపుల చూచి చిరునవ్వు నవ్వి కన్నులార్చినా చిచ్చు చెలరేగి గుప్పుమని పొగలతో మంట నాల్కల సాచుతూ మిన్నంటును.

ఇది ఆర్పుటకు శతప్రయత్నములు చేసిననూ కొనసాగదు జీవితాంతము వరకూ కుమిలి కుమిలి కాలుతూ కడకు పిచ్చిపోవుటో కూలిపోవుటో మనసు విరిగి పోవుటో తప్పదు స్త్రీ పొరపాటుతో నయినా కూడా పురుషుని హృదయములో చిచ్చుపెట్టరాదు తల్లీ జీవితము మంగలదిబ్బ యగును అన్నది అనసూయమ్మ.

స్త్రీలకు మాత్రము వుండదా స్త్రీలది హృదయముకాదా పరస్త్రీల నుంచుకొని పరపంచల పడి పాడౌతూవుంటారే యీధర్మము వారికిలేదా అన్నది సరోజ.

ఉన్నది లేకేమి ముందు వారుచేస్తారు మురిసిపోతారు అధికారమున్నదని ఆడవారిని బాధిస్తారు ఆపై వచ్చేజన్మకు అన్నీ అప్పులు తీర్చమంటారు వారిమాట అటుండనీ అన్నివిధాల భర్తను అనుసరించి అదరించి మనసును మరలించి బాగోగుల గమనించి నడిచి నడిపించుకోవలె నమ్మా ఇది స్త్రీధర్మము అని చెప్పునంతలో తలదువ్వుట జడవేయుట అయిపోయినది. సరోజ లేచి పోయి ముఖము కడుగుకొని కుంకుమ తీర్చిదిద్ది దేవుని పాదములచెంత వుంచిన పువ్వుల నమస్కరించి సగముతీసి చక్కగా జడపై పెట్టుకొని వంటపనుల చూచుకొంటూ వుండెను.

అంతలో రాము మార్కెట్టునుండీ శరవేగముతో వచ్చి ఈ చూడు మార్కెట్టు వచ్చింది అన్నాడు.

అయ్యో మార్కెట్టు అంతా యెందుకు తెచ్చినారండీ ఊరందరూ యిక్కడికే వస్తారు యిల్లు వీధైపోతుంది అన్నది నవ్వుతూ సరోజ.

ఊరందరూ వచ్చేమార్కెట్టు అక్కడే వుంచి మనకు కావలసిన మార్కెట్టు తెచ్చినా చూడు అంటూ రాము రోజాపువ్వుల కొన్ని దేవుని దగ్గరపెట్టి వకపెద్ద పువ్వుతీసుకొని యిలువేల్పు దేవుళ్లకు యిష్టదైవాలకు అవీ యింటిదేవత కివీ అంటూ సరోజ జడపై అమర్చి యిలువేల్పుకిచ్చి యిల్లాలి కివ్వకపోతే కోపం పాపం గృహలక్ష్మి ఉస్సుమంటే అలక్ష్మి బుస్సుమంటుంది గృహలక్ష్మి కలకల మంటే ఆలక్ష్మి గలగలమంటుంది అంతా యీలక్ష్మిలోనే వుండేది కదా అంటూ తనరెండుచేతులతో తలపట్టుకొని కన్నులలోకి చూచినాడు రాము.

సరోజ కన్నులనుండీ వెల్వడు విద్యుత్ కిరణములు రాము ముఖ మండల మునకు సోకి కన్నులు మూతపడెను. యిలువేల్పును యింటిదేవతను మరచిపోక మనసులో పెట్టుకొను మనుజులు యెప్పటికీ చెడరు మనసులో వున్నావా అన్నది సరోజ.

అయ్యో మనసులో వుండే మరువకుండా పూలు పండ్లు తెచ్చినాను తెచ్చి నదిగాక యిలువేల్పుపాదములపైనా యింటిదేవత శిరోజములపైనా పెట్టినానే అన్నాడు రాము.

ఔను నాకొరకు పెట్టినారా మోసేది నేను చూసేది వాసన చూసేది మీరు సింగారించుకునేది నేను సింగారముతో ఆనందించేది మీరు నాకొరకు వక్కటీలేదు అంతా మీకొరకే నన్నది సరోజ.

ఆ ఆ నీవు చేసుకొన్న అలంకారములన్నీ కామాగ్నికి చిచ్చు యీ పూల వాసన వాయువు యీసువాసనా మందానిలుడు తగిలితే కామాగ్ని పొగ విడుచుచూ ప్రజ్వరిల్లుతుంది ప్రజ్వరిల్లెడి జ్వాలలతో చెలగాటమాడి సంతోషిస్తావు నీవూ వూరకే మోయలేదు. నాకుతెలుసులే స్త్రీ అలంకారమంతా పురుషునిలో గల కామాగ్నిని చెలరేపేటందుకని అందరికీ బాగాతెలుసు మీలాభానికయ్యే నగలూ

నాణ్యాలు, పూలూ, కుంకుమ, చీరలూ, రవికలు, మోయలేక మోస్తూవున్నారు. యీమర్మం అందరికీ తెలుసు యెవరి లాభం వారిది నాదీ మోసమే నీదీ మోసమే మనసార ప్రేమించాలని మహాకష్టాలుపడి సంపాదిస్తూవున్నాను. బాగాప్రేమించా లని నీటుగా సింగారించుకున్నావు సింగారించకుంటే విగ్రహంలో దేవుడులేడు. సింగారించకుంటే స్త్రీలో బంగారంలేదు తెలుసునా నాలాభానికి నీవు నీలాభానికి నేను కథవిప్పితే అంతాకల్లే దేవుడుకూడా లాభాన్నే ఆసిస్తూ వున్నాడు అది అట్లుం డనీ అని చెంతకు పోయి ఓ సువాసనా పుష్పమా నీసువాసన నాకక్కరలేదు. రోజా కన్నా సరోజ వకఅక్షరము యెక్కువ నీలో సువాసన వన్నె తప్ప మరేమీ సుగుణములు లేవు మా సరోజలో సకల సౌరభములు నవరసములు సకల సుగుణములు శ్రవణానందమయిన పలుకులు యీలాంటివి యెన్నోవున్నవి యెన్నో ఏల అముఖ చంద్రమండలమున వెల్వడు చల్లటి తెల్లటి వెన్నెలలే చాలు కామాగ్నిని చల్లార్ప నీ సువాసన యెందుకు రోజా కన్నా సరోజే సౌరభమంటూ చేయి సాచ పోయినాడు రాము.

అ. ఆగండి త్రిశూలధారిని మరచినారా కాస్త తిరిగి చూడండీ అయ్యో యీ కవన ధారలో కాలు జారింది కాబోలు కాలు వూడుకొని కన్నులు తుడుచుకొని మార్కెట్టు బయట పెట్టండి మనసు పట్టండి అన్నది సరోజ

మనసు పట్టకుంటే మాట వినేదెవరూ యిది ఆర్యావర్తంకదూ అంతా మీమాటే కానీ అంటూ రాము వస్తువులన్నీ పేర్లు చెప్పుతూ చిత్తినుండి తీసిపెట్టి ఒకడజను అరటిపండ్లు నున్నవి పీటెను పంచామృతముచేయి చూపు దేవునికి మేపు మానవునికి అన్నారు. అట్లుచేస్తాము అన్నాడు రాము.

అయ్యో నాకు తెలియదండి చెప్పితే చేస్తా నన్నది సరోజ.

అయ్యో నాకు తెలియదండీ చేస్తేతింటానన్నాడు రాము.

నీకూ నాకూ తెలియకపోతే దేవాలయానికి పోయి అర్చకుల వారినో లేక దినమూ ఆరగించు దేవునినో అడిగిరాండి అన్నది సరోజ.

ఆడవారికి అన్నీ తెలియవలెగా అన్నిటిలో ఇదివక్కటి యెందుకు తెలియదు అన్నాడు రాము.

వంట నేర్చుకున్నాను గాని అర్చకం నేర్చుకోలేదండీ పంచామృతాలు చేయను అర్చకులవారు తమరున్నారే చెప్పండి చేస్తాను అన్నది సరోజ.

అయితే విను అర్చకులవారు చెప్పుతారు అరటిపండ్లను తోళ్లతోవేయక వలిచి చిలుముపట్టని గిన్నెలోవేసి నున్నగపిసికి పంచదారుమునిగేటంత పాలుపోసి పదిపిళ్లెలు నేయివేసి అర్థసేరు మోతాదు చక్కెర వ్వన్నంతతేనె కొంచెము ఏలకులపొడివేసి బాగ పిసికో చిలికో పెట్టు ముందు ముప్పేట్లుంకు వారి సతీసుతులకుపెట్టి ఆటుపై త్రిశూలధారికి పెట్టుదము మిగిలినది నాకూ నీకూ నీకు నాకు అనులోము విలోమములుగా వాడుకుందాము అన్నాడు రాము.

సరే పండ్లపాయసం చేయమన్నారు అన్నది సరోజ.

పండ్లపాయసంకాదే పంచామృతం అన్నాడు రాము.

రెండూ ఒకటేలెండి యెట్లోమరచినారు అధరామృతం అనేవారే పాపము గౌరవించినారు అంటూ వంటపనిలో నిమగ్న అయింది సరోజ.

రాము పోయి పాదప్రక్షాళనము చేసుకొని వచ్చినాడు సరోజ దేవునిదీపము వెలిగించినది రాము పూజా విధానము ప్రారంభించి లక్ష్మీ విష్ణు సహస్రనామములు పారాయణము చేసి నారాయణ అష్టాక్షరీ మంత్రము వేయి జపముచేసి ఉమా మహేశ్వర అష్టోత్తరములు బ్రహ్మభారతీ అష్టోత్తరములు చెప్పి నైవేద్యం అన్నాడు అంతకుముందే తనధ్యానము ముగించుకొని సంసిద్ధముగా నున్న సరోజ పంచామృతము పాలు చక్కెర తెచ్చిపెట్టినది రాము నైవేద్యము పెట్టి మంగళహారతి యిచ్చి నమస్కరించి తీర్థముపుచ్చుకున్నాడు సరోజవచ్చి భగవంతునికి భర్తకునమస్కరించి చేయి పట్టినది.

ఏమని మంత్రముచెప్పవలెనో చెప్పు నీవుకోరినట్లు మంత్రము చెప్పుతానన్నాడు రాము.

తమరు ఏమని మంత్రము చెప్పదలంచెదరో అదే కానివ్వండి అదేపదివేలని భావిస్తానంటూ చిరునవ్వుతో రాము ముఖము చూచినది సరోజ.

శీఘ్రమేవ సుపుత్రా ప్రాప్తిరస్తు అని తీర్థము వేసినాడు రాము.

తీర్థము పుచ్చుకొని చేయి సాచినది సరోజ దేవుని పాదములపై నున్న పువ్వుల కొన్నితీసి చేతిలో వేసినాడు రాము.

కన్నులకద్ది నెత్తిలో పెట్టుకొని కావలసినది సుపుత్రుడొక్కడేనా పుత్రికలు వద్దు అంటూ అక్కడున్న పదార్థముల యెత్తుకపోతూ యెనిమిది గంటలు అయినది భోంచేస్తారా యింకా టయము కావలెనా అన్నది సరోజ.

అత్త యెప్పుడు భోంచేసినదో పాపము కానీ అన్నాడు రాము.

ఔను అత్తగారిపైన అంతమాత్రమైనా ప్రాణము లేకుంటే యెట్లు కన్నకూతుర్ని యిచ్చిందిగా అన్నది ఛలోక్తిగా సరోజ.

ఇదంతా వింటూ కంటూ వున్న అనసూయమ్మకు హృదయానంద మైనది.

రాము భోంచేయ కూర్చొనెను సరోజ వడ్డిస్తూ యీనాడు కారము నిత్యము కన్నా కొంచెము తగ్గించినాను తమకెట్లుంటుందో అన్నది సరోజ.

మనమేతక్కువ కారముతినేది యింకా తక్కువగా తింటారా మీయింట్లో అన్నాడు రాము.

ఔను కారము ఉప్పు పులుసు యెక్కువ తినుటవల్ల రక్తము చెడుననియు, వయసు యెక్కువగుకొద్దీ తిమ్మెర్ల జబ్బు కంటిజబ్బు వచ్చుననియు, కోపము యెక్కువగుననియు, ఉష్ణధాతువులై ఉష్ణవీర్యమై మూత్రాధిక్యమై వంటి బలము తగ్గుననియు, వీర్యము పతలాయగుటవల్ల చూపు తగ్గి శుక్లములు తటస్థపడుననియు బుద్ధిబలము కూడా నశించుననియు యీ మేహజబ్బులవల్ల ఆయువుక్షీణించుననియు, అన్ని విపత్తులకూ మూలమేననియు యీపూడువస్తువుల గుణము తెలియుటవల్ల మిళితముగా మితముగా మాయింట్లో వాడుకుంటారు వస్తుగుణము కొంతవరకూ మానవునికి పనిచేయునని వారినమ్మకము అన్నది సరోజ.

వీటెను వీలయినంతవరకూ తగ్గించుట శ్రేయమేనన్నాడు రాము.

పెసరబేడలు వేయించి పచ్చిమిరపకాయలు యెండబెట్టినవి వేయించి వేసి కొంచెము నిమ్మపులుసు పిండిన పప్పు పచ్చి అరటికాయల బిళ్లల శెనగపిండితో పక్వడా కందగడ్డ సన్నగాతరిగినవి నెయ్యిలోవేసి యెత్తి తిరుగబోతలోవేసి

కారము ఉప్పు కొబ్బెర పప్పులు కలిపి దంచిన పొడిచల్లిన కందపొడి చామగడ్డ పొడికూర ఉసిరికాయపచ్చడి చేసినాను పొట్టుతీసిన పెసరబేడలు మాయింట్లో యెక్కువగావాడు కుంటారు. మంచిచలువనీ పైత్యహరమని పుష్టిబాగా యిచ్చునని దేహారోగ్యమని అంటారు పచ్చిఅరటి దేహానికి చాలామంచి దంటారు. యింక కంధా చామా వీర్యవృద్ధి వీర్యబంధనము నిచ్చునంటారు. గడ్డలు బలకరము లంటారు ఉసిరిక పచ్చడి విషయం తమరు తెలుసుగదా అమృతోపమానమని యీ ఆహారములన్నీ మాఅమ్మకు యిష్టము తమరేమంటారో అన్నది సరోజ.

వస్తుగుణ తత్వం చక్కగా చదువుకున్న యిల్లాలు వంటలో లోపమే ముంటుంది. అమృతవల్లీ పేరు గలదని తిప్పతీగె తెచ్చి పప్పుచేయవద్దు వరమచేమ మాఅత్త వున్నంతవరకూ ఆయమకు యిష్టమేదో తెలుసుకొని వంటచేయి తదుపరి మనయిష్ట ప్రకారము వర్తిస్తాము అన్నాడు రాము.

మీయత్త వచ్చినప్పుడు మీయత్త యిష్టప్రకారం మాయత్త వచ్చినప్పుడు మాయత్తయిష్టప్రకారం చేస్తాను యిరువురు లేనప్పుడు తమయిష్టప్రకారము యిక నాయిష్టప్రకారం యెప్పుడూ అన్నది సరోజ.

ఓహో అప్పుడే నీఇష్టమా కొడుకును కని పెంచి పెండ్లిచేసి వచ్చిన కోడలతో నీయిష్టం చెల్లించుకోవలె నీవువకరికి కోడలిగా వున్నప్పుడెట్లు యిష్టం నెరవేరుతుంది అనధికారం వైతొలగుతుంది. అర్జన చేయగల కొడుకు చేతిక్రిందికి వచ్చినప్పుడు అధికారం నీవూ అత్త అధికార పత్రం పొందవలెనంటే దాచావు నలభైవేండ్లు వయసురావలె అప్పుడూ అత్త అధికారం చలాయించేది అన్నాడు రాము.

అత్తా అన్నంతమాత్రములో అంత అధికారమా తానూ వక అత్తక్రింద పనిచేసి తెలుసుకున్నదే కదా అందులో కష్ట సుఖములు తనకెందుకు తెలియదూ అన్నది సరోజ.

ఇది నాదీ అది నాదీ అనే ఆశ అధికారం తప్ప మరేమీ తెలియని జీవులు వొరుల సుఖము చూచి సహించలేని కుచ్ఛితులు యింకా ఈ గృహ ఛ్చిద్రములతో నాకేమి పని కొంచెము విశ్రాంతి తీసుకొని హరిధ్యానముతో ఆపై వచ్చు జన్మకు పుణ్యము తోడు చేసుకుందామనే బుద్ధిలేని మతిహీనులు చచ్చినంతవరకూ అధి

కారము విడువకూడదనే బుద్ధిహీనులు అయి తాను కన్నపిల్లకూ తాళికట్టి తెచ్చుకున్న పిల్లకూ తారతమ్యములు తెలుసుకొనలేక తహ తహ పడుతూ యిహపరములకు రెంటెకు యెక్కక కోడండ్రతో రచ్చపెట్టుకొని కొడుకూ కోడలిసంధున కొరకరాని కొయ్యయై కొంపలో వక్కప్రొద్దులూ వారాలూచేస్తూ చేయిస్తు కలకలలాడే కాపురాన్ని కంటినీళ్లలో కలుపుతారు. కోనంగిలాగ నాకొడుకు పెండ్లి నాకొడుకు పెండ్లి అని కలవరించి పెండ్లి అయినతోడనే పెంటా పెనుగులాటా పెట్టుకొని కొడుకునూ కోడల్ని నిందిస్తూ యింటిగుట్టు వీధికెక్కిస్తారు.

యివన్నీ యింకా నీకు అనుభవములేదు అవుతాయి చూస్తానన్నాడు నవ్వుతూ రాము.

స్త్రీకి భర్త ఆదరణవుంటే యెంతభారమునైనా యెన్నిబాధల నయినా సహిస్తుంది. భర్తకూడా అనాదరణ అసూయా అన్యాయము చూపితే భారమై చేయి విడుస్తుంది. బ్రతుకునే రోశి ప్రాణమునే విడుస్తుంది. శాంతవాది అయిన స్త్రీ అందరూ అనాదరణ చూపినా భరించి భర్తను కన్నీళ్లతో బంధించి భరించి బిడ్డల కని అనాదరణా కూపమునుండి బిడ్డల చేదోడుతో బయట పడుతుంది పౌరుషము కీర్తి జ్ఞానములేని స్త్రీ సంఘ దూష్యయై జీవచ్ఛవములాగ బ్రతుకుతుంది ఓర్పు నేర్పు కూర్పు వుంటే మరుపు లేకుండా భర్తను భగవంతుని చూపెట్టుకొని వుంటే అత్తా మామా బావలూ మరదులు అడబిడ్డలు తోడి కోడండ్రు బంధుమిత్రులు మొదలగు భర్త పిత్రు కుటుంబము యెక్కడనో రాలిపోయి తాను గమ్యస్థానము చేరుకుంటుంది ఓర్పు నేర్పు లేక కోపము మూర్ఖము అసూయా అన్యాయము అపద్ధము చోరత్వము యింటి సుద్దులు వీధినపెట్టుట అనుమానములకు ఆస్పదమిచ్చుట మొదలగు దుశ్చేష్టలు వుంటే అడుగంటుతుంది. స్త్రీ భర్తను భగవంతుని వశుల చేసుకొన్న ఏదీభారముకాదు తమదయ వకటివుంటే చాలు తమరు పెండ్లినాటి మాట మరచి దయతప్పవాకండి అత్తగారితో వచ్చు అధికారాలకు అలజడి చెందను అన్నది సరోజ.

అల్లుడూ కూతురూ మాట్లాడే మాటలకు ఆనందపడుతూ అనసూయమ్మ తలయూచుతూ నవ్వుతుండెను.

ఔను నాకోడలని నాఅధికారమని అదిచేయి ఇదిచేయి అని చలాయించే దానికన్నా అదిచేసుకో ఇదిచేసుకో అని సహాయమిస్తూ చాలు తెలియకపోయిన గర్జన భర్జన తర్జనలతో దండించక కన్నబిడ్డకు చెప్పినట్లు శాంతముగా చెప్పి వంశమర్యాదను. వంశాన్ని నిలబెట్టి యింటా బైటా యెవరి నోటిలోనా కరుగక బ్రతికినంత కాలము బ్రతుకుతానా ముందుగతుల చూచుకుందమని భగవంతుని భర్తను నమ్ముకొని గృహకార్య కలాపములలో సలహావిస్తూ చేతనయినంతా చేస్తూ కన్నపిల్లలాగా కోడలితప్పుల కడుపులో పెట్టుకొని యితరులకు తెలియ కుండా చక్కదిద్దుకొని కన్నకొడుకును కంటనీరు పెట్టించక కాపురము నడుపుటే అత్తకు ముఖ్యధర్మము. కూతురు యెవరి ముచ్చటలో తీర్చుతుంది. కోడలు కన్నకొడుకు ముచ్చటలో తీరుస్తుంది. కూతురు రక్తము యెవరివంశమునకో పంచి యిస్తుంది. కోడలు మనవంశమునకు పంచియిస్తుంది. కూతురు యెవరియింటివో పేరును గోత్రసూత్రముల చెప్పుతుంది. కూతురు యెవరి వంశ మర్యాదలనో నిలబెట్టుతుంది. కోడలు మనవంశ మర్యాదల నిలబెట్టుతుంది. కూతురు యెవరి కాళ్లకో మ్రొక్కుతుంది. కోడలు మన కాళ్లకు మ్రొక్కుతుంది. కూతురు కని యెవరి చంకకో యిస్తుంది. కోడలు కని మనచంకకు యిస్తుంది. కూతురు విపత్తులలో యెవరికో ఏగుతుంది. కోడలు మనకు విపత్తులలో ఏగుతుంది. కూతురు యెవరికో దుఃఖిస్తుంది. కోడలు మనకై దుఃఖిస్తుంది. కూతురు యెవరియశస్సునో కోరుతుంది కోడలు మనయశస్సును కోరుతుంది. కూతురు యిక్కడనుంచీ వకటొకటే జీవితాంతమువరకూ మోస్తుంది. కోడలు అక్కడనుంచీ వకటొకటే యిల్లుచేర్చి మన అభివృద్ధి గోరుతుంది చేరుతుంది. కూతురు వారల జీవితరక్షణకు అక్కరకు వస్తుంది కోడలు మనజీవిత రక్షణకు అక్కరకు వస్తుంది కూతురి కొడుకులు మరణ కాలములో కూడు తినవత్తురు కోడలికొడుకులు మరణ కాలములో నోటినీళ్లు పోయుటకు భుజమిచ్చి యెత్తివేయుటకు అగ్ని మొదలగు కార్యములు చేయుటకు పనికివత్తురు అమ్మఅమ్మ అవ్వయని కూతురు కొడుకులు పెట్టమని చేయిసాచుదురు. నాన్నఅమ్మ జేజి యని కోడలి కొడుకులు పట్టమని తెచ్చిపెట్టుదురు కష్టకాలములో కూతురికొడుకులు జారుకొందురు. కోడలికొడుకులు ఆతురతతో చెంతచేరుకొందురు. యీ యిరువురిలో దగ్గిర వారెవరయినదీ తెలియక కొందరు చెడిపోతూ కొంపలకు నిప్పంటించి యిక్కడా అక్కడా యెక్కక రెంటికిచెడి కూలిపోతూ వున్నారు. అత్తగారు అత్త అధికారిగదా అత్త ఆజ్ఞకు లోపడవలెగదా అత్త అధికార పత్రము

పొందినదనుకా అత్త అజ్ఞాను వర్తిస్తై వర్తించవలెగదా అని తెలియని కోడండ్రు అయినారు యీ యిరువురి సందులో పొకొత్తిలో వక్కయై యిజిగి చస్తూ వున్నారు. మొగవారు అంటూ భోంచేసి చేయికడుగుకొని వచ్చినాడు రాము.

సరోజ అనసూయమ్మను భోంచేయ పిల్చినది. అనసూయమ్మ లేచి పోయి భోంచేయ కూర్చున్నది. సరోజ యిరువురకూ వడ్డించుకొని భోంచేస్తూవుండగా రాము పోయి చూచినాడు సరోజ రాము వైపు చూస్తూ మీ అత్తగారికి ఏమీ తక్కువ చేయను తమరు చూడ నక్కరలేదు లెండి అత్తగారికి ఏమి తక్కువచేస్తుంతో యని చూడవచ్చినారా అన్నది సరోజ.

రాము చిరునవ్వు నవ్వుతూ లేదులేవే కొంచెం అట్ల కులాసాగా చూచిపోదా మని వచ్చినాను అన్నాడు.

యీనాడు మీ చిలిపిచేష్టలు కుదరవు పెద్దవారున్నారు పోండి మీరు వచ్చి నదినాకు తెలుసులే అన్నది సరోజ.

ఏమిటిదే అన్నది అనసూయమ్మ.

సరోజ రాము వైపు చూస్తూ చూడమ్మా భోంచేస్తూ వుంటే మధ్యలోవచ్చి వద్దంటే అన్నంవేసేది కూరవేసేది పెరుగువేసేది నెయ్యివేసేది తినలేక నేను చచ్చేది కడకు పారవేసేది మిగిలితే పాపము బోకులు తోమే వారికి వుంటుందికదా పారవేస్తే మేలా అన్నది సరోజ.

ఆకులో వక మెతుకుకూడా పోనివ్వక బైటవేస్తే కుక్కలు క్రిమి కీటకములు యెన్నో చూపెట్టుకొని వుండును. ఆకులో కొంచెమయినా లేకుండుట చూచి నిరాశతో దుఃఖించును. పాపముకాదా రెండు మెతుకులు పోనివ్వవే అంటే నున్నగా వూడ్చి తినేస్తుంది అత్తా అందుకై కాస్త అన్నంవేస్తే వేసిన అకొంచెంకూడా కడుపు లోనే పెట్టుకొని ఉత్తవిస్తర బైటవేసి అన్నంజాస్తి అయిందని ఆయాసపడుతుంది అత్తా యెంగిలి చేత్తో కాకుల అదిలించనంటుంది. అందుకై వస్తి అయినా పెద్ద వారున్నారని పోతూవున్నా నన్నాడు రాము.

మంచిది పోయిరాండి అత్తగారికి అంతమాత్రము అయినా గౌరవ మివ్వక పోతే యెట్ల చదువుకున్నవారు సర్వము తెలిసినవారు సందు దొరికితే అన్నది సరోజ.

ఆ ఆ అన్నాడు రాము.

ఆ లేదు ఊ లేదు చదు వేమయిందో చూడండి అన్నది సరోజ.

మా అమ్మా నాన్న చెప్పించిన చదువు చాలదని మళ్లీ నీకూతురు చెప్పిస్తూ వున్నది నాబ్రతుకంతా చదువడమే అయిపోయింది అత్తా అన్నాడు రాము.

ఔను నాయనా అచదువు అమ్మా నాన్న గౌరవము కొరకు నీజీవనో పాధి కొరకు అని యిప్పటి చదువు ఆలు పిల్లల సంరక్షణ కొరకు అని చదవండి ప్రతి వాడు జీవితాంతము వరకు యిహ సంబంధ మయినదో పరసంబంధ మయినదో ఏదోవక విద్యా కృషి చేస్తూనే వుండవలయు నంటారు. బాల్యములో యిప్పుడు చేయకపోయిన మరెప్పుడు చేస్తావు నాయనా గృహచ్ఛిద్రములలో తగులుకొనక ముందే ఏది ఆర్జించినా ఆర్జించవలయును అటుపై కష్టము చదువు,నాయనా కష్టే ఫలే అన్నారు అన్నది అనసూయమ్మ.

ఔనత్తా అప్పుడు అమ్మా నాన్నకొరకు యిప్పుడు ఆలు పిల్లలకొరకు చదువుతూ వున్నను నాకొరకు ఏమీలేదు అన్నాడు రాము.

ఔను పాపము అప్పుడు అమ్మానాన్నకడుపు యిప్పుడు ఆలు పిల్లలకడుపు తనకు కడుపే లేదు పాపము నోట్లో వేలుపెట్టితే కొరకలేక చప్పరించే చంటి పిల్లవాడు ఏమీతెలియదే మీ అల్లునికి అన్నది సరోజ.

వేలు పెట్టి చూడు చప్పరించేది చపి చూచేది తెలుస్తుంది అంటూ నవ్వుతూ తనగదికి పోయెను రాము.

యేమే అమ్మాయీ నాల్గునాళ్లలో యెంత మారిపోయినావే నాలుగేండ్లు సంసారము చేసినవారి విధముగా తయారయినావే యెంతశాంతము, యెంతఓర్పు, యెంతనేర్పు చూడడానికి రెండుకండ్లు, వినడానికి రెండుచెవులు చాలవే ఔను తెలుసుకొని కాపురముచేస్తే భూలోకమే స్వర్గలోకములాగ కల కల లాడుతుంటే అమృత తుల్య మగుతుంది. తెలియక చేస్తే నరకలోక మగుతుంది అన్నది అనసూయమ్మ.

మీ అల్లుడు అన్నిటిలో సమర్థుడు. కథ వేస్తాడు విప్పుతాడు నేర్పరి, ఊర[illegible] పాడిస్తాడు ఆడిస్తాడు నడిపిస్తాడు నడుస్తాడు నగుతాడు నగిస్తాడు చాకచక్యము[illegible]

బాగా వుంది. అమ్మా అంటూ భోంచేసి చేయికడుగుకొని వంటయింటి కార్యకలాపములు అన్నీ చూచుకొని పాలు, ఫలహారం, నీళ్లు పాన్‌బీడా తీసుకపోయి గదిలో పెట్టి పాన్‌బీడా రాముకు అందిచ్చి వచ్చి ఆకు వక్కపొడి సున్నము తీసుకొనివచ్చి అమ్మదగ్గర కూర్చొని ఆకువేసుకో అమ్మా అంటూ తాను వేసుకొన ప్రారంభించెను. తాంబూలంచేస్తూ అనసూయమ్మ ఉగాదిపండుగ యింక యెనిమిది రోజులు వున్నది. నాలుగు రోజులు ముందే యిద్దరు రాండమ్మా ఆయనతో చెప్పు అన్నది అనసూయమ్మ.

ఉగాది పండుగ మాకు లేదేమమ్మా మాయిలువేల్పు దైదావానికి మేము నివేదన చేయ పనిలేదా యింటికికూడా వద్దు ఇక్కడనే ఉందామని మీ అల్లుడన్నారు నన్ను విడచి వారు పోరు, వారిని విడచి నేను రాను. అత్తామామా జాబు వ్రాసినారు పండుగకు ఇంటికి రమ్మని. అమ్మగారి ఇంటికి గాని అత్తగారి ఇంటికి గాని వచ్చేదిలేదు పోయేదిలేదు. యీ వత్సరాదికి ఇక్కడనే ఉంటామని జాబు వ్రాసినారు. మొదటి ఉగాది పండుగ నీచేతులార చేయవలె నాచేతులార యిలువేల్పుకు పెట్టవలె అన్నారు. పెండ్లినాడు అయిన ముఖపరిచయము గాక ఈపండుగలో మాయింటి కోడలు ఏవని మాయిలువేల్పుకు పరిచయము చేసి దాస్యముచేసే అధికారముదరి యిప్పిస్తా వేయిస్తా నన్నాడు. ఇంటిలో యజమానురాలిని నేనై యజమాని తానై యిలువేల్పుకు, ఇష్ట దైవానికి ఆతిథ్య మివ్వవలె ఆశీస్సులు పొందవలెనని యువ్విళ్లూరుతున్నారు. ఇద్దరమూ రాము అన్నది సరోజ.

ఆమాటలకు ఆశ్చర్యపోతూ అనసూయమ్మ ఏమే అమ్మా ఈ నాల్గునాళ్లలో ఎంత మారిపోయినావే తొలిపండుగకు రాకపోయిన పిలుచకపోకపోయిన ఎవరయినా చూస్తే ఏమనుకుంటారే ఇద్దరూ రాండి అట్ల ఆయనరాకపోయిన నీవైనా రామ్మా బలవంతముచేసి అయినా పిలుచకుం రాకపోయిన మాకు అవమానుషము కాదా. అన్నను పంపుతాను ఇరువురూకలిసి రాండితల్లీ అన్నది అనసూయమ్మ.

ఆయనరాడు నేనొక్కదాన్ని వచ్చి ఏమిచేసేదమ్మా పండుగనాడు క్రొత్త గుడ్డలను కట్టుకొని ఉన్నసొత్తు అలంకరించుకొని దేవునికి నమస్కరించి అమ్మా నాన్నకు నమస్కరించి అటుపై యెవరికి నమస్కరించవలె ఆసింగారాన్ని యెవరికి చూపవలె ఆశృంగారాన్ని చూచి ఆనందపడేవారెవరు అటుపోతూ ఇటుపోతూ

ఎవరినిచూచి ఆనందపడవలె ఎవరిని ఆనందింప చేయవలె తిను పదార్థములు యెవరికిపెట్టి సంతోషపడవలె యెట్లు నోటికి పోవలె వారు లేకయిరని అక్కడ నేను, లేకపోయితినని వారిక్కడ అటునుట పడవలసినదే గాని ఆనందముంటుందా ఊరిలోవారు అలామగళ్లు పిల్లలతో దేవాలయాలకు కాయాకర్పూరం తీసుకొని పోయి దేవునికర్పించి వస్తూవుంటే చూచి చింతించవలెనా సంతోషించవలెనా లేనిజీవులు లేకపోయెనని వెక్కిళ్లు పట్టి ఏడుస్తూవుంటే ఉన్నజీవులు విడిబడే దెందుకు అన్నది సరోజ.

అనసూయమ్మ వింతపడుతూ కాదే పండుగలకు అమ్మగారింటికి ఆడబిడ్డలు పోయేవారంతా ఏమని పోతూ ఉన్నారు. వారికి యీధర్మాలూ మర్మాలూ అంతా తెలియవా పిలుచుకపోయే వారికి తెలియదా అన్నది అనసూయమ్మ.

ధర్మముయెందుకు లా అంతా చక్కగా తెలుసు అత్తమామలతో భర్తతో తోడికోడండ్రతో ఆడబిడ్డలతో బావమరదులతో బాధలుపడునని పండుగ రోజైనా హృదయావేదన మనశ్శాంతి దేహాలంపట దాస్యజీవనం లేకుండవలెనని తలిదండ్రులు పిలుచుకపోతారు తన అత్తమామలు తనభర్త తనకాపురం తన ఇలువేల్పు తనవారనే ఉల్లాసముగల యువతి పోదు అంచేపో ఇంచేపో ఆలితో ఆప్యాయకొని కులాసావడే భర్త అంచేపో ఇంచేపో ఆపోదుయిచ్చి కన్నకూతురు లాగా చూచి నాకోడలని సంతోషముతో ఆనందపడే అత్త అక్కచెల్లెండ్రలాగ ధర్మమెరింగి నడిచే తోడికోడండ్రు తోటి సోదరీలవలె చూచి సంతోషించే ఆడ బిడ్డలు నాన్నకన్నా మిన్నగాచూచే ఉన్నఇంటిని విడచి పండుగలకు ఆడబిడ్డలు పుట్టినింటికి పోనేపోరు రానేరారు. పెనిమిటే పెన్నిధి అత్తే అమ్మ మామే నాన్న తోడికోడండ్రే అక్కచెల్లెండ్రు బావమరదులే అన్నతమ్ములు ఆడబిడ్డలే ఆత్మీయులు అత్తగారి యిల్లే అమ్మగారియిల్లు అవుతుంది. వకరికివకరు అప్తెప్రాప్తై ఎవరిధర్మము వారెరింగి నడిస్తె అత్తగారియిల్లే అమరావతి అలకావతి అమ్మా. అత్తగారి యింటి ఆనందం అమ్మగారియింట వుండదు రాదు అన్నది సరోజ.

అనసూయమ్మ మరింత వింతపడుతూ ఏమినేర్చినావే అమ్మా మొగుణ్ణి మరగి అమ్మా నాన్నా అన్నా తమ్ముడు అక్క చెల్లెలు బంధువులు మిత్రులు పుట్టిన వూరూ అంతా దూరముచేసెలాగా ఉన్నావే అన్నది అనసూయమ్మ.

ఔను నాన్నా నీవు నావివాహమునాడే కంటనీరు పెట్టినారు. మేము మా యిల్లు దూరమైపోయెను అల్లారు ముద్దుగా చాకి సంతరించి ఒరుల కర్పించినాము యింక నీగతులు నీవితల్లి నీయదృష్ట దురదృష్టములే నీకు తోడు నీడ. ఈ పరివార మంతా ఇంతటితో నిలచిపోయినది. క్రొత్త పరివారమంతా తోడౌతున్నది వారిలో యెట్లు మెలగెదవో ఎట్లు నిల్చెదవో ఏమో నీజీవితము నీపైనే ఆధారపడి ఉన్నదని తలలో నాలుకగా నటించమని అల్లుని చేతికిపట్టి యిచ్చినారే ఇప్పుడు మళ్లీ విడ దీకితే యెట్లనమ్మా అని నవ్వినది సరోజ.

అమ్మమ్మా ఏమి ధర్మాలు ఏమి నీతులు నేర్పినావే అల్లుడు మాట్లాడే మాట లన్నీ నీవే అంటూ ఉన్నావే కన్నదానికి నాకు ప్రీతి వుండదేమే మేమెట్లు పోవలె నన్నది అనసూయమ్మ.

అల్లుడూ ఆడబిడ్డా ఆనందంగా కాపురము చేసేది కని విని ఆనందపడేదితల్లి. యిరువురను యెడబాటుచేసేది, గిజుగులుపెట్టేది, కాపురానికి పంపక అజ్ఞలో ఉం చుకునేది, దుశ్చేష్టలు, అవినీతులు, అప్రయోజకాలు నేర్పేది, ఆలు మొగళ్ల సందులో అతుకు వేసుకొని అగచాట్ల పాలుచేసేది, తెలిసీ తెలియని పిల్లలకు దుర్బుద్ధులు చెప్పి దుష్టులచేసేది, ఆదాయము కొరకు అమ్ముకునేది సంఘ మర్యాదలకొరకు ముందు పెండ్లిచేసి తగువులు ఆలు మొగళ్లసందు గల్పించి విడాకులు పెట్టించి అవినీతితో ఆదాయాలు తీసుకొనేది, నీవు కాపురానికి పోతే మేము బ్రతుకలేము పోవద్దని బలవద్గమనముతో నిలబెట్టుకొనేది తల్లిగాదు గరళ వల్లి. అట్టితల్లికి ఆడదై పుట్టుటకన్నా అడవిలో జంతువై పుట్టేదిమేలు స్త్రీయైకూడా స్త్రీ చిత్తము తెలుసుకొనలేక నెలల పర్యంతము యింట వుంచుకొని అల్లుని, అత్త మామల సాకులుచెప్పి సాగనంపుతూ సాధించడములో కూతురు కాపురము చెరిచే కుమతి అమ్మగాదు మారెమ్మ. ప్రేమా అంటే తనయింట పెట్టుకొనుట తాను తెచ్చిపెట్టుటకాదు. తగినవివి, తగనివివి అని చెప్పి ఆలుమొగళ్ల యెడబాటుచేయక ఆనందముగా కాపురము చేయునుపాయము చెప్పి కని విని ఆనందపడుటే అమ్మకు గాని అత్తకుగాని ధర్మము. కష్టాలు ఉన్నదీ లేనిదీ గమనించి అమ్మగాని, అత్త గాని, ఆడబిడ్డల పిలువవలెను. యిచ్చేవస్తువుల చక్కగా జరుగుచున్న అమ్మా యికి అక్కడికే పంపుట శ్రేయము. భార్యా భర్తలు యిరువురూ సంతోషిస్తారు అన్నది సరోజ.

అయితే వచ్చేది స్వస్తి చెప్పినావన్న మాట. వచ్చినాను కన్నులార చూచినాను కడుపుచల్లగా అయినది. ఇట్లే కలకాలము కాపురము ఆడుతూ, పాడుతూ నడుపుతూ కని పెంచుకోండి తల్లీ. ఇదే మాకోరిక సంతోషముగా భార్యాభర్తలు కాపురము చేస్తూవుంటే పిలుచుక పోయి నెలల పర్యంతరము ఇంట ఉంచుకునే అప్రయోజకులుంటారు వారితో చేసిన పాపము తప్పదుతల్లీ నాదుఃఖము యీనాటితో తీరిపోయినది. కావలసినన్నీ గుడ్డలు అన్నతో పంపుతాను ఉండు తల్లీ ఇప్పటికే ఆయన దుఃఖము మనకు పాపరూపమై యెంతో చుట్టుకున్నది యింకా యెందుకమ్మా చక్కగా చూచుకో పాపము బాపుకో ఋణం తీర్చుకో. అయితే రేపు ఉదయం పోతానమ్మ అన్నది అనసూయమ్మ.

వచ్చె దానికి నా మాట, పోయేదానికి అల్లుని మాట అత్తకు అవశ్యకము. అమ్మకూ అంతే తెల్లవారి అల్లుని అడుగు అన్నది సరోజ.

సరోజా యివన్నీ యెక్కడనేర్చినావే, ఇన్నినేర్చేనా మూడు నెలలు మూర్ఖత వహించినది అన్నది అనసూయమ్మ.

పట్టుదల, కోపము, ఈర్ష్య ఈమూడు భూతములు ముమ్మూర్తుల నైనా పట్టి బాధిస్తాయి. ఈ మూడు విడచినవారే ముల్లోక పూజ్యులు. ఆభూతముల బారి నుండి తప్పించుకొని బయటపడి బాగుపడినాను. ఆ భూతములకు తిరుమంత్రము నేర్పు ఓర్పు నేర్చుకున్నాను యింక నావెంతకు రావు. స్త్రీకి అవి అపాయకరములు అన్నది సరోజ.

మాటల సందడిలో పొద్దుపోయెనేమో చూడు అన్నది అనసూయమ్మ.

పదిన్నరగంటకు అలారముపెట్టి చదువుకుంటూ వుంటారు అంతవరకూ ఇంటిపనో లేక చదువుకునేదో ఏవయినా నేర్చుకునేదో చూస్తూవుంటాను. అల్లుని అంతవరకూ మాట్లాడించపోను అన్నది సరోజ.

అంతా క్రొత్తపద్ధతుల్లాగ ఉన్నవిగదే ఒకటొకటే వింటూవుంటే వింతగా వున్నవి అన్నది అనసూయమ్మ.

క్రొత్తేమున్నది పాతబద్ధతే మైథున నిద్రాహారములు మూడే నమ్ముకొని దేవుడూ దైవమూ అనేదిలేక మూడువేళల కాఫీ ఫలాహారము రెండువేళల భోజనము చాలైనంతవరకూ పగటినిద్ర సూర్యోదయమై ఇంట్లో వారులేవమన్నంతవరకూ

రాత్రి నిద్దురపోయే మొద్దు దద్దన్నలు ఉంటారు. మానవుడు బ్రతికినంతవరకూ ఏదోవక క్రొత్తనేర్పును గాని ఉన్నదాని అభివృద్ధిగాని చేస్తూనే ఉండవలయును. మానవులలో గౌరవ ప్రతిష్ఠలు కావలెనంటే దేనిలోనయినా ఒకదానిలో ప్రతిష్ఠ నార్జించవలె. ప్రతిభావంతుడే ప్రజలలో పూజనీయుడు మీఅల్లుడూ ఆడబిడ్డ ఆ పెద్దన్నలలో చేరరు ప్రజ్ఞావంతులలోనే చేరుతారు రాజకీయమునకో ప్రజానీకము నకో పనికిరాక బూ దే నీ పుటాక్షరములకు పనికివచ్చు మానవుడు. బ్రతికి సార్థకములేదు ఈజన్మలో తప్పినా మరుజన్మకైనా ఒచ్చులాగ కష్టపడవలెను మీఅల్లుడు యం ఏ పరీక్షకు చదువుతూన్నారు పదిమందిలో కీర్తినార్జించవలెనను రకము అపకీర్తి తెచ్చు రకముకాదు అన్నది సరోజ.

అంతలో అలారము గడగడ కొట్టినది. ఇక పడుకో అమ్మా అంటూ పడక వేసివచ్చి సరోజ రాము వున్న గదికి పోయినిది.

రాము పరుగెత్తుతూ యెదురువచ్చి ధర్మాలవుట్టి, వేదాలకట్ట నియమానమెట్టు వజ్రాలగుట్ట అంటూ గౌగిలించి యెత్తుకొని పోయి అంకస్థలముపై కూర్చుండబెట్టు కొని చుబుకము నిమురుతూ నాసంసార రాజ్యలక్ష్మి చతుర్విధోపాయము లెరింగిన చక్కని మంత్రి చతురంగ బలంబుల బలంబులెరింగి యుక్తి యుక్తగా సైన్యంబు నడి పించి శత్రునివహంబుల నిశ్శేష మొనర్పగల సైన్యాధిపతి చాలూమూలా యెరింగిన సాధ్వి శిరోమణీ అంటూ వుండగా సరోజ రాము చేతుల పట్టుకొని కొంచెము కర స్పర్శ కవనము చాలించండి రసికాగ్రేసర చక్రవర్తులు, రసికతవల్ల మాటల చతురతవల్ల స్త్రీ హృదయాన్ని చెజిక్కించుకొని మదన సామ్రాజ్యము అవలీలగా ఏల నేర్చిన నీతికోవిదులు తమకష్టు ఏమున్నదీ కొంచెమాగండి నామనవి ఆలించండి అమ్మా నేను మాట్లాడేది విన్నారా అన్నది సరోజ.

ఔను అన్నాడు రాము.

కవులకు చదువుకొను పిల్లలకు మునులకు. కార్యాలోచన సేయు ధీమతులకు ధ్యానముచేసే భక్తులకు ప్రక్కన పోటుకు పెట్టువారుగాని మాట్లాడు వారుగాని మాట్లాడించే వారుగాని వారిపాలిటి శత్రువులన్నారు. అట్లనే అయిందే చదువు విడిచిపెట్టి మాసుద్దులలో దిగినారే చాలా మంచిపని చేసినారే. తల్లీ పిల్లా అల్లారు ముద్దుగా పొద్దు పోక మాట్లాడుతుంటే తల్లీ పిల్లా మధ్యామాటలేమిటివో అని వింటూవుంటిరేమో కదా అన్నది సరోజ.

ఔను నాయిల్లు నాభర్తా అనే భావముగల యిల్లాలు మాటలు భర్తకు అమ్మతో సమానముగా నుండును. మరీ మరీ విన కుతూహలముగును ఆయన్ను విడచి నేను రాను నన్ను విడచి ఆయన కొరకు పోయి అమ్మదగ్గర యిస్తావుంటే నేను వింటే నాహృదయ ముప్పొంగి బ్రహ్మా కూకటిదాటినది. ఆమాటలతో నన్ను నామనసును చూరగొన్నావు కాళ్లకు బంధనము వేసినావు ఆమాటలవల్ల మీయమ్మ హృదయము ఆనందపడి మనసు చల్లబడివుంటుంది. అల్లుడూ ఆడబిడ్డ ఆనందంగా కాపురము చేసుకొను చుంటే వారు విన్నా కన్న ఆనందమునకు మేరవుండదు. వారు ఆనందపడడము తోటి అత్తా మామా సుఖం తీరుతుందన్నారు అన్నాడు రాము.

అయితే కథ అంతా విన్నట్లేవుండే అని చిరునవ్వు నవ్వి వాల్గన్నులవైఖరిని చూపి రాము కౌగిలిలో కనుమూసినది సరోజ.

అస్తాద్రి మరుగున క్రుంకిన సూర్యభగవానుడు ఉదయాద్రిపై తొంగిచూడ ఉద్యమించు వేళకు గంట గడగడమన్నది కనులిచ్చి చూడ అయిదు గంట యిరువురు లేచి పోయి దినకృత్యములు దీర్చుకొని స్నానముచేసి కాఫీచేయ సరోజ పోయెను. రాము సూర్యునకెదురుగ దొడ్డిలో నిల్చుకొని సూర్యసహస్ర నామము పారాయణము చేసి దేవుని కార్యకలాపములు చూచుకొన్నాడు.

సరోజ కాఫీగిన్నె దేవుని యెదుటపెట్టి అమ్మా ముఖము కడుక్కొందువురా కాఫీ అయినదని పిల్చినది.

అనసూయమ్మలేచి ఈవేళకే కాఫీ ఏమమ్మా అంటూ పోయి దినకృత్యములు తీర్చుకొని దంత ధావనముచేసి వచ్చెను.

రాము కాఫీ దేవునికి నివేదనచేసి తాను త్రాగుతూ వుండెను.

ఆవేళకే స్నానముచేసి పూజా పునస్కారాలు చేసి కాఫీత్రాగుతున్న అల్లుని కూతురిని చూచి ఆనందపడి ఈవేళకే స్నానాలు సంధ్యలు కాఫీ అయినాయేమమ్మా అంటూ సరోజ తెచ్చి యిచ్చిన కాఫీ త్రాగుతూ సరోజా నలభై యాభై యేండ్లు అనుభవముగల పురాణ దంపతుల్లాగ కాపురము యెంతబాగా చేస్తూ ఉన్నారే

ఈవేళకే లేచే పద్ధతులు మాకులేవుగదే ఔను కాడియెద్దులా మంచిజత అయితే యెంతబరువయినా యిగ్గగలవు ఇరుజతపడితే ఇజీగిచచ్చుపేగాని బండిముందుకు సాగదంటారు కర్షకులు భార్యా భర్తలు యిద్దరూ వకట్టై సంసార రథాన్ని ఈడ్చ ప్రారంభించిన యెంతబరువున్నా వెంటవచ్చును ఓపిక ఓర్పు నేర్పు వుండవలె అవి మీలో ఉన్నట్లున్నవి బాగుపడగలరు అన్నది అనసూయమ్మ.

ఔను అత్తా కూతురిని చక్కగాతయారుచేసినావు ధర్మాలపుట్ట నియమాల గుట్ట వేకువ అయిందిలేండీ స్నానముచేయండీ చదువూ సంధ్యాచూడండీ కాఫీచేస్తా త్రాగండి అంటూ పోరుబెట్టుతుంది. అత్తా త్రిపీడాస్తు అనే మూడు పీడల్లో రెండు పీడలున్నాయి మూడోపీడ యిక రాబోతుంది అన్నాడు రాము.

ఇంట్లో ఆలుపీడా బళ్లో పిల్లల పీడా రెండూ ఉన్నవి యికఇంట్లో పిల్లలపీడ ఒకటే లేదని అల్లుడు చెప్పుతూన్నాడమ్మా అన్నది సరోజ.

దారలేని తిండి దయ్యపు తిండిరా అన్నాడు వేమన యోగి దారలేనికష్టము అనుభవించి దారా దరిద్రము నాశత్రువులకు కూడా వద్దురా అబ్బా అని తల విదిలించుకొని అన్నాడు అమహాయోగే దారపీడ వద్దురా అంటే దయ్యాలకొంప అవుతుంది. నాయనా దారా పుత్రులువుంటేనే మానవునికి సుఖము దారా పుత్రులు లేనివాడు దయ్యాలలో చేరుతాడు పరదార పరాన్నము పరధనముల ఆశించి పతితుడై పాడైపోతాడు మైథున నిద్రాహారములకు పరమాత్ముడు కూడా వశ్యుడే సంసారకష్టములకు వెరచి వెన్నిచ్చి పరిగెత్తిన పతితులు సన్యాసులు పైకంటుచూడు సప్తర్షులకుకూడా గృహధర్మిణులు ఉన్నారు. సహధర్మిణి లేక సాగదు దారి కాదనిసాగించెనా యితరులకు బాకీ పడవలసినదే దారఉండవలె దారితెలిసిన దారదొరికితే పురుషుడు పుణ్యాత్ముడు ధర్మమెరింగిన భర్తదొరికితే దారపుణ్యవతియే కలిసీ మెలసీ కాపురముచేస్తూ భగవద్ కైంకర్యముల దినచర్యల మరువకవుంటే యోగులు త్యాగులు పోనిచోటికి పోగలరు యోగులు త్యాగులు లోకులకూ బాకీపడి పరదారా పరాన్న పరధనములు తీర్చను తిరిగీవస్తారు వాటెకు లొంగక సంచ రించే మహానీయులు మంచి మార్గముగలవారు అరుదు అట్టివారు ఆశ్రమములులేక శిథిల దేవాలయములలో వుంటూ దైవసేవచేస్తూ ఏయాశ్రమములలో వున్నవారికి ఆయాశ్రమ ధర్మములు తెల్పుతూ క్రొత్తపనులు చేయక నాయనువస్తువుల గల్పిం

చుకొనక శిథిలములయిన ధర్మసంస్థాపనల బాగుచేయించుచూ వకచోటనక తిరుగుతూ ప్రపంచమునకు ఉపకరించును. సంఘమును చేర్చుకొనడు స్వయముగా వండడు విదిలభించిన నదిస్వీకరించి ప్రజోపయోగముల గుర్తెరింగి నడుచుచుండునని మీమామ చెప్పుచుండగా విన్నాను నాయన దార పీడకాదు ముఖ్యబంధువు ముఖ్యస్నేహితుడు మైథున నిద్రాహారములు మగువలేక తీరవు హరి హరాదులయినా అదవారి నాశ్రయించవలసినదే వారే వారినాశ్రయించి వుంటే యీగడ్డంపులులు వారిజాడల కాలరుద్ధి మరుగుజాడలతో మాధవు నొద్దకు పో జూచెదరు అక్కడ పోయినా ఆమహాతల్లి స్త్రీ రూపమే వారిప్రక్కన గూర్చున్నదీ అదదే హరిహరాదులకు అలవిగాని జిహ్వోవ స్థాచాపల్యముల ఈజీర్ణదేహాలు సాధించగలరనుట నీటమూట దేవ దానవ మానవులకు నలవిగాని దానికై యేడ్చుటకన్నా సూక్ష్మముగా పోవుటే మేలు నాయనా అన్నది అనసూయమ్మ.

శహబాష్ అత్తా బాగచెప్పినావు మొదలు చేదయితే కొమ్మలు చేదే ఆకులుచేదే వగరయితే వగరే తీపయితే తీపే నన్నారు. నీలో యింతతీపువుండే యీకొమ్మకు యింతతీపు వుండేది. నీవయసు వచ్చేటప్పటికి కొమ్మ మొదలయ్యేట్లు ఉన్నది. అత్తా పూర్వజన్మ సుకృతముంటేనే మంచి తలిదండ్రులకు పుట్టేది అన్నారు. అట్లేపుట్టింది పుట్టుకతోకొన్ని పెట్టుకతోకొన్ని అన్నీయిన్నై అవతరించినది కూతురు అన్నీదొరికిన యిల్లాలు దొరుకుటతోటి నేనూ పుణ్యాత్ముడనే షట్కర్మాలు ఆచరించడమునకు సైదోడు దారలేక కష్టము షట్కర్మాచరణ లేక షడ్వర్గము లగు కామక్రోధము లడుగంటవు అదిలేక దైవము సమీపించడు దైవము దూరస్థుడయిన నానాకష్టములు సంప్రాప్తించును వాటెకు వెరచి సంసారమువద్దని సన్యసించెనా మైథున నిద్రాహారములు పైబడును వాటెకొరకై తిరిగీ దారాపుత్రులతో కాపురము చేయువారి ధనము అన్నము వస్త్రము మొదలగు వాటెపై ఆధారపడి వారికి బాకీపడవలసి వచ్చును. దైవానికి కష్టార్జితము పెట్టనూలేక తిననూలేక స్త్రీ వ్యామోహాన్ని అపనూలేక వాటెకొరకై నానావిధముల నానాజీవులకు బాకీపడి దుఃఖాలతో తలవాల్చవలసివచ్చును. దార మంచిదై మంత్రియై షడ్గుణములు గలదై వుంటే దారేదైవము మగవానికి ధవుడే దైవము దారకు దార అవులేక దైవము ప్రాపులేక మానవుడుంటే వాడూ ఈలోకములో ఒకదయ్యము వానికి అపు భూతనాయకుడే జై శంకర్ అని తలమాసి వలుమాసి వలువలుమాసి గడ్డము దిగబెరుగ బుద్ధియెగబెరుగ ఆ భూతనాయకునికి ప్రీతిగా వారి వేషమే వేసి వారి

పరివారములోనే చేరి జిహ్వోపస్థల అభిరుచులకు స్వప్నములుగంటూ ముందు పోవు లోకాన్నిచూచి దుఃఖించుచూ కడకు కోరికలతో తల నేలమోపవలసి వచ్చును. తనువు విడుచు సమయమునకు ఆత్మీయులు యెవరూ చెంతలేక దుఃఖించి తనువు విడచి తిరిగీ ముందుకోరికల తీర్చుకొన ఇందురావలసినదే. షట్ కర్మాచరణ చక్కగా ఉన్నచో భగవంతుడు బంధువై మిత్రుడై మనయింట కుడిచి కూర్చొని మనము చెప్పుకొను మాటలవింటూ ఏనాటికష్టముల ఆనాడు తీర్చుతూ ఆశీర్వదించును.

భగవంతుని సమీపింప చేసుకొనుటకు సమీపించి పోవుటకు దార మంచిదిగాక పోయిన బహూకష్టము. అత్తా కని పెంచి ఆరు గుణములూ గలిగిన అతివా శిరో మణిని కన్యాదానము చేసినావు. యీ దార సపర్యలవల్ల భగవంతుని బంధువుగా చేసుకోగలను. భగవంతుని అనుగ్రహముతో భూలోకము భువర్లోకముదాటి సువర్లోకము చేరగలను అంతో ఇంతో ఆ పరీక్షలో కొదువపడి తిరిగీ ఈ స్కూలు కేవస్తే మళ్లీ యిటువంటి కన్యకనే ఒకదాన్ని తయారుచేసి కన్యాదానము చేసినా వంటే తప్పక ప్యాసగుతాను అక్కడ చేరుతాను మీపేరు ప్రతిష్ఠల మంచిని అక్కడ చాటుతాను. మీమేలు మరచిపోను ఈమాట మరువవద్దు అత్తా అన్నాడు రాము.

అనసూయమ్మ నవ్వుతూ అట్లనేకానీ నాయనా యీ జన్మకే కాకుండా మరు జన్మకుకూడా నీయట్లా అల్లుడే కావలెనని మాకోరిక. అల్లుడూఅంటే శ్రీమహావిష్ణు వుగా, ఆడబిడ్డ లక్ష్మీగా భావించమన్నారు. ఆ గుణాలన్నీ నీలోవున్నవి నాయనా. ఆధ్యాత్మిక శక్తికి దూరుడై భౌతికశక్తికి లోనై పాపపుణ్య విచక్షణలేక అత్తవారి కుటుంబమునకు పరమ భేతాళుడై ముందు మూకట్లతో ఆ పైకుండలతో అటుపై గంపలతో అటుపిమ్మట గాజలతోతిని చాలలేదని అగ్ని హోత్రగుండై కన్నుఎర్రచేసి చేతులుసాచి నోరుతెరచి భార్యపై బడి నిన్ను తింటా మీయమ్మలుతింటా మీనాన్ననుతింటా కడకు మీ సర్వస్వము జీవితాంతమువరకూ తింటా నంటూ వీరావేశముతో మాట్లాడుతూ అత్తగారి కీర్తి గౌరవముల ధన ధాన్య ములతిని వీధికెక్కించక గౌరవించి గౌరవపడుతూ కన్యాదానము చేసినవారిని కంట నీరు పెట్టించక కాలము గడపు యశోవంతుడుదొరికితే అత్తా మామ చేసిన పుణ్యము నాయనా. మేము యెంతో ముందు పుణ్యముజేసినాము. మీతల్లికడుపు మంచిది అవినీతుల కని అందరినీ నాశనముచేయకుండా ఈ అర్యావరములో నిజమయిన

అర్యునిగా కని, మాకు అల్లునిగా యిచ్చినది ఆర్యధర్మములన్నీ ఆమూలాగ్రముగా తెలిసినవాడవు. ఇంక మాకేమీ కొదువలేదు నాయనా అన్నది అనసూయమ్మ.

అమ్మా అల్లుని తియ్యనిమాటలువిని పొగడుతూ వున్నావా తియ్యగా మాటలు తీర్చిదిద్దుతారు వింటూవుంటే మూడునాళ్లయినా ధర్మాలు చెప్పుతారే అన్నది నవ్వుతూ సరోజ.

అత్తా నేను ఒక ఆకు చదివితే రెండాకులు చదువుతుంది నీకూతురు. అంటే ఒకటంటే రెండంటుంది అనికాదు అర్థము. నేనొక ధర్మాన్ని లేవదీస్తే రెండుగా మారుస్తుందీ అన్న మాట అన్నాడు రాము.

అత్తగారితో ధర్మాలూ మర్మాలూ కర్మాలు మధ్యాహ్నము మాట్లాడుదురు చేసేపని అయిపోజేయండీ ఫలాహారము అవుతూ వున్నది కానీయండి అన్నదిసరోజ.

చూడత్తా మరచిపోతే అడుగడుగునా నుడుగు తప్పకుండా యెత్తిస్తూ వుంటుంది సంసారంపాట నుడుగులన్నీ బాగా నేర్పినావు అత్తా. పదం పాడితే తాళం కొట్టుతుంది, తాళంకొట్టితే పదం పాడుతుంది అన్నాడు రాము.

అంతటితో ఆశువు ఆపినారు బ్రతికినానులేండి అడుతుంది అనంటే కష్టంగా వుండునన్నది సరోజ నవ్వుతూ.

రాము కృష్ణ సహస్రనామము రుక్మిణీ సహస్రనామమూ మూలము పారాయణముచేసి గీత నాలుగు శ్లోకములు చదివి నాడు సరోజ ఉప్పుపిండిచేసి తెచ్చి పెట్టినది రాము దేవునికి సమర్పించి తీర్థము పుచ్చుకొని పోయి దుస్తులు ధరించి వచ్చినాడు అంతలో అనసూయమ్మ స్నానముచేసి వచ్చినది సరోజ ఫలహారము పెట్టినది. అనసూయమ్మ తింటూ భగవద్‌గీత ఒకసర్గ అయినా చదువక నాల్గు శ్లోకములతో ఆపినావెందుకు నాయనా మీమామ దినమూ ఏడుసర్గలయినా పారాయణము చేస్తారే అన్నది అనసూయమ్మ.

రాము నవ్వుతూ అత్తా ఈభగవద్ గీతా సుందరాకాండ రామాయణము పారాయణము చేయువారు చాలామంది ఉన్నారు భగవద్గీత మానవునికున్న

దుర్గుణముల పోగొట్టి సుగుణములనేరి తెల్పి జీవు డిట్టివాడు దేవు డిట్టివాడని మనసుకు నచ్చచెప్పి షట్కర్మాచరణమే మానవుని ఉత్తీర్ణతకు తెచ్చునని జీవుడు దేవుని మరువకుండునట్లు మనసు అధర్మములకు పోకుండునట్లు గట్టిపరచి ఆధ్యాత్మిక శక్తికి లోనగునట్లు మానవుని మనసును బాగుచేయగలదు. దీనిని నిత్యమూ పారాయణము చేసిన లాభముండదు ఈగీతను వకసారిపట్టు పదిసార్లు చదివి చదివిన దాన్ని అర్థముచేసుకొని అర్థమయినదాన్ని ఆచరణలో ఉంచుకొని గీతా బోధకు జీవమయిన శ్రీకృష్ణభగవానుని సతీసమేతముగా సహస్ర నామపారాయణము చేయుట మానవులకు శ్రేయము. అట్లగాక భగవద్ గీతా పారాయణము వృధా కాలక్షేపము. చదివి అర్థముచేసుకొని ఆచరణలో ఉంచుకొనుటకు చెప్పిన నియమముల నిత్యమూ చదువుచుండిన ఫలమేమి గలదు అన్నాడు రాము.

అందరూ చేస్తూన్నారుగదప్పా యెంతోకాలమునుండీ ఆచరణలో ఉన్నదే అన్నది అనసూయమ్మ.

కొంతకాలము భగవద్గీతను పారాయణముచేయుచు అందులో అర్థమును గ్రహించి ఆచరణలో ఉంచుకో బాగుపడెదవని పెద్దవారు చెప్పగా అందులో అర్థము ఆచరణలో వుంచక భగవధ్యాన్నముచేయక నిత్యకృత్యముగా వృధా కష్టముచేయు చున్నారు. ఇదియొక పట్టుదల అన్నాడు రాము.

అయ్యో పెద్దపెద్ద మహానీయులు పేరెన్నికలుగల విద్యావంతులు చేయు చున్నారే వారికి తెలియదా నాయనా అన్నది అనసూయమ్మ.

వారు మహనీయులు గావచ్చు, విద్యావంతులు గావచ్చు. వేదం, శాస్త్ర, పురాణ తర్కపఠితంకింతే నజ్ఞానం వినా అన్నారు. గురువుచెప్పిన దానిపైనే ఊదుకొని నడుచువారు కొందరు. దానిని విమర్శించువారు కొందరు. తపఃశక్తితో దానిని గమనించి మంచిదారిన పోవువారు కొందరు ఉన్నారు. తానుచేయు భగవత్శక్తి మంచిదైన తనకే జ్ఞానముగలుగును. దారిమార్చును గాని చదువుతో మారదు అత్తా. కర్షకుడు భూమిని దున్ని దోకి యెరువూ యెంపలీపెట్టి అదునులో విత్తనమువేయును. విత్తనమువేసిన భూమిని తిరిగీ దున్నడు. దానికి తగు విధముగా పైరుచెడకుండా యెన్నోవిధముల సహాయము చేయుచుండును ఫలమునకై వేచియుండును అట్లే గీతను చదివి అర్థము చేసుకొని ఆచరలో ఉంచుకున్నవాడు తిరిగీ చదువడు. గీతనుంచి కావలసిన సదుపాయముల గ్రహించినాడు గీతా

బోధను గీటుదాటక ఆచరిస్తూ గీతాబోధామయుని అనుగ్రహమునకై త్రిసంధ్యలనో ద్విసంధ్యలనో లేక వకపూటనో కృష్ణ సహస్రనామము రుక్మిణీ (లక్ష్మి) సహస్ర నామము పారాయణముచేయుచూ అందులో చెప్పిన షట్కర్మ విధానమును మరు వక ఆచరించుచుండును. కానీ గీతనే జీవితాంతమువరకూ పారాయణముచేయడు. అందువల్ల నేను గీతా బోధకుని సహస్రనామము చేయుచూ దంపతులలో ఒకరిని దలచి మరొకరిని విడచిన మరుజన్మకు మాతా శాపమున సన్యాసిజన్మ వచ్చునని దంపతీ సమేతముగా పారాయణముజేసి జ్ఞాపకార్థముగా నాలుగు శ్లోకములు చదువు తాను. తొందరపని వున్నమానుతాను అన్నాడు రాము.

ఆలోచిస్తే నిజమే నంటుంది బుద్ధి ఈమర్మము తెలియక చేసి చేసి వడిబడు తున్నారు వ్యర్థముగా అన్నది అనసూయమ్మ.

వారుచేస్తుండిరి వీరుచేస్తుండిరని వకరికొకరు చెప్పుకొని ఆదీవక గౌర వముగా భావించి చేయడమేగాని ఆచరించుటగాని అనుభవించుటగాని లేదు అత్తా భక్తి శ్రద్ధలతో సహస్ర నామపారాయణములు స్తోత్రములు చేయుట శ్రేయము సుందరకాండ రామాయణము పారాయణము చేయుటకన్నా రాదు అంజనేయు సహస్రనామ పారాయణములు చేయుట శ్రేయము కాలక్షేప గ్రంథములు పారా యణ గ్రంథములయినని అన్నాడు రాము.

అంతలో సరోజ కాఫీ తెచ్చి ఇక గీతా సారము చాలించి కాఫీసారము గ్రహించండి భోంచేసి మధ్యాహ్నము బాగా కూర్చొని అత్తగారికి కావలసినన్నీ పురాణాలు చెప్పుమరు శ్రవణానందముగా విని ఇంటికి పోయి అల్లుని కథ అంతా తూ చా తప్పకుండా చెప్పుతుంది. అందరు చెవులు బిక్కిరించి వింటారు. అల్లుని పొగడుతారు ఆడబిడ్డకు మంగళహారతి యిస్తారు అందులో మానాన్న పెద్దఆగ్రె మెంటు చేసి బల్ల గృద్ది అల్లుని పొగడుతాడు అన్నది సరోజ.

యెందుకట్లు అంటాడూ అన్నాడు రాము.

అల్లుడూ అంటే అందరికీ ప్రాణమే ఆడబిడ్డ అవివేకము చేసిందిగా ఈ అవివేకము ఇక తీరుతుందో తీరదో చెప్పలేను ఆడబిడ్డ అయితేనేమి అవివేకి అయితే అందరికీ కోపమే అందులో మానాన్నకు యెక్కువకోపము తలిదండ్రికి అపకీర్తి తేచ్చే ఆడబిడ్డను ఏమిచేసినా పాపములేదనే అయన మతం అన్నది సరోజ.

తప్పువని చేస్తే అందరూ అంటారు అమ్మా సంఘములో గౌరవముగా బ్రతుకుతూ వుంటేనే ఏదోవకనెపము పెట్టుతూ వుంటారు. ఇకలోపము దొరికితే బ్రతుకనిస్తారా ఒకరితో అందరికీ అగౌరవము ఏర్పడుతుంది. దానికై అట్టివారిపై ఆత్మీయులకు అందరికీ కోపమే వకరు చేసిన చెడుగు అందరికీ వ్యాపిజెందుతుంది అన్నది అనసూయమ్మ.

శహబాష్ అంతా బాగా తెలుసుకున్నావే చాలు తప్పినావు సంస్కరింపబడి రావు అనిపించుకున్నావు. ఆర్యధర్మములు చెప్ప తీడుకున్నావు ఇంకభయములేదు మధ్యాహ్నానికి అన్నమేమో తయారుచేస్తావు అన్నాడు చేయి తుడుచుకొంటూ రాము.

భారమనక కావలసినన్నీ కూరగాయలు మోసుకవచ్చినారు వంటచేయక పోతే యెట్ల ఏమివంట చేయమంటారో చెప్పిపోయి పని చూచుకోండి అన్నది సరోజ.

రాము వెనుదిరిగి వంట నన్నడుగుతావేమిటే అత్తగారిని అడుగు లేదా నీయిష్టప్రకారము చేయి గుడిలో దేవుని అడిగి తెలియచేసే అర్చకుడున్నాడా ఏది ఆనాటికి ఉన్నదో అదిచేసి పెట్టునేగాని ఏమిచేయమంటావు స్వామీ అంటే పలుకు తాడా అన్నాడు రాము

అస్వామి ఏదితక్కువున్నా ఏదియెక్కువున్నా మనప్రాప్తమని తింటారు ఈ స్వామీ అట్లకాదే ఇదితక్కువ అదియెక్కువని దూషిస్తాడే కోపగిస్తాడే కన్నుల్లెట్ట జేస్తాడే బాగలేదని పారవేస్తాడే అర్ధకడుపుకు తిని అర్ధమగుతాడే అన్నది సరోజ.

వహ్వా అయితే నాకొరకయ్యేనా బాగా ఆలోచించి పక్వముగా జేయడము నానాలుకకేది రుచో అదే జేయడం నాకిష్టమెటో అట్లేనడువడం, నామనసెట్లో అట్లే గుర్తించి వర్తించడం జరుగుతుందన్నమాట అన్నాడు రాము.

ఔను నాయిష్టప్రకారమైతే యింట్లో వంటమనిషి యెందుకుండదూ, మీ యిష్టప్రకారమయ్యే ఇల్లాలే చెస్తూవుండేది ముందు పిల్లా పిల్లవాడు యిష్టపడే పెళ్లి అయివుండేది. పిల్లవానియిష్టం పిల్లా తీర్చవలె, పిల్లయిష్టం పిల్లవాడూ తీర్చవలె పిల్లా పిల్లవాడు ఏకమై నడువకపోతే పిల్లా జల్లా కల్ల, ఇల్లూ వాకిలి గుల్ల, కిల కిల నవ్వులు యెల్లా సుఖమెల్లా యిల్లా అని నవ్వినది సరోజ.

అత్తా చూచినావా కూతురి చాతుర్యం. వృద్ధనారీలాగా సుద్దులూ సూక్ష్మాలు సూక్తులూ ఫలోక్తులు అన్నీ బాగనేర్పినావు అన్నాడు రాము.

నాకు ఏవీ ఈలాంటి మాటలు రావునాయనా పూర్వకాలపు జీవిని మాయింటి కొకాయమ్మ వస్తుంది ఆమె ఆడపిల్లలకందరికీ జీవితరక్షణ, జీవనరక్షణ, పిల్లలపోషణ పెద్దలపోషణ సమస్తము స్త్రీలకు కావలసిన విధి విధానములన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పుతుంటుంది యాభై అరవైమంది ఆడపిల్లలు మావీధిలో ఈవిధంగా తయారయి నారు. యింకా తెలియనేటివి చెప్పమనగా చెప్పే ఆచార్యులవారు వకరున్నారు. అందువల్ల యేవిషయములోనా కొదువలేకుండా తయారయినారు నాయనా అన్నది అనసూయమ్మ.

అందుకేఅత్తా డెబ్బైఏండ్ల వృద్ధనారీలాగా తయారైనదికూతురు అన్నాడురాము.

నన్నప్పుడే వృద్ధనారిని చేస్తున్నారా అని నవ్వినది సరోజ.

నిన్నుకాదు నీబుద్ధిని చేస్తున్నాను. మనిషి వయసులో ఉన్నా బుద్ధి వృద్ధత్వము వహించవలె లేకున్న ముప్పులు తిప్పలూ తప్పవు అంటూ పోయి ఏవోకొన్ని పుస్తకములు చూస్తూ వుండెను రాము.

అనసూయమ్మ కూరగాయలు తరుగుతూ ఉండెను.

సరోజ హృదయానందముతో బలేచురుకుగా నడచుచూ కాళిదాసు రచించిన శ్యామలా దండకము కాఫీ రాగములో చెప్పుచూ పదిగంటలకు వంట పూర్తిచేసి అగ్నిదేవునికి అన్నీ సమర్పించి దేవుని దగ్గర పదార్థములన్నీ ఉంచి ఒకరికి అతిథ్యమిచ్చినాను రెండవవారికి యెదురు చూస్తున్నానన్నది సరోజ.

రాములేచి పోయి దైవనివేదన చేసి భోజనానికి కూర్చున్నాడు.

సరోజ వడ్డించ ప్రారంభించి ఈనాడు కూడా మా అమ్మకు యిష్టమైన అహారమే చేసినాను తనకు కూడా బాగనే ఉంటుందనుకుంటాను తిరుగవాతబెట్టిన గట్టికందిపప్పు ఇదికొంచెము వేడిచేయునని యెఱ్ఱ అవిశెపూత పొడితూర చేసినాను ఇది చలువా వీర్యవృద్ధి దేహబలం విరేచనకారి అన్నారు. బహుశ్రేష్ఠమని వైద్యులు యెక్కువ వాడుతారు. వారానికి వకటి రెండు తూర్లు అకునూ వాడుతుంటారు.

మలబద్ధకము ఉన్నవారు పదేపదే వాడుతారు. యిక మినపబేడలు వేయించి పచ్చడి చేసినాను మినపబేడల ప్రతాపము తమకు తెలిసినదేగా అన్నతోడనే

రాము సరోజవంక యెగజూచి నవ్వుతూ నాకేనా తెలిసినది నీకుతెలియదా అన్నాడు.

అమగో గోడ అవతల యెవరున్నదీ కొంచెం గమనించండి అన్నది నగవూ కోపమూ వలపు మిశ్రమముచేసి సరోజ.

అరరే తప్పు తప్పు మాటకు మాట అందివ్వడములో మరచిపోయి భావ గర్భితమైన మాట వాడినాను గజ్జెల గుజ్జుమువంటి జవరాలు పజ్జన వడ్డిస్తూవుంటే ముజ్జగాలు యేలేమొనగాడైనా అనీ అనకమునుపే, సరోజ అమగో ఇప్పుడు సంపూర్తిగా మైమరచినారు అన్నది.

యికమాట్లాడితే పొరపాటె ఇదిసరిపాటి అయింది చెప్పుతూవుండూ తింటూ వింటూ వుంటానన్నాడు రాము.

అప్పళాలు వడియాలు ఇవి పూర్తియిష్టంకదా అన్నది సరోజ.

యిష్టంకదా అని ప్రశ్నిస్తే ఔననో కాదనో చెప్పవలసి వస్తుందే చెప్పడములో మైమరచిపోతాను మైమరచడములో మాటలు పొరపాటవుతాయి నీవంటూ వుంటే తింటా వింటా నంటా నంటూ తలయిట్లా అట్లా ఆడించినాడు రాము.

అయ్యో క్రిందపడిపోయీనండీ తల అట్లు ఆడిస్తారు నాకు భయమగుతూ ఉన్నది. అంటూ నవ్వుతూ ఇన్ని మాట్లాడుతూ ఉండినా నోరూ చేయి జాగ్రత చూవుతూనే ఉన్నారే అన్నది సరోజ.

అయ్యో ఆమాటలు చెప్పి యీమాటలుచెప్పి అమ్మ తినిపించే కాలం అది, ఆమాటలు ఈమాటలు చెప్పుతూ ఆకుకెదురుగా కూర్చొని మైమరపించి ఆలు తినిపించే కాలం. ఇది అప్పుడు అమ్మ, ఇప్పుడు ఆలు మంచివారైతే ఆ అబ్బాయికి ఆనందం చెప్పవలెనా ఆనందం బ్రహ్మానందం అంతావానిదే అమ్మ తినిపిస్తూవుండె, ఆలు తినిపించనిది వకటే తక్కువ అన్నాడు తింటూ రాము.

అయ్యో పాపం చంకకు యెత్తుకొని చందమామను చూపిస్తూ తినిపించ మంటారా పగలు చందమామ ఉండడు రాత్రికి అందాలమామా చందమామా వస్తాడు అప్పుడు పైడిగిన్నెలో పాలు అన్నం కలిపి తినిపిస్తా పిల్లవాడవగుదురు యిప్పటికి భోంచేయండి అన్నది సరోజ.

అయ్యగారికి తినిపించేది నేర్పుతున్నావు అబ్బాయికి తినిపించేది నేరుస్తావు ఇప్పుడు అయ్యగారిని ఆడిస్తూ ఉన్నావు యింక అబ్బాయిని ఆడిస్తావు ఆడింపూ అండిచు అంటూ చారువరకూ వచ్చినాడు రాము.

సరోజ అన్నము పెట్టి మజ్జిగ చారుచేసినాను కొత్తిమెర పచ్చికొబ్బెర పచ్చి మిరపకాయలు సైంధలవణము నున్నగా నూరి చిక్కని మజ్జిగలో కలిపి తిరుగ వాత వేసినాను వైద్యులు దీన్ని హైనగా తక్రారిష్టమంటారు జీర్ణకారి విరేచనకారి ఆరోగ్యానికి మంచిది ఇంకకొంచెము వేసుకోండి అంటూ వేసినది.

రాము కడుపునిండుకూ తిని తేపుతూ అమృతోపమానముగా ఆహారమున్నది.

కం॥ పొగడొందు జననిగానీ
తగవున వర్తించునట్టి దయితయుగానీ
తగనుండని గృహమున నుం
టగు చక్రవిహీన రథము నంచుణ్ణ టరయఙా!

అన్నాడు రెండు చక్రాలు ఈబండికి బాగున్నాయి బరువు యెంతైనా యెత్త వచ్చు యెన్నైనా తోలవచ్చు నంటూ పైకెగబాచి నాదే సుకృతము స్వామీ అటు అమ్మా ఇటు ఆలూ ఆదరణ సంపాదించుకున్నాను. తమ ఆదరణవకటే కొడుకు నిన్ను వెతకి పట్టుకునేదారి అమ్మ చూపినది ఆలు అనుసరించుచున్నది ఇంక నీయా దరణకూడా సంపాదించుకుంటాను స్వామీ అన్నాడు రాము.

కడుపునిండిన మాటలు మాట్లాడుకున్నారా యింకా రెండు కడుపులున్నవి తొందరగా లేవండీ చేతికి నీళ్లు పెట్టినాను అన్నది సరోజ.

సతి పతికి సైదోడు చేదోడు అన్నారు పెద్దలు కొంచెము చేయూతనీవే సైదోడుకావే మాటలతో మైమరపించి అన్నం అధికమయ్యేటట్లు చేసినావు అంటూ చేయి సాచినాడు రాము.

ఏమిలేవమంటారా అయ్యోఅయ్యగారికి కడుపుబరువయింది షష్టిపూర్తిరోజులు వచ్చినవి. ఆలులేపితేగాని అయ్యగారు లేవలేరంటూ చేయిపట్టి లేపిందిసరోజ.

రాము లేచి శహబాష్ అంటూ భుజముపైన చేయివేసితట్టి కడుపునిండా అన్నంపెట్టినావు కడుపునిండా ఆశీర్వదిస్తా శీఘ్రమేవ సుపుత్రా ప్రాప్తిరస్తు నాయట్లా మొగపిల్లవాడు కడుపున పడుగాక అని పోయి చేయి కడుగుకున్నాడు.

సరోజ తుండుపంచె వకటి యెత్తుకపోయి చేయితుడుచుకొన యిచ్చి పాణ్బిడా వకటిచుట్టి నోటి కందిచ్చి యికవేషం వేసుకొని వాహనం యెక్కండి భోజనం అయింది ఆశీర్వచనాలు అయినవి ఇంకేమి కొదువ అన్నది సరోజ.

నాన్నా నేనూవస్తానవేవాడే కొదువ ఇంకేమీ కొదువలేదు అన్నాడు రాము.

ఇదివరకెక్కడన్నా సంపాదించిపుండే పట్టుకరాండీ అంటాను అన్నది నవ్వుతూ సరోజ.

ఛా ఛా ఆముట్టాలో చేరలేదే మాఅమ్మా అప్పా ఆదారిన పోకుండా ముందు వచ్చే ముఖ్యమయిన షట్టాలు చెప్పి పడిపోకుండా పట్టాలపైకి బండీనెక్కించినారు చక్కగా గమ్యస్థానము చేరుకున్నాను అగమ్యస్థానము ఎట్లాటిదనుకున్నావో ఏర్ కండీషన్‌తో ఎలిక్ట్రిక్ దీపాలతో ఎంతో వింతలతో వినోదాలతో దేవలోకాని కన్నా మిన్నగా ఉన్నడి యింక పొరపాటు జరుగదు స్థానం విడువదు అంటూ చొక్కావేసుకొని సైకల్ చేతబట్టి ఊ ఆశీర్వదించు పోయివస్తా ముందు అమ్మ ఆశీర్వచనం యిప్పుడు ఇల్లాలి ఆశీర్వచనము అన్నారు. ఇవిరెండూ దూషణలయితే వానిజీవితము హతం అన్నారు ఏమని ఆశీర్వదిస్తావో కానీ అన్నాడు రాము.

సరోజ నవ్వుముఖముతో సుఖంగా పోయి లాభంగా రాండి అన్నది.

అదుగో సుఖంగా పోయి లాభంగారాండీ అంటే సాయంత్రం వచ్చేటప్పుడు పూలూపండ్లు పట్టుకరండీ అని అర్థం లాభంగానే వస్తానన్నాడు రాము.

నాకొరకాతెస్తారు మోసేది నేను చూచేది అనందించేది మీరు తేకుంటే బరువే తక్కువగుతుంది అన్నది సరోజ.

బలేమాట బలేమాట అంటూ రాము సైకలెక్కి స్కూలుకు పోయినాడు.

అనసూయమ్మ కూతురు అల్లుడు ఆడుకొనే మాట్లాడుకొనే తీరుచూచి చిరునవ్వు నవ్వుకొంటూ పరమానందముగా గోడకానుకొని కూర్చొనివుండెను.

సరోజ వీధితలుపు వేసివచ్చి అమ్మా యింక భోంచేస్తామురా అంటూ అల్లుని కథచూస్తివా కాలికివేస్తే మెడకూ మెడకువేస్తే కాలికీ వేస్తూ కావలసినన్నీ కథలు పడతారు సమాధానాలు చెప్పలేనిదయితే సగమైపోవలసిందే నంటూ రెండు ఆకులలో వడ్డించి ఇరువురూ కూర్చున్నారు. అనసూయమ్మ భోంచేస్తూ సరోజ యెంత బాగ చేసినావే వంట ఒక్కనాడయినా మనఇంట్లో చేసినావేమే నయముతో

ఏవీకావు భయముతో సర్వమూ అవుతాయి అన్నారు అదేవిధమయినది. అంటూ ఫోంచేసి అనసూయమ్మ లేచినది. సరోజ ఫోంచేసి వంటయింటిలో సర్వమూ చక్కదిద్ది తాంబూలం తీసుకొని అమ్మవద్దకువచ్చి తాంబూలం వేసుకొమ్మని ఇరువురూ వేసుకొని కొంచెము భుక్తాయాసముతో తలవాల్చినారు కొంతసేపటికి గంట మూడుకొట్టినది సరోజలేచి పోయి కాఫీవేసి అమ్మకుయిచ్చి తానుతాగ్రి ఇంటిపనులు చూచుచుండెను.

అనసూయమ్మ తలదువ్వుతా రామ్మా యని పిలువగా వచ్చి తలదువ్వించుకొని అలంకారము చేసుకొను వేళకు అయిదున్నరగంట అయినది.

రాము శరవేగముతో వచ్చి నీవు ఆశీర్వదించినట్లు సుఖంగాపోయి లాభంగా వచ్చినాను లాభం ఇదిగో పిసికిచూడు తెలుస్తుంది అన్నాడు.

సరోజ నవ్వుతూ పోయి పట్టుకున్నది ముండ్లుగ్రుచ్చుకున్నవి అబ్బా అంటూ చిత్తివిడచి చేయివిదిలించుకున్నది.

లాభం లాభంగానే ఉన్నదా అన్నాడు రాము.

ఆడవారినోటి అబ్బాబ్బా అయ్యోయ్యో అంటేగాని ఏడిస్తేగాని అయ్యగారికి ఆనందం ఉండదా అన్నది వలపులో దుఃఖం మిశ్రమముచేసి సరోజ.

మగనితో సరససల్లాపాలాడుతూ మొగలి పూలవాసనే మరచి లాభమంటానే చేసాచిన అతివకు అబ్బబ్బలుగాక మరేమున్నదంటూ మొగలిచెండును చేతికిచ్చి రోజాపువ్వును జడలోపెట్టి మోసుకవచ్చేది నేనూ ముడిసేది నీవు అన్నాడు రాము.

మోజు చూచేది అన్నది సరోజ.

మొనగాడయిన మొగవాడు అన్నాడు రాము.

మొగవారవుతానే మొనగాళ్లవుతారా మొనగాని లక్షణాలన్నీ వుండవలె మెచ్చి చేసుకున్నమగువ మోజు చూచేవారు కోరి చేసుకున్న కోమలికోర్కె తీర్చేవారు వలచి వలపించుకొని కోర్కెలు తీర్చుకొనేవారు మొనగాండ్రు కొట్టి, తిట్టి కట్టుళ్లలోపెట్టి కంటనీరు పెట్టించుతూ కోర్కెలు తీర్చుకొను వారు మొనగాండ్రా ఆడవాండ్రా మీరే చెప్పండీ అని వాల్గన్ను లల్లార్చుతూ నవ్వుతూ మొగలి చెండును దేవుని-దగ్గర పెట్టి నమస్కరించి కొన్నిరేకుల శ్రీవారికిపెట్టి కొన్నితీసుకొని వచ్చి తల్లిచేతికి యిచ్చెను. తల్లిచక్కగా మడిచి కుట్టి పుష్పాకృతిచేసి జడలో పెట్టెను. సరోజ పోయి కాఫీ తెచ్చి రాముకు యిచ్చి కొంచెము పుచ్చుకోండి

మొగలిపూలు మోసుకవచ్చి బరువుపడినారు భారమై గసపెట్టినారు అంటూ చేతి కందిచ్చినది సరోజ.

రాము కాఫీత్రాగుతుండగా అనసూయమ్మ మెల్లిగా పండుగకు ఇద్దరూ అక్కడికి రాండప్పా అన్నది.

మారాష్ట్రానికి రాజ్యానికి ప్రధానమంత్రిగారిని అడిగి తేల్చుకోండి మంత్రి గారి సలహోవయిన నడుస్తాము అన్నాడు రాము.

మంత్రిగారి సలహోవయిన మహారాజుగారు నడుస్తారు రావలె పాపము ముందే చట్టము ప్యాసుచేసి బహిర్గతము చేసినారుగా అమ్మగారి యింటికి అత్తగారి ఇంటికి స్వస్తిచెప్పి స్వస్తిశ్రీ ప్లవనామసంవత్సర అను సంకల్పముతో సొంతకాపు రము ఇక్కడ బెట్టి స్వేచ్ఛా విహారముగా ఉండవలెనని యుప్పిళ్లూరినారుగా మళ్లీ మంత్రిగారి సలహా అంటూన్నారు అన్నది సరోజ.

మరుపు మరుపు ఔనత్తా వచ్చేక్రొత్త సంవత్సరం ప్లవనామసంవత్సరం క్రొత్తకాపురానికి క్రొత్త దస్తరం పెట్టబోతాము మీకూతురు కూడా మాయిలువేల్పు చిట్టాలెఖ్ఖల్లో ఉంది దస్తరానికి యెక్కించడానికి అర్జీదాఖలు చేయవలె శ్రీవారి శ్రీముఖం పట్టా పొందవలె మాఇంటి కోడలయినట్లుగా పండుగరోజు పంచ భక్ష్య పరమాన్నములు చేసి శ్రీవారికర్పించి చిట్టానుండి పెద్దదస్తరాని కెక్కవలె వారి ఆశీస్సుల పొందవలె ఈపండుగకు రాము మరొకతూరి వస్తామని మంత్రిగారు మహారాజాగారు మనవిచేసుకున్నారని మా మామగారికి బావగారికి అక్కగారికి మంత్రివరా యింకెవరికి చెప్పవలెనో చెప్పు అన్నాడు రాము.

ఊ౦ చెప్పండి మార్జాల చక్రవర్తులకు శునక శుండాలములకు ... అనునంతలో చా చా శునకం శుండాలముగాదు మార్జాలము చక్రవర్తిగాదు — అని రాము అను నంతలో నేను మంత్రినీగాదు తమరు మహారాజులూగాదు అన్నది సరోజ.

కార్యాలోచనలో మంత్రివలె సలహాయిస్తూవున్నావు గాబట్టి నాకు మంత్రివే నీవు మంత్రివి కాదని మానవులుగాదు దేవ దానవులుకూడా అనలేరు. ప్రపంచాది నుండీ భార్యా భర్తలు మారకుండా వస్తుండారనీ, ఒకరి కొకరు విడిపోరనీ, ఒకరి కొకరు ద్రోహములుచేసి బాకీ పడుతూ తీర్చుకునే నిమిత్తం ఎడతెగకుండా పుట్టుతూ వుంటారని ఒకరి కొకరు ద్రోహంచేయక సహాయభూతులై ఏకలక్ష్యముతో ఏకీభ ధర్మమునుమరువక దారిపట్టిననాడు తిరిగిరారనీ, భార్య, భార్యచేసినవి భర్త ఒకరి

కొకరు మోసము చేసుకొంటూ విధవలై సన్యాసులై పాపఫలముతో ఇజిగి వస్తూ యుగాంతమువరకూ విడిబడక యెడతెగక వస్తారని పెద్దలు అన్నారు. ప్రభు ద్రోహము చేయక నీవు మంత్రిమనవి ఉల్లంఘన చేయక నేను దయా దాక్షిణ్యములతో సంసార రాజ్యమేలినా మా రాజ్యం సుభిక్షంగా వుంటుంది. రాజూ మంత్రీ చక్కగా వుంటారు. యథారాజ తథాప్రజా మనసు చల్లగుంటే ప్రజలంతా చల్లగున్నట్టే అన్నాడు రాము.

కానీ నాయనా యిద్దరమూ హాయిగా పండుగ యిక్కడనే జరుపుకుంటాము ఉంటాము అంటూవుంటే రమ్మని బలవంతం చేసేది భావ్యముకాదు. కన్నబిడ్డల ఆనందం చూచే ఆశేగదా కన్నతలిదండ్రులకు మరేముందీ కావలసినవీ, ఈవలసినవి కావలసినన్నీ యిక్కడికే పంపుతాను కలయికతో కాపురము సాగించండీ కావలసిందిదేగా అయితే ఉదయంపోతానప్పా పండుగదగ్గర ఉన్నది అన్నదిఅనసూయమ్మ.

సలహాదారు ఏమంటాడో అడుగు అత్తా అన్నాడు రాము.

సలహాదార్ దఫేదార్ జమేదార్ సిరస్దార్ తహసీల్దార్ తాలూకాఫీసులో ఉంటారు సంజెవేళ అతిక్రమిస్తుందని సలహాదారు మనవి అన్నది సరోజ.

చూడు అత్తా ఏవేళకేదిచేసేది నేనుమరచిననూ సలహాదారుమాత్రము మరువదు ఇట్లాటిసలహాదారు ఇంకొకరువుంటే పంపుఅత్తా నీమేలు అజన్మాంతము మరచిపోను అంటూ నవ్వుతూ కాళ్లుకడుగుకొన రాము పోయెను.

ఇద్దరి సలహాలుంటే కొంపలు కూలిపోతాయి భావ విభేదములతో బాగును ఓగుగా, ఓగును బాగుగాచేసి భద్రతను చెరచి సంసార వృక్షాన్ని కూకటి వ్రేళ్లతో పెల్లగించి కూలతోస్తారు పాపపుణ్య విచక్షణతో మనోభేదములులేక ధర్మచ్యుతులుగాక ఉండువారు యెందరున్ననూ పరవాలేదు మాటపట్టింపుకై మానవత్వమునే చెరచుకొని యెట్టిపాపమునకైన జంకని బుద్ధిహీను లంటారని తెలియలేదా అత్తగారికి నేనొకర్తెనే బిడ్డను ఆశపడినా ఇంకలేరులే అని నవ్వినది సరోజ.

అత్తకు ఇంకా బిడ్డలున్నారని ఆశపడే దుష్టసముదయములో నన్ను చేరుస్తావేమే అట్లు వుండిననూ అక్కచెల్లెండ్రరూపమున చూడగలము. చూడక వ్యతిరేకించినదానగలుగు పాపఫలము చక్కగాతెలియును గోయియని తెలిసి అందులో దుముకు దుండుడుకు ధూర్తుడననుకొంటివా ముందుజన్మలో చక్కగా పతీ సతీ న్యాయము తెలిసి వర్తించి నందుకే ఈపతికి ఈసతి, ఈసతికి ఈపతి దొరికి వుండేది లేకుంటే

హాలాహలము అమృతమై, అతివ అతివా శిరోమణియై బద్ధద్వేషము మాని భర్తను వెతుకుతూవస్తుందా పగదస్త్రీగా కాపురము చేస్తుందా మనసిస్తుందా అన్నాడు రాము.

వసిష్ఠులమాదిరీ తమరు వెతుకుతూ రాకపోయిననూ, రాధ కృష్ణుని వెతకి పట్టుకున్నట్లు తమరిని వెతకి పట్టుకున్నా ననుకోండి అన్నది సరోజ.

ఓ అట్లకాదే వసిష్ఠునిమాదిరీ నిన్ను వెతకిపట్టుకున్నాను కట్టుకున్నాను కావలసినంత మట్టుకూ నాకునేను తిట్టుకున్నాను. వసిష్ఠుడు తండ్రియగు బ్రహ్మమాటను కాదని లోకాలన్నితిరిగి హరిజన గూడెములోనున్న హరిజనకన్య నొకతెను వజ్రమని మానినీశిరోమణియని ప్రేమించి కట్టుకొని తండ్రితో ముప్పదిమూడుకోట్ల దేవతలతో ఆశీస్సులంది అగ్రస్థాన మలంకరించినాడు.

హరిజన గూడెమునుండి వచ్చిన అతివ అతివలలో శిరో మాణిక్యమై హరి హర బ్రహ్మాద్య మరులచే వర్ణనీయమై త్రిదేవులచే పొగడబడి తారామండలమున తారయై వెలుగొందు చున్నది. నేనా దలిదండ్రుల మాట లెక్కించక వెతకి వెతకి అగ్రస్థాన మనబడి ఆర్యులచే పొగడ్త కెక్కి అన్ని విధములా అగ్రగణ్యమైన మీ ఇంటనిన్ను చేపట్టి రెంటెకు చెడిన రేవనై ఏమిదీ అధః పతనమున ఉన్న హరి జన బాలిక రెట్టపట్టిన వసిష్ఠుడు తారామండలమున తై తక్కలాడడము అగ్రస్థాన మాక్రమించిన అగ్రజాతి కన్యకను చేపట్టిన నేను అథఃపతనము గావడమా ఏమిది వింతా అదృష్ట మరదృష్టములుండు నంటారే అవి ఉండునా అవి స్త్రీలవా పురుషులవా స్త్రీల వనుటకు పురుషుడు కదా కర్త కోరి తెచ్చుకున్నది. పురుషుడే కదా గాజు కువ్వనుండీ ఎత్తుకపోయిన వసిష్ఠునకు వజ్రమగుటయు వజ్రముల కువ్వనుండీ తెచ్చుకున్న నాకు గాజురాయి గావడము జరిగినది. ఇది నా దుర దృష్టము అది వసిష్టుని అదృష్టము. దురదృష్టుడు ఒకటి చెడెనని ఆతురతపడి వెంటనే మరియొకటి చేసిన మరింత చెడునందురు ఛీ ఇక ఈ దురదృష్టము వైదొలగి అదృష్టము వెన్నంటి దానంతట అది వచ్చువరకు హరిధ్యానమే శరణ్యమని గట్టిమనస్సుతో నుండగా అధోలోకమున కట్టై దిగజారి అప్రతిష్ఠ పాలయిన తన్వి ధూళి ధూసరితములతో గప్పబడిన మనస్సును విదలించి మంచి నీటితోకడిగి షడ్గుణముల సంచి సంకనుంచుకొని షట్కర్మా చరణ మరొక సంక కెత్తుకొని సాలూ మూలా భుజాన నిడికొని స్త్రీ ధర్మముల శిరమున పెట్టుకొని వలపూ పిలుపూ వలపలిచేతా దయా ధర్మములు దాపలి చేత పట్టి ధర్మదేవతవలె

నాదయితుడెక్కడమ్మా అని ప్రత్యక్షమయిరావు ఇంకా అరుంధతి నతిక్ర మించగలవు తారా పథమున ఆమె వెలిగితే ఈ తారాపథమున నీవు వెలుగగలవు. ఆకాలములో అంతస్తు సంపాదించినది ఆమె అది గొప్పగాదు ఈకాలములో అంతస్తు సంపాదించినదే గొప్ప సంపాదించినావు. ఆమె ఈతారాపథముననే ఉండ గలదు నీవా తారాపథమున కష్టాల కోటాన కోట్ల మైళ్లలో ఉన్న వైకుంఠ నగరమే పోగలవు వైకుంఠుడు బంధువై అతిథియై నిత్యకృత్యముగా వచ్చి పోవు జాడ తెలుసుకున్నావుగా అరుంధతి హరిజనబాలిక నీవా బ్రాహ్మణ బాలికవు ఆమె వుండినది. సత్యకాలం నీవున్నది కలికాలం ఆమె కష్టములతో గట్టెక్కినది. నీవా సుఖములతో గట్టెక్కగలవు ఆమె మునిభార్య నీవు ధనిభార్యవు ఆమె పతియోగి నీపతి భోగి ఆమె పతి నిష్కామి నీపతి కామి ఆమె పతి వృద్ధుడు నీపతి వయస్కుడు ఆమె కుసుమాలాంబిదములు సున్న నీకు చీని చీనాంబర చిత్ర విచిత్ర భూషణా దులు గలవు. ఆమె స్థాయితగ్గ నీస్థాహెచ్చు వారు పోలేనిచోటుకు పోవ ప్రయత్న ములు సాగించుచున్నావు ఇట్టే ఎంచిన ఆమెకన్న మిన్న నీవే బహుసులభములో భగవంతుని భర్తను కట్టివేసినావన్నాడు రాము.

ఆమాటలకు నవ్వుతూ సరోజ భర్త భార్యను పొగడుట సహజం లయతప్పితే తన్నుటా సహజం ప్రజ లామాటనవలె భగవంతుడు కనికరించవలెనన్నది సరోజ.

ఇంట గెల్చినవారు రచ్చ గెల్వగలరు రచ్చ గెల్చినవారు రంగనే గెల్వగల రన్నారు. అయినా ఇది రెండు తెగలవారి లోకముగదా బ్రతికి ఉండగా ఒకతెగ వారే మెచ్చేది. చచ్చిన వెనుక ఆతెగవారుకూడా చేయెత్తగలరు. గట్టిగా దారిబట్టి నావు దాదాపు గమ్యస్థానము చూపుమేరలో ఉన్నది, ఈనాడు గాకపోయిన మరునాడయినా చేరగలవు. భయములేదంటూ రాము దైవధ్యానము చేయసోయెను.

సరోజ త్రిదేవి సహస్రనామముల వల్లించుచూ గృహకార్యక్రమములు చూచుచుండెను.

అనసూయమ్మ గోడకానుకొని అల్లుడూ కూతురు చెప్పుకొను మాటలువిని ఆనంద పడుతూవుండి ఇరువూరూ వారు కార్యక్రమ నిమగ్నులుకాగా తానూ త్యాగరాజులవారు రచించిన శ్రీరామ దండకము చెప్పుకొను చుండెను.

దండకము.

శ్రీభక్త హృత్తాప గాఢాంధకారా యుతార్క ప్రభాకార
దివ్యంబు నేత్రోత్సవంబౌను చూపించు రామప్రభో
నీ వనేకాండకోట్లన్ విధీంద్రాది దేవాసుర స్థూలసూక్ష్మం
బులన్ నీవు పుట్టించి కాపాడి నష్టంబు సేయన్ సదా మూడు
రూపంబులన్ దాల్చి లోకేశుడై విష్ణువై రుద్రుడై చాలా
లీలా వినోదంబులన్ సేయ మర్త్యుల్ సదాషణ్మతంబైన
కూపంబులోపుట్టి కామాది షడ్వర్గ కృత్యంబులున్ సల్పి
గర్వాచలారూఢులై మూఢులై చాల దారార్భకాగార గోబంధు
లోకంబులన్ చూచుచుప్పొంగుచున్ కుక్షి పూర్ణంబు
సేయంగ లేకెప్పుడున్ దుఃఖ వారాసిలో మగ్నులయ్యేదరు
శ్రీరామ నింజేరు యా రాజమార్గంబులన్ స్వప్నమందైన
సాధింప లేరయ్య నేనమ్మి నానయ్య రావయ్య నాయొక్క భా
గ్యంబు నీవంచు నున్నాను శ్రీ త్యాగరాజార్చితా ఖండలా
ధక్ష దిక్పాల సంసేవ్య మాంపాహి మాంపాహి మాంపాహిమాం॥

ఇంతలో గంట యెనిమిదికొట్టినది రాము పూజావిధానము ముగించుకొని తీర్థము పుచ్చుకొని సరోజకు తీర్థప్రసాదము ఇచ్చి వెలుపలికి వచ్చెను.

సరోజ భోజనమునకు విస్తరవేసి భోంచేస్తారా అన్నది.

సాపాటు లేకను ఏపాటు కుదురదు అన్నారు.

తే॥ అశన మొక పూట నాకలి కబ్బకున్న
కుసుమ శరుడైన సన్యాసి కొడుకుగాడే అన్నాడు రాము.

అశన మొకపూట నాకలి కబ్బెనేని అన్నది తలఎగరవేసి నవ్వుతూ సరోజ.

పుట్టు సన్యాసికైనను పుట్టుతెగులు అన్నాడు రాము.

అదిగో పెద్దవారున్నారనే భావంకూడా లేక చదివితే సరియా అంటూ చిరునగు వంకురింప తలవంచి పాదసూపు రాముపై బరపినది.

ప్రశ్నించినది ఎవరు నేనా నీవా అపాదం అనవలె వినవలె అనందపడవలె నన్నది నీవా నేనా ఏదీ నాయెదపై చేయిపెట్టి చెప్పు లేదా నీఎదపై చేయిపెట్టి చెప్పుతా నిలుమంటూ వంట గదికి పోయెను రాము.

ఊరుకుంటారా లేదా అంటూ ఊరగాయతెచ్చి విస్తరలో పెట్టెను సరోజ.

అగ్ని పూరకుంటుంది గాని గాలి చెలియై చిచ్చును చెలరేపుతుంది చెలరేపి చెలగాటమాడి కడకు చల్లార్చుతుంది గాలిలోనే ఉంది గమ్మత్తు గాలి లేక అగ్ని నడువలేదు ఏమీ చేయలేదు గాలే అగ్నికి ప్రాణవాయువు నీవుగాలి నేను అగ్ని కమ్మని గాలి వీచితివా ఝుంమ్మని నిప్పు చెలరేగుతుంది అన్నాడు రాము.

ఝుం ఝుం మ్మని ఝుం ఝుంమ్మని కంట్లదగ్గర ఈగలు ముసురుతాయి కమ్మనిగాలి పదే పదే వీచితే గమనించి కమ్మగా చిచ్చుకు చిచ్చుతోడు చేయండి అంటూ అన్నము వడ్డించి నెయ్యి దండిగా వేసినది సరోజ.

అగ్నికి ఆజ్యం ప్రీతి అన్నారు. సరే ఆజ్యం చక్కని భోజ్యం మదన సామ్రాజ్యం అన్నారు వైద్యులు. వీలుంటే తెగవుంటే ఇంకొక నాలుగుముద్దలు అట్టుంటే యిట్లు.టా నంటూ భోంచేయ ప్రారంభించినాడు రాము.

నెయ్యివారం దూరముగా ఉంది మధ్యలో దొరుకదు మిల్లి మళ్లి వెనకాడు తుంది గనపెట్టి పదుగెత్తి కూర్చునేదానికన్నా అవమానముగాకుండా నిలిచి కూర్చొన కుండా శక్తికొలది దారినడచుటే శ్రేయము చూచుకోండి అన్నది సరోజ.

అయ్యో నీయానందానికి నాయానందానికి మధ్య ఈమిల్లిగరిట దేవతేనే ఉండేది. ఈదేవతను నొప్పించవద్దు ఆమెయిష్టము వచ్చినట్లు ఆడనీ ఆమె ఆడక పోతే ఆనందమే లయం. ఇంటికి లక్ష్మి రాకపోయినా, ఒంటికి ఈమె పోకపోయినా ఇంటిలో వంటిలో మాదేవత తాండవిస్తుందే తిన్నసకల పదార్థములూ అన్న సారమై అన్నసారమునెత్తురై సప్తధాతువులకూ శక్తిని సమకూరుస్తుంది వాటెకు అధికమయినది క్రొవ్వు పదార్థ మవుతుంది ఆక్రొవ్వుపదార్థము ఎక్కువగా తయా రయ్యేది యౌవనకాలములోనే బాల్యములో దేహము పెంచను సరిపోవును వృద్ధా ప్యములో జర క్రొవ్వును కూడ పెట్టలేదు యౌవనకాలములోనే సకల జీవరాసుల లోనా క్రొవ్వుపదార్థము యెక్కుండేది. క్రొవ్వుపదార్థమనగా నెయ్యే మనము ఈ నెయ్యినే ఎక్కువగా పంపిన వెంటనే వీర్యధాతువునకు చెలియై సహాయమొసంగును చెయ్యివలన వీర్యము యెక్కువ అభివృద్ధి యగునందురు. వీర్యము అభివృద్ధిచేసి నిలవచేసిన ఆయువభివృద్ధి అన్నారు భార్యలేనివారు భర్తలేనివారు చాలాకాలము బ్రతుకుట అందుచేతనే అంటారు వీర్యాభివృద్ధి ఆయుర్వృద్ధికూడా మనము యౌవ నులము ఈ నెయ్యిదేవతకు యెంతమ్రొక్కితే అంతమేలు పాడిఆవుకు ఎంతతిండి

పెట్టితే అన్నిపాలు పితుకుతుంది అట్లే నీవు తినే నేయికూడా ఇక్కడే పడవేస్తే నీయానందానికి నాయానందానికి మధ్యగల శుక్లాభివృద్ధి దేవత శుక్లాంబరధారియై పిలిచీ పిలువకమునుపే హాజరవుతుంది బాగా తెలుసుకో నాయభిప్రాయములో కలుసుకో కొందరు తెలియనివారు అమృతమెత్తుకపోయి అంగడిలో అమ్మి అమృతంతెచ్చుకుంటారు పాపం తెలియక జరుగక అన్నాడు రాము.

అమృతమంటే సరే మృతమేమిటిది అన్నది సరోజ.

మృతమంటే చచ్చినది వట్టిచేపలు మాంసము మొదలగునవి అన్నాడురాము.

తినక తిననీక వంటిలోనా యిచ్చినవాని యిచ్చేడివాని ఇంటిలోన మరచి ఇంటిలో వంటిలో మూదేవత తాండవింప చేసుకొని వైద్యుల బ్రతికిస్తారు వైనమెరుగనివారు అన్నది సరోజ.

అయ్యయ్యో నీవంటి గృహలక్ష్మి ఇంటింటా ఉంటేకదా ఇల్లూ వళ్లూ గుల్లగాకుండా చల్లగా ఉండేది భగవంతుడూ భర్త ఇల్లుమరగవలె ఇల్లు కలకలలాడవలె ఇంట్లో వంట్లో వెలుగు వెలుగవలెనని ఈవీధిలో నీలాంటి యువతుల కొందరిని తయారుచేయి ఆకొందరితో ఊరందరూ తయారవుతారు మంచిపిల్లలు పుట్టుతారు వారితో గ్రామాభివృద్ధి పురోభివృద్ధి అన్నాడు రాము.

పిల్లలకూ దీనికి సంబంధమేమి అన్నది సరోజ.

ఆరోగ్యమయిన ఆహారంతో హరిధ్యానముతో కలిగిన పిల్లలు బుద్ధిమంతులై గ్రామాభివృద్ధిచేస్తారు నాస్తికాలతో నానారోగాలతో పుట్టినపిల్లలు బుద్ధిహీనులై వయోవృద్ధ మాతృ పితృ ఆజ్ఞోల్లంఘనులై గ్రామమునకు చీడపురుగులై నశింపు చేస్తారు ఆరోగ్యము హరిధ్యానము లేనిచోటు మూదేవతకునెలవు అన్నాడు రాము.

తమ ఆజ్ఞానువర్తులై కొందరిని తయారుచేయడములో కొంతధనాన్నికూడా ఆర్జించియిస్తాను చదువుకున్న ఇల్లాలు కావలెనని వెతకితెచ్చుకున్నారుగా చదువుకున్నవారు చక్కగాపోక చతికిలపడితే వెనుక పైకివచ్చుసోదరీలకు అడ్డుపడతారు ఉదాహరణకుతెచ్చి ఉన్నవారి ప్రాణాలుతీస్తారు భద్రమన్నారుగా ప్రతి చదువుకున్న స్త్రీ ఉన్నత మార్గమునే అనుసరించిన వెనుకవారు అందరూ అట్టిస్థితికి రాగలరు ఆదర్శప్రాయులై ముందువెలుగిచ్చువారు వ్యతిరిక్తులైన క్రిందివారికి కొంత కాలమునకు వ్యతిరిక్తము జరిగితీరుతుంది అన్నారుగా నేనట్టిమబ్బు విడిపించుకొని బిబ్బుకుదిరించుకొని దెబ్బతప్పించుకొని నిబ్బరంగా అడుగడుగునా చూచుకొంటూ.

అడుగడుగునా మీమాటల తలచుకొంటూ నడుస్తాను అలపిగానప్పుడు అనసూయ అత్రిని తలచుకున్నట్లు తలుస్తాను అవతల తమరుండనే ఉన్నారు అన్నది సరోజ.

అంతలో రాము మజ్జిగా అన్నము కాడికి వచ్చినాడు సరోజ అన్నముతెచ్చినది రాము ఇంక వద్దన్నాడు.

రోజువేసే అమ్మకంపెరుగు కామలేండి అపాకుపెరుగు రోగాలుతెస్తుంది ఇంటింటివగ్గరా చేతులు పెట్టి పెట్టి నీళ్లూ మజ్జిగా పోసి పోసి రోతపట్టి పులుపెక్కి పాడై ఉంటుంది అందుకని పాలుతీసుకొని పేరబెట్టినాను అన్నం పెట్టించుకుంటే పైమీగడవేస్తానన్నది నవ్వుతూ సరోజ.

లేకుంటేనన్నాడు రాము.

లేకుంటే లేనట్లేనంటూ కొంచెముపెట్టి మీగడతోటి పెరుగు దండిగా వేసినది సరోజ.

ఔను అప్పుడు అమ్మా తనమేలుకే పెట్టింది యిప్పుడు అలూ తనమేలుకొరకే పెట్టేది ఎవరిమేలు వారు చూచుకోవలసినదే వేయి అన్నాడు రాము.

అమగో అందుకున్నారా వీణ జమ్మనకూడదు మృదంగం డమ్మని వాయిస్తారు బాగా అల్లకం గిపిగానివలె అల్లుతారు అన్నది సరోజ చిరునగుతో.

అట్లకాదే ఇల్లూ యజమానివళ్లూ ఇల్లాలే చూచుకోవలె ఉన్నదీ లేనిదీ అతనికేమి తెలుసు లేకుంటే ఇల్లూ, వళ్లూ, గుల్ల అంటారూ అన్నాను అంటూ రాము తిన్నాడు.

ఏమి లేస్తారా లేక కాస్త చేయుత ఇవ్వవలెనా అన్నది నవ్వుతూ సరోజ.

ఏమేనీమగడు ముసలివాడనుకొంటివా అసలు ముసలివాడయినా ఆడవారుండేచోట అట్టే చౌకలించి లేస్తాడుగాని చేయూదిలేస్తాడా చేతగానివాడనంటాడా చింతచచ్చినా పులుసు చావదే అని చౌకలించి లేచినాడు రాము.

ఆ ఆ భద్రం ఇక్కడ క్రొత్తఆడవారెవరూ లేరు పాతవారే నంటూ చేతికి నీళ్లయిచ్చి చేతుడుచుకొన తుండుపంచెయిచ్చి పాకాబిడా నోటికిచ్చి ఇంకేమికావలె అన్నది సరోజ.

నీవనేది నాకుతెసులేవే పెత్తనాలువిడచి పేజీలు తిప్పమని పగలంతా బడి పిల్లలతో ఇంటికివస్తే ఇల్లాలితో ఇంతో అంతో సందుదొరికితే పుస్తకాలతో ప్రశ్నలు

జవాబులు చెప్పి చెప్పి పడుకుంటే స్వప్నంలోకూడా మీముగ్గురే కానవస్తారే భయం భయంకాదు కాస్తతప్పితే బడిలోపిల్లలతో అల్లరి కొంచెంతప్పితే ఇంటిలో ఇల్లాలితో అల్లరి చదివిచదివి చచ్చి పరీక్షవ్రాసివస్తే ప్యాసుఅయి హావు అన్నంతవరకూ మనసు మసిలైపోతూవుంటుంది ఎట్లో అయితే మార్కులుతక్కువని అందరిలో అల్లరి ఈఅల్లరులతో మనసంతా అల్లరి ఇంకఈఅల్లరులంతా చాలించి చల్లగా అన్నాడు పడుకుంటానని అర్ఫోక్తిలో రాము.

చల్లగా నిద్దురపోతానంటూన్నారా అయ్యో పదండి జోలపాడుతూ నిదుర పుచ్చుతాను నిదురరాదేమో సాటివారంతా ఎగసి ఆకాశంలో తిరుగుతున్నారే వారి చెంతకుపోవ రెక్కలువచ్చేదెన్నడు దేవుడూ ఎగిరేదెన్నడు రాయుడూ అనక చల్లగా అంటారా ఔను కడుపారతిన్నారు కంటేరా నిదురపోండి కాసికిపోయిన పుణ్యముంటుంది. కొందరు అంటూవుంటారు ఈమాట అంటూ నవ్వుతూ సరోజ అమ్మను భోజనానికి పిల్చినది.

అప్పుడు అమ్మతో భయం ఇప్పుడు ఆలితో భయం ఏళ్లుఇద్దరూ విడిస్తే అక్కడ బడిపిల్లలతో భయం ఎప్పుడూ భయమేనా నాకుస్వాతంత్ర్యం నాకు స్వాతంత్ర్యం అంటారు పకరిచేతిక్రింద పనిచేయలేనంటారు స్వాతంత్ర్య జీవనమే జీవన మంటారు. ఎప్పుడబ్బా స్వతంత్రం స్వతంత్రం స్వర్గలోకములోనా సన్యాసి కూడా మధ్యాహ్నమయ్యే వేళకు అస్వతంత్రుడై అన్నానికి ఒరుల చేజాచి అమ్మా అనవలసినదే బాల్యములో చదువుతోబాధ ఒకయింటి వాడయ్యేటప్పటికి ఆలుతో అటుపై పిల్లలతోబాధ ఇంతకన్నా చచ్చేదిమేలని చస్తే యమకింకరులతోబాధ ఛా ఛా మీముఖమే చూడకూడదు దయా దాక్షిణ్యము లేనివారు మావారే మేలు కొంచె మయినా దయా దాక్షిణ్యముంటుంది. మీరుచెప్పేదేమిటో చెప్పండి పోతానని తిరిగివస్తే అయ్యో ఇదేమళ్లీ ఎప్పుడు సుఖం యింక కైవల్యం పోవలె సుఖంకావలె నంటే అదిసామాన్యమా అయినా ప్రయత్నంచేస్తున్నాముగా పోదాము పో భోంచే యిపో నాకొరకుగాకున్నా నీకొరకన్నా చదువుతాపో అంతనిజంలేకుంటే చదివేది చూచేపోవే అంటూ రాము గదికిపోయెను.

నవ్వుతూ సరోజ నాకొరకయ్యే చదవండి అంతానాకొరకనే ననండీ అని భోంచేయపోయెను.

అనసూయమ్మ ఫోంచేస్తూ సరోజా రాము చాలారసికుడమ్మ పెద్దవారు ఇంట్లో ఎవరూలేరు తెలిసి నటించకపోతే చాలాదెబ్బ తల్లీ మగవారిజీవితమంతా వనితచేతుల్లోనే ఉంది. ప్రాణమియ్యవలె నన్నా మనమే, ప్రాణం తియ్యవలెనన్నా మనమే ఒకకంట చూపెట్టి నడిపించుకో పరుగెత్తగలవని కర్షకుడు ఎద్దుల పరుగెత్తనివ్వడు గసపెట్టనివ్వడు మితిమీరి బరువెత్తనివ్వడు బలము తగ్గనివ్వడు కంటికి రెప్పలాగా కాపాడుకుంటాడు తద్విధముగా భార్య భర్తను కాపాడుకుంటుంది పదికాలాలు బ్రతికిస్తుంది బ్రతుకుతుంది అన్నది అనసూయమ్మ.

కరుణా సీతమ్మ అత్తామాటలు నాహృదయములో నాటుకొని వెలుగిస్తూ దారినిచూపిస్తూ ధర్మవ్యతిరిక్తముల అటకాయిస్తూ పరిపాలనా విధానము బోధిస్తూ ధర్మమార్గముల నడిపిస్తూ శ్రీరస్తు ఇష్టకామ్యార్థ సిద్ధిరస్తూ అని దీవిస్తూఉన్నవి. భయంలేదమ్మా నీవన్నంతపనీ చేసేవాడే అల్లుడు పండుగలూ, పర్వాలూ, వ్రతాలూ, వక్కపొద్దులు ఆరోగ్యాలు, అనారోగ్యాలు చెప్పి సాలుకుతెస్తూ ఉన్నాను. లేకుంటే ఉద్యోగానికే సెలవుపెట్టి భార్యను చూచుకుంటూ ఇంట్లో ఉండవలెననేరకం కాముకచక్రవర్తి అన్నది సరోజ.

అది నీప్రాప్తము తల్లీ రసికుడు యౌవనుడు రూపవంతుడు గుణవంతుడూ భర్తదొరుకుటకు పూర్వజన్మ సుకృతముకావలె తల్లీ ముందుజన్మలో సుకృతము చేసుకున్నావు దానికితోడు ఈజన్మలో చేసుకొనిన మరుజన్మకుకూడా అనుభవించ గలవు మరువవద్దు ఇప్పుడు నీవన్నదారిలో బలమున్నది. నియమ వ్రతశక్తిలో జ్ఞానశక్తి, దేహశక్తి, వీటితో వీర్యశక్తి, దానితో ఆయుశ్శక్తి, బలమై వీటితో దైవశక్తి యిమిడీ ఉన్నవి అన్నారు. మానవుడు అన్నిటిలో నియమవ్రతుడుగావలె అగునట్లు స్త్రీ చేయవలెనన్నది అనసూయ.

బుద్ధినిచక్కగా నడిపింపక త్రొక్కుడువిడచిన హద్దుమీరి నడుస్తుంది. దీనికిబద్ధమున్నద అరెటూలేచినది సరోజ.

అనసూయమ్మ చేయికడుగుకొని మధ్యహాలులో కూర్చున్నది. సరోజ కార్యక్రమములన్నీ ముగించుకొని తాంబూలం తీసుకొనివచ్చి తల్లికి సమీపములో కూర్చొని ఉదయం పోతానంటావా అమ్మా అన్నది.

ఔనమ్మా పండుగ సమీపించె నన్ను అడుగనిది మీవదినెగార్లు ఏమీచేయరు నాప్రాప్తము మంచిదై కొడుకులు కోడండ్రు మంచివారైనారమ్మా నీభయమే పెద్ద

గావుండెను అదీతీరి పోయింది. ఇకదుఃఖము లేకుండా ముత్తయిదవ తనముతో పోవుచే కొమవ తల్లి దానికి భగవానుడేమంటాడో మనకేమెరుక అన్నది అనసూయ.

ఏమంటారూ సరేనంటారు భర్తనూ భగవంతుని ఒక్కచోటి కన్నబిడ్డల కొన్నబిడ్డల వక్కచోటి కన్నకొమకుల కొన్నకొడుకుల ఒకేచోటపెట్టి ఓకేధర్మముతో చూచేచూపు నీకేనాడు గలిగినదో అనాడే నీకోర్కెలు పండినవి భగవంతుని భర్తను కట్టివేసినావు నీవెట్లచెప్పితే అట్లఆడతారు వస్తాస్వామీ అన్నావా రా అంటాడు భగవంతుడు మీకన్నా ముందు పోతానండీ మీవెనుకవస్తే నన్నధోగతి పాలుచేస్తుందీ ప్రపంచం నెత్తిగొరిగించి విభూతిపూసి యెఱ్ఱబట్ట కట్టించి రుద్రాక్షలు మెడలోవేసి ఒంటిపూటకూడుపెట్టి ఇంటాబైటా వేగిలేచినది మొదలు విధవ మొగమంటూ అవమానపెడ్తూ ఏకార్యక్రమమునకు ఎక్కనివ్వక ఏడ్పిస్తుంది. ప్రపంచం తమ ఆజ్ఞ ఇవ్వండి వెళ్లుతాను మీరు ఎక్కడున్నా ధన్యాత్ములు వెనుకరాండి అంటే భర్త భయపడకుండా ఈప్రపంచములోకి వచ్చేటప్పుడు ముందు పోయేటప్పుడు వెనుక పోవుట పురుషధర్మం వచ్చేటప్పుడు వెనుక పోయేటప్పుడు ముందు స్త్రీధర్మం దీనికి వ్యతిరిక్తమైతే వైనంతప్పుతుంది. ముందునీవేపో మొనగాణ్ణి మొగవాణ్ణి నాకే మనేభర్త ఉన్నారు నీకేమమ్మా అన్నది సరోజ.

ఎంతబాగాచదివినావే తల్లీ కన్నకొడుకూ కొన్నకొడుకు అన్నావే అదితప్పు (అరణం) వరదక్షిణ రూపముగా అత్తగారి ప్రాణవాయువును లాగినవారిని కొన్న కొడుకు కనవలెగాని నాఅల్లుడు వారిలో చేరువాడుకాడు కొడుకులోనే చేరుతాడు కొడుకులకన్న మిన్నౌతాడు అల్లుడు శ్రీమహావిష్ణు స్వరూపమన్నారు. అల్లుడు పూజనీయుడు ఆడబిడ్డ లక్ష్మిఅని శుక్రవారం మంగళవారం ఇంటినుండి ప్రయాణం చేయనివ్వరు ముహూర్తాలూ పెట్టనివ్వరు అత్తవారింటికి పంపరు కంటనీరు పెట్టనివ్వరు లక్ష్మి స్వరూపముగా భావిస్తారు. ఆడబిడ్డ లక్ష్మి అయినందున ఆడబిడ్డకై వచ్చిన అల్లుడు శ్రీమహావిష్ణు స్వరూపమన్నారు. అల్లుండ్రు ఈమాటను మరచి తమశక్తియంత వరకో గమనించలేక భావోద్రేకులై అవమానపరచి అవమానపడే ఆదిభైరవులు ఉంటారు. రాము శ్రీమహావిష్ణు స్వరూపమే నాకన్నవారికి ఆయనకు భేదములేదన్నది అనసూయ,

అబ్బా ఎంతప్రేమ ఉన్నదే అల్లునిపైనా ఇట్టి మాత్రుపేమకు మన్నుగొట్టి కన్నబిడ్డ కండ్లకు దుమ్ముగొట్టి ధర్మమార్గములకు కంపగొట్టి మరొకమార్గమున

ప్రేమనుమార్చుకొను మారికాశక్తులున్నారు. మారితగిలినా ఒకవేళ బ్రతుక వచ్చునుగాని ఈమారితగిలితే ఇటు ఈవంశం అటు అవంశం ఆదిమరాక్షసులున్న అధోలోకమున కావల పోలిమేర చూడవలసినదే అన్నది సరోజ.

ఛా ఆపాడుముండల చల్లటివేళ తలుస్తావెందుకే దానికేపుట్టి దానితోక్రీడించి దానికే పిల్లలగను పశువులవలె పోయే పాడుజీవుల ఇట్లాటి వేళలో తలంచుతా వెందుకు నోటనే పలుకరాదు పాపుల పాపపుమాటల పలుకకూడదని పదముల పరనిందల చేయుటచే ఫలము భ్రష్టీకరించుతుంది ఆజ్ఞైన్నడూ నాల్కతో పాపము చేయవద్దు పల్కవద్దు అన్నది అనసూయమ్మ.

ఇప్పటి లోకమునకు దూరముగానడుచుటతోనే నీకుశుభములు వకటొకటే చేకురుతున్నాయి అమ్మా నీమాదిరీ అందరూ ఉంతపనిలేదా అన్నది సరోజ.

మానవులకుండవలసిన లక్షణములవిడచి దానవులకుండే లక్షణాలునేర్చుకుంటే మన్నుకొట్టడానికి మాధవుడున్నాడు. మీవదినె హరిప్రియ అడుగుదాటి అడగుపెట్టే టప్పటికి అత్తా అంటుంది ప్రతిదినమూ వేగిలేచినతోనే శిరస్సంతా పాదములపై మోపి నాకునమస్కారము చేయనిరోజులేదు నన్నుచూడనిది క్షణముండలేదు ఈప్రేమ అమెకెందుకు గలిగినదంటే వాళ్లతల్లి వకనాడువచ్చి ఇల్లు ఆయకము పెట్టుకొని నాలుగువేలుడబ్బుఇవ్వండి వదినా ఆరువేలు వరదక్షణతో ఒకపిల్లవానిని మాట్లాడుకున్నాము ఇక్కడికీ నెలకు డెబ్బై రూపాయలు సంపాదించే మహాపురుషుడు దొరికినాడు ఎక్కడా ఉనితిరుగలేదు నీవెట్లయినా మాఅన్నయ్యగారికిచెప్పి పుణ్యము కట్టుకున్నావంటే నీమేలుమరువను కన్యాదానము చేసినదానవవుతావు అని కంట నీరుపెట్టినది. అదిచూచి నాకూ కంటనీరువచ్చి మనస్సంతామారి అట్లయితే ఇల్లు చూచివస్తాముపా అంటూ వాళ్ల ఇంటికిపోయినాను. మీ సావిత్రి అత్త హరిప్రియను పిల్చి అత్త వచ్చిందమ్మా అంటూ చాపవేసి కూర్చోవదినా అన్నది. కూర్చున్నాను హరిప్రియవచ్చి నమస్కారము చేసినది. అదివరకెన్నడూ నేను అపిల్లను అంతగా చూడలేదు చాలా అందంగా నాకంటకగపడింది కూర్చొమ్మని చదువూ పనీ పాటా అడిగినాను చిలుకలాగా అదేచెప్పింది చక్కగాచూచినాను మనసుమారి పోయింది. రూపాయలుచూస్తే ఈలాంటి రూపము దొరుకుతుందా వంశము దొరుకుతుందా ఛా రూపాయలచూచి రూపాన్ని నాశనముచేస్తావా అని హరిప్రియ ముఖముచూస్తూ ఏమే నాకు కోడలవగుతావా అన్నాను అమాట అన్నానో లేదో నాపాదలపైనపడి

అత్తా ఆమాటనిలుపు ఆజన్మాంతము నీఆజ్ఞను వర్తినై బ్రతుక్కుంటాను నీడొక్కలో చోటిచ్చి పుణ్యము కట్టుకో కన్నతల్లి వనుకుంటాను కలకాలము తలుచుకుంటూ వుంటాను మీభుక్తశేషమే అమృతప్రాయమని గీచిన గీటులోనిల్చి గికురుమనకుండా కాలము గడుపుతాను ఇస్తానను నీకోడలినయ్యే అధికారమిస్తానను అత్తా అంటూ కంటినీళ్లు కాళ్లపైవదలింది సావిత్రి ఒకప్రక్క నిలచి కంటనీళ్లు తుడుచుకుంటూ అంత అధికారం కోరవద్దమ్మా అత్త సహాయమిస్తేచాలు సహాయంకోరు హిరణ్యాకసిపువరాలు వద్దుతల్లీ అంటూ ఉన్నది.

నామనస్సుకరిగి శరణుజొచ్చిన ఒకకన్యకను కాపాడలేని బ్రతుకు బ్రతుకు కాదని కొడుకుల గన్నతల్లిని గాబట్టి కన్య కోరుతున్నదని కొడుకునుగని ఇట్టి కన్యకకు దానముచేసినదే దానమనీ మరుజన్మకు పుణ్యమనీ తలంచి భర్తకు కొడుకుకు నచ్చచెప్పి చేయగలననీ ధైర్యముతో కాళ్లువిడుతల్లీ నీవే నాకోడలవు నమ్మకము లేకుంటే చేయిపట్టు అన్నాను లేచి చేయిపట్టింది. చేతిలో చేయివేసి నాను దానితో సావిత్రివచ్చి నారెండు చేతులు పట్టుకొని వదినా బంధురూపమున గాక సేవకారూపమున ఆజన్మాంతము నీయాజ్ఞను వర్తులమై నీతమ్ముడూ నేనూ ఉంటాము నీమేలు మరువమ్మా అంటూ కండ్లనీళ్లు విడిచింది అప్పుడునేను మనసును సవరించుకొని.

సావిత్రీ ప్రకృతం వరదక్షిణకొరకు యెంత మట్టుకు డబ్బు అంచున పెట్టుకున్నావు అన్నాను.

వదినా ప్రకృతం రెండువేలు మాత్రము ఉన్నవి భూమిఅమ్మి నిన్ననే తెచ్చినాడు అన్నది సావిత్రి.

ఆడబ్బు ఇట్లయిచ్చి రేపు మధ్యాహ్నము వానునురమ్మను ముహూర్తము నిశ్చయముచేసుకొని వస్తాడు ఈడబ్బుకూడా అక్కరలేదుగాని మీఅన్ననూ నీతల్లుని వప్పించే నిమిత్తం వానికి చేతిలోవేస్తే గుడ్డలూ గుడుసులూ ఏవయినా తెచ్చుకోనీ అని అడుగుతున్నాను ఇంకమీరు వరదక్షిణా ఆలోచన సేయవద్దు చాలు వివాహం చేతనయితే కానివ్వండి లేకుంటే మేము చూచుకుంటామన్నాను సావిత్రి డబ్బు తెచియిస్తూ.

వదినా నాబిడ్డ హరిప్రియ అయితే నీకింత కనికరంకలుగదు నీబిడ్డగానే

చూచినావన్నది. ఈమధ్యలో హరిప్రియ కాఫీచేసి తెచ్చి అత్తా కాఫీ అంటూ ఇచ్చినది.

తే అమ్మా నీచేత త్రాగవలసినదే ఈనాడే ప్రారంభం అంటూ తాగిణిని పసపూ కుంకుమ తాంబూలం పండ్లు ఇచ్చిరి తీసుకొని వస్తానన్నాను సావిత్రి వెంటవచ్చి ఇంట విడచి పోయింది.

అయిదుగంటలకు మీనాన్న వచ్చినాడు కాఫీ తీసుకపోయి యిచ్చి ప్రక్కన కూర్చున్నాను దిండు కానుకొని కాఫీ త్రాగుతున్న మీనాన్ననుచూచి నేను మిమ్ముల ఏమీ వయసులోకూడా కోరలేదు ముదిమిలో కోరుతున్నాను కాదంటారా ఔనంటారా అన్నాను.

ఏమి కోరికో అది అయినా చెప్పు అన్నాడు.

నీమాట కాదనను అని గట్టిగా చెప్పితే చెప్పుతానన్నాను.

కైక దశరథుని కోరినట్లు కోరి కొంపకూలుస్తావా యేమే అన్నాడు నవ్వుతూ.

కైక కథకు కారణ భూతురాలై చేసింది కాలకర్మములోవుంది కావలసినంతా కట్టుకథ అటుండనీ, ధర్మవ్యతిరిక్తముగానిదీ, పూర్వజన్మమునకు మనకు ఫలము గలుగునది. పదుగురు సెబాస్ అనునది సకలవిధములా వన్నెగడించునది అన్నాను.

సరేకానీ నీకులేని కష్టం నాకేనా అదెట్లాటిదయినా వింటానుకానీ అన్నాడు చేయిసాచినాను చేయిపెట్టినాడు వడిలోఉన్న రెండువేల రూపాయలనూ చేతిలో పెట్టి ఈరెండు వేలు పదివేలనుకోండి అన్నాను.

మీయప్ప వకీలుగాబట్టి ఎవరో నాచేతికి డబ్బుయిచ్చి కేసును కొంచెము డబ్బుతో తన్ను మోసము చేయనున్నారని ఏమి కూనీకేసా అన్నాడు.

మీకు యెప్పుడూ కూనీకేసులు తప్పితే కులటల కేసులూ కాదండీ ఒకపిల్ల చాలాబాగున్నది. నామనసుకు బాగానచ్చింది చాలామచింది. వారుబీదవారు వారి దగ్గరఇంతేడబ్బు ఉండేది. బీదకన్యకకే కొడుునుకు దానంచేసి పుణ్యము కట్టుకోవలెనని నాకుఇష్టం కూతుర్ని మీఇష్టము వచ్చినట్లు దానంచేసుకోండి కొడుకుల ఇష్టంనాది. కూతురిఇష్టంమీది. కన్యాదాన ఫలంమీది వరదాన ఫలంనాది మంచి అమ్మాయిగాచూచి బీదకన్యకకు దానంచేస్తే, ముందుజన్మకు ఫలంఉంటుంది.

ఇప్పుడు కొడుకులున్నారని ఎగనీల్గి దూరపుమాపులేక ఫలాన్ని దుర్వ్యయము చేసుకుంటే మరుజన్మకు మన్నేనని చెప్పుతున్నానన్నాను.

అరరే కొత్తది లేవదీసినావే కొడుకులవల్లవచ్చు ఫలంనీదీ కూతుళ్లవల్లవచ్చు ఫలంనాదీనా అంయకేనా శివప్రసాదుకు వరదక్షిణ మాటేతలంచ వద్దన్నది. అయినావారు పదివేలు యిచ్చినారు మంచిమాటే మంచికోరికే నీకుఇష్టమయింది నాకూఇష్టమే అంతస్తులకుపోతే పుణ్యము సున్నా పుణ్యానికిపోతే అంతస్తు సున్నా అంతస్తుతోపనిలేదు పుణ్యమే ప్రాముఖ్యము ఇదిహరి ఒప్పుకున్నాడా అన్నాడు మీనాన్న.

మీరు వప్పుకుంటే వాణ్ణి వప్పించుకుంటా నన్నాను.

భాగాలు పెట్టినావుగా నీభాగం నీవేమయినా చేసుకోవో అన్నాడు వెంటనే ఆనందముతో కాళ్లంటి నమస్కారము చేసుకొని కొంచెముసేపు అరూపాయలు ఇట్లిమ్మని తీసుకొనిపోయి మీఅన్నగారిని ఇద్దరినీ పిలిచినాను.

ఇద్దరూవచ్చి కూర్చొని ఏమి ఏమి అన్నారు.

ఏమీలేదు నేనొక ఘనకార్యాన్ని సాధించాల పుణ్యాన్ని ఆర్జించాల పదిమందిలో గౌరవ ప్రతిష్ఠల పొందాల అనుకున్నాను. మిమ్ముల కనిపెంచి పెద్దవారినిచేసినాను మాత్రుపిత్రు వాక్యపరిపాలనకై రాముడు సుఖమును కాలదన్ని అరణ్యానికి పోయినాడు అన్నకొరకై లక్ష్మణుడు అన్నిసుఖములా దూరముత్రోసి అరణ్యమే శరణ్యమని నిదురా ఆహారములు వదలి సేవకుడై, వాద్యోడై, సైద్యోడై, వెంటపోయినాడు పెనిమిటికొరకై సీత సర్వసౌఖ్య పరిత్యాగినియై వెంటపోయినది. అన్నలు అట్లయిరని భరత శత్రుఘ్నులు సర్వసౌఖ్యములు ఉండీ పరిత్యజించి మునివేషధారులై నంది గ్రామమున నివసించినారు ధర్మబద్ధులయినందున శిలా విగ్రహరూపముల ఇప్పటికీ ఉన్నారు చచ్చి బ్రతికినవారిలో చేరినారు కథవిన్నారు గరుత్మంతుడు మాత్రుదేవిదాస్యవిముక్తి చేయ ప్రాణాపాయమనిభావింపక దేవతలతో పోరాడి అమృతముతెచ్చి మాత్రుదాస్య విముక్తిచేసి మాతృరుణము తీర్చుకున్నాడు ఇట్టివార లనేకులు కావ్యములలో కవులతో ప్రజలతో పొగడ్తకెక్కి ఆచంద్ర స్థాయిగా నిల్చినారు నేనంతటి కోరికనుకోరను మిమ్ముల అధోగతిపాలు చేయను నాకు పుణ్యమువచ్చునది మీకు మాతృరుణము తీరునది మీకు ధర్మమయినదీ మాకు మరుజన్మకు మంచి మార్గమిచ్చునది పదిమందిలో అందరికీ ఘనతగల్గునదీ ఉన్నది మాటతప్పమని చేతిలోచేయి వేయండీ అన్నాను.

## మాతృజ్యోతి.

ఒకరి మొకము ఒకరుచూచుకొని పెద్దవాడు ఒరేతమ్ముడూ కైకేసి రావణాసురుని ఈశ్వరుని ఆత్మలింగము తెమ్మన్నట్లు అమ్మకోరితే మీవదినను విడచి నేను తపస్సుకు పోలేనురా అప్పా గతేమిరా అన్నాడు

అన్నయ్యా అమ్మ అమృతమే తెమ్మంటే రెక్కల్లేవురా నాకలోకానికి పోవడమునకు ఏమికోరుతుందో ఏమో ఏల్లైవానికెరుక మనపని అయినట్లేనన్నాడు హరిప్రసాద్.

అంతలో శివప్రియవచ్చి ఏమిటిదన్నా ఇద్దరికొడుకులా కూర్చుంటపెట్టుకున్నావే ఎన్నడూలేదే ఏమిఆలోచన చెప్పరానిదా అన్నది.

ఇప్పుడు ఉంది నీమొగనిది మరదిది మాతృభక్తి చేతిలో చేయివేయండా? అంటే అమ్మమాటను ఆలోచిస్తా ఉన్నారు ఊ కాదనండీ లేకుంటే పోతుందనండీ అన్నాను. ఒరేతమ్ముడూ అమృతంపోసి పెంచినచేత్తో అమ్మ హాలాలం పోస్తుందా కానీ వేస్తామురాచేయి అన్నాడు శివప్రసాద్.

అన్నయ్యా అంతో ఇంతో సుఖమనుభవించినావు నీవు ఏమీయెరుగని బ్రహ్మచారినినేను చూసంతా సుఖంపైనే ఉంది. కష్టాల్లో కాలువేయమంటే కష్టాల నుంచీ వెనుదిరిగి వస్తానో లేనో భయమేస్తుంది. నాన్నను తలగొట్టమనింది వకమ్మ అమ్మతలగొట్టమన్నాడు వకనాయన అమ్మా నాన్నను నమ్మి ఎట్లన్నయ్యా చేయి వేసేది అన్నాడు హరిప్రసాద్.

అంతలో శివప్రియ అందుకున్నది అమ్మ దారినపోతూ ఉంటే దొరుకలేము దారినదాపురించిన అమ్మకాదు.

కనీ, పెంచి, విద్యాబుద్ధులు చెప్పించి తినీ. తినక, మిగిలించి ఇల్లూవాకిలి కట్టించి పెండ్లి పేరంటంచేసి పెండ్లాని ప్రక్కకు పంపిండేది దారిన పోయెవారు కాదు మీకు మీరేకాదు అమ్మా నాన్న అన్నకు తెచ్చియిచ్చినారు తమ్మునికి తేబోతారు అమ్మ నోరుతెరచి అడిగితే అన్నా తమ్ముడు అనుమానిస్తారా రక్తంపంచి యిచ్చినది తల్లి నోటికాడ పెట్టుకొన్నతిండిని లాక్కొని తింటూఉంటే ఆనందించిన తల్లి సత్యాలూ సత్యాలు మీకొరకై ఉండినతల్లి నిద్రగాచి మిమ్ముగాచినతల్లి జిహ్వోపస్థా చాపల్యముల మీకొరకై దూరముంచి కంటికి రెప్పలాగ కాచి కాపాడినతల్లి మీఆరోగ్యములకై అభివృద్ధికై తినకదాచి చేజాచినతల్లి, మీఅభివృద్ధి తనయభివృద్ధి

యని భగవంతునికి భర్తకుచెప్పుకొని రక్షణ భారమంతా మోసినతల్లి తండ్రికొట్టినా తిట్టినా వెనుక వేసుకొని మంచి మాటలతో బుజ్జగించి ఫలాహార లంచములిచ్చి పాపల పెద్దచేసినతల్లి కోరినవన్నీఇచ్చి, కోరినదంతాతెచ్చి, కోరినదాన్నిచేసి కొడుకు లగను మన్నతల్లి కోరికతీర్చక ఒకరి మొకము ఒకరు చూచుకుంటారా అత్తా నాచేతనవు తుందేమోచెప్పు తప్పక ప్రాణాలవడ్డీ అయినా చేస్తానన్నది శివప్రియ ఆమాటలు వింటూఉంటే మైమరపు తగిలి భావోద్రేకమై ఒక్కొకబొట్టు కంటనీరు ఎదపై పడుతూఉండి ఆమ్మా ఏమిధర్మమే నూరేండ్లు బ్రతుకవేతల్లీ అంటూ రెండు హస్తములూ జోడించినాను.

తటాలున అత్తా అంటూ నారెండు పాదములపైనా పడింది నీకుకాదే చేతులు జోడించినది. నీవుమాట్లాడిన ధర్మవాక్యములకు లే తల్లీ లే అంటూలేపి అంచుకు తీసుకొని తలనిమురుతూ ఇన్ని ధర్మసూత్రములు నీలో ఉన్నవని నీకింత తెలుసు ననీ నాకుతెలియలేదు శివా ఇంక నాయిల్లు బంగారు మయమవుతుందన్నాను.

కన్న కూతురువలె డొక్కలోకి తీసుకొని ధర్మాలు చెప్పుతూ నిమురుతా వేమే అత్తా కోడండ్రంటే అగ్ని అజ్యం అన్నారే ఇదిఏంతగాఉందే అన్నాడు పెద్దవాడు.

పుట్టినింటిలో మెట్టినింటిలో దీపముంచేది కోడలు రావంశ మర్యాదలుంచేది వంశాన్ని పెంచేది కోడలు ఇంటికి యజమానురాలు అయి నాతదనంతరం మాకిన్ని నీళ్లు విడువమనేది ప్రీతిగాచేసి పెట్టేదికోడలు మనపేరు ప్రతిష్టనిల్పేది పెద్దతనాన్ని నిల్పేదికోడలు డొక్కనుండీ కూతుర్ని వెలిబుచ్చి డొక్కకు వెలితిలేకుండా కోడల్ని ఉంచుకున్నాను కోడల్ని డొక్కలో ఉంచుకొనక కూతుర్నిపెట్టుకుంటే ఫలమేమిరా వాళ్లత్త ఇష్టం ఆమె అదృష్టం నాకు తెలియదనుకున్నావా మీనాన్న మీరూ కోర్టు లా చదివినారు నేను గృహ లా చదువుకున్నాను హిందూమత సంప్రదాయము హృద యములో పదిలమై యున్నది. అత్తా, కోడలు, అగ్ని అజ్యం అయితే కొంపలో మూదేవత తాండవిస్తుంది రా అమ్మ చచ్చిందని కూతురు ఏడ్చిందిగాదు అత్త చచ్చెనని కోడలు ఏడ్వవలె అమ్మకన్నా అన్నివిధాలా ఆదరణయిచ్చి ఆదరించి అపురూపంగా చూస్తూవుంటివే ఇంక నాకెవరుదిక్కు అని కొడుక్కన్నా ముందు కోడలు ఏడ్వవలె అది అత్త, నాకోడలు సావిత్రి, నాకోడలు సుమతి, నాకోడలు అరుందతి అని అన్యగృహములలో అత్త అనవలె అదికోడలు నేనూ ఈ ఇంటి

కోడలినే అదృష్టముండి అత్తనయినాను అత్త పెత్తనమిదియని కోడండ్రకు నేర్పితే రాబోవు కోడండ్రను వాళ్లూ చక్కగా చూచుకుంటారు కోడలనగా ఎవరు మన యింటిలక్ష్మి అమ్మగారింటికి మూదేవత ఒకటోకచే తెచ్చి ఇల్లునింపి తననెత్తురునే మన ఇంటికి అర్పించే దయామయి.

కం॥ కులకాంత తోడ నెప్పుడు
కలహింపకు వట్టితప్పు ఘటియింపకుమీ
కలకంఠి కంటి కన్నీ
రొలికిన శిరిఇంటనుండ నొల్లదు సుమతీ॥

అన్నారు అని అన్నాను.

వరే తమ్ముడూ !కోడలే అత్తకు ప్రాణాలు యిచ్చేకాలమొచ్చిందే కొడుకు లెక్కడ వుండాలెరా కొత్తకాలంగా ఉందిరా ఈ అష్టగ్రహకూటంలో అత్తకు ప్రాణాలు యిచ్చే కోడండ్ర కాలంవచ్చిందిరా మనమింకెక్కడుండాలో ఏమిచేయాలో ఏమనాలో తెలియలేదురా అన్నాడు శివప్రసాద్.

అగ్రజా నమో్మన్నమః వెరగందెడవేల నీ తమ్ముని పల్కులిటువినుము.

చ॥ జలనిధులింకుగాక కులశైలములేడును గ్రుంకుగాక యా
జ్వలనుడు వేడిమిన్‌విడచి చల్లదనంబును దాల్చుగాక యా
జలజహితుండు పశ్చిమదిశన్‌ జనియించెడుగాక మా
ర్పలుక కమెందుమజ్జనని పల్కులె యట్టిపిదైన అగ్రజా॥

అగ్రజా మరియూ ఇటువిను రఘురాముని బాణము లక్ష్యము తప్పినతప్పుగాక భృగురాముని పరశువువాడి మడిగిన మడుగుగాక బలరాముని ముసలము మోమకు శత్రువుల తలలు ప్రీలక నిల్చిననిల్చుగాక నేనాడినమాటను తప్పను అమ్మకు యిచ్చినమాట ఇచ్చినదే నని చేతిలో చేయివేసినాడు చిన్నవాడు నీవురా అన్నాను పెద్దవాణ్ణి.

కోడలూనిన్నే అనుసరించింది చిన్నకొడుకు అనుసరించె ఇంకనేనా ప్రక్కకు పోయేది సరే నన్నాడు వాడూ.

అప్పుడు వడిలో ఉన్నరూపాయలు పట్టమని చేతిలోపెట్టి నీకు వరదక్షిణా ఇదే గుడ్డలకూ ఇవే ఇకతప్పకూడదు ఆ అమ్మాయికి మాట యిచ్చినాను అన్నాను.

ఓ ఇదా వైకుంఠానికో కైలాసానికో పంపమంటావో సీమోనని తపస్సు నేనెక్కడచేతురా బ్రహ్మదేవా అని భయపడినానే అమ్మా అపిల్ల అడదేకద లేక గాడిదపిల్లా గాడిదపిల్ల అయినా చేసుకొమ్మంటే అమ్మమాట మీరుతానా మీరే జట్టులోచేరుతానా ఇక్కడికి నీరుణంతీరినట్లేనా అమ్మా అన్నాడు హరిప్రసాద్.

నారుణం నాతోకూడా పోదురా అటుపైకూడా సంవత్సరాని కొకతూరి వస్తూనే ఉంటాను అన్నాను.

ఎక్కడున్న దాకన్య అన్నాడు శివప్రసాద్.

మనఇంటికివచ్చే సావిత్రి కూతురురా వజ్రంలాగా ఉన్నదిరా అది దైవికంగా కుదిరింది. ఇది దైవచిద్విలాసం పరమట వీధిలో ఉన్నారువారు అన్నాను.

అందరూ ఇప్పుడేపోయి చూచి వత్తామన్నారు సరేనని ముందు వాండ్లకు చెప్పిపంపి పూలూ, పండ్లూ పసపూ, కుంకుమా తీసుకొని మీ అప్పుతోసహా అందరముపోయి చూచినాము.

ఆ అమ్మాయినిచూచి అందరూ పూర్తి ఇష్టపడినారు. పదిరోజుల్లో ముహూర్తము పెట్టుకొని నీకు జాబువ్రాసినాము. చాలాసంతోషంగా పెండ్లి అయిపోయింది. అప్పటినుంచీ హరిప్రియ మాటచెప్పినట్లే నటిస్తూ ఉంటుంది. నన్నుచూడక క్షణ ముండదు. చూడూ అందరిలో కలసి మెలసి యెంతకులాసాగా ఉంటుందో నేను పోయినంతవరకూ ఎదురు చూపెట్టుకొని ఉంటారు. తల్లీ మనసే కారణముకానీ మనిషికాదు, రేపు పోతానమ్మా ఆయనతో చెప్పు అన్నది అనసూయమ్మ.

పుణ్యంచేసినావు భర్తా, కొడుకులూ, కోడండ్రు అల్లుడూ అంతా మంచివారు దొరికినారుపో అంటూ పడకవేసి పడుకొమ్మని రాము గదికిపోయి ఎంతవరకు వచ్చినారు ప్రభూ అన్నది సరోజ.

ప్రభ్వీ వాకిటివరకూ ఎదురు వచ్చినాను. బడిపంతులు లేకపోయినా బడిపిల్ల వాణ్ణి గాకపోయినా భార్యకోరికతో చదివేభర్తకు ఉల్లాసమిచ్చే భార్యఉందిగా పైన పరీక్షించను ప్రక్కనే వున్నదిగా అన్నాడు రాము.

పరీక్ష అయినారు అనేవార్త చెవులవిన్నప్పుడుగా భర్త భార్య మాటలు విని చదివినట్లు పరీక్షతో పరమానందం బ్రహ్మానందం అన్నది సరోజ.

ఆ పరమానందముతో సగమన్నా నాకు యిస్తావా అన్నాడు రాము.

సగమేమి సర్వమూ అర్పించి సంతృప్తిపరుస్తాను ఘావలయమంతా మీదే మీది చేతులు తియ్యండి అత్తగారు ఊరికిపోతారవ అలారము అయిదుగంటలకు పెట్టండి కాఫీవేసియిస్తాను అత్తా అల్లుడూ తాగిపోయి బస్సుయెక్కించి వత్తురని మనవి అన్నది సరోజ.

చిత్తం ప్రభ్వీ అజ్ఞానువర్తినై అత్తగారిని విడచివస్తాను అవతలా అల్లుని కన్నకొడుకుల్లో చేర్చుకునేటంతవరకూనా అన్నాడు రాము.

సరోజ ఆశ్చర్యపడుతూ అమ్మా అంతావిన్నాడే అమ్మా కూతురు మాట్లాడే ధర్మలూ కర్మాలూ వింటూ చదువుసాగనంపి కొడుకుల్లో అల్లుని చేర్చుకున్నావన్నది విన్నాడే అన్నది.

ఔను అల్లునికన్న కొడుకులా శ్రేయస్సుకోరవలసినది అత్త కోడల్ని కన్నబిడ్డలా చూడవలసినది అత్త అప్పుడే ఆనందం అన్యోన్యం తప్పేమున్నదీ అన్నది అనసూయమ్మ.

విలాసముగా రామునుచూస్తూ సరే మీరుచక్కగా చదువరు "బడిపంతులులేని చదువు భారముసుమతీ" అన్నారు పోనీ పదిన్నర అయినది పడుకోండీ అన్నది సరోజ.

ఇట్లేమాట్లాడుతూ నిద్రపోయినారు అయిదుగంటలకు అలారము కొట్టినది సరోజలేచి రామునులేపినది దినకృత్యములు తీర్చుకొని కాఫీవేసి అమ్మనులేపినది అనసూయమ్మ కాలకృత్యములు తీర్చుకొని కాఫీతాగి వంటగదికి వచ్చెను రాము బండిపిల్చుకొనివచ్చి రడీనా అన్నాడు.

కాఫీతాగండీ అంటూయిచ్చినది సరోజ.

కాఫీతాగి బండివచ్చినిల్చినది అత్తా అన్నాడు రాము.

అనసూయమ్మ వస్తానమ్మా సరోజ అన్నది.

సరోజ పసపూ కుంకుమా తాంబూలం ఇచ్చి మోకరించి నమస్కరింపబోయినది.

ఆ ఆ ఒకరేనమస్కరింపరాదే అంటూ తానూ పోయి నమస్కరించి అత్తా ముంచు ఆడపిల్లో మొగపిల్లో నీవేచెప్పిపో అన్నాడు రాము.

ఆడపిల్ల వెందుకునాయనా పితృకుటుంబపోషణకు అదనుగా మగవాడెదిగిన వెనుకగల్గు పిల్లలకూ తలిదండ్రులకూ సహాయమిచ్చును ఆడపిల్లలయన తలిదండ్రులు వయసుగాక మునుపే అల్లుడురావలసివస్తుంది పితృకుటుంబమునకు దెబ్బఇచ్చునదే గాని సహాయమిచ్చునదిగాదు అలు మొగలిరువురకూ మగవాడుకావలెననే ఆశేవుంతవలయును కన్యాదానఫలం కడన అయిన ఎంతో ఆనందముగావుండును అన్నది అనసూయమ్మ.

అయ్యో అత్తా పెండ్లిఅయ్యేది ఆలశ్యం ఇంటికి గంప్లపెట్టేది ఆలశ్యం అంటూ వింతూ కంటూ ఉన్నామే కొడుకు పెద్దవాడై కూడా ఫలములేనివారు ఎందరో వున్నాలుగా అన్నాడు రాము.

అది తలిదండ్రుల లోపమేగాని వానిలోపముగాదు బాల్యమాదిగా చక్కని పరిస్థితిలోవుంచి సత్కర్మాచరణ సాలుచూపివుండిన నూటికి తొంభైమంది సాలుకు నిల్తురు సాలూమూలా తలిదండ్రులకే లేనిలోపము ఇది ఈలోపముతో నూటికి తొంభైమంది చెడుగుణములపాలై పోతూవున్నారు సర్వవిధములగు నేర్పులూ తండ్రికన్నా తల్లిలోవున్నవి పురుషులకు పురుషుబుచేటు అన్నట్లు తండ్రిచెప్పినా విననిమాటలు తల్లిచెప్పితేవింటారు మాతనూ మాతృభాషనూ మాతృభూమిని మరచువారు ఎవరూవుండరు ఇవి శల్యగతమైవుండునన్నది అనసూయమ్మ.

ఇంతలో అయ్యా అన్నాడు బండివాడు ఆమాటవిని అత్తా అన్నాడు రాము ఆ హెచ్చరికతో.

చిత్తి చేతికితీసుకొని వస్తానమ్మా భద్రము నేనుచెప్పినమాటలు జ్ఞాపకముండనీ అన్నది అనసూయమ్మ.

నవ్వుతూ సరోజ రామువంక వాల్గన్నుల తళుకుబరపి ఆవియన్నీ అల్లునితో చెప్పిపో విన్నారా ఇంటిలో వృద్ధులెవరూలేరు చెప్పేవారు దేహాలుచూచుకొని సంసారంచేసుకోండి అంటూ ఉన్నది అత్తగారు అన్నది సరోజ.

అత్తా కూతురువయసులోవున్నా బుద్ధివృద్ధత్వం వహించివుంది హద్దుమీరి నడిస్తే దండిస్తుంది అంతకూమీరితే నాల్గువడ్డిస్తుంది దానికిమీరితే ఆకుతిరగేస్తుంది దానికిమీరితే తలకుపట్టేస్తుంది బాధనఘనయిస్తుంది లవుకికాలగుట్ట సుగుణములపుట్టి యుక్తియుక్తములుంచినబుట్ట ఏమీభయము లేదంటూ పర్సుజోబీలోపెట్టుకొని పోయి బండిలో ముందు కూర్చున్నాడు.

భద్రమమ్మా అంటూ అనసూయమ్మ బండియెక్కినది బండికదలెను సరోజ బరువయినహృదయముతో మాతృప్రేమను వదలలేక తల్లియెడబాటును సహించలేక కంటనీరు దానంతట అదివచ్చుచుండ వాకిలివేసి లోపలపోయెను.

బండి బస్‌స్టాండుచేరెను రాము బండిదిగి పూలుపండ్లూ తెచ్చి బస్సులోపెట్టి కూర్చొఅత్తా అన్నాడు. అనసూయమ్మ కూర్చున్నది బస్సుకదలెను.

వస్తానప్పా అన్నది అనసూయమ్మ.

మంచిదత్తా అన్నాడు రాము బస్సువెళ్లెను.

రాము రెండునిమిషములలో ఇంటికిపోయి వాకిలితట్టినాడు.

ఎవరువారు అన్నది సరోజ.

నేను రామమిత్రుణ్ణి అన్నాడు రాము.

రాము అట్లయితే వాకిలితియ్య రాము రాముకే ఇక్కడ పూర్తిచోటులేకుండా వుంటే మీకెక్కడచోటు దొరుకుతుంది బండ్లమెట్లుకుపోండి అంగళ్లుంటాయి అంటూ వాకిలితియ్యవచ్చి తమపేరూ అన్నది సరోజ.

పరశురాం అన్నాడు రాము.

అయ్యో పరశురాం అంటే భయపడడానికి రాజునా రాచకన్యనా తమకు చోటున్నా తమగంద్రగొడ్డలికి ఇక్కడచోటులేదు నిజముచెప్పండీ అంటూ వాకిలి తీసినది సరోజ.

పూలూ పండ్లూ తీసుకొని ప్రత్యక్షమయినాడు రాము.

అయ్యో నీఆత్మారాముడు పూలూ పండ్లూ తీసుకొనివచ్చినారూ అనకూడదూ అప్పుడే వాకిలితీసివుందునే పరశురాముడనని భయపెట్టుటెందుకూ అనినవ్వినది సరోజ.

నీ ఆత్మా రాముడనేనా అన్నాడు రాము.

ఆత్మలోపకచోటగాదు విహరించుట అద్యంతమూ అపాదమస్తకము అంతటా రామమయం ఆనాడె పెండ్లినాడే రామునికి దేహాన్ని ప్రాణాన్ని అంకితము చేసుకున్నాను వారు విహరించనిచోటు కరస్పర్శనములేనిచోటులేదు ఇకవారి దయ నాయదృష్టము అన్నది సరోజ.

అయ్యో ఏమిచ్చి ఏమీప్రయోజనములేదు దేహాన్ని ప్రాణాన్ని అన్నచోట ఇంకొకటి అనుటకుముందే రాము నోరుమూసి సరోజ.

అన్నీమీసొత్తేనని నవ్వి రాముచెంపలపై చేతులుపెట్టి జారబెరికి తలకువేసి నెటికలు విరచి నవ్వినది సరోజ.

అబ్బా అన్నాడు రాము.

ఏమి చేయి కంటికి తగిలినదా అన్నది సరోజ.

పంచప్రాణములా పంచబాణములతో పంచబాణుడు పరికించికొట్టి ప్రాణముల తీయుచున్నాడు ఇకనీవేశరణ్యము శరణార్థినంటూ చేయిసాచపోయినాడు రాము.

అయ్యో పంచబాణుడంటే నాకుమహాభయం గుండెలవిసిపోతాయి అంటూ పరుగెత్తిపోయి స్నానాలగదిలో దూరి తలుపువేసుకున్నది సరోజ.

శత్రువువెన్నంటి కొట్టుతుండ తాళలేక శరణుజొచ్చిన శరణార్థికి అభయమివ్వక ఆర్యధర్మరహితవై పోమ్మనెదవా చేవిడచెదవా ధర్మమా అన్నాడు రాము.

అవినీతిపరుడై వేళా విశేషములు తెలియక బాణనైపుణ్యమున్నదని బారినబడిన వారినందరినీ కొట్టుట భావ్యముకాదని చెప్పు ఇది భారతభూమి భారతనారులు ధర్మబద్ధులు సత్కర్మాచరణులు వీరికడ కొంతనీతిగా ప్రవర్తించమను శీఘ్రముగాపొమ్మను అన్నది సరోజ.

శరణార్థిని పొమ్మనుట నీకు అన్యశరణ్యము నాశ్రయించుట నాకు భావ్యముకాదే శత్రువువెన్నంటి విడుచునట్లులేదే ప్రాణావసిష్ఠుని చేయుచున్నాడు రా శత్రుసంహారమొనరించి ప్రాణముదక్కించి చెంతజేర్చు వీరనారివై కవాటముతెరచి మన్మథుని మట్టుపెట్టు అన్నాడు రాము.

అయ్యో ఇరువురమధ్యలో కవాటము అడ్డములేకున్న వాటముగా వైనముగా కోటికొల్లకొడ్తాడండీ కొంచెము ఓపికపట్టండీ వాళ్లమ్మతోచెప్పి వైతొలగిస్తా ఓలక్ష్మి మహాతల్లీఒకణ్ణికన్నా ఎట్లాటివాణ్ణికన్నావమ్మా ఒకపురుషునితో ఒకస్త్రీదాపుననిల్చి తలయెత్తిమాట్లాడకూడదు ఎక్కడనుంచీ వస్తాడో అప్పుడే నాధిచూడు బయన్నాఅని సంధులేకున్నా సందుచేసుకొని బాణాలుతీసుకొని మంచీచెడ్డా గమనించక వేళావేళల పరికించక నీతిఅవినీతుల పాటించక వావివరుసల లెక్కించక మధ్యదూరి పంచప్రాణాలు లేచిపోయేటట్లు పంచబాణాలు ప్రయోగిస్తాడు ఒకేటుతో ఇద్దరుచస్తారు

ఇదేమిటమ్మా ఎంతగొప్పవారైనా ఇదియామర్యాద అయ్యో నాప్రాణాలు పోతున్నాయి ప్రాణాలుతీస్తున్నాడు రక్షించురక్షించుమన్న శరణార్థిని పాపమని రక్షిస్తే ఇకనీఅన్నవున్నాడు లోకమందరికీ మామ చందమామ వెతుకుతూ పసికట్టి వాసనబట్టి సత్యముచేబట్టి వచ్చి వడిగట్టుతాడు వడిబెట్టుతాడు వద్దని మొరపెట్టినా విడక మెడగట్టుతాడు అయ్యో కొడుకునూ అన్ననూ మంచివారిని సంపాదించుకున్నావు తల్లీ మరీ పడుచుపిల్లలచూస్తే పైపైరుసకపడతారు పరిగెత్తినా విడక కొడ్తారూ వడిగడ్తారు పదిమంది పిల్లలయినారయ్యో బాధించకండి బాధభరించలేమండీ వావి వరుసలేనివారు వక్కపనికే వచ్చినారు వరుసకాదండీ వైనమూకాదండీ అంటే వింటేగా ఒకరుకొట్టను ఒకరువడిగట్టనూ ఈమధ్యలో నీసవతి మూదేవత మహాతల్లి గజ్జెలపెద్దమ్మ వద్దుతల్లి వద్దుతల్లి అని నమస్కరించినా వినక కొంపలో తిష్ఠవేసి కూర్చుంటుంది ఎక్కడలేని బాధలగల్పించి ఆహారానికి విహారానికి వ్యవహారానికి వస్త్రానికి లోటుగల్పించి పీల్చిపిప్పిచేస్తుంది అయ్యో ఆమహాతల్లి ఎవరికీ భయపడదు పోలీసుశాఖగాని మిల్టరీశాఖగాని ఏమీచేయలేరు ఈమె ఏటంటే వారికీ భయమే ఆటంశక్తులు ఐడ్రోజన్లుకూడా పనిచేయలేవు రాజధానికే లోపడనంటుంది ఇనుపగజ్జలతో వీరావేశముతో శివతాండవమాడుతుంది నీసవతి చేరినచోటికి నీకొడుకూ అన్నా వంటికాలితో పరుగెత్తివస్తారు పిలువనిపేరంట్రాండ్లు అగుతారు ధనికుల ఇల్లంటే వాళ్లముఖమంటే వాళ్లజంటంటే వింటే పిక్కబలంచూపుతారు నీకంటిచూపుపడిందాకా ఈముగ్గురూ ఏడ్పిస్తూనేవుంటారు ఈముగ్గురికీ దుష్టత్రయులనిపేరుపెట్టి పదవులనుండీ పడగొట్టుతల్లీ ఈముగ్గురిని పదవులనుండీ పడగొట్టుటకు ప్రకృతం రాజధానిలో ఆలోచిస్తూ కార్యములుచేస్తూ నడిపిస్తూవున్నారు నీవు పడగొట్టకపోయినా మారాజధానే పడగొట్టితీరుతుంది ఈమాట నీకొడుకుమన్మథునికి అన్న చంద్రునికి సవతి దారిద్ర్యదేవతకు చెప్పు మీపదవులు ఉండవనిచెప్పు మీతంటాలు ఇకసాగవనిచెప్పు మీవారికి నీవుగట్టిగా బుద్ధిచెప్పు మావారికినేను నీతి చెప్పుతా ఏమండి ఇంకా పోయినాడాలేదా వాళ్లమ్మకు గట్టిగా చెప్పినా ఇంకా ఉన్నాడా పోయివుంటే బాధానివర్తికై తాపోపశమనమునకై ప్లాసులో కాఫీపెట్టి వచ్చినా కొంచెంపుచ్చుకోపోండి కోపాన్ని క్రోధాన్ని చేతపట్టుకొనక పాదరక్షలుగా ఉపయోగముచేసుకోండి భార్యపైకోపము పశమించండి కామాస్త్ర ముపసంహరించండి కోటిభద్రతకయ్యే కవాటము బంధించినాను లేకున్న శత్రువులు ఈవేళకు కొల్లగొట్టి వుందురు పోండి స్నానముచేస్తాను అవదరుబోతుల పొగరుబోతుల

మరొకసారి రమ్మనండీ ఇరువురమూ ఏకమై ఎదిరించి వెన్నివ్వక ఎదఇచ్చి పోరాడి వారిత్రుళ్లడంతాం పోండీ నమస్కారం స్నానముచేస్తానంటూ నీళ్లుపైన పోసుకున్నది సరోజ.

రాము నిరాశతో శాంతముతో చమత్కారమునకు మెచ్చుకొంటూ వాక్చతురతకు తలయూచుతూ వచ్చి గ్లాసులో కాఫీత్రాగి కుర్చీలోకూర్చొని భార్యచేతిలో వున్నది భర్తబ్రతుకు ఆడిస్తుంది పాడిస్తుంది అమృతవర్షం కురిపిస్తుంది ఆనందాంబుధి తేలిస్తుంది ఉల్లాసములో ఊగిస్తుంది ఉజ్వలతేజము గలిగిస్తుంది ఉన్నతపదవిని అందిస్తుంది ఉంది భార్యలోపదునుంది కోటకుసైన్యబలం దేహానికి వీర్యబలం ఇంటికి ఇల్లాలిబలం ముఖ్యా ఆశ్యకము చదువుకున్న ఇల్లాలేకావలె నంటూ ఆలోచిస్తూ ఉండెను.

ఇంతలో సరోజ స్నానంచేసి పాడిగుడ్డ కట్టుకొని వస్తూ చిరునవ్వుతో నమస్కరిస్తూ కాఫీత్రాగినారా అన్నది.

త్రాగకుంటే తాపం పూరకుండనిస్తుందా అన్నాడు రాము.

ఆహారం చేసుకున్నామని కావలసినంతా కుండలోపెట్టుకున్నామని తొందరపడి వేళావేళల గుర్తెరుంగక తింటే అజీర్ణముకాదూ తమకు తెలియదూ అంటూ నవ్వుతూ వంటగదికి పోయెను సరోజ.

ఇట్లే బడిటయమువరకూ కాలముగడపి భోంచేసి స్కూలుకుపోయి అయిదు గంటలకు ఇంటికివస్తూ పూలూపండ్లు తీసుకొని మూటగట్టి భుజాన వేసుకొని ఇంటికి వచ్చి వాకిలితట్టి త్రోసి లోపలప్రవేసించినాడు రాము.

సరోజఎదురుపోయి స్వాగతమిస్తూ వీపుననున్న పూలనుపండ్లను తీసుకున్నది.

రైటు రైటు శాస్త్రంచెప్పినది నిజమే ఇల్లువిడచి పోయివచ్చిన అబ్బాయికడుపు చూస్తుందట కన్నతల్లి, వీపుచూస్తుందట ఇల్లాలు, క్రిందికి మీదికి అంతటా చూస్తారట పిల్లలు నడివీపునవున్న మూటను అప్పుడే కనుకున్నావుచూడు అన్నాడు రాము.

ఔను దేవునిదగ్గరకు ఆలు పిల్లలదగ్గరకు అమ్మా నాన్నదగ్గరకు గురువుల దగ్గరకు బంధుమిత్రుల దగ్గరకు పిల్లలకడకు రిక్తహస్తములతో పోకూడదని అట్ల పోయిన పరాభవము పదిమాటలు పాపాలు ఆహారములో విచారణలో లోటువస్తాయన్నారుగా దేవుడు గురుడు అమ్మా నాన్న బంధుమిత్రులకన్నా ఆలు పిల్లలు అస్వతంత్రులు కట్టుకున్నవారు కరుణగలిగి కడుపెరిగి తెచ్చియిస్తే చేయి చాస్తుంది

లేకుంటే నిరాశ చెందుతుంది జిహ్వోపస్తా చాపలములు ఋషులకైనావున్నవి. వారి కొరకయ్యే మిమ్ముల ఆశ్రయించి వుండేది అవిలేకుంటే మీతో పనివుండదు. అడవిలో ఆడఋషులమై ఉంటాము ఆర్జించి పెడ్తాను ఆశలు తీరుస్తాను అనురాగంగా మెలగుతాను నాప్రాణంగా చూచుకుంటాను అని ప్రమాణపూర్తిగా తెచ్చుకున్నారు. మిమ్మాశ్రయించక యెవరిని ఆశ్రయింపవలయునో చూడండీ గమనించండి మీరు తెచ్చినదానితో ఇచ్చినదానితో సంతోషపడవలె మనసుకు స్వస్తిచెప్పవలె పురుషుడు ఆదరిస్తే నిరంతసంతోషియై బ్రొద్దునుచూస్తూ ఇంకారాకపోయెనని ఎదురుచూస్తుంది స్త్రీ నిరాదరణచేస్తే నిరంతర దుఃఖియై తన అస్వతంత్రతకు పరితపించి దేహమాన ప్రాణములపై రోసి వెనుక నుయ్యి, ముందు గొయ్యి చూచి యెటుజరుగుటకు వీలులేక నుయ్యికో గొయ్యికో ప్రాణమర్పింస్తుంది. ప్రాణభిక్షపెట్టినామీరే, ప్రాణాపహరణచేసినామీరే ముఖము పరికించి ఒకచిరునవ్వు నవ్వి ఇంటఇల్లాలు వుండదని పూలోపండ్లో పట్టుకవచ్చి చేతికందిస్తే దేహమంతా పులకరించి ఉత్సాహయుతమై పరమానంద మొందుతుంది. కోపించి చూచితిరా దేహమంతయూ చిరుచెమ్మటలు గ్రమ్మి చల్లబడి నిరాశతో నిట్టూర్పువిడుస్తుంది. అన్నదమ్ముల అక్కచెల్లెండ్ర తల్లిదండ్రుల ఆప్తుల బంధుమిత్రుల విడచి మరచి ధర్మమే జయమనీ, కర్మమేనిజమని తాళికట్టినవారినినమ్మి తలదాచుకొనవచ్చిన అబలకు ఆపూ ప్రాపూ దాపూ భర్తగాక మరెవ్వరూ భర్తచేయివిడచినా ప్రేమమరచినా వేరుదలచినా గతులుగలవా చెప్పండీ మీరు అదరణా స్వాతంత్ర్యము యిచ్చుటవల్ల దేహము ప్రాణము మీ వెన్వెంటనే తిరుగుతున్నది గంటను పదేపదే చూస్తుంది చప్పుడయితే మీరేనంటుంది నిరాదరిస్తే గతేమి అంటూ కాఫీతెచ్చి చల్లార్చి యిచ్చింది సరోజ.

సుగుణములపుట్ట ధర్మాలకట్ట అంటూ చేరదీసుకున్నాడు రాము.

స్త్రీకి ఇదే ఆదరణ ఈ ఆదరణావిధానము ప్రధానమై ప్రాణదానమై ఎంత కష్టముచేసినా ఎన్నిచిక్కులువచ్చినా ఎట్టియిక్కట్టులు రూపొందినా ఎదిరించి ప్రాణమును గాపాడుకుంటుంది స్త్రీ పతి ఆదరణా నిరాదరణలో ఉన్నది. స్త్రీ జీవితము ఆదరణ అమృతము నిరాదరణ హాలాహలము మరువవద్దు అంటూ సగముఇంకా తనచేతిలో ఉన్న కాఫీనితానే త్రాపి పండుగకు ఏమితెస్తారు ఏమి చేస్తారు చెప్పండీ అంటూ రాము కాళ్ళను చక్కనిద్దుతూ అన్నది సరోజ.

ఏమికావలెనో చెప్పమన్నాడు రాము.

నాకన్నా నాల్గుపండుగలు తామే ముందుచూచినారుగా ముందుమీరు చెప్పండి వెనుక నేనుచెప్పుతాను అన్నది సరోజ.

ఇంటికార్యక్రమములూ పండుగలూ పర్వాలూ ఆచరణావిధానములూ గృహిణీవిగాని గృహస్థునివికావు అన్నాడు రాము.

సరే నాకుతెలిసినవన్నీ చెప్పుతాను అందులో మరచిపోయినవి మీరు చెప్పండీ అని వ్రాసుకోండీ అన్నది సరోజ.

రాము కాగితము పేనా చేతికితీసుకొని చెప్పు వ్రాసుకుంటానన్నాడు.

ఊఁ పెట్టండి పేనా శ్రీరస్తో శుభమస్తో లేకుంటే శ్రీరామోరఘురామో అని ఏమీపెట్టకుండా వ్రాయుటకు నాస్తికులా అన్నది సరోజ.

కాలుపెట్టినా కాలుతీసినా కదలినా కదిలించినా లేచినా కూర్చునా దేవుని పైనే ఆధారపడి ఉంటావే అన్నాడు రాము.

ఔను దీనినే ఆచరణా అంటారు దేనిని ప్రారంభించినా వేగిలేచినదిమొదలు రాత్రిపండుకొని నిద్రపట్టువరకు మరువకుండా తనయిష్ట దైవమును తలంచువారు న్నారు వ్రాసినా చదివినా ఇష్టదైవాన్ని మరువరు. లేచినా కూర్చున్నా మరువరు. ఇష్టదైవాన్నో ఇలువేల్పునో తలంచి ప్రారంభిస్తారు. అందరూ పోయేదార్నే పోండి ముండ్లు మోట్లు రాళ్లూ రప్పలూవుండవు కొత్తదార్లువేయడం కష్టం నష్టం ఇప్పటికే యెన్నోమతములు యెన్నోభాషలు యెన్నో ఆచారములు యెన్నోకులములు యెన్నో దేవతలు అయినవి తమరూ యేలయింకొకటి సృజిస్తారు ఊఁకానివ్వండీ అన్నదిసరోజ.

సరేనంటూ శ్రీకృష్ణాయనమః అని వ్రాసినాడు రాము.

అబ్బా కృష్ణభగవానుడా మీరు ఇలువేల్పా ఇష్టదైవమా అన్నది సరోజ.

అంటే అన్నాడు రాము.

ఓహో ఇలువేల్పును ఇష్టదైవాన్నే మరచినారన్నమాట ఇలువేల్పు అంటే వంశపరంపరగావచ్చిన ఆదివేల్పు వారిని మరచినట్లైతే వంశానికి హానికలుగు తుంది వంశాన్ని పెంచడం వారివంతు వారిదస్తరములో ఉంటుంది మనవంశవృక్ష ము ఇక ఇష్టదైవమంటే బంధువూ మిత్రుడూ ఉన్నట్లు ప్రకృతం మనస్సు ఆక ర్షించగా మక్కువగా పెట్టుకున్న వేల్పు పెద్దవారు తెలిసినవారైతే ఇలువేల్పుపేరే పెట్టుకుంటారు ఇలువేల్పునే కొల్చమంటారు అన్యదైవము అన్యమతమును

అన్యకాంతను అన్యధనమును ఆసించవద్దని తప్పక కీడు గలుగుతుందని బాల్యము ననే భద్రపరుస్తారు కొందరు. వక్తలు వారి వారి మతములలోకి లాగి వారాశ్రయించిన దేవునిచూపి భ్రష్టుచేస్తారు వారివారి ఇలువేల్పునే సేవించమనుట మత గురువులకు శ్రేయము. మతాభివృద్ధికై తెలియనివారినిమార్చి దైవ దూషకులై కూలి పోయెదరు. తమరిని అమ్మానాన్నా భద్రపరచి వుండవచ్చుగాని, వారిభద్రతకు తమరు కట్టుబడి వుండరు. ఇష్టదైవమెంతో వారంతే నన్నారు. ఇలువేల్పు దైవ మెవరూ అన్నది సరోజ.

మాకు ఇలువేల్పు శ్రీరంగనాథుడు అయితే మానాన్న శ్రీరాముని సేవించే వారు అందువల్ల నాపేరు యిష్టదైవముపేరే పెట్టుకున్నాడు అన్నాడు రాము.

అందుకే తమరు వక్కాణైనారు. ఇలువేల్పుపేరు ముందు పెట్టివుండిన ఇష్ట దైవము మరొకరిని ఇచ్చివుండును. సోదరులవారు లక్ష్మణస్వామి ఇంకొకరువుండి వుందురు. అయినా ఇష్టదైవాన్ని మంచివారిని పెట్టుకున్నారే వినేటప్పటికే గుండె లవిసి పోయెనే అన్నది సరోజ.

ఏమి శ్రీకృష్ణుడు చెడ్డవాడా అన్నాడు రాము.

చెడ్డవాడుకాదండీ మంచివాడే ఆయనదైవము. తమరు మానవులు వారిలీలలు అనంతములు తమరు వారిశిష్యులు భక్తులు శ్రీవారిననుసరించి వుందురుగా, ఏదేవుని గొల్చిన ఆదేవుని నడకబలమూ మనసూ ఉండునంటారు పెద్దలు. లీలామానుష విగ్రహుని లీలలనేకము లయినట్లు తమ లీలలూ అయితే ఎట్లా అని ఆలోచన అన్నది సరోజ.

నాకు అర్థముకాలేదు నీమాటలు కొంచెము అర్థమయ్యేటట్లుచెప్పు అన్నాడు రాము.

అయ్యో తమకెట్లు అర్థమగుతుంది అయ్యేటట్లు చెప్పుతా వినండి ఆ శ్రీకృష్ణ పరమాత్ముడు బాల్యమాదిగా గోపికలతో ఆటలాడుతూ మాటలాడుతూ పాటపాడుతూ వారిమనోహరణ మొనర్చినది గాక వారి ఇండ్లనవనీతము హరించినాడు గోపికలు ఒకరిద్దరుగాదు పదహారువేలమంది తమవాంఛా మనోరథమునకుగట్టి ఈడ్పించి నాడు వస్త్రాపహరణమొనరించి ఏడ్పించినాడు ఏడ్పించినదిగాక చేతులు మోడ్పించి నాడు కేలుమోడ్పించినదిగాక యమునాతీరమున బృందావనమున చిలిపిచేష్టలెన్నో

చేసి మరులుకొల్పినాడు పీరితో తమిదీరక వివాహసమయమున శత్రుమధ్యగతయైన రుక్మిణిని ఎత్తుకవచ్చి పట్టపురాణిగా చేపట్టినాడు. రుక్మిణిగాక ఇట్లే ఏడుగురినితెచ్చి అష్టభోగములలాగా అష్టభార్యలనిపించుకున్నాడు. వీరుగాక నరకాసురునితో బందింపబడిన కన్యలచెర విడిపించగా వారు తన్నుకోర పదహారువేల రాచకన్యల వరించితెచ్చినాడు విన్నారా ఇందరూ చాలక మేనత్త రాధ వెఱ్ఱిదై వెన్నాడితే వెనుదిరిగి అత్తా అని కౌగలించినాడట కౌగిలిలో ఒరిగిపోయిందా వెఱ్ఱిరాధ విన్నారా అంతతమకము గమకము గలిగినవారు తమకు దేవుడయితె తమరెట్లుంటారో ఎట్లుంటుందోనని భయం ముచ్చటగా ముందు చేసేది మొగవారు అప్పుతీర్చేది ఆడవారు ఆడదిచేస్తే అప్రయోజకురాలు వ్యభిచారిణి పుట్టినింటికి మెట్టినింటికి మట్టి గొట్టే మారికాశక్తి అంటూ దూషిస్తారు కర్త ఏవిధమయిన కర్మచేస్తే అవిధమయిన కర్మ తనకు జరుగుతుందని తానెందుకు తెలుసుకొనకూడదు. చేశావ్ బోశేశావ్ అన్నసామెత వినలేదా పురుషుల మనోవృత్తి చెడిన స్త్రీలుచెడుదురు, స్త్రీలుచెడుటచే వర్ణసంకరమగును వర్ణసంకరముతో వంశనాశనమగును అని ఆ గీతా భగవానుడే చెప్పినాడే అదీగాక ఋణానుబంధ రూపేణా పశుపత్ని సుతాలయా అన్న మర్మము తెలియలేదా భార్యా పిల్లలు ఇల్లూ పశువులు మొదలగునవి పురుషుని ఋణములూ ముందుజన్మలో ఒకరికి ఋణపడకుండిన నీవస్తువులు ఏవీచెడక నీవెనువెంటనే వుండును ఋణముండిన ఏవీనిలుపుకొనలేవు నీవు ఎవరికీ ఏవిధమునా ఋణపడవద్దు జమాఖర్చులు వ్రాసే జగజ్జట్టీ చిత్రగుప్తున్నాడు చక్కగా లెక్కలోకి యెక్కిస్తాడు అన్నారుపెద్దలు విన్నారా అకృష్ణపరమాత్ములవారి భక్తులుతమరు వయసూ వయసుకు తగ్గరూపమూ రూపమునకుతగ్గ ధనమూ జ్ఞానా విద్యా వినయము ఉన్నవి ఆశపడి అప్పుయిస్తామంటారు ధర్మవ్యతిరిక్తనిచేసి దుర్మార్గులలో చేరుస్తామంటారు విలాసానికై వినోదానికై ఆడించుకుంటారు పాడించుకుంటారు తిరుగుతారు తిప్పించుకుంటారు తానుజారిణియై జారుడంటారు అంటూవుంటే రాము తలబట్టుకొని అబ్బా తలనొస్తుంది అవతల చెప్పే అన్నాడు.

వింటేతలనొప్పివస్తే కంటే వళ్లునొప్పివస్తుంది పరవాలేదు అలాంటి పాత పాదరక్షలుంటాయి తప్పించుకొని నడువండి నన్నునడిపించండీ అప్పుపడి అప్పు తీర్చమనకండి కృష్ణులవారి శిష్యులనిపించుకొనకండి అంటూ చేయిచాస్తున్నాను అనిపించుకోనని చేయివేయండీ అవతలికథ చూస్తాము అని చేయిపట్టినది సరోజ.

పెండ్లినాటి ప్రమాణాన్ని మరచివుంటాడేమో జ్ఞాపకము చేస్తామనుకున్నావా సై అప్పుడప్పుడూ సానబెట్టావుంచేనే కత్తితళతళా మెరిసేది ఇదిగో విను కృష్ణుని చెడ్డకార్యములలో నికృష్టుడనై మంచికార్యములలో జిష్ణుడ విష్ణుడనై భక్తుడనై ఇల్లాలికిచ్చినమాటను జవదాటను అప్పుచేయను నీమాటవింటాను ఇంట ఉంటాను అని చేయివేసి భయముతీరిందా అన్నాడు రాము.

మీమనస్సుకు ఆనందం కల్పించవలసిన ధర్మంనాది నామనస్సుకు ఆనందంకల్పించవలసిన ధర్మంమీది ఒకరినొకరము నమ్మి చేయునది సంసారం నమ్మికలుచెడితే ఇంతకన్నా నరకము ఎక్కడావుండదు. ఈనరకానికన్నా ఆలోక ములో ఉన్ననరకం నయము భర్తమరొక స్త్రీని ప్రేమించినాడని తెలిసిన గృహిణి మనఃకల్లోలం గృహకల్లోలం స్త్రీమరొకరిని ప్రేమించినదని భర్తకు తెలిసిన సర్వతా కల్లోలం ఇరువురమన్సులు ఏకమై ఏకలక్ష్యముపై వెళ్తే ఇంతకన్నా ఆనందము ఏలోకములోనా ఉండదు. నమ్మినడవండీ నామాటవినండీ ముందుకు జాకీపడి నొప్పిపడకండీ ముందేభగవంతుని నిర్ణయించు కొనడములోకూడా కొంచెము యోచనవున్నది. అయినా మనస్సువారిపై వాలింది మరల్చరాదు వారు భగవంతుడు వారిలీలలు అనంతములు వారెందుకట్లచేసిరో మరొకతూరి మాట్లాడు కుందాము తమరుమాత్రము శ్రీరామచంద్రునివలె ఒకమాట ఒకబాణము ఒకపత్ని వ్రతుడవై కీర్తిగౌరవముల నిల్పండి మనఇంట్లో కృష్ణపటములేమిగా తీసుకరండీ ఒకకృష్ణుడుమాత్రము వుండేపటము తేవద్దు రుక్మిణిసమేతుడై కూర్చొనిఉండునట్లు ఉండవలయును ఒకరే ఉన్నపటముతెచ్చిన వారినినేను హద్దులో పెట్టలేను అమ్మా తల్లి రుక్మిణి చేతగాక తలుగువిడిచింది. ప్రక్కన ఆమెవుండిన కొంతనయం ఈవీధిలో అల్లరులు చేసిన అందరికీ మనము జబాబులు చెప్పకొనలేము వారితో యశోద అల్లాడిచచ్చినది ఆయవస్థ నాకుపెట్టకండీ దంపతీ సమేతములేని దేవుని సేవించిన మాత్రుశాపగ్రస్తులై సన్యాసులైవుట్టి స్త్రీసుఖముగానక స్త్రీలలో చీవాట్ల బ్రతుకై అగచాట్లు పడగలరు అన్నారు. అది అటుండనీ పటము వ్రాసుకోండి ఇక కూరగాయలన్ననో మార్కెట్టులో ఉండినట్టివి తమకగుపడినట్టివి ఒకొక అర్ధసేరు వంతున తీసుకోండి మొదటిపండుగగదా దొరికినట్టివంతా చేసిపెట్టుదాము ఇక తీపుపదార్ధములలో హోళిగలు ఈపండుగకు ముఖ్యముగాచేస్తారు ఇంకా వీలుగలిగితే మూడువిధములగు తీపుపదార్ధములుచేస్తారు ఏదైవాన్ని మనము సేవిస్తామో

ఆదైవానికేది ప్రీతియో తెలుసుకొని కొందలుచేస్తారు తమఇష్టదైవానికి వెన్నప్రీతి వారికి వెన్నా చక్కెరా తేనే దాొక్ష కలిపి నివేదనచేస్తాము మీగడకొంచెముతీసి అందులో చక్కెరకలిపి ఇదీవకరకముగా పెట్టుదాము అరటిపండ్లూ పాలూ చక్కెరా నెయ్యీ కలిపి మరీఒకటి మీఇష్టమయిన వేల్పుకు చాలా అన్నది సరోజ.

పంచామృతము శ్రీదయితునికి ప్రీతి అధరామృతము నీదయితునిక ప్రీతి వారికి పంచామృతం వీరికి అధరామృతమిచ్చి సంప్రీతులచేసి వశవర్తులచేసుకో నీదయితుడు ఇక్కడా శ్రీదయితుడు అక్కడా సుఖమిస్తారు నీశ్రేయస్సును కోరుతారు అన్నాడు రాము.

భక్తి శ్రద్ధలతో పంచామృతమిచ్చి వారిని భయశక్తులతో అధరామృతమిచ్చి మిమ్ము వారిని యిల్లుమరపి మిమ్మువళ్లుమరపి ఆనందమనుభవిస్తామని ఆశఉంది వారికరుణా కటాక్షమెట్లున్నదో తమదయాంతఃకరుణ ఎట్లున్నదో తమ ఇరువుర దయా నాయదృష్టమూ అన్నది సరోజ.

పంచామృతపానమిచ్చి పరమాత్మను అధరామృతపానమిచ్చి నాయాత్మను తృప్తిపరచేదిగాక క్షీరపానమిచ్చి శిశువునూ రక్షిస్తావులే అన్నియెడలా అన్నికడలా అందరికీ అవూ పాలు ఇచ్చి పుణ్యము సంపాదించేశక్తి ఉండే స్త్రీకి పుణ్యాంగన యని పేరుగలిగినది ప్రక్కన చేర్చుకొని అధరామృతపాన మిస్తూ యిస్తూ భర్తను కనుమూయించి డొక్కలోచోటిచ్చి క్షీరపానము ఇస్తూ ఇస్తూ శిశువును నిమర పుచ్చిన పుణ్యము హరికి అగ్నికి చేసిపెట్టిపెట్టినట్టి ఫలమూ నిన్నువెన్నంటి వైకుంఠ పురద్వారమువరకూ చేర్చగలవు అక్కడ నీపిలుపులేకనే తెలుసుకొని హరి సిరిసమేతముగావచ్చి తొడ్కొనిపోవ అక్కడున్న పరమభాగవతులు చూస్తూ పతివ్రతా శిరోమణియా కలియుగములోనా అబ్బా అని ఆశ్చర్యపడ పరమప్రీతితో పదవి పట్టా ఆ పురాణదంపతులు ఇస్తారు అప్పుడు నన్నూ నాకుటుంబాన్ని మరువవద్దు అని చుబుకమంటి ముఖములో చూచినాడు రాము.

ఔను అధరపానం త్రాగి త్రాగి ప్రాణం తీసి సగంచేసినానని కట్టుకున్న అబ్బాయి రక్తంలో సగం పంచుకొని పుట్టి క్షీరపానం చేసి చేసి సగంచేసినానని కన్న అబ్బాయి కామ్యమూర్తులై పెద్దరయిలు ఎక్కిస్తే చక్కగాపోయి శ్రమ లేకుండాచేరి పోతా కారుణ్యరహితులై చిన్నబండిఎక్కించిరా నల్లులూ కరుస్తాయి

నడుములూ విరుగుతాయి అనుకున్నవేళకు చేరక నడుమ అవస్థలూకలుగుతాయి అంతా మీలోనేవుంది ఆశవారిబ్రతుకు వయసు వున్నంతవరకూ ఒరుగతోసి త్రాగి త్రాగి వయసు మీరగానే వారతోస్తారు పాపమనే పరమపుణ్యులెవరో అని దీనముగా మాటాడినది సరోజ.

ఎందుకట్ల దీనముగా మాట్లాడుతావు సరోజ అన్నాడు రాము.

ఈనాటిప్రేమ ఆనాడు ఉంటుందా అని ఆలోచన అవుతూ ఉన్నదన్నది సరోజ.

కట్టుకున్న అబ్బాయి కన్నఅబ్బాయి ప్రేమ విరగడ అయ్యేవేళకు సాకుడు కొడుకుల్లాగతిన్న పై అబ్బాయిలు యిపుడూ ప్రాణంగా చేయూతనిచ్చి పైకితీసు కొనుటకు తయారుచేసుకొంటూ ఉన్నావుగా నీవుజాణవులే ఆసమయానికి నన్ను పనికిరావని పారదోలుతావు పిల్లల యారదోలుతావు పెద్దబ్బాయిని చిన్నబ్బాయిని చేరబిల్చుతావు పంచామృతాలు పంచభక్ష్యాలు పరమాన్నాలు నట్టింట తిష్ఠవేసి కూర్చొని నాలుకకురుచిగా తిన్న అబ్బాయిలూ నీపిలుపు వినరా ప్రీతిగనరా దాపు ఇడరా ధర్మబద్ధులై మానవులే ఎందరోపెట్టినవారికి పెట్టవలెననివుంటే ప్రతి నిత్యమూ ప్రీతిగాపిల్చి పెట్టినవారికి పెట్టక భగవంతుడు మరచిపోతాడా భగవంతుడు ధర్మబద్ధుడు మరచిపోడు మంచినీళ్లిస్తే పాలు ఇస్తాడు అన్నమిస్తే అమృతమిస్తాడు యిక్కడికి తన్నురాగోరితే అక్కడికి తానురాగోరుతాడు మరువకుంటే మరువ కుంటాడు మనసిస్తే సర్వమూఇస్తాడు ఆదరిస్తే అన్నీఇస్తాడు ఒకజన్మలోపెట్టితే పదిజన్మలకు పెట్టుతాడు ఇదిఎరింగే నడుస్తున్నావు పెడ్తున్నావు అంగరక్షకుడై అగ్నిదేవుడు అక్కడచేరుస్తాడు అజరు ద్రాద్యమరులు అందరానిపదవి హరిఇస్తాడు కన్నతల్లివలె శ్రీమాత లాలిస్తుంది ప్రేమిస్తుంది శ్రీవరులిద్దరూ చెంతచేర్చేది నిన్నేలే జాణతనము చూపకు మంటూ రాము చెంపన చేయిపెట్టినాడు.

సరే కథఅటుండనీ చేయియిటుండనీ అని రాము చేతిని తనరెండుచేతులతీసి పట్టుకొని పండుగసామానుల్లో ధర్మాలూ అధర్మాలూ భార్యాభర్తల సంబంధాలూ వచ్చినవి ఇవితెగవుకానీ పదార్థాల విషయమయింది ఇంక టెంకాయలు నాల్గు వ్రాసుకోండి అన్నది సరోజ.

నాలుగు ఎందుకూ అన్నాడు రాము.

ఇలువేల్పుకొకటి ఇష్టదైవానికొకటి గ్రామవేల్పుకొకటి రాత్రికి ఉత్సవమగుతూ ఇంటిముందుకువచ్చే దేవునికొకటి వెరసీనాలుగు సరిపోలేదా అన్నది సరోజ.

ఇంతమందిదేవుళ్లయితే భరించేది బ్రతికేది కష్టమే అన్నాడు రాము.

వీళ్లలో ఎవరినివిడుస్తారండీ ఇలువేల్పు వంశపరంపరగా వచ్చినవారు ఇష్టదైవమూ మెచ్చి ఉంచుకొని సేవించువారు ఇక గ్రామదైవమూ గ్రామవాసో జనాశ్రయః అన్నారు గ్రామవాసులు వారినాశ్రయించి వారు గ్రామమునాశ్రయించి జీవదేవన్యాయముగా ఉన్నారు. వారిఆశ్రయము లేనివారికి అవస్థలుతప్పవు గ్రామములో ప్రవేశించెడి పీడాపిశాచములు మారికాస్ఫోటకాది ఉపద్రవములు రోగములు వారిరక్షణలేని వారిగృహములకడ నివసించి సమయమెరింగి గృహప్రవేశమై బాధించును వేధించును గ్రామకలహములూ గ్రామచ్ఛిద్రములూ కలుగుచుండును గ్రామములో అనధికారము సంప్రాప్తింపచేయును గ్రామములో అదవగా యదవగా తయారుచేయును. గాన గ్రామ అధిష్ఠానదేవరకు పండుగదినములలో కష్టకాలములలో సంవత్సరాదిలో తప్పక వారినిసేవించి సమర్పింపవలసినవి అర్పించవలసినదే ఇక గ్రామోత్సవములో ఇంటివద్దకే వెంచేసినవేల్పును అర్చించక ఆతిథ్యమివ్వక అవతలపొమ్మంటారా మానవుడు తినీ తినకనైనా చేయవలసిన విధములూ చేయవలసిన కార్యములూ చేయకమరువరాదు. ఇచ్చినవాని మరచి ధనికులూ విద్యాధికులూ ఇచ్చెడివాని మరచి బీదాసాదా భ్రష్టులై పోతున్నారు వారిసంఘములో చేరకండి చెడిపోతాము అన్నది సరోజ.

సరేకానీ నాల్గుటెంకాయలూ అని వ్రాసుకున్నాడు.

ఓ ఈనలుగురికీ సరిపోవునన్ని పూలూ పండ్లూ కర్పూరం ఊదుకడ్డీ తీసుకొనండి పండ్లూ పూలూ కొన్నిరకములు దొరికిన రకమునకు కొన్నితేండి ఇక్కడికి పూజాద్రవ్యములు సరిపోయినవి వస్త్రములు వ్రాసుకోండీ జతకట్టుపంచెలు జతపైపంచెలు రెండుచీరలూ రెండురవికలూతేండి ఇలువేల్పుకు ఇష్టదైవానికి సరిపోతాయి అనిచెప్పుచుండునంతలో తల్లిగారి వూరునుంచీ గుమాస్తా సుబ్బారావు జట్కాదిగి ఒకబుట్టా ఒకచిన్నగట్టా తీసుకొనివచ్చి అక్కడపెట్టి నమస్కరించి అమ్మపంపినదమ్మా ఈబస్సుకే నన్నురమ్మన్నారు వెళ్లుతానని జట్కాలో తిరిగి పోయెను.

సరోజ బుట్టవిప్పెను అన్ని తినుబాండారములుండెను చూచినారా అత్త అల్లునిపైన ఎంతప్రేమో నెలవరకూ తిన్న అయిపోవుపోండీ ఊ బుట్ట ఇవి గట్టాలో ఏమున్నవని దింప్పగా రెండుమంచిచీరలూ రెండురవికలు జలతారుఅంచుగలవి జతపంచెలు ఒకకండువాపంచెవున్నవి చూచినారా అల్లుడూ ఆడబిడ్డాఇంటికిరాకున్నా కూడా ఆనందంగా ఉన్నాముగాబట్టి కావలసినన్ని వస్త్రాలు ఆహారాలు పంపినారు ఇక ఒక మీదిపంచె తేండీ సరిపోతుతుంది అన్నది సరోజ.

అత్తగారిచ్చినవిగాని మనము తెచ్చినవిగావే పైవయోగ్యములేనా అన్నాడు రాము.

ఔను వారు మనవంతు చేసినారు మనము శ్రీవారిసొత్తు చేస్తాము వారి దేహము తగులక వస్త్రములు వారిచేయి తగులక ఆహారము మనము స్వీకరించిన ముందుజన్మకు మలినవస్త్రధారులమై శతపరిచ్ఛిద్ర చేలములు కట్టవలసి వచ్చును. అజీర్ణవ్యాధితో అటమటపడుతూ ఆహారానికి కొరతపడుతూ అల్లాడవలసి వచ్చును. కుటుంబగాని సన్యాసిగాని బ్రహ్మచారిగాని తప్పక తనకు లభించినవి వారికిచూపక ఏవి అనుభవించినా ముందుజన్మకు ముప్పుతిప్పలే అందులో కుటుంబికి మరీ వ్యాప్తి చెంది వెన్నంటిబాధించును నిత్యకృత్యముగా పక్వముచెరుపక పరిపక్వమొనర్చిన యజ్ఞేశ్వరునికి పరమదయాళుడై పట్టమని ఇచ్చిన పరమేశ్వరునికి వెనుక యిచ్చినది మర్వ్యాయములకు హెచ్చించక తెచ్చిఇల్లాలికందిచ్చిన భర్తకు పెట్టక తిన్నఇల్లు ఇల్లాలు గుల్లైపోవునన్నారు. ముగ్గురునాకు పూజనీయులు అతిథులు తమకు ఇద్దరు పూజనీయులూ అతిథులు అంటూ సామానులు యింట్లోపెట్టి చిత్తీ డబ్బు చేతికందిచ్చి పోయివస్తారా అన్నది సరోజ.

సరే ఈనాడుకొన్ని రేపుకొన్ని తెస్తానంటూ రాము బజారుకు పోయినాడు.

సరోజ యింటిలో పనులుచేసుకొంటూ శ్లోకములు చెప్పుకొంటూ ఉండెను.

కొంతసేపటికి రామువచ్చి సామానులు కొన్నితెచ్చినాను రేపుకొన్నితెస్తానన్నాడు.

సరోజ సరేనని అన్నిఎత్తిపెట్టినది యిట్లు సంతోషముగా కాలము గడచినది.

రాత్రిపండుకొను నప్పుడు నాలుగున్నరకు గడియారము అలారముపెట్టి పండుకొని నాలుగున్నరగంటకులేచి నీళ్లక్రిందవేసి దినకృత్యములు తీర్చుకొని కాఫీ

వేసినది సరోజ. అంతలో రాములేచి దినకృత్యములు తీర్చుకొనిరాగా సరోజ కాఫీ యిచ్చి తాగి పాతపంచెకట్టుకోండి తల అంటుతానని తానూ కాఫీత్రాగి కొంచెము వసంతముకలిపి తట్టలో కొంచెముపోసి గ్లాసులో కొంచెము ఎత్తిపెట్టి తానూ పాతచీరకట్టుకొని నూనెగిన్నే పీటా ఎత్తుకొనివచ్చి తూర్పుముఖముగా కూర్చొను లాగు పీటవేసి ప్రభువులవారువచ్చి పీటపైకూర్చొనవచ్చు తలంటుటకు ధర్మపత్ని సర్వవస్తుసామగ్రితో తయారై ఎదురుచూస్తూ ఉన్నదన్నది.

తలఅంటెదవా అనిలేచి రాము గలగలమను నీగాజుల రవళికి అనిపాడు నంతలోసరోజ అదుగోమొదలుపెట్టినారా కవిత్వానికి. కవిత్వానికికాలాలున్నాయిరాండీ తెల్లవారుతుంది అంతలోపల స్నానమయిపోనీ అంటూ పోయి చేయిపట్టి లాక్కొని వచ్చి కూర్చుండబెట్టి అత్తవారియింటివద్ద తమరు ఈనాడుఉంటే బావగారు యిద్దరున్నారు బాగావసంతము పోసి హేళనచేసి ఉందురు. కులాసాపడి ఉందురు యిక్కడ !ఎవరున్నారు నేను ఉన్నాను వసంతము కొంచెమయినా వంటిపైన పడకపోతే అశుభమని భార్యాభర్తలున్నవారు ముసలివారైనా ఒరుసగలవారిపైపోసి పోయించుకుంటారు భార్యాభర్తలు పోసుకుంటారు. వయసువారూ వసంతం కొంచెమయినా పడకపోతే యెట్లా వసంతుడు సంతోషించి ఆశీర్వదించవద్దా భార్యాభర్తలు యిద్దరూ పకపకనగుతూ వసంతము లాడుతుంటే వసంతుడూ వారినవులో కలసి పకపకనగుతూ నూరు వసంతములిట్లు దంపతీ సమేతముగా వసంతాలాడండీ సంతోషపడండీ అంటూ దీవిస్తాడట. యిది తొలివసంతం నన్ను మిమ్మువరించమంటారా తమరు నన్ను వరిస్తారా అంటూ గ్లాసులో వసంతము చేతికి తీసుకొని చేతితో రాముపై చిలకరించి నవ్వినది సరోజ.

రాము చిరునవ్వు నవ్వుతూ అదుగో వసంతము కలిపి వసంతములో వసంతునియెదుట పకపకనగుతూ వక్షస్థలముపై చిలికి వాల్గన్నుల తళుకుతో వయ్యారాలతో హొయలుతో వరుని బంధించెదవా అంటూ రాము రెట్టబట్టి చెంతకు చేర్చుకొని వసంతా అంటూ వసంతముతో బొట్టుపెట్టి యిరుచెంపలా దిష్టిపెట్టుపెట్టి వక్షస్థలమున వసంతము చిలికి చుబుకము పట్టుకొని వసంతా యేదీ ఒక చిరునగు నగూచూచి గడచిన వసంతములతో నూరువసంతములు నాతో వసంతమాడుమని మనసారా దీవింతును యేదీ అన్నాడు రాము.

సరోజ నవ్వుతూ వసంతా వైజయంతా గడచిన వసంతములతో నూరువసంతములు వీరిహృదయములో నాకు చోటు గలిగించు స్వామీ అంటూ రామును కౌగ

లించుకొని యిర్వురు వక్షస్థలములమధ్య వసంతముపోసి బిగ్గకౌగలించి తల రాము భుజములపైన మోపి నిమిషకాలము ఆ చల్లదనములో కనుమూసినది సరోజ.

అదిచూచి మందమారుతుడు చల్లగ పవన వీచినాడు. అది వసంత ఋతువు ఉషఃకాలము మందమారుతుడు మలయమారుతుడై గంధవాహుడై గంతువేయుచూ మరింత చల్లగ వీవనవీయ రాము పంచప్రాణములు స్పర్శలుతప్పినవి. ఆసమయ మెరింగి పంచబాణుడు అకర్ణాంతము నారిని లాగి కోటుగా బాణమువేయ రాము వెన్నునదూరి యెదనవెళ్లి పంచేంద్రియ స్పర్శలుతప్పి యెదకానుకొని ఆనందాంబుధీ తరంగములలో నుయ్యాలలూగుతూ రాముహృదయములో లీనమయిన సరోజకు సూటిగాతగిలినవి తగిలితగులుటకోసే మెరుపులని స్పర్శగల్గి రాము కౌగిలినుండి బల వంతముగా దిగజారి పాదములకు నమస్కరించి పట్టుతప్పించుకొని సరసాలు ఇక చాలు సాలుగా కూర్చొని వసంతుని జయంతుని కంతుని మలయపవనుని తోడు చేసుకొని రేపుమాపటికి రమ్మనండీ వేళావేళల గమనించక నీతి అవినీతులపాటించక వెఱ్ఱులై తిరిగితె భిక్షపెట్టరని చెప్పండి. వేగిలేచి వాకిలితీస్తేసరి ఎదురగుతారు నలుగురూ నాల్గుగరుడస్తంభములు చాకట్లుతీసుకొని నెమలిపింఛము మోసేటంత పేపున వేసుకొని చెవులు బ్రద్దలయ్యేటట్లు వాయించుతూ ఈదాసర్ల పోరుపడలేక కొంపవెక్కితే అక్కడికి తయారవుతారు. మంత్రివుండే రాజును రాజ్యాన్ని ఇట్లు చేస్తారు ఇకమంత్రిలేని రాజు నేమనవలె రామరామా వీళ్లరాపిడీ రాపిడికాదు పొమ్మనండి తొందరగా పొమ్మనండీ అన్నది సరోజ చిరునవ్వు నవ్వుతూ.

రాము ఒకనిట్టూర్పు విడచి నిరాశతో నియమమునకు లోపడి అయ్యా దాసర్లూ రేపురాత్రికట రాండీ కంతుజయంత వసంత పవనులేకాదు మిమ్ముల పుట్టించిన శ్రీకాంతుడువచ్చినా కాదంటే కాదు. లేదంటే లేదు. హిందూమత సిద్ధాంత ధర్మకర్మములన్నిటకు దావుయిచ్చినది ఇంక మీకాకట్లు ఇక్కడవాగవు కాదనివాగితే కంటనీరు కాల్వలైపారుతుండ పాదముల శిరము నాశ్రయిస్తుంది అటుపై మీరూనేను కట్టగట్టుకొని నష్టేటముమునకవలసినదే పోండి వేళమీరిపోతుంది ఆర్యధర్మదూరులై పండుగ పర్వముల లెక్కింపక హిందూ సాంప్రదాయములకు లోపడక సూర్యార్చనా దైవధ్యానా సమయముల గమనించక బ్రహ్మముహూర్త కాలమును మైథున నిద్రాహార ముహూర్తముల కుపయోగించు వారనేకు లుంటారు. వారు కావలసినంతా భిక్షపెట్టుతారు అక్కడికి పోండి తెలియవి

వారికడ తెలిసి మనోనిగ్రహము లేనివారియెడ మీజాకట్లు బాగావాగుతాయి అక్కడ కొదువపడిన జోలె యిక్కడ నిండుతుందిపోండి. మాఇల్లాలు మనస్సురాయి పెరగదూ విరుగదూ పెరవారిమాట వినదు. పట్టిందేపట్టు పెట్టిందేపెట్టు మొండిపట్టు పట్టితిరా మీకుఇదివరకయిన మంగళహారతులు తక్కువ ఇప్పుడెక్కువా ముక్కోటి దేవతలకు మూలపురుషుడు ఈమెకు ముఖ్యబంధువు. కాదంటిరా మీఉద్యోగము లుండవు పొండి అని సరోజ ముఖముచూచి ఏమి ఇంకా ఏమయినా చెప్పుతావా చెప్పు అన్నాడు రాము.

చెప్పు మీవల్ల ధర్మరహితులైపోయి మానవులూ కడకు దేవతలూ పండుగ పర్వదినాల్లో మిల్లెడునూనె నెత్తినపెట్టి పట్టమని చెంబెడునీళ్లుపోయ ధర్మపత్నిలేని మొగోళ్లు సన్యాసివాళ్లు ఇదిగో గుడ్డ ఇదిగో పూలు ఇదిగో పండ్లు అని చేయిసాచు మొగవాడు పండుగపర్వాల్లో పూరతిరుణాల్లో పదిమందీ వచ్చుగుంపే నీకూపట్టమను మొనగాడు లేక కంటతడిపెట్టు ఆడవాళ్లు ఉన్నారు. ఇక్కడికిచాలు పొమ్మని చెప్పు అధర్మాలకట్ట యిక్కడ వంచవద్దనిచెప్పు ముందుజన్మలో ధర్మాలకు కట్టుబడి దైవార్చనచేసిన వారిదే ఇప్పటికాలం. ఇప్పటిజన్మలో ధర్మానికి కర్మానికి కట్టుబడి దైవాన్ని నమ్మి తిరిగినవారిదే ముందుకాలంఅని తెలుసు మీవాలకం మీ జాలకం ఈవీధినే కుమరదు పొమ్మను అన్నది సరోజ.

ఏమండయ్యో విన్నారా ఇంకిక్కడవుంటే మీకుమానంలేదు కాదు కూడదంటే ఓకుమానంలేదు పొండి అన్నాడు రాము.

పట్టి తలతనప్రక్కకు త్రిప్పుకొని శ్రీరామ జయరామా అని పాటపాడుతూ తలపై నూనెపెట్టి తలంటి చేతులూ కాళ్లూ వళ్లు రుద్ది మంగళహారతిపాట పాడుతూ వసంతము నీళ్లతట్ట త్రిప్పి నొసటబొట్టుపెట్టి తట్టలో ధర్మపత్నికి ఏమిచేస్తారో వేయండీ అన్నది నవ్వుతూ సరోజ.

ఏమున్నదీ నాసర్వస్వమూ అనాడే పెండ్లినాడు ఇచ్చినానే ఇంక దేహ ప్రాణ మాన ధనములలో గుడ్డిగవ్వయైనాలేదు ఏమున్నదీ అన్నాడు రాము.

అదిగో చేతిలో ఉంగరము అదిదయచేయండీ అన్నది సరోజ.

సరేనంటూ ఉంగరముతీసి సరోజ యెడమచేతికిపెట్టి. పెట్టినందుకు ఫలం అన్నాడు రాము.

తలఅంటి హారతియెత్తి నూరువసంతములు వత్సరములు భార్యాసహితులై సర్వభోగములు సర్వదా అనుభవించుమని బొట్టుపెట్టినాను చేతులారా అపాదమస్తకము శిరస్నానముచేయించి తడివత్తి కూర్చుండబెట్టుతాను మరీవచ్చు వసంతము వరకు తమకీలాగున సేవచేసేనిమిత్తం ప్రేమపూరితముగా ఇల్లాలికి దానంచేసినారు దయితులవారు ఇంకేమికావలెనంటూ వసంతంనీళ్లు బైటపోసివచ్చి బచ్చలిలో పీట వేసి ఇకరాండీయని పిల్చి శిరస్నానముచేయించి తడివత్తి ఇకపోయి మీపని చూసుకొమ్మని తానూశిరస్నానముచేసి వచ్చి కార్యకలాపములలో దిగెను. ఇంతలో సూర్యుడు ఉదయగిరిపైన అగుపడీ అగుపడక ఉండెను. ఇరువురు పోయి కొన్ని ధ్యాన శ్లోకములుచెప్పి నమస్కరించిన తర్వాత సరోజ వెళ్లిపోయెను. రాము ఆదిత్య హృదయము అష్టోత్తరము కవచము మంత్రమూ చెప్పెను. అంతలో పాలవాడు వచ్చి అమ్మా పాలు అన్నాడు సరోజ పోయి ఆనాడు పాలుఇంకా కొంచెము ఎక్కువగా తీసుకొని కాచి ఒకగ్లాసుపాలు చెక్కెరా పండ్లూ పూలూ తీసుకొనిపోయి పీట వేసి పీటపైపుంచెను. నీళ్లు ప్రోక్షించి రాము మోకరించి తండ్రీ లోకబాంధవా కర్మసాక్షీ ఈనాడు వసంతరుతువుకు, వత్సరమునకు ప్రారంభదినము. ఇంతవరకూ చేలోటులేక కాపాడితివి నీవుకర్మసాక్షివి దుష్కర్మములపాలుగాకసత్కర్మలలో బుద్ధిచోరునట్లు గడచిన వసంతములతో నూరువసంతములిట్లే భార్యా సహితుడనై తమ్ము సేవించునట్లు మమ్ము ఆశీర్వదించుమని భగవానునికి నివేదనచేసెను. సరోజ కర్పూరము ముట్టించియిచ్చెను ఇరువురు చేతులబట్టి మంగళహారతీ శ్లోకము చెప్పుచూ హారతియిచ్చి ఇట్లే నూరు వసంతములు ఇరువురమూ నాల్గుహస్తములతో మంగళహారతి యిచ్చునట్లు దీవించుతండ్రీయని క్రిందపెట్టి పాలము భూమిసోక సాష్టాంగ దండప్రణామము లాచరించి తీర్థప్రసాదములు ఇలువేల్పుకు, ఇష్టదైవానికి పెట్టక ముందుసేవించరాదని తెచ్చి దేవునిపీటముదగ్గరవుంచి రాము దేవుని దగ్గర మాలిన్యవస్తువులతీసి తుడిచెను. సరోజ అక్కడ పరికరములతుడిచి శుభ్రము చేసి దీపములురెండూ యిరువాగులా వెలిగించెను. రాము ద్వాదశ నామార్చనచేసి ధూపవత్తులు వెలిగించి నమస్కరించి ప్రార్థనకు కూర్చొనెను. గంటకాలములో ఇలువేల్పు శ్రీరంగనాథసహస్రనామము లక్ష్మీసహస్రనామము ఇష్టదైవము శ్రీకృష్ణసహస్రనామము రుక్మిణీసహస్రనామము చేసి సరోజను చూచెను.

అయినదా అన్నది సరోజ.

ఓ అన్నాడు రాము.

పాలు చక్కెర పండ్లూ పూలూ తెచ్చి పెట్టెను సరోజ.

దేవుని పుష్పాలంకృతునిచేసి ఊదువత్తులు ముట్టించి నైవేద్యము పెట్టి మంగళ హారతియివ్వ కర్పూరం ముట్టించి మంగళశ్లోకము ప్రారంభించినాడు రాము.

నన్నుమరుస్తారా అన్నది సరోజ.

రా అన్నాడు రాము.

ఇద్దరూకలిసి మంగళశ్లోకముతో హారతిత్రిప్పి పీటపైపెట్టి సాష్టాంగ దండ ప్రణామములుచేసి చేతులుజోడించుకొని స్వామీ ఇంతవరకూ పోయినవసంతములు రెండుచేతులతో మంగళహారతి ఈవసంతమునుండీ నాల్గుచేతుల మంగళహారతి శత ఆయుర్దాయమువరకూ నాల్గుచేతులా మంగహారతి ఇచ్చులాగు ఆశీర్వదించుడు ఈవసంతమునుండీ తమకు దాసురాలై మావంశమర్యాదలకు కల్పవృక్షమై నాకు చింతామణియై కన్నబిడ్డలకు కామధేనువై కాపాడుతూ నాతో వసంతసమయముల వసంతమాడునట్లు ఆశీర్వదించుడు. తాము సేవకురాలిగా స్వీకరించుడు అని నమస్కరించినాడురాము. సరోజ రాముతోకలిసి నమస్కరించి లేచి రాముకు తాళిని చూపి ఆనాడు కట్టినారు ఈనాడు తగలండి కొత్తవసంతము వత్సరాది వృద్ధ పుణ్యాంగనలతో తయారయిన నూలుకు కూర్చబడి పచ్చటిపసపుతో పూయబడి మున్నుకట్టిన వారితో కట్టించుకొనవలసిన వసంతం ఇక్కడ వృద్ధనారు లెవరూ లేరు ఇంటికిపోయిన వెనుక అత్తగారితో తయారుచేసుకుంటాను వృద్ధ పుణ్యాంగ నలు శ్రీసూక్తముతో నూలువడికి సరడుతయారుచేసి ముత్తయిదువులకు దానముచేసే రోజులంతరించినవి తయారుచేసి ఇవ్వవనిపసపుకుంకుమ తాంబూలం పూలు పండ్లు ప్రతి ఇచ్చి పాదములంటి నమస్కరించు ముత్తయిదువాలేదు. అరువది ఏడులు దాటిన ముత్తయిదువకు నమస్కరించుటవల్ల ముత్తయిదుతనం అభివృద్ధియౌనన్నారు వారిని స్త్రీపురుషులిరువురూ గౌరవించవలెనన్నారు. తగలండీ తాళిని తగలండీ అని రాము చేతులతగిలించి దేవుని తట్టుమళ్లి దయామములారా కట్టిన ఈతాళిగట్టిగా ఈవక్షోజములపై నూరువసంతములు చిందులాడునట్లు ఆశీర్వదించుడని నమస్క రించి రాము పాదములకు నమస్కరించెను.

రాము రెండుచేతులా పట్టి లేపి కట్టినతాళికి చెప్పి కట్టిన చేతులమరచితివా అన్నాడు.

సరోజ చిరునగు వంకురింపు ముఖముతో అయ్యోపురువలేదు కట్టినతాళికీ కట్టినవారికీ కన్నబిడ్డలకు కన్నులక్కడనే ఆనందములేనని చిరునవ్వునవ్వి చేయిపట్టెను.

రాము తీర్థమిచ్చి పుష్పముల తానే శిగలోవుంచి పండ్లు చేతిలోవేసెను.

సరోజ కన్నులకద్దుకొని పండువల్చి సగముతుంచి రాము నోటికందిచ్చి సగము తాను నోటిలో వేసుకొని పోయి కాఫీ తెచ్చియిచ్చి సూర్యప్రసాదాన్ని మరచితిమని పండ్లను పట్టుకవచ్చి సగము రాముకిచ్చి సగముతాను తీసుకొని పోయి వంటకార్యములో పాల్గొనెను.

రాము కాఫీత్రాగి సరోజకు వంటకార్యములకు సహాయమైపోయి నిలచుకొని వంటపనుల్లో ఒంటిపిట్టనై జంటలేదనీ వంటకాదనీ నిలచుకుంటూవుండే పిట్టకు జంటపిట్ట వచ్చిందిచెప్పు పనిచెప్పు ధీరుణ్ణై మగధీరుణ్ణై ధీమాగాచేస్తానన్నాడు రాము.

సరోజ తలఎగరవేస్తూ చిరునవ్వునవ్వుతూ చేస్తారూ. ఇల్లాలిని ఆడిస్తారూ పాటలపాడిస్తారూ ఆటలఆడిస్తారూ పలుకుల పలికిస్తారూ పకపకనవ్విస్తారూ అని పకపకనగి ఆడించడంలో పాడించడంలో ఉప్పూ కారం మరచితే పదం మార్చరుగదూ పాపంవద్దులేండీ వద్దనేకూర్చోండీ పిల్లలు తల్లులను పడుచుపిల్లల పడుచువారు వంటశాలల్లో వెంటవెంటనే తిరుగుతుంటారన్నారు. అట్లనే ఉంది అన్నది సరోజ.

అయ్యో జిహ్వోపస్థా చాపల్యాలు లేనివారెవరు పిల్లావచ్చేదే పెద్దావచ్చేదే అధరపానం పెద్దకూ, క్షీరపానం శిశువుకూ ఇచ్చి కడుపుచల్లజేసి సాగనంపే కామ ధేనువు వంటగదిలో వుంచే వెన్నంటి కాళ్లకుచుట్టుకొనక యెక్కడపోతారు అంటూ వంకాయలు తరుగను ప్రారంభించినాడు రాము.

సరోజ నవ్వుతూ తలయుచుతూ దోసకాయలు తరుగుతూ పాట ప్రారంభించినది.

పాటచాలించి నవ్వుతూ అంతంతవప్పులా అన్నది సరోజ.

ఒప్పులేనే పెద్దగా వుండవలసినదీ. తప్పులుంటే తన్నులే వప్పులు పెద్దగా ఉండవలె ఒప్పులు తీసుకొని తప్పులుపారవేస్తాములే అన్నాడు రాము.

ఆవప్పులు చిన్నవికొన్ని పెద్దవికొన్ని ఉన్నవి. చిన్నవి ఉడికేటప్పటికి పెద్దవి ఉడకవు పెద్దవిఉడికేటప్పటికి చిన్నవిచెదిరిపోగలవు సామాన్యముగా తప్పులేఅగు పడేది తప్పుచేసేదిమీరు తన్నులుతినేదినేనూనా ధర్మమేనా అన్నది సరోజ.

పప్పులు తప్పులుగా తప్పులు పప్పులుగా వాదించను వకీలు ననుకున్నావా నాకూయమదండన భయమున్నది మళ్లీజన్మ ఉన్నదనేనమ్మకమూ ఉన్నది నాదియూ నీదియూ తప్పు అని తెలుసుకునే బుద్ధీవున్నది.

క॥ తప్పులెన్నువారు తండోపతండంబు
ఉర్విజనులకెల్ల నుండుతప్పు
తప్పులెన్నువారు తమతప్పులెరుగరు
విశ్వదాభిరామ వినురవేమ ॥

అన్నాడు వేమనార్యుడు. నాతప్పునేనూ నీతప్పునీవు ఆలోచించి తెలుసుకొని వప్పుకుంటే సంసారంచక్కగా చల్లగాసాగిపోతుంది తప్పుచేసి కాదని సమర్థించు కొన చూచితిమా సాలుచెడి మూలవుంతుది సంసారం చట్టుబండౌతుంది అయినా ఇవన్నీ యెక్కడనేర్చినావే అనుభవము పెద్దగావున్నట్లుందే ఉన్నట్లుండి ఉంగరము కొట్టేసినావు చూడు అన్నాడు రాము.

సరోజ ముఖములో హేళనా లాలనా సమ్మేళనచేసి లావణ్యమయిన మాట లతో ఊ ఉంగరమూ బొంగరమూ ఈ ఉగాదినుండీ వచ్చే ఉగాదివరకూ తమకు సేవచేసేటందుకు కూలితీసుకున్నాను. సేవకులకు జీతము ఇవ్వడములేదూ ఆ సేవ కులు కష్టమొస్తే పారిపోతారు సుఖముంటే వుంటారు. ఈసేవకురాలు కష్టాలకు సుఖాలకు అవుతూ ఆజ్ఞానువర్తియై తొణకకుండా వణకకుండా ఉండవలెనుగా వత్స రాది ప్రతిపండుగకు మాఅమ్మ పండుగనాడు దానం అని అడిగి వడిబట్టితే పొర్లుదో సెడు రూపాయలు మానాన్న పెడ్తాడు. మాఅమ్మచుట్టూ పిల్లలందరమూ చేరి నాకు నాల్గు నాకయిదని పీక్కతింటాము. యెవరికీయ తగినంతా వాండ్లకిచ్చి పనిచేసే వారికి ఇంటిసమీపముఖవున్న బీదసాదలకు పండుగరోజులో యేమైనాతెచ్చుకొని తినం డని చేయిసాచుతుంది. దేవునికి కొంతయిస్తుంది మిగిలినది సంవత్సర పర్యంతమూ దాచి అప్పుడప్పుడూ ఈలాంటి ఖర్చులకు వాడుకొంటూ వుంటుంది. ఈనాడు మన మక్కడవుండిన తెలిసివుండును. నాకేవీ దోసెడురూపాయలు ఈసంవత్సరాదినాడు బీదలుకూడా భార్యా పిల్లల సంతోషపెట్టుతారు. లేనివారు ఇరువురు కలిసి కలిపి

కన్నీరు కన్నబిడ్డలపై నిడుస్తారు. ఈనాడు ఇట్టివారినెరిగి గుప్తదాన మిచ్చినవారే పుణ్యాత్ములు లోభులు అవివేకులు ఆలుపిల్లల ఈనాడుకూడా సంతోషపెట్టిక మరు జన్మకు పండుగరోజుల్లో పట్టుమని పట్టెడన్నము పెట్టువారులేక నాయనువారులేక చావిళ్లలో సత్రాలలో పడీ కన్నగచాట్లు పడతారు. అందుకై తమతో దానము తీసుకున్నాను. మరుజన్మకు కూడా తమవెంటనే ఉంటాను అని వాల్గన్నుల తళుకు రాముపై బరపినది సరోజ.

శహబాష్ చంపేసినావు పండుగ పర్వతములాగా అడ్డములేకుంటే పైబడ చేసినావు దాసర్లు తిరుగుమజిలీ అయ్యేలాగు చేస్తావు అన్నాడు రాము.

దాసర్లకుదాపిస్తే ధర్మాలుదాటి కర్మాలుతెస్తారు. కర్మాలుకన్నీళ్లతోగాని దాటవు. ధర్మాలు దాటేదెందుకు కర్మాలకు చోటిచ్చేదెందుకు కన్నీళ్లుకాలవలై పారేదెందుకు ధర్మానికి బద్ధులుకాండీ ధర్మపత్ని దాపున్నేవుంది కాలము ముందు వుండనేవుంది దాసర్లదాడికి భయమెందుకూ, దార ఉందిగా ధైర్యంగా నిల్చుకోండీ వెన్నిచ్చి పరుగెత్తి పారుబోతు అనిపించుకోకండీ అనినవ్వినది సరోజ.

వారిదాడికి హరిహర బ్రహ్మాద్యమరులుకూడా ఓర్చుకోలేక ఒక్కొకరికి ఒకరినీ ఇద్దరినీ ముగ్గురినీ అపుకొరకై అంగరక్షగా ఉంచుకున్నారు. బ్రహ్మ నావలె ఒకరినే ఉంచుకున్నాడు. హరి భూనీళల. హరుడు గౌరీ గంగల ఉంచుకున్నారు. ఇంక దేవతలు దానవులు మానవులు దాడీ జరిగినప్పుడంతా ఒక్కొకరి మరుగు చేరినారు. ఇకమునులన్ననో రాజ్యము మదనసామ్రాజ్యము విడచి అడవిలో ఘోరముగా తపస్సుచేస్తున్న విశ్వామిత్రుడు అప్సరస మేనకలా ఆటా పాటాచూచి దాసర్లదాడిని వెరచి మైమరచి తపస్సువిడచి ఆమె మరుగుజొచ్చి శకుంతలను పుట్టించినాడు యేటియొడ్డున జెట్టివలె కోకను మొలవరకూ ఎగజెక్కి దట్టీ కోకవలెపైటను నడిమికిచుట్టి పసిడిబొమ్మవలె నిగనిగలాడు పడుచుపిల్ల మత్స్యగంధినిచూచి వృద్ధపరాశరులవారిబుద్ధి హద్దుమీరి వద్దకీడ్చి ముద్దులాసించి తపోవ్యయమును లెక్కగొనక ఆమెకోరినకోర్కెల దీర్చి కడకు వ్యాసుని పుట్టించి లోకమున ఉదాహరణ కెక్కించినారు. దాసర్లబలం తెలుసునా ఇంద్రుడు పెండ్లి పీటలపై బంగారుబొమ్మవలె కూర్చొనియున్న అహల్యనుచూచి కంగారై పండ్రెండు సంవత్సరములు కామాగ్నికి క్రాగి క్రాగి దుఃఖమనుభవించి కడకు తెగించి గురుపత్నియనిలెక్కింపక ముందువెనుకలరయక హరునిచెంతకేగు మరునిభాతి దాసర్లకు

దాసుడై మోసమున అహల్యను గూడి, గౌతమ శాపదగ్ధుడై కీర్తి గౌరవముల గోల్పోయి అంగహీనుడై లోకమున ఉదాహరణకునిల్చెను. ఇట్టివారేఇట్టిట్లైఉంటే ఇక ఈ దాసర్లు యోగుల మునుల మాకోటి భోగుల బ్రతుకనిస్తారా ఆడవారి అపులేకుంటే నష్టేట దమికినడనుకా వెన్నంటుతారు అపు దాపు నీవే నన్నాడు రాము.

అపూ దాపూ ఉన్న అంగనకు బంగరు ఉంగరమేనాగతీ దోసెడు రూపాయలేమయినా ఉన్నవా అన్నది సరోజ.

ఈ విషయంనాకు తెలిసివుంటే దోసెడు రూపాయలెందుకు కనకాభిషేకమే చేసివుందునన్నాడు రాము.

కట్టుకున్నదానికి కనకాభిషేకంచేసే కరుణాసుయులులదుడు. పెట్టుకున్న దానికి చేసేపెద్దలున్నారు. ఇప్పటికి ఉంగరమేచాలు ముందువచ్చేపండుగకు ముందులిచ్చి కొంగుబట్టి దానం అంటాను కొంగునిండుగా వేయండీ అన్నది సరోజ చిరునగు నగుతూ.

కాసులతో కనకాభిషేంజేస్తా విడుస్తారా పూర్వగాధలు పుణ్యకథలూ పండుగలూ పర్వాలూ అనుభవముచెడి చెప్పేడివారులేక చెడిపోవుచున్నవి. చెప్పేడీ వారుండిన విని అచరణలో ఉంచుకోగలవారు కొందరైనా ఉంటారు. అడిగేవిధానం ఆచరణావిధానం మరచి అందరూ చెడిపోవుచున్నారు. నీశక్తికొలదీ ఈవీధిలో అడవారికి చిన్నపిల్లలకూ దీపం కొంచంపెట్టు చదువున్నది స్వార్థమునకేకాదు పరార్థమునకూ పారమార్థికమునకూ పంచవలయు. పీది సంస్కారమైతే ఊరూ. ఊరు సంస్కారమైతే ఉన్నప్రదేశము అన్నారు. అది అట్లుండనీ మనయింట పనిచేసే వారికి మనమేమీ యివ్వలేదే అన్నాడు రాము.

ఈనాడు ఇస్తే యేమిఫలమని నిన్ననే ముట్టచెప్పినాను వారి అశీస్సులు నీకూ నాకూ ముందే అయినవి అన్నది సరోజ.

ఏమి ఆశీస్సులన్నాడు రాము.

నేను మనయింట పనిచేసే వాళ్లిద్దరినిపిలిచి అవ్వా రేపుపండుగగదా అన్నాను అంతలో దీనముగా ముసలిది ఔనుతల్లీ పండుగవచ్చేది బీదల యేడ్పుకొరకే మాకేమి పండుగతల్లీ మహారాజులనందరినీచూచి మనసు పాడుచేసుకొనను. పిల్లల తల్లడపూచి

కాళ్లుచేతులు చల్లపడను అన్నది. అంతలో నేను చేరి అయిదు రూపాయలు యిచ్చి యేమయినా తెచ్చుకోండీ అన్నాను. వారు రెండుచేతులు యెత్తి దండము పెట్టుతూ ఆలుమొగళ్లిద్దరూ చల్లగా పంచిపిల్లలగంటూ నూరేండ్లు బ్రతుకండితల్లీ మా ఆయుర్దాయము అంతా ఇచ్చేవైనముంటే మీకే యిత్తుముతల్లి యెందుకు మెండిబ్రతుకు నాకొక మనవడున్నాడు ఒకచొక్కా పట్టించమని శ్రీమపెట్టుతూ వున్నాడు.. పట్టించను యే వీలూలేక వానిబాధ చూడనూలేక ఏసిగిపోతూ ఉన్నాను. తమరు నిన్నా మొన్నా వచ్చినవారు అడుగుటకు నోరాడలేదు అయ్యగారు మొన్ననే జీతము యిచ్చినారు. వారిని అడుగుటకు మనసొప్పలేదు తల్లి. నాభారం తొలగించినావు పిల్లవాని ఆనందమంతా నీదేనమ్మా ఈఇంటిలో బాడుగకుఉన్న వారికందరికీ కష్టంచేసి నాము నయాపైసా చేయిసాచినవారులేరు కడకు వారుపోయేటప్పుడు నెలజీతం కూడా యివ్వకపోయినవారుకూడా ఉన్నారు. యిల్లుకట్టుకొని ఉన్నలక్షాధికారులూ ఉన్నారు. ఎందరికో సేవచేస్తూఉన్నాము. కనికరముంటే కన్నతల్లిలేదు పనిచేయ లేదని విదిలించే యిల్లాలేఉంది నీకుదీవలబాధ బోధపడింది తల్లి పైసానో నయా పైసానో యిస్తేరేపుయిచ్చేవారిని చూచినాముగాని పండుగకన్నా ముందేయిచ్చి యేమయినా తెచ్చుకోపొమ్మను పరమ పావనిని చూడలేదు. నీయిల్లావళ్లూ చల్లగా వుండనీ తల్లీ అని దీవించినారు పాపము అన్నది సరోజ.

మంచిపని చేసినావు పదిరూపాయలు మనకుపెద్దకాదు అవివారికి యెంతో ఆనందపరుస్తాయి సంతోషసమయాల్లోకూడా దుఃఖాలెందుకు పాపము పోనీ మంచిపనే చేసినావు రాజులేకున్నా మంత్రి సామర్ధ్యముగా రాజ్యము నడిపించ గలడు అందుకు సంతోషించవలసినదే మానవుడు పుట్టినది వుపకారార్థమే అప కారము చేయుటకొరకుగాదు అన్నీచదివిన అయ్యగారలే అవినీతికిపాల్పడి అపకార ములకు పాల్పడుతాడు లోకములో చదివినదొంగలే ఎక్కువగుతున్నారు వీరికన్నా చదువనిదొంగలే కొంతనయం సరోజా మాటలు మాట్లాడుతూనే సగము పనిచేస్తివే శేహబాష్ అన్నాడు రాము.

మీపనిలో మీరు చాకచక్యముచూపుతూ వుండలేదా యిదిమాపని చాకచక్యం మాకుండక మీకుంటుందా మాపనిమేమూ మీపనిమీరూ చేసుకుంటే బాగుంటుంది విడిబడితే యిడుములే విడిబడి కార్యములు నడుపవలెనని యిప్పుడు చూస్తున్నారు. కొంతదూరము సాగితేగానీ తెలియదు అగ్నిని ఆజ్యాన్ని ఒకచోటబెట్టి కరిగేవు అంటున్నారు ఈరీతిగా లోకముముందుకు సాగవలెనని వ్యాసభగవానుడన్నాడని

గ్రహగతులట్లున్నవని మా ఆచార్యులవారు అంటూ వుంటారు. లోకమెట్లో గ్రహగతులననుసరించి పోతావుంటుంది లోకము పోకడతో మనకేల నన్నదిసరోజ.

సూర్యునిదగ్గర అంనేజయులు తయారయినట్లు ఆచార్యులవద్ద బాగాతయారయినావు. ఈమాటలు నీవుమాట్లాడినావంటే లోకము అనుమానిస్తుంది పదునెనిమిది ఏడుల పిల్లవు నీవెడా ఈధర్మాలకట్ట లెక్కడ ఏంత అన్నాడు రాము.

అయ్యో చదివేదానికన్నా వినేదేగొప్పది ఎన్నోచదివి ఎంతో శ్రమపడి ఆర్జించిన విజ్ఞానాన్ని గంటకాలములో క్లుప్తముగా ఎల్లరకూ తెలియునట్లు చెప్పగలరు అదిజ్ఞాపకముంచుకున్నవారు మరువక అక్కడక్కడా సమయస్ఫూర్తిగా ఫలానావారు వకప్పుడు చెప్పిరని వాడుతుంటారు మరొకరు ఏదోహూత్రై తామేచెప్పుచుంటిమని తాళాలువేస్తారు వీరికిముందుగతులుండవు.

శ్రీరామకృష్ణ పరమహంస నాకు యెందరో గురువులు చెప్పలేనంతమంది వున్నారన్నారట ఒకనాడు పరమహంసగారు పోతూవుండగా ఒకగ్రామములో దేవునివుత్సవములో ముందుదేవదాసీనృత్యము మంగళమేళధ్వనులతో వస్తూ ఉండగా ప్రొద్దుపొడుచువేళలో పిల్లునమ్ముఎక్కుపెట్టి చెట్టుక్రింద అణిగి అణిగి పోతూ ఉండ, పరమహంస వానిజూచి అప్పా ఓఅప్పా అప్పా అని పదిమార్లు పిలిచినా వాడుపలుకక లక్ష్యము విడువక గువ్వనుకొట్టి అదిపడిన తరువాత వెనక్కు తిరిగి ఏమయ్యా అట్లవాపోతావు ఏమి అన్నాడట కోపగించుకున్న విధముగా. పరమహంస వానిలక్ష్యము పంచేంద్రియముల ఏకాగ్రత పట్టుదలచూచి అర్థముచేసుకొని చేతులుజోడించి గురూ ప్రక్కన మంగళతూర్యారవములు మోగుతూ ఉండినా జనసమ్మర్దమునగలుగు ఆరవము చెవులు బద్దలగుతుండినా వైభవోపేతముగా దేవుడు ఉత్సవము అవుతుండినా దేవదాసీ నృత్యము జరుగుచుండినా నీలక్ష్యము వ్యర్థముచేసుకొనక గువ్వనుకొట్టినావు నీవు నాకిప్పుడు గురుస్వరూపుడవైనావు నీవు లక్షముతో గువ్వను కొట్టినట్లు నేను నాలక్ష్యముతో నాగువ్వను కొట్టుటెన్నడో లక్ష్యములోగల బలమిట్టిదని నాకునిరూపించి చూపుటచే నాకుగురువయినావు. నిన్ను ఎప్పటికీమరువను. ఇక నాగువ్వను కొట్టగలనని నాకునమ్మకము గలిగినది అన్నాడట. వీరుపలానావారని వాడుతెలుసుకొని పరమహంస పాదములపైబడి నమస్కరించి స్వామీ పాపము చేసినాను చేయుటలో దైవముయెదుట చేసినట్లు తమయెదుటనే చేసినాను క్షమించి మంచిమార్గముచూపి నాకు మార్గదర్శివై నడిపించు తండ్రీ అన్నాడట.

అదిచూచి వానిమాటలువిని పరమహంస నాయనా లోకమునగల సర్వ ప్రాణులకు బ్రతుకుపై ఆశ ఉన్నది అలా పిల్లలూ ఉన్నారు వారిపై ఆశఉన్నది. వాటె ఆశల వ్యర్థముచేసి నీఆశలు తీర్చుకొనుటకన్నా అందరూ పోవు సాత్విక మార్గములో నడచి జీవద్రోహముచేయక అహింసా పరమోధర్మయని ఆర్యులమాట చేయూత తీసుకొనిపో అందరూచేరు గమ్యస్థానమేమో అదిసిద్ధిస్తుంది ఇదీనాయనా మార్గము అన్నాడట. మార్గమధ్యములోగాని సభలోగానీ ఒకమాట ఒకరివల్ల విన్నది నేర్చుకొని దాచుకున్న అమాట మరొకచోట వాడుకొనునప్పుడు వారిజ్ఞాపక మగుతారు వారిని మరువరాదు గ్రంథములుకూడా అంతేనన్నది సరోజ.

ఇంతలో పనిపూర్తిఅయినది రాముచేతులు కడుగుకొని వచ్చి అంతా అయి నట్లేన అన్నాడు.

ఇదంతాతమదయ తమసహాయములేకుంటే ఒంటిగంటఅయ్యేది దారకు ధపుడు దాపూ ప్రాపూ అయినందున వంటచేసినట్లు లేకుండా ఆయాసములేకుండా కష్టమగు పించకుండా ఆనందంగా తయారైపోయింది ఇంక మీపని కానివ్వండీ అన్నది సరోజ.

ఆలిమీద అధికారముందని అవసరిస్తూ కటకటపడుతూ కాళ్ళకాలినపిల్లిలాగా వంటఇంటిలోకి బైటికి తిరుగుతూ గుటికలు మ్రింగుతూ కండ్లెఱ్ఱజేస్తూవుండే రకం కాదు జీవమర్యాదతెలుసు చేస్తున్నారాలేదా ఈపని ఎంతపని అనేజ్ఞానం బుఱ్ఱలో ఉంది ఆడపనిలో మొగపనిలో అందెవేసినచేయి. ఆలికి అమ్మకేకాక యితరులకు కూడా సహాయముచేసే సాత్వికహృదయునే. ఇల్లాలికి తన్నికి సహాయమివ్వక మరె వ్వరికివ్వమంటావు. ఈదేహం అమ్మకొరకు ఆలికొరకే ఉండేది. ఎందుకున్నదీ ఈదేహం బాగాతెలుసు నన్నాడు రాము.

భారతవీర భారతం బాగాచదువుకున్నారు ఆర్యధర్మములన్నీ అప్పే ఉట్టి పడి నోటవస్తూ కార్యరూపముగా కన్పడుతున్నవి ఇంక అమ్మా అలా బ్రతికిపోయి నారు అవతల పనికానివ్వండీ అంటూ సరోజ కాళ్లూ చేతులుకడుగుకొని వచ్చి నొసట బొట్టుపెట్టుకొని పోయి యజ్ఞేశ్వరునికి సమర్పించి నమస్కరించినది.

రాము ఇలువేల్పుకు ఇష్టదైవానికి అష్టోత్తరములు చెప్పుచూ పూలమాలలువేసి ద్వాదశనామములతో అర్చనచేసి ఇక నైవేద్యముతెస్తావా అన్నాడు.

త్రిదేవీస్తోత్రములు చెప్పుచూ సరోజ అన్నివంటకముల తెచ్చిపెట్టి గంధము పసపు కుంకుమ తాంబూలం పచ్చిపసపుకొమ్ములు పండ్లు తట్టలోపెట్టి వస్త్రములకు కొసల పసపుపట్టించి పీటలపైన పెట్టినది.

రాము గంధము దేవునికి పెట్టి ఊదువత్తులు ముట్టించి ఇంకా కొదువవేమీ అన్నాడు.

శక్త్యానుసారముగా లభ్యమయినవి చేసినాము పెట్టినాము అయ్యో మరచినాను అన్నీ అయినవెనుక ఆజ్యం అన్నారు అని నెయ్యివేసి పాలుతెచ్చి పెట్టి ఇంకేమీ లేవండీ ఈరెండే మరచినాను అన్నది. సరోజ.

చూచినావా మరచినా మరువనివ్వడు భగవంతుడు మానవునికి మరువు వున్నదిగాని భగవంతునికి మరవులేదు ఈనాడు మనము ఒకతప్పుచేసినాము అందువల్ల నీకామరువు గలిగినది ఈపదార్థాల్లోకూడా కొంచెము పొరపాట్లు ఉండవచ్చు ఆతప్పు నాకిప్పుడు జ్ఞాపకమునకు వచ్చినది ఊరందరిపెంటా ముందు పెట్టుకొని ఊరేగినాము వంటచేయునప్పుడు దేవతాదర్శనమునకు పోవునప్పుడు దేవాలయములలో దేవునిసమీపములలో త్రిసంధ్యలలో హరికథాకాలక్షేపములలో దైవప్రార్థనచేయక ఏకమనస్సుతోనుండక వ్యవహారములు గృహకల్లోలములు ఊరివాళ్లసుద్దులు చెప్పుకొనరాదు. చెప్పుకొనుటచే భుక్తి ముక్తి చెడిపోవునన్నారు దైవస్తోత్రముమరచి దానవులవి మానవులవి మన్మథులవి తెచ్చి పెట్టుకున్నాము. నన్నునీవూ నిన్నునేనూ చూచుకుంటూ మైమరచి దెబ్బతిన్నాము. ఏదో ఈవంటలో వైనంతప్పివుంటుంది ఇక మరచిపోవద్దు అన్నాడు రాము.

తాముకదండీ తారుమారుచేసింది నిత్యమూ వంట అయ్యేలోపల త్రిదేవి సహస్రనామములు మూడూ అవుతూవుండెను. అంతలో తమరువచ్చులోపల త్రిమూర్తుల అష్టోత్తరాలూ అష్టకాలూ అయిపోతూ ఉండెను. ఈనాడు అన్నీ లోపించినవి యేమిచేయమంటారు అన్నది సరోజ.

రాత్రికి వంటచేసేపనిలేదుగా సాయంత్రం ఈకొరత తీర్చుకో తప్పును వారొప్పుకొనక మరెవ్వరొప్పుకొనవలె నంటూ ఇష్టదైవానికి రెండుటెంకాయలు కొట్టి పెట్టి నివేదనచేసి కర్పూరము వెలిగించినాడు రాము.

సరోజపోయి తానూతట్టను పట్టుకొన్నది మంగళ శ్లోకముతో మంగళహారతి ఇచ్చి క్రిందపెట్టి సాష్టాంగ దండప్రణామముచేసి లేచి చేతులు జోడించుకొని దయామయులారా పురాణదంపతులారా ఇలువేల్పువై మీరూ ఇష్టదైవమై వారూ మావంశ వృక్షరక్షకులై మీరూ జీవిత జీవనరక్షకులై వీరూ సర్వదా కాపాడ ప్రార్థిస్తూవున్నాను. దంపతీసమేతముగా ఆతిథ్య మివ్వడములో ఈవసంతమే ప్రారంభము. ఇట్లే దంపతీసమేతముగా పోయినవాటితో నూరు వసంతములు

మిమ్ము అర్చించి ఆతిథ్యమిచ్చులాగు ఆశీర్వదించుడు అర్చనావిధానములో నన్నా అతిథ్యమిచ్చిన పాకవిధానములో నాభార్యను తప్పులున్న క్షమించ ప్రార్థిస్తున్నాము అని రాము నమస్కరించి ఊ కానీ నీవూచెప్పుకోమన్నాడు సరోజను.

సరోజ చేతులుజోడించి జగదుద్ధారకులారా జననీ జనకులారా పోయిన వాటితో నూరువసంతములు పతీసమేతముగా ఆయురారోగ్యభాగ్యములతో పుత్ర పౌత్రాభివృద్ధితో ధర్మబుద్ధితో తమకు అతిథ్యమిచ్చులాగు ఆశీర్వదించుడు మనో వాక్కాయకర్మలు ఏకీభవించి తమయందు నాపతియందు నిల్చునట్లు నన్ననుగ్ర హించి దీవించుడు అని నమస్కరించి లేచి అపరాధములు క్షమింపుమని చెంపలు వేసుకొని రాముకు తలపాదములు సోకులాగ మోకరించి నమస్కరించినది.

రాము చేతులు పట్టుకొనిలేపి శ్రీఘ్రమేవ సుపుత్రాప్రాప్తిరస్తు అని దీవించి చిరునవ్వు నవ్వుతూ తీర్థప్రసాదములిచ్చి తానూతీసుకొనెను.

సరోజ ప్రసాదము రామునోటికి కొంచెము అందిచ్చి మిగిలినది కన్నులకద్దు కొని నోటిలో వేసుకొని పాకపదార్థములు ఎత్తిపెట్టి ఒకబుట్టలో పూజా ద్రవ్య ములు ఉంచి దేవునికిపెట్టిన క్రొత్తచీరకట్టి క్రొత్తరవికనుతొడిగి దేవాలయానికి పోయి వసామా అన్నది.

సాయంత్రము పోతే సరిపోదా అన్నాడు రాము.

మనము భోంచేసి నిక్కి నీల్గి పోతే సరిపోతుందంటారా సాయంత్రం పోయేది మంచిదికాదు. పనీ పాటా చూచుకొని వంటావార్పూ చేసిపెట్టి బాగా అలంకారాలుచేసుకొని రాత్రికి పోయి దేవునిసేవించుటకన్నా ఉదయమేకానీ భోజ నమునకన్నా ముందుకానీ దేవునిసేవించుట శ్రేయమన్నారు. వత్సరాదిపండుగ నాడు కూడా ఇట్లు ఏందుకుచేయవలె పోయివస్తాముపదండీ అని బుట్టచేతికి తీసుకు న్నది సరోజ.

జడకూడా వేసుకొనలేదే కొనముడితోనే పోదామా అన్నాడు రాము.

జడవేసుకొని పూలుపెట్టుకొని సొత్తులు అలంకరించుకొని దాపుడుచీరలుకట్టు కొని సర్వాలంకార భూషితయై పోయినకానీ భగవంతుడూ భగవతీ చూడరనియా గౌరవమర్యాదలకు లోపమనియా దేవతాదర్శనమునకు పోవువారు అట్లుపోవరాదు ఒకవిధమగు వేషముతో భక్తి శ్రద్ధలతో పోవుటే క్షేమమన్నారు ఈవేషమేచాలు పోదము పదండీ అని నవ్వినది సరోజ.

సరేపద యని క్రొత్తపంచెనుకట్టి కుందువాపంచెను పైనవేసుకొని తాళము చేతికి తీసుకోనగా సరోజ రామును చూచి డబ్బుతీసుకొండి అన్నది.

ఎందుకన్నాడు రాము.

వక్కరూపాయి మంగళహారతికి హారతిలో వేయడమునకు అక్కడ బీదలకు వేయడమునకు పూలమాలలు కొనడమునకు కొంచెము దేవుని నిత్యకైంకర్యములకు మన సంవత్సరార్జనలో తమకు బుద్ధిపుట్టినంతా అర్పించి నమస్కరించడమునకూ అన్నది సరోజ.

సరేననిరాము పర్సు చేతపట్టుకొని ఇంటికితాళమువేసి ఇరువురూ కేశవాలయమునకు పోయి రెండు పూలమాలలు కొని ధ్వజస్తంభము దగ్గరసాగిలబడి నమస్కరించి గర్భాలయ ప్రదక్షిణముచేసి మంగళహారతి టికెట్టుకొని గర్భగుడిలో ప్రవేశించగా అర్చకుడు తట్టను తెచ్చిపెట్టినాడు రాము మంగళహారతీ టికెట్టీ ఇచ్చినాడు.

సరోజ టెంకాయ పండ్లూ పూలూ తాంబూలం పూలమాల కొన్నివిడిపూలు కర్పూరం ఊదుకడ్లు పెట్టెను అర్చకుడు తట్టతీసుకొని ఇరువురిచేతిలో ఉద్ధరిణితో తీర్థమువేసి చేతులుకడుగుకొని రెండుచేతులతో పుష్పములూ తులసీతగులసని గోత్రమూ పేర్లూ అడిగి సంకల్పమూచెప్పి అష్టోత్తర నామార్చనచేసి కాయకొట్టి నైవేద్యముపెట్టి మంగళహారతి ఇచ్చి మంగళహారతితట్టతెచ్చి ఇరువురముందు పెట్టెను. ఇరువురూ చేతులు మంగళహారతిపైపెట్టి కన్నులకద్దుకొని చెరివక పావలా డబ్బులు తట్టలోవేసి దేవునికి సాష్టాంగ దండప్రణామములు చేసి చేతులుజోడించుకొని కేశవా దయామయా గ్రామవాసుల రక్షింపనీవు నిన్నుసేవింప గ్రామనివాసులు క్షీరనీరన్యాయముగా ఉన్నాము. తండ్రీ ఈతిబాధలగు మారీస్ఫోటకాది ఉపద్రవములు క్రూరవ్యాధులు ఆగంతుక మృత్యువులు విషసర్ప క్రిమికీటకాది బాధలు క్రూరచోరభయంబుల వారినుండి రక్షింప నీదేవంతు నిన్ను ఆశ్రయించుకొని ఉన్నవారి కాపాడ నీదేభారము నిన్నామరువము మమ్ము మరువకుము పోయినవాటితో నూరువత్సరములు నీసన్నిధికి వచ్చుచుండునట్లు ఆయురారోగ్యములు ఇచ్చి ఆశీర్వదించు తండ్రీ యని నమస్కరించి తీర్థప్రసాదములు తీసుకొని లక్ష్మీదేవిమందిరమునకు పోయి పూజావిధానము యథావిధిగా చేయించి శ్రీవారితో చెప్పుకొన్నట్లు చెప్పుకొని నమస్కరించి అర్చకులవారిని గర్భగుడినుండి కొంచెము ఇవతలికిరమ్మని స్వామీ తమరు దేవునికి మానవులకుమధ్య యజ్ఞేశ్వరుడున్నట్లు భక్తులకు భగవంతునికి మధ్య సంధిచేయు సత్పురుషులు మిమ్ములా పూజించవలసి

నదే పట్టండనితాంబూలములో ఒకరూయపెట్టి ఇచ్చి నమస్కరించి ధర్మకర్తదగ్గరకు వచ్చి అయ్యా యీపదిరూపాయలు దేవుని కైంకర్యములకు దేవాలయ అభివృద్ధికి గాను ఈసంవత్సరము ఇస్తూ ఉన్నాను. జమలో వ్రాసుకోండి ఈసంవత్సరం మూడురోజుల జీతం దేవునికి కానుకగా ఇచ్చినాను రాబోవుసంవత్సరం ఒకపక్ష ములో రాగల డబ్బు అర్పిస్తామన్నాడు రాము.

ధర్మకర్త రాముచెప్పినట్లు దేవుని కైంకర్యమునకు దేవాలయ అభివృద్ధికని రాము పేరుఅడిగి వ్రాసుకొని అయ్యా సంవత్సరాది పండుగనాడు దేవాలయాభి వృద్ధికని ఇచ్చినవారిని ఇంతవరకూ మేము చూడలేదు. తమరు పురాతన ధర్మమ వలంభించినారు చాలా మంచి మార్గమన్నాడు ధర్మకర్త.

అవునండీ మనము మిత్రులకొరకై బంధువులకొరకై మనకొరకై ఉద్యోగాన్ని ఎన్నో సెలవులు పెట్టుతూ ఉంటాము నూరు రూపాయల జీతగానికి మూడురోజులకు పదిరూపాయలు జీతమగుతుంది భగవంతుని కైంకర్యమునకై సంవత్సరమునకు పదిరోజులు పనిచేస్తే మనకు కొదువగాదు వళ్లు అరిగిపోదు వచ్చేసంవత్సరము ఒకపక్షము చేస్తానని శ్రీవారికి చెప్పుకున్నాను ఇట్లే ఉద్యోగులు పనిచేయువారు ఇన్నిదినములు తమకై సేవచేస్తానని వ్యాపారులు ఇన్నిరోజుల లాభమిస్తానని రైతులు సంవత్సరాదాయములో ఇంతఇస్తానని తెలిసి ఈదేహకష్టాన్ని ఇస్తే ఇహ పరములకు దైవసహాయముంటుంది ఆధనముతో గ్రామ దేవాలయాభివృద్ధి పండుగ పర్వదినములలో దైవ కైంకర్య కార్యనిర్వహణ జరుగును. దానితో గ్రామాభి వృద్ధియై దుష్టనాశనం శిష్టపోషణ గలిగి గ్రామం వన్నెకెక్కును ఈపద్ధతీ ప్రతి జీవికీ ఇరువాగుల సౌఖ్యమిచ్చునన్నాడు రాము.

అదివిని అక్కడివారందరూ ఇంటికొక రూపాయి ఇస్తే చాలు ధర్మకార్య ములు ఎన్నిఅయినా అవుతాయి ఇచ్చేబుద్ధిగల వాడెవరయ్యా అన్నారు.

రాము నవ్వుతూ దేవునితో జీతము తీసుకుంటూ అదిచాలక దొంగగా వారి సొత్తూతింటూ అదీచాలక భక్తుల మోసముచేసి వారిసొత్తూతింటూ చక్కగా పనికూ డాచేయక సోమరులైవుంటే ఇక ఇచ్చువారూ తెచ్చువారూ ఎవరయ్యా తెలియని వారికి తెలియనట్లుగా చెప్పడం చెప్పేదాన్ని తానూ ఆచరణలో ఉంచుకొనడము శక్తివంచనలేకుండా శాయశక్తులా శ్రమపడి భక్తాదులకు చెప్పడం కార్యములు చక్కగాచేయడం చేస్తే తెస్తారు ఇస్తారు.

మానవద్రోహం చేసి దేవునికి చెప్పుకొని తీర్చుకుందామని భక్తాదులు ఇక్కడికివస్తే వారికి దేవునికి ద్రోహము మీరుచేస్తారు దేవాలయాల్లో పనిచేయు వారు చేసినపాపం మరెవ్వరికి చెప్పుకొనపోతారో తెలియదు దేవాలయాల్లో దేవుని సొత్తూ భక్తులసొత్తూ తిని తిరిగీ జన్మించిన వారిసంఖ్య అటుపూడూ తిండీతీర్థాలులేక తిరిగీ చోరీలేచేస్తూ తన్నులుతింటూ గోపురాలు ఎక్కుతున్నారు పిట్ పేకట్ లు కొట్టువారూ ప్రీతిగాపిల్చి మోసములు చేయువారూ వీరేవానరములు తానే తెలివిపరుడనని ఇతరుల హేళనచేసి వెక్కిరించి చిల్లరరాళ్లువేసి మోసముచేసినవారి గుంపూ ఇందులోనే ఉన్నది. తిరిగీ ఇక్కడనే చూపెట్టి తిరిగీచేస్తున్నారు అదిగమనించి భక్తాదులకు శ్రమగలిగించక వినయముతో భక్తిఇట్టిదనీ భగవంతుడిట్టివాడనీ సక్రమముగాచెప్పి తిరిగీ వారు వచ్చులాగు చేయవలయును. యమునిబాధకన్నా దూతలబాధ యెక్కువయినట్లు మీబాధ కాకూడదు. మీరు సక్రమమయినవారుగా ఉండవలయును దేవునికి జరుగు పూజావిధాన నిత్యకైంకర్యములు త్రిసంధ్యలా జరుపుచూ వచ్చిన భగవత్ శక్తి అందిమిడీ భక్తాదులు నిత్యాభివృద్ధిచెంది ధనము నకు కొదువలేక దేవాలయము అభివృద్ధికి తోడ్పడును. అర్చకులలో ఉందీశక్తి నూనెలోవత్తి చేసి వెలిగించితే వెలుతురుగలుగును వత్తి నూనే అగ్గివుండికూడా ప్రయోజనములేదు దూరెకుపైన మనుష్యుడు కావలెను వెలుతురు కావలెనని ఆశించి ముట్టించిన వెలుతురుగలుగును. ఎక్కడివి అక్కడ యెంతకాలముండినదూ వెలుతురుగలుగదు అట్లే మంత్రము మహిమా దేవుడూ ఉన్నాడు కాని దూరెను ఒకచోటపెట్టి వెలిగించు మనుషుడుకావలె. భక్తుని ఆశయములో భగవంతుడు వీక్షించి సర్వకార్యములూ తానేచేయగలడు. భక్తిశ్రద్ధలతో భగవత్ కార్యములు మానవుడు చక్కగాచేయుటయే మానవునివంతు పైకార్యముల పరమేశ్వరుడే చూచుకోగలడు అన్నాడు రాము.

నిజమేనాయనా ఈవిధముగా అందరూ వర్తించిన ధర్మకార్యములు దైవకార్యములూ ఎంతోబాగుపడగలవు దీనిని యోచించి నడుచుకొను వారిసంఖ్యేలేనిది అన్నాడు ధర్మకర్త.

ఔనండీ చదువుకొన్నవారు చక్కగా మార్గమంటీ పోతూవుంటే మూఢులూ మూర్ఖులూ తెలియనివారు వారివెన్నంటే వస్తూవస్తూ చాలుకువస్తారు ముందుచదువుకున్నవారే భావవిభేదములతో ఈర్ష్యా అసూయలతో పట్టుదలతో దురాదాయములకై తప్పడడుగులువేసి గుంపును చీలబెరుకుతుంటే వెనుకవచ్చు అమాయకులు

ఏమిచేయగలరు. అనేకమయిన మతాలను భాషలను వేషాలను సృజించి ఉన్నది లేనట్లు లేనిది ఉన్నట్లు బోధించి చెరచు భావ విభేదజ్ఞాలుదయించి భారతనారీ భాగ్య మభాగ్యమై దుఃఖభాజనమయినది. చదువుకున్న తలచెడితే సకలమూ చదరమగునన్నారు. అయినది అయినా కాలమహిమ అంటూ ధర్మకర్తగారికి పోయివస్తామండీ అని నమస్కరించి దేవాలయ ప్రదక్షిణముచేసి ధ్వజస్తంభము దగ్గర నమస్కరించి మహాద్వారము దగ్గరపోయి వెనుదిరిగి నమస్కరించి దారిపట్టిరి.

ఈ తీరుచూచి ధర్మకర్త చూచినారా బాల్యములో భార్యాసహితముగా దేవాలయమునకువచ్చి ఈవిధముగాచేయు యౌవనులు వీరయ్యా. వీరు సంస్కరింప బడ్డవారు సంస్కారము లేనివారే సర్వదా చెడువారు ఇప్పుడేగాక ముందుజన్మలో కూడా సంస్కరింపబడియే అరూపమూ అవినయము అవిద్యాఘనమూ ఘూర్యాచక్కగా కుదిరినవి. భక్తిలోనే శక్తియిమిరివున్నది. ఇది ముందుకు ఇంకా ముందుకు పోగలడు వండుగేయని ఊరిలో వక్కరయినా దేవాలయానికి వచ్చిన వారున్నారేమోచూడు ఇదిపురచి పోయినారు. మరుపును మళ్లీఎత్తిపెట్టు కవులు పౌరాణికులూ మరుగై నారు. మళ్లి వారు కన్నుతెరచినగానీ మానవులు చక్కబడరు అన్నారు.

రామూ సరోజ వెళ్లుతుండగా అందరూ కన్నులపండువుగా చూస్తూ జత బాగున్నదనువారు, పురుషుని పూర్వజన్మ సుకృతమనువారు, కొంతవరకూ అన్లేచూచి తమజీవితమును వారికిసరిపోల్చి నిరుత్సాహపడువారు, అవుతూవుండ పోతూ రాము సరోజను చూచి ఎందుకంత తలవంచి నడుస్తున్నావు అన్నాడు.

సరోజ చిరునవ్వుతో రామును చూచి ఎక్కువగా తలయెత్తి ఎదయిచ్చి నలు ప్రక్కల చూస్తూ స్త్రీలు నడువరాదు ఎదురవచ్చువారికీ మనకూ చూపూ రూపూ సంధిచేసి పాపపుతలంపులు తలపునకువచ్చును అన్నారు తలవంచి తనఇష్టదైవ మును బుద్ధికితగిలించి తలంచుచూ తనపనిపైన తానుపోవుట శ్రేయమన్నారు అన్నది.

రాము నవ్వుతూ పిట్టకొంచెమూ కూతఘనమూ అన్నట్లు ఉన్నది నీనీతి అన్నాడు రాము.

ఔను సంస్కారమయినవారు ఎంతచిన్నవారైతే ఏమి వయసులో ఏమున్నది కష్టపడి నేర్చుకున్నవారు చెప్పగా విని ఆచరణలో ఉంచుకున్నవారు చిన్నవారై

ఉండవచ్చు అందులో వింతయేమున్నదీ అన్నది సరోజ.

ఈశ్వరాలయము క్రొత్తది కట్టుతున్నారన్నాడు.

ఈవూరిలో ఈశ్వరాలయములు ఇంతవరకూలేవా అన్నది సరోజ.

లేకేమి గొప్పదేవాలయమున్నది ఇక్కడా ఎవరో కట్టిస్తూ ఉన్నారు అన్నాడు రాము.

శిధిల దేవాలయములుండగా వాటెను చక్కచేయుట విడచి, కొత్తవి కట్ట తలంచినవారికి పాపముతప్ప పుణ్యమునున్న అన్నాడు మాఅచార్యులు. క్రొత్తదేవాలయములు వీరుస్వార్ధపరులై తమపేరు ప్రఖ్యాతి ప్రజలలో నిలుపవలెనను తలంపుగలిగి పురాతన దేవాలయ భక్తులనుకూడా ఇక్కడ మళ్లించి చందాలు తీసుకొని ముందున్న స్థానమును మూలత్రోసి ముందుకు తానురావలెనని ముందుచేసిన ధర్మముల పడగొట్టి వారికీర్తి ఎదపై కాలుపెట్టి దాటిపోవలెనని ధర్మచ్యుతులై ముందుచేసిన ధర్మములకు అపకారము చేసినదిగాక దైవద్రోహులై వంశనాశనము చేసుకొందురు. ప్రజలలో కీర్తినే ఆశించిరిగాని దైవసాన్నిధ్యము ఆశించలేదు అట్టిదైవ చింతనగలిగినవారు శిథిలగ్రస్తమయిన దేవాలయముల సత్రములా బావులా కోనేళ్ల సరిచేయుదురుగాని క్రొత్తవి పాతవి ఉన్నచోటిలో కట్టరు అట్టి విజ్ఞానముగలవారు భక్తులతో భగవంతునితో ఆశ్వీచనము పొంది సుఖపడుదురు. శివకేశవులలో ఒకతెగకు చెందినవారందరూ అయినగాని ఒకదేవాలయము చక్కబడదు. వీధి కొకటయిన పూజా పునస్కారములు జరుగక శిధిలములగును. దీనిని పశున్యాయమంటారు ఒకడుచేసినచోట మరొకడు అక్కడనే ప్రారంభించిన దానికీ దీనికీ కూడులేక చెడిపోవు మార్గము కలుగును.

ఒకడు చేసినదానిని ఒకడు కనిపెట్టినదానిని చేతపట్టుకొని నాతెలివని ఎదతట్టినిల్చి లాభముగడించు విద్యావంతులు ధనికులూ ఉంటారన్నారు దీనిని పరమ పశున్యాయమంటారు వారు ముందుజన్మకు పశుప్రాయు అగుదురన్నారు అన్నది సరోజ.

నిజమే ఒకరుచేసినది చేయక అందరూ క్రొత్తదారులను వేయ నలవియగునా అన్నాడు రాము.

చేతగాకపోయిన ఉన్నవాటెతో సంతోషిస్తూ వాటెకే సహాయముచేస్తూ

తలవాల్చుట శ్రేయము శిథిలముల బాగుచేయుటలో ఎక్కువ పుణ్యముండు నన్నారుగా పాతవాకెకు ప్రాణముపోయుటే ధర్మము అన్నది సరోజ.

ఇంతలో ఇల్లు చేరుకున్నారు. టయము పన్నెండు అయింది కూర్చొండి వడ్డిస్తానంటూ అరటిఆకువేసి పాత్రా మరొక ఉపపాత్రా మంచినీటితో పెట్టి కూర్చోమన్నది సరోజ.

కాళ్లు కడుగుకొని వస్తానన్నాడు రాము.

దేవాలయానికి పోయివచ్చి అస్పృశ్యతా దోషం అంటరాని వారి అంటూ ఉంటుందని స్నానముచేయరాదన్నారు పెద్దలూ దేవునిదగ్గరకు పోయివచ్చిన దేహము పావనమన్నారు ఒకప్పుడు తిరుపతికొండ యెక్కివచ్చి కాళ్లుకడుగుకొంటూ ఉంటె పెద్దవారు కడుగరాదన్నారు. అదిఈనాటికి జ్ఞాపకమున్నది ఇదే సంస్కారము కూర్చొండి అని వడ్డించినది సరోజ.

తీపు ముందువేస్తున్నావే అన్నాడు రాము.

ఔను పండుగలలో శుభకార్యములలో చక్కెర పంట్లు ముందు వడ్డిస్తారు ఆహార విహారములలో కట్టూ జుట్టూ బొట్టూలో కార్యకలాపాలలో మతకర్తలు ఒకరు పోయిన దారిన ఒకరుపోక భావవిభేదమలై ప్రజలకు కష్టములు గల్పించినారు అన్నముపెట్టి నెయ్యివేసి అటుపై సొదకములు వడ్డించవలెనని కొందరు కూరా నారా ముందువడ్డించి అటుపై అన్నము వడ్డించమన్నారు మరొకరు ఉప్పు ఊరగాయ ముందు అన్నారు మరొకరు పండూ పంచదార అన్నారు ఇంకొకరు ముందుపాయసం అన్నారు మరిఒకరు ఆనాడు కొత్త ఆహారం ఏదిచేసి వున్నారో అదిముందుపెట్టండీ అన్నారు ఏదారిన పోవలెనో యేమో ఎవరిదారివారిదని పోవలసినదేగాని తప్పులు పట్టితే తగవులు తప్పవు. షడ్రసములలో తీపే ప్రధానమయినది గాన తీపే ముందుకొంచెము వడ్డించినాను ముందు జిహ్వకు కాస్తదాన్ని తగిలించి అటుపై తమకేది రుచిస్తుందో దాన్ని ఆరగించండీ అందులో కృష్ణభగవానుని ప్రియశిష్యులుగా అమృతాలు ఎక్కువకోరుతారు ఒక అమృతము దేవతలు త్రాగినది పంచామృతాలు తమరుత్రాగేది వారికన్నా తమరే గొప్పవారు కానివ్వండీ అని ఒకదొన్నెలో పంచామృతము తెచ్చి విస్తరలో పెట్టినది సరోజ.

అజగన్మోహిని ఒకఅమృతాన్నే పంచినది ఈమోహిని మంచామృతాలు

పంచుతూ ఉన్నది ఈమోహినికన్నా ఆమోహిని చాలానయం పంక్తిలో రాహూ కేతువులే మయినా ఉన్నారేమో చూడవే ఉన్నారని కొందరూ లేరనికొందరూ అంటూ ఉన్నారూ అన్నాడు రాము.

అయ్యో ఉన్నారండీ చూచుకొని భోంచేయండి అప్పుడు రెండుకాళ్లుంటే ఇప్పుడు ఆరుకాళ్లు అయినవి అమృతాలు ఎక్కడుంటే అక్కడతయారై అమృతము వెంబడీ కడుపులోకికూడా ప్రవేశిస్తారు కడుపులోకిపోతే కలియబెట్టి తిరికీ వెనక్కు వచ్చునంతవరకూ పోనివ్వరూ అన్నది సరోజ.

రాహూకేతుగ్రహాలు ఈగలూ దోమలై బాధిస్తూ ఉన్నారన్నావా అంటూ హోళిగలవరకూ వచ్చినాడు రాము.

హోళిగవేసి చిక్కని పాలువేసినది సరోజ.

కలిపితింటూ రాము మనరాయలసీమలో పండిన సెనగలు గోధుమలు బెల్లముతో చేసిన హోళిగలతో పాలువేసి పిసికితింటే దీనికిమించిన పదార్థములేదు ఎంత వింత పదార్థములుచేసి కొత్త కొత్త పేర్లుపెట్టి కొంపలు కూల్చుడమేగాని ఈ మాధుర్యానికి అన్నీ తక్కువేనంటూ తిన్నాడు. తకారింతా నిభోజనాని అని యెన్ని తిన్నా ఆఖరున మజ్జిగగానీ మీగడతోటి పెరుగుగానీ వాడవలెనన్నారు అదివరకు తిన్న వాతపిత్తశ్లేష్మ పదార్థముల ఒకవయిపునకు తిప్పి ఒక్రములన్నీ నిర్వక్రముగా చేయునన్నారు అన్నాడు రాము.

తక్రము చేయమన్నారా లేక క్రమంగానే ఉండనివ్వమన్నారా అన్నది సరోజ.

అన్నిధర్మాలూ తెలిసిన అతివకు అదిమాత్రము ఎందుకుతెలియదూ మాయమ్మ మీగడతోటి పెరుగువేస్తూ ఉండెనన్నాడు రాము.

అయ్యో పాపము అమ్మ మీగడతోటి పెరుగుతో పెట్టుతుంటే అలు అన్యాయం చేసేనసేదెందుకు తినండీ బాగా వాసుకున్నారుగా భోజ్యేతుమాతా అని ఊ కానివ్వడీ అంటూ వేసినది.

రాము భోంచేసి లేచినాడు.

సరోజ నిత్యపద్ధతి నెరవేర్చి తానూభోంచేసి వంటఇంటిలో అన్నీచక్కబెట్టి

వచ్చి కూర్చొని తాంబూలంవేసుకొని కీలుగంటువిప్పి చిక్కుదీసి వెంట్రుకలు అర విడచి కృష్ణ కృష్ణ అని చాపపై తలవాల్చెను.

ఏమి ఏమి అంటూ రామువచ్చి ప్రక్కన కూర్చున్నాడు.

ఎవరు పిల్చినారూ నేను పిలువలేదే అన్నది చిరునవ్వు నవ్వుతూ సరోజ.

అయ్యో నన్నుపిల్చితేనేమి నాదేవుణ్ణి పిల్చితేనేమి దైవమో దాసుడో దాసురాండ్ర కోరికలతీర్చవలసినదే చెప్పు తప్పకతీరుస్తా నన్నాడు రాము.

మీదైవానికి దాసులవారికీ దండాలు భుక్తాయాసము కార్యకలాపశ్రమ కొంచెం తీర్చుకోనివ్వండి పంచకచ్చలూ కుచ్చెలూపోసి పంచెలు బిగించి మడి మడీ అంటూ మడినే నమ్ముకొని మడినుండీ వడికెక్కిస్తారు వడికెక్కింది తెలిసి వైనంగా వైతొలగుతారు మీదాసులవారి అంచ చేరితే దాసురాండ్రకు గండమే. పంచెకచ్చల్లో బిళ్లు ఏకకచ్చల్లో సూపుతానంటారు మీ సహవాసమే సహవాసంకాదు పోయి కొంచెముసేపు శయనించండి అన్నది ఛలోక్తిగా సరోజ.

ముందుదాసులు తోడైతేగానీ దైవముండే దారితెలియదు దారితెలిస్తేగాని దైవమగుపడడు దైవాన్నిచూడాలంటే దాసులకు దాసోహం అనవలె దాసులులేకుంటే దైవమేలేడు దారితెలుసుకో అన్నాడు రాము.

చిత్రగుప్తుని వ్రాతకు యముడు విధించుదండనకు జడుపులేదుగాని కింకరుల బాధ భయంకరమురా అన్నారు అట్లనే దైవసాన్నిధ్యమునకు కష్టపడి పోవచ్చును గాని అక్కడా దాసురాండ్రకు దాసులబాధ యెక్కువ అన్నారు. మంచములో నల్లులున్నట్లు నెత్తిలో పేలున్నట్లు గుడ్డలలో చీరపోతులున్నట్లు దాసురాండ్రకు దాసుల బాధ. దాసులకు దాసురాండ్రబాధ ఇరువురూ పొరబడితే పోయినది కుటుంబము కాదు. ఇది నిజమయిన దాస్యకుటుంబం అవుతుంది. ఎవరిదారినవారు దైవాన్ని వెతుకుటే దొడ్డబుద్ధి దాసులువారికి దండాలుపోయి కొంచెముసేపు పడుకోపొండి అన్నది సరోజ.

దారితెలిసిన దాసురాలికి దారిఇదికాదు అది అంటే దారివిడుస్తుందా దండుగ మాటలు వింటుందా మనపనీ అంతా నిష్ప్రయోజనమంటూ పోయి పడుకున్నాడు రాము.

ఇరువురూ అనాడు యెక్కువ శ్రమపడుటవల్ల మైమరచి నిదురించినారు.

మూడున్నరగంట అయింది ఇంట్లో పనిచేయు ముసలాయమవచ్చి వాకిలి తట్టినది.

సరోజలేచి వాకిలితీసి గంటచూచి పోయి కాఫీవేసి రామునులేపి కాఫీయిచ్చి వంటఇంటి పనులుచూచుకొని తలదువ్వి సర్వాలంకార భూషితయైనది అంతలో ఆరుగంట లయినది ముసలాయమను ఇంటిముందు నీళ్లు చల్లమని నాలుగైదు ముగ్గులు పెద్దవిగా వేసినది.

ఇంతలో రాము సాయంసంధ్యలో చేయదగు పూజావిధానము చేయు చుండెను.

సరోజ పోయి ఆ కార్యములో తానూ పాల్గొనెను. ఏడున్నరగంటకొకైను రాము ప్రార్థనముగించి నైవేద్యముపెట్టి మంగళహారతి యిచ్చి తీర్థప్రసాదములు పుచ్చుకొని సరోజకు యిచ్చి.

లఘు ఆహారము తీసుకుందామా అన్నాడు.

లఘు వెందుకూ బరువుగానే తీసుకుందురూ కేశవస్వామి ఉత్సవమన్నారే యిక్క డికి యెంతకాలానుకి వస్తారన్నది సరోజ.

ఓ తొమ్మిది పదిలోపల వస్తారు అంతకులోపల మనము భోంచేసి రడీగా ఉండవచ్చు అన్నాడు రాము.

సామాన్యముగా పదకొండు లేక పన్నెడు గంటలకులోపల స్వామివచ్చేటట్లు వున్నయెడల గృహస్తులు భోంచేయరాదన్నారు దీపము ఆర్పరాదన్నారు బైయట ఇరువాగుల గూళ్లలో దీపములు ఉంచవలెనన్నారు భోంచేసి భగవంతునికి ఆతిథ్య మిచ్చిన ధర్మవ్యతిరిక్తముకాదా అన్నది సరోజ.

వ్యతిరిక్త మేమున్నది పదార్థాలు చెడిపోకుండా ఉన్నవి. భద్రముగా కడుపులో దాచడం దిట్టంగా ఆకూ వక్కానమిలి వీధిన పోయేవారు అసహ్యా పడేటట్లులేక కాళ్లకయి తిట్టుతూ ఇంటికి పోయి కాళ్ళు కడుగుకొనేటట్లు, నడి వీధిలో చెడమూయడం ఇరుగు పొరుగువారంతా ఒకేచోటచేరి అలికి ముగ్గులుపెట్టే దానికి బదులు వీధిఅంతా చెడమూసి దేవుడు వచ్చేవేళకు లేవిడీ లేవడం ఇంకా తీవుతిని అయాసముగావుంటే ఒకనిద్దుర నిద్దురపోయి లేవడం అయింటి సుద్దులో ఈ ఇంటిసుద్ధులో లేక సొత్తులూ గుడ్డల విషయాలలో వంటా వార్పుల విషయా లలో చెప్పుకొనడం జరుగుతూ ఉంటగా దేవుడువస్తే ఒక టెంకాయవుంటే ఇవ్వ

డం లేకుంటే చేయి ఆట్లనడం లేక తలుపుమూయడం ఇది ఉత్సవకాలమరియాద ఏమంటావు అన్నాడు రాము.

ఏమీ అనేదిలేదు ఒకరితో మనకుపనిలేదు దేవుడు వచ్చిపోయినవెనుక భోం చేస్తాము నేను పూజాద్రవ్యములు అన్నీతట్టిలో పెట్టుతాను. తమరు ఏదోఒక గ్రంథము కాలక్షేపముకొరకై కొంచెంచదువండీ శ్రవణానందముగా వింటాను అన్నది సరోజ.

భర్త చదవడం భార్యవినడం బాగుంటుదా భక్తులు ఎవరూలేరే అన్నాడు రాము.

ఒకరితో పనిఏమి మనకు కాలము నడువవలెగా అంటూ టెంకాయ తాంబూలం దక్షిణ పూలూ పండ్లూ కర్పూరం ధూపకడ్డీ తట్టలోపెట్టినది సరోజ.

రాము భాగవతముతెచ్చి కృష్ణుడు గోపాలకులతో చలుదులారగించే కథను తీసి ఒకపద్యము చదివి విన్నావా భగంతుడెంత దయామయుడో గొల్లపిల్లలెంత అదృష్టవంతులో చలుదులు వకరివి ఒకరు లాక్కొని తినడం, ఒకరిని ఒకరు గుద్దడం కొట్టడం పెరకడం వరుసలతో మాట్లాడడం హేళన చేయడం ఆడడం పాడడం తగలడము మొదలగు ఆటలతో భగవంతుడు బాలకుల ఆనంద పెట్టుతూ ఆనందపడుతూ ఉన్నాడు. ముప్పదిమూడుకోట్ల దేవతలు దేవునిముందు నిల్చుకొనుటకు కూడా వీలుగలుగదు. అట్టి మహనీయ మూర్తితో ఆడుకొను నోమునోచినవారు గోపకులు గోపికలు దేవతలకు అలిపిగాని స్థానము మానవులు అతిక్రమింపగలరు. దేవతలవల్లగాని పనులు మానవులు చేయగలరు క్రమబుద్ధముగా మానవత్వము నడిపితే మానవునితో కానిపని ఏమీలేదు. గోపగోపికలతో కృష్ణభగవానుడు ఆడుకొనుట పాడుకొనుట చూచి బ్రహ్మ అయ్యో నాకు సురజ్యేష్ఠుడను పేరేగాని ఏదునోచిన నోముకూడా నేనునోచలేదు పరమాత్మని సమీపమునకూడా నిల్చుకొను నోమునోచలేదు వీరెంత పుణ్యాత్ములోగానీ కలయికగా తిరుగుతూ చేయిచేయి కలుపుతూ తగులుతూ వరుసలతో పిల్చుతూ ఉన్నారు వారిలో తానూఒకగొల్లపిల్లవాడై తిరుగుతూ ఉన్నాడు. వీరిలీల వీరికే ఎరుకని చింతించినాడట. మానవులు సాలుమూలలా తెలిసి చక్కగానడిస్తే దేవతల కన్నామిన్న అన్నాడు బ్రహ్మ. చూచినావా మానవులలోగలబలము అన్నాడురాము.

సరోజ రామునుచూచి మంచికథ తీసినారు మానవులమూచి బ్రహ్మకూడా వగచినట్లు మానవులు ధర్మమెరిగినడిస్తే దేవదానవులకు మిన్నకాగలరు. మమతకు లోపడి ధర్మదూరులై తన్నుతానుమరిస్తే నిలుచుకొన ఎక్కడా చోటులేక పశుపక్ష క్రిమికీటకాదులకు వెనక్కుపోగలడు. ఇంతో అంతో ముందడుగే వేయవలయును గాని వెనకడుగు వేయరాదన్నది సరోజ.

ఇంతలో ప్రక్కయింటి ముసలాయమవచ్చి ఏమమ్మా భార్యాభర్తలిద్దరే గ్రంధకాలక్షేపము చేస్తున్నారే బయట ఇరువాగుల గూళ్లలో దీపాలుపెట్టి ఇంటి ముందు నీళ్లచల్లి ముగ్గులువేసివుంచే ఎంతోబాగుంది వయసు చిన్నదైనా నేర్పూ ఓర్పూ బాగున్నదితల్లీ వాకిలిముందు నిల్చుకొని చూస్తూవుండి మీమాటలువిని ఇట్ల వచ్చినానమ్మా అన్నది ముసలాయమ.

సరోజ ముసలాయమను కూర్చొమ్మని పండుగరోజు ఉత్సవకాలం ఇంటి ముందు వెలుతురు ఉండవలయునని సాయంత్రం నీళ్లచల్లి ముగ్గులువేయవలయుననీ తమబోటి పెద్దవారు చెప్పుతుండగా విని పెట్టినాను అవ్వా అన్నది.

చెప్పగలముగాని చేయువారుండ బనిలేదాతల్లీ నేను మాఇంట్లో నాలుగైదు సార్లు చెప్పినాను ఎవరూ పలుకలేదు నేనుచేయలేను వీధిఅంతా ఇట్లేచేసిన ఎంత బాగుండేది తల్లీ. దేవుడు వచ్చువేళకు వీధిపరిశుభ్రముగా ఉంటుంది. చేసినవారికి పుణ్యమూవుంటుంది. చేసేపుణ్యాంగనలులేరు ఈవీధిలో ఈనాడు నిన్నుఒక్క దానిని చూస్తున్నానమ్మా అన్నది ముసలాయమ.

ఇంతలో దేవుడు సమీపించినట్లు తోచి సరోజ బయటికిపోయి చూచి దేవుడు సమీపించినాడు అవ్వా చూతురురండీ అని దేవునికెదురుగా మోకరించి నమస్కరించి లేచి చెంపలు వేసుకున్నది.

ఇంతలో ముసలాయమ రామూ బయటికి వచ్చినారు రాము సరోజనుచూచి ఏల అక్కడ దేవుడుంచే ఇక్కడనుంచే నమస్కరిస్తూ ఉన్నావు ఇక్కడికి వస్తారుగా అన్నాడు రాము.

సరోజ నవ్వుతూ ఇక్కడికి దేవుడు వచ్చినప్పుడు నమస్కరించడానికి అర్చకులూ మోతకాళ్లు మేళగాళ్లు ఊరివాళ్లు క్రిక్కిరిసి ఉంటారు వారిముందు నమస్కరించమంటారా అందుకై ముందే నమస్కరిస్తూ ఉన్నాను అన్నది సరోజ.

ముసలాయమ రామునుచూచి ఔనునాయనా వయసు పిల్లలవారు ఆ జన సమ్మర్దములో ముందుకుపోయి నమస్కరించుట మంచిదికాదు ఇల్లాలికుండవలసిన విధి ఇంతేనప్పా చక్కగా సంస్కరింపబడ్డది అమ్మాయి అంటూ ముసలాయమా ఒకదండము పెట్టినది. రాము చాగిలపడి నమస్కరించినాడు దేవుడు పూర్తి సమీపించెను. రాము చేతికి తట్టనుతెచ్చి ఇచ్చినది సరోజ.

రాము నడిమికి పంచెచుట్టి తట్టతీసుకున్నాడు దేవునిఎత్తుకొనివచ్చి నడిముగ్గుపైన నిల్చినారు మోతకాళ్లు ముందుభాగమునవున్న ముగ్గులచూస్తూ నిల్చినారు అర్చకుడుచూచి ఇక్కడ ఎవరో ముసలిభక్తురాలు పూర్వపుమనిషి ఉన్నదయ్యా చూడూ నీళ్లుచల్లి ముగ్గులువేసినది. ఈకాలపు నవీన నారీమణులకు దేవుడూ దైవమూ విలాసమూ వినోదమే. భక్తీవద్దూ ముక్తీవద్దు ఆసక్తి అంతా భుక్తిమీదా రక్తిమీదా లేదా శక్తిమీదా ఇంకావుంటే ఒకవ్యక్తిమీదాచూడూ ఇంతవరకూ ఏఇంటి ముందుగానీ ఇన్నినీల్లుచల్లి ముగ్గుపెట్టినతల్లి ఉన్నదేమో ఈమె ఇల్లూ వళ్లూ బంగారముగానూ కొడుకులూ కోడండ్రూ కొల్లగా చల్లగా అభివృద్ధిగానూ అని రాము తెచ్చిన పళ్లెరము తీసుకొని పూలదండల స్వామికి భూ నీళలకూ వేసి కాయకొట్టి నైవేద్యముచేసి గంటకొట్టుతూ మంగళహారతి యిచ్చి ప్రసాదము రాము చేతిలో వేసి తట్టచేతికిచ్చి శఠారి శిరమునా భుజములా తగిలించినాడు అర్చకుడు.

రాము తలవంచి దేవునికి నమస్కరించి వెనుదిరిగి పోయినాడు వాకిటిలో కాచుకొనివున్న సరోజ మంగళహారతి కన్నులకద్దుకొని తట్టను తీసుకొనిపోయి స్వామిదగ్గర వుంచినది స్వామిని మరొక ఇంటిదగ్గరకు తీసుకపోయినారు ఆ ఇంటి యజమాని టెంకాయా ఒక ఆకు వక్కా తట్టలో పెట్టుకొనివచ్చి దేవుని ఎదుట నిల్చినాడు అర్చకుడు తట్టతీసుకొని కాయకొట్టి దేవునికిచూపి ఒకఒప్పు తట్టలోపెట్టి యజమానిచేతికిచ్చి శఠారి నెత్తిన బోర్లించగా ఆయన పోయినాడు. మోతకాళ్లనుచూచి అర్చకుడు నాయనా చూచినారా భక్తిలోగలశక్తి ఎన్నిఅయినా ఎంతఅయినా నీచకార్యములకు డబ్బుఖర్చుపెట్టగలరు సిగరేటు చుట్టా బీడీ ఆకూ పొగాకు నశ్యం మొదలగు దురభ్యాసములకూ దుర్వ్యయములకూ లొంగి ఎంతైనా డబ్బునాశనము చేయగలరు ధర్మకార్యములకు దైవకైంకర్యములకూ కుంటీ కురూపులకూ యివ్వవలెనంటే చస్తారు. యిది వీరిదురదృష్టము పుణ్యమార్గములకు కంపకొట్టించి పాపమార్గముల పన్నీరుతో అలికించి కస్తూరితో ముగ్గులు పెట్టించును

దురదృష్టము అర్ధణా కర్పూరము బరువయింది ఈ యజమానికి ఎందరో వెంకా యడబ్బులకు లొంగి వాకిండ్లుమూసి యింట్లో ఉన్నవారున్నారు. మూకిలిమూసి సినిమాలకు పోయినవార్లున్నారు పండుగరోజు దేవుని ఉత్సవమున్నదను భావము గలవారు తగ్గుమజిలిలేవట్టినారు. భక్తియే అడుగంటినది ఆ యింటివారు ఈవీధిలో వున్నట్లు అక్కడక్కడా మచ్చుకై ఇంకాకొందరున్నారు దేవునికి ఆతిథ్యమిచ్చు కాయాకర్పూరమే గొప్పసెలవని భావించి నిత్యమూ సినిమాలకుపోవు బుద్ధిమంతు లున్నారు. బుద్ధిగరవు పెద్దలు లోపించుటవల్ల ఈబుద్ధులు గలిగినవి వారెప్పుడు దూటికి వస్తారో వీరెప్పుడు చక్కబడతారో కాలదేవతకు తెలియును గాని మనకు తెలియదు అంటూ దాటి పోయినారు.

సరోజ రాముకు భోజనము వడ్డించినది.

రాము భోంచేస్తూ మనయింటిదగ్గర ముసలివారు ఎవరో వున్నారన్నారు అర్చకులవారు అప్పుడు నేను అందుకుందామనుకున్నాను మాయింట్లో ముసలివారు ఎవరూలేరూ ముసలిబుద్ధిగల వయసువారు వున్నారని విమర్శ పెద్దగా అవుతుం దని చాలించి ఊరకున్నానన్నాడు.

అనకూడదా అందులో తప్పేముంది వయసువారికి ముసలిబుద్ధి వుండుటశ్రే యమే ముసలివారికి వయసుబుద్ధివుంటే చాలాకష్టమూ నష్టమూ అన్నది సరోజ.

నాగరికం నవీనం అనే నారీలోకం ముందుకు నడిచేటప్పుడు ఈలాంటి మర్యాదలవలంబిస్తే అనుకోరూ మరి అన్నాడు రాము.

ఎన్ని నవీనాలు ఎన్నినవనాగరికాలు ఉత్పన్నమయినా మంచిమార్గములు మరుగుపడవు. మంచిని కాదనే నాగరికాలు నవీనాలు వుండవు ఏలాటి కాలాలు వచ్చినా పాప పుణ్యములు ధర్మా ధర్మములు దైవభక్తి అడుగంటవు మాతృదేవోభవ పితృదేవోభవ గురుదేవోభవ అనే ముఖ్యసూత్రములు మూలనకూలబడవు కూల బడితే కూర్చుండబెట్టేవంతు భగవంతునిపైన ఉండనే ఉన్నది ఇలువేల్పును ఇష్ట దైవాన్ని గ్రామదైవాన్ని మరచి మతిహీనులైతే కవివృషభుడు చెలరేగి అట్టుమంచి కాలుమవ్వి వాలమల్లార్చుతూ తలవంచి కొమ్ములతో భూమిని గ్రుమ్మి దుమ్మును ఎగరజిమ్మి అట్టెత్తి కనులెఱ్ఱచేసి చూడుతూ ఖనీమని అంకెకొట్టును అభీకరశబ్దమునకు ప్రజలల్లకల్లోలమై కడకు భావోద్రేకులై ప్రభువులపైనా ప్రభువులు కోపోద్రేకులై

ప్రజలపైనాపడి అన్యాయమై అనువులగోల్పోవుదురు అతివృష్టి అనావృష్టులు తటస్థపడి సువృష్టి నశించును క్రూరవ్యాధులు తలలెత్తి భీషణముగా సంచరించును క్రూరులూ కుచ్ఛితులు మదోన్మత్తులూ మతోన్మతులూ పాపచిత్తులూ కామాతురులూ తాగుడుబోతులూ జూదరులూ విచ్చలవిడిగా విడిబడి తిరుగుదురు. నిర్భీతిగా సంచరించుదురు. లోకకంటకులూ లోకవంచకులూ అవినీతులు అప్రయోజకులు చోరులూ చోరాగ్రేసర చక్రవర్తులూ జననమగుదురు. గ్రామములు అల్లకల్లోలమై ప్రజలు తల్లిలేని పిల్లలవలె తల్లడిల్లుదురు. అది తెలియక తెలియచెప్పువారులేక చెడిపోవుచున్నారు ప్రజలు అన్నది సరోజ.

అంతలో రాముభోంచేసి చేయి కడుగుకున్నాడు.

సరోజ భోంచేసి అన్నీచక్కపెట్టివచ్చి కూర్చొని భర్తకు ఆకుమడిచిస్తూ తానూవేసుకుంటూ వుండగా రాము సరోజను చూచి గ్రామములో ధర్మబుద్ధిగల ధనికులూ బాహుబలమూ బంధుమిత్ర సోదర బలముగల నీతివరులూ పాపపుణ్యవిచక్షణా జ్ఞానము చక్కగాతెలుపగల కవులూ పౌరాణికులు దైవజ్ఞులు కథకులూ ధర్మహృదయులై ప్రజలబాగుపరచి చక్కగా నడువవలెనను గ్రామపెద్దలూ గలుగునంతవరకూ గ్రామములు ఒకసాలుకు రావు. చక్కబడవు వీరందరూ దురాదాయములకు లోబడుటచేతనే ధర్మదేవత అడుగంటి కర్మదేవత గ్రామములలో కాలుబెట్టినది అన్నాడు రాము.

ఔను ధనికులు ఇచ్చినవానిమరచి ధర్మదూరులై లోభులై ధర్మకార్యములూ అడుగంటించి దేవతామాన్యములూ చాకిరీ ఇనాములూ లోను చేసుకొని కార్యక్రమములకు మన్నుకొట్టి ప్రజలు బలవంతులైతే గౌరవమర్యాదలు లోపించునను తలంపుతో ప్రజలకు ఎంమనా చోటివ్వక పాదములక్రింద త్రొక్కి నిలుతురు. ఇక బాహుబలముగలిగి బంధుమిత్రబలముగలిగి బాహాళ్యమగు పలుకుబడిగలవారు అవినీతికి అన్యాయములకులోనై అడుగడుగునా దురాదాయములకు పాల్పడుదురు. జ్ఞానవంతులు విద్యావంతులు ఆదాయములేదని ప్రజల విజ్ఞానవంతులచేస్తే మనకు ఎదురగుదురని భావించి మానవధర్మముల నీతినియమముల తెల్పక తమకుతాము విద్యాధికులమని విఱ్ఱవీగుదురు. ఇంకా తీరకుండలేనివారు. అసూయాగ్రస్తులునగు విద్యావంతులు ఒకరితో ఒకరికి ఇరుకులుగల్పించి న్యాయము అన్యాయముగా, అన్యాయము న్యాయముగా మార్చిచెప్పి చీలికలగా ప్రజలచేసి గ్రామరాజ్యములు ఏలుతూ

దురాదాయముల తీయుదురు. ఇట్టి అవినీతులు గ్రామములలో పుట్టుటకు కారణం గ్రామదైవ పూజావిధానము లడుగంటుటవల్లనే యందురు పెద్దలు. అవునంటే కాదని కాదంటే అవుననే అప్రయోజకుడు గ్రామానికి ఒక్కడుంటే చాలు గ్రామమడుగంటుటకు అన్నారు. ధనికుడూ బలవంతుడు విద్యావంతుడు ఈముగ్గురూ బుద్ధిమంతులున్న ఊరు స్వర్గతుల్యమగునన్నారు. ఈమువ్వురికీ దురాదాయ పిశాచము లావరించే సర్జన్యపరిపాలనపోయి దౌర్జన్యపరిపాలన అయివుండేది. ఈ పిశాచముల పారద్రోలుటకు గ్రామగ్రామములా పూర్వపురీతి పౌరాణికులు ప్రబలవలయు పాపపుణ్యముల తూచి చెప్పిదౌర్జన్యమును దుర్మార్గమును దురాశను తొలగించుకొని మనునుపాయమును చెప్పగల దైవజ్ఞులు ఊరఊరా వుండవలయును భౌతికశక్తిని పారదోలి అధ్యాత్మికశక్తిని ఉసికొల్పి పరోపకార చింతనా శివము వెక్కింపగల ప్రజ్ఞావంతులు ధర్మజ్ఞులు ప్రబలవలయును. ప్రజలు బాగుపడవలయును. కల్లబొల్లి మాటలతో దర్దన్నల ఆటలతో పెద్దమ్మల పాటలతో పనులుగావు ఆరునూర్లు దాదాపు ఏడునూర్లు ఏండ్లనుండీ అన్యదేశస్థులు అన్యమతస్థులు రాజ్యమేలుటవల్ల తినతిండీ కట్టుబట్ట లేక కంటనీరుపెట్టి కటకటపడుతూ తలదాచుకొన కొంపలేక నూరేండ్లు బ్రతుకుజీవులు ఆగంతుక మృత్యువుల పాలైపోతూ ఉన్న దేశమును మనదేశమూ మనప్రజలు అనగలమనవారు రాజ్యమేలుటవల్ల ఈ పదిఏండ్లలో రాజ్యమూ ప్రజలూ ఎంతముందుకువచ్చిరో చూడు మన అనే భావములో అంత ప్రబలమయినశక్తి ఉన్నది ఆమాట నూదుకొని మనగ్రామం మనప్రజలు అనగల బుద్ధిమంతులు గ్రామములలో ప్రబలవలయు అప్పుడు దేశము స్వర్గతుల్యమగు నన్నది సరోజ.

ఔను పూర్వము దేవాలయములలో ప్రతిదినమూ సాయంత్రము కాలక్షేపములు ఏర్పాటుచేసి ప్రజలకు మానవశక్తి ఇట్టిదని దైవశక్తి ఇట్టిదని మనము ఈవిధముగా నడువలెననీ ఉదాహరణకు భాగవత భారత రామాయణములలో పురాణములలో చూపుతూ ప్రజల ధర్మహృదయులగా చేయుచుండినారట. పాపపుణ్యవిచక్షణా జ్ఞానము ప్రతివారిలో గలిగి వర్తిస్తూ వచ్చినారట. అవి అడుగంటుటవల్ల అవినీతీ అధర్మమూ అందరినీ ఆక్రమించి అడుగంటిస్తూ ఉన్నది. రాజ్యపాలకులు ఎంతచెప్పినా ఎంతచేసినా నీతికి నిలువక ఎగబ్రాకిపోతూ ఉన్నారు. ఆశలు అంతుదప్పి అమరలోక మేగవలయు నంటున్నవి. ఇట్లు అనుభవింపవలయునని తెల్పే సినిమారంగము లున్నవిగాని ఇట్లు ఆర్జనచేయవలయునని తెల్పే రంగ

ములులేవు. కష్టములు లేకనే సుఖముల చూరగొనవలెనను సూక్ష్మ గ్రాహులు బయలుదేరి దొంగతనములూ దోపిడీలు మోసాలు కూనీలూ ఐపీలు దగాలూ కూట సాక్ష్యాలు తకరార్లు తారామళ్లు జూదాలు ప్రబలుతున్నాయి అన్నాడు రాము.

ఇంతలో పదిన్నరగంట అయినది. టయముచూచి ప్రొద్దుపోయినది పడు కోండి అన్నది సరోజ.

ఔనంటూ రాము పడుకున్నాడు. సరోజ కృష్ణ అంటూ తలవాల్చినది.

ఇట్లే మరునాడు ఉదయమాదిగా సాయంత్రమువరకూ గడచినది. ఆరాత్రి భోజనానంతరము సరోజ రామునుచూచి ఊరికిపోయి అత్తా మామను చూచి నాలుగు రోజులుఉండి వస్తామా అన్నది.

మీవూరికా మావూరికా అన్నాడు రాము.

మీవూరే మావూరు మావూరూ మాగోత్రము మాసూత్రము మాఇంటిపేరు మంగళసూత్రంగట్టి మాయంచేసి మాను మీగా మార్చినారుగా మావూరెక్కడుంది మటుమాయమయింది మీవూరే మావూరయింది అన్నది సరోజ.

మంగళసూత్రముతో మాహక్కులన్నీ గుంజుకున్నావు మాన ప్రాణములు మాత్రము గుంజుకొనకు అన్నాడు రాము.

ఊ హూ అని తలా కన్నులూ త్రిప్పుతూ సరోజ తప్పించుకుందామనుకున్నారా మాన ప్రాణ ధనములకు మూలెకూ హక్కుదారనే పెండ్లినాడే హక్కులు పోగొట్టుకుంటూ ఉన్నామని తమ ప్రక్కవారూ తలిదండ్రులూ చిక్కులు మెడగట్టు కుంటున్నామని మాప్రక్కవారూ కంటనీరు ఆనాడే విడచినారు తమరు కట్టిన హక్కుపట్టాబిళ్ల మోస్తూ ఉన్నానుగా వేగిలేచినతోనే కన్నులకద్దుకొని భగవంతుని రక్షింపుమని ప్రార్థింపని రోజులేదు. ఈహక్కుబిళ్లలోనే నాజీవితమూ మీజీవితమూ ఉన్నది. కష్టసుఖములకూ మనఇరువుర బాంధవ్యమునకూ మధ్య దేవతాస్వరూపమై ఇరువక్షోజముల మధ్యప్రదేశమున నెలవేర్పరచుకొని హాయిగా కులుకుచున్నది. ఈబిళ్ల హక్కు చెక్కు చెదరకుండా మక్కువతో జీవితాంతమువరకూ కాపాడవలసినవిధి నాపైనా కొంత మీపైనా ఉన్నది. నన్నూ నిన్నూ తన్నూ కాపాడవలసిన విధి గూటిలోవున్న పన్నగశాయిపైనా వున్నది. ఏమంటారూ అన్నది సరోజ.

ఔను సర్వమూ సర్వేశ్వరుని మీదనేవున్నది తన్ను మరువని వారిని తాను మరువనన్నాడు. తదితరులతో తనకు పనిలేదన్నాడు అన్నాడు రాము.

తను పనిమానుకుంటే తారుమారుకారా జీవులు తారుమారుకాదా జగత్తు అన్నది సరోజ.

నన్ను ఏమరుస్తావా తన్నునమ్ముకొని తానే దిక్కని తనపైనే సర్వకార్య భారములా ఉంచి జీవించు జీవులతప్పా మిగతాజీవుల సంబంధము తనకులేదని పూర్వజన్మ పాపపుణ్యముల అనుభవింపచేయు నవగ్రహములే చూచుకుందురన్న భగవద్వాక్యము తెలియదనుకున్నావా నారాయణుడూలేడు నవగ్రహములూలేవు బాపలు గల్పించిన బాడుకోవు కూతలను జాబాలీలలో చేరువాడనని తలంచితివా అమస్తుడ నుకొను.

కం॥ కలడందురు దీనులయెడ
కలడందురు పరమయోగి గణముల పాలఁ
కలడందు రన్నిదిశలను
కలడుకలండనెడువాడు కలడో లేడో ॥

అని తలంపక కలడని కష్టము చేసేవాణ్ణే నన్ను ఏమరుస్తావు అన్నాడు రాము,

నరహరిని తలంచితే నవగ్రహముల పీడ పరిహార మగుతుందనగలరా అన్నది సరోజ.

సత్కర్మనుగానీ దుష్కర్మనుగానీ వైతొలగింప హరిహరాదులతో కాదన్నారు. అయితే వారి అదరణ కటికయెండలో కాళ్ళకు చెప్పులూ కడుపులో చలిది అన్నమూ తలకుగుడ్డా చేత ఛత్రీ వున్నట్లు శాంతిభద్రత వుండును భగవంతుడు దుష్కర్మను ఎదిరించుశక్తి మానవునకు ఇవ్వగలడు. తనశక్తిగలచోట్ల నవగ్రహ తీక్షత ఎక్కువ వుండదు. వెలుతురుగలచోట్ల చీకటిదాచుకున్నట్లు భగవత్ శక్తి ముందు నవగ్రహశక్తి తాళుకొనును వెలుతురు లేకపోతే చీకటి గ్రమ్ముకొన్నట్లు భగవత్ శక్తిలేనిచోట్ల పూర్వజన్మకర్మ సంపూర్ణముగా నలముకొనును ఆ యంధకార ములో మానవుడు కనుగానక అల్లాడును పూర్వపు శక్తిలేక పోయినా ప్రకృత మైనా దైవశక్తిని ఆర్జిస్తే. ముందుజన్మ దుష్కర్మల ననుభవించునపుడు వాదోడై చేదోడై అవువుండును. అంగరక్షకునివలె ముందుదారి చూపుచుండును గాని దుష్క

ర్మను తీసివేయ నలవికాదందురు. తానుసైదొడుగా నుండుటవల్ల దుష్కర్మ ప్రబలమై బాధింపదు. సత్కర్మ దీప్తినిచ్చునన్నారు. ఎన్నికష్టములు వున్నా ద్విసంధ్యలైనా దైవప్రార్థన మానవులకు ముఖ్యమన్నాడు రాము.

నిజము మా యాచార్యులవారూ ఇట్లేచెప్పినారు తమరేమి చెప్పగలుగుతారో చూతా మనుకున్నాను బావ భేదమేమీలేదు ప్రకృతమువచ్చిన ఈతిబాధలకు దేహబాధలకు దైవమును అడ్డుపెట్టి సవరణ గాకపోయిన,

కం॥ అక్కరకు రానిచుట్టము
ప్రొక్కిన వరమీనివేల్పు మోహరమున దా
నెక్కిన బారని గుఱ్ఱము
గ్రక్కున విడువంగవలయు గద రాసుమతీ॥

అన్నారని దైవముపై అసూయజెంది తమకర్మను ఎరుంగక తారుమారై దైవముపై నమ్మికచెడి పాషండులవువారుకూడా ఉన్నారు. దైవము యెంతమాత్రము ఈజన్మలో సహాయమివ్వగలడు. చేసినది చేయించక పోవదుకదా చేశావు బోశేశావు అన్నసామెత ఉన్నదికదా అని తెలుసుకొనలేక తెలియచెప్పువారులేక చెడిపోవుచున్నారు. అంటూ రామును చూచి అసలు మాటమరచినాము ఊరుమాట ఏమంటారు ఆనాడు ఇల్లూ వాకిలీబాగాచూడలేదు మనసారా అత్తామామతో మాట్లాడలేదు సిగ్గూ బిడియమూ ఉన్నదిగా అందులో క్రొత్త నాలుగునాళ్లు ఉండీ వస్తామనుకున్నాను తమరేమంటారు అన్నది సరోజ.

అత్తా మామను చూడబోదామనే ఆపది నాకుచొరికిందిగదాయని సంతోషమొకప్రక్క అక్కడికిపోతే అవతల ఏమోననే సందేహమొకప్రక్క రెండూ రెండు ప్రక్కల లాగుతుంటే ఎటుపోవుటకూ వీలులేక గుటికత్రిప్పలేక నీతట్టు చూడవలసి వచ్చినది అన్నాడు రాము.

మంచితనం మానవులకు మరులు మందన్నారు. ముందున్న మూడు నాళ్లలోనే ఉత్తమగుణములుగల అత్తయని తెలుసుకున్నాను ధనీ మానధనీ అనుకున్నాను నాయదృష్టమునకు నాలో నేను మెచ్చుకున్నాను మామగారు మూలమట్టముగా మానవధర్మము లెరింగిన వారని గ్రహించుకున్నాను. మీకున్నప్రేమ నాకెందుకుంటదూ నన్నుకన్నది నరపశువనుకున్నారా నన్నుకన్నది ధర్మాలకల్పవల్లి

నిర్మలహృదయ తనధర్మాల కల్పవల్లికను నాహృత్సీమలో నాటి పెంపమని ఆజ్ఞయిచ్చి ఆశీర్వదించినది భయములేమ ఎట్టికష్టములకైనా ఓర్చి మీవరకూ రాని వ్వక చూచుకోగలశక్తి ఉన్నది రేపు కావలసినతెస్తే ఫలాహారం చేసుకొని పోయి చూచి వత్తాము అన్నది సరోజ.

ఏమికావలెనన్నాడు రాము.

తమకు తెలియదా తలిదండ్రులదగ్గరకు గురువువారి యొద్దకు బంధుమిత్రుల కడకు దేవుని సన్నిధికీ అలు పిల్లలవెంతకు పోవునప్పుడు పూలూ పండ్లూగాని ఫలాహారముగానీ తీసుకొనక రిక్తహస్తములతో పోయిన పాపమనలేదా పెద్దలు. లోభులూ దరిద్రులూ తప్ప మరెవ్వరూపోరు రేపు చెప్పుతాను వస్తువులుతేండీ ఫలహారము చేసుకొని పోదామన్నది సరోజ.

సరే నీమాట కాదనడమెందుకు అత్తా కోడలినీ కలిపి అవతలికథ చూస్తాము అని పడుకున్నాడు రాము.

సరోజ నవ్వుతూ అత్తాకోడండ్ల భయం పూర్తివున్నదే, పాపము అవును ఇరుగు, పొరుగు కాపరాలుచూచి పెండ్లి మానుకున్నవారుకూడా వున్నారన్నారు అత్తా కోడండ్రసందు తగవులదీర్చ హరిహరాదులకుకూడా అలవికాదన్నారు తెలిసి వర్తిస్తే తగవులే కలుగవన్నారు తెలిసివర్తిస్తాములేండీ దమరు ఇష్టపురమద్యా తికమకలూ దకిమికలూ గావద్దు అంటూ పడుకున్నది.

మరునాడు రాము కావలసినవస్తువులన్నీ తెచ్చినాడు సరోజా అయిదారు ఫలాహారములుచేసి బుట్టికిపెట్టి కావలసిన గుడ్డలూ వస్తువులూ ఎత్తుకొని బోజనానంధరం బస్సుకు బయలుదేరి సాయంత్రం ఆరుగంటలకు నారాయణపురంచేరి గుఱ్ఱపుబండిలోవచ్చి ఇంటిముందు దిగినారు వారినిచూచి జ్ఞానాంబ అక్కడనే నిలువండని యెఱ్ఱనీళ్లుతెచ్చి త్రిప్పి వారిముందు అక్కడనే పోసింది వారుదైవాన్ని తలంచుకుంటూ యెఱ్ఱనీళ్లనుదాటి ఇరువురూ శుభం అని కుడికాలురాము ఎడమకాలు సరోజ కడపకిలి అవతలపెట్టి గృహప్రవేశ మయినారు బండివాడు సామానులు తెచ్చి ఇంట్లోపెట్టినాడు. సరోజ నిలుచుకొని ఉండుటచూచి రాము ఏమన్నాడు.

సరోజ దండము పెట్టుదామని సంజ్ఞారూపమున చెప్పినది.

రాము తలిదగరకు పోబోయినాడు.

సరోజ తండ్రియని సైగ చేసినది.

రాము అదిగ్రహించి తండ్రిదగ్గరకుపోయి సాగిలపడి నమస్కరించినాడు.

సరోజ రాము ప్రక్కనే మోకరించి నమస్కరించినది. ఇరువురనూ ఆశీర్వదించినాడు తండ్రి రంగనాథం. అటుపై తల్లిదగ్గరకు పోయి నమస్కరించి పోయి కాళ్లుమొఖము కడుగుకొనివచ్చి జ్ఞానాంబ కాఫీయివ్వగా రాము కాఫీత్రాగి తండ్రితో మాట్లాడ మధ్యహాలులోకి పోయినాడు.

సరోజ శిరస్నానముచేసి కీలుగంటు వేసుకొని పొడిగుడ్డ కట్టుకొని వచ్చినది.

అత్తా జ్ఞానాంబ కాఫీతెచ్చి ఇదుగోనమ్మా అంటూ ఇచ్చినది.

సరోజ రెండుచేతులూసాచి వంగి కాఫీతీసుకొని దేవునిదగ్గరకుపోయి నమస్కరించి నిలుచుకొని త్రాగుట ధర్మవిరుద్ధమని కూర్చొని గ్లాసునోటికి తగులకుండా త్రాగి గ్లాసు కడిగి తెచ్చిపెట్టినది.

అత్త జ్ఞానాంబ ఇదిచూచి మరియాదగానే ఉన్నదనీ కొడుకూ కోడలూ ఈడూ జోడూ బాగున్నారని మురిసిపోతూ రామా అని కొడుకును పిలిచినది.

ఏమమ్మా అంటూ వచ్చినాడు రాము.

రామా మీరు ఇక్కడనుంచీపోయి దాదాపు నాలుగుమాసాలగుతూ ఉన్నదే ఇల్లూవాకిలీ ఉన్నదనీ అమ్మా అప్పా ఉన్నారని జ్ఞాపకమే రాలేదా సెలవు ఇవ్వలేము ఇవ్వలేదని అనడమేకాని వచ్చేదిలేదా సెలవివ్వక పోతే రాజీనామా పారవేసి రాకూడదా ఉద్యోగం లేకపోతే బ్రతుకలేమా అన్నది జ్ఞానాంబ.

సరోజ రామునుచూచి పైటచెరుగును నోటికి అడ్డముపెట్టుకొని దిగ్భ్రమతో నిల్చుకున్నది.

రాము చిరునవ్వుతో సరోజను వారగంట చూస్తూ అమ్మా ఉద్యోగమంటే సులభమనుకున్నావా ఇప్పుడు పోకూడదంటే ఉండవలె పోఅంటే పోవలె స్త్రీల పైన కాపురము ఆధారపడినట్లు ఉద్యోగం పైవారిపైన ఆదారపడి ఉంటుంది ఎట్లో కొంచెము శాంతముగా ఉంటే సర్వకార్యములూ నెరవేరగలవు తీవ్రపడితే కార్యహాని ఉద్యోగహానీ కలుగుతుంది శాంతము మానవునికి అంగరక్ష అని నీవే అంటూ ఉంటావే శాంతానికి అగ్రస్థానమిచ్చి వారు చాలా అన్నదాక తిష్టవేసి కూర్చున్నాను వారికే జ్ఞానంకుదిరి ఇంకపోవచ్చు అన్నారు సరేనని వచ్చినాను అడుగూ కోడల్ని అంతేనో కాదో అన్నాడు రాము.

నీవు అక్షరంతప్పకుండా అంతా చదివినావుగా ఇంక సరిచూడడం ఎందుకూ అన్నది తల్లి జ్ఞానాంబ.

సరోజ చిరునవ్వు నవ్వుతూ అత్తా చదువుకున్నవారు శుద్ధతప్పుచేసినా చూచే వారికి శుద్ధవప్పుగా గన్పడేటట్లు సమర్ధిస్తారు. ఒప్పులూ తప్పులూ చదువులోనే ఉన్నవి అన్నది.

నావప్పులూ తప్పులూ మాఅమ్మను అడుగవే తప్పులు సిరిపారవేసి ఒప్పులనే గ్రహించువాడని మాఅమ్మకు బాగాతెలుసు. నిన్నా మొన్నాటిదానవు నీకేమితెలుసు అన్నాడు రాము.

ఆమాటలువిని జ్ఞానాంబ నవ్వుతూ ఔను తల్లక్రిందుగా తపస్సుచేసివుంటే తప్పులు వప్పులుగా మారినవి తప్పరా అంటే తప్పన్నర చేస్తాననేవాడు దిద్ది దిద్ది తయారుచేసిఉంటే వప్పుల కుప్పైనాడు నిన్నామొన్నటిదాకా తగనితప్పులుచేసే తంటా తుంటరులలో తానే అగ్రాసనాధిపతి ఈనాడు శాంతహృదయుడై శాంతము చెప్పుతున్నాడు అన్నది జ్ఞానాంబ.

రాము నవ్వుతూ అమ్మా పెద్దవారుకూడా చిన్నతనంలో ఎన్నోచేసి ఉంటారు. అవివారుతెలుసుకొని చిన్నవారితప్పుల తీర్చి దిద్దవలసినదేగాని కోప గించి తిట్టేవారు కొట్టేవారు ఉన్నారు కొట్టకుండా తిట్టకుండా నయముతోనే తీర్చినా వమ్మా తల్లిలోఉంది పిల్లలబ్రతుకు బ్రతుకుతెరువుకు తగిన విద్యాబుద్ధీ చెప్పించి తగినరీతిగా తీర్చక పోవిడచిన వెనుకవారు అధోగతి పాలుకాగలరు. ఆదోషము తలిదండ్రుల కాపాదించి ముందుజన్మకు వారూ అదేగతికాగలరు. నన్ను చక్కగా తయారు చేసిన పుణ్యము మళ్లీ జన్మకు నీకు తప్పక ఉంటుందమ్మా అన్నాడు రాము.

నిజమే నంటూ నవ్వుతూ జ్ఞానాంబ వంటపని చూచుకొన పోయినది.

సరోజ అత్తను అడిగి దేవుని దీపముముట్టించి ధాన్యశ్లోకములు చెప్పుకొను చుండెను.

రాము స్నానముచేసి తానూ పూజావిధానములో పాల్గొనెను రాత్రిఏడు గంటలాయెను పూజ అయిపోయినది.

జ్ఞానాంబ రామునుచూచి మీయప్పను పిల్చునాయన ఏవేళప్పుడు భోంచేసి వచ్చినారో భోంచేతురన్నది.

మధ్యహాలులో జపముచేసుకొంటూ ఉన్న రంగనాధంవద్దకు పోయి అప్పొ భోంచేస్తామా అన్నాడు రాము.

కానీ పోదాముపద అని లేచినాడు రంగనాథం.

ఇరువురూ వచ్చి కూర్చున్నారు.

జ్ఞానాంబ వడ్డిస్తూ సరోజా నీవూ కూర్చోమ్మా వడ్డిస్తానన్నది.

ఇరువురమూ మళ్లీకూర్చుందాము వారికికానీ అత్తా అన్నది సరోజ.

అంతలో రాము అమ్మా నీతోనే నయం నీకోడలితో భయంగావుంది కాలు తీస్తే ఒకటి కాలు పెట్టితే ఒకటి కదిలితే ఒకటి మెదిలే ఒకటి ఆచారాలు అనాచారాలు ఆరోగ్యాలు అనారోగ్యాలు పాపాలూ పుణ్యాలూ వారాలూ వక్కపొద్దులు నీతులూ నియమాలూ అంటూ ప్రాణాలు తీసేస్తుంది ఇద్దరూ ఒకచోట ఉంటే ఇంకా ఏమ వుందో పెద్దవారికన్నా ముందుతినరాదు. పెద్దవారితో పెట్టించుకొనరాదని అప్పుడే అతుకువేసింది చూడు అన్నాడు రాము.

రంగనాథం నవ్వుతూ సరే ఒకఇంటిలో ఇద్దరు పిచ్చివాళ్లయితే తిరుణాలా తీర్థవాసీ అక్కడే వుంటుందన్నారు కానీ మాఅమ్మా ఈ ఇంటిలో ఇట్లే వుండే కోడల్ని తయారుచేసి పోయినది అత్తకు పనిలేకుండా అక్కడే తయారయినకోడలే వచ్చివుంటే అత్తకుపనిలేకుండా పోయినది అన్నాడు రంగనాథం.

పిచ్చిది ఉండే వెఱ్ఱివారికి ఏ కష్టాలులేకుండా చక్కగాచేసి పెట్టుతుండేది పిచ్చిలేని మచ్చకంటి అయివుంటే అకంటి తళుకుల్లో తలపోటుల్లో మాడునొప్పుల్లో కంటినొప్పుల్లో కంటికి అద్దాలువచ్చి పనిచేయలేని దొంగతనాల్లో చెప్పుకోలేని అజ్ఞానాల్లో అలుమొగళ్ల అలజడుల్లో దేహజబ్బుల్లో దయ్యాలూ పీడలూ పిశాచాలూ పట్టి దిగదీయింపులూ ఎగదీయింపులూ వచ్చి యంత్రాలూ మంత్రాలూ వచ్చి మెడకెక్కి దుర్భలాలూ నీరసాలు వళ్లుకెక్కి టానిక్కులూ ఎగనిక్కులూ ఇంటిలో గూటికెక్కి ఉంటే పిచ్చివిడచి వెఱ్ఱిముదిరివుండు.

మనిషిని చూచిచూడకముందే మనసును గమనించి మహారాజుకు జరిపినట్లు జరిపేమనిషి దొరికి అబ్బా కొడుకూ ఆడినది ఆట పాడినదిపాటగా ఉంది లేకుంటే తెలిసివుండునన్నది నవ్వుతూ జ్ఞానాంబ.

అబ్బా ఏమిచదివినావే చదువూ సర్వమూ తెచ్చి వంటఇంటిలో పెట్టుతుంటే

అంగలారుస్తున్నావు ఈపనికి ప్రక్కల పదహారుమంది పనీపాటకు సహాయం దీనికి ఏమేమో చదువుతావు అన్నాడు రంగనాథం.

ఔను అన్నానికిలేని అనాథ సంరక్షణకొరకై వడ్లను దంపిస్తా కార్యకలాపాలుచేయిస్తా దొడ్లో చెట్టూ చామావేయిస్తా యెఱువూ నీళ్లూ వేయిస్తా పశురక్షణకై పశుగ్రాసముకొరకై పదిమందిని పోషిస్తా వారితో మనకుమేలు మనతో వారికి మేలు ఇవన్నీ చాలించి గొంతెమ్మలాగ సింగారించుకొని కూర్చొమ్మంటావా పశుసంపద వుండడముతోటి పసిపిల్లలకు పాలు దానంచేస్తా మనకు కావలసినన్నీ పాలూ పెరుగూ నెయ్యీ ఉంది ఇరుగు పొరుగువారికి మజ్జిగకావలసినన్నీ వేస్తా గోమయం కావలసిన వారికందరికీ ఇస్తా దొడ్డిలో కూరగాయలు పండించి దానం చేస్తా కావలసినన్నీ తింటాము వాళ్లేచేస్తారు, వాళ్లేతింటారు దాన మనకువచ్చు నష్టమేమీ పరోపకారము లేనిజీవి బ్రతికి చచ్చినవాడన్నారు వారిలో చేరమంటారా చూడరా నాయనా మీనాయన చెప్పేమాటలు అన్నది జ్ఞానాంబ.

ఔను అమ్మా ఉన్నావారు పదిమంది బీదవారికి పనిగల్పించి తానుచెడకుండా వారు ఒడిబడకుండా చూడవలసినదే ఉన్నవాడనగా ధనమున్నవాడొక్కడే నని అర్థంకాదు మూడునాల్గు ఉన్నవి. ధన్నమున్నవాడు విద్యవున్నావాడు బాహూబలమున్నవాడు బంధుబలముతో సైన్యబలముతో పలుకుబడితో బలమున్నవాడు ఈ నాల్గు నలుమూలల నాల్గుస్తంభాలుఇవి ఒరుగు దిరిగినా ఇరుగుచూపినా పిప్పిబట్టినా కొంప గూలినట్లు గ్రామములో ఈనల్గురూ చెడినట్లయితే గ్రామనాశనమన్నారు కలికాలం అదేనన్నారు దురాదాయములకై ఈనల్గురు చొరబడిన గృహం దహనం అన్నారు గ్రామదహనం అన్నారు. పనిగలిగినప్పుడు పరమాప్తులరీతి పదే పదే పిలచి పనిచేయించుకొని పారదోలి ప్రాణము పోతున్నది పట్టెడన్నమో చారెడు గంజో పోయమంటే పంకించక పండ్లిగిలించే ధనిక వర్గమువినవెంచక విదిలించి గమనించక గ్రాంఢ్రచే ధనికవర్గమూగల పాపికాలం ఇక పండితులవారన్ననో పారమార్థికము బోధిస్తారు. పాపరహితము చేయిస్తారు అని పజ్జచేరితే కుమార సంభవమూ తారా శశాంకమూ చదువుతూ అర్థము చెప్పడములో ఉర్లువొడ్డి వల లోవేసుకొని ధనమో మానమో హరిస్తారు ఇక బాహూబలముగలవారనీ పలుకుబడి గలవారనీ ప్రక్కనజేరితే ఇంటిపనులకో వంటపనులకో వెంటదిరుగు జంటపనులకో కంటకింపైతే పెంటపనులకో వాడుకుంటారు ఈ నలువురే లోకమునకు పరోపకారము చేయవలసినవారు కంచెయే చేనుమేసినగలదెదిక్కు అన్నట్లు ఈ నలువురే

లోకకంటకులైతే తల్లిలేని పిల్లలవలె తల్లడిలక తాజాపడగలరా. ప్రజలు మలమల మాడత కలకలలాడుతుందా లోకము అమ్మా నీవు చేసేపని చాలామంచిదేనమ్మా ధనికుడు బీదలా విద్యావంతుడుని రక్షరకుక్షుల బాహుబలవంతుడు దుష్టుల వలుకుబడిగల ప్రతిభావంతుడు బీద సాదల కార్యకలాపముల చక్కజేయ కంకణముకట్టుకున్నరోజు కలియుగము కనకయుగము కాగలదు. ప్రజల ముఖము కలకలలాడగలదు. పసిపాపలు కిలకిల నవ్వగలరు. దరిద్రదేవత కడుపు మలమల మాడగలదు అన్నాడు రాము.

అంతలో భోజనము అయినది తండ్రీకొడుకులు లేచి చేయికడుగుకొని మధ్య హాలుకు పోయినారు.

జ్ఞానాంబ ఆకువేసి పదార్థములన్నీ ఆకు సమీపములో ఉంచుకొని సరోజా రావమ్మా మాటలు పెట్టుకొని భోజనమునకు చాలా ఆలశ్యమయినదీ అన్నది జ్ఞానాంబ.

వస్తున్నా అత్తా అంటూ సరోజ పోయి రాము భోంచేసిన విస్తరముందు కూర్చున్నది.

జ్ఞానాంబ ఆతీరుచూచి అక్కడనే కూర్చున్నావా అభ్యాసమయినదా ఎంగిలాకా ఎంగిలా ఎంగిలితట్టా అంటూ ఏవగించుకొనే ఇల్లాండ్రు ఉన్నారు. అందుకై వేరే ఆకువేసినానమ్మా ఆనీతీ నియమములుంటే ఉత్తరోత్తరా అభివృద్ధికిరాగలవు. మనపూర్వుల మనము మరచిపోరాదు అంటూ తనభర్త ఆకులో తానువడ్డించుకొని వడ్డించమన్నావా అన్నది జ్ఞానాంబ.

వడ్డించు అత్తా కంచం పొత్తులేనిది మనసు పొత్తు కుదరదు మనసుపొత్తు లేనిది మంచం పొత్తు కుదరదన్నారు. సర్వదా భుక్తశేషముతోనే జీవించవలసినది స్త్రీ యని అమ్మవల్ల విన్నాను. మాఇంట్లో ఈపద్ధతి ఆచరణలో ఉన్నది అన్నది సరోజ.

ఔనమ్మా ఒకరినిచూచి ఒకరు చెడిపోవుటాకలదు ఒకరిని చూచి నేర్చుకొని మేలుపొందుటాగలదు నీతిని నేర్చుకొని మేలుపొందగలరు. అవినీతిని నేర్చుకొని అడుగంటాగలరు నీతికి దూరులైన నీచులకు మరుజన్మలో నిలువనీడ ఉండదు. చూస్తున్నాముగా కష్టజీవులా బుద్ధిలేనిదద్దన్నలా అంగహీనులా అప్పులులేని అనాధలా మూడుసుఖాలూలేని మూలపెద్దమ్మలా అంటూ రెండువిస్తళ్లలో వడ్డించి కానీతల్లీ అంటూ తానూకూర్చున్నది.

సరోజ పప్పు అన్నముకలిపి చేతికిముద్దయెత్తుకొని అత్తను చూచినది.

కానీవమ్మా నేను ముద్దయెత్తనిది నీవుయెత్తకూడదనియా అంతవరకూ పోయినావా మంచిదితల్లీ అంటూ అగ్నిదేవుని దేవుని పతిని తలంచుకొని ముద్ద నోటిలో ఉంచుకున్నది జ్ఞానాంబ.

అమాటా ఈమాటా మాట్లాడుకొంటూ భోంచేసి వంటఇంటి పనులు చక్క పెట్టి మధ్యగదిలోకి వచ్చినది జ్ఞానాంబ.

రాము శయన గృహములో కూర్చొని ఏవోచదువుకొనుచుండ సరోజ పోయి నిలచెను.

రాము సరోజనుచూచి అత్తా కోడండ్రవ్యవహారం అంతా అయిపోయెనా అన్నాడు.

అబ్బా కొడుకుల వ్యవహారం అంతా అయిపోలేదూ అని చిరునగవుతో వయ్యారముగా చూచినది సరోజ.

అదుగో ఆచూపు చూచినావా అప్తబంధువులాగా హాజరవుతాడు అనంగుడు అంచుకు పిలుస్తావు అవతలపోమ్మంటావు ఈలాంటి చూపులతో మాటలతో ఎందరో యువకులు హతమయినారు కలికిచూపులూ చిలుకపలుకులూ చిరునగవులూ చూచి మోసపోయి ముందుకుసాగి చెడిపోయినారు. అపనిందల పాలయినారు కలవరాలతో కామజ్వరాలతో కడకు కాటికికాళ్లు సాచినారు పసలబాలునికథలో ఒక కవి వ్రాసినాడులే.

అడవారీ మాటావింటే అర్థికొచ్చూ కొర్తికొచ్చూ
తప్పితే తలకాయాకొచ్చూ ఆడవారీ నమ్మాలేనే
నమ్మలేనే నాచిన్నపణతీ అన్నాడు.

అమృతముచిలికి హాలాహలము కురిపించవద్దు అమృతమయమేచేయి అన్నాడు రాము నవ్వుతూ.

అమృతోపమానముగా చిలుకపలుకులు పలికి చిరునగవులు నవ్వి కలికి చూపులుచూపి మగవారిమనసును కదలకొట్టి రెచ్చగొట్టి పిదప మనసును విరగ గొట్టి మదన తాపజ్వాలలలో కాల్చి మసిజేయు కఠినపక్కసిననుకున్నారా అలాంటి స్త్రీలు అధః పతనమగుతారు. మగవారిని మరులుకొల్పి మమతతెల్పి మానుకొన్న పాపము పోదు. తన్నూ కాల్చి మసిచేస్తుంది మరుజన్మకు విధవత్వము గలిగించి

ఆఇంటనే ఇరువుర ముప్వుర సుఖపడు జీవుల గల్పించి కళ్లారాచూస్తూ ఆనంద వాక్యముల వింటూ వంటరియై కామబాధను భరింపలేక ఆగంతుకమృత్యువుల వాతబడజేయును వృథా పోదు. ధర్మశాస్త్రమూ స్త్రీధర్మమూ కొంత తెలుసు నన్నది సజరో.

ఈమాటలు కొంచెము కొంచెము వింటూ ఉన్న రంగనాథం మధ్య గదిలో పడుకొనుచున్న జ్ఞానాంబదగ్గరకు పోయి విన్నావా కోడలిమాటలు అన్నాడు కన్నులు ఎగరవేయుచు.

ఔను మరి ఆడవారికున్నరోగమే ఇది మనసు కదలగొట్టి మానుకుంటే మానవుడేమి కావలయును ఆపాపము ఊరకపోతుందా నిజమే నన్నది జ్ఞానాంబ.

ఇంతలోరాము సరోజనుచూచి మంత్రివరా చాతుర్వర్ణంబులు ధర్మంబులు దప్పక వర్తించుచున్నవా అన్నాడు నవ్వుతూ.

ఆహా ప్రభూ చాతుర్వర్ణంబుల ధర్మంబులు చెల్లాచెదరుచేసి చెరిచి చెన్నంగీ దున్నంగీ విత్తి అనేకమయిన భాషల సృజించి వకరిమనోభావము ఒకరికి తెలియ కుండునట్లోనర్చి అనేకమయిన మతముల పుట్టించి మనసులవిరచి ఏమతము బాగో ఏదిఓగో తెలియకుండా మరుగు పరచి అనేకమయిన కట్లు జుట్లు బొట్లను సృజించి కట్లతో జుట్లతో బొట్లతో కొంత ప్రజల విభజనచేసి అసలు జాడల రూపుమాపి అనంతములయిన మతజాడల గల్పించి జాతి మత భాషా ఆచార వ్యవహారములను శివమెక్కించి తమపని ఏమో తామే ఎగబెట్టి ఇంతకన్నా సుళువులేదని జాబాలి మతమును చేపట్టి ప్రజాసముద్రమునుండీ శక్తికొలదీ కాల్వలుతీసి తమతమ మళ్లకు పారబెట్టుకున్నారు. ధాన్యమునకు బదులు ఉప్పుపండుటచూచి కడకు జీవితాంతమున తమతప్పు తాముతెలుసుకొని చింతించి పరమపదించినారు. కొంవరు వక్తరూ మత గురువులూ వారివంశపరంపరలో ప్రకృతం ఇప్పుడున్న మహాపురుషులు పైవారి తప్పు తెలియక కలికావతార వేషధారులై కాంభోజీ రాగముతో గంభీరముగా ఒకరినొకరుచూస్తూ మీసముల మెలివేస్తూ కాళ్లుచేతులూ నడుమూ పిరుదులూ కను సోగలూ కన్నులూ హావభావములకు సరిపోవ నాడించుచూ క్రిందికి మీదికి చూస్తూ వీరావేశముతో నాట్యము చేస్తూ వారివారి చేన్లగెట్ల నామతమే మతమూ నాజాడే జాడా నాకార్యమే కార్యమూ నాబోధే బోధ నామంత్రమే మంత్రము నాజాతే జాతీ నానీతే నీతీ నాగురువే గురువూ నాచాలే నాలూ నావేషమే వేషం రాండీ రాండీ అని చేయివకటి సాచి ఒకటి చెంపనబెట్టి కొంచెము వంగి శక్తికొలదీ కేక

వేస్తున్నారు. ప్రజలు ఎవరిమాటలు నిజమో తెలుసుకొనలేక విసిగిపోతూ ఉన్నారు. నిజమిద్దియని తెల్పుజోష్యులు అంతరించుటతోటి వీరిఆటలూపాటలూ కావలసినంతా సాగినవి వారిశక్తి ముందుకు సాగినదనుకా వీరిఆటలంతరించవు. ఈ కేకలు నశింపవు ప్రభూ పావనాశక్తిగల బ్రాహ్మణశ్రేష్ఠులు శక్తివంతమయిన సుక్షత్రియులూ కలికాలానుగుణ్యముగా అండుగంటి అన్యాయ తిమిరముల లముకొని కన్నులు కానరాక ఎటుపోవుటకు ఏదివినుటకు వలను పడకయున్నది. కలిప్రేరణతో మంత్రయుగము మాయమై యంత్రయుగముగా మారినది. ఇట్టియంత్రయుగములు ఎన్నో ఇదివరకు పోయినవన్నారు దైవజ్ఞులు ఇదీఅట్లే ఎట్లోపోతుంది ప్రకృతం చాతుర్వర్ణ ధర్మంబులు వింధ్య హిమాచలపర్వతములదాటి ఆక్రందనము చేయుచూ అన్యదేశములకు పరుగిడుచున్నవి. అడ్డుపడు మగవాడు ప్రకృతం గనరాడు భారతజాతినీతి నియమములకు అభయమిచ్చి అన్యమతసాంప్రదాయముల అడుగంటించి నిజమయిన పూర్వ సాంప్రదాయముల నిలబెట్టుజెట్టీయేడీ యెవరికివారే యమునాతీరే అన్నట్లు ఎవరి ఆలుపిల్లల రక్షణవారిదే అయినది. నామతము నాభాష నాకులము నాదేశం అన్నట్లే ఉందిగాని వారివారినేవారు ఆరగిస్తూఉన్నారు అడుగంటిస్తూ వున్నారు ఆదరణఏదీ శక్తిగలనాల్గు మూలస్తంబాలూ నలుమూలల పరమ భేతాళ హృదయముతో లావు లావుమని చేతులుసాచుకొని చెంతకువచ్చిన వారిని నయముతో చెంతకురానివారిని భయముతో ముగిస్తూ ఉన్నారు ఇంకెక్కడి చాతుర్వర్ణములు అన్నది సరోజ.

ఔను నాజాతీ నామతం నాభాష నాదేశం అనేశివము మానవులకు ఎక్కించి నారు ఈశివంతగ్గదు తగ్గుటకు రాజకీయంగా మంచిమాత్ర రంగలించి వేస్తేగాని కుదరదు సామదానభేదములతో కుదరదు దండనోపాయముకావలె లేదాగొప్పగా ప్రచారములు జరుపవలె ఎక్కడవుతుంది తొందరలో కొంతకాలానికివస్తుంది అంటూరాము సరోజనుచూచి మంత్రీ సందేహము ఒకటిఉంది తీర్చగలవా అన్నాడు.

ఆహా ప్రభూ తెలిసినంతమట్టుకూ తెలుపగలను కానివ్వడీ అన్నది సరోజ.

మంత్రీ తల్లికి ముందుదండముపెట్ట పోతూవుంటే తండ్రిని చూపితివే అదెందుకట్లు చూపితివో తెల్పిసందేహముతీర్చగలవా అన్నాడు రాము.

అహ మహాప్రభూ మాతృదేవోభవా అనిముందు అన్నంతమాత్రముతోనే తల్లికి ముందుదండము పెట్టవలయుననిఉన్నదా మనమాతృదేవికికూడా మనపితృదేవుడు పూజనీయుడూ వందనీయుడూకాడా మాతృదేవికి పితృదేవునికి గురుడు

వందనీయుడుకాడా ఈముఫ్ఫురికీ దేవుడు వందనీయుడూ పూజనీయుడూకాడా తల్లినుండీ పూజనీయులు ప్రారంభమై ఒకరికన్నా ఒకరు దేవునివరకూ వంద నీయులయినారు. వందనపూజార్హులువీరు అందులో సకలచరాచరకర్త సంరక్షణలో భర్త లయింపచేయుటలో హర్త అయినదేవునికి ముందు నమస్కరింప వలయును. అటుపిమ్మట పుత్రవాత్సల్యమున శిష్యవాత్సల్యమున తను విన్నది కన్నది చదివి అనుభవములో ఉన్నది గురుపరంపరా పితృపరంపరగా వచ్చినది దాచక తెల్పి మార్గదర్శకుడై త్రిలోదకములలో తీర్థప్రసాదములలో త్రిసంధ్యలలో నన్ను మరువకుమని వెన్నిపునతట్టిన గురుదేవునికి అన్నది సరోజ.

ప్రక్కగదిలో ఈమాటలు వింటూ ఉన్న రంగనాధం ప్రక్కలో పడుకొని ఉన్న జ్ఞానాంబను వినూవినూ అని గట్టిగా తట్టినాడు.

ఏమండీ యముకలు విరిగిపోయేటట్లు మోటతనంగా అట్లతట్టుతారూ వెఱ్ఱి ముదిరిందా ఏమీ అన్నది జ్ఞానాంబ.

వెఱ్ఱిగాదూ పిచ్చిగాదే కోడలుచెప్పుతుండే ధర్మాలువిని అనందంపట్టలేక మైమరచి అబ్బా అని ప్రక్కనున్ననిన్ను వినమన్నాను అన్నాడు రంగనాధం.

వినేది ధర్మాలూ చేసేది కర్మాలూనా తమ ఆనందములో మైమరచడములో నాడొక్క ఎముకలు విరిగిపోయినవి చాలు మళ్లిమైమరచేరు అన్నది జ్ఞానాంబ.

అంతలో రాము సరోజనుచూచి ఊ అవతలా అన్నాడు.

మహాప్రభూ సావధానులై వినండీ మనమాతృదేవిని ఏరికోరి తెచ్చుకొని సకలవిధములా కంటికిరెప్పలాగా చూచి గర్భమయినది మొదలు దీక్షలుచేస్తూ కోరినవన్నీతెచ్చి యిస్తూ కోరకపోయినా పదేపదే అడిగి లాలించి పాలించి ప్రేమించి ఆనందింపచేస్తూ వచ్చి ప్రసవించినదాదిగా తల్లికి పిల్లకూ కావలసినవన్నీ తెచ్చి యిస్తూ తల్లిపిల్లల ప్రేమతో తహతహపడుతూ కాళ్లుకాలిన పిల్లిలాగా ఇంటికి వీధికి తిరుగుతూ తినీతినక తల్లి పిల్లల పెంచి పెద్దచేసి విద్యాభివృద్ధికై దేహాభివృద్ధికై యశోవృద్ధికై ఎంతో ప్రయాసపడిన పితృదేవునికి అన్నది సరోజ.

అబ్బబ్బా ఏమిధర్మం ఏమిధర్మం అంటూ రంగనాధం తలత్రిప్పుతూ తన రొమ్ముపై బాదుకుంటూ ఉండగా అయ్యయ్యో నీధర్మాలపై బండపడా ఇదేమిటండీ అట్లబాదుకుంటారు కోడలుచెప్పే ధర్మాలకు మామమైమరచి రొమ్ములబాదుకోవ డమా ఎవరుగా ఏదయినాచెప్తితే ఆగలేక ఆపలేక ఆనందం పట్టలేక ఆమెనే బాదు తారా ఏమి అన్నది జ్ఞానాంబ నవ్వుతూ.

ఛా ఛా ఛా నీముఖముచూడరాదు ఏమిమాట మాటాడితివే కన్నకూతురొకటీ కోడలొకటీనా కోడలితో సరసాలూ సరసల్లాపాలూ ఆడినవారికి మరుజన్మకు ద్వికళత్రయోగ మేర్పడి మొదటిభార్యకొడుకు పినతల్లి యనక వావివరుసలులెక్కించక రెండవభార్యతో సరసల్లాపాలు ఆడుతుండచూచి దుఃఖించి ఏమిచేయుటకూ ఎటుపోవుటకూ వలనుపడక దుఃఖముతో తలవాల్చవచ్చునన్నారు. అట్టివారి నెందరినో చూచుచున్నాము ధర్మదూరుడై బ్రతుకుటకన్నా చచ్చుటమేలు నీతిలేని అవినీతి ననుకున్నావా జ్ఞానా ఎంతమాటన్నావు ఏనాడయినా అట్టి దుర్నీతిలోదిగిన దినము కన్నావా విన్నావా అన్నాడు రంగనాధం.

ఆమాటకు నొచ్చుకున్నాడని తెలుసుకొని జ్ఞానాంబ నవ్వుతూ ఇంతచిన్న మాటకు అంతనొచ్చుకుంటారెందుకూ అని తాను మరింత అనుకొనిపోయి మీద చేయివేసి నిమురుతూ నేనన్నమాట తప్పా అలాంటి అధర్మపరులు లేరంటారా తమరు వినలేదంటారా అన్నది జ్ఞానాంబ.

చేసినది చేయించుకుంటారు ముందుసుఖపడి ఒకటికి పదెంతలు దుఃఖపడతారు ఆముండగులతో ధూర్తులలో నన్నుచేరుస్తావా పావలాతీసుకొని రూపాయ ఇవ్వవలెనంటే ఎంతకష్టమో ఎంతదుఃఖమో చూడూ అన్నాడు రంగనాధం.

ఇది పురుషులవల్ల జరుగదులేండీ స్త్రీ చేయవలెననిగాని తెలియకగాని పురుషునికి చనువిచ్చి విచ్చలవిడిగా కంటిముందుతిరిగి వగలూ వయ్యారాలూ చూపి పురుషుని మన్మధావస్థలోదింపి మరులుకొల్పి మన్మధజ్వాలలు మాటిమాటికి రగుల్కొల్పితే ఆజ్వాలలకు క్రాగిక్రాగి ఆగలేక చూడకుంటే బ్రతుకలేక వెంటవెంటనే పసిపిల్లలాగా తిరుగు మగవారికి అంగసౌష్ఠవములు చూపితే మగవారు మానప్రాణములతెగించి దీనవదనముతో వెన్నంటి తిరుగుతూ రక్షించమని గద్గదస్వరముతో గడ్డము పట్టుకొని బ్రతికించి పుణ్యముగట్టుకొమ్మని బ్రతిమాలుతారు సక్రమమైన రీతిగా అదుపూ ఆజ్ఞా నీతీ నియమం ఎరింగి స్త్రీనడుచుకొనిన అంతదూరమురాదు. ఉండినా మనసులోనే మదనజ్వాలలు ఆరిపోగలవు. ఇది అంతా స్త్రీలోనేఉంది చిత్రం ఇదీగాక కొన్నిఇండ్లలో మామకు కోడలు నీళ్లుతోడి పోసి వీపురుద్ది కాళ్లురుద్ది కట్టుపంచెతెచ్చి యిచ్చే అభ్యాసాలున్నాయి ఇవి ఈఅగ్నికి మరింత సమిధలై సమీరుడై ఆరిపోవు అగ్నినికూడా రగుల్కొల్పుతుంది చిచ్చై ఇటు యిహాన్నీ అటు పరాన్ని చెరచినదిగాక మరుజన్మలో దుఃఖాన్ని కావలసినంతా పెట్టుతుంది అట్టకోడలితో చేయించుకున్నమామకు చేసి చెరచిన కోడలికి ఒకేచోట దుఃఖసముద్రం ఉంటుంది.

పదిఏడులుదాటిన మగపిల్లవానిని తల్లికూడా ఏరదోలమన్నది ధర్మశాస్త్రం భార్యతో మినహా మరెవ్వరితోనా సేవసేయించుకొనవద్దన్నది మగవానికి ధర్మశాస్త్రం పురుషుడు అజ్యం స్త్రీ అగ్ని. ఈరెండూ కలియనే కూడదన్నారు పెద్దలు కలిస్తే కలికాలం ప్రారంభమగుతుందన్నారు కనుగలిగి బ్రతికితే కలమసుఖమన్నారు. ఒకానొక మహారాజు సత్యలోకములో గంగాభవాని ఊరువుల కనుమూయక చూచినందుకు బ్రహ్మచే శపింపబడి పుణ్యశ్లోకుడై శంతనుడై జన్మింపబడీ ఆవంశము సారంగధరుని వరకూ వ్యాప్తిచెందినది. పుణ్యార్జనచేసి సత్యలోక నివాసమేర్పరచుకున్న మహనీయునికే స్త్రీ అంగసౌష్ఠవములజూచు ఆశ విడలేదు. ఈమానవులకుంటుందా ధర్మాలకట్టు తెగక ఆగుతుందా తమకు యాభైయేండ్ల వయసు వాదావున అయినది ఇప్పటికీ అని అంతటితో ఆపినది జ్ఞానాంబ.

ఊ అవతలఅనూ యాభైయేండ్లువచ్చినా ఇరవైయేండ్లనాటి వ్యామోహం విడువలేదు అంతకంతకూ పెరుగుతూనే ఉన్నదనూకాదే చింతచచ్చినా పులుసుచస్తుందా ఇంతో అంతో ఉంటుంది పులుసు చచ్చి తీవు కలుగుతుంధనుకున్నావా అబీజమేవేరు అన్నాడు రంగనాథం.

జ్ఞానాంబ రంగనాథం చెంపవయిన తనచేతితో నిమురుతూ పురుషుడు ఏమి చేయగలడు చేయమనసున్ననూ చీవాట్లుదిని పోవును. స్త్రీచేయవలయునన్న క్షణములో చేయగలదు. స్వతంత్రస్త్రీ పురుషుడు స్త్రీచేతిలో కీలుబొమ్మ ఎటు అడించవలయునన్న అటు ఆడించగలదు అన్నిటకూ స్త్రీమూలము స్త్రీ జాగ్రత్తగలిగివుండిన పాపము కలుగనేరదు అంటూ చేత నిమురుతూ వుండగా అబ్బా అన్నాడు రంగనాథం. ఏమి అన్నది జ్ఞానాంబ.

స్త్రీహస్తములో ఎంతచల్లదనమున్నదే కర్మభూమివదలి జీవులు కదలిపోలేరన్నది ఇందుకేనే స్త్రీచేతిలో చిక్కితే ఉక్కిరిబిక్కిరి అయిపోతావు చిక్కువదలించుకోలేక వారికే దక్కిపోతావు అన్నారు నిజమేనన్నాడు రంగనాథం.

స్త్రీలుమాత్రాము పురుషులవలలో పడలేదా వలలోపడే అష్టకష్టాలూ పడుతూ ఉండేది. అయ్యగారు ఏమిచెప్పినా వింటూ ఉండేది కూర్చోమంటే కూర్చోవలె నిలుచుకొమ్మంటే నిలుచుకోవలె అనుసంతలో రంగనాథం ఇంకాఅన్నాడు.

జ్ఞానాంబ రంగనాథం నోరుమూసి ఇంకా నావంకమాటలు వినూ అన్నది. ఇంతలోఅలోచిస్తూవున్న రాముసరే సరిపోయినది మళ్లీఅన్నాడుతలత్రిప్పుతూ.

సరోజ రాముతలను పట్టుకొని అయ్యోయ్యో అంతగా తలఊపవాకండీ ఊడి పోతే కష్టమూ అన్నది ఆశ్చర్యంగా నవ్వుతూ.

ఏయ్ ఊడిపోతుందా బ్రహ్మదేవుడంత వెఱ్ఱివాడనుకున్నావా శిరోభద్రత కొరకై జీనగిరివాడువేయు మేకులాగా మేకునొకదాని క్రిందివరకూ నమర్చి ఊచినా ఊడిరాకుండా ఉంచినాడు తెలుసా అన్నాడు నవ్వుతూ రాము.

సరోజ నోటికి పైట అడ్డముపెట్టుకొని తలక్రిందికి వేసినది.

రాము గడ్డముక్రిందచేయిపెట్టి ముఖముపైకెత్తి మహామంత్రీ మాటకుమాటా వింతకువింతాపాటకుపాటా అందివ్వలేనంత అసమర్థుడననుకున్నావాఅన్నాడురాము.

సరోజ కోపమూ చిరునగువు మిళితముచేసి ముఖమొక వింతచూపగా మొగ వారు సిగ్గూ బిడియమూ విడచి మాట్లాడుతారు చెల్లించుకుంటారు ఇంతమాత్రము ఆడవారు మాట్లాడితే సిగ్గూ బిడియమూ భయమూ భక్తిలేని చిత్తినీ జాతి అంటారు మీనోటికి మాత్రం అడ్డు ఉండవలెనిలేదా అంతవిచ్చలవిడిగా మాటాడితే అవతల ఎవరైనా ఉంటారూ వింటారూ అడీనుకోవలెనిలేదా అన్నది.

అపురూపవతియైన అతివ అంచుననున్నపుడు అజుడైనా హరిహరాదులైనా మైమరచి మాటాడుతారన్నారు నీయట్టి విలాసవతి అంచున నుడ్నిప్పుడు నేనెంతటి వాడను అయినా మరచినాను మంత్రివరా మాతృదేవోభవ చెప్పకపోయితివే చెప్పు విందాము అన్నాడు రాము.

మళ్లీ మొదలెత్తుకున్నారా మాతృదేవిని మరచే మందభాగ్యులూ కన్నపిల్లల నాశనముచేసి తమఆశయాల తీర్చుకునేకుటిలహృదయులూ ఉన్నారు. వారటుండనీ మాతృదేవి తాను గర్భమయినది మొదలు తొమ్మిదినెలలుమోసి పత్య సత్యములు ఉండి కామమును ఓర్చి కావలసినన్నీ కష్టాలుభరించి కని మలమూత్ర విసర్జనలకు ఏవగించుకొనక అర్థరక్తమును పిండమనకూ అటుపై పాలరూపమున రక్తము పంచియిచ్చి పడరాని బాధలపడి తననోటికాడిది కూడా పెట్టి తనప్రాణమునకన్నా మిన్నగా కాపాడి ఎన్నికష్టాలకైనా ఓర్చి ఎట్టిఇక్కట్టులైనా ఎదిరించి పెంచి పెద్దచేసి సంతతి యశోన్నతికై రక్షణకై ప్రాణములనైనా ఒడ్డి బలుపాట్లుపడినది మాతృదేవి న్గాలవపూజనీయ వందనీయులలో తల్లిమొదలుకొని దైవమువరకూ ఒకరికనా ఒకరు పెద్దవారుగాబట్టి దైవమూ గురువూ పితృవూ మాతృవూ అటుపై శాస్త్ర సమ్మతముగా పెద్దవారు అందరూ వందనీయులే ఈనలువురనూ మరచిన మంద భాగ్యులుకూడా ఉన్నారు వీరికి పునర్జన్మమేలేదు అన్నది సరోజ.

రామరామరామ శ్రీరామా రామ అంటూ చెంపలు వేసుకున్నాడురంగనాథం.

ఆదిచూచి జ్ఞానాంబ అయ్యో పటపటమంటూ అట్ల చెంపలు వేసుకుంటారెం మకండీ అని రంగనాథం రెండుచేతులా పట్టుకొని అన్ని నీతులా చెప్పేవారున్నారు ఆచరణలో చూపితేకదా ఆమె అరుంధతికన్నా మిన్నవలె అన్నీ అంకదరికీచెప్పి అస్సలు అవినీతిగా ప్రవర్తించే అవివేకులున్నారు తెలియనివారు ఎవరోకొందరే ఇది పాపం ఇదిగోపుణ్యం అని అందరికీ తెలుసు ఆచరణలోపెట్టే అగ్రగణ్యులే తక్కువ అందరికీ బల్లిశకునముచెప్పి ఆఖరుకు తాను కుడితిబానలో పడిచచ్చినట్లు నీతుల బోధించే నిర్మలాత్ములందరూ కడకు అవినీతిపాలై అందరితో అనిపించుకుంటారు ఆచరణ చక్కగా ఉన్నప్పుడు అందరమూ అనుకొనవలెనన్నది జ్ఞానాంబ.

ఛి ఛి బుద్ధితక్కువ దానా మొగవాడడుగుతుంటే అంతమాత్రము అతుకు తప్పకుండా ఘంటాపథంగా జవాబుచెప్పే ఆడది ఉన్నదా ఆ చిన్నవయస్సులో ఆ విధంగా అరవై సంవత్సరాల వృద్ధనారిలాగా అన్నిటకూ అన్ని జవాబుల నందిచ్చే విజ్ఞానముం డవలయునన్న ముందుజన్మలో ఎంతపూజచేసి ఉండవలయునో తెలియునా నీ కొడుకు అడుగులువేస్తూ పోతూవుంటే అడుగులలో అడుగులు తప్పకుండా వేస్తూ పోవలయునంటే సామాన్యమా అన్నాడు రంగనాథం.

ఇంతలో రాము సరోజభుజములపై రెండుచేతులువైచి చిరునవ్వుతో మహా మంత్రీ పూజనీయులగు దేవ గురు పితృ మాతృవుల మరచినవారికి పునర్జన్మము లేదన్నావే జన్మములేక ఎక్కడపోతారన్నావు అన్నాడు రాము.

మహాప్రభూ చెప్పతూవుంటే తెల్లవారువరకూ అడిగేటట్లు ఉన్నారు ఈ నాటికి శయనించండి జోకొట్టుతాను అన్నది సరోజ.

మంత్రివరా జోకొట్టేరోజులు శీఘ్రముగా వస్తాయి తొందరపడకు అడిగిన దానికి జవాబుచెప్పు మాత్రము అన్నాడు రాము.

మహాప్రభూ దేవగురు పితృమాతృవుల త్రికరణశుద్ధిగా చక్కగా ప్రేమించి సేవించిన కష్టసుఖములు మిశ్రమ ఫలమిచ్చు కర్మభూమికి రాక కలకాలము వైకుంఠనివాసము చేయుచూ హాయిగా నుండగలరు. దానితో పునర్జన్మములేదు అన్నారు. ఆ నలుగురిని దూరముచేసి మండగుడై మందుడుకు తనముతో క్రూరుడా యెనా పశుపక్షి క్రిమికీటకాది జన్మమెత్తుతూ అనేకయుగములు పాపఫల మనుభ వించుచూ మానవజన్మకు మళ్లీవచ్చుట దుర్లభమన్నారు. ఈపదము రెంటికూ అర్థమే స్వామీ పునర్జన్మము లేదు అనగా ఇరువాగులా అర్థమవుతుంది ప్రభూ తమరు

మాతృ పితృ గురుసేవాపూజామాని దైవసేవ ఒకటేచేయుచున్నారు. అదెందుకో తెలియదు ఇంటిలో ఎక్కడచూచినా అమ్మా నాన్నా పటము ఒకటీలేదు తమ గురుదేవులెవరో అంతకూలేదు అన్నీ అడుగుతున్నారు వేగిలేస్తే నేనెక్కడ మ్రొక్కవలెనో తెలియలేదు అత్తగారూ అంటే ప్రక్కనే ఉంటుంది నమస్కారముచేయ వలయునుపడును ప్రతిదినమూ మామగారి చెంతకు పోవుట మరియాద గాదందురు పెద్దవారికి ఎదురుగా పోవరాదందురు. మహాప్రభూ రేపు ఫోటోగ్రాఫరును పిలుచుకవచ్చి అమ్మా నాన్నను ఫోటోతీయించండి వారిద్దరినీ రెండుపటములూ అందరమూకలిసి మూడు పటములూ అయితే సరిపోగలవు తమరు ఆచరించకపోయినా సమస్కరించకపోయినా నాబాధ్యత నేను తీర్చుకుంటాను. వారుసంపాదించిన వస్తువులతో వారు కని పెంచిన తమతో ఆనందపడుతున్నానుగా వారిరుణమెట్లు తీరవలయును ప్రత్యక్షముగా వారికి నమస్కరించుటకు వలనుగానప్పుడు పటమును ఉపయోగించుకుంటాను అన్నది సరోజ.

అందరినీ కలిపి మూడూ, వారిద్దరినీ రెండుగా తీయమన్నా వదెందుకన్నాడురాము. వారిపటము ఒకటి ఇక్కడా, ఒకటి మనదగ్గరా, మిగత మూడులో ఒకటి ఇక్కడా, మరొకటి అత్తగారి ఇంటిలో అల్లుడూ ఆడబిడ్డా ఉండవనిలేదా వారికి ఒకటి మనచెంతా ప్రభూ మాతృ పితృ గురుదేవులు దేవునికి దగ్గరగాపెట్టి వందనార్చనల ప్రతిదినమూ చేయువారికి ఆయురారోగ్య భాగ్యములు త్రివిధ ఐశ్వర్యములగు తను జ్ఞానధన సంపదలు ఎన్నిజన్మలకైనా ఉండునన్నారు ప్రభూ మరచిపోకుడని చెప్పుచుండగా రాము ఇంతకాలము మరచినానని ఆలోచించుతూ చూపుక్రిందికి పెట్టినాడు. అది సరోజ తెలుసుకొని రెండుచేతులూ రాము గడ్డముక్రింద పెట్టి తలపైకియెత్తి చిరునవ్వుతో రాముకన్నులలోకి తనకంటితళ్కును పంపి తల ఊచుతూ స్వామీ ఏమట్లున్నారు ఇంతకాలమూ ఇంతకాలమూ మరచినాననియా లేక నేను చెప్పినది తప్పుడుదారియనియా తగనిదనియా వారు పూజార్హులు కారనియా ఎక్కువ భారమనియా చెప్పండీ అని నవ్వుతూ చెంపలపైకి చేతులు పోవనిచ్చి నిమురుతూ ఊ చెప్పండీ అన్నది.

అబ్బబ్బాబ్బా కులదేవత కులదేవత అంటూ వింటూ ఉన్న రంగనాథం పండుకున్నవాడు కూర్చొని చెంపలువేసుకొన మొదలుపెట్టినాడు.

అయ్యయ్యో ఆచెప్పే ధర్మాలకూ ఈ కర్మాలకూ అంతులేదు రామ రామా ఇదెక్కడి కర్మము పసిపిల్లవాడయినాడు అని చేతులు పట్టుకొని ఏమి పిచ్చిపట్టినదా ఎట్టిపట్టినదా అన్నది జ్ఞానాంబ.

రంగనాథం జ్ఞానాంబను చూచి అనాదీ యధర్మముల ఆచరించు కోడలు దొరికినదిగదాయని ఆనందము పట్టలేక మైమరచినాను నీకా ఆనందము లేనట్లున్నది అత్తాకోడలు అగ్నీ ఆజ్యమువలె వద్దికగా ఉంటారన్నారు అందువల్ల ఆమెచెప్పే మాటలు నీకువచ్చునట్లున్నది ఆకోడలి ఎదుత ఈఅత్త కునికిపాట్లు పడవలసినదే చూడూ ఆ అనువు. ప్రవాహమువలె పొంగి పొరలి పోతూఉన్నది. ఆ స్వరమాధుర్యమూ శ్రవణములకు సోకిన ఆబాలగోపాలము అట్టే నిర్జీవ ప్రతిమలవలె నిలువవలసినదే కాలుకదల్పా సాధ్యమా కఠోరమయిన స్వరమూ కీచుగొంతూ రెండు మూడు విధముల స్వరభేదము గలుగు కంఠమూ అపస్వరమూ నత్తీ తొందరమాటలు దీర్ఘముతీసి మాట్లాడుట బట్టగొంతూ పురుషస్వరమూ బలువిధములగు అపస్వరములు అపశబ్దములు గలిగిన స్త్రీలు గానీ పురుషులుగాని అధమాయుర్దాయు లగుదురని పెద్దలన్నారు. కొంత అనుభవమూ వున్నది నీకోడలిస్వరము చూడు కోవెల లాలకింపవలె నీకొడుకు అదృష్టము నీయదృష్టమునకు మేరలేదన్నాడు రంగనాథం.

ఇది మీయదృష్టం భార్యా కొడుకూ కోడలూ మంచినడకగల వారుగా సంపాదించుకొన్నారు సుఖపడుతున్నారు పుణ్యాత్ములు మీరు అన్నది జ్ఞానాంబ.

రాము సరోజనుచూస్తూ మంత్రీ మైమరచి తిరిగినట్లు తిరిగినాను మాతృపితృ గురుదేవుల మరచినాను వీరు పూజనీయులే నీమాటనిజము నాగురువు తనకన్నపిల్లలకన్నా మిన్నగా నన్నుచూచినాడు. ప్రతిసంవత్సరమూ పరీక్ష అయినప్పుడంతా నన్ను అందుకుపిల్చుకొని పీపుతట్టి మరింత చెంతకుతీసుకొని నీవు బుద్ధిమంతుడవు కన్నతలిదండ్రులకు విద్యనేర్పిన గురువుకూ కీర్తిని తేగల ధీమంతుడవు. విద్యావివేకశీలముల ఆర్జించి ప్రజోపయోగమగు కార్యములుచేసి సత్కీర్తివంతుడవై మనుమని కౌగలించుకొని సంతోషించేవారు వారినికూడా మరచినాను హెచ్చరించి మేలు చేసినావు ప్రభువుకు మంత్రి ప్రాణమువంటివాడు అన్నది వాస్తవము మంత్రిచెడితే మహారాజు మన్నుపాలవుతాడు అన్నదీ వాస్తవమే నన్నూ నాబుద్ధినీ హెచ్చరించి మేలుకొలిపినావు ఇందుకై ఏమికోరుతావో కోరు బహుమానము ఇస్తానన్నాడు రాము.

మహారాజా ఇస్తారా నేకోరినవి ఇస్తారా నిజమేనా అంటూ చిరునవ్వుతో వయ్యారముగాచూస్తూ రాము రెండుహస్తములూ తనహస్తములలోకి తీసుకున్నది సరోజ. రామునవ్వుతూ దశరధుని కైకవరాలుకోరినట్లు కోరవుకదా అయినా కోరు తీరుస్తానన్నాడు. సరోజ రాముచేతుల తనభుజములపై వేసుకొని నిమురుతూ ఎన్ని వరాలు కోర అజ్ఞ యిస్తారూ హిరణ్యకశ్యపుడు బ్రహ్మతో రెండుమాటలలో విన్న

వించుకుంటానని అమరత్వమూ అజేయత్వము కోరినట్లు రెండుగా అడుగమంటారా అన్నది కలికిచూపులతో సరోజ.

మాతృ పితృ గురుదేవుల కథచెప్పినావు మూడుగా అడుగు ఇస్తానన్నాడు రాము.

ముందుచేతిలో చేయిపెట్టండి ఇచ్చింది ఇచ్చిందేననండి అన్నది సరోజ.

నోటమాటాడినమాటపై అంతఅవిశ్వాసమూ చేతిలోచేయివేసిన అంత విశ్వాసమూనా అదెందుకట్లా మాటపైనేగదా ముందందరూ చిక్కులపాలైనదీఅన్నాడు రాము.

ముందుపోయినవారు ఆడి తప్పని మహనీయులు ఇప్పుడున్నవారు ఆడితప్పటలో మహానీయులూ చేతిలో చేయివేసినది పాలూఅన్నము అంటపల్కినది నెత్తిన రామాయణమూ గీతా పెట్టుకొని నుడివినదీ శుక్రనీతిలో కల్పి చిక్కగా పద్యమల్లి మోహనరాగముతో చెవులకింపుగా పాడుతారు తామూ వారిలోకలుస్తారేమోనని చేతులోచేయి వేయమంటున్నాను అన్నది సరోజ.

రోజా పుష్పమునకన్నా ఈ సరోజ చాలా సువాసన వెదజల్లేటట్లున్నది శహబాష్ అంగనలు అనంగకేళీవిలాస కులాస మధ్యలో మగనటు ఆపి నిల్పి మరులు కొల్పి మరింత భ్రాంతిని పురికొల్పి ఒకచిన్నకోరిక ఉన్నది తీర్చండీ అని గడ్డము పట్టుకొని లాలనతో కరుణ వకవంక ప్రేమవకవంక పెంచి కౌగలించి ఆభరణములూ చీరలూ రవికలూ ప్రయాణములూ తీర్థయాత్రలు తిరుణాళ్లూ చెప్పి వప్పించుకొందురన్నారు అనుభవజ్ఞులగు పెద్దవారు అట్లుగాక మంత్రివలె మాటల బలముతోనే ప్రభువును మెప్పించి వరాలు తీసుకునే ఘరానామనిషివి ఊ కానీ రాజునై ఇస్తా మంత్రివై పరిగ్రహించుమంటూ ధీమాగా చేతిలో చేయివేసినాడు రాము.

ఊ ఇప్పుడు నామంత్రిబలము మంత్రబలము చూపవలసింది కాస్త వాహం పుచ్చుకొని ధైర్యంగా ఉండండి అంటూ పాలుకొంచెము తెచ్చియిచ్చి సమీపముగా ముందుర్చొని ధైర్యంగా ఉన్నారా మాటతప్పరుకదూ అని చిరునవ్వునవ్వుతూ అమ్మానాన్నా కుమారుని విలాసాలకు వినోదాలకూ విద్యలకూ వస్త్రాలకు వాహనాలకూ సౌకర్యాలకూ భూషణాలకూనై ప్రాణం కావలెనన్న పిదప పట్టుపట్టి లోభత్వంవహించి తినీతినక పుత్రభ్రాంతితో పుణ్యకార్యములకూ ఇవ్వక పుణ్యము చేయక తీర్థయాత్రలకుపోక కడకు భిక్షకులకుకూడా పెట్టక మనసును అరికట్టి పాపమనక పరులవి దొరికినా తెచ్చిపెట్టి చేయరాని పాపములుచేసి ఆర్జించి కడకు తమకేమో చేయునను మముకారముతో ఆస్తీపాస్తీలు ఆర్జించి ప్రాణమంతా తమ

పైనే పెట్టుకొని బ్రతుకుతుండే తలిదండ్రులమాట పెడచెవినిపెట్టక విని వారిని చక్కగా రక్షించుట ఒకటి అని సరోజ అనునంతలో రాము ఇప్పుడు చంపినావే పెడదారిని చూపినా పెండ్లాన్ని విడువమన్నా పేరూ ఊరూలేని పనులు చేయమన్నా దుష్కార్యములలో దూరమన్నా పెండ్లాన్ని తన్నమన్నా పెరవారితో కలహించ మన్నా అత్తగారితో ఆదాయము తెమ్మన్నా వినవలెననెదవా అన్నాడు రాము.

అలాంటి తలిదండ్రులయిన శుక్రనీతి ఉపయోగించి తానొవ్వక ఒరులను నొప్పింపక తప్పించుక తిరుగవలయు వారిని నొప్పించిన మరుజన్మకు రోలూ రోకలీ పొరకా చేట ఇల్లూ వాకిలీ భూమి బుట్రా ధనమూ ధాన్యమూ మానమూ మరియాదా జ్ఞానమూ దానమూలేక బ్రతికే తలిదండ్రులు దొరికి అడవిమల్లెల సౌరభం దర్శిమని యౌవనం అయి ముప్పతిప్పలూపడి ముచ్చెరువుల నీళ్లు త్రాగి బ్రతుకవలసి వస్తుంది. అట్టివారిని యెందరినో చూస్తూ ఉన్నాముగా ఎందుకు తెలుసుకొనలేమూ పూర్వము సుకృతముచేసే తమకూ తమసతికీ తలిదండ్రులు ఉత్తములై ఉమామహేశ్వరులవలె పురాణదంపతులై ఉన్నారు. ఇది మీపుణ్యమూ అది నాపుణ్యమూ పుణ్యమునకు మరింత పుణ్యము సమకూర్చుకున్న రాబోవుజన్మకు తలిదండ్రులు చాలాకాలము బ్రతుకువారు గౌరవనీయులూ విద్యావివేకవంతులు శ్రీమంతులూ దొరికి సుఖపడగలము సరేనా ఇక రెండవది కోరమంటారా అన్నది సరోజ.

ఒక్కవరంలోనే మెడవిరచినావు రెండవది ఎట్లుంటుందోనని గుండె దడగలుగుతున్నది ఆలిసందునా అమ్మసందునా పడరాని పాట్లుపడే ప్రక్క సోదరులమాచి ప్రాణం తహతహ పడుతూ ఉంటే వారిమాట వినే తీరవలెనని ప్రమాణం చేయించుకుంటూ ఉన్నావు అందులో కష్టసుఖాలు నానెత్తినవేస్తే నేనేమిచేసేది తీరని సమస్యతెచ్చి మెడకుచుట్టితివే అన్నాడు రాము.

ఆలూ అమ్మాకలిసి అణుమాత్రముకూడా మీకు కష్టాలుతేరు అమ్మకొట్టినా తిట్టినా మెడబట్టినెట్టినా ఆకష్టాలు తమచెంతకు వస్తేగా తమకు కష్టము వారిఆజ్ఞనకు అధికారిని వారిఆజ్ఞకు బంధితను వారిఇంటికి ఇల్లాలిని వారిఇంటికి దాసినీ వారు నాకూ తమవలె తలిదండ్రులు వందనీయులూ పూజనీయులూ నాధర్మము నేను చక్కగా నెరవేర్చుకున్న వారివల్ల నాకు ఏలోపమూ గలుగదు. అంతకూ లోపమున్న నాకర్మమని అనుభవింతునుగాని మిమ్ముల నొప్పించనని రాముచేతిలో చేయివేసి సరేనా అన్నది సరోజ.

ప్రక్కన తదేకధ్యానముగా వింటూ ఉన్న జ్ఞానాంబ ఆనందబాష్పములు కన్నులరాల్చుతూ మనస్సు పట్టలేక తాళలేక మైమరచి వినండి వినండి అంటూ రంగనాధంపై చేయివేసితట్టినది రంగనాధం అదిచూచి అబ్బా అత్త ఆనందానికి అంతూపంతూ లేదంటూ తానూవకచేయి పైనవేసినాడు.

జ్ఞానాంబ తనపొరపాటును తెలుసుకొని అయ్యో పొరపాటు పడినాను అంటూ దూరముగా జరుగుకున్నది పొరపాటు అందరికీ ఉంటుంది మనిషైనవాడంతా మైమరుస్తూనే ఉంటాడు భావోద్రేకము భగవంతునికికూడా ఉంటుంది అంటే మొరటు సరసాలంటావా ఇప్పుడు నీవెట్లు మైమరచినావే మందగమనా చంద్రవదనా కుందరదనా అత్తకుతగ్గ కోడలే వచ్చింది ఆనందమంతా నీదేయిక అన్నాడు రంగనాధం.

వలానావారి కోడలంటే మీకుమాత్రం గౌరవములేదా గౌరవమర్యాదలకే గదా ప్రతివారూ కష్టాలుపడేది అన్నది జ్ఞానాంబ.

అక్కడగదిలో రాము సరోజనుచూచి ఊఁకానీ రెండవవరము అదెట్లుంటుందో విందామన్నాడు.

సరోజ కలికిచూపులతో వలపుహృదయముతో చిలుక పలికినట్లు వింటా నంటారా సప్తవ్యసనముల మానుకొనుట రెండూ అనగా మొదటిది తమకం ఇదికడు భయంకరమయినది ధనమూ మానము ప్రాణమూ సపరివారముగా ఆత్మీయులతో నాశనము చేస్తుంది. తమకం తాళిగట్టిన దానితో సరియని పెరవారిపై పేరాశలు పెట్టుకొనక ధర్మబద్ధులై ధర్మపత్నికిచ్చిన మాటపైనుండుట ఇకజూదము ఇదిమిత్ర గోష్ఠితో కాలక్షేపము క్రిందదిగి కడకు ఆలుపిల్లలనైనా అమ్మిస్తుంది బుద్ధిని మార్చి వేస్తుంది అపకీర్తుల తెచ్చిపెట్టుతుంది పేరుప్రతిష్ఠల నశింపుచేస్తుంది మరి త్రాగుడు మానవుడు మరిగిన తాళినైనా త్రెంచుకపోయి త్రాగుతాడన్నారు ఇదికూడా ధన మాన ప్రాణముల తీయును దయితై పట్టును దాన్నివిడిపించుకొనుట దుర్ఘటమన్నారు మిగతానాల్గూ ఈమూటెను మించలేవు ప్రభూ సప్తవ్యసనముల జోలికి పోనని రెండోవరం అన్నది సరోజ.

ఇక్కడా ఒకదెబ్బకొట్టినావు ఏడుటిలో ఒకటిమాత్రమూ అప్పుడప్పుడూ ఉండెను ఈనాటితో అది అంతమయినది చందాలో నాపేరుకొట్టివేయమని ఏవో అబద్ధాలు చెప్పవలసివస్తుంది అన్నాడు రాము.

ఏమదీ క్లబ్బా అన్నది సరోజ.

ఔనన్నాడు రాము.

అయ్యో క్లబ్బుకుపోవద్దండీ క్లబ్బంతాగబ్బే సప్తవ్యసనాలకు నెలవన్నారు.

కనగ గౌరవనీయులగబ్బు క్లబ్బు అన్నాడు ఒకకవి దాన్నిమానుకొనండి క్లబ్బుజరిగేవేళ సంజెవేళ దైవధ్యానసమయము హిందువయినవాడు దేవాలయమునకు పోవుటో లేక ఇంట్లో దైవధ్యానముచేయుటో చూచుకొనునుగాని డ్రింకింగ్ చేసి స్మోకింగ్ కాల్చుతూ వాకింగ్ పోవడు కాలము వృధాచేయడు సప్తవ్యసనములకు లోనుకాడు స్కూలువదలుతానే ఇంటికివస్తే అన్ని ఆనందాలూ తమకు అమర్చగల భార్య ఉన్నది ఆపనులకు పోకండీ అంతో ఇంతో పుణ్యముచేసి ఇక్కడికి వచ్చినారు ఈఅంతస్తును దుర్మార్గుల సహవాసంతో పడగొట్టుకోవాకండీ అన్నది సరోజ.

స్కూల్లో కూర్చొని కూర్చొని కాళ్లుతిమ్మిర్లుపట్టి బుద్ధిపీకుపట్టి వళ్లు తొన్నెబట్టి ఉంటుంది. డ్రింకింగ్ స్మోకింగ్ వాకింగ్ లేకుంటే బ్రతుకలేము అందరమూ ఇంతేనన్నాడు రాము.

అయ్యో అట్లకాలము వృధాచేసేదానికన్నా కేశవాలయానికివెళ్లి కాళ్లునొచ్చేటంతవరకూ.

హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణా కృష్ణకృష్ణ హరేహరే!

అంటూ నూటాయెనిమిది ప్రదక్షిణాలపట్టు వేయిన్నీ ఎనిమిది తిరుగండీ శక్తి ముక్తి అక్కడ కలుగుతుంది ఇంటికివస్తే భుక్తి రక్తి ఉంటుంది కాలము పోయినది వస్తుందా వృధాచేయకండీ అన్నది సరోజ.

రైట్ రైట్ నీమాటలు వజ్రాలమూటలు మానవ జీవిత భద్రతకు కోటలు అంటూ సరోజను అంచుకు లాగినాడు రాము.

ఊ హూ మూడోవరమో మరచినారా అన్నది సరోజ

కానీ అడుగూ అన్నాడు రాము.

దేవ బ్రాహ్మణ గురు మాతృ పితృ వయోవృద్ధ సాధుసజ్జన శాపగ్రస్తులుగాక ఆశీస్సులనందుతూ చేతనయిన ఉపకారము చేయడము చేతగాకున్న అపకారము చేయక ఆవల వైతొలగడము మానవ లక్షణము వీటె ననుసరిస్తాననడము మూడవది ఏమంటారూ అని లాలనగా ఇవి తమఇల్లాలు కోరిన వరాలు అన్నది సరోజ.

గుడ్డీ కుంటీ కురూపి ముసలీ అనాథ మొదలగు అంగహీనులా అమితదారిద్రులా చెప్పకపోయితివే అదెందుకూ అన్నాడు రాము.

ప్రభూ వీరు పూర్వజన్మలో క్రూరములైన పాపము లొనర్చినవారు. ఈజన్మ లోకూడా తప్పకచేస్తారు వీరి ఆశీస్సులవల్ల ఫలములేదు కాదని వారు ఆశీర్వదించినా ఫలము దొరుకదు పుణ్యహీనులై పాపఫలమనుభవించు చున్నారు సరుకు లేనివారు యితరులకేమి ఇవ్వగలరు వారిపై భూతదయా పశ్చాత్తాపము లుండినచాలు వారిని అన్నవస్త్రములతో తృప్తిపరచిన భగవానుడు మనకు ఇవ్వగలడు అన్నది సరోజ.

ఆచార్యులకన్నా మిన్నగా అన్నీనేర్చి అంచుననుంచుకున్న స్వర్ణవిగ్రహ మంటూ తొడపైకి లాక్కున్నాడు రాము.

వింటూవున్న రంగనాథం జ్ఞానా ఏమిధర్మాలు ఏమిధర్మాలు అబ్బబ్బా అంటూ చేతులుజోడించి రామరామా అన్నాడు తలత్రిప్పుతూ రంగనాథం.

ఇక పడుకొండి కోడలి ధర్మాల్లో కోళ్లుకూయవచ్చింది అని కన్నుంటించినారు.

రాత్రి నాల్గవ యామము బ్రహ్మముహూర్తకాలములో నిత్యమూ లేచువేళకు సరోజ మేల్కొని రామునులేపినది ఇరువురూ కాలకృత్యములు దీర్చుకొని స్నానము చేసి. రాము సూర్యధ్యానము చేయుచుండెను సరోజ కాఫిచేయ పొయి ముట్టించి అగ్నిదేవునికి సమస్కరించి నీళ్లు పొయిమీదికి ఎక్కించి దేవునిదగ్గరకువచ్చి నమస్కరించి పతిపాదములంటి కన్నులకద్దుకొని అత్తమామ స్వరూపముల మనసులో తలంచి నమస్కరించి త్రిదేవీ ధ్యానమునకు మొదలుపెట్టెను అంతలో జ్ఞానాంబ రంగనాథం లేచి చూడగా రాము దేవునిదగ్గర కూర్చొని ఉండెను. సరోజ కీలుగంటు వేసుకొని కాఫీ వడియగట్టుతుండెను. జ్ఞానాంబ ఆశ్చర్యంగా అప్పుడే స్నానంచేసినారేమమ్మా అన్నది.

ఔనత్తా ముఖప్రక్షాళనము చేసుకొనిరాండీ కాఫీ అయినది అన్నది సరోజ.

జ్ఞానాంబ కాలకృత్యములు తీర్చుకొన పోయెను సరోజ దొడ్డిలో పీటవేసి చక్కెరా పండ్లూ పాలూ పెట్టినది.

రాము పోయి సూర్యసహస్రనామ పారాయణము చేయుచుండెను.

రంగనాథం బయటికి పోయివచ్చి రామునుచూచి ఆమార్పుకై సంతోషించెను.

బయట పాలవారు పిలువగా సరోజపోయి తీసుకవచ్చి కొన్ని పీటపైపెట్టి కొన్నికాచి కాఫీలో పోసినది.

జ్ఞానాంబ స్నానముచేసి వచ్చినది.

అంతలో రాము సూర్యునికి నివేదనచేసి అన్నీ ఎత్తుకొనివచ్చి దేవునిదగ్గర పెట్టెను సరోజ కాఫీగిన్నెను దేవునిదగ్గర పెట్టగా రాము నివేదనచేసి మంగళహారతి ఇచ్చెను.

సరోజ చేతులుజోడించి భగవంతునికి చెప్పుకొన తగినవి చెప్పుకొని నమస్కరించి లేచి అత్తకూ పతికి నమస్కరించి కాఫీగిన్నె ఎత్తుకపోయి అత్తా కాఫీ అని గిన్నె గ్లాసులూ అత్తఅంచున పెట్టినది.

అంతలో రంగనాథం స్నానముచేసివచ్చి దేవునికి నమస్కరించి జ్ఞానాంబను చూచి మనములేచేవేళకుముందే లేచి కాఫీకూడావేసి దేవునికి నివేదనచేసినారు. ఇంతవరకూ స్నానముచేసి నేను కాఫి వేసినాను స్నానముచేసి దేవునికిచూపి త్రాగండీ అన్నరోజులేదు కొడుకూ కోడలూ అయినా చూపినారు మంచిదే జ్ఞానా జ్ఞానం తెచ్చుకో అన్నాడు రంగనాథం.

తెల్లవారిలేచి చెంబుపట్టుకపోతే ఎనిమిదిగంటలకు కానీ ఇంటికిరావు నేనుచేసి ఏమిచేయవలెనంటూ జ్ఞానాంబ ఇదుగో త్రాగండీ అంటూ ఉపపాత్రతో కాఫి పాత్ర చేతికందిచ్చెను కొడుక్కూ కోడలికీ ఇచ్చి తానూ తీసుకొనెను.

రంగనాథం త్రాగుతూ రామా ఈనాడు కాఫీ మారిపోయి రుచికరముగా నున్నదిరా కొడుక్కు ఎక్కడ తక్కువగుతుందోనని వాళ్ల అబ్బసొమ్మంతా పోయినట్లు పొడీ చక్కెరవేసి పాలుకొదువచేసి జలాధిదేవతా భ్యోనమః అని తెచ్చిఇస్తూ ఉండెను కాఫీ అంటే ఇట్లుండవలెనిలేదేమే నిత్యమూ చేస్తూవుంటివి చూడూ నీవు త్రాగలేదా అన్నాడు రంగనాథం.

అయ్యో త్రాగినాను గమనించినాను తమరిక ప్రారంభిస్తారని తెలుసుకున్నాను యింకొక అరగ్లాసు పుచ్చుకోండి అంటూ తీసుకపోయి ఇచ్చినది జ్ఞానాంబ.

నాకువొద్దే యింకొక అరగ్లాసు నీవుత్రాగి రుచిబాగా గమనించి రేపు ఇట్లు చేయుమని చెప్పదలచినాను అన్నాడు రంగనాథం.

రుచిని మరచిపోకుండా వుండునట్లు బాగాచప్పరించి త్రాగి రుచిని జ్ఞాపకముంచుకోండి అంటూ బలవంతము చేసి ఇచ్చినది జ్ఞానాంబ.

వృద్ధ దంపతులమాట చూచి వయసు దంపతులు ముసి ముసి నగులు నగుతూ ఒకరినొకరు చూచుకొన్నారు అటుపై ఎవరిపనులువారు చేయప్రయత్నించినారు.

సరోజ అత్తగారికి సహాయకార్యదర్శిగా పనిచేయ ప్రారంభించినది. పదిన్నరకంతా వంటఅయినది.

రంగనాథంగారు అంతవరకూ దైవధ్యానం దేవతార్చన చేయుచుండినారు.

రాము గ్రంథములు త్రిప్పుచుండెను.

జ్ఞానంబ భర్తనుచూచి వంటఅయినది నివేదనకు తెమ్మంటారా అన్నది.

రంగనాథం తెమ్మన్నాడు.

చేసిన పదార్థములన్నీ తెచ్చిపెట్టినది జ్ఞానాంబ.

దేవునికి నివేదనచేసి మంగళహారతి ఇచ్చినాడు రంగనాథం.

ఆ సమయానికి హాజరయి రామూ సరోజ దేవునికి తండ్రికి ఇరువురూ నమస్కరించినారు.

రాము తీర్థమునకై చేయిసాచినాడు.

సరోజ అత్తగారిని పిలచినది.

వస్తానమ్మా అన్నది జ్ఞానాంబ.

అంతలో రంగనాథం రాముకు తీర్థంయిచ్చి దేవునితీర్థం మీఅత్తకు లేకున్నా పరవాలేదు లేవమ్మా నీవుపట్టూ అక్కడ బిందెలతో ఉన్నాయిగా తీర్థం అన్నాడు రంగనాథం.

జ్ఞానాంబ తొందరగావస్తూ అడుగు ఆలశ్యమయితే అతుకువేస్తారు జపమూ తపమూ మేముచేసినాము పుణ్యమంతా మాదే ఈ ఆడవాళ్లకేముందిలే అని తమ అభిప్రాయముండవచ్చు మేము కష్టపడి వంటచేసినాము ఎంగిలీ మంగలం లేకుండా శబరిపని చేయకుండా వాసనకూడా చూడకుండా భయభక్తులతో ఎంతో శుచిగా చేస్తూ ఇరుగింటి పొరుగింటి సుద్దులు లేకుండా వారినే ధ్యానించుచూ వంటచేసి వారి యెదుట పెట్టినాము మాకష్టము తమకు తెలికపోయినా అదంపతులకు తెలియదా తమకు కనికరము లేకున్న వారికుండదా పుణ్యమంతా మాదే ననుకున్నారు అర్థానికి మించుగా మాదేనని మానమ్మకము అక్కడనయినా వాదిస్తాము అయినా పోనివ్వమంటూ చేయిసాచినది జ్ఞానాంబ.

తీర్థంవేస్తూ రంగనాథం వరే రామా మీయమ్మ ఈలోపల లాయరుపరీక్ష అయిందిరా అన్నిటకూ అన్నిలా మాట్లాడుతుంది అన్నాడు రంగనాథం.

అంతలో సరోజ అత్తకు సమస్కరించి తీర్థమునకు చేయిసాచినది.

రంగనాథం తీర్థమువేసినాడు.

రాము నవ్వుతూ ఔను నాయనా మాఅమ్మ చెప్పినది వాస్తవమే సేవకాధర్మము చక్కగా నెరవేర్చితే జపతపాదులు చేసేవారిపై యున్న ప్రేమకన్నా సేవకులపైనే భగవంతునికి ప్రేమ గలుగగలదు. వారు హృదయపూర్వకముగా నమ్మి కష్టముచేయువారు మనోవాక్కాయకర్మలూ ఏకీభవించినడచును కూర్చొని ధ్యానముచేయువారికి మనోవాక్కాయకర్మలు ఏకీభవించుట కష్టము దీనికై కొందరు

పూర్వులు నిత్యమూ వకమైలు నేల నడచుతూ ధ్యానముచేస్తూ వచ్చినారట దేహము శ్రమపడుచుండ మనస్సు కదలదనివారు అవిభముగాచేసి కడతేరినవారు గలరు మనోవాక్కాయకర్మలు ఏకీభవించినగాని మైమరువడు మానవుడు మైమరచినగాని పంచేంద్రియములు స్పర్శలుతప్పవు అట్లు స్పర్శలుతప్పి భజించినగాని భక్తిగాదు అట్టిభక్తి కుదిరినగాని భగవంతునికి కరుణగలుగదు వైరాగ్యములో భక్తి ఏకీభవించి నపుడు కనేది వినేది వచ్చేది పోయేది శ్వాస పీల్చేది పీల్చనిది తెలియదు జీవుడు దేవునిలో క్షీర నీర న్యాయముగా కొన్ని రెప్పపాట్లకాలము కలసిపోవును: ఆకాలమే కాలము ఆయానందమే అనందము దానికి మేరఉండదు నవరసములలోన బుద్ధి చొరినట్లు భగవద్భక్తిలో చొరదు అందువల్లనే హరికథాకాలక్షేపములు చేయుచుండుట కథారూపములో రసము ఉండును దానితో మనోవాక్కాయములు ఏకీభవించి ఈడ్చును మనసు నిలుచును గాన కాలక్షేపము మానవులకు మంచిదన్నారు వీరు భయభక్తులతో కార్యములు చేసినారు గాబట్టి మనకన్నా స్త్రీలకే ఇందులో భాగము ఎక్కువుండుననుకుంటా నన్నాడు రాము.

ఇంతలో వడ్డించినారు భోంచేయ రంగనాథం రాము కూర్చున్నారు.

రంగనాదంభోంచేస్తూ ఈవంటకం కొడుకూ కోడలికనిచేసినావా భగవంతునికని చేసినావా అన్నాడు.

చూడరా మీయప్పవేసే ఏకటప్రశ్నలూ ఈనాడుగురువారం భగవద్నివేదన అవుతుంది. వచ్చినవారికీ అవుతుంది అని చేసినానండీ శనివారం రాలేదని మీఅభిప్రాయం శనివారమేనా పాయసంపొంగలివారం గురువారంకాదా అన్నదిజ్ఞానాంబ

యిట్లేమాట్లాడుతూ భోంచేసి అబ్బాకొడుకూ బయటికి వచ్చినారు.

రాము గదిలోపుస్తకములు త్రిప్పుచుండెను.

రంగనాదం తాంబూలంచేసి బయటికిపోయెను.

అత్తాకోడలు భోంచేసి వంటగదిలో కార్యములుచక్కపెట్టి బయటికివచ్చి పీటతలక్రిందపెట్టుకొని రామరామ అని జ్ఞానాంబ భుక్తాయాసముతో తలవాల్చెను.

సరోజ తలవెంట్రుకలువిప్పి ఆర్పుతూ చిక్కుతీసుకొనుచుండెను.

జ్ఞానాంబ సరోజనుచూచి తాంబూలం తేపోమ్మా వేసుకుందామన్నది.

సరోజ తెచ్చి అత్తముందుంచినది.

వేసుకోమ్మా అన్నది జ్ఞానాంబ.

సరోజ విప్పినవెంట్రుకల ముడివేసుకొని ఆకువేసుకొన ప్రారంభించినది.

జ్ఞానాంబ ఆ తీరుచూచి ఔనమ్మా వెంట్రుకలు విప్పుకొని ఏపనీ చేయరాదు ఆకువేసుకొనరాదు ఏదీతినరాదు త్రాగరాదు ఏకార్యములోనూ పాల్గొనరాదు అది తెలియుటతోటి ముడివేసుకొని వక్కనమలుతున్నావు తల్లిలో ఈ బలంలేకున్న నీకెట్లు తెలియును. వెంట్రుకలువిప్పి చేయుపనులు అపరములు వామాచార మంత్రములు అందువల్ల ముడివేసుకొనక ఏపనీచేయరు అన్నది జ్ఞానాంబ.

ఔనత్తా పెద్దవారితో సంస్కరింప బడకపోయిన అన్నీతప్పులే ఉండును వారికి వారు తెలుసుకొనునప్పటికి వెంట్రుకలు తెల్లనౌతాయి అప్పటికీకొన్ని తెలియవంటూ ఆకువేసుకున్నారు.

జ్ఞానాంబ తిరిగీ పండుకొంటూ సరోజా కొంచెముసేపు పండుకోతల్లీ అన్నది.

సరోజ ఒక తుండుపంచె అత్తకు దగ్గరగా పరుచుకొని పండుకొన్నది.

అరగంట పోయిన తరువాత ప్రక్కఇంటి సీతమ్మ వచ్చిచూచి అత్తా కోడలూ ఒకచోట అమ్మా కూతురువలె పడుకున్నారే హాయిగా అన్నది.

జ్ఞానాంబ సీతమ్మను కూర్చొమ్మనిచెప్పి సీతా అందుకేనే తీతువ అరచినట్లు ఇంట్లో ఎప్పుడూ అరచుతూ ఉండేదీ కూతురువకటి కోడలువకటిన కూతురు కొరకై అల్లుని మహావిష్ణువునుచూచినట్లు చూడడములేదా అడిగినదంతా ఇవ్వడములేదా వచ్చిరాకమునుపే పీటవేసి కూర్చుండబెట్టి పెట్టడములేదా పేరుమ్రోగిన మొనగాళ్లు కూడా అల్లునికి అణిగి తిరుగడములేదా కూతురుకొరకై అల్లుని చూచినపుడు కొడుకు కొరకై కోడలినిచూడవలెనంటావా లేదా కన్నది ఇక్కడ ఉన్నదా తెచ్చుకున్నది ఇక్కడున్నదా నిన్నూ నీవంశాన్ని ఉద్ధారకము చేయవలసినది ఇదియా అదియా ఆవిజ్ఞానములేక ఆగచాట్లుపెట్టి తిట్టి కొట్టినవారి అగచాట్లు ఆఖరున తెలుస్తవి వివేకము ఉండవలయునే అన్నది జ్ఞానాంబ.

నీవోర్పూ చూతాము లేవే ఎన్నాళ్లో అన్నది సీతమ్మ. నీవలె బుద్ధిలేని పెద్దమ్మననుకున్నావా కోడలినీ కొడుకునూ ఏడ్పించి కొంపలో రంపులూ వీధిలో గుంపులూ లేపి తూ చా అనిపించుకోను. మంచిమాటలతో మంచితో చెప్పితే వినక మితిమీరను వారేమి రక్కసులా రాళ్లా ఆడికి కాకపోతే అన్నీ అప్పగించి హరి ధ్యానముచేస్తూ కాలముగడిపి కనుమూసేది ఉత్తమముకదా అలిసందునా అమ్మ సందునా అవస్థపడలేక వద్దురాదేవుడా కాపురం అన్ని నెత్తిన చెరుగు వేసుకొని పోయినవారుకూడా ఉన్నారు. ఇట్ల చేసేదానికన్నా వివాహము మేమున్నంతవరకూ మానుకోనాయనా నేనువోర్చుకోలేను అని ముందుచెప్పి వప్పించుటమేలు పెండ్లి

పెండ్లి యని మురిసి మురిసి పోయేదీ అయిన దాదిగా దాని ఉసురూ వాని ఉసురూ తీసేదీ మేలా నీపిల్లకు చెప్పినట్లు చెప్పితే ఎందుకు వినదూ పండ్లుకొరికి నెటికలు విరచి చుర చుర చూచి బుసకొట్టితే కొంతకాలం చూస్తారు వారూ నేర్చుకుంటారు తొడతట్టి మీసము దిద్ది కాలుమవ్వి పౌడుగరచి సింహగర్జనచేసి రమ్మంటారు అప్పుడు రంపులూ గుంపులూ చంపులూ తలవంపులూ తప్పితే తెగతెంపులూ అన్నది జ్ఞానాంబ.

మరేమిచేయమంటావే దాన్నిచూస్తే నాకు సరిపోదు నన్ను చూస్తే దానికి సరిపోదు రవరవమంటూ రగులుకుంటుంది కోపం రానురానూ తీవ్రమయి పోతూ వున్నది. మా ఇరువురమధ్యా వానికి ప్రాణానికి వస్తూవున్నది అన్నది సీతమ్మ.

సీతా నీకీపేరు పెట్టుటకూడా తప్పేనే కాళమ్మ అని పెట్టివుంటే తగినట్లుండేది. మనఇంటికి వచ్చిన అమ్మాయిని ఒకరింటి అమ్మాయి అనుకొనరాదు. మనఇంటి అమ్మాయిగా బ్రహ్మచే వ్రాయబడే మనఇల్లు చేరియుండేది. మనఇంటికి వచ్చిన అమ్మాయి మన అమ్మాయే మనవానికి మనవంశానికి మనకూ అమరుకొన కష్ట సుఖాలు పడవచ్చిన అమ్మాయి మనఅమ్మాయి గాక మరెవరూ అప్రాయములో మనమెట్లుంటిమో వెనుదిరిగి చూచుకొన్న తెలియును. ఈజన్మలోచేసిన పాపము మరుజన్మకు వస్తుందనే నమ్మకమువుండి నడుచుకొనవలె. నమ్మి వచ్చినవారిని అన్యాయముచేసిన ముందున్నది కుంభీపాక నరకము తెలుసుకొనవలె ఆధ్యాత్మిక శక్తితో చూడక భౌతికశక్తితో చూస్తే అందరూ ఇంతే కాళ్లముందు చూపుతో కఠిన హృదయులై కటికరక్కసులై అన్యాయమనక హతముచేసి హతమవుతారు. సీతా నిదానముగా చెప్పుకొని మంచిమార్గముతో కన్నబిడ్డలాగా చూడవే ముందుజన్మానికి నీకూ అత్తమంచిది వస్తుంది. ఇప్పుడు నీవుచేతరాస్తే మరుజన్మకు కాలరాచే అత్త వస్తుంది తప్పినదికాదు. అప్పుడు చింతించి కన్నీరుపెట్టితే లాభముండదు ముందు జన్మలో చేసినపాపము నీకోడలికి ఈజన్మలో చూపుతున్నది చూడూ అది అమే తెలుసుకొని నడుచుకొనవలె తెలుసుకొనక నడిచిన మరీజన్మకూ ఇంతే నన్నది జ్ఞానాంబ.

కొంచెము చెప్పే అముండకు పోట్లాడకుండా అన్నది సీతమ్మ.

అదుగో బుద్ధితక్కువ అనే నోరునాప హరి హరాదులతో కాదన్నారు. నాల్క చేసే పాపము చేస్తూనే ఉంటుంది మరుజన్మకు నాల్కలోపమై ఏడ్పిస్తుంది ఏయవ యవములతో చేసిన పాపము ఆ యవయవములు లోపింపబడి దుఃఖింప చేయు

నన్నారు ఎందుకట్లు పాడవుతావు అముండా అంటూ ఉన్నావుపూడు కోడలు ముండైతే కొడుకెక్కడుంటాడు చూడు కోడలి కొరకై కొడుకును చంపుతావా ఇవే అర్థములేనిమాటలు ఈమాటలే అన్ని అందాలా చేటుతెచ్చేది మాటలనేర్పు బాగ వుండలె తెలుసుకొని మాటాడవలె అర్థము తెలియక మాట్లాడితే పాపమూ కోపమూ కొట్లాట తప్పక తెస్తాయి కోడలీని ముండా అనవచ్చునా ఒకముండవు ఉన్నావే దాన్నిచేసి ఏమిలాభము గందా మనుకున్నావే ఇందుకే కదా వాగ్వాదాలు గలిగి వైనంతప్పేది మాటలలోనే మానహానీ ప్రాణహానీ గౌరవమూ కీర్తి మొదలగునవి ఉన్నవే మాటలు ఏవి ఎవరితో ఎట్లుమాట్లాడవలెననేది ఈవయసుకు ఇంకా తెలియ లేదు. ఇకెన్నడుతెలిసేది ముందుజన్మకా అన్నది జ్ఞానాంబ.

అతీవ్రత అట్లుచేస్తుంది ఏమిచేయమంటావు మరి అన్నది సీతమ్మ.

అందుకే అందరిలో తప్పులు ఉండును హరి ధ్యానము నాల్కతోచేయి కొంత ఉద్ధ్వతము తగ్గి ఉపద్రవముల తప్పించునన్నారు పెద్దలు. ఆమార్గమవలంబిస్తే మానవధర్మాలూ భూతదయా మనసుకు తోసుంది జ్ఞానంకుదురుతుందీ అన్నది జ్ఞానాంబ.

ఇంతలో సరోజలేచి మూడుగంటలయినది కాఫీచేయమంటావా అత్తా అన్నది.

కానీమ్మా నీపెనిమిటికన్నా మామగారు నేనుచేస్తే కాఫీబాగలేదంటారు అన్నది జ్ఞానాంబ.

ఎన్నినీళ్లు పెట్టమన్నారూ అన్నది సరోజ.

అయిదారుగ్లాసులుపెట్టూ అతిథీ అభ్యాగతులు వస్తేఉంటుంది అన్నది జ్ఞానాంబ

సీతమ్మా జ్ఞానాంబ మాట్లాడు తుండగనే సరోజ కాఫీచేసి అత్తా కాఫీ అన్నది.

సరోజ పిలువగా రాముచ్చినాడు సమయానికి రంగనాథం బయటనుండీ వచ్చినారు.

రాండీ కాఫీ తీసుకుందురని అందరికీ యిచ్చి సీతా రావే త్రాగుదువూ అని ఇచ్చినది.

సీతమ్మత్రాగుతూ అమృతమునట్లున్నదమ్మా మా కోడలూ చేస్తుంది హాలాహలంబొగ్గు నీళ్లున్నట్లే నన్నది సీతమ్మ.

అన్నీ అమర్చిపెట్టే అత్తవుంటేగదే కోడలు చేసేదీ పెత్తనం అత్తది పెట్టుకొని పేరులేకుండా పదార్థముండవలెనంటే కోడలు ఎట్లచేస్తుంది పదార్థలోపములేకుండా చేతినిండుకూ ఉంటే గదా చేసేది అన్నది జ్ఞానాంబ.

అదీ నిజమే నన్నది సీతమ్మ.

జ్ఞానాంబ సరోజనుచూచి నూనె దువ్వెనా తేమ్మా తలదువ్వుతా నన్నది.

సరోజ తెచ్చినది జ్ఞానాంబ తలదువ్వుతుండగా సీతమ్మనుచి జ్ఞానా నీకు ఓర్పు బాగున్నదే నాకోడలికి పట్టమని చేయెత్తి తలదువ్వినరోజు లేదమ్మా ఎపాపాన పోతానో గాని ఏపనికికూడా సహాయముచేసేదిలేదు నాకెందుకని ఊరకుండేదాన్నే అందులో సందుదొరికితే అందుకునేదాన్ని అవతల ఏమవుతుందో భగవంతునికెరుక వచ్చిమూడేండ్లు అవుతుందికదా వచ్చిన దాదిగా ఏపనీ ముట్టుకొని ఎరుగనమ్మా అన్నది సీతమ్మ.

సరే ముందన్నది ముసుళ్లపండుగ తెలిసినట్లే ఉన్నది అంటూ జడవేసి దొడ్డిలో పూలు కోసుక వస్తాము పదా యని పోయి పూలు కోసుకొనివచ్చి కట్టి రామ్మా జడలో పెట్టుతా నన్నది జ్ఞానాంబ.

ఇట్ల ఇవ్వుఅత్తా దేవిదగ్గర పెట్టి నమస్కారముచేసి వస్తాను అని తీసుకొని పోయి దేవునిదగ్గర పెట్టి నమస్కరించి తెచ్చి రెండుబాగాలుచేసి ఇచ్చినది సరోజ.

నవీనపద్ధతిగా నెత్తిలో పెట్టినది జ్ఞానాంబ.

సరోజ అత్తకు నమస్కరించి ముఖము కడుగుకొన పోయినది.

చూచినావా సీతా తెలిసిన ఇంటి బిడ్డ గాబట్టి దేవునికిచూపక ముత్తయిదువలు పూలు పెట్టుకొనరాదనే అత్తకు ఇవ్వక తాను పెట్టుకొన రాదనీ తల్లికి మారుగా జడవేసిన అత్తకు నమస్కరింపక పోవరాదనీ ఆమెకు తెలిసినది. వారి ఇంటి ధర్మాచరణ ఉన్నదనీ తలితెలివిగలదనీ ఈనడక నిరూపించుచున్నది. పెద్దవారు అచరిస్తే చిన్నవారు కష్టముతోనైనా అచరిస్తారు పెద్దవారు పాడైతే చిన్నవారు వారికి జోడౌతారు నీకు శాంతము ఉండే వాళ్లకు ఉంటుంది అన్నది జ్ఞానాంబ.

ఔను జ్ఞానా పెద్దలనుండే పిన్నలకు రావలయును పెద్దలు పొరబడిన చిన్నవారు పూర్తి చెడిపోగలరు. ఇదినిజమేనని ఇంటికిపోయి కోడలు బియ్యములో రాళ్లువేరి వేసుకుంటూ ఉండగా చూచి నేను ఏరుతాను నెత్తిదువ్వుకోపోమ్మా అంటూ తాను చేటను తీసుకోపోయినది సీతమ్మ.

నేను చేసుకుంటానులే అత్తా అన్నది కోడలు హేమ.

పో ప్రొద్దుపోయింది దువ్వి జడవేసుకోపో అన్నది సీతమ్మ

అయ్యో ఇదేమి ఈనాడు ఇంత చల్లగా ఉన్నదే మారికాశక్తిలాగా మా వూరమ్మవిధంగా మంటలుమండుతూ మనుషులపైన పడే మారి మనసుమారి మహా

ప్రీతిగా ఉన్నదే శక్తిలో సాధుశక్తి ఒకటియా అయినా ఇదెందుకో చూతమని పోయి నూనే మవ్వేన తెచ్చుకొని బియ్యములో వెంట్రుకలు పడునని దూరముగా కూర్చొని జడవిప్పినది హేమలత.

ఇంతలో సీతమ్మ బియ్యముచేట అటుంచి నేను దువ్వుతా నాచేతికీవే ఈపాడు చేతులతో ఒక్కనాడుకూడా దువ్విన దాన్నికాను అని లేచిపోయినది ప్రీతిగా సీతమ్మ.

ఒద్దులేఅత్తా అత్తగారితో దువ్వించుకొనే అదృష్టము నోచుకోలేదు ముందు జన్మలో ఎవరినో బాధించినాను అత్తను సుఖపెట్టక నిర్లక్ష్యముచేసి బలమున్నదనీ జరుగుతుందనీ ధర్మదూరనై బాధించినాను. ఇప్పుడనుభవిస్తూ ఉన్నాను మళ్లీ ఎందుకు చేసుకోవలె మీసొత్తు తింటూ ఉన్నాను మీతో మళ్లీసేవచేయించుకుంటే మళ్లీ ఇంతే వయసుఉన్నంతవరకూ రక్తం ఉన్నంతవరకూ సేయవలసిన ధర్మం ఉన్నదీ చేస్తాను అన్నది హేమలత.

ఔను సర్వమూ పూర్వజన్మకర్మమే కర్మతీరిపోతే కడిగినట్లు బుద్ధికి సర్వమూ తోస్తుంది పుణ్యము చేయిస్తుంది నాకు నీవూ నీకు నేనూ గాక మరెవ్వరు గావాలె నన్నునమ్ముకొని నీవూ నిన్నునమ్ముకొని నేనూ ఉండవలసి వున్నది. ఇంతవరకూ ఎట్లో కాలము గడచి పోయినది. ఇంకనైనా వకరికొకరము చెప్పుకొంటూ చక్కగా ఉండి దేవుడూ దైవమని కాలము గడుపుదాము అంటూ కూర్చొని దువ్వి జడవేయుచుండగా కుమారుడు సోమసుందరం వచ్చిచూచి దేవుని పీటము దగ్గరకు పోయి చేతులు జోడించుకొని.

స్వామీ ఎంతదయ ఎంతదయ అవునూ పెద్దపులినీ పిల్లినీ ఎలుకను ఒకరేవున ఒకచోట నీళ్లు త్రాపుతున్నావు నీ మహామహిమ ఏమనవలె నీదయ నేమనవలె ప్రభూ ఇట్లై సర్వదా ఉండ దీవించుతండ్రీ యని సాగిలపడి నమస్కరించినాడు.

హేమ పకపక నవ్వినది. అదిచూచి సీతమ్మ నవ్వినది సుందరం లేచి వాళ్ల నిరువురనూ చూచి నాకండ్లతో చూచేది నిజమా కాదా అన్నట్లు కండ్లు తుడుచుకొని చూచినాడు సుందరము.

అదిచూచి అత్తా కోడలూ మరింత అసాధ్యముగా నవ్వినారు.

ఇంతలో జ్ఞానాంబ వచ్చి చూచి ఏమే నవ్వుతున్నారు అన్నది.

సుందరం జ్ఞానాంబను చూచి పెద్దమ్మా చూడు ఆవూ పెద్దపులీ ఒకచోట పండుకొని ఒకదాన్ని ఒకటి ప్రేమగా నాకుతున్నాయి ఎంత ఆశ్చర్యమో చూడు.

ఈజంతువుల ఇట్లు మార్చినదేవునికి నాపైన ఎంతదయో చెప్పనలవిగాదు. అని దేవునికి దండాలు పెట్టుతుంటే ఇరువురూ నన్నుచూచి నవ్వుతున్నారు. నేను నవ్వాలనో ఏడ్వాలనో తెలియలేదు అన్నాడు సుందరం.

జ్ఞానాంబ చిరునవ్వు నవ్వుతూ కాదురా తెలిసివర్తిస్తే వాదు యెందుకుంటుంది కోడలికి దిక్కు అత్తా, అత్తకు దిక్కు కోడలూ ఈఇద్దరికీ దిక్కునీవూ ఎవరిధర్మము వారుతెలుసుకుంటే ఇందులో చిక్కులేదు. చూడుచూ నిన్న మాకోడలు వచ్చినది ఎట్లుచేసుకొంటూ ఉన్నదో ఆఅణుకువా ఆమెలకువా ఆప్రీతీ ఆనీతీ ఆవినయమూ ఆవిధేయత ఎట్లుందో మనమూ తెలిసి వర్తించవలె వారూ తెలిసి తిరుగవలె ఇరువురూ అజ్ఞానులయితే అంతారోతే నన్నది జ్ఞానాంబ.

ఇంతలో జడవేసినది సీతమ్మ.

హేమలేచి అత్తకు నమస్కారముచేసి దొడ్డిలోకి పోయినది.

అబ్బా అని రొమ్ముకొట్టుకొని సుందరం ఏంతవింత అన్నాడు.

ఏమిరా అన్నది జ్ఞానాంబ నవ్వుతూ.

అత్తకు కోడలు నమస్కరించడమూ అత్త కోడలికి జడవేయడము ఎన్నడూ నాజన్మలో చూడలేననుకున్నాను. చూడలేదు ఈనాడు ఎంత సుదినమో ఏమో తెలియదు పెద్దమ్మా అన్నాడు సుందరం.

శాంతముగా పెద్దవారు నడుచుతూ ఉంటే సొంతముగా శాంతముగా కాపురం నడుచుతూనే ఉంటుంది. అంతా అత్తలోనేవుంది అజ్ఞానం విజ్ఞానం అన్నది జ్ఞానాంబ.

అయితే కోడండ్లలో లేదంటావా అన్నది సీతమ్మ.

లేకేమి ఉంటుంది అమ్మా నేర్పులేని అమ్మాయికి అత్త నేర్పుకోవలెగాని అరవడానికి మొదలుపెట్టితే అంతా అగ్నిమయం అవుతుంది అన్నది జ్ఞానాంబ.

చెప్పితే వింటేగా పెద్దవారని మర్యాదచూపితేనా ఏమిచెప్పినా ఎప్పుడూ ఈఏడ్పే పిశాచబాధ అబ్బా అంటూ మూతి త్రిప్పి ఈసడించుకుంటే ఏమిచెప్పుతావే అన్నది సీతమ్మ.

ప్రీతిగా చెప్పి ప్రీతిగా చూస్తే చేయకపోను పశువులా వారు చేయనిదాన్ని మనమేచేస్తే చూచి వారేనేర్చుకుంటారు అంతా వారికొరకయ్యే కదా వారిమేలుకోరితే మనమేలు వారూకోరుతారు అంతా ప్రీతిలోనే ఉన్నది. మనధర్మము మనము

చక్కగా నెరవేర్చుకుంటే వారు వారిధర్మమునకు కట్టుబడక విడిబడి సంచరించను రక్కసులా అట్ల సంచరించిన మరుజన్మకు అనుభవిస్తారు అంటూ హేమనుపిల్చి కొంచెము నల్లేరు తెమ్మన్నది జ్ఞానాంబ.

ఎందుకే అన్నది సీతమ్మ.

మావారికి కొంచెము అజీర్ణముగా ఉన్నదట పచ్చడిచేసి పెట్టుదామని అన్నది జ్ఞానాంబ.

అజీర్ణానికి మేలేనా అన్నది సీతమ్మ అంతలో హేమ నల్లేరు తెచ్చి ఇచ్చి పచ్చడీ నీవు ఎట్లచేస్తావు అత్తా అన్నది హేమలత.

ఎట్ల వీమున్నదీ నల్లేరును పైనారతీసి సన్నగా తరిగి నూనె గానీ నెయ్యిగానీ వేసి దోరగా వేయించి అటుపై తగినంతా పులుసూ కారము ఉప్పూ వేయించిన నూగులు తగినన్నీవేసి కొంచెము బెల్లము చేర్చేవారు చేరుస్తారు కొందరు, కొందరు చేర్చరు నూరి ఇంగువ తిరుగబోత పెట్టిన బాగుండును భోంచేసిన జీర్ణము చక్కగా నవును మలబద్ధకము విడుచును ఉష్ణదీప్తినిచ్చును అహారకోశము శుభ్రము చేయును ఆరోగ్యమిచ్చును అజీర్ణముతో బేదులయ్యే వారికి అమృతమువంటిది ఉష్ణదేహాలకు పనికిరాదు అంటూ ఇంటికిపోయినది జ్ఞానాంబ.

ఇంట్లో అబ్బా కొడుకులూ మాట్లాడుతూ ఉండిరి జ్ఞానాంబను చూచి రాము అమ్మా రేపు ఊరికి పోతాము అన్నాడు.

నిన్నవచ్చి రేపు పోవడమా ఇదేమిరా అన్నది జ్ఞానాంబ.

సెలవులేదు అమ్మా కోడలు తొందరచేస్తూ ఉంటే వచ్చిపోదామని వచ్చినాము అన్నాడు రాము.

పదినాళ్లు సెలవుతీసుకొని రాకూడదేమప్పా అన్నది జ్ఞానాంబ.

వేసవికాలము సెలవులు ఉన్నవిగా అప్పుడువచ్చి వుంటాము అన్నాడురాము.

అయితే మొర్నాడుపోండి రేపు అతిరసాలన్నా చేసియిస్తా నన్నది జ్ఞానాంబ.

ఔనమ్మా రేపుచేసియివ్వు నీపేరు చెప్పుకొంటూ తింటా మన్నాడు రాము.

ఇప్పుడు తినేదీ వుండేది తమరు వచ్చేటప్పుడు వెంటతెచ్చినారా, అమ్మా నాన్నవిగావూ అమ్మా నాన్నా మిగిలించి వుంటేనే తమరు తమాషావడుతుండేది అది అర్థముగాని వారే తలిదండ్రుల ఎదిరించి మాట్లాడి భాగములు పంచుకొని మరీజన్మకు బాల్యముననే తలిదండ్రులు గతించి కన్నఅవస్థలకూలోనై కడగండ్లపాలై

అయ్యో అనువారులేక తినతిండీలేక జీవితసౌకర్యములు గల్పించు ఘనులులేక వృథా ప్రయాసలపడుతూ జీవచ్ఛవములై జీవించువారు చూడలేదా గమనము కాలేదా అన్నది నవ్వుతూ సరోజ.

అంతా అత్తా మామా ప్రక్కనే మాట్లాడీనావుకదే అవతల అర్థముకాలేదా వారి ఆశయములకై పుట్టిన పిల్లలనోట మట్టిగొట్టి వారిజీవిత రక్షణల చెరచి వృత్తి విద్యావిషయములమాట మూలబెట్టి పిల్లల వారియాశయాలకు వాడుకొనుబుద్ధిహీనులు మతిభ్రష్టులూ వున్నారు పిల్లల పీల్చి పిప్పిచేసి వారి అర్జితము ఆశయాలు నాశనము చేసి కడకు వున్నదానిలో చక్కగా పంచిఇవ్వక పాడుచేయు రక్కసులూ వున్నారే అంతా మన అమ్మా నాన్నా వున్నట్లే వున్నారనుకొనవద్దు అన్నాడు రాము.

అందుకే ఈజన్మలో సంతతిలేక కొందరూ సంతతి అప్రయోజకులై కొంద రూ మూగీ గుడ్డీ కుంటీ కురూపీ పుట్టి అల్లాడుతుండేది ఎవరిధర్మమువారు అనుస రించిక విడిబడి తిరిగే కన్నీరు పెట్టుతూ కడగండ్లపాలై కటికటపడుతూ ఉండేది తెలియదా అన్నది సరోజ.

ఇరువురూ మాట్లాడు మాటలకు రంగనాథం జ్ఞానాంబ ముసిముసి నగులు నగుతూ ఉండి రామును చూచి జ్ఞానాంబ చెన్నంగిబియ్యముతో చేసియివ్వమంటా వా పిషాణము బియ్యముతో చేసియివ్వమంటావా అన్నది.

పిషాణబియ్యమెందుకే చెన్నంగిబియ్యముతోనే చేసియివ్వు చాలా బలమూ రుచీ వీర్యవృద్ధీ ధాతుబలం అన్నారు పూర్వపువారి పదార్థము బలమయినది అన్నాడు రంగనాథం.

సరే అట్లనే కానివ్వండి అన్నది జ్ఞానాంబ.

అరాత్రే బియ్యము నీళ్లలోపోసి తెల్లవారి పిండికొట్టి నెయ్యిలోచేసి నెయ్యిలో దోరగావేయించిన గసాలూ యేలకులపొడీ దండిగా ప్రతి అతిరసమునకూ చల్లి కళాయివేసిన పాత్రలోపెట్టినది వాముపొడికొంతా జిలకరవేసిన చుట్టలు కొన్ని రవ్వలడ్డు కొంతచేసి దైవనివేదన చేయమని భద్రపరచినది జ్ఞానాంబ.

సరోజ ఇదంతాచూచి ఎందుకుఅత్తా అన్నిమాకే పెట్టినట్లున్నదీ మీకూ కొంచెము వుండనీ అక్కడ నేనుచేసి పెట్టుతానులే కుమారునికి ఏకొదువా రానీ యను అంటూ ఇక్కడరాండీ అని రామును పిలిచి చూచినారా చేసినవన్నీ కొడుక్కని కట్టిపెట్టినది మాతృప్రీతి ఎట్టిదో తెలిసినదా తమకడుపుకట్టియైనా పెట్టి పెంచినది

గాక జీవితాంతమువరకూ అహృదయముతోనే వున్న జీవులు వ్నారు మాతృ పితృ ఋణము తీర్చువారు అరుదన్నమాట నిజము అన్నది సరోజ.

కన్నబిడ్డలపైన ప్రీతి కన్న తలిదండ్రులకే తెలియును ఇతరులు తెలుసు కొనలేరు ఇట్లని చెప్పుటకు వలనుపడదు మీరూ కన్నప్పుడు మీకూ తెలియును ఒక్కొక్కరికి అంత మమత వుండదు. ఒక్కొక్కరికి ఎక్కువవుంటుంది అదీ పిల్లలు చేసిన పుణ్యము అన్నది జ్ఞానాంబ.

అమ్మా నేనుపుణ్యముబాగాచేసినానే అన్నలూ తమ్ములూలేరు అక్కాచెల్లెండ్రూ లేరు ఒక్కనౌటచే లెక్కలేనంత సౌఖ్యమనుభవించినాను. అనుభవిస్తూ వున్నా నన్నాడు రాము.

తినేటప్పుడు సుఖమనుభవించేటప్పుడు అనవచ్చునుగానీ సోదర సోదరీలు లేని దుర్బలత్వము తెలియలేదా కష్టసుఖాలలో పాల్గొను వారులేనందుకు చింతలేదా సైన్యబలములేని రాజువలె ఒంటివాడు ఏమిచేయగలడు కష్టాలలో అదుకొనువారె వ్వరూ ఆత్మీయులూ ఏకగర్భ జనితులూ బంధువులూ మిత్రులూ చాలామంది ఉండుటకు మంచివారవుటకూ పూర్వజన్మ సుకృతముండవలయు నన్నారు. చిక్కులకూ ఛిద్రములకూ తోడై సహాయమిత్తురు ఆత్మీయులబలమూ బంధుమిత్రుల బలమూ పుణ్యానుగుణముగానే వుండును. వంటీ పెంటీ అన్నారు అన్నది జ్ఞానాంబ.

సోదర సోదరీ బలము మంచిదైన శ్రేయమేనన్నది సరోజ.

ధర్మజునివంటి అగ్రజులూ లక్ష్మణునివంటి తమ్ములూ లక్ష్మీదేవివంటి చెల్లెండ్రు బ్రహ్మవంటీ కొడుకులు మారుతివంటి సేవకులూ సావిత్రివంటి కోడండ్రు కృష్ణునివంటి బావమరదులు సీతవంటిభార్య వుంటేమంచిదే క్రూరులూ క్రూరసే నులూ ఉంటే లేనిదానికన్నా మిన్నగా దుఃఖముంటుంది. అందరూ పడేపాట్లు కానరాలేదా అన్నాడు రాము.

కానరాకేమీ ముందుజన్మలో బాధనీయులయినవారికే బాధగలుగును గాని ధర్మబుద్ధులకు దాపురించవు ధర్మమే అన్నిఅందాలా వజ్రకవచము ధర్మమునకు దైవముకూడా బద్ధుడే నన్నారు ధర్మదూరునికి అన్ని అందాలా కష్టములే దాపురిం చును దానితో అలమటించును. చూచుచునే వున్నాముగా అని మరచినారా పోటో సంగతి అన్నది సరోజ.

అందుకున్నట్లు పోటోగ్రాపర్ వాసు బదర్సు వారి శ్రీనివాసరావు కేమరా యెత్తించుకొని ప్రత్యక్షమయినారు రాము వారినికూర్చొంఁడ నియమించి రెండు కుర్చీలు వేసినాడు కుర్చీలకు వెనుకభాగమున శ్రీనివాసరావు వెంటవచ్చిన సహాయ కార్యదర్శులు తగినంత అలంకారము చేసినారు.

రంగనాథం వచ్చిచూచి రెండేకుర్చీలు ఉన్నవే నాల్గువేయలేదే అన్నాడు.

ఎందుకు అప్పా అత్త ప్రక్కన కోడలు, నాన్నప్రక్కన కొడుకు నిల్చుకుంటే సరిపోతుంది మీతో సమానంగా కూర్చోమంటారా ఏమి అంటూ ఔనా సార్ అని శ్రీనివాసరావుగారిని చూచినాడు రాము.

శ్రీనివాసరావు రంగనాథంగారిని చూచి ఔనండీ పెద్దవారిప్రక్క చిన్నవారు కూర్చొనుట మరియాదగాదు ఈ తీరే మంచిది అంటూ లేచి కేమరా పట్టుకున్నాడు.

జ్ఞానాంబ సరోజా ముస్తాబైరాగా రాము తల్లిని కుర్చీలో కూర్చుంఁడ నియమించి సరోజను ప్రక్కన నిల్చుకొమ్మని తండ్రిని కూర్చుంఁడమని తానూ ప్రక్కన నిల్చుకున్నాడు.

శ్రీనివాసరావు ఇంకొంచెమటు ఇంక కొంచెమిటు అని చక్కగా కూడండని సవరించుకొని రడీ అని బటన్ వత్తినాడు.

రాము ప్రక్కకు వచ్చి సరోజను ప్రక్కకు రమ్మని ఇద్దరిని మాత్రము తీయండిసార్ అన్నాడు.

సరేనని శ్రీనివాసరావు వాళ్లఇద్దరినీ తీసినాడు మూడు మూడువంతున కాఫీలు ఇవ్వమని కాఫీ ఫలాహారము యిచ్చి తాంబూలం పూలు పండ్లు ఇవ్వవలసిన డబ్బూ ఇచ్చి నమస్కరించగా.

శ్రీనివాసరావు తీసుకొని రామూ నీభావము చాలామంచిదప్పా తలిదండ్రుల ప్రక్కన కూర్చుని పోటో తీయించుకునే దానికన్నా నిలుచుకొని తీయించుకొనుటే శ్రేయము ధర్మము పెద్దవారికి గౌరవము ఇవ్వడము ధర్మమును పాటించడము ఇదిమానవధర్మము చక్కగా తెలుసుకున్నావు. వారిని ఇద్దరినే తీయించడము చూస్తే వారిని పూజించే నిమిత్తమని తెలుసుకున్నాను ఔను ప్రతిమానవుడూ తల్లినీ దండ్రినీ గురువునూ దైవమునూ మరువక పూజించవలసిన విధి ఉన్నది. వీరి బాకీతీర్చుకొనుట కష్టము. వీరి బాకీ ఇంతో అంతో తీర్చక పూర్తి బాకీపడిన మరుజన్మకు వీదారీలేని ఎడారులోబడి ఏడ్వవలసి వచ్చును. ఈసూక్ష్మము చక్కగా తెలుసుకున్నట్లున్నది ఇంతేనా అన్నాడు శ్రీనివాసరావు.

ఔను సార్ స్వభావాన్ని చక్కగా తెలుసుకున్నారు అన్నాడు రాము.

ఉదాహరణకై అక్కడక్కడా అప్పుడప్పుడూ నీయట్టి బుద్ధిమంతులు వినయ విధేయులు నీతికోవిదులు నియమ బద్ధులు శాంతచిత్తులు పుట్టు తుంటారు బాల్యా మాదిగా చూస్తూ ఉన్నానుగా నీనడకే వేరుగన్పిస్తూ వున్నది అభివృద్ధికి వచ్చువారి పంథా ఇదే వస్తానన్నాడు శ్రీనివాసరావు నమస్కారము నిలుస్తా నన్నాడు రాము.

ఆయురారోగ్య భాగ్యములతో ఆదర్శప్రాయుడవై బంధుమిత్ర కళత్ర పుత్ర పరివార యుతముగా క్షేమముగా నుండవుగాతమని వీపున చేయివేసి నిమురుతూ అన్నాడు శ్రీనివాసరావు.

ఎంత దీవనసార్ కడుపార దీవించినారు అన్నాడు రాము. ఔను తల్లీ దండ్రీ గురువూ దైవమూ పెద్దా చిన్నా మంచీ చెడ్డా గమనించక భూతదయా పశ్చా త్తాపములులేక పరోపకార చింతనలేక అధర్మహృదయులై లోకకంటకులై బ్రతుకు వారు ఎందరున్న ఎందుకు జీవచ్ఛవాలువారు వారిని దీవించీ ఫలమేమి నీబోటివా రిని దీవించినా ఫలముగలదు వస్తా రామూ అంటూ శ్రీనివాసరావు పోయెను.

సరోజ రామునుచూచి వారు మంచి అనుభవజ్ఞులున్నట్లున్నదే అన్నది.

వీపుట్టలో ఏపాముఉన్నదీ ఎవరికేమితెలుసు లోకములో ఎందరో మహ నీయులూ అనుభవజ్ఞులూ ఉన్నారు. భక్తులూ ఉన్నారు భ్రష్టులూ ఉన్నారు. గమ నించడము కష్టము మంచివారు లేకున్న లోకము అడుగంటదా ఒక్కొక విషయ ములో మేధాశక్తిగలిగిన వారు ఉన్నారు అన్నాడు రాము.

రేపు ఉదయము ప్రయాణమునకు సామాను చక్కబెట్టుకోండి అని సరోజ తాను సంసిద్ధపరచింది ఆరోజు గడచింది మరునాడు ఉదయమే బస్సుకు ప్రయాణ మై నమస్కరించి పోయి వస్తామన్నారు రామూ సరోజా.

పోయి చేరినతోడనే జాబువ్రాయమన్నది జ్ఞానాంబ వ్రాస్తానత్తా అన్నది సరోజ

సరోజను బండియెక్కమన్నాడు రాము. అత్తా మామకు చెప్పి సరోజ బండి ఎక్కినది. రాము అమ్మానాన్నను నిలువండని బండిఎక్కినాడు సాయంత్రము మూ డుగంటలకు ఊరుచేరుకున్నారు.

మరునాడు రాము భోంచేసి స్కూలుకుపోయినాడు సరోజ ఇంటిలో పండు కొని ఉండగా వమనమయ్యేలాగుననూ కడుపులో ఒకవిధమగు బాధగను దేహ మంతా అదోకవిధమగు చచ్చుగనూ పైత్యముగను ఉండుటనుబట్టి చూచి ఇది వాతావరణము మార్పుతో గలిగెనా లేక మాఅమ్మ చెప్పినట్లు బయికలా గర్భము

నిల్చునప్పుడు కొందరికీ అన్నమిందదూ అధిక ఆయాసముగలుగును పైత్యమధికము గానుండును నిద్రచక్కగారాదు కాళ్లూ చేతులు తీయును తలకటకట నొచ్చును ఒకనెల దాటువరకూ బాధగలుగుచుండునని ఒకప్పుడు చెప్పుచుండగా విన్నాను. అదేఉండునా అని సందేహ పడుతూ అయిదుగంటలవరకూ ఉండి లేచి కాఫీ చేసి గ్లాసులోపోసి కొంచెము త్రాగినది కాఫీ త్రాగినతోడనే కడుపులో ఇందనట్లుగా దోచెను దొడ్డిలోకిపోయి వమనము చేసుకొనుచుండెను.

అంతలో రామువచ్చి వమనముచేసుకొను సరోజనుచూచి సైకలా సైకలా అంటూ పరుగెత్తి పోయి పట్టుకొని ప్రక్కన కూర్చొనెను.

సరోజ నవ్వుతూ సైకల్ అమూలనుంది చూడుపోండీ ఇక్కడెక్కడుంది అన్నది.

బైకా బైకలా చెప్పు చెప్పు అంటూ నోరు పుక్కిలించ గ్లాసుతో నీళ్లు పట్టుక వచ్చి ఇదిగో నీరు పుక్కిలించు యిక వమనముకాదు అన్నాడు రాము.

సరోజ రాము అపర్థాకు సంతోషించుతూ నీళ్లుతీసుకొని పుక్కిలించి అబ్బా అంటూ తన్ను అనుకొని పట్టుకొని ఉన్న రాముపై వాలినది.

రాము సన్నపిల్లను ఎత్తుకున్నట్లు అడ్డము ఎత్తుకొనగా అయ్యో నడుస్తానండీ ఎత్తుకపోవద్దు ఏడండీ అంటూ ఉండగనే ఎత్తుకపోయి మంచముపై పరుండబెట్టి నాడు రాము.

సరోజ పండుకొని చిరునవ్వుతో రామును చూస్తూ నన్నుమోసి ప్రేమ వెలి బుచ్చినట్లుగాదు సర్వభారములూ మోసేదిఉంది ఇక ఇది ప్రారంభదినము ఇరువుర మూ మహోల్లాసముగా సరస సల్లాపములతో సురత సుఖ మనుభవించినందుకు చాలు ప్రారంభమయినది నేను ఒకరిని మోస్తే తమరు ఇరువురను మోయవలె రాను రానూ మోత బరువగును మోయను కాయనూ ధైర్యంగా ఉండండీ ఇంకె ట్లా అనండీ కొందరు బైకల్ అంటూనే సైకిల్ ఎక్కి పారిపోయే అబ్బాయిలూ ఉన్నారు. వారిలాగాగాక ఓర్పుతో ఉండవలసిన రోజులు వచ్చినవి కామాన్నీ కట్టవలె కడుపునూ కట్టవలె కావలసినదేదో చేసుకున్నాము చెప్పుతాను సావకా నంగా వింమరు గ్లాసులో కాఫీపెట్టినాను నన్ను తెమ్మంటారా త్రాగివస్తారా అన్నది సరోజ.

సమయా సమయముల గుర్తించలేనంత అప్రయోజకుడ ననుకున్నావా దేవుడిచ్చిన బుద్ధీశాంతమూఉన్నది భార్యబాధపడుతుండగా చూచి పరిచర్యచేయకపోయెనని కోవ వడే అధర్మహృదయులలోచేర్చకుమనిపోయి గ్లాసుతీసుకొనివచ్చి రెండుగ్లాసుల్లోకాఫీ

పోసి ఒకగ్లాసును సజరోజకు యివ్వగా నేను త్రాగినాను మీరు త్రాగండి అన్నదిసరోజ.

త్రాగినది వమనమయినదిగా ఈకొంచమూ పుచ్చుకొమ్మని తలక్రింద చేయి వేసి లేపపోయినాడు రాము.

అయ్యో నాకొద్దు మీరు త్రాగండీ అంటూ లేచి కూర్చున్నది సరోజ.

ఒకగ్లాసు చేతికి ఇచ్చి తానూ త్రాగినాడు రాము. సరోజ త్రాగినతరువాత గ్లాసు ఇటు ఇవ్వమని చేయిసాచినాడు రాము.

సరోజ తలఊచుతూ ఊ ఈనాడే పాపలోకానికి పంపిస్తా మనుకున్నారా ఏమంత కష్టమొచ్చినది నాఎంగిలి మీరుకడిగి నన్నెక్కడ పంపుదామనుకున్నారూ నాకూ భగవంతుడు విజ్ఞాన మిచ్చినాడు. నమ్మి ప్రేమవలలో చిక్కినాడని నానా కార్యములు చేయించుకొని నానాహింసల పెట్టి కడకు చీటీలు మోయించి కాళ్లపట్టి మనీ అవినీతికి బాల్పడినవారు కండ్లూ కాళ్లూ పోయి మల్లెలు పడి మానహీనమై పరమనీచమై నానాయవస్థలతో ప్రాణాలు గోల్పోయిన పాపులచూచినాను. ఇప్పుడే ఆజట్టులో చేర్చుదామనుకున్నారా కండ్లూ కాళ్లూ ఉండపనిలేదూ అని రాము చేతిగ్లాసును తీసుకొని రెండుగ్లాసులూ చేర్చి మంచముక్రింద పెట్టి మళ్లి కడుగు తానులేండీ అన్నది నవ్వుతూ సరోజ.

ధర్మబద్ధయై దారపలికిన వాక్యములకు హృదయము వెన్నవలె కరిగి ఆనంద బాష్పములు రెండు విడచినాడు రాము.

అయ్యో ఇప్పుడు నాకేమయినదండీ ఎందుకు కంటనీరు పెట్టుతారూఅని రామును ఎదకు అంచుకొని పైటతో కంటనీరు తుడిచి ఇదిఅందరికీ ఉంటుందీ ఇందులో ఏమీభయములేదు ఊరుకోండిఅని తనమెత్తని హస్తముతో రాముచెంపలపై నిమురుతూ ముఖములో ముఖముంచి ప్రేమవెల్లివిరియ ఇంతమెత్తని హృదయ మయితేఎట్లా అనిచిరునవ్వు వెన్నెలలు తొలకరించినది సరోజ.

రామునవ్వుతూ నీకొరకై దుఃఖించలేదు నీమాటలలో ఆచరణలోగల ధర్మ బద్ధమునకు హృదయముకరిగి చలించి ఆనందబాష్పములు అప్యాయ మానముగా వాటంతట అవివచ్చినవి. ఆలుమొగలలోగల ఆనందమిదే అబ్బా తెలిసివర్తిస్తే అమరసౌఖ్యమిదే నీలాంటి ఇల్లాలు దొరుకుటకు పూర్వజన్మసుకృతములేకా అను భవించు సాహసమూ బుద్ధికుశలతా విద్యాబలమూ దేహబలమూ లభ్యపడక సన్యాసు లయినారుగానీ అనురాగవతీ అపురూపవతీ నీలాంటి సుగుణవతీ దొరికిన సంసార ములోగలసారము మరెక్కడా ఉండదని నాయభిప్రాయము మాదైవజ్ఞులవారంటూ

ఉంటారు సుఖకారకుడూ విలాసకారకుడూ అయినచంద్రుడు శనితోకలియుటచేత వారికిసుఖమడుగంటి సన్యాసత్వము వచ్చును సన్యాసత్వము మహాఘోరము పాప ఫలమేననియూ ఇల్లాలుమంచిదయిన ఆధ్యాత్మికశక్తికి సహాయకార్యదర్శియై సహాయ మిచ్చుననియూ ముక్తికీ భక్తికీమూలము ఇల్లాలేననియూ ధర్మప్రవర్తకులై ఇరువురూ నటించిన ఇంతకన్నా సుఖమూ ఇంతకన్నా చక్కనిదారీ ఇంతకన్నా దగ్గరమార్గమూ ఇంతకన్నా సులభమూ ఇంతకన్నా మరొక్కటి లేదంటూ చెప్పేవారు ప్రహ్లాదుడూ ధృవుడూ మొదలగు బాలభక్తుల వివాహము చేసుకొని రాజ్యాలూ మదనసామ్రా జ్యాలూఏలి ఆటుపైరాండీ అని భగవంతుడే చెప్పినాడట మానవులను వద్దంటాడా వైనంతప్పి వంకపోలయినవారే సన్యాసులు వైనముంటే వక్కడూ సన్యాసికాడు దీనిమర్మము జోశ్యులకుతెలుసు ఛాఛాఛా భార్యతోనే భక్తుడు కావాలే వేమనకష్టపడి తలవాసి దారలేనితిండి దయ్యపు తిండిరా అన్నాడు ఎంతకష్టము లేకుంటే అమా టంటాడు దారమంచిదైతే దైవాన్ని అనుసరించేదీ వారిదయ సంపాదించేది బహూ సులభమన్నారు దారయనగా నీవే దారవన్నాడు రాము.

సరోజ చిరునవ్వు నవ్వుతూ జింకకన్నులవలె కన్నులు త్రిప్పుతూ నాపైగల ప్రేమతో దయతో అట్లంటున్నారుగాని నేనేమి అనుకోతగ్గదాననా కాను మీరు నాజీవితములో మరచి పోనంతమేలు నాకుచేసినారు మేలుమరచిపోను. జీవితాం తము వరకూ సేవచేసి తీర్చుకుంటాను నవనాగరికంగా ఈదేహాన్ని అలంకరించి సోమరినిగాక సక్రమముగానీటుగా దేహాన్నిఉంచి ఆనందాన్ని అనుభవించమని అర్పించుకుంటాను జీవితమే అర్పిస్తాను మనోవాక్కాయ కర్మలానమ్మి సంచరిస్తాను మంచికుమారులా కుమార్తెలా రక్తముశుద్ధముగా పంచియిచ్చి కని వంశాభివృద్ధికై అందిస్తాను ఇంతకన్నామేలు ఏమీచేయలేనిదానను అన్నది సరోజ.

స్త్రీ అనురాగవతియై ఇంతమాత్రము చేస్తే సన్యాసము పుచ్చుకొనే పురు షుడే ఉండడు సోమరియై తిరిగే మానవుడే వుండడు సంసారం రోతఅనే సామెవే వుండడు తాను ముందు జన్మలో రోత పట్టించుకొని ఇప్పుడంగలార్చుతూ ఇతరుల కూడా సన్యాసములో దింపు సుద్దులుచెప్పి ఇప్పుడూ ఇంత కట్టుకొని కడకు ఏమవు తారో తెలియదు ఇప్పుడయినా వెరచి వెన్నివ్వక సన్యాసము పుచ్చుకోక దుర్మార్గ ప్రవర్తనలకు దిగక సాలుకునిల్చి సత్యముగా సంపాదించుతూ దేహమువంచి కష్ట ముచేయుచూ కొంతకాలము భగవత్సేవలో లీనముచేసి సొంత ఇంటకాని శిథిల దేవాలయములలోగానీవుండి శిథిల దేవాలయమునకు మిగులు ధనము హెచ్చించుతూ

పరధనమూ పరదారా పరాన్నముల యాచించక గడచనప్పుడు రోగగ్రస్తు డయినప్పుడు భిక్ష్యాన్నమే శరణ్యమని దైవచింతనతో వచ్చెడి కష్టముల భగవంతుని సహాయముతో నెరవేర్చుకొంటూ కాలముగడపిన రాబోవు జన్మమయినా చక్కగా ఉంటుంది కొరతగలిగెననీ దేవుని తిట్టుతూ మనోకాంక్షా కొరంతల నవరించుకొన అడ్డమయిన కర్మలనెల్లా చేస్తూవచ్చిన మళ్లీ ఇదే గతులన్నాడు రాము.

ఔను స్త్రీ హృదయాన్ని తెలుసుకొనే పురుషుడూ పురుషుని హృదయాన్నీ తెలుసుకొని ప్రవర్తించే స్త్రీ తోడైతే భూలోకమే సువర్లోకము నిజమే మీవలె అంద రూ పుణ్యముచేసి పుట్టవలెనంటే అవుతుందా తల్లి దండ్రీ అత్తా మామా భార్యా బావమరదులూ ఆస్తీ పాస్తీ విద్యా వినయం ధనం ధాన్యం అమనూ వదునూ అతు క్కన్నట్లు ఏ ఏ అమనుకు అవి అతుక్కున్నవి మీ యోగము కుదిరినది కుమట వడి నారు ఈ అతుకును అన్యాయం చేయకుండావుంటే మళ్లీజన్మకు అన్నీ అతుక్కరా గలవు మీరు పుణ్యాలు సరీగాకూర్చొనండీ అని ఎదకు అనుకొని వున్నరామును ముందుకు జరిపినది సరోజ.

అన్నిటకూ అన్నివిధాల అతుకులువేసి చెప్పగలశక్తి మెచ్చుకోవలసిన విషయ మంటూ తాను ప్రక్కకు జరిగి వడిలోకి సరోజను తీసుకున్నాడు రాము.

ఇంక మీ ఆనందానికి ఆటంకమేర్పడినది ఇప్పుడూ మీ శాంతీ దాంతీ అగుప డేది ఇక్కడ కొంచెం పాపంచేసి వుండినట్లు గన్పడు చున్నది ఏమందురా కడు తొందరగా కన్యాత్వముచెడి తల్లిగా స్త్రీ మారుట పురుడుచేసిన పాపమన్నారు. కొంతకాలమయినా ఇరువురూ సుఖపడకుండా చూలుగలుగుటచే ఇరువురూ బ్రహ్మ చర్య మవలంబించవలసి వచ్చును. అదియుగాక యుక్తవయస్సులోనే అల్లుడో కోడలో రావలసి వచ్చును. చిక్కులూ చింతా ఏర్పడును ఇరువురమూ ఇక్కడ కొంత పాపము చేసినాము అన్నది సరోజ.

భగవంతుడిచ్చిన దానికి మన మేమి చేయగలము కానీ వివాహము చేసుకొ న్నది పిల్లలగనుటకేగా అన్నాడు రాము.

వివాహము చేసుకున్నది నిజంగాచెప్పండీ కామతృప్తికొరకుగాదా తృప్తి తీరనిదే కన్యాత్వముచెడి తల్లిగామారుట అదృష్టహీనముగాదా ఈయుక్త వయసులో బ్రహ్మచర్య మవలంభించి చూలును చక్కగా పోషింపగలమా ఆకలితీరనిదే అన్నము వర్జింపగలమా ఇదంతా మనలోనే ఉన్నది. భగవంతునిపైపెట్టు టెందుకు

కొంతకాలము కన్యాత్వముతోనుండ నేనూనీవూ పుణ్యము చేయలేదన్నమాట కొందరువివాహ మయినది మొదలుకొని పిల్లలు పిల్లలని మొత్తుకునే వెఱ్ఱివారుగలరు మనమూవారిలో చేరినాము మనసుఖముకొంత ఈనాటితో సన్నగిల్లినది అన్నది సరోజ.

ఏలనన్నాడు రాము.

అయ్యో ఈవిషయమందా తెలిసివుంటే మీరేముందు చింతింతురు అని చిరునవ్వునవ్వుతూ ఈవిషయం తెలియకనే చింతించలేదు అన్నది సరోజ.

ఇందులో మర్మమేమిటో తెలియలేదు చెప్పుచూతా మన్నాడు రాము.

సరోజ చిరునవ్వుముఖములో చిందులాడ దొండపండువంటి పెదవులుతెరచి మల్లెమొగ్గలవంటి పండ్లు వెలిపరచి రాము చుబుక మంటుచూ ఏంటారా విన్నది ఆచరిస్తారా కాదనరుకదూ అంటూ ఉత్తములుగాఉన్న దంపతులు చూలుతెలిసిన దాదిగా ఇరువురూ దీక్షాపరతంత్రులై పురుషుడే పుట్టవలెననీ ఆయురారోగ్య భాగ్యములుగలుగు అదృష్ట వంతుడుగా నుండవలెననీ అంగసౌష్ఠవములు సౌకుమార్యములై ఉండవలెననీ సుగుణవంతుడై దేవబ్రాహ్మణ గురుమాతృ పితృ బంధు మిత్ర వయోవృద్ధానుకూలుడై ఉండవలెననీ అటురాజ్యాంగ మునకో ఇటుప్రజాంగమునకో ముఖ్యమై వర్ధిల్లవలెననీ ప్రజ్ఞావంతుడూ మేధావంతుడూనైపుట్టి తలిదండ్రులపేరూ తనపేరూ నిల్పగల ధీమంతుడుగా ఉండవలెననీ బ్రహ్మచర్యముతో త్రిసంధ్యలగానీ ద్విసంధ్యలగానీ ఇలువేల్పునూ ఇష్టదైవమునూ ఉపాసిస్తూ పూజిస్తూ ప్రార్థిస్తూ తొమ్మిదిమాసములై ప్రసవమగువరకూ గడ్డమూ గోళ్లను తియ్యక పురుషుడునూ స్త్రీ సాత్వికాహారములు తీసుకుంటూ కామోద్రిక్తగాక సంతోషియై సకాలములలో పాల్గొని ఇలువేల్పును ఇష్టదైవాన్ని అర్చిస్తూ ఆహారవిహార వ్యవహారములలో జాగ్రత్తవహిస్తూ కులోద్ధారకుడూ పుణ్యపురుషుడూ గలుగునట్లు దైవమునుకోరుతూ ఉండవలెనందురు. యిదిఉత్తమపద్ధతి ఇక మధ్యమము రెండుమూడు మాసముల పర్యంతము సంగమము చేయుచూ ఉదయాస్తమయములలో ఒకవేళ ధ్యానముచేసి చెప్పుకొనతగ్గవి చెప్పుకొనుచూ గడ్డమూ గోళ్లను పెంచక కొంతవరకూ సాత్వికాహారముల తీసుకుంటూనుందురు ఇక అధములు ఆహారవిహార వ్యవహారములలో నియములేక ఏవేళకేవి దొరికినవి తింటూ దైవమునే తలంచక అయిదు మాసముల వరకూ సంగమము చేయుచూ సుఖదుఃఖములలో పొర్లుతూ పురుషుడుచూలాలని తలంచక నెనరెంచక నిరంతర కృషికి లోనుచేయ ప్రసవకాలమువరకూ

ప్రయాసల కోర్తురు ఇక అథమాథము లన్ననో ప్రసవమగువరకూ సంగమించుతూ సత్త్వవర్తనకు దూరులై కారమూ ఉప్పూ పులుసూ చేదూ వగరూ ఎక్కువగా నాల్కవింపుగా తింటూ గర్భముసంగతే ఎత్తుకొనక శిశువుయొక్క గతులు తలంపక నిరంతరకృషికిలోనై పురుషుడు పీడింప దుఃఖియై దైవచింతనలేక పశున్యాయ ప్రవర్తకులై పుట్టించుకొని పిల్లలు రోగగ్రస్తులై బుద్ధిహీనులై అంగలోపములతో అగచాట్లుపడుచుండ చూచి దుఃఖించుతూ పిల్లలకట్లుచేసిన పాపముతో వీరుమరు జన్మకు అట్టిబుద్ధి హీనులకే జన్మింతురందురు విన్నారాతమరు వీరిజాడలలో ఏజాడన పోదలంతురో సెలవిండీ అంటూ రెండుహస్తములతో రాము చెంపలనిమిరినది సరోజ.

అబ్బా ఈమాటలు నీవేచెప్పుమంటివో లేకనీలో నీగురుడేనిల్చి చెప్పుచుండెనో తెలియదు ఇవినిశ్చయముగా నీమాటలుగావు గురువాక్యములే నిస్సందేహముగా గురువాక్యములే నన్నాడు రాము.

సరోజ రాము ముఖముచూస్తూ చిరునవ్వుంకురింప నిజమే నామాటలుగావు గురువాక్యములూకావు మాతృదేవి వాక్యములు వదినెగారికి చెప్పుచుండగా విన్నాను అన్నది సరోజ.

విన్నవి జ్ఞాపకముంచుకొనుట గొప్పవిశేషము జ్ఞాపకముగలవి అచరణలో ఉంచుకొన ఉద్దేశ్యము గలుగుట మరింత విశేషము వుద్దేశ్యము అచరించుట మరీ విశేషము నీవుఏవిధముగా ఆచరించమనీ సంచరించమనీ వక్కాణించిన అవిధముగా గీటుదాటక ఆచరిస్తాను అనుభవిస్తాను సహకరిస్తాను దీక్షనుసాధిస్తా నన్నాడు రాము.

అయితే వ్రతము రేపే ప్రారంభించండి ఈ నాటినుండీ కారమూ పులుసూ వగరూ చేదూ తగ్గిస్తాను ఉష్ణ పదార్థములు వదలుతాను తమకెట్లనేను తీసుకొను పదార్థములతోనే సంతోషిస్తారా అన్నది సరోజ.

ఔను స్వాత్వికాహారము తీసుకొనక ఉష్ణాహారము భుజించిన కామోద్రిక్తము గును దీక్షను సాధించలేను నూగులూ, ఉలవలూ, కోయిగూరా, చామాకూ, నల్లేరు, మెంతిక్కాయలు, పచ్చివుల్లిగడ్డలూ, మునగాకు, మునక్కాయలూ, చిట్టిఆకు, చిలకముక్కిఆకు, అటికమామిడి ఆకు, చేనిచామాకు, తెల్లగడ్డలు, ఎక్కువగా ఆవాలూ, కరివేపాకూ నూగులనూనె మామిడికాయా చింతకాయ ఊరగాయా కొఱ్ఱఅన్నమూ ఎక్కువకారమూ శాకాహారులు వర్జింపతగ్గవి. మాంసాహారులు కోడిమాంసమూ గుడ్లూ పక్షి సంబంధమయిన మాంసమూ వాడుకొన రాదందురు. యింతమాత్రము

చాలునన్నారు పాలూ నెయ్యీ పెరుగూ మజ్జిగా వెన్నా శీతలాహారములు వాడు కొనిన దేహము శాంతమై కాంతివంతమై కామదీప్తినివ్వక భరింపగలశక్తి నిచ్చు నన్నారు వెలువడే వస్తువు భద్రతకొరకై ఆచరిస్తాము అనుభవిస్తాము అన్నాడు రాము

వుత్తమ పద్ధతి అవలంభిస్తారా మధ్యములుగా వుంటారా అన్నది నవ్వుతూ సరోజ.

ఉత్తమపద్ధతినే అవలంబించి వుత్తమునేగని వుత్తమలోకానికేపోయి ఉత్త ములకే జనిస్తాము. పిల్లలకుచేసిన పాపముతో పాపలోకానికిపోయి పాపులకూ బుద్ధిహీనులకూ పిచ్చివారికీ తిక్కవారికీ అమితకోపులకూ పరమదరిద్రులకూపుట్టి పడరానిపాట్లు పడుటెందుకూ పిల్లలకొరకైచేసిన దైవపూజలూ పుణ్యమూ నియమ వ్రతదీక్షలూ బ్రహ్మచర్యమూ దేహారోగ్యమూ గలిగించి ఆయుర్దాయము హెచ్చిం చును కలిగిన సత్సంతతితో ఆనందమూ గలుగును దీనగలుగు నష్టమణుమాత్ర మూలేదు. దంపతులిరువురూ ఏకీభవించకపోయిన ఈవ్రతము సాధించుట కష్టము అందులో స్త్రీహృదయము మంచిదికావలె పురుషుడు వెన్నంటి నడువవలె ఇరువురూ వద్దికతో కలుగబోవుశిశువు అభివృద్ధికై భూతదయా పశ్చాత్తాపముగలిగి ప్రవర్తించ వలె నీవే నన్ను భద్రపరచుచున్నావు గాబట్టి నీ వెనువెంబడీ ఆవువెంటబోవు కోడె లాగ అనుసరిస్తాను ఆనందిస్తాను అన్నాడు రాము.

అన్నట్లుగాదు ఆచరణలో చూపవలె అది శూరత్వమూ అంత్యభ్రష్టత్వమూ చేయకుడు ఇక్కడ ఈనవమాసములు గడిపినట్లుగాదు శిశు జననాంతరముకూడా ఈదీక్షా కాలపరిమితిలో వెనుకంజ వేయరాదు. ఎదతట్టి నిలువవలె కామునికి వెరచి మనసుకు సోలితిరా అంత్యభ్రష్టత్వ మవుతుంది ఆలోచించుకోండీ అన్నది సరోజ.

జననానంతరము ఏమున్నదన్నాడు రాము.

దీనికన్నా అది మరింతకష్టము ఏమందురా ప్రసవానంతరం దినదిన క్రమేణా స్త్రీదేహము ఆరోగ్యమునకువచ్చి దేహసౌష్ఠవము ఏర్పడును పంచభక్ష్య భోజ్య ముల పళ్లెరము ప్రక్కన ఉంచుకొని వస్తుపరుండి మనసు పట్టవలెనంటే పరమ ధర్మమెరింగిన పరమ మునీశ్వరుడో పరమేశ్వరుడో గావలెనన్నారు మనసును పొర్లనివ్వక తమరు పట్టగలరా అని సందేహం అన్నది సరోజ.

ఇప్పుడు దినదిన భివృద్ధిగా గర్భము పెరుగుతూన్న గర్భభారానికోర్వలేక గసతో బుసతో ఆయాసములో నున్న ఇల్లాలును గర్భములోనున్న అర్భకునీ కూస్తూ కనికరిస్తూ కామాన్ని సహిస్తూ కాలాన్ని లెక్కిస్తూ దీక్షను సాగిస్తూ ఉండినవానికి కన్నులపండువుగా కలిగిన శిశువునుచూచిన కామాన్ని కట్టలేనంటావా శిశుపోషణకై

ప్రాణాన్నైనా ఒడ్డి ఆరోగ్యమునకై ఎట్టినియమ వ్రతమునైనా సాగిస్తా నీవెనువెంట నీ అడుగుజాడల్లో నీవెట్లనడిస్తే అట్లె కష్టాలేకుండా నడుస్తా అకాలపరిమితి చెప్పు విందామన్నాడు రాము.

వింటారా ఉత్తములలో చేరుదామంటారా శిశుపోషణ భారము చక్కగా నిర్వర్తించి పుణ్యముగంటారా అలిమాటలువింటే అవస్థలు తప్పవంటారా చెప్పండీ అంటూ చొక్కాగుండీలను తీస్తూ పెడ్తూ ఎదన చేయితో నిమురుతూ ఊ చెప్పండీ అన్నది సరోజ.

రాము హృదయానందముతో సరోజనుచూస్తూ అడుగు తప్పకుండా ఆడేది మాటాడేది నేర్చుకున్నావు ఆటకుతగ్గ పాటా మాటకుతగ్గ మాటా నేనూ నేర్చుకున్నా కానీ వింటా గీటుదాటకుండా ఉంటా నీ కానంటే నేనౌనంటా ఊ కానీ అన్నాడు రాము.

సరోజ నవ్వుతూ అనుభవించిచెప్పే అరవైఏండ్ల అడదని నవ్వవాకండీ అని రాముగడ్డముపై నిమురుతూ ప్రసవించిన దాదిగా పదకొండవనాడు స్నానము చేయించిన నాలుగునాళ్లకే మనసు పట్టలేక వళ్లునాపలేక కామాతురుడై కావలెనంటే కన్నశిశువుపై కనికరములేక తానూ కామాన్ని ఆపలేక కట్టుకున్నవారిమాటను కాదనలేక కసిగందుకువచ్చే కడగండ్లను తెలుసుకొనలేక దేహానికి అపాదించే ఉపాధులు గమనించలేక లోకమనేమాటల మనస్సునకందక సరేనని సంవత్సర ములోపలనే రెండవసంతతినిగను అధమాధములూ ఉన్నారు. అన్నప్రాసము ఆరునెలల పర్యంతమూ తాళి ఆటుపై మనసును తాళపట్టలేక సంవత్సరమున్నర లోపలనేకనే అధములూ ఉన్నారు. ఈఇరువురపిల్లలూ వ్యాధిగ్రస్తులై చచ్చుటో జీవచ్ఛవముల విధముగా అనారోగ్యవంతులై అల్లాడుటోతప్పదు. అగంతుక మృత్యువుల వాతబడక అమ్మానాన్నా తప్పులనుండీ అయుర్దాయముండీ బయటకు రావలసినదే కానీ జీవన్యాయముగా రాజాలరు. ఇక మధ్యములు పిల్లవాడు చక్కగా అన్నమతిని నడయాడుచూ నవ్వుతూ పేలుతూ ఆరోగ్యవంతుడై అల్లారుముద్దుగా సంవత్సరమువరకూ ఉండి పుట్టినపండుగచేసి దైవసాన్నిధ్యమున పిల్లవాని నిలిపి చేతులుజోడించుకొని ప్రభూ ఇకనీ మాయను భరింపలేము స్త్రీ పురుషన్యాయమున సర్వజీవులా కట్టివేసిననీకు ఇందులో గలుగు భ్రాంతీ బాధ తెలిసియే ఉన్నది బాధ భరింపలేము ఇక ఈశిశుపోషణా భారము నీదే ధర్మబద్ధులమయి వత్సనికి ఒక వత్సరము వయసువచ్చువరకూ వ్యామోహాన్ని అపుకున్నాము ఇక అపశక్యముగాదు

ఈకుఋని నీకు నవ్వు చెప్పుతున్నాము నీదేభారము ఆయురారోగ్యములతో వర్ధిల్లునట్లు ఆశీర్వదించుడు తండ్రీయని పిల్లవానిభారము భగవంతునిపైపెట్టి భార్యాభర్తలు సుఖపడుదురు వినా్నరా చాలా అన్నది నవ్వుతూ సరోజ.

అబ్బా ఏకోనవింశతి మాసములు సప్తశతీ పారాయణమే శరణ్యమా సంవత్సరమూ తొమ్మిదినెలలు సొలుతప్పక ఉండవలెనంటే నాలుగు తలలవాడైన తలలు విదిలించుకోవలసినదే ఇక్కడికే మధ్యమమే గన్పడుతున్నది. ఉత్తమము పసిఫిక్ మహాసముద్రములాగా ఇకెంతలోతున్నదో భగవాన్ భారమయ్యా ఇంత కన్నా పెడ్లిలేనిదేమేలు దయ్యాన్ని చూడలేదా భయపడలేమ అన్నమాటగా ఉండును భారం భారం పూరాబారం ముందు తొమ్మిదినెలలూ వెనుక సంవత్సరమూ వెరసీ ఇరవై ఒకనెల లేక సంవత్సరమూ తొమ్మిదినెలలు బ్రహ్మచర్య మనుభవించవలెనంటే కంటిమంటతో కాముని భస్మముచేసిన కాలకంఠుడైనా కటకట పడవలసినదే పుట్టించిన బ్రహ్మఅయినా చింతతో పూరి గడువవలసినదే రామ రామ రామా ఊఁ కానీ అని తలత్రిప్పుతూ ఒకనిట్టూర్పు విడచి తలవంచినాడు రాము.

సరోజ నవ్వుతూ రాము గడ్డముక్రింద చేయిపెట్టి ఎత్తి కన్నులలోచూస్తూ ఏమి భయమయినదా భరింపలేనంటుందా మనసు మధ్యముల మాటకే తలత్రిప్పి నిట్టూర్పు విడిచి తలవంచినారే అయ్యోపాపము ఉత్తములమాటవింటే ఉత్సాహమంతా పోయి ఉన్నమతిపోయె చంద్రమతీ అన్నట్లు చిత్రవిభ్రమము గలుగునేమో అయ్యో ఇకచెప్పను అలసట పడకండీ తమరెక్కడ బండినిలుపుమంటే అక్కడ అంగుళము ముందుకు పోకుండా నిలుపగలను నిరుత్సాహపడకండీ అని చుబుకమంటుచూ చిరునవ్వుతో రాము ముఖమండలములోకి చూచినది సరోజ.

అధిక కామియైన అతివే కామాన్నికట్టితే మొగవాణ్ణై మొలత్రాడుగట్టి మనసు నిలుపలేనా వేయీ ఎంతపెద్ద అంజవేస్తే అంతకు బెత్తెడుముందు వేస్తానులే ఊఁ కానీ అన్నాడు రాము.

చెప్పమంటారా భయమగుతుందంటారా అన్నది ముసిముసినగు నగుతూ సరోజ.

మధ్యములమాటలోనే గుండెనీరై దేహము చలించి మొద్దుబారిపోయింది మోటు చెట్టును ఏగాలీ ఏమీచేయలేనట్లు మొద్దుబారినమనిషిని భయమేమి చేయగలదు కానీ అన్నాడు రాము.

అయితే వినండి కన్నతల్లి ఆహార విహారాదులలో వ్యతిరిక్తగాక కాలాను గుణ్యముగా మార్చుకొంటూ పిల్లవానికి అన్నప్రాశనము మొదలుకొని మిరియాల చారుతో పాలతో నెయ్యితో కలిపిన అన్నమును తినిపించుకుంటూ జీర్ణములగు ఫలాహారము లిచ్చుచూ శిశువుకు పాలుచాలక పోయిన ఆవుపాలను తల్లి ఉదయం సాయంత్రముల కావలసినన్ని తాగుతూ కామోద్రేక్తగాక శిశువుకొరకై ఇరుపూటలా దైవధ్యానము చేయుచూ దినదినమూ పిల్లవానితో దేవునికి నమస్కరింపచేయుచూ రెండవ వత్సరము పండుగవచ్చువరకూ ఉండుట స్త్రీకినీ పురుషుడు తల్లికి పిల్లకూ కావలసినన్ని సాత్వికాహారములు తెచ్చియిస్తూ మన్మథునిధాటిని సహించి దినదినాభివృద్ధిగా షోడశ కళలతో అభివృద్ధిచెందు చంద్రునిలాగా వచ్చు పుత్రునిగని సంతోషిస్తూ దినదినమొక చాయతో కంటికి మిరిమిట్లుగొల్పు భార్యనుచూచి దినముల లెక్కించుచూ మనసుకు బుద్ధిచెప్పుచూ ద్విసంధ్యలా దైవధ్యానము పిల్లవానికై అర్ఘమర్పిస్తూ మాతృ పితృలోనర్చిన దైవశక్తి సహనశక్తి పిల్లవానియందుగన్పింప ఆనందిస్తూ రెండవపండుగవరకూ ఓర్చి పండుగనాడు పదిమంది బీదలకు అన్నము పెట్టి దైవాన్ని అర్చించి చేతులుజోడించి ప్రభూ హిందూమత సంప్రదాయ సిద్ధములగు ఆచారముల నిషిద్ధముచేయక ఆచార మనుసరించినాము అన్నిఅంగులా బిడ్డడు పెరిగినాడు ఈబిడ్డని నివంతుచేసినాము నీమాయాలీలలగు మైథున నిద్రాహారములు ప్రతిజీవినీ బాధించును ఇంతవరకూ ధర్మబద్ధులమై నీయాజ్ఞకులోబడి సంగమదోషముతో తల్లిపాలు ఉష్ణదీప్తిగలిగి పిల్లవానికి అనారోగ్యమువేర్పడుననీ వెంటనే తల్లిగర్భవతియైన ఆపాలు పిల్లవానికి మరింత కీడునిచ్చుననీ సంగమదోషము గర్భదోషమూవల్ల బాలారిష్టములు కింకలూ కీడూ ఆపాదించుననీ గమనించిపిల్లవానిపై దయాదాక్షిణ్యముగలిగి ఇంతవరకూ వేచితిమి ఇంకభరించుటకు కష్టము తండ్రీ ఈనాటితో కోడిపిల్లల యారదేలునట్లు యారదోలి నీవంతు చేయుచున్నాము ఆయురారోగ్య భాగ్యములు ఇచ్చి ఆదరించుడు తల్లిదండ్రులారా యని శ్రీలక్ష్మీనారాయణులకు వప్పచెప్పి బాలుని దేహారోగ్యముల సమయానుకూలముగా గమనించుతూ తిరిగీ సంసార సుఖము లనుభవించువారు ఉత్తములు వారిబిడ్డలు బుద్ధిబలములో బృహస్పతివలె దేహబలములో భీమునివలె మనోబలమూ దేహబలమూగలిగి దినదినాభివృద్ధియై షోడశకళలలో పూర్ణిమచంద్రునివలె ప్రకాశమానమై బ్రతికి వచ్చిన వారుగాక చచ్చి బ్రతికినవారగుదురు విన్నారా అన్నది సరోజ.

రోజులు రెండంతలు పెరిగినవిగాని కార్యమంతా ఒకచే ఈలెక్క చూడగా

మూడేండ్లకొక సంతతియగుట బాగనే ఉంటుందిగాని అమ్మా నాన్నా తలనొప్పికై పీశశాంతి కావలసివస్తుంది. కామునికి బుద్ధిచెప్పే కఠినహృదయులయితేగాని ఈ వ్రతం నెరవేరదన్నాడు రాము.

ఔను నీరోగులు దేహబల మనోబల యశోధారులూ సంతతికావలెనంటే తలి దండ్రులు ధర్మబద్ధులు కావలయును మనోనిగ్రహము ఉండవలయును జంతువుల వలె బైటవేస్తేసరియా కష్టపడి నెత్తురుపంచియిచ్చి కన్నందుకు నాకూ తల్లినీ పిల్లనూ కష్టార్జితముతో సాకినందుకు మీకూ కీర్తితెచ్చు సత్సంతతిగా ఉండవలె పుట్టినప్పటి నుండీ వారికై వారివిద్యాబుద్ధులకై వారిజీవనోపాధులకై తలిదండ్రులు పీడ్చే సంతతి లేకున్ననూ శుభమే పుట్టితే ఒక్కడైనా శ్రీరామ శరమువంటివాడుగా ఉండవలె ఎందరో ఎందుకు దద్దన్నలు అట్టివారు కావలెనంటే ఇన్నికష్టాలు పడవలె ఊరక రారు ఊరక వచ్చేవారు తలిదండ్రుల రూపునామ క్రియలులేకుండా తుడిచేటందుకే నన్నారు అన్నది సరోజ.

అయితే మూడేండ్లకొక సంతతిగలుగు వారదంరూ ఇట్టే వర్తిస్తారంటావా అన్నాడు రాము.

లేదు కాలసంతతీ అకాలసంతతీయని రెండు విధములన్నారు మా ఆచార్యులు అకాలసంతతి తల్లికీ పిల్లకూ ఇరువురకూ ప్రాణహాని గలిగించునన్నారు ప్రసవా నంతరం సంగమము వినాడు గలిగిన అతిత్వరలో గర్భము వెంటనే గలుగుననీ సంవత్సరములోపల ఒకటిన్నర సంవత్సరములోపల రెండేండ్లలోపల గలిగి తల్లికి పిల్లకూ అనారోగ్యములు గలిగించి పీడించునందురు. ఇది తలిదండ్రులు పిల్లలూ చేసిన పాపము దీనికి వ్రతనియమమూ దైవప్రార్థనా ముఖ్యమన్నారు. కాలసంతతి మూడేండ్లకొకటూరే ఉండును. అంతకు లోపల కాదని సంగమము గలిగిననూ అదృష్టానుకూలముగా గర్భము కాదన్నారు. వారుముందుజన్మతో నియమబద్ధులై దైవముతో చెప్పుకొని పసిపిల్లలకు ద్రోహముచేయనివారు. తమ ప్రాణముకన్నా పసిపిల్లలప్రాణము మిన్నగా చూచినవారు అట్టివారికి ఈజన్మలో మూడేండ్లకొక కాన్పై కాన్పులో పిల్లకూ తల్లికీ విష్టమూలేక రోగగ్రస్తులుగాక ఏడ్పుగంటివారు గాక రాత్రివేళ పోరుపెట్టుకొని ఇరుగుపొరుగువారిని ఇంటివారినీ తల్లినీ నిద్ర పోనివ్వక తాను నిద్రపోక అందరికీ మృత్యుప్రదమై పాడుపిల్ల బాగపుట్టెనని తల్లి వేసటపడ ఇంటిలో వేదనపడ రోదనచేయక హాయిగాపెరిగి అల్లారుముద్దుగా మాటాడి తలిదండ్రులూ జేజీ అబ్బా అవ్వా తాతా మొదలగువారు ఆశ్చర్యపడ

ఆటలతో మాటలతో ఆనందపెట్టుదురు. ఎంతధర్మదూరులైనా నియమముల నిరాకరించినా పిల్లలూ తల్లులూ దెబ్బతీనక ముందుకువచ్చుట వారుముందుచేసిన సుకృతఫలమన్నారు. తమరు రేపే వ్రతాన్ని ప్రాలంభించండి ప్రారంభము రోజున కాయాకర్పూరమూ పూలూ పండ్లూ క్షీరాన్నముతో దైవనివేదనచేసి దీక్షకు ప్రారంభము క్రమశిక్షణకూ ప్రారంభము సకలసద్గుణగరిష్ఠునీ పుత్రుని గలిగించి వంశము పావనముచేయండీ పేరెన్నికగనండీ ఇంకనన్ను విడండీ లేవనివ్వండీ యని చుబుకము పట్టుకొని హృదయానందమంతయూ వకతూరి కుంభవర్షముగా రాముపై వర్షింపచేసినది సరోజ.

రాము ఆకుంభవర్షములో తడిసి ముద్దై చలిపీడింప నీవేశరణ్యమని కౌగలించుకొని ముఖము ముఖములోవంచి సరోజా నీవన్నట్లు మనము కొంతపాపుల మనవచ్చును ఒకఫసలీ అయినా దాటకముందే ఫలమందుట పావభూయిష్ఠమే అన్నము విస్తరలోపెట్టి వెనక్కి తీసినట్లే అయినది ధర్మదూరుల మయితిమా పాపము ధర్మబద్ధులమయితిమా తాపము అన్నంతలో రాము తలాకన్నులు ఎగరవేస్తూ చిరునవ్వు నవ్వుతూ పాపము అన్నది సరోజ.

పాపమూ పాపమున్నర దేహకష్టానికన్నా మనోదుఃఖం మరింతపీడిస్తుంది. అతి ఆలోచన మనిషిని తగ్గిస్తుంది ఏమనుకున్నావు అని అటుపైకి ఎగచూచి ఓ బ్రహ్మదేవుడా ముందుజన్మలో పిల్లలు పిల్లలని నీతో మొరపెట్టుకొన్నామా లేక పిల్లలు జాస్తి జాస్తి యని భ్రూణహత్యలు చేసినామా ఈరెండుతెగల వారిలో ఎక్కడచేరినామో కాస్త తాలూకుప్రాసి పడవేయవయ్యా పాపపరిహారం చేసుకునే విధమాలోచిస్తాము అన్నాడు రాము.

నన్నుచెప్పమంటారా వింటారా ముందుజన్మలో గర్భాధానం చేసుకున్నదాదిగా గర్భం గర్భం అంటూ గంతువేస్తూ కాకపోతివని భార్యపై కోపగిస్తూ చురచురా చూస్తూ ముక్కోటి దేవతలకు మ్రొక్కుతూ మ్రొక్కించుతూ యంత్రతంత్రాలు మోయించుతూ పాపమనక ఆర్తిప్రార్థనవినక మొరాలింపక ముందుగతులు పరికింపక అబలకు అన్యాయంచేసి రెండవ వివాహం చేసుకొని ముందొచ్చినది మూలన మూల్గుతూ చీదివేయుచుండ మురిపెములతో ముద్దులతో సుద్దులతో వద్దికగా రెండవభార్యతో ముచ్చటపడినారు ఆ పాపం వెన్నంటి గర్భాధానమయినదే గర్భంప్రారంభమయినది ఇప్పుడూ అధర్మహృదయులయితిరా పాపం ధర్మహృదయులయితిరా మదనతాపం పాపం ఇటు

నయ్యా అటుగొయ్యా అప్పుడట్లు చేయకవుండి వుంటే కన్యాత్వముతో కాముకేళిలో కోమలినై స్వాములవారిని మెప్పించి వప్పించి మదనతాపాన్ని మైదప్పించి వుండే దాన్ని బ్రహ్మనెందుకంటారూ చిత్రగుప్తనెందు కంటారు.

చేసినదంతా మహదేవా చేయించితీరును మహదేవా
చేసినదంతా మహదేవా బోచేయుచునున్నా మహదేవా

అన్నారు విన్నారా నన్నులేవనివ్వండి ప్రొద్దుపోయింది అన్నది సరోజ.

అయ్యో ప్రొద్దుపోయినదొక పేకాదు బుద్ధి మొద్దుబారిందికూడా ఆలోచించి చూస్తే నిజముగానే తోస్తుంది ముందుజన్మలో బిడ్డలు బిడ్డలని బలుపాట్లుబడినా లేక స్థిరచరాస్తుల అన్యాక్రాంతముచేసి అందులో సుఖములేక కడన కడగండ్లపాలై దైవచింతనలేక దానధర్మములు చూచిచూచి చేయలేక నావస్తువునుతిన పిల్లలు లేక పోయిరి లేకపోయిరని పరితపించి పోయినవారికి మరుజన్మలో తథాస్తని వసంతాని కొకడూ వత్సరానికొకడూపుట్టి వద్దువద్దనియూపోక సాలమ్మాఅని పేరుపెట్టుకున్నా చాలించుకొనక సాధించును ముప్పురినీ బాధించును రానురాను మరింత పీడించును ఈవేదనతో యాసరిక గలిగి జన్మజన్మానికి పిల్లలువద్దని దేవుని ఎదుట చెప్పుకొనగా తిరిగీ జన్మకులేక పోవును ఈఅడిగే దానిలోవుంది యుక్తి అడిగేటప్పుడే ఒకనియ మముగా అడుగవలె పిల్లలు పిల్లలని నియమమూ నికరమూ లేకుండా అడిగితే అంతా పెంటే ముందు ఈవిషయములో మనము జాగ్రత్తపడివుంటే ఇప్పుడు ఇట్లకాదు అన్నాడు రాము.

ఇప్పుడడగండీ ఇద్దరు మగపిల్లలూ ఇద్ధరు ఆడపిల్లలూ చాలని అక్కడికి సంతోషిస్తాము అన్నది నవ్వుతూ సరోజ.

అడిగేదేమిటి కుటుంబ నియంత్రణకై మందులు మాకులూ ఆప్రేషన్లూ మైనర్ అప్రేషన్లూ ఇంజక్షన్లూ వచ్చినవిగా అవిగాక ఆయుర్వేదములో మందులనే కములున్నవిగా ఈవిషయమై త్రిమూర్తులతో చెప్పుకొనవలసిన తిప్పలేమీలేవు ఇప్పుడీ భారము ఓదయామయా ఎంతపని చేసితివయ్యా అని అన్నాడు రాము.

సరోజ నవ్వుతూ రాము బాహువులమధ్యనుండీ విడిపించుకుని ఆనందలక్ష్మి వైతొలగినా ఆరోగ్యలక్ష్మి ఆశ్రయిస్తుందిలేండీ ఆరోగ్యమే మహాభాగ్యము అంటూ పోయి గృహకార్యకలాపములలో పాల్గొనెను.

రాము సహాయకార్యదర్శిగా పనిచేయుచుండ అస్తమానమాయెను. పూజా

భోజనాది కార్యములు ముగించుకొని వేళాకోళముగా మాట్లాడుకొంటూ నిమరించి మరునాడు ఉదయమేలేచి దినకృత్యములు దీర్చుకొని కాఫీ త్రాగి రాము బజారుకు పోయెను.

సరోజ వంటకు ప్రారంభించి చేయుచూ స్తోత్రముల వల్లించుచూ నుండు నంతలో.

రాము బజారునుండీవచ్చి ఈనాడు భానువారము సూర్యప్రసాదము చేసినావా అన్నాడు.

ఆదివారాన్నే మరచిపోమంటారా అంతమతిమరుపులురాను ఒకటిన్నర షష్టిపూర్తినిండిన వృద్ధవనిత ననుకున్నారా ఇంకా తొంబైఏండ్లు రాలేదులేండీ తమదే ఆలశ్యం కానివ్వండి అన్నది సరోజ.

అందులో వేయు పదార్థములన్నీ వేసినావా అన్నాడు రాము.

ఏమి వేయమన్నారూ అరపావు రవ్వకు ఒకటింకాలు అరపావు పాలుకాచి నెయ్యివేయించిన రవ్వను అందులోవేసి మోతాదుకు మించినెయ్యివేసి కలియబెట్టి వుడకనిచ్చి ద్రాక్ష ముంతమామిడి సారపప్పువేసి దించి కొంచెము యాలకలపొడి వేసి కలయబెట్టివుంచినాను ఇంతేనా ఇంకా ఏమయినా చేర్చమన్నారా అన్నదిసరోజ.

రైట్ రైట్ అంటూ రాము పోయి స్థానము చేసివచ్చి సూర్యభగవానునికి దేవునికి నివేదనచేసి ఇరువురూ ప్రసాదము పుచ్చుకుంటూ ఇంకనీకు సైదోడూ వాదోడుగా మీ అమ్మను రమ్మంటామా మాఅమ్మను రమ్మందామా అన్నాడు రాము.

రమ్మందామా వద్దు పరంధామా వద్దు రెండు మాసములు దాటువరకూవద్దు ఇది నిశ్చయమో అనిశ్చయమో ఎవరికేమి ఎరుక తెలుసుకొని తమపరి తెల్పవచ్చు మీయమ్మ మాయమ్మవస్తే మీ నాన్నా మానాన్నా ఎక్కడ పోతారను కున్నారూ ఇరువురూ అట్లాటివారే ఒకక్షణము ఆడవారులేక ఓపిక పట్టలేనివారు వారూ మన వంటివారేనని తలంచలేదా అన్నది సరోజ.

పాలు పొంగి పొంగి ఆగినవి ఇంగిపోవు చున్నవి. గడ్డకట్టేసమయములో కూడా పొంగు వస్తుందంటావా అన్నాడు రాము.

ఔను దంపతులు వృద్ధులయినా అనుభవించుటకు అసక్తిపరులయిన్నా ఆశలు మాత్రము అంతముగావు. అలు అంచునే వుండవలెనను ఆశలుంటాయన్నారు కార్యకలాపాలకు వాడుకొంటూ కమ్మని మాటలు మాట్లాడుకుంటు కాళ్లు పట్టుమనీ వళ్లు పట్టుమనీ కావలసినవి అందివ్వమనీ కాలముత్రోయు చుందురు. వారిని ఇక్కడ

ముందుజన్మలో జంటపక్షుల విడదీకేనా మనజంట కొంతకాలం వంటియైనది అన్నాడు రాము.

ఆమాటవిని సరోజ ముఖముచిన్నచేసుకొని తలవంచి కంటనీరుపెట్టినది.

అది రాము గ్రహించి అన్నది పొరపాటని తెలుసుకొని తటాలున సరోజను అంచుకతీసుకొని గడ్డముపట్టుకొని కట్టుకున్నవాడన్నందుకు కన్నీరా భర్తహేళన చేయక బైటవారుచేస్తారా నిన్ను ఎగతాళీహేళనా చేసేఅధికారము చనువూ బాధ్యత నాకులేదా చేయరాదా భర్తభార్యనూ భార్యభర్తనూ ఎగతాళిచేసుకోక ఎవరినిచేయవలయు నంటావు ఒకరిని ఒకరము అనుకొంటూ హేళనచేసుకొంటూ వినోదమూ విలాసమూపడుతూ ప్రణయ కలహములు చేసుకొంటూ ప్రాణ స్నేహితులలాగా ఉన్నదే కాపురము అట్లున్నవారే భార్యాభర్తలు కాదనిమాటజారినా చేయిజారినా కాలుజారినా కోపగించుటా క్రోధపడుంచుట ఇరువురకూ తగదు అని ఎదకాంచుకొని చెంపల నిముడుతూ అన్నాడు.

మీరు అన్నందుకుకాదు అనుటకూ అదరించుటకూ అధ్యాత్మభర్త భర్తఅనక మరెవరనవలె మీరుకొట్టినా తిట్టినా మెడబట్టినెట్టినా నన్నుకాదనుకుంటాను నాలో గల పెద్దతనాన్ననుకుంటాను భర్తపైకోపముగానీ క్రోదముగానీ ఉండుకాలము పోయినది భర్తకూ భార్యకూగల సంబంధబాంధవ్యాలను తెలుసుకున్నాను కోపముతో పాపము తెచ్చుకున్నాను. అపాపాన్ని అనుకున్నప్పుడంతా మైవలించి కంటనీరువస్తుంది. గంటలకొలదీ ఆగక ఏడ్పిస్తుంది అదిమీనోటనే వినుటతోటి వాగుండెలపిసిపోయినవి. ఇట్టిప్రేమజీవుల ధర్మపరులా ఊరక దుఃఖింప చేసినానే అని చింతించేదాన్ని మరుజన్మకు ఈబాధఎట్ల భరించవలెననేదాన్ని ఆమాటమీనోట వినుటతో హృదయము చీలిపోయినది అన్నది గద్గదస్వరముతో సరోజ.

ఆమాటలకురాము సరోజను మరింత కౌగలించుకొని లేతగులాబీ పుష్పము వంటి బుగ్గలపైనిమురుతూ సరోజాఇదివెఱ్ఱితనము పూర్వజన్మసుకృత దుష్కృతముల ప్రతిజీవి అనుభవించవలసినదే ముందుజన్మలో నీకునేను ద్రోహముచేసినాను అదివచ్చి దుఃఖింపచేసింది పోయింది పోయినదానికై తిరిగిదుఃఖపడుట అప్రయోజకము మంచిదికాదు స్త్రీ అనాథయనీ పురుషుని మాటచెల్లుతుందనీ అనేకమయిన చిక్కులుపెట్టి విడచిపెట్టి భయపెట్టి ఇరుకునబెట్టి ఎటుపోవుటకూ వీలులేని తెరవున

బెట్టి దుఃఖింపచేయువారూ సొత్తులకై వరదక్షిణలకై దురాదాయాలకై మాటిమాటికీ ఎత్తిపొడుచుచూ ఏడ్పించువారూ తెచ్చుదనుకా ఇంటికేరావద్దని మెడబట్టి నెట్టువారూ కటకటబెట్టువారూ తాళిగట్టి నడిఇంటిలోబెట్టి తానొకదాన్ని పెట్టుకున్నవారూ అట్టివారికి చోటిచ్చినవారూ ఉన్నారు ముందుజన్మకు వారెట్టికష్టముల పాలవుతారో తెలియదు నేనట్టిక్రూరములేమీ చేసినట్లులేదు నడకలో అగుపడుతూఉన్నది. నీపై కోపగించుకొని దయలేక ధర్మపత్నియే విడిచిపోవుట పాపమనక నలుడు విధివశమున దమయంతిని అడవిలో ఒంటరిగావిడచి పోయినట్లు గర్విష్ఠనైపోయి నిన్నుఏడ్పించినాను అది ఈజన్మలోనన్ను ఏడ్పించినది ఇకరాదూ లేదూ మనసారా చెప్పుతున్నాదా చిత్రగుప్తుని చిట్టాలోకాదని ఎక్కిఉండినా తెలిసి చింతించి కన్నీటిబిందువు విడచి నావు దుఃఖించినవాణ్ణి నవ్వించినావు మరపించినావు హృదయములోచోటు తిరిగి ఏర్పరచుకున్నావు దుఃఖించిన వానినోటితో పాపములేదని పించినావు పాపము చిత్రగుప్తుని చిట్టాలో తుడిచివేయించుకున్నావు ఏదీ ఒకతూరి చిరునగునగూ ముఖబింబము వికసింపచేసి ఒకతూరిచూడూ చూడవూ అని పైకెగజూచి రామా నీపేరు పెట్టుకున్నవారికికూడా నీకష్టమేనా అయ్యోయ్యో ఇదేమయ్యా అనాడుసీతను ఎవరో అనినమాటకై అడవులకుపంపి ఏడ్పించినావు ఏడ్చినావు. ఈనాడు నీపేరుగలిగిననేను ఇల్లాలినీ సీతవలెనుండు చూలాలినీ పొరపాటున కనికరములేక జ్ఞాపకములేక అనన్నమాటనుఅని ఏడ్పించినాను ఏడ్పించినందుకు ఏడ్వవలసివచ్చినది నీకేగాక నీపేరుపెట్టుకున్న వారికికూడా ఇంతేనాస్వామీ అయినా నీవట్లుండు ఓబ్రహ్మదేవా షడ్రసాల్లో చేదుఉన్నట్లు నవరసాల్లో దుఃఖరసము ఏలసృజిస్తివయ్యా మాటల్లో పొరపాట్లూ మనుష్యుల్లో అగచాట్లుఇట్లే స్వజించినావు అయినా నిన్ననవనిలేదు నీవట్లుండు ఏడ్పించినందుకు ఏడిస్తేగాని అప్పుతీరదు రాబోవుజన్మలో ఏడ్చేదాని కన్నా ఇప్పుడేఏడుస్తాననీ సరోజను విడచి తలరెండుచేతులతో పట్టుకొని కూర్చొపోయినాడు రాము.

సరోజ రామును కూర్చొనివ్వకుండా నడుముపట్టుకొని ఆపి నవ్వుతూ నాకు నొప్పితగిలి ఏడిచినాను మీకేమి నొప్పితగిలినదని ఏడ్పువస్తుందన్నది.

నొప్పిలేదా నీకుమనసొక్కటే నొచ్చినది నాకు దేహమంతా మనసంతానొప్పె జల్లెడు గండ్లలాగా దేహమంతా గండ్లే పదునైన మదనాస్త్రములు ఎదనదూరి వెన్నిపునవెళ్లేటట్లు మదనుడు కొట్టితే నొప్పిలేదా చువుక్కుమని ప్రాణంపైలోకానికి

పోయివచ్చినది పాపానికై పరితపించి బాధపడి ఏడుస్తున్నది ఇల్లాలు మదన తాపానికై నీవేడ్చుమని మనసూదేహమూ ఏకమై ఏడుస్తున్నవి అన్నాడు రాము ఆశ్చర్యంగా.

సరే అయినప్పటికీ వ్రతము వ్రతప్రారంభమునాడే అస్త్రాలకూ శస్త్రాలకూ విడిస్తే ఎంతోకాలం వీగాలనే అవతలేమిగతి అన్నది సరోజ.

ఏమినన్ను కొంచెముగాచూస్తావా నాదేవుడెట్టివాడో నేనట్టివాడనని తెలుసుకొనలేక మాట్లాడుతావు వేషభాషల సన్యాసిననుకున్నావా పొరపాటుపడను ముందుకుకాలు పెట్టితినా అచ్చము రతీనాథుడనే వెనక్కుకాలుపెట్టితినా అచ్చము శుకులవారినే వ్యాసుని కామతేవే వెట్టిదానా నాదైవము కృష్ణపరమాత్మ ఒకానొకప్పుడు పదివేల ఏడులు వుండంటి చలిలోచలికొండలో పంటంటినిండు యౌవనవతి రుక్మిణీదేవిని తొడపై కూర్చుండబెట్టికొని తపస్సుచేసినాడట ఇకశిష్యుడన్న సామాన్యుడనుకున్నావా వుండంటిచలివచ్చి కొండలాగ మీదపడినపడనీ పిండారబోసినట్లు ఆరబోసినవెన్నెలలా వెన్నెలదొరలూ వేయిమందివచ్చి వెన్నాడిన అడనీ కంతుజయంత వసంత మలయమారుతులు నలువురు దాసర్లా జాకట్లుకొట్టిగోవిందలు ఇంటిముందు ఎంతగాపెట్టినా పెట్టనీ కట్టుకున్నకాంతే బాధభరించలేను అని మిన్నేరులాగా పెన్నారులాగా పైబడినపడనీ నాదేవుడెంతో కార్యసాధనల్లో నేనంతేనన్నాడు రాము.

సరోజ పకపక నగుతూ దైవానికి తగ్గ దాసుడూ దాసునికి తగ్గ దైవమూ మంచివారే అపవారంపే అమడదూరం పోయేవారు కొంగజపాలుచేసి కొంగులు కొంగులు ముడిబెట్టే ఆస్వామీ కొసరి కొసరి కోర్కెలు తీర్చుకునే ఈస్వామీ సరిపోయినారు అన్నది.

అది చూచి రాము దేవుడా భారం తీరిందిరా భార్య నవ్వింది రా ఏడ్పిస్తినే ఏమౌతుందో ఏమోనే అని దిగులాయె తీరింది స్వామీ అన్నాడు రాము.

భార్య కంటనీరు పెట్టితే అంతదిగులా అంతకనికరమా అంతదయా కంటనీరు పెట్టినా కాళ్లమీదపడినా కడీనీళ్లు విడచి కటకట పడినా దిక్కులేని దాననని మొరబెట్టినా కనికరములేక కాలదన్నే కట్టుకున్నవాళ్లూ తళుకూ బెళుకూ కులుకూ పలుకూ భరకుచూపితే వశుడవుతాడు ఇతరులఆశించి వీధిమరగడూ ఇంటికివస్తాడు

సుఖపడదామని వాల్‌గన్నుల వైఖరిచూపితే బోగంకులుకుతో బోర్లపడతావా అని నాల్గువడ్డించేభర్తలూ కేళీవిలాసముగా మాట్లాడి కాముకేళిలో వప్పించిమెప్పించి జీవితము హాయిపరచి హాయిజెందుదామని పైనచేయివేస్తే చిత్తినీజాతియనే పుణ్యపురుషులా ఆహారవిహార వ్యవహారములలో మిగుల శ్రద్ధతోమెలగి సేవచేసి వలచి వలపించుకుందామని పతిననుసరించితే వశవర్తిని చేసుకొని మోసముచేయ ఉద్యమమాఅని సందేహించు మొనగాండ్రు భార్యభర్త పేరువింటే పులినిచూచిన లేడివలె గజగజవడకి నిలువవలెనని ఎంచి అదిగొప్పగౌరవమని తలంచి భార్యప్రాణం భర్త భర్తప్రాణం భార్యయనే భావంమరచి అన్యాయంచేస్తే మరుజన్మకు అన్యాయం జరిగితీరుతుందనే వాక్యముమరచి భార్యను పదేపదే చీటికీమాటికీ పడదన్నువారు వదిగివదిగిజీవిస్తే సంచరిస్తే నేనంటే అంతచేదాయని చెంపలువాయగొట్టువారు అధికారము చెలాయించి అధఃపతనముచేయువారూ ఎందరోఉంటే భార్యకన్నీటికే దిగులుపడినారా నేనుధన్యురాలను భూతదయా పశ్చాత్తాపమూ దాక్షిణ్యముగల భర్తదొరుకుటవల్ల ధన్యురాలను ధన్యవాదాలు అని సరోజ చేతులుజోడించి నమస్కరిస్తూ నవ్వినది.

అబ్బా ఆరక్కసుల చెప్పవాకే దిగులవుతుంది చేస్తారూ చేయించుకుంటారూ చూడలేదా ఆడవారు మొగవారికిచెప్పే శిక్షావిధానాలు ముందు చిన్నచిన్నమాటలూ అటుపై పెద్దపెద్దమాటలు దానిపై మెటికలూ దానిపై రంపులూ దంపులూ గుంపులూ తలవంపులూ దానిపై సమ్మార్జనీప్రయోగం దానీపై శూర్పప్రయోగము అటుపై వీలుదొరికితే **144** శిక్ష దానికిమీరితే **302** ఉండనేఉన్నది అయినా ఆడవారికీ చనువిస్తే చంకకెక్కేది ప్రేమిస్తే పెద్దరికంచెలిచేదీ వలపుచూపితే వడ్డించేదీ ప్రీతి చూపితే మూతిముడిచేదీ చెంతచేర్చితే గంతులేసేది అధికారమిస్తే అణుకువగాచూచేదీ మాటవింటే ఆటఆడేదీ చేరదీస్తే శిరసుకెక్కి తాండవమాడేదీ నిజం అవన్నీ విడచి అణుకువగలిగి స్త్రీ, ధర్మమెరిగి భర్త, నడుచుకుంటేబాగు లేకుంటే సూర్యచంద్రాదులుగతులు తప్పినట్లుంటుంది జీవితాలేవ్యర్థ భాజనమన్నాడు రాము.

ఔను విద్యాజ్ఞానమూ లోకజ్ఞానమూ ఎరింగినవారు మొగవారు పదిచోట్ల తిరిగి పదివిషయాలువిని పదిపుస్తకాలు చదివి పదినీతులూ ధర్మాలూ నేర్చినవారు మొగవారు స్త్రీకేమితెలుసు నట్టనడిఇంట్లోఉండి నాల్గువిషయాలుకూడా తెలియనిది తల్లిమంచిదై తెలిసినదై చెప్పిఉండిన ఇంతోఅంతో తెలిసిఉండవలసినదేగాని కనీ

వినీవిరుగని దానికేమితెలుసు కననిపీ వినని తెలుసుకొనగలజీవి అదివేరన్నారు పూర్వజన్మ సంస్కారము పూర్తిగా అయివుండవలెనన్నారు. ఏమీతెలియని జీవులని తెలిసి మొగవారు శాంతవాదులై లోకజ్ఞానము కామవిలాస తంత్రమంత్ర యంత్రములూ కుటుంబరక్షణో పాధులూ భాషా వేషమూ నేర్పూ ఓర్పు నేర్చుకొని అనుభవింపతగినవారు ఆవలవైతొలగి శాంతములేక నేర్పుకొను మరుపుకొను నేర్పులేక కోపులై ముక్కోపులై కండ్లురిమి పండ్లు చిటపట పటపటా కొరికి చిటికీ మాటికీ చెంపలు వాయించితే ప్రేమపెన్నార్ చేరి చావుకుతెగించి జీవితాశయములులేవు తీరవూ అని తలంచి ప్రకృతికి ఎదురీద తలంచుటో సంఘమునకు వెరచి ముందువెనుకలరసి చావుకుతెగించుటో ముందువెనుక లరయక అందరమూ సంఘములో అప్రతిష్ఠపాలవుదుమను మారాలోచనలేక భ్రష్టయి భావిగతులు చెరచుకొనుటో దుఃఖముతో కృంగి కృశించి పరము పదించుటో జరుగును దయితుడు శ్రీదయితునివలెగాక దస్యుమయితే దాపురించేదిఇదే శ్రీదయితుడే భార్యగౌరవనీయ భరింప తగినది ప్రపంచమునగల విలువగల వస్తువులలో విలువగలది దాచుకొని తిరుగతగినది. తినీతినకనైనా దాచుకొని తెచ్చియైనా పెట్టతగినదీ దేహములో ఎచ్చటనైనా చోటివ్వతగినది అనిచెప్పుచూ దృక్కుగా సాక్ష్యరూపముగా తానేశ్రీదయితుడు వక్షస్థలమునా బ్రహ్మపుక్కిటా శివుడు పార్వతికి అర్ధదేహములో గంగకుశిరస్సులో చోటిచ్చి ఆస్థాన మంటపములలో అంకస్థలముననే చోటిచ్చిరి ఇచ్చినదిగాక అభయహస్తమెత్తి ఇట్లమీరూ స్త్రీలకు చనువూ చోటూఇవ్వండి అనురాగముతో ఆనందమనుభవించండి ఆకాశములో మేఘములావరించి ఉరుములురిమి మెరుపులు మెరసి చల్లటిగాలితో వర్షబిందువులు భూమిపైపడినగాని భూమిలోగల ప్రతిమొక్కబీజమూ మొలకలెత్తి సశ్యశ్యామలముగా పెరుగదు ప్రకృతి వచ్చటవన్నెతో శోభాయమానముకాదు అట్లే స్త్రీని అనురాగముతో అమితచనువుతో అంకస్థలముపై కూర్చుండబెట్టుకొని ప్రేమించి లాలించినగాని ఆమె ముఖమండలములో మెరుపులలాంటి కంటితళ్కులు బెళ్కులు కుల్కులూ ఛలోక్తులూ వెలువడవు చనువిచ్చి ప్రేమనువెలివరచినగాని ఇట్టివి వెలువడవు చనువిచ్చుకొద్దీ స్త్రీలోగల విలాసములు అనంతములుగా వెలువడును అట్టివి వెలువడినగాని పురుషుని హృదయము రంజింపబడదు అనురాగములోఉంది ఆనందం ఆనందవతి కుసుమవిడచిన పామువలె తేలికై చలాకీయై సర్వమూ తనదేనని సర్వకార్యములూ చక్కబెట్టును సంతోషముతో పురుషుని ప్రేమించి వెన్నంటును మద్దుమందులక్కరలేదు అనురాగము

చెరచుకొంటిరా ఇహమూ పరమూ చెరచుకోగలరు అని సరోజ ఇంకాఏమో చెప్పబోవు చుండగా.

ఆ అగుమని రాము త్రిమూర్తులు త్రిదేవులకు అంకస్థలమున చోటిచ్చి గౌరవించినందున వారు వారికేమయినారో తెలుసునా వారిపతులు వారిని ఎంతగౌరవించినారో అంత అణిగిసంచరించి విష్ణుప్రథమ కింకరీ శివప్రథమ కింకరీ బ్రహ్మప్రథమకింకరీ అనిపించుకొన్నారు అట్లసంచరించుతూ పరిచర్య స్వయముగాచేస్తూ పతిభక్తి గలిగి నీవలెవంటమనిషి గావలెనని పోరుపెట్టుకొనక పొరపాటు పొరపాటు రక్తిగా సంసారముచేస్తూ శక్తి మితిమీరినడువక పాలనీళ్ల న్యాయముగా కలసిపోయినారు అట్లయితేమిల్లరీ సెల్యూట్ కొట్టి అంతావప్పచెప్పి అక్కడా ఇక్కడేమి వెత్తినేచోటు చూపవచ్చు అదికాదే శాస్త్రచనువిస్తే కాయనేలకు తట్టి తొడసుగట్టిగ కొట్టి పెడవప్పళించి భుజాస్ఫాలనమొనర్చి లేవని సంకోచించక ఎడమచేయి మీసము మీదికి పోనిస్తారు మొగుడు భూమిమీద తాండవమాడితే మొగనినెత్తిపై తాండవమాడుతారు నెత్తికెక్కినావు దిగవేఅంటే ఇంకనీతోగాదు మీనాన్నతోగాదు అంటారు అంటావా నెత్తిన తాండవ మాడుతానంటావా అనిగట్టిగా గద్దిస్తే చావుకు తెగించుటో రచ్చకెక్కించుటో ఇంటిగుట్టు బయటబెట్టి రట్టుచేసి తలవంపించుటో జరుగుతుంది వాళ్లకుండేబుద్ధి వినయమూనీతీ పెళ్లికుంటేకదూ వైనంకుదిరేది వలచి వలపించుకునే వైనం ఉంటేకదూ ఇచ్చిన అధికారాన్ని దుర్వ్యయము చేయకుండా దాచుకొనిమగని మనసెరిగి నడిస్తేకదూ ప్రాణానికి ప్రాణమిస్తుందనే నమ్మకం కలిగిస్తేకదూ అనుమానమునకుఆస్పద మివ్వక ప్రవర్తిస్తేకదూ అవరాభిమానియై గృహానికి గృహస్థునికీ అంగరక్షకి అయితేకదూ భర్తకీర్తి గౌరవముల నిల్పుభారము వహిస్తేకదూ అధికారమిచ్చేదీ ఆదరణిచ్చేది అనురాగముతోచూచేది అంకస్థలమిచ్చేదీ ఊరక వస్తుందా నేరకగమనమునకు వస్తుందా తేలికగా తెలుస్తుందా అయినా ఇదంతా పురుషుని అదృష్టములో ఉన్నదిలేవే అన్నాడు రాము.

అదృష్టవంతులచూచి అదృష్టముకావలె రావలెననేవారేగాని వచ్చేతెరవాలోచించి నడిచేవారులేరు రాబోవుజన్మకయినా కావలె ననేవాంఛగలిగి ప్రవర్తిస్తేకదూ అదిపూజ్యం ధనముతో రూపముతో విద్యతో వినయముతో సేవతో బలముతో ఇరుకుతో యుక్తితో భయముతో ఇరికించుకొని అనుభవిస్తామంటారు దేవుడూ దైవమూలేడని సోమరులై తిరుగుతామంటారు అవతలిజన్మలో అదృష్టాలులేవని

అటమటపడతారు ఉన్నవారినీ అనుభవించేవారినీచూచి గుక్కిళ్లుమ్రింగి కుమిలి పోతారు అన్నది సరోజ.

అవి అటుండనీ అసలుమాట మరచిపోయి అతుకులెన్నో వేసినాము మీయమ్మవస్తే అట్లా మాయమ్మవస్తే మానాన్నకు క్షణంప్రొద్దుపోదు ఎప్పుడూ ఏదోవక అల్లజడిచేస్తూనేఉంటారు ఎన్నిచేసినా ఎన్నిఅన్నా తొణకకుండా నిండు కుండలాగా ఉంటూ జబాబులిస్తూ అడిగినదంతా చేసిపెట్టుతూ ఉంటుంది ఆమెకోప గించుకుంటే కోపము శాంతించువరకూ నవ్వేవరకూ చోటువిడువక శొంఠెపిల్లవాని లాగా ఎన్నోచేస్తూఉంటారు. ఒకరిని విడచి ఒకరు క్షణముండలేరు నీమాట వాస్తవమేనన్నాడు రాము.

ఒకరినిఒకరు అర్థంచేసుకొని భావమెరింగి ప్రేమించితేనే సంసారం లేకుంటే శంకరుని గృహమగుతుంది శంకరులవారు కనుమూసి తపస్సుకు ప్రారంభిస్తే అర్ధకనుమోడ్చి అంబ వారిననుసరిస్తుంది అప్పుడా భూతగణము భజరేబజయని తాళాలుకొట్టుతూ తాండవమాడుతూ తారుమారుచేస్తూ త్రైతక్కలాడుతూ కోతుల గుంపుకొంప చెరచినట్లు కైలాసము కైవశము చేసుకొని కల్లోలముచేస్తారు భర్త కన్నుమూసినా భార్యకన్నుతెరచి చక్కపెట్టుకుంటేనే కాపురమయ్యేదీ వారివలె కనుమూస్తే కడికితక్కువగుతుంది గృహిణికనుమూస్తే గృహం కనుమూస్తుంది కల్లోలముజరుగుతుంది వారు సృష్టికర్తలు ఇరువురూ కనుమూసినా ఇల్లూవాకిలీ ఉంటుంది మనముకనుమూస్తే మసిపాతకూడా ఉండనివ్వరు ఇరువురలోవకరు గృహవిషయంలో జాగ్రత్తగా ఉండియే తీరవలయును అన్నది సరోజ.

ఇట్లే ఆమాటా ఈమాటా మాట్లాడుతూనే వంటచేసి దైవనివేదనచేయ పదార్థ ములు తెచ్చిపెట్టినది సరోజ రాముఇయివేల్పునూ ఇష్టదైవమునూ అర్చనచేసి టెంకాయకొట్టి నివేదనచేసి మంగళహారతియిచ్చి సరోజ ముఖము చూచెను.

సరోజ చిరునవ్వునవ్వుతూ దీక్షను భగవంతునితో చెప్పుకొనుటకు భయ ముగా ఉన్నదా భారముగా ఉన్నదా మనసును ఒకకట్టుదిట్టములోపెట్టి మమకా రమును అదుపులో ఉంచవలె లేకున్న చేసినదేచేయవలె తిన్నదే తినవలె కన్నదే కనవలె ఆడినదే ఆడవలె విన్నదే వినవలె పాడినదే పాడవలెనని మనిషినిమట్టు పెట్టును మమతపెంచును మానవధర్మముల నతిక్రమించును మాన ప్రాణధనముల

పౌరుషజ్ఞానకీర్తుల అడుగంటించి అధర్మములోదింపి మరుజన్మకు మట్టిలోగలిపి అడవిమల్లెల సౌరభమూ అష్టదరిద్రుని యావనమూ వృథాయయినట్లు మానవుని అధోగతికి పంపును మనసును విడువక మమతనుపెంచక మనకన్న తలిదండ్రుల ఎదుటమాటచెప్పి మాటనిలపండి గర్భపోషణా భారమూ గర్భకుహరమునగల అర్భకపోషణాభారమూ తమదేనని చెప్పండి ధర్మబద్ధులమైదీక్షను సాధింప ప్రారంభించుచుంటిమి ధర్మహృదయులై శుభలక్షణలక్షితుని సుగుణగణగణ్యుని సత్పుత్రుని దయచేయుమని అడుగండి ఏలనిర్వీణ్ణులై నిలచితిరి మనసును అరికట్టి మమతనుబిగబట్టలేరా దుష్టప్రవర్తకులలోచేరి దురదృష్టవంతులా అంగహీనులా కురూపులావ్యాధిగ్రస్తులా బుద్ధిహీనులా కంటారారాఅంపుకుచాల్పుదుతారా తమవ్యామోహదేవతకు బిడ్డలబలిఇస్తారా సర్వాంగ సౌష్ఠవఇల్లాలసితీరని వ్యామోహములోబడి ధర్మచ్యుతులై ధర్మపుత్రికా పుత్రకుల సర్వదా దుఃఖింపచేసి దుఃఖపడతారా దీక్షాబద్ధులై కార్యముసాధించి కన్నబిడ్డలు ఉత్సాహవంతులై త్రిదేవుల ముద్దుబిడ్డలై ఇరువాగులా ఇహపరములా వన్నెపుటింప చూచి సంతోషిస్తారా చెప్పండీ అంటూ చెంతకుపోయి నిలచినది సరోజ.

రాము చేతులు జోడించుకొని కన్నులు మూసుకొని కన్నీరు మున్నీరై పొంగి పొర్లి కనుదోయి విడచి చెంపల బడిచెంపలనుండీ జారి ఎదపైబడి కుక్షినాశ్రయింప మాటాడలేక నిలచిన రాము కన్నీటిని పైటతో తుడుచుచూ సరోజ రాము భుజముపైచేయివేసి ముఖము చూచుచూ అయ్యో ఇంతవరకూ ఉన్నధైర్యము ఇప్పుడేల చెడినది ఆడదానినై నేనే మొండిగానిల్చిన గుండెగల మొగవారు మీరే ఇట్లైన ఎట్లు చెప్పండీ పుట్టబోవుబిడ్డలపై ప్రేమలేదా ఉన్నదాన్నినే నెక్కడపోగలను మీకింత దుఃఖమెందుకొచ్చెను చెప్పండని రామునుతనయెదకు అంచుకొని వీపునిమురుతూ లేదు మీమనోవర్తినై మీమాటనుజవదాటక మనసిచ్చి వర్తిస్తానమ్మండీ ప్రేమను ఆపలేనని ముందేల చెప్పరయితిరిఅంటూ పైటతో రాముకన్నీరువత్తి ముఖము ముఖమున హత్తుకొని సరోజ కన్నీరు పెట్టుతూ గద్గదస్వరముతో నాప్రాణమానధనములసర్వమూ మీకు మనసారా అర్పించినానని మనవిచేసుకున్నానే హృదయమే ఇచ్చినానే నమ్మలేదాఅంటూ నిండుగా కౌగలించు కున్నది సరోజ.

రాము కనుమూసి మైమరచి ఎందోపోయి ధర్మవిచక్షణ చేయుచున్న మనసును తటాలున వెనక్కులాగి సరోజనుచూచి కన్నీరువిడుచుచున్న సరోజకన్ని

టిని తనఅంగవస్త్రముతోతుడిచి ఏలకన్నీరుకార్చెదవు వెనికంజవేయు వెజ్జినను కున్నావా భయపడకుమని చుబుకమంటి సరోజ, సుకుమారమై సౌందర్యమై లేతయూ చిగురాకువంటి నీదేహమూ కాంతినీ మృదుమధురమై నీతికోవిదులూ శాస్త్రజ్ఞులూ కామతంత్రజ్ఞులూమెచ్చునౌ సుధలొలుకు పలుకులునూ కని విని హృదయముకరిగి రాబోవు కాలప్రవాహముచూడ మనసునుపంపితిని అందు స్త్రీ పురుషులకుగల కష్ట సుఖ తారతమ్యముచూచి కన్నీరు మున్నీరయినది స్త్రీ కామబాధనువోర్చి గర్భ భారాన్ని నవమాసములుమోసి ఆహార విహార వ్యవహారములలో లౌకికముగా నటించి ప్రసవవేదన సహించి కని అదుగోనాన్నయని చేతికందిచ్చునీవూ నీకష్టమూ నీఓర్పు కన్నులకగపడినది పెరిగిపెద్దై వరకూ పత్యాపానీయములలో ప్రాణమును హింసించి వస్తుండి అస్తుండి పసిపాపని పెద్దచేయు నీకష్టముసుకని కంటనీరుపెట్టి తిని కామబాధనొకదాని సహించలేక కటకటబడు పురుషుని చూచినసిగ్గగును సరోజా స్త్రీకష్టాన్ని తలయెత్తి ఆలోచించిన నలుమోములుగల నలువకూడా ఇట్టిదీ ఇంతటిదనిచెప్పలేడు ప్రాణమునకేముప్పు ఇట్టికష్టముల సహించి పెంచినతల్లికి పట్టెడు అన్నము పెట్టలేని పావులు న్నారుఅని కన్నీరువిడిచినాడు రాము.

సరోజ రాముకన్నీటిని తుడిచి వారే పురిటిలో తలిదండ్రుల పోకార్చుకున్న పుట్టుదరిద్రములు ఇట్టిచోట వారినెందుకు తలంచెదరు. పోనివ్వండి ఇంతలేత హృదయ మయితేయెట్లు అని తనరెండుచేతులా రాముకంఠమునకు చుట్టుకొని ముఖము ముఖ మునచేర్చి తమకేదానందమోచెప్పండి భోంచేతురుకానివ్వండి ఈనాడు గాకున్న రేపు చెప్పండి అన్నది సరోజ.

రాము చిరునవ్వు ముఖమున వెలుగు దివ్వెవలెవెలుగగా సరోజనుచూచి చేతులతో పెంపలనిమురుతూ ముఖమునకుజారిన వెండ్రుకల సవరించుచూ కళవళ పడితి ననుకొంటివా కామదేవతకు బలిద్దై కాదని కదలెవ ననుకొంటివా నీవు నాధర్మదేవతవు దారవుకాదు తప్పుడుదారుల పోవుచుండ తగదని మందలించినిల్పి కామితార్థములీడేర్చు కల్పలతవు కానీ నన్నుదీక్షాబద్ధునిచేసి దివ్యపురుషునిగని దివ్య యశోన్నతి దివికి భువికి వ్యాపింప దినమణివలె ప్రకాశించు ప్రకాశింపచేయు అన్నాడు రాము.

ఔను మీరేతస్సుతో మీతేజస్సునేకని మీతల్లి చేతుల్లోపెట్టి మీకొడుకువలె నున్నాడోలేదో చూడమంటాను రూపులో చూపులో పలుకులో ఘనతలో ఆటలో

పాటలో చూడమని గర్వపడతాను రుణము తీర్చుకుంటాను వంశవృక్షానికి ప్రశంస నీయుని శ్రీవారి అంశనీయునీ ఇస్తాను చెప్పండీ అన్నది ఆనందముతో సరోజ.

చేతులు జోడించుకొని రాము ప్రభూలోకరక్షకా హిందూమత సంప్రదాయ సిద్ధముగా న్యాయముగా ఈనాడు దీక్షను ప్రారంభించు చున్నాము దీక్షనూ మమ్మూ కాపాడ మీదేవంతు మీదయలేక దేవదానవ మానవాదులలో ఎవరూ కాము వ్యామోహజలధిని దాటలేరు ఏకార్యమూ సాధించలేరు తమదయగలిగిన సాధించ గలరు సాధించు శక్తినీ బుద్ధినీ మాకుప్రసాదించి కొనసాగించు తండ్రీ దీక్షలోచేయు సత్కర్మాచరణ ఫలములో తమబలముగలిపి మెదిపి ప్రజారంజికముగా దైవయోగ్య ముగా పిండోత్పత్తి జ్ఞానోత్పత్తియొనర్చి మమ్మనుగ్రహించు ప్రభూ ప్రతిజీవి పుట్టుట నిజము తానుగిట్టినా తనకీర్తిగిట్టక పట్టుగానిల్వగలజీవి జీవి ప్రతిజీవి జీవిగాదు అట్టి గట్టిజీవుల జట్టులో పుట్టునట్లు చూపెట్టు మమ్ము చేపట్టుమని సాగిలి నమస్కరించి నాడు రాము.

సరోజ చేతులుజోడించి తలవంచి నమస్కరించి జగత్కర్తలారా జగజ్జననీ జనకులారా వారిదీక్షకు ఏలాటి అపకృతీ గలిగింపక పాటించిమీసేవా వారిసేవా చేయుచూ మనస్సును అరికట్టి నాల్కనుబిగబట్టి వాంఛలవెగబెట్టి కామదేవతను మెడబట్టినెట్టి ఆహార విహార వ్యవహారములలో గీటుదాటక శిరసావహింతును నవ మాసములూచేసిన సత్ఫలమూ తమసేవాబలము వారిఆశీర్వచనబలమూ పిండమునకు తోడై తండ్రి కొడుకులగమనింప వీలులేని ప్రతిబింబము గలుగునట్లు తనుధన విద్యాసంపత్తులలో త్రిదేవుల పుత్రుడని ప్రజపొగడునట్లు జ్యేష్ఠుడు పుత్రుడేయై తండ్రి కుటుంబమునకు సహోపాధ్యాయుడగునట్లు తలిదండ్రులపేరు నిల్పునట్లు స్థిరస్థాయిగా కీర్తినిల్పునట్లు ప్రసాదించు తండ్రీ యని మోకరించి నమస్కరించిలేచి చెంపలు వేసుకొను సరోజను రాముచూచి నీకునీవుచెంపలు వేసుకొంటూ అపరాధములు క్షమించు తండ్రీయని బ్రతిమాలుతావు అట్లకాదు నేనుచెంపలువేస్తూ ఉంటానీవు బ్రతిమాలుతూఉండు అని రాము సరోజ ముక్కుపట్టుకొని ఒకటి రెండూ అని చెంపలు వేయుచూ ఊఁబ్రతిమాలు అన్నాడు.

సరోజ నవ్వుపూస్వామీ తమయెడ తప్పులు ఎన్నడూ చేయలేదు ఇక్కెన్నడూ చేయను చెంపలు కందునట్లు కొట్టకుడు తమరు కరుణామయులే ఇంత కాఠిన్యమెట్లు గలిగె చెప్పండీ ముక్కువిడువండీ తీర్థప్రసాదములివ్వండీ భార్యా వ్యామోహము ఈనాటితోవిడువండీ అని విడిపించుకొని అగ్గినితగిలి భగ్గుమన్నదని ఎందుకంటారూ

అగ్గి భగ్గుమంటుంది ఇకెన్నడూ తగులకండి అని భర్తకునమస్కరించి చేయిసాచినది.

రాము తీర్థమూ ప్రసాదమూ ఇవ్వగా సరోజ తీసుకొని నడిమికిపైటచుట్టి పదార్థములు ఎత్తుకపోయి రామును భోంచేయబెట్టి తానూ భోంచేసివచ్చి పడసాల్లో కూర్చొని రాముకు ఆకు మడిచిస్తూ తానూ వేసుకుంటూఉండ రాము చిరునవ్వు నవ్వుతూ గర్భము గట్టిగా చూచుకొని జాబు వ్రాస్తామన్నందుకు నాకు నామిత్రుని కథ జ్ఞాపకమునకు వస్తూఉన్నది చెప్పమంటావా అన్నాడు.

మంచి కథఅయితేవింటా లేకుంటే పండుకుంటా నన్నది సరోజ.

మంచిదంటే ఎట్లుంటుందన్నాడు రాము.

ధర్మ వ్యతిరిక్తముగానిది స్త్రీ వినతగినది అంటూ రాముకూర్చున్న కుర్చీ దగ్గరకుజరిగి రాము కాళ్లకుఆనుకొని నిద్రవస్తే ఇక్కడే తమమోకాళ్లపై వరుగుతానూ తమరుమాత్రము కథచాలించకండీ అన్నది సరోజ నవ్వుతూ.

అదుగో అగ్గి భగ్గుమంటుంది తగలకండీ అని తిరిగినీవే తగులుతున్నావు మణి శిలా గంధకమూకలిపి మంటలేచి భద్రమంటున్నావు అన్నాడు రాము.

అయ్యో మరచినానండీ నేనుమరచినప్పుడు మీరూ మీరు మరచినప్పుడు నేనూ హెచ్చరించుకుంటూ ఉంటేనే కార్యసాధన అయ్యేది లేకున్న మాయచాయలో మరుగౌతాము మతిచెడి మాటను మరుస్తాము అంటూ దూరముగా కూర్చొని ఊకొనివ్వండీ అన్నది సరోజ.

నాకొక మిత్రుడున్నాడు వానికి బంధువర్గము కావలసినంతా ఉన్నది ఒక రకముగా ఆస్తిగలవాడు ఆదాయమూ గలవాడు వానికిపిల్లలులేదు భార్యకు అయిదారు మంది అక్కచెల్లెండ్రుగలరు అన్నతమ్ములూ ఉన్నారు. వారందరూ గర్భమయి నప్పుడంతా సారెలు, చీరెలు, గారెలు, బూరెలు, పండ్లు పసపు కుంకుమ రానూ పోనూ చార్జీలు ఖర్చులూ పెట్టుకొంటూ వచ్చినారు. తనభార్యమాత్రము గర్భము లేదు జమఎవ్వరూ ఇవ్వనూరాలేదు వాడుఒకనాడు భార్యను కూర్చుండబెట్టుకొని అందరిగర్భాలకొరకై అమితంగా ఖర్చయింది అదిరాబట్టుకొనుటకు నీవుగర్భమే కాలేదు మనకు జమవచ్చేదెట్లా అన్నాడు లేనందుకు నేనేమి చేసేదండీ మన అదృష్టము ఇట్లున్నదన్నది భార్య.

అదృష్టముమాటా గర్భముమాటా అటుండనీ మనకు జమఏతెరవున రావలె నన్నాడు.

ఎట్లవస్తుంది గర్భమయితే వస్తుంది లేకుంటే పుణ్యముతప్పదు అన్నది భార్య.

పుణ్యముమాట అటుండనీ నేనోకటి చెప్పుతావిను గర్భమయినట్లు కాస్తనీవట్లు నటించు వీధిలోనలుగురకూ కొంచెం చెవునవేయి వీధంతా తెలిసిపోతుంది బంధువులకందరికీ నాభార్యగర్భవతియని జాబులు వ్రాస్తాను జమఅంతా వచ్చినతదుపరి గర్భభిన్నం భిన్నమని జాబులు వ్రాస్తాము రెండురూపాయలతో మనకు రావలసిన జమ అంతావస్తుందని భార్యవద్దన్నా వప్పించి జాబులు వ్రాసినాడు బంధువులందరూ అత్తగారితోసహా పసపు కుంకుమా పదిఫలాహారాలతో తెచ్చినారు. ఖర్చుకన్నా జను ఎక్కువగా వచ్చినది వచ్చినవారు ఏమే గర్భచిహ్నలేమీ గానరాలేదేఅంటే అమాటకు భార్యఏమీచెప్పక పోయినా వాడే ఎప్పుడూ కానివారయితే అది అంతేలేఅని సమాధానమందరికీ ఇచ్చేవాడట అందరూపోయిన తదుపరి భార్యనుచూచి ఏమే ఖర్చుకన్నా జమఎక్కువయింది ఇకవ్రాస్తాను గర్భభిన్నం గర్భభిన్నం అని అన్నాడట.

భార్యనవ్వుతూ ఇంకాఎవరన్నా బాకీఉన్నారేమో చూడండీ మళ్లీమళ్లీవ్రాస్తే నమ్మకం చెడుతుంది అన్నది.

తెచ్చిన పదార్థాలు తినివాడు పదినాళ్లలో పచ్చబడినాడు ప్రక్కఇంటి ముసలామె వాణ్ణిచూచి నాయనా గర్భవతి ఎట్లన్నాఆయె నీవుపచ్చబడినావురా అబ్బాయీ అన్నదట దానిలో ఇదేసందని వాడు.

ఏపాడుముండ తిట్టుకుంటూ తెచ్చిందోగాని అవ్వా అంతాభిన్నం భిన్నం అంటూ తలతిప్పినాడట.

అవ్వనవ్వుతూ జమన్నా అంతావచ్చినదా ఇంకాకొమవున్నారా అన్నదట.

అంతా కనుక్కున్నట్లు ఉందే అని నవ్వినాడట.

అదివీధంతా తెలిసి ఇంటింటా చెప్పుకొని నవ్వినారట.

అట్లమనమూ అవుతామని సందేహించినావు నిజమే గట్టితెలుసుకునే వ్రాస్తాములే అన్నాడు రాము.

సరోజ నవ్వుతూ ఆస్నేహితునిలాగే తయారవుదామనుకున్నారా. ఆయనెవరో వ్యాపారిలాగా ఉన్నాడు ఇచ్చునదీ తేచ్చునదీ జమాఖర్చులు వ్రాసివ్రాసి అభ్యాసమయినవాడు అమ్మకిచ్చినది అలికిచ్చినదికూడా వ్రాసేవాడు కనుకనేరాబట్టుకున్నాడు అట్టి ఆదాయము మూటగట్టి అన్యాయపరులకూ అతియుక్తిపరులకూ మూఁడుచోట్ల అయ్యేటట్లు దైవముచేస్తాడు విడువడు అన్నది సరోజ.

ఇట్లు మాట్లాడుకుంటూ ఉండగనే గోడగడియారం టంగుమని గంటమూడు కొట్టినది అప్పుడే మూడుగంట అయినదే అన్నది సరోజ.

మాటల్లో సంతోషంలో పొద్దుకానరాదు అన్నాడు రాము.

కాఫీ వేస్తానంటూ సరోజ లేచినది.

వద్దువద్దు పడుకో నేనువేస్తానని లేచినాడు రాము.

అదెందుకన్నది సరోజ.

చూస్తూ చూస్తూ నిండు చూలాలిని కష్టపెట్ట రాదన్నారు నేనున్నాగా అన్నాడు రాము.

ఇప్పుడు నవమాసములూనిండిన నిండు చూలాలిననుకున్నారా లేకపదునెని మిది మాసములనుకున్నారా అనినవ్వినది సరోజ.

అ నవ్వుతావు గర్భమూ అన్నదాదిగా గర్భవతిని కష్టపెట్టరాదు కన్నీరు పెట్టించరాదు కోరినవితెచ్చి పెట్టవలె కోపగింపరాదు ఆనందంగా ఉండేటట్లు ఏర్పాట్లు చేయవలె కొండమీది కోతినికోరినా కొనితెచ్చిపెట్టవలె భర్తస్నేహితునివలె చూస్తూ కోరకున్నా కోరమని కొసరికొసరి కోర్కెలు తీర్చవలె మంచిఆహార మియ్యవలె నన్నారు పెద్దలు నాకూతెలుసులేవే గర్భాలసంగతి ఇదికొత్తగాదూ అన్నాడు హేళనగా రాము.

అయితే ఒకపిల్లతండ్రిగానో ఇద్దరు పిల్లల తండ్రిగానో నాటకమాడినారన్న మాట అని నవ్వినది సరోజ.

పొరపాటు పొరపాటు విన్నాను అనేపదం మాటలసందడిలో మరచినాను అప్పుడే అందుకున్నావు ఇంటగెల్చితేగాని రచ్చగెలువలేరన్నారు నిన్నుగెల్చితే అందరినీ గెల్చినట్లే అయినా కాఫీవేస్తానంటూ పోబోయినాడు రాము.

సరోజ చేయిబట్టి ఆపి ఇప్పుడే ఇట్లుంటే అప్పుడెట్లుంటుందో ఎత్తుకపోయి అన్నమిని పిస్తారా అన్నది నవ్వుతూ సరోజ.

ఓ అదినిజమే పాపభీతిలేని పరమమూర్ఖుడయితే నిండుచూలాలిపై జాలి లేకుండ ఉండగలడు సతిగతి గమనింపడు మృతికయినా చింతింపడు వానికి మరు జన్మకు మూలపెద్దమ్మ దాపురించి మన్నుతాల్చి కొట్టుతుంది నాది అదారికాదు మళ్లీ జన్మఉంది పాపపుణ్యములు వెన్నంటగలవు అప్పుడుపడే అవస్థఇప్పుడు పడదాము పరవంచనా పరనిందా పరధనం పరదారా పరిహాసం పాపం, పరోపకారం మహా

పుణ్యం అనిఎంచి వరులకు ఉపకరించేవాడను అలి కష్టాలకు అదుకొనలేనా అన్నాడు రాము.

ఆదుకొనే కాలండుంది అప్పుడుగా తమఓర్పూ ఓదార్పుతెలిసేది మాటలతో ఓదారుస్తారో పనిపాటలతో ఓదారుస్తారో చూస్తాముగా అని కాఫీచేయ బోయినది సరోజ.

రాము వెన్నంటిపోయి కాఫీపొడీ చక్కెర అందిచ్చినాడు సరోజ నవ్వుతూ తమకు మాట్లాడడానికీ ఆట్లాడడానికీ మరెవ్వరూలేరూ ఏమిచేస్తారు పాపం నాతో పొద్దుపుచ్చుతూ ఉన్నారు శీఘ్రంగా అవతరిస్తారులేండీ పనిలేనప్పుడు ఆట్లాడనూ మాట్లాడను అన్నది సరోజ.

ఔను అలితోఆట్లాడక మాట్లాడక పోట్లాడక ఏట్లాడక తిట్లాడక అక్క డెవ్వరితో ఆట్లాడమంటావు ఎవరితోనన్నా ఆట్లాడితే వెన్నెముకకు వస్తుంది సన్న జ్వరం అన్నాడు రాము.

బాగా మాట్లాడతా ఆట్లాడతా ఉంటిరి మాట్లాడకుండా ఆట్లాడకుండా శీఘ్రము గానే సిద్ధముచేసినాడు దేవుడు అందులో పిల్లోడు పిల్లోడు అని అల్లాడుతుంటిరి అన్నట్లే అడిగినట్లే మూతిబిగించినాడులే అని వాల్గంటి తళుక్కులో చిరునవ్వు తల విసురూ మిళితముచేసి రాముపై పంపినది సరోజ.

రాము అబ్బా అన్నాడు

ఏమన్నది సరోజ.

ఏమున్నదీ దేహమంతా జల్లరించినది ప్రాణం పైలోకానికిపోయినది ఆకంటి తళుక్కుతోనే వరమమునీంద్రులు హరిహరాదులు హతమయినది ఆతళుకును జయింప లేకనే హరిహరాదులు అంకస్థలమున అతివలకు చోటిచ్చినది. ఆడవారిముఖమున వెల్వడు మోహజ్వాలలకు క్రాగి పరితపింపనివారు పరితపించి తేరుకొనలేక పరమ వదించినవారు పరమునగాని ఇహముగాని ఉండుటకల్ల ఇంకొకతూరి వంపితివా దీక్ష డుబ్గయా ఆడవారి ముఖమండలములో అమృతబిందువులూ హాలాహల బిందువులూ మిశ్రమమై సమయానుకూలముగా వెల్వడుచుండు నన్నారు ఈరెంటిలో దేనివంపినా భరింపలేను సహింపలేను గురువునూ తండ్రినీ అగ్రజునీ సోదరునీ చూచెడిచూపులతోగాని అన్యపురుషుల చూచెడి చూపులతోగాని చూస్తేగాని మనదు దీక్ష రామరామా ఈచూపుచూస్తే ఈశ్వరుడైనా ఓర్చలేడు బుద్ధిని మార్చలేడు అన్నాడు రాము.

సరోజ నోటికి పైటచెరగు అడ్డముపెట్టుకొని నవ్వుతూ ఆమావులో అంత చురుకు దనమున్నదిగా అంతగా మైచలిస్తుందిగా ఇది ఆడవారికి నైజముగా దైవము పెట్టినాడు కావలసిరావు మరేమి చేయమంటారు అయినా ఇప్పుడుమీరు చెప్పితిరే ఆమూపెట్లో కొంచెంచెప్పండి విందాము నేర్చుకుందాము అన్నది నవ్వుతూ సరోజ.

గౌరవనీయుల దగ్గర ప్రశాంతవదనముతో సుస్వభావముతో నిండు కుండ లాగా తొణకక కన్నులకు కొంతబుద్ధిచెప్పి కాంతిని ప్రజ్వలింప చేయక పండ్లను పెదవులుదాటనివ్వక వక్షస్థలమిచ్చి ఎదురుగా నిలువక దేహమున వస్త్రము జాగ్రత్తలో ఉంచుకొని మాట్లాడవలయును అన్యపురుషునికడ అణుకువతో దీనవద నముతో తలకొంచెమువంచి ఎదురుగా నిల్చుకొనకగాని ప్రక్కకు నిల్చిగానీ పొర పాటులేకుండా మాటకుమాట తగినంత మాట్లాడి పంపవలయును లేక పెద్దవారున్న వారికివప్ప చెప్పవలయును అట్లగౌరవనీయుల చూచినట్లుగానీ పరపురుషుని చూచి నట్లుగానీ చూస్తేనేదీక్ష కట్టుకున్నవాణ్ణి చూచేకలికి చూపులుచూస్తే కదంత్రొక్కు తాడు కాముడు సగంచస్తాడు రాముడు అన్నాడు రాము.

ఆడవారి లక్షణాలన్నీ ఆమూలాగ్రంగా నేర్చుకున్నట్లుందే ఇన్నినేర్చినవారిని ఈమూపులేమి చేస్తాయిలేండీ అన్నది సరోజ.

అన్నీనేర్చినవారినే హతంచేసేది నేర్పులేని వారేకొంతనయం అందులోగల ఆనందం అనుభవింపగలశక్తి ఎవరియందు ఉన్నదో వారికేముప్పు అయస్కాంతము ఇనుమును పట్టుకున్నట్లు రాగెను పట్టుకొనలేదు బంగారు రజాన్నిరసంతప్ప మరేదీ పట్టలేదు ఆమూపులోగలశక్తి అతీతమయినది అన్నాడు రాము.

పాపం కేళీవిలాసముగా కాలము గడపవలసిన నవయౌవనుల గీటులోనిల్పి నాడా బ్రహ్మపాపం అని నవ్వుతూ కాఫీపుచ్చుకోండీ ఉపశమన మవుతుంది అని కాఫీఇచ్చినది సరోజ రాము త్రాగుతూ ఇదీవకందుకుమేలే ఈమిషతోనయినా భగవద్ధ్యానము దొరకడం బ్రహ్మచర్యముతో దేహారోగ్యము పొందడం ఆయుర్దాయ మును హెచ్చించు కొనడం జరుగుతుంది ఆరోగ్యమూ ఒకభాగ్యమేగా అన్నాడు రాము.

అదిఎవరు పాటిస్తారు అధ్వాన్నానికిదిగి యెంత అధమవృత్తి అవలంబిస్తే అంతమహావీరుడు యౌవనుడూ అనుకుంటారు 'మూఢోమూర్ఖో గార్దభశ్చైకరాశిః అన్ననీతివాక్యమును పాటించు వారెవ్వరూ అన్నది సరోజ.

వారితో మనకు పనేమి నీవనుకొనవుగా అన్నాడు రాము నవ్వుతూ ఛలోక్తిగా.

నేనూ పడతినీ పసిదాన్ని నాకూకోర్కెలున్నాయి పాషాణాన్నిగాను అయితే అధర్మానికివెరచి ధర్మానికి కట్టుబడి కన్నవారు కులోద్ధారకులు కావలెనని ఆశపడి వడిలోవాలక కౌగిలిలో కనుమూయక వైతొలగినాను గర్భసమయాల్లో భార్యకు భర్తపయినా భర్తకు భార్యపయినా మక్కువ ఎక్కువన్నారు పాపభీతిలేకున్న ప్రక్క విడువరన్నారు పురుషుడు అంటే అందరూ పురుషులుగాదు చెప్పుతావిను దేహము అన్నందుకు సర్వాంగ సౌష్ఠవము వాటెకు తగ్గట్టు రూపము రూపానికి తగ్గట్టు యౌవనము యౌవ్వనానికి తగ్గట్టు రసికత వాక్చతురత ఇవి ఏకసంపద విద్యా విద్యకుతగ్గ వినయమూ విధేయత సమయస్ఫూర్తిజ్ఞానము విద్యావిహీనులచూచి గర్వింపక సోదరులవలెచూచి తెలియచెప్పడమూ ఇవి మరొక సంపద ధనమూ ధనమున్నందుకు సద్వినియోగములో త్యాగము దుర్వినియోగములో లోభమూ దరిద్రులా అంగహీనులా వృద్ధులా కనికరించి చేచాచడమూ పట్టాలుతప్పకుండా పాప పుణ్య విచక్షణతో బండిని నడపడమూ ఉండ వలెనన్నారు ఈత్రివిధ సంపదలూ నాపూర్వజన్మ సుకృతాను సారముగా తమయందు అన్నీ మూర్తీభవించి ఘనీభవించి నవి కన్యాదానానంతరంనేను యోచించినాను సర్వలక్షణ లక్షితుడూ గుణగణ గరిష్ఠుడు గానున్నారే వీరియందు ఏలోపముండును మానవులు లోపములేక ఈకర్మ భూమికిరారన్నారే మరిఏలోపమూలేదే కనుపింపదే ఏముండునూ అని ఆలో చించుతూవచ్చి యౌవన లోపముండునా ఆయుర్దాయలోపముండునా అనుకొని అయినా నాయదృష్టము ఎట్లున్న అటుకాగలదని ఉంటిని కన్యాదానానంతరం అయ్యేదానంలో సేరుకు సవాసేరయినారు నాచేసిన పూర్వపుణ్యానికిమెచ్చి మన సిచ్చి నాసంతృప్తినీ ఆనందాన్ని గాఢాలింగన చుంబనలతో వెలిబుచ్చినాను ఆనందంలో ప్రాణంకూడా దానంచేసేసినాను దేహసౌష్ఠవభాగ్యం మనోభాగ్యం రెండుమీసొత్తే ముందుచేసిన పుణ్యానికితోడు మరింతఇప్పుడు పుణ్యముచేసి మరు జన్మకుకూడా త్రివిధసౌఖ్యములపొంద ఆశించుచున్నానన్నది సరోజ.

కన్యాదానానంతరం ఏమీ దానంచేయలేదే అది ఏమిదానం అన్నాడు రాము.

అది ఏమిదానమో తలయెత్తినిదానంగా యోచించండి మనోఆకాశంలో గాలి పటంలాగా కానవస్తుంది కానరావడములో మన్మథావస్థలు పడకండి ప్రస్తుతంనాటి

ఆనందంపడు ముసలితనంలోకూడా మరువవోరటు అలుమగలు పాపం మరచి పోండీ అన్నది సరోజ.

ఆదానం ఏమిటో నీనోటవకతూరి అంటేనేను ఏంటేబాగుండుననుకున్నాను దానంచెప్పలేదే అన్నాడు రాము.

సరోజ నవ్వుతూ వయ్యారముగా చూస్తూ అంటే ఏంటే యెందుకంటే చూస్తారుగా దానఫలం దానం తీసుకున్న దుష్యంతులవారిమాదిరి మరచితిరేమో దుష్యంతుడు నేనెరుగనంటే నీవునాకు తెలియదంటే నాకలోకాన్నుంచి వాళ్లతల్లి దిగివచ్చి శకుంతలా భయపడకుమని నిండుసభలో సాక్ష్యమిచ్చినది లోకంమెచ్చి నది మాయమ్మ సాక్ష్యమిచ్చేటందుకు స్వర్గలోకములో లేదండీ భూలోకములోనే ఉంది సాక్షమిచ్చినా బలంఉండదండీ దుష్యంతులుగాక బుద్ధిమంతులుకండీ భద్రం అన్నది సరోజ.

దుష్యంతుడు గాంధర్వం చేసుకొని తననిజాయితీ నిలుపుకొనుటకై ఆమెశక్తిని తనశక్తిని తెలుపుటకూ ఆమెతలిదండ్రులు ఎవరయినదీ తెలుపుటకునున్నిన వన్నాగ మది అదిఆటుండనీ నేను గాంధర్వముకాదే చేసుకొన్నది పరిణయమేఅని నవ్వుతూ మీద చేయివేయబోయినాడు రాము.

ఆ ఆగండీ ధర్మదేవత ఉన్నది మధ్యలో అంటూ జారుకున్నది సరోజ.

ఔను మరచినాను అని రాము సరోజా ఈనాటినుండీ కాఫీ మానుకొని చిక్కగా చక్కగా కాచినపాలు వాడుకొనడం ఉత్తమం కాఫీ పైత్యాన్ని పెంచును పైత్యము ఆహారము కొరతచేసి దేహాన్నినశింపు చేయును గర్భవతికి పైత్యసంబంధ వస్తువులు కూడువన్నారు గర్భదారణాలు జరుగకుండా పిండమునకు రక్తలోపమూ గాకుండా గర్భవతికి ఆహారలోపంలేకుండా మూడువేళలా ఆవుపాలు జీర్ణమునెరింగి తగుమోతాదు ఇవ్వడం మంచిది మూడువేళలకూ కలిసి ఒకపడి తెమ్మనేదా అన్నాడు రాము.

అవును కావలసినదే గర్భం ఎట్లపెరిగింపోఅట్ల అంతోఇంతో దేహంపెరుగ వలసిందేగా అదీగాక ఆడవారికడుపు పెరిగేకొద్దీ మగవారికడుపూ పెరుగవల సిందేగా ఆడవారికి పావూ మగవారికి ముప్పావూ ఊ కానివ్వండీ గొంతెమ్మ కోరికలు గర్భవతివీ గొంతువరకూమేసేది ఇంటి అందరివీ గర్భవతీనెపంతో నిర్భ యంగాపెరగండీ అన్నది నవ్వుతూ సరోజ.

ఇట్లు ఆనందంగా రెండుమాసములు కాలముగడిపినారు ఆనాడు మూడవ మాసం ప్రారంభదినం గురువారమయినది భోంచేసి రాము స్కూలుకు పోయినాడు సరోజ భోంచేసివచ్చి తాంబూలం వేసుకుంటూ ముందురాబోవు కార్యక్రమముల ఆలోచించి గర్భమునుగురించి యోచించుతూ స్త్రీలకు గర్భమూ వకగండమే అందుకే పురుషులుదీక్షతో ఇలువేల్పునూ ఇష్టదైవాన్ని నిత్యమూ అర్చించేది స్త్రీ అహర్నిశమూ త్రిదేవుల హృదయమునమరువక వుంచి ధ్యానించేదీ పూజించేదీ జీవికి భగవంతునిదయ చేయూతలేకున్న నీటినుండీ బయటపడిన చేప లాగగును ఈవిషయము బాల్యమాదిగ బోధించి బాగుపరచుటకు ముందుజన్మ సుకృతముతో తలిదండ్రులూ గురువు మిత్రులూతోడబ్బినవారే ధన్యులు నాకు తలిదండ్రులూతో సంస్కారము ఆచార్యులవల్ల వినికిడీలేకున్న నేనేమయి ఉందునో ఇదినాసుకృతము సుకృతమున్నవారికి బాల్యమాదిగా చక్కనిమార్గము చూపువారు తోడగుదురు సుఖపడుటకు గౌరవప్రతిష్ఠలు పొందుటకు మంచివారు జతగుదురు మనము చేసుకొన్న మంచిచెడ్డలేమనకు తోడగును అంటూ తలవాకిలి వారచేసివచ్చి తల వాల్చినది సరోజ.

మెలకువలేకుండా అయిదుగంటలవరకూ నిద్రపోయినది ఇంతలో రామువచ్చి తిన్నగా వాకిలితీసి చూచి సరే నిద్రపోనీఅని వంటరూముకుపోయి అలజడీ అరుపూ లేకుండా కాఫీచేసి త్రాగి కాఫీ తీసుకొనివచ్చి ప్రక్కలోకూర్చొని తట్టి సరోజా ఏమి నీరసముగా ఉన్నదా లే కాఫీ త్రాగుదువు అన్నాడు రాము.

సరోజ తటాపటాలేచి అయ్యో ఎంతసేపాయె మీరువచ్చి మైమరచినట్లు అట్లే నిద్రపట్టిందండీ వాకిలివారగించి నిద్రపోనులే అని పడుకున్నానన్నది సరోజ.

నీరసముగా ఉన్నదా అన్నాడు రాము.

లేదన్నది సరోజ.

ఇదిగో కాఫీ త్రాగమని అందిచ్చినాడు రాము.

కాఫీవేసినారా అయ్యో లేపకుండా ఇదేమిపని నన్నుదోలోకానికి త్రోసేటట్లు న్నారే భార్యను పరుండబెట్టి మీరు కాఫి వేయడము నేనుత్రాగడమునా ఇకెన్నటికీ నిద్రపోకుండా వాకిలివారగించి పండుకోకుండా శిక్షవిధిచినారా అన్నది సరోజ.

రాము నవ్వుతూ లేదు ఏనాడూ ఇంతవరకూ నిద్రపోనిది ఈనాడు ఎంత నీరసముగాలేకున్న ఇట్లుపండుకొని ఉంటుందని అలికిడిలేకుండా కాఫీవేసి లేపినాను త్రాగమన్నాను అన్నాడు రాము.

సరోజ సంతోషములో దీనత్వం మిశ్రమముచేసి చూస్తూ జాలిగా ఇట్లి ఇకెన్నటికీ చేయననిచెప్పితే త్రాగుతా లేకుంటే త్రాగను మీరేత్రాగండీ పొర పాటుతో నిద్రపోయినందుకు ఇంత పనిచేసినారు అన్నది.

లేదు నన్ను ఒకనాడుకూడా ఏకార్యమూ ముట్టుకోని నివ్వకుండా చేస్తూ ఉన్నది ఒక్కనాడయినా కాఫీ అయినా చేసిఇవ్వవలెనని అనుకొంటూఉండినాను ఈనాడు సందు దొరికింది కాఫీచేసి తెచ్చిలేపినానుగాని అన్యథా తలపలేదు ఇకచేయను త్రాగమని చేతికిచ్చినాడు రాము.

నన్ను నేరగ్రస్తనుచేసి చిత్రగుప్తుని చిట్టాలో ఎక్కించి గడ్డనుండామన కున్నారా నేనుచేసిన పాపము తమకూ సగమున్నది తమరుచేసిన పుణ్యము సగము నాకున్నది భార్యాభర్తల పాపపుణ్యములలో భాగాలు ఇట్లున్నవన్నారు పెద్దలు నేనుతెలిసి చేసిన పాపముగాదు మీరేనన్ను మోసం చేసినారు ఇందులోగలుగు పాప పుణ్యములు తమవేనని త్రాగినది సరోజ.

లేదు భర్తకు సేవచేసి భార్యపుణ్యము సంపాదించు కొనుచున్నదికదా అట్లే పాపం నిండుమూలాలు ఇల్లాలు కాఫీ వేసిఇచ్చి పుణ్యం ఆర్జించుకుందా మనుకున్నాను వాకిలివారగించి ఇకెన్నడూ నిద్రపోకుండా ఉండేటందుకు ఇప్పుడుశిక్ష రెండుముక్కు చెంపలు వేస్తానంటూ చేచాచినాడు రాము.

ఆ అగ్నితెలుసా అయ్యగారికి వళ్లంతాభగ్గుమంటుంది అని తలప్రక్కకు త్రిప్పు కొన్నది నవ్వుతూ సరోజ

ఆ అ అలవాటులో పొరపాటు అన్నాడు రాము.

సరోజ చిరునగువంకురింప రామును చూచి ఇంక మీయత్తగారికీ మాయత్త గారికీ జాబులు వ్రాయండీ మూడవమాసములో కొన్నిసాంగెములూ అయిదవ మాసములో కొన్నిచేస్తారు తెలుపకపోయిన పండనాక్షుల మర్యాదము పెద్దవారు న్నారని మీమనసుకు తోచిఉండేకదా అయినా ఇప్పటిమనుష్యులకు పెద్దవారికంట బతరులేయని ఎత్తిపొడుస్తారు ఈనాడె జాబులు వ్రాయండి మంచిరోజుగా నున్నదీ అన్నది సరోజ.

ఇప్పటికి రెండుమాసముల గడ్డమూ మీసములు పెరిగినవి తొమ్మిది మాసములు అయ్యేటప్పటికి హజరత్ అంటారు ఈగడ్డములో ఏముందో పెద్దలు పెంచమన్నారు దీనివిషయము నీవేమన్నా విన్నావా అన్నాడు రాము.

ఔను మా ఆచార్యులు చెప్పగా విన్నాను దీక్ష అనగా మనోవాక్కాయ కర్మల కేంద్రీకరింపచేసి ఈపని తప్పక చేస్తానూ తప్పక సాగిస్తాను అని ప్రతినచేసి నెరవేర్చడం ప్రతిజ్ఞాసూచన దీక్ష తప్పినా చేయలేక మధ్యలో విడచినా ఇదిగో తప్పు అని ఇతరులుచూపినా పురుష లక్షణమునకు మూలమై పౌరుషమునకు నెలవై రోషమునకు స్థానమయిన ఈగడ్డమూ మీసములూకొరిగి మీపాదములముందు పెట్టుతానని ప్రతిన మరీ స్వామీ మైథున నిద్రాహారములలో చాలుతప్పక సాత్వికుడనై మితవాదినై అలంకారము విడచి గర్వమునకు చోటివ్వక నా నియమితకాలము నిన్నే స్మరించుచూ పరిశుద్ధుడనై సాధింతునని దీక్షాబద్ధుడగుట కామక్రోధ మోహ లోభ మద మత్సరముల అధోగతికి త్రిప్పక ఊర్ధ్వగతిచేసి అసత్యములనాడక హరి ధ్యానముచేయుచూ అలంకారమునకు ఆటపట్టయిన ముఖము విహీనముచేసి అతి ఆశలువిడచి దీక్షను సాధిస్తారు. ఇన్ని అన్ని అననేల తప్పుచేస్తే నీకిదిలగదని గొరిగించండీ అని దీనిభావము తమరుకూడా మధ్యలో పౌరుషహీనులై నీతికి దూరులై తప్పుచేస్తిరా గడ్డము గొరిగించి దేవుని ఎదుటబెట్టి చెంపలు వేసుకొని ఓడిపోతినని పోయి గోడక్రింద కూర్చొని పుల్లలతో నేలరాయవలసినదే నేను నవ్వవలసినదే విన్నారా అన్నది సరోజ.

ఓహో గడ్డమంటే దొడ్డదే ప్రతివారూ అంతేనా అన్నాడు రాము.

గడ్డమూ గోళ్లూ పెంచుకొని కాషాయవస్త్రముల ధరించి బంగిత్రాగి మోసమునకు దగాలకూ వ్యామోహాలకు లోలత్వములకులొంగి కారణమాత్రము కాషాయాంబరులై కడికై మడికై కటకటబడే కటిక రక్కసులున్నారు. వారిమాటేల మనకు అన్నది సరోజ.

కడివుంటే మడీ మడివుంటే కడీ కావలయును. కడీ మడీ కాటకమయితే కారడవే జీవితము అన్నాడు రాము.

మీకవిత్వము విడచి జాబులువ్రాయండి అనిలేచి వంటగదికి పోయినది సరోజ.

రాము జాబువ్రాయ కాగితము తీసుకొని పైనేమి వ్రాయమంటావు అని వంటరూముకు పోయినాడు.

సరోజ నవ్వుతూ పైనవ్రాసేది ఇక్కడెక్కడుందండీ అగూట్లో గిన్నెలో ఉంది చూడండీ అన్నది.

ఆ గూట్లోనా నోట్లోనా పైనవ్రాసేవి ఉంటుంచా అన్నాడు రాము.

పునికపైన అమ్మరాసింది మరచినారేమో కాస్తఆమిదము రాసుకున్నారా చలువకు తిరిగి బుద్ధివికసించి అత్తగారికిజాబు ఎట్లవ్రాయవలసిందీ జ్ఞాపకమునకు వస్తుంది పొద్దుపోకవచ్చింది వంటకావలెనన్నది నవ్వుతూ సరోజ.

వద్దురాదేవుడా చదువున్నఅలూ చేపలు అనివ్రాస్తే చేవలు అనిచదువుతుంది చేపలు అనివ్రాస్తే చేపలు అనిచదువుతుంది. ఏమిదంటే చాకూ చేకూ భేదము లేదంటుంది ఇందుకే మావారన్నది చదువుకున్న ఇల్లాలువద్దురా అబ్బాయీ చక్కగా తూచా తప్పకుండా బదులుచెప్పుతుందీ సాగవునీయాటలు సాగదీకుతుందీ అన్నారు పీకూ, సాగదీకూ ఎంతపీకితే అంతసాగుతా విసుగై విడిచిందనుకా సాగుతానంటూ పోయికూర్చొని గంగాభాగీరథీ సమానురాలగు అందమా ఛా ఛా విధవలకువ్రాస్తే ట్లా అంటారు గంగాభాగీరథీ పరమపావనులు వారివలె పీరూ పావనులనియా రామరామా వారిమాటమనకెందుకు శ్రీమతి అందమా సినిమా తారలా అంటారు అత్తా మామాగారికి అందామా కొంచెమయినా గౌరవపదము నుందలేదే అంటారు అత్తామామా అనవలెనో మామాఅత్తా అనవలెనో అత్తపెద్దా మామపెద్దా అత్తా మామా అలూమగడూ అమ్మానాన్నాఅని వాడుకల్లోఉంది అత్తామామా అనివ్రాస్తే మామ కోపగించుకుంటేయెట్లు పెద్దవారిని మందెంచవలెగాదా ఎక్కడచూచినా స్త్రీలే ముందున్నారు అయినా ఇది తికమకలుగా ఉంది అటుండనీ అని ఒకటీ చక్కగావ్రాసి జేబిలోపెట్టుకొని సరోజ దగ్గరకు లేచిపోయి సరోజ సందేహంవచ్చి కూర్చుంది చక్కగా విప్పివప్పించి పనిచూచుకో నాపనికావలే నీపనికావలె నన్నాడు రాము.

ఇప్పుడే అన్నారుగా చదువుకున్న భార్యవద్దురా దేవుడా అని నన్నిక చదువు రాని దానిలో జమ కట్టుకోండీ అన్నది సరోజ.

చాకలి బట్టలువ్రాసే చదువు వద్దన్నానుగాని చక్కగా చదివిన చదువు వద్దననే అటూ యిటూ రాని చదువేచావు చెప్పు సందేహం విప్పు అన్నాడు రాము.

నా పనీగావలె నీపనీకావలె నన్నారుగా అయ్యో అయ్యోవని నాపని అయింది. ఇంక అయిదవ మాసములో అయ్యగారిపని అవుతుంది. ఇంకేమి కావలె నండీ అన్నది హేళనగా సరోజ.

అయ్యో అయిదవమాసములో నాపనేమిటే అన్నాడురాము ఆశ్చర్యంగా.

చీరలకూ రవికలకూ విందులకూ వినోదాలకూ వచ్చిపోయే ఖర్చులకూ ముందు అయ్యగారు ఆర్జించిన ధనానికి సీమంతం ఆటుపై అయ్యగారి ఇల్లాలికి సీమంతం అని చిరునవ్వోలయ చీర చెరుగు నవ్వుకూ రాముకూ మధ్యలో అడ్డముంచుకున్నది.

నీ నవ్వుకూ నా చూపుకూ మధ్యలో పైటచెరగు అడ్డము మంచిదేకానీ ఊ అని దీర్ఘంగా ఆలోచించి అయితే జాబులు మానుకొని పిల్లవాణ్ణి ఎత్తుకొని ముచ్చటగా మూడోమాసం నిద్రచేయబోదాం ధనవ్యయం కాకుండా ఉంటుంది. వారడిగితే పుట్టినదనుకా మాకు తెలియదు వాళ్లూ వీళ్లూ ప్రక్కఇంటివాళ్లూ అన్నారేగాని మాకు నమ్మకంలేదు. ఆహారబలమనుకున్నాం అయినా ఇరువురమూ తిక్కవాంఛమేనని తప్పించుకుందాం అయితే మానుకుందా మన్నాడు రాము.

సంఘ మర్యాదను వదలి సంఘంలో లోకువవవుతారా ప్రతియొక్క ఆచారం పూర్వులు మంచికై బంధువుల కలయికకై నవగ్రహశాంతికై మాతా శిశు పీడాపరిహారార్థమై పురుష సంతతే కలుగవలయునను ఆశయముతో సీమంతము చేస్తారు. దేశాచారము సాంప్రదాయాను గుణ్యముగా ఎన్నోరీతుల జరుగును. మతగురువులు భావవిభేదములై ప్రజల పీడించి వకరిలో వకరు చేరక నాదిమంచిది నాదిమంచిదని కలహించు రీతులగల్పించినారు అదటుండనీ నడవడి విడి విడిబడి సంచరించును. కార్యార్థం అర్థములేక నిరర్థకులా అర్థము తెలియని వ్యర్థులా అన్నది. ముసిముసి నగుతో సరోజ.

అయితే అర్థానికి వచ్చిందన్న మాట అగచాట్లు తెరచాట్లలోవచ్చిన అగచాట్లు ట్లు పోట్లు కాట్లునై అర్థంవ్యర్థం అయ్యేకాడికి వచ్చింది కానీ ఉత్తరంకథ చెప్పూ అన్నాడు రాము.

ఏమి నింజగా చెప్పమంటావా అన్నది సరోజ.

సందేహం ఏమిటంటే అత్తామామగారికి అనమంటావా మామాఅత్తగారికీ అని వ్రాయమంటావా అన్నాడు రాము.

అందరూ పోయేదారినపోక అడ్డడ్డం పోతామంటారు మామా అత్తా అనేది కాళిదాసు కొమ్మను నరికినట్లు ఉంటుంది అక్కడ బావగారున్నారు నగుతారు గురుస్వరూపులనీ అగ్రజులనీ వయోవృద్ధులనీ పాదములకు నమస్కరిస్తే వారిపాద

ములకే ప్రశస్తమిస్తారా వారిముఖమునగల బ్రహ్మతేజస్సుకూ చిరకాలము బ్రతికిన వయస్సుకూ వృద్ధాప్యమునకూ ప్రాధాన్యము ఇస్తారా చూడండీ వారిశిరోభాగమున గల నాల్గుశక్తులశక్తి దేహభాగమునకు శక్తీ గౌరవమూ ఇచ్చినది అట్లే స్త్రీకీ శక్తి గలిగినది స్త్రీ ఒకవేళ సర్వశక్తులూ స్వయముగా ఆర్జించుకున్ననూ ఉన్ననూ భర్త లేకపోయిన వందనార్హకాదని వైతొలగుతారు ఒకవేళఇచ్చినా శుభసమయముల చూపు ప్రక్కకు త్రిప్పుతారు భర్తతో స్త్రీకిగౌరవము ఇదిసంఘమర్యాదేగాని ఎందుకు అర్హురాలుకావను గొప్పవారు లేకపోలేదు వారివిషయమటుండనీ మరొకటి స్త్రీ మొదలే శాఖోపశాఖలకు ప్రాణవాయు విచ్చునదీనిజమే మొదలులేకున్న శాఖోపశాఖలు బ్రతుకలేనిదీ వాస్తవమే మొదలునే పూజించేదీ సత్యమే అయితే పైన వెలువడు పుష్పములా కాయలా పండ్లా వాసనలా అందులోగలుగు సుగుణములా ననుసరించి మొదలుకు పూజ్యతగలుగును గాని మొదలుకు పూజ్యతలేదు దానిఅగ్రస్థానఫలమునుబట్టి దానికిబలము గలిగినది తల్లియు దండ్రియు౯ గురుడుదైవము అన్నారు అగ్రస్థానమున అనగా శాఖాఫలము దైవముయినాడు మొదల తల్లి అయినదని దైవమును విడచి తల్లిని పూజించుట శ్రేయముగాదు మొదల పలికినంత మాత్రములో అధికారమేమీలేదు ప్రపంచమున తాను వెలువడినది తల్లినుండేగాబట్టి తల్లికన్నా మించినదైవము లేదన్నారు మనస్సునుబిగబట్టి దేహాన్ని అరికట్టి కనిపెంచిన తల్లిదైవస్వరూపమన్నారు. ఈదేహ అవయవములలో పాదభాగము హీనమయినది మీదేహ హీనభాగమునగలుగు పరాగమునకు నాదేహమున అగ్రస్థానమై నాల్గు ఇంద్రియములకు నెలవై జ్ఞానేంద్రియమునకు స్థానమైయున్న నాశిరస్సుబలము తమ పాదధూళికి చాలనివాడను తమ పదపరాగ స్పర్శతో నాశిరోభాగమును పావనము చేసుకొనెదనని పాదములు సోక శిరస్సుంచి చిన్నవారు పెద్దవారికి నమస్కరిస్తారు పదపరాగములతో గృహము పావనమగుతుందని మహనీయుల గృహప్రవేశము చేయిస్తారు పాదధూళిని శిరస్సున ఉంచుకుంటారు. పాదములగడిగి తీర్థముపుచ్చుకుంటారు అగ్రభాగమున శక్తిలేకున్న అధోభాగమునకు శక్తిలేదు అట్లే అత్తా మామా అనడములో అగ్రభాగంమామగారే అవుతారు నాకుతెలిసింది ఇంతే ఇంకాఅనేకము చెప్పవచ్చు యింతమాత్రముతో చాలించుకోనండి మాకన్నా ముందు మీరే మేముఒకవేళ కావలెనన్నా కాదులేండీ అట్లఅనేకమతాలూ అట్లఅనే మానవులూ మహిళలూ ఉన్నారు వారితోమనకు పనిలేదు అందరూపోయే దారినే పోండి యిదివేదహితమేనని సమ్మతించి జాబువ్రాయండీ అన్నది నవ్వుతూ సరోజ.

చీరలకూ రవికలకూ విందులకూ వినోదాలకూ వచ్చిపోయే ఖర్చులకూ ముందు అయ్యగారు ఆర్జించిన ధనానికి సీమంతం అటుపై అయ్యగారి ఇల్లాలికి సీమంతం అని చిరునవ్వొలయ చీర చెరుగు నవ్వుకూ రాముకూ మధ్యలో అడ్డముంచుకున్నది.

నీ నవ్వుకూ నా చూపుకూ మధ్యలో పైటచెరగు అడ్డము మంచిదేకానీ ఊ అని దీర్ఘంగా ఆలోచించి అయితే జాబులు మానుకొని పిల్లవాణ్ణి ఎత్తుకొని ముచ్చటగా మూడోమాసం నిద్రచేయబోదాం ధనవ్యయం కాకుండా ఉంటుంది. వారడిగితే పుట్టినదనుకా మాకు తెలియదు వాళ్లూ వీళ్లూ ప్రక్కఇంటివాళ్లూ అన్నారేగాని మాకు నమ్మకంలేదు. ఆహారబలమనుకున్నాం అయినా ఇరువురమూ తిక్కవాంఛలేనని తప్పించుకుందాం అయితే మానుకుందా మన్నాడు రాము.

సంఘ మర్యాదను వదలి సంఘంలో లోకువవ్వుతారా ప్రతియొక్క ఆచారం పూర్వులు మంచికై బంధువుల కలయికకై నవగ్రహశాంతికై మాతా శిశు పీడాపరిహారార్థమై పురుష సంతతే కలుగవలయునను ఆశయముతో సీమంతము చేస్తారు. దేశాచారము సాంప్రదాయాను గుణ్యముగా ఎన్నోరీతుల జరుగును. మతగురువులు భావవిభేదులై ప్రజల పీడించి వకరిలో వకరు చేరక నాదిమంచిది నాదిమంచిదని కలహించు రీతులగల్పించినారు అదటుండనీ నడవడి విడి విడిబడి సంచరించును. కార్యార్థం అర్థములేక నిరర్థకులా అర్థము తెలియని వ్యర్థులా అన్నది. ముసిముసి నగుతో సరోజ.

అయితే అర్థానికి వచ్చిందన్నమాట అగచాట్లు తెరచాట్లలోవచ్చిన అగచాట్లు ట్లు పోట్లు కాట్లునై అర్థంవ్యర్థం అయ్యేకాడికి వచ్చింది కానీ ఉత్తరంకథచెప్పు అన్నాడు రాము.

ఏమి నిజంగా చెప్పమంటారా అన్నది సరోజ.

సందేహం ఏమిటంటే అత్తామామగారికి అనమంటావా మామాఅత్తగారికీ అని వాయమంటావా అన్నాడు రాము.

అందరూ పోయేదారినపోక అడ్డడం పోతామంటారు మామా అత్తా అనేది కాళిదాసు కొమ్మను నరికినట్లు ఉంటుంది అక్కడ బావగారున్నారు నగుతారు గురుస్వరూపులనీ అగ్రజులనీ వయోవృద్ధులనీ పాదములకు నమస్కరిస్తే వారిపాద

ములకే ప్రశస్తమిస్తారా వారిముఖమునగల బ్రహ్మతేజస్సుకూ చిరకాలము బ్రతికిన వయస్సుకూ వృద్ధాప్యమునకూ ప్రాధాన్యము ఇస్తారా చూడండీ వారిశిరోభాగమున గల నాల్గుశక్తులశక్తి దేహభాగమునకు శక్తి గౌరవమూ ఇచ్చినది అట్లే స్త్రీకీ శక్తి గలిగినది స్త్రీ ఒకవేళ సర్వశక్తులూ స్వయముగా ఆర్జించుకున్ననూ ఉన్ననూ భర్త లేకపోయిన వంధనార్హకాదని వైతొలగుతారు ఒకవేళఇచ్చినా శుభసమయముల చూపు ప్రక్కకు త్రిప్పుతారు భర్తతో స్త్రీకిగౌరవము ఇదిసంఘమర్యాదేగాని ఎందుకు అర్హురాలుకాదను గొప్పవారు లేకపోలేదు వారివిషయమటుండనీ మరొకటి స్త్రీ మొదలే శాఖోపశాఖలకు ప్రాణవాయు విచ్చునదీనిజమే మొదలులేకున్న శాఖో పశాఖలు బ్రతుకలేనిదీ వాస్తవమే మొదలునే పూజించేదీ సత్యమే అయితే పైన వెలువడు పుష్పములా కాయలా పండ్లా వాసనలా అందులోగలుగు సుగుణములా ననుసరించి మొదలుకు పూజ్యతగలుగును గాని మొదలుకు పూజ్యతలేదు దానిఅగ్రి స్థానఫలమునుబట్టి దానికిబలము గలిగినది తల్లియు దండ్రియుఞ్ గురుడుదైవము అన్నారు అగ్రిస్థానమున అనగా శాఖాఫలము దైవమయినాడు మొదల తల్లి అయిన దని దైవమును విడచి తల్లిని పూజించుట శ్రీయముగాదు మొదల పలికినంత మాత్రి ములో అధికారమేమీలేదు ప్రపంచమున తాను వెలువడినది తల్లినుండేగాబట్టి తల్లి కన్నా మించినదైవము లేదన్నారు మనస్సునుబిగబట్టి దేహాన్ని అరికట్టి కనిపెంచిన తల్లిదైవస్వరూపమన్నారు. ఈదేహ అవయవములలో పాదభాగము హీనమయినది మీదేహ హీనభాగమునగలుగు పరాగమునకు నాదేహమున అగ్రిస్థానమై నాల్గు ఇంద్రియములకు నెలవై జ్ఞానేంద్రియమునకు స్థానమైయున్న నాశిరస్సుబలము తమ పాదధూళికి చాలనివాడను తమ పదపరాగ స్పర్శతో నాశిరోభాగమును పావనము చేసుకొనెదనని పాదములు సోక శిరస్సుంచి చిన్నవారు పెద్దవారికి నమస్కరిస్తారు పదపరాగములతో గృహము పావనమగుతుందని మహనీయుల గృహప్రివేశము చేయిస్తారు పాదధూళిని శిరస్సున ఉంచుకుంటారు. పాదములగడిగి తీర్థముపుచ్చు కుంటారు అగ్రిభాగమున శక్తిలేకున్న అధోభాగమునకు శక్తిలేదు అట్లే అత్తా మామా అనడములో అగ్రిభాగంమామగారే అవుతారు నాకుతెలిసింది ఇంతే ఇంకాఅనేకము చెప్పవచ్చు యింతమాత్రిముతో చాలించుకోనండి మాకన్నా ముందు మీరే మేముఒకవేళ కావలెనన్నా కాదుతేడీ అట్లఅనేకమతాలూ అట్లఅనే మానవులూ మహిళలూ ఉన్నారు వారితోమనకు పనిలేదు అందరూపోయే దారినే పోండి యిదివేదహితమేనని సమ్మతించి జాబువ్రాయండి అన్నది నవ్వుతూ సరోజ.

సమయానికి తగ్గట్టు అతుకులువేసే సమయస్ఫూర్తి జ్ఞానములో నాకన్నా పై చేయినీదే శభాష్ సారథ్యములో కృష్ణ సారథ్యం శల్యసారథ్యం అని రెండున్నవి కృష్ణ సారథ్యంచేసి సంసార భారత యుద్ధంలో పేరు ప్రఖ్యాతీ నాకేనిల్పు ఆ భారతయుద్ధంలో అర్జునునికే పేరునిల్పినాడు శ్రీకృష్ణుడు ఈ భారతయుద్ధములో కష్టమున నీవు చేసిన నాకే పేరునిల్పు శల్య సారథ్యంచేసి చెడిపేవు భారత యుద్ధంలో తానుసచ్చినా భారతీయులలో శల్య సారథ్యం అనే చెడ్డపేరు పోలే దన్నాడు రాము.

శల్యసారథ్యంచేసే చెడ్డపేరు గలుగడముతోటే స్త్రీలకు చదువు వద్దన్నది పవిత్రలై పతికి హితవుబోధించి కృష్ణసారథ్యముచేసి పిల్లలకూ తల్లులకూ పిన్నలకూ పెద్దలకూ మార్గదర్శిపై నడిచి వన్నెగడిస్తే సారథ్యం కావలెనంటాడు ఇది ముందు పోవువారు గమనించి వెనుక వారిని ముందుకుతేవలె చెడులో ఆదర్శులుగాక మంచిలో ఆదర్శప్రాయులైతే ప్రపంచమే ముందుకు వస్తుంది. అయినా అదృష్ట ముండవలె నంటూ కార్యము చేయబూనినది సరోజ.

రాము జాబు వ్రాయబూని సందేహం సందేహం అన్నాడు.

ఇది అయ్యో జాబుకాదూ అయ్యో వంటాకాదూ అని విసుగెత్తినట్లు రెండు చేతులా తలగీక్కుంటూ ముఖము చిట్లించి నన్ను వంట చేసుకోనివ్వరా అన్నది సరోజ.

భాభాభా రెండుచేతులా తలగీక్కున్నా తల అంటుకున్నా తలరుద్దుకున్నా నూనె పూసుకున్నా దేహముగీకున్నా ఇంద్రునకైనా దరిద్రము వస్తుందన్నారు. అందరికీ శకునంచెప్పి కుడితిబానలో పడతావా అన్నాడు రాము.

సరోజ నవ్వులో వాల్గన్నుల తళుక్కులో దుఃఖము మిశ్రముచేసి గద్గదస్వర ములో తియ్యనిస్వరము మిళితముచేసి చెవులకింపుగా ప్రేమకు సొంపుగా కనులకు రాణింపుగా ఏమి నన్ను బల్లిని చేసినారా బల్లినా నేను అన్నది సరోజ.

ఔను ఆబల్లి కిటకిట పలికేస్తుంది. ఈబల్లి పటపట చెప్పేస్తుంది మాటలు రానిబల్లి అదీ మాటలువచ్చేబల్లియిది ఓబల్లీ తీర్చవేసందేహం ఊ పటపటా అన్నాడు రాము.

నన్ను బల్లీయన్నారు యింక ఏమయినా అంటారు నేనుచెప్పను అంటూ మృదుమధుర మూర్ఛాన్ని చూపింది సరోజ.

యింక బల్లిఅనను శకునాలపక్షి శాస్త్రాలపిట్టా అంటానులేవే నీకెందుకంత కోపం నాభార్యగర్భమయి మూడవమాసము పడింది అని వ్రాసేదా నాపెండ్లాం నీళ్లుపోసుకొని మూడు నెలలయిందీ అని వ్రాయమంటావా అన్నాడు రాము.

దినమూ నీళ్లు పోసుకుంటూ ఉన్నానె మూడునెలలయిందీ అంటారు యిది హేళనగాదా అక్కడ చదువుకున్న అత్తామామా యింకారెండాకులు ఎక్కువచదువు కున్న బావగారూ కొంచెము ఎక్కువతక్కువగావున్న అక్కగారూ ఉన్నారు పిరగ బడీ నగుతారు భావగర్భితముగా వ్రాయక బటాన బయలుగా వ్రాస్తే అయ్యోనేను గర్భం అనకుండా నాభార్యగర్భం అన్నాడే బావగారూ అని నవుతారు. భార్య గర్భంగాక తానవుతాడా అంటారు భావగర్భితముగా వ్రాయండి అన్నది సరోజ.

గర్భం భావగర్భం నాకురాదే గర్భమయినవారే ఆభావగర్భం కొంచెం చెప్పితే ముత్యాలులాగా అక్షరాలు వ్రాస్తానే అన్నాడు రాము.

చిరంజీవి తమకుమార్తె సరోజకు మూడవమాసము నడుస్తూఉన్నదీ అనండి భావగర్భితము గా గర్భం అని ఉంటుంది అన్నది సరోజ.

వరెవా వరెవా బుద్ధిబలంఅంటే నీదేనే చక్కగా నన్ననుసరించినావు విను చదువుతా.

సులక్షణ లక్షితులై సుగుణగణ గరిష్ఠులై సుప్రసిద్ధులైన బ్రహ్మశ్రీ వేదమూర్తు లగు అత్తామామగారి సన్నిధికి అన్నాడు రాము

అబ్బా అత్తా మామను అట్లుపొగిడితారే పట్టంచుల పంచెలకూ కండువా పంచెలకు ప్లాను బాగావేసినారే రాబట్టే అల్లుండ్రవంధా బాగాచదివినారే అత్తా మామను బాగాగౌరవిస్తేగాని రాతగ్గవిరావు దూషిస్తే దూరమవుతాయి పొగిడితే పొంగిపొర్లి సముద్రం చెలియలికట్ట ఏనాడయినా వకనాడు దాటుతుంది టో కానీ అన్నది సరోజ.

చిరంజీవులు అనంతముగా దండప్రణామము లాచరించి విన్నవించుకున్న విజ్ఞాపన ఉభయకుశలో పరిసాంప్రతం అని వ్రాయుటకు బదులు ఉ సా పెట్టినాను ప్రకృతంలేఖ వ్రాయుట ఏమన చిరంజీవి తమకుమార్తె సరోజకు మూడవ మాసము ఈనాటితో పడినది దేహము ఆరోగ్యముగా ఉన్నది తమయావన్మంది క్షేమములు తెల్పకోరు తున్నది ఇంతే దండప్రణామములు.

ఇట్లు భవత్ ఆశీర్వచనాభిలాషులు.

చి॥ సరోజ, రాము.

అని చదివినాడు రాము చాలుజాబు పెద్దగా వ్రాయక పోయినా పొగడ్త పెద్దగా ఉన్నదే మంచి పంచెలజత వస్తుంది అన్నది నవ్వుతూ సరోజ.

ఊరకే ఇస్తారా వాళ్లఅమ్మాయిని కంటికి రెప్పలాగా కాపాడుతూ పువ్వుల్లో పెట్టి సాకుతూ ఉన్నానుగా అన్నాడు రాము.

అంతటితో విడిచినారు బ్రతికినాను వరుసగా వర్ణిస్తారు వచ్చినన్నిపదాలు వాడుతారు అనుకున్నాను. చాలుఇంకపోయి పోస్టులో వేసిరాండి పొద్దుపోతుంది మాటల సందడి మానవుని వేళను గమనింపనీదు సంధ్యావేళల మానవులు మరువ రాదు మూడు సంధ్యలా మానవులు మరచి పార్కులూ షికార్లూ సినీమాలు బజార్లూ కాఫీహోటళ్లూ మరిగి ఓగులై, జోగులై, సోమరులై, చెడిపోతూ ఉన్నారు. పోయి జాగ్రత్తగారాండీ అన్నది సరోజ.

ఇందుకేనే శంకరులవారు చెప్పినది ముఖ్యస్నేహితులు మానవునికి ఎవరనగా భార్య అన్నాడు భార్యకు భర్త అన్నాడు ఈజోడులోగల అర్థం తెలుసుకొని జీవిస్తే ఆనందముగా జీవిత కాలరథం సాగిపోయి భద్రంగా శుభంగా గమ్యస్థానం చేరు కుంటుంది. ఓస్నేహితుడా నీమేలు మరువలేను మాటనూకాదనను పోయివస్తానని పంచె పైనవేసుకున్నాడు రాము.

అప్పుడప్పుడు వికసించెడి తామర పుష్పమువలె ముఖము వికసింపచేసి సరోజ అయ్యో పాపం స్నేహితుడా అన్న నాలుకకు కాస్త తీపు తగిలిస్తే మరీ మరీ అంటుంది. ఈ కాస్తకాఫీ త్రాగిపోండీ అని గ్లాసు చేతికందిచ్చింది.

శహబాష్ స్నేహితుడవంటే నీవే స్నేహితుడవు పతీ సతీ స్నేహం ఎట్లపెరు గుతుందన్న విషయం తెలుసుకున్న సహధర్మిణి నీవేనే శాస్త్రిలపుట్ట శకునాలపిట్ట అన్నాడు రాము.

అయ్యో పాపమని నేను త్రాగవలసినది మిగిలించి ఇస్తే పుట్టలూ పిట్టలో అంటారు. మాటలు బాగానేర్చినారు ఉబికించి స్తోత్రంచేసి అటుభగవంతునితో వరాలూ ఆశీర్వచనాలూ ఇటు భార్యతో ఆహారాలూ అలింగనాలూ సంపాదించుకునే మాటలేవో అవి బాగావర్ణించినారు సంపాదించుకుంటూ ఉన్నారు మాటల నేర్పుతో

కవీ కాగలరు పౌరాణికుడూ కాగలడు అన్నీ సంపాదించు కోగలడు. అందరి అభిమానమూ పొందగలడు అందరిలో గౌరవముగా తిరుగగలడు స్త్రీ వశ్యం జన వశ్యం రాజవశ్యం కడకు దైవ వశ్యంకూడా చేసుకోగలడు మాటలనేర్పు ప్రతి మానవునికీ ఆవశ్యకము అన్నీ నేర్పినారు భయములేదు పోయిరండీ అన్నది సరోజ.

సేరుకు సవాసేరుగానేర్పి భర్తనూ భగవంతునీ వలలోవేసుకున్నావు భర్తలో భగవంతునిలోగల శక్తి అంతానీదే రాజ్యాలూ మదన సామ్రాజ్యాలూ ఏటికో భూర్భువస్సువర్లోకములలో ఎదురులేదులే ప్రజ్ఞంపే నీదేప్రజ్ఞ పంచామృతాలు ఇచ్చి భగవంతునీ అధరామృతాలు ఇచ్చి భర్తను వలలో వేసుకున్నావులే అని అంటూ ఉండగా రాము.

సరోజ ముఖము చిట్లించి వలపూ వయ్యారమూ అందులోకలిపి మృదు మధుర స్వరములో కొంత చిడునగవూ దుఃఖమూ తొందరా మిళితముచేసి వళ్లు కదలించుతూ చేతులు విదిలించుతూ ఈవంట కాదూ అజాబు పోదు సంధ్యా వందనము అయ్యేదిలేదు మీఇష్టంలేండీ అని అన్నంలో కలియబెట్టు గరిట చేతికి తీసుకున్నది.

రాము భయపడునట్లు అభినయించుతూ సరోజా ఆయుధం అందుకోకే పోతూ ఉన్నాను దండనోపాయము అపాయము అంటూ వెనుదిరిగినాడు రాము.

సరోజ ఫక్కున నవ్వినది.

వెనుకనవ్వు మంచిదిలే అంటూ పోష్టాఫీసుకు పోయినాడు రాము.

సరోజ వంటచేసుకొంటూ దయామయా ఇదంతా నీదయ నీదయలేకున్న ముందుసుకృతము చేయకున్నా దయితుడు దయ్యమై వడతారన్నారు నీఅనుగ్రహముతో స్నేహితునికన్నా మిన్నగా సుఖ దుఃఖముల చెప్పుకొన తగ్గవారు దయామయులు రసికులూ సర్వాంగసుశోభితులూ అదృష్టవంతులూ భర్తదొరికినారు మిమ్ము మరువను తండ్రీ ఈదయ మరుజన్మకు కూడా చూపు తండ్రీ అనుకొంటూ పనిచేసుకొనుచుండగా రాము పోష్టాఫీసుకు పోయి జాబులు వేసివచ్చి సాయంత్రము పూజావిధి ముగించుకొని భోంచేసి వినోదముగా ఆహ్లాదముగా మాట్లాడుకుంటూ ఉండి రాము సరోజా నేను పూర్వపుణ్యము బాగాచేసినాను మేనమామ కూతురి కన్నా చనువుగా సర్వవిధములా తెలిసినదై అనురాగమూ అపురూపమూ అను

గుణ్యమూ కుదిరిక గలిగిన భార్య దొరుకవలెనన్న సామాన్యమా ఏలోపమూ చేసినవాడను కాను భగవంతునిదయ నాపై ఎక్కువగా ఉండిన దన్నాడు.

ఎందుకు చేయలేదు కొంత పాపంచేసినాము నాకు తమరు మేనమామ మేనత్తకొడుకులు గాకపోవుట నేనూ అట్లే మేనత్త కూతురూ మేనమామ కూతురూ గాకపోవుట వివాహ పర్యంతమూ ఒకరు ఒకరికి తెలియకపోవుట పాపము చేయ లేదా అన్నది సరోజ.

ముందేమున్నది వివాహానంతరం కాదా సుఖమో దుఃఖమో ఉండేదీ అన్నాడు రాము.

మీరు తెలిసికూడా అడుగుతారు అనుకుంటాను తమరు మేనమామ కుమారులై ఉంటే బాల్యమంతానాకు ఎట్లుండునో ఏమో ఆసంతోషమంతా హతమ యిందిగా స్త్రీకి సామాన్యముగా ఏడు యెనిమిది ఏడుల వయసునుంచీ కోర్కెలూ కామంప్రారం భమై తనదేహము తాను దాచుకొనుటా సిగ్గుపడుటా బిడియపడుటా మంచియువకులా సమవయస్కులా చూడదలచుట ఎగతాళికి నొచ్చుకొనుట వరుసగలవారిని చూడ లేకపోవుట చూడక వుండలేక పోవుట నిలజూచుట ఆశల పెంచుకొనుట చిరునవ్వు గలుగుట కంటితళుక్కులు వయించుట మనసులో ఆదేదో ఆనందము గలుగుటా శృంగార వర్ణనలు వినగోరుట చదువమనసుపోవుట ఆలుమగల్లు విలాసమూ వినోదమూ పడుచుండ చూడగోరుట ఇట్టి ఆనందములకులోనై పదీ పదకొండు సంవత్సరముల వరకూ తన మనసులో తాను రాబోవు సుఖముల తియ్యనికలల కంటూ ఉంటుంది. అప్పటిలో మేనమామ మేనత్త కొడుకుండి చూచుచుండుటా ఎగతాళీ హేళన చేయుచుండ ఆనందపడుట అప్పుడప్పుడూ ఒకచోట కలసి మెలసి ఒకరిని ఒకరు చూచి సిగ్గుపడుట పరిహాస మాడుట ఆడుటా పాడుటా కొంటెపనుల మామచేయగా తనకు ఇంపుగావున్న తనకిష్టమున్నా అమ్మా చూడవే మామా అంటూ అమ్మతో చెప్పగా మీ ఇరువురిమధ్యా ఊ కొట్టనూ బలకొట్టనూ తగాదాలు దీర్చనూ లా చదువుకున్న ఒక వకీలుగావలె ఏమోఅమ్మా ఎట్లన్నాపోండి అంటూ ఒరే ఊరుకోరా అది గర్వభడవ ఏమన్నా అనీనీ అని అత్తఅంటూ వుంటే లేదు అత్తా నేనేమీ అనలేదు నీ కూతురే నన్నుతగిలింది నన్ను తగులుతావు అంటూ వుంది అని అపద్దాలు చెప్తుంటే అంతా అపద్దాలని ముసిముసి నగువులతో మురిసిపోతూ బదులిస్తూవుంటే వారి ఆనందానికి మేరవుందా కాబోయేభర్త కాబోయేభార్య ఒకరి

నౌకరు విడలేక చెప్పుకొనలేక కోర్కెల కల్లోలములకు తహతహ పడుతూ ఎరుగని కలలెన్నో కంటాడు మామ విద్యలో ప్యాసై ఉత్తీర్ణుడయినది వింటే చూడవలెనని ఉత్సాహపడుతుంది. ఉద్యోగములో చేరెనంటే చూడవలెనని ఉబ్బాతలాగు తుంది తన సోయగము సొగసూ సొబగు విద్యా పెంపూ దేహసౌష్ఠవమూ చూపి మెప్పుబడయవలెనని తీవ్రపడుతుంది. ఫోటో లూ చూచినప్పుడంతా రాబోవు కాలాన్ని సమీపమునకు రాగోరుతుంది సెలవులుఎప్పుడు నాన్నాఅని అడిగితే ఏమి మీమామ రావలెననియా అని అమ్మోనాన్నో అంటే సిగ్గుపడి చూడునాన్నా అంటూ పోదు అమ్మాఅంటూ లేనిపోని కలలతో-ఈసారివస్తే ఇట్లమాట్లాడవలే ఇట్లచూడవలె ఇట్లనడువవలె ఇట్లపైట సవరించవలె ఇట్లతిను పదార్థములు ఇవ్వవలెనని ఆలోచిస్తూ ఆలేత హృదయాన్ని మామకేఅర్పిస్తూ మామనే తలంపులో ఉంచుకొని వివాహకాలమునకై తాను పుష్పవతి అగుటకొరకై ఎదురుచూస్తూ ఉంటుంది మామరసికుడైనా తానురసికురాలైనా ఇంకా ఎన్నెన్నో ఆనందాలు పొందుతారు. ఆనందకాలం మీకూలేదు నాకూలేదు అత్తకూతురో మామకూతురో ఇంకాదగ్గర అక్కకూతురో ఉండి ఉండిన తమకు తెలిసిఉండేది పాపం అట్లఉంటే ఆనందపడి ఇతరులకుచెప్పి ఉండరులేండీ స్త్రీ ముందు జన్మలో సుకృతంచేసి ఉంటేనే బాల్యమాదిగా కొంచె మెంచుమించు వయసులోగలిగి ఈడు జోడుకుదిరి వేషభాషల్లో తనకునచ్చి తనకుతగ్గ మామదొరికేదీ కామజ్వాలలకు క్రాగకుండా మైనము తీరుతానే ఏడుమీరకుండా జోడుదొరికేది లేకుంటే వింధ్య హిమాలయముల సందులో అంతదూర బంధుత్వములో అంతదూరములో కన్నీరుకాల్వలై పారిన వెనుక ఆశలన్నీ అడుగంటిన తమవరి తోటిసోదరీలు పిల్లలుగన్న పిదప దేహసౌష్ఠవమూ యౌవనమూ యుక్తకాలమూ అడవిజేరిన కొన్నాళ్లకు ఆదివరాహమూర్తి వలె అవతరిస్తాడు ఏమామో ఒకమామ సర్వాంగసౌష్ఠవముగలిగి అవయవములు అకాల మృత్యువుల వాతబడక అరవైఏడుల వరకూ భార్యభర్తలు రసికులై యౌవనులై అన్యోన్యముగా క్షీరనీర న్యాయముగా ఏకమనస్సుతో ఉండీ పుట్టుకలో వెనుక పుట్టినా చావులో భర్తకన్నాముందు భార్యగతించి రోజుల తేడాతోనో నెలల తేడాతోనో భర్తగతించ వలయునన్న ముందుజన్మలో త్రిమూర్తులా త్రిదేవులా త్రిసంధ్యలా త్రికరణ శుద్ధితో అర్చించి ఉండవలె మంచి నడక నడిచీ ఉండవలె ఊరక రాదు అదీతెలియక నాకు పెళ్లికాకపోయె అమ్మానాన్నా చేయలేక పోయిరి డబ్బులేకపోయె తగినవరుడు తటస్థపడక పోయెనని చింతించుచూ వ్రాతవ్రాసిన

బ్రహ్మను దూషిస్తూ ఎవరో వకడు దేవుడిచ్చినభర్త చేసుకొమ్మన్నవారిపై దుమ్మెత్తి పోస్తూ నాలుగందాలు లేకపోతే చేసుకొనీ ఏమిమేలంటూ ఇతరులనూచిగుటికలు మింగుతూ కంటికి వత్తివేసుకొని ఏడుస్తారు బీదలకిస్తే ధనికులుకాలేదా ధనికులకిస్తే బీదలుకాలేదా నూరేండ్లు ఆయుర్దాయమనిఇస్తే మూడునాళ్లకే వూడిపోలేదా అనేకమయిన అలజడులు గలుగలేదా అంతాముందుచేసిన సుకృతములో ప్రకృతంచేయు పుణ్యములో ఉంది జీవిబ్రతుకు తెలియక చింతిస్తారు ఇదిబుద్ధిలేనితనం తానుబుద్ధిగలిగి యుక్తవయసు వచ్చువరకు తిరిదేవిపూజ చక్కగాచేస్తే ఆరు ఏడువేండ్లు కాలమవుంతుంది పన్నెండు ఏండ్లు తప్పక సేవిస్తే ఏదేవతయినా ఏదేవుడయినా తప్పక అనుగ్రహిస్తుందన్నారు అనుభవజ్ఞులూ పెద్దలూ ఎందుకు ఆచరించ కూడదూ వీరిసుఖ దుఃఖములకు వీరుగాక వేరేవారు బాధ్యులవుతారా ఇదంతా తల్లిలో ఉంది అని ఊరకున్నది సరోజ.

అయ్యో విడచి పెట్టితివేమే తెల్లవారు తుందనుకున్నానే నీకు నేను మామనో మేనమామనో అయివుంటే నిన్ను ఏమిచేసివుందునో చెప్పతరముగ్గాదు మనము చేసేసేత వ్రాయలేక బ్రహ్మకూడా తలవిదిలించు కొనును దినదినమూ కాట్లాటే కొట్లాటే పోట్లాటే తీర్చలేక చూడలేక పొమ్మనలేక రమ్మనలేక మీ అమ్మా నాన్నకు చాలైవుండేది అన్నాడు రాము.

కండ్లు త్రిప్పి పెదవులు విప్పి వలపు పిలుపులతో వలపు చూపులతో మరపించుకొని ఆడించి వుందును చేతగానిపిల్ల అయితే కాట్లాటా కొట్లాటా పోట్లాట వుంటుంది చేతనయినదాని చేతిలో కీలుబొమ్మ కొమ్ములు తిరిగిన మొనగాడైన తెలుసునా అన్నది నవ్వుతూ సరోజ.

బుగ్గలు కమిలిపోయి గడ్డము వాచిపోయి మామపండ్లు కాట్లు అట్లు పోట్లు అయి అమ్మకుచూపి మామ చూడవేఅని ఏడ్చేటట్లు చేసివుందు వస్తా ముందుజన్మకు వస్తా వుండూ అన్నాడు రాము.

రా వలపు సంకెళ్లు తగిలించి చిలిపి చేష్టల్లో ఇరికించి ఆడిస్తా ఇంటికి వీధికి తిప్పిస్తా గీటుదాటకుండా చేయిస్తా అన్నము నీళ్లూ మరపిస్తా రా అన్నది సరోజ నవ్వుతూ,

రాము గడియారము ప్రక్కచూచి అప్పుడే పది అయినదే ఇక పండుకో గర్భవతులు నిద్రమేల్కొరాదు అట్లుమేల్కొన్న మరునాడు ఉష్ణాధిక్యమై దేహము నీరసమేర్పడును తలనొచ్చును మనస్సుకు ఉల్లాసము వుండదు అజీర్ణమగుటో మలబద్ధకమగుటో జరుగును పిడీమనుషులైన పరవాలేదు పాపము గర్భవతివి పడుకొమ్మని రాము పడుకొన్నాడు సరోజ కన్నంటించినది.

మరునాడు తొమ్మిది గంటలకు జాబుచేరి భుజంగరావు ఇంట్లో అందరూ ఆనందపడినారు సరోజ కాపురమును గురించి నడకను గురించి మాటినందుకు సంతోషించినారు అనసూయమ్మ కావలసిన పదార్థములు చేసుకొని మూడవనాడు ప్రయాణమై కుమార్తె ఊరు చేరుకున్నది. ఆ సమయమునకే జ్ఞానాంబా వచ్చి చేరినది ఇద్దరూకలసి బస్సుస్టాండునుండి ఇల్లు చేరినారు ఆ సమయమునకు సరోజ భోంచేసి కూర్చొని ఏదోచదువు కొనుచుండెను. ఇద్దరూ ఇంటిలో ప్రవేశించిన తోడనే సరోజ లేచి సంతోషముగా ఎదురుపోయి అత్త చేతిలోగల సామానులు తీసుకొనివచ్చి అక్కడపెట్టి అమ్మచేతిది తీసిపెట్టి కాళ్లుకడుగుకొన నీళ్లు ఇచ్చి క్షణములో కాఫీవేసి ఇరువురకూ ఇచ్చి నీళ్ల క్రిందవేసి స్నానముచేయ పొమ్మని భోజనము కాలుగంటలోపలచేసి ఊరగాయలో పోళ్లూవేసి భోంచేయపెట్టి చాపవేసి కూర్చుండుడని తాంబూలము తెచ్చి ఇచ్చి తాను కాఫీవేసి ఫ్లాస్కులోపోసి తానుత్రాగివచ్చి అమ్మా అత్తను క్షేమములు అడుగుచుండెను. ఇంతలో అయిదు గంటలాయెను.

రాము స్కూలు నుంచీవస్తూ పూలు పండ్లూ పట్టుకొని వచ్చి చూచి ఓహో ఒకేరోజులో ఒకేవేళలో ఒకేసారిగా ఒకే బండిలో వచ్చినారా అంటూ పూర్తి ఇంటిలో ప్రవేశించి మీయత్త ముందా మా యత్తముందా మీయమ్మ ముందా మాయమ్మ ముందా సరోజా చెప్పమన్నాడు రాము.

ఇద్దరికి నలుగురిని చెప్పుతున్నారే మాయత్తా మీయత్తేవచ్చింది ఆనందంగా చూడడములో నలువురిగా అగుపడినారు ఒకేబండిలో ఒకేసారిగా వచ్చినారు మళ్లీబాగచూడండీ ఇద్దరుగానే అగుపడుతారు అన్నది చిరునవ్వు నవ్వుతూ సరోజ.

అత్తగారికి ఆహారం ఫలాహారమేనా అన్నమేమయినా అన్నాడు రాము.

సరోజ నవ్వుతూ అత్తగారు వస్తారని అయ్యగారు చెప్పలేదు అన్నము చేయలేదు అన్నది సరోజ.

పెద్దవారు చిరునవ్వుతో ఇరువురనూ చూస్తున్నారు.

అన్నము ఆకులోపడందే అక్కసున్నంరాయరులేవే అంతసూక్ష్మ గ్రాహిత లేదనుకున్నావా స్కూలుమాష్టరకు చూచేవేళకే అంతా అవగాహన మగుతుందనుకో తెలుసుకో అంటూ పూలూ పండ్లు మువ్వురి మధ్యలో పెట్టినాడు రాము.

చేతికివ్వకుండా అక్కడ పెడతా రెందుకూ అన్నది సరోజ.

అవగాహన మవుతుందని ముందేచెప్పినానుగా అమ్మా అత్తా ఆలూ మధ్య ఎవరిచేతికిచ్చుటకూ వీలులేక అక్కడ పెట్టినాను ఎవరిచేతులు ముందక్కడికి వస్తాయో చూతామనుకున్నాను ఎత్తుకొన తగినవారే ఎత్తుకున్నారు ఎత్తిపెట్టునో ఎగరగొట్టునో వీలెవానికెరుక అన్నాడు రాము.

ఎత్తిపెట్టేది ఇల్లాలూ ఎగరకొట్టేది యజమాని అంటూ ఎత్తిపెట్టి కడుపు చల్లచేసుకొని కావలసి నంతసేపూ మాట్లాడండి అంటూ కాఫీతెచ్చి ఇచ్చినది సరోజ.

రాము తాగి నీధర్మంనీవు ఆచరించినావా అన్నాడు.

సరోజ ఆవిషయం తెలుసుకొని లేదండీ తమకొరకై తాళుకున్నాను అన్నది.

అయితే రా అంటూ అమ్మా అత్తా ఎదుటనిల్చి ముందు అమ్మకా అత్తకా అమ్మముందా అత్తముందా అన్నాడు సరోజను చూచి రాము.

అన్నీ చదివిన అయ్యగారికి అదెందుకు తెలియదూ అన్నది నవ్వుతూ సరోజ.

అమ్మ కనిపెంచినది అత్త కన్యనచ్చినది కనడములో అమ్మముందు అత్త వెనుకు అమ్మ ధనముతో సర్వస్వము దానముచేసినది. అత్త కన్యాదానం మాత్రం చేసింది కొడుకును కన్నతల్లి అధికారి కూతురిని కన్నతల్లి అనధికారి అరం భారం నీభారం నాభారం మోసేది అమ్మా అంతాభారం మీదేననేది అత్తా ఎవరికిముందో నీవే చెప్పు అన్నాడు రాము.

నోటికి పైటచెరగులు అడ్డము పెట్టుకొని పెద్దవారు నవ్వుతూ ఉండగా.

సరోజ నవ్వుతూ మాయమ్మకనీ మీయమ్మకు దానంచేసింది దానమిచ్చు దాకా మాయమ్మపెద్దది తీసుకున్న వెనుక మీయమ్మపెద్దది దానమిచ్చువారిదే పైచేయి తీసుకొనువారిది క్రిందిచేయి అయినా వయసులో వైనంలో కాలంలో మీఅమ్మే పెద్దది. కానివ్వండీ, అన్నది సరోజ.

సరే తగినట్లే చెప్పినావు. దీనిఅర్ధంఇంతేనని సాగిలపడి ఇరువురూ నమస్కరించినారు.

పుత్ర పౌత్రాభివృద్ధితో నూరేండ్లు బ్రతుకండీ నాయనా అని అనసూయమ్మ దీవించినది.

జ్ఞానాంబ అన్నది వినపడలేదు.

రాములేచి అమ్మముఖము చూచి ఏమమ్మా నీవన్నది వినబడలేదే అన్నాడు రాము నవ్వుతూ.

జ్ఞానాంబ ముఖమున చిరునవ్వొలుకు బాగా ఆశీర్వదించినా నాయనా చతుర్విధ సంపదలతో యశోవంతుడై ఏడువీడి ఏడుకూడి దేవబ్రాహ్మణ వయోవృద్ధ బంధు మిత్ర ఆశీస్సులందుకొను పిల్లలకని చిరకీర్తి వంతులై వర్ధిల్లమని కడుపార దీవించినా నాయనా జాబు చూచినతోడనే మీనాన్న పో పో పొమ్మని చంపినాడు దీక్షచేయ వలసినవిధమూ వారికేమి తెలుసు మనహింధూ సాంప్రదాయము ఆచారము అంత రింప చేయరాదు మూడవమాసము నుండీ అయినా ప్రారంభించచేసి ఉండువిధమూ వండువిధమూ చెప్పిరాపొమ్మని తొందరించినాడు కోడలు చక్కగాతెలిసినదీ అదుపులో ఆజ్ఞలో ఆచరణలోఉంచి ఉంటుంది వరవాలేదు అంటే వింటేగా తొంద రించినాడు వచ్చిచూడగా అనుకున్నంత ఉన్నది సంస్కారమయిన పిల్లగాబట్టి నిన్ను యుక్తితో సంస్కరించినది నాయనా సీతర్కాలకూ తారామళ్లకూ నేర్పిన పిల్లగాబట్టి తాళుకుంది దద్దమ్మఅయితే పెద్దదేవర చేసిపెట్టి ఉండును అన్నది జ్ఞానాంబ

రాము అమ్మప్రక్కలో కూర్చొని అమ్మా, పిల్ల, పడుచుపిల్ల అయినా బుద్ధి వృద్ధ బుద్ధి పిట్టకొంచెం కూతఘనం వృద్ధవు-స్త్రీయాంగన వృద్ధనారీ ఉన్నదిగా ఇంట్లో కాలుకదిలిస్తే ధర్మాలు కట్టవిప్పి ముందుపెట్టుతుంది. వద్దే గడ్డం పెంచవద్దే షోకుగా ఉండవలెనని గంపెడంత ఆశఉందే అగచాట్లుగా ఉంటుందే ఆకారహీన మవుతుందే ఆకారములేక కృత్రిమముగా ఆగచాట్లతో కుదిరించుకునే వాళ్లుంటే ఉన్న ఆకారము పొగొట్టుకొమ్మంటా వెందుకే ఈకాలంలో నన్ను బుద్ధిలేనివారిలో జమ కట్టుతారే అంటే వింటేగా నేనుమాత్రం ఆకారహీననుకానా నియమబద్ధనుకానా అగచాట్లులేవా కొంతకాలం కన్యాత్వముతోనుండ కోరికలేదా అన్నికోర్కెలాచంపి స్థిరప్రజ్ఞనై బుద్ధిని బిగియ బట్టవనిలేదా అంటూ అమ్మా దీక్షలో దిగినదనుకా సాధించింది వేధించింది మూతి ముడిచింది ఆనందంబిగించింది నానావస్థలాపెట్టి నన్నిస్థితికి తెచ్చింది అంతా నీవరుసే నీతోనాన్నకెంత కష్టమో దీనితో నాకంత కష్టమొచ్చిందే మనఇంటికి వచ్చేటప్పటికి మనుషులే మారుతారు వంశవృక్షములో

కూడా ఏదోశక్తి ఉన్నట్లేఉంది పిట్టచిన్నదేగానీ చెవులు బ్రద్దలయ్యేటట్లు కూతవేస్తుందే అన్నాడు రాము.

ఊ కానీ ఇంకా కానీ అత్తా అమ్మఎదుట ఉన్నదంతాకానీ అన్నీవిడచి విషయ సుఖాల్లోపడి విన్నదాన్నీ కన్నదాన్నీ కాలదన్ని పుట్టేపిల్లల బలాన్నీ జ్ఞానాన్నీ రూపాన్నీ పాడుచేయుపద్ధతు లవలంబించి పుట్టినవెనుక ఇట్లాయెనని విసుగుజెంది వేసటపడితే వస్తుందా సానపట్టేటప్పుడే కుమ్మరసెట్టి సొట్టలేకుండా మట్టిమంచి దానితో దేనిదేని కెంతెంత ఎట్లెట్ల సానపట్టవలయునో పట్టక కొట్టడములో సరిచేస్తే మట్టితక్కువ వస్తుంది గట్టితక్కువ వస్తుంది మనేదీతక్కువ వస్తుంది ఇదంతాసెట్టిలో ఉంది సట్టిబలాబలం దీక్షాబద్ధులై కష్టపడి తయారుచేస్తే విలువగలుగుతుంది. కష్టం తగ్గుతుంది కార్యం నెగ్గుతుంది. పౌరుషజ్ఞానకీర్తులు మిగులుతుంది అమ్మా నాన్నా అబ్బా జేజీ అవ్వా తాతా మామా అత్తా హృదయాల్లో వెలుగు వెలుగుతుంది. మీయమ్మనూ మాయమ్మనూ అడుగూ అనుభవనీయులు అన్నది నవ్వుతూ సరోజ.

ఈమాటలకు నవ్వుతూఉన్న అమ్మ అత్తనుచూచి రాము చూడవే ఎన్నిఆకులు చదివిందో కొంచెం అట్లు కాలుత్రొక్కితేచాలు తలనుంచీ కొనతోకవరకూ చిమగ త్రొక్కేస్తుందే కోడలంటే కోడలుగాదు అన్నాడు చూచిచూడనిత్రోనే చూడచక్కని చిన్నదీ కడమేడలోనా ఉన్నదీ అని తత్వంపాడుతూ సులక్షణ లక్షణములన్నీ ఉన్నవీ స్ఫురద్రూపీ సుగుణవల్లీ అని పొగడి చేసుకుందామన్నావు అమ్మచెప్పింది అది పెద్దమ్మ అయినాసరే దద్దమ్మయినాసరేనని చేసుకున్నా రామ రామా వచ్చిన త్రోనే కట్టవిప్పితే ఆచారాలూ వ్రతాలూ వక్కబ్రొద్దులూ నియమాలూ నిష్ఠలూ పండుగలూ పర్వదినాలు ఇంకాఎన్నో ఒకటా కట్టిఅంతాఅదే కాలుకదిలిస్తే వస్తుంది. పడుచుపిల్లకదా పడదాం క్రిందామీదా పదిలమున్నదనుకా అంటే పంచాంగం పార బట్టి అమావాశ్య మొదలుకొని అన్నీ విశదీకరిస్తుంది కాదంటే కన్నీరువిడుస్తుంది. కన్నీరుచూస్తే కనికరం కలుగుతుంది ఈబాల్యంలో ఇంతపనివద్దే ఇజిగి చస్తామే గౌరవానికై రాబోవుకాలానికై కోరికల చంపి మనోవ్యసన మనుభవించే మనుష్యుల మవుతామే ఈకామదేవత కాళ్లూ చేతులు కాస్తచల్లపడనీవే అంటే వింటేగా మూతి ముడుచుకుంటుంది, నామాట వినకుంటే మీమాట విననంటుంది భయపెట్టి చేయించు కుంటారా వల్లనిసంసారం మనసొల్లని మమకారం దేహం మీసొత్తూ మోహం నాసొత్తూ నిర్జీవప్రతిమతో మాటా ఆటా ఉన్నట్లుంటుంది భద్రం అని హెచ్చరిస్తుంది

అబ్బా ఆస్థైతే ఇదేమేబురా దేవుడా అని పినే ఈగడ్డం సీలెడెత్తు వచ్చిందే అమ్మ చెప్పితె అవతల పొమ్మంటా న్నాన్నచెప్పితే నాకుచెప్ప వద్దంటా అడ్డాదిడ్డం మాట్లాడుతా కానీ ఈడచిక్కినానే ఊ కట్టుకున్నట్లుగాదు కావలసినవి తెంటీ ఆనందపడినట్లు గాదు ఆనందంలో పిల్లలున్నారు. ముకిసిపోయినట్లుగాదు ఇద్దరికి ముగ్గురూ ముగ్గురికి నలుగురూఅయి నలుమూలలా రద్దులూ, గుద్దులూ, సుద్దులూ, వద్దురా దేవుడా అన్నాపోరు. జాగ్రత్త అని ఎదపై చేయిపెట్టితట్టి హెచ్చరిస్తుందే దిగులు పుట్టిస్తుంది మా అమ్మా నాన్న సంపాదించి నాకులేవే భయంలేదు అంటే డబ్బుసంపాదించేది అమ్మా నాన్నా పిల్లలసంపాదించేది నీవూనా ఇదెక్కడ నేర్చుకున్నావు అని మూతి పొడుస్తుంది. మా అత్తా మామకు చెప్పుతా ఇవ్వవద్దని అంటుంది పినేపేనీవు. నేనే సంపాదించాలట ఇదెక్కడవుతుందే అడక్కన్నా మా అమ్మ ఇస్తుందిలేవే తెచ్చుకుందాం అంటాను అట్లావద్దంటుంది అమ్మా ఇందులో ఇన్నికష్టాలున్నాయని ముందు తెలిసి ఉంటే ఇంతచేసుకోనే అన్నాడు పేద మొఖము పెట్టి భయపడీన వానిలాగా రాము

ఔను మంచిమాట అలిబాధలు పడలేక అడిగినవన్నీ తేలేక భాగ్యమూ ఆరోగ్యమూ అనుభవించు మహాభాగ్యమూ తమకడలేకా అనురాగవతీ అపురూపవతీ అనుగుణ్యవతీ ఆనందవతియై ఆజ్ఞానువర్తినియగు ఇల్లాలిని ముందుజన్మలో సంపాదించు కొనిరాక ఈజన్మలో పరితపించి సంసారాన్నివిడచి వెన్నిచ్చి పసుగెత్తి గడ్డము పెంచి కావివస్త్రాలుకట్టి శుష్కవేదాంతాలు చెప్పేశుకులవారై పరాన్నమూ పరదారా పరధనమూ పాపమని చెప్పుతూ అమూటెకే ప్రారబ్ధమై కుంభీపాక నరకములో కలుసుకొనే కొయ్యలవలె అవుతారా లేక భగవంతుడు స్త్రీ పురుషుల గల్పించి ఇట్లచేసుకొండని తాను ముందు సంసారై ఆదర్శ ప్రాయుడై నిలచి సంసార పరీక్షపెట్టినాడు దీనిని చక్కగానెగ్గి గరుడవాహనముగాక సింహవాహనమే అయి సాలుకు చక్కగా ఎదఇచ్చినడచి సంసార సాగరములో భగవత్ సేవా నావ ఎక్కి సాటివారికన్నాముందు దరిజేరి భగవంతునితో పట్టాపొంది సైయనిపించుకొని చిత్రగుప్తుని చిట్టాలో లెక్కలకెక్కక శ్రీనగరముచేరు అయ్యావారగుతారా చెప్పండి అత్తా అమ్మ ఎమటచెప్పండి అత్తాకొడుకు మెత్తపడినాడు కొంచెము నిబ్బరముచెప్పి భయముదీర్చు అని నవ్వినది సరోజ.

ఆ మెత్తపడతానా ఈరెండు మాసాలకే పిలెడంత చుట్టుకొల్త ఉబికినానే ఇంక అత్తా అమ్మా తెచ్చిన రెండు బుట్లఫలాహారాలు తింటే ఇంక రెండేళ్లు అని వేళ్లుచూపినాడు రాము.'

అత్తా అమ్మా భార్య ముగ్గురూ విరగబడి నవ్వినారు సరోజ అవి మీకుకాదండీ నాకూ వకేనాడు భీమ ఫలాహారం చేస్తామనుకున్నారేమో అని నవ్వినది.

ఆహారం లేకపోయినా ఆ వాసనైనా వస్తూంటుందిగా ఆలుకడుపు పెరుగుకొద్దీ అయ్యగారు ఆపాదమస్తకం అరంగుళమన్నా పెరుగవలెనన్నారు అనుభవజ్ఞులు రెండుబుట్టలూ కాలీఅయిపోవులోపల అని రెండేళ్లు తిరిగిచూపినాడు చూపి సరోజ తట్టుమళ్లీ ఏమీ గరుడ వాహనమని హేళన చేస్తావెందుకే అడుక్కునే క్రిందిచేయి అనికదా నీభావం అదికాదు హరినీ సిరినీ ఇరువురా మూపునకూర్చుండ బెట్టుకొని హరిపదములొకహస్తమునా సిరిపదములు ఒకహస్తమునా పెట్టుకొని హస్తములు సాచి ఆర్యులారా పరమభక్తులారా మీరు హరిధ్యానా తత్పరులై అన్యులకు అపకారముచేయక పూర్వజన్మ పాపులగు పుట్టంధులకూ వృద్ధులకూ అన్నబీదలకూ అంగహీనులకూ చిక్కులకు లోనగు సంసారులకూ సహాయపడుతూ దినచర్యను మరువక రాజయోగులై తరించి ఈహరిసిరి పదములాశ్రయింపుడు సన్యాసులలో చేరకుడు వీరిసేవవల్ల ఈతిబాధలుండవని చేతులుసాచి తన్మయుడై గృద్ధుపెద్దవిచేసి మోకరించి చెప్పుతున్నాడు పరదారా పరాన్న పరధనములతో శిశ్నోదర పోషణ చేయు బుడ్డసన్యాసులలో చేరకుడనిగొంతు బొంగురుపోవ చెప్పుచున్నాడు గరుకు మాన్లు అన్నాడు రాము.

ముప్వురూ పడిపడీ నవ్వినారు.

ఇక సింహవాహనమంటే కంఠీరవము నోరుతెరచి కోరలు చూపుతూ గాండ్రించి పైకిలేచి గోళ్లు పెకల్చి ఇదిగో గరుత్మన్తుని మాటకాదని వేరుమార్గముల బోధించువారినీ ఆదారినపోవని వారినీ పాపపుణ్యములులేవు పునర్జన్మము లేదను వారినీ పాపభూయిష్ఠులా దైవము లేడనువారిని మంచి దార్లకు కంపగొట్టు వారినీ లోకవంచకులా లోకకంటకులా భక్తులబాధించు వారినీ బీదల బాధించి పీల్చిపిప్పి చేయువారినీ మదీయ నఖాయుధముల చీల్చి నల్లత్రావెదను భద్రము సుమాయని నోరుతెరచుకొని ఇదుగోనేనను శబ్దము వినవచ్చునేమో పైదుముకుదమని నలుప్రక్కలా పారజూచు చున్నాడు మృగరాజు ఇచ్చేదానికికాదా అట్టహాసం మీదికి దుమికేదానికి అన్నాడు రాము.

దేనికితగ్గట్టు దానికి సరిచేస్తాడు అతుకు గానరాకుండా అతుకువేస్తాడు అత్తా అన్నది సరోజ నవ్వుతూ.

ఔనే వీనితో ఎప్లేగుతున్నావోగాని ఎప్పుడూఇంతే ఓనమాల తరగతి నుండీ ఇంతే నన్నువీదయినా అడిగేదీ నేను చెప్పినదాన్నివిని తిరిగీ వాళ్లనాన్నను అడిగేదీ అందులో కొంచెం భేదమయితే ఆదిచక్కగా సమాధానం ఇచ్చువరకూ మా ఇరువురలో వకరు తప్పనో మరచినామనో చెప్పునంత వరకూ చంపుకతినేవాడు ఇట్లే రాత్రింబవళ్లుబావ ఇంట్లోఉంటే దేనికీ తర్కమూ కుతర్కమూ బాల్యములో మరింత శొంతెముండాకొడుకు అన్నది జ్ఞానాంబ.

అమ్మా ఆపదం ఇఁకొకరినోట వచ్చిఉంటే కూనీలు ఒకటో రెండో ఈవేళ కయిఉండును శొంతెముండాకొడుకు అంటే శొంతెముండవునీవూ కొడుకును నేనూ నిన్నునీవు తిట్టుకున్నావుగానీ నన్నుతిట్టలేవు ఇట్లతిట్టవచ్చునా తిట్టేది నేర్చుకోవలె నన్ను తిట్టేతిట్టు తిట్టవే నీవిప్పుడు తిట్టినది బజారుతిట్టు పల్లెతిట్లనీ బజారుతిట్లనీ బాపనతిట్లనీ శూద్రతిట్లనీ పురాణము తిట్లనీ బహురకాలున్నాయి ఇవి తెలుసుకొని తిట్టితే తిట్టవలెనే ఏదీఒకటి తిట్టు చూతాము అన్నాడు రాము.

ముప్పురూ ముసిముసి నగులతో నోళ్లకు పైటలడ్డము పెట్టుకొని చూస్తున్నారుగాని జవాబు పుట్టలేదు.

అమ్మతట్టు చూస్తూ రాము కానీ ఓ అమ్మా వక్కటి తిట్టవే అని బాధించబట్టినాడు జ్ఞానాంబ తాళుకొనలేక పోరా కోతిబడవా అన్నది.

అదీ సూటిగా నాకు తగిలినది అమ్మకూ అక్కకూ అలిగి తగలకుండా నాకే తగిలింది. తిట్టితే నేర్చుకొని తిట్టవలె నేర్పులేకుంటే నెత్తికొస్తుంది అన్నాడు రాము.

మీస్కూల్లో పిల్లవాండ్రకు చెప్తుతుంటారా పురాణంతిట్లూ పల్లెతిట్లూ ఏవీ కొంచెమనండీ చూస్తాము అన్నది నవ్వుతూ సరోజ.

ఔను రేపు కొడుకుపుట్టి పెరిగిపెద్దై తులువచేష్టలు చేస్తుంటే తిట్టవనిలేదా నేర్చుకో అనికండ్లురిమి ఒరేమొద్దా మొద్దుపెద్దమ్మా ఒరేతుళువబోకీ ఒరేబుద్ధిలేనిదద్దన్న ఒరేశుంఠా ఈ సరళ్లో ఇంపుగా ఎన్నోవాడతారు. అందులో కొంచంపెద్దై మాటవినకుంటేకోపం పట్టలేనప్పుడూ పండ్లుకొరికి ఒరేపశువా ఒరేపలుగాకీ ఒరేపాపీ ఒరేమతిభ్రష్టా ఇట్లా తూకంగా పలువిధాల నడిపిస్తారు. ఆవి చదువుకున్న తల్లితిట్లు ఇకచదువురానితల్లిఝాడిస్తుంది జంటదెబ్బలతో ఒరేగాడ్దెకొడకా ఒరేలంజకొడకా అనిఈజాడలో కదం త్రొక్కినట్లు ఎన్నోనడిపిస్తుంది. ఇక బజారుతిట్లు ఒరే ఈదులాడ్చే నాకొడకా

ఒరే దరిద్రపునాకొడకా ఒరే రండనాకొడకా అని అమ్మకు అవమానం గాకుండా వానికి శూలాలుగా తగిలేటట్లూ అంత్యప్రాస పోకుండా అవతలివారికి వినబడకుండా బట్టిలో తొడపాశంలాగున అనగబట్టి తిడతారు. ఇక బాపలతిట్లు అంటే బ్రహ్మ కూడా తలపట్టుకోవలసినదే ఓరి నీపాడెకట్టా నిన్ను నష్టేటపట్టా నీ తలపండుపగులా నీ పిండం పిల్లులుతినా నీపాడుకానూ నీవంశం వల్లకాడుకానూ నీ అడుగారిపోనూ అని బండెడంత అర్థం ఇమిడించి ఈ వరుసలో అనేకమయిన పదాలు వాడుతారు వాడూ వాని వంశమూ పాడయ్యేటట్లు తిట్టుతారు కొందరుతిట్లు తగలవంటారు అట్లయితే ఆశీర్వచనము కాదంటారు ఆశీర్వచనములో ప్రభావముంటే తిట్లలో ప్రభావమెందు కుండదూ బాపనతిట్లు తినరాదు బహుపాడువి బహుదెబ్బ ఇక పల్లె తిట్లంటావా చూడూ మహాకవి భక్తశిరోమణియైన పోతనకవిత్వము అంత్యప్రాసమూ బిగువూ నడకా సరళత మృదువూ భావమూ ఉన్నట్లు నీయమ్మ నీయక్క నీయాలి అని ద్విప్రాస త్రిప్రాసలతో దంచితే అటు ఏడులోకాలకూ యిటు ఏడులోకాలకూ ప్రతిధ్వనించి వినబడి కామదేవత అల్లాడవలె కామశాస్త్రమంతా చిందరవందర కావలె గ్రామదేవత శివమెక్కి తాండవమాడవలె యింటిదగ్గర ఆడవారు కదం కదంఅని కదంతొక్కవలె కక్కులకు తెగిమీదపడి కూనీలు కావలె పల్లెతిట్లల్లో కామశాస్త్రం కదంతొక్కి నడుస్తుంది కూనీలు చేయిస్తుంది మరి పురాణంతిట్లు ఎట్లోతెలుసునా విను హిరణ్యకశిపుని భార్య లీలావతిని యింద్రుడు ఎత్తుకపోయి దేవలోకములో చెరపెట్టగా హిరణ్యకశిపుడు బ్రహ్మతో వరములు తీసుకొని యింటికివచ్చి విచారించి యింద్రలోకముపై దాడిచేసి దేవతల జయించి దేవేంద్రుని పట్టుకొని నిండుసభలో నిలబెట్టి తిట్టినాడు చూడు.

శా॥ ఓరీపాకవిరోధి నారమణి క్రూరోద్యోగివైపట్టితీ
వేరాగర్విణియైన కాంతయెడనా ఈభంగి నీచా దయా
దూరాజ్ఞాన విహీనయన్వయహరా దుర్జాతి దుశ్శీల నీ
వేరీతిన్భరియింతు వింకచెపుమా ఏనిచ్చశిక్షావిధుల్!

అన్నాడు నీచా దయాదూరా జ్ఞానవిహీన అన్వయహరా దుర్జాతి దుశ్శీల ఇవి ఒకతిట్లా నేనయితే పల్లెతిట్లతో పదినాళ్లునిలబెట్టి తిట్టిపించు కావ్యాల్లో పురాణాల్లో హరికథల్లో ఇట్లే ఉంటాయి తిటల్లో గల అర్థం తెలుసుకొని నీచానీచముల గమనించి చోటును తెలిసి సమయానుకూలముగా వాడుకొనక పోయిన తప్పక

తలకొస్తుంది అవమానం ప్రాప్తిస్తుంది ఇప్పటినుంచే వదాలు ఏర్పరచుకో అన్నాడు రాము,

సరోజ నవ్వుతూ తమరు నేర్చుకున్నారుగా మిమ్మలుచూచి నేర్చుకుంటాను లేండీ అన్నది.

జ్ఞానాంబ ఆశ్చర్యపడుతూ ఏమినేర్చుకొన నీకేమిపని ఉండెరా మందూ మంత్రమూ జ్ఞాపక ముంచుకున్నట్లు ఉంచుకున్నావే అన్నది.

ఔను వదినా విజ్ఞానములేని పశువులు పిల్లల ఎట్లంటే అట్లతిట్టుతారు. గాడ్డె కొడకా అంటే అమ్మగాడిదా నాయనగాడిదా రంకుముండాకొడకా అంటే తాను రంకుదయినట్లుకాదా మరిన్నీ నోటికి అడ్డములేదబ్బా చూముతగులా గత్తరతగులా పాముగరువా పెద్దపులితినా ఎక్కడవచ్చి ఉంటివి ఎక్కడ పాడైఉంటివి ఇవా ఆడవారు పిల్లల తిట్టవలసిన తిట్లు ఆడవారు కోపపడి నడిఇంట్లో పండ్లుకొరికితే ఇల్లు పాడౌతుందన్నారు ఆడవారు పండ్లుకొరకరాదు నాలుక కొరకరాదు పెదవులప్పళించరాదు పిల్లల పదేపదే కొట్టరాదు యుక్తితో శాంతముతో నేర్పుకొనవలయును. అర్థములేని తిట్లూ ప్రాణంపోయే కొట్లూ అవతల వారిగతులు తెలుసుకోలేక చేసే సేతువ ఆయన చెప్పేది నిజమే ఉండేది నిజమే నన్నది అనసూయమ్మ.

ఔను వదినా తల్లి సంస్కారములేని జీవిఅయితే పిల్లాఅంతే లేకతాను బంధువులతో మిత్రులతో సాటివారితో అని పించుకొని చీవాట్లుతిని నేర్చుకునేవరకు నెత్తివెంట్రుకలు తెల్లనౌతాయి అయ్యోపనిగాదు తల్లి పండ్రిలలోనేఉంది సంస్కార శక్తి అన్నిటకన్నా ముంచు పిల్లలదృష్టము -ఈఆసామిని తీర్చి దిద్ది దిద్ది ఉంచే ఇక్కడికి వచ్చినాడు అన్నది జ్ఞానాంబ.

నిజమేవదినా పిల్లలు పుట్టలేదని ఏడ్చినట్లుగాదు పిల్లల తీర్చిదిద్దడములో ఉంది కష్టం తీర్చని పిల్లలుచూడూ నానావిధాలచెడి నానాకష్టాలు పడుతూ వరులకు మృత్యు ప్రదమలై గ్రామానికి దేశానికి చీడపురుగులై చెడ్డపేరు తెస్తూన్నారు అన్నిటకూ తలిదండ్రిలు తీర్చడములో ఉంది మసిపాతకూడా చక్కగా వుతికితే తెల్లగౌతుంది మానవులు మంచిమార్గమునకురారా చెప్పేవారులేక చెడిపోతూ ఉన్నారన్నది అనసూయమ్మ.

సరోజ చిరునవ్వునవ్వుతూ మీరు పదిమంది పిల్లల్లో ఉండేవారు చదువు చెప్పేవారు పొరపాటుతో చదువు చెప్పబోయి తిట్లునేర్పేరు తిట్లల్లో పల్లెతిట్లు తిట్టేరు పత్నోమడు చదువులలోసార మెల్ల చదివితి తండ్రీ అన్నట్లు తిట్లల్లోగల తీర్లన్నీ ఎరింగినవారు భద్రం నీలోపల పంచప్రాణాలు ఉన్నట్లు బైటా పంచప్రాణాలు న్నాయి మీప్రాణాలు నొప్పిపడితే ఈప్రాణాలు నొప్పిపడతాయి ఈప్రాణాల నొప్పి పెట్టకండీ మీకు పుణ్యముంటుందీ అన్నది సరోజ.

బైట పంచప్రాణాలేమిటే అన్నాడు రాము.

ఔను తిట్లు నేర్చుకొనడములో వీరయిదుగురినీ మరచినారు కనిపెంచినతల్లీ కనిపెంచి యిచ్చిన అత్తా కలకాలం కనిపెట్టుకొని బ్రతికే నేనూ యిక్కడ ముగ్గురూ యిక మీమామా మా మామా యీ అయిదు ప్రాణాలకు ప్రాణం మీరుకాదా మీ అపకీర్తే వీరిఅపకీర్తి మీకీర్తే వీరికీర్తి మీబాగే వీరిబాగు మీఓగే వీరిఓగు అభ్యాసమయిన నోరు పొరపాటుతో జారుతుందని పెద్దవారు ఈలాంటివి అభ్యాసము చేసుకోరు పూర్వము వివాహాది శుభకార్యములూ యజ్ఞయాగాది క్రతువులూ చేయించే బృహస్పతులు అపరాలుచేయించను పోయేవారుగారట అపరాలుచేయించేవారు వాటెకుపోయేదిలేదట ఏదయినా మంత్రము పొరపాటురావచ్చని క్రియలు మారవచ్చని అశుభమంత్రోచ్చరణ చేసిననోరు శుభము పలికినా మేలులేదనీ వారి నమ్మకం పిల్చేవారులేరు పోయేవారుగారు అన్నీతమరు పరంలో అపరంగలిపినట్లు పొరపాటుతో పటపటా పల్లెతిట్లుతిట్టి ప్రాణానికితెచ్చేరు అన్నది వింతగానవ్వుతూ సరోజ.

నిజమేనన్నది జ్ఞానాంబ.

శహబాష్ నీతోముగ్గురు ఆడవారు ఇద్దరు మొగవారు అయితే నాతో ముగ్గురు మొగవారూ యిద్దరు ఆడవారూ అవుతారు ఈప్రాణాలన్నీ నీప్రాణంపైనే ఉన్నవి నీవుభద్రంసుమా అన్నాడు రాము.

ఆయర్థం తెలియక కొందరు ఈఅయిదుగురినీ అనాదరణచేసి ఆత్మానందమునకై అవలవైతొలగి కడకు అగ్గిపాలవుతున్నారు కొందరు ఈఅయిదుగురి ఆత్మశాంతికై తాము అవస్థలపడుతున్నారు నామంచితో మీయమ్మానాన్నా మీ మంచితో మాయమ్మానాన్నా ఆనందపడవలె ఎవరిధర్మంవారు చక్కగా నెరవేర్చుకొంటే అందరూ పుణ్యవంతులుపోయి గమ్యస్థానం చేరుకుంటాము అన్నది సరోజ.

మాటల్లో అన్నంమాట మరచినావాఏమి అన్నాడు రాము.

లేమ మరువలేదు డెబ్బైఏండ్లదాన్నై మతిమరుపులు వచ్చినాయనుకున్నారా భయమూ భక్తి లేదనుకున్నారా ఈనాడు గురువారం వచ్చి గూట్లో కూర్చున్నది జ్ఞాపకమున్నదోలేదో నావంటావార్పు చక్కగా తయారయినాయి అన్నది సరోజ.

అబ్బా అమ్మా అత్తా వచ్చిననాడే గురువారం వచ్చిందా శుద్ధవైష్ణవమూ వీరశైవమా లేక సాధారణ స్మార్తమా మూడూకాని మధ్యమా అన్నాడు రాము.

ఒక్కప్రొద్దులో ఇన్నేమిరా అన్నది జ్ఞానాంబ.

ఔను వచనము అయిన వస్తువులేకాడవు వచనముగానివి వాడవలెనని పావుమొదలుకొని అర్ధసేరువరకూ పాలూ ఇకపండ్లు తెగవున్నంతా తినగలిగినంతా రకరకాలూ ఉంటే మరీమంచిది. అటుకులూ పేలాలూ ఉన్నట్లయితే పెరుగువేసి గానీ పాలువేసిగాని కలిపి వేలుపెట్టితే అందువరకూ వెనక్కుతిరిగి చూడకుండా పటపటా పడవేస్తారు ఇదిస్మార్తం ఇంచుమించుగా వీరశైవం ఇక వైష్ణవం బియ్యము గానీ బియ్యపునూకగానీ కాస్తవెచ్చజేసి దండిగా నెయ్యి తిరగవాతవేసి ఉప్పుపిండి చేయుటో మోర్‌కళీ వెలెడెత్తు దోశవలెపోసే ఊదప్పమో వేయుటో అందులో టోమేటోను పండ్లూ రకరకాల కూరగాయలు ఉడికించినవి కలుపుతారు ఇట్లామడుగుత్తో ప్రీతిగాచేసి దేవునికి నివేదనచేసి కొంచెం చక్కెర నెయ్యితో రంగరంగా శ్రీపాండురంగాయని కావలసినంతా పట్టిమూస్తారు ఉత్తములు మధ్యమముగా నున్న వారు కూరా చారూ పచ్చడీ ఊరగాయ మొదలుకొని చిక్కినవి సమయానికి ఉన్నవీ వేసి పిసికి పాతగోడకు పూతవేసినట్లు కకారాది క్షకారపర్యంతం నవనాడులూ ఆడకుండా బిగించి రామా శ్రీరామా యని పొడుంబీల్చి కపాలం కొంచెం వెచ్చనగునట్లు అరిచేతరుద్ది ఆపాదమస్తకం అంగవస్త్రంకప్పి గోవిందరాజువలె వరుగుతారు. ఇదివీరవైష్ణవం ఇంచుమించు దానిననుసరించిన మధ్వము ఇట్లకమ్మని ఆచారం పెద్దలు నియమించినారు గాబట్టి ఒక్కప్రొద్దులు ఎక్కువయినాయి అందులో శుక్రవారం స్త్రీలు వక్కపొద్దు ఉండేవారు ఉన్నారు ఇదేమిటో తెలియదు శుక్రవారం స్త్రీ కంటనీరు పెట్టరాదు అస్తులూ పస్తులూ ఉండరాదు శిరస్నానము చేయక వుండరాదు తమలముచేసే తీరవలె పూలుపెట్టుకొనే ఉండవలె పురుషుడు వారం విచారించుకొని భార్యతో కొట్లాడవలెనన్నారు అత్తమననుండక నోరుండకా పొద్దుపోవువరకూ చేతులతీట తీరుకొరకూ కొట్లాడవలెనంటే శుక్రవారం దానితో

సమానమయిన మంగళవారం కొంచెం సమదాయించుకొని మరునాడు ఉదయమే బ్రహ్మముహూర్త కాలములోనే లకారముతో ప్రారంభించమన్నారు ఇట్లుచెప్పుతూ శుక్రవారం వక్కపొద్దు వీరవైష్ణంగానో వీరశైవంగానో ఉండూ నీకోరికలు ఫలిస్తాయి అని చెప్పే దొడ్డవారున్నారు నేనట్లకాదమ్మా వారాలు వక్కపొద్దులూ ఏకాదసులూ చక్కగా ఉంటాను ఉపవాసమంటే ఉపవాసమే పండ్లూ పాలూ మాత్రము దైవనివేదన చేస్తాను అవీ అరవళ్లకొద్దీ పాలూ డజన్లకొద్దీ పండ్లూ లేవు రెండు పండ్లూ ఒకచిన్నగ్లాసు పాలు మాత్రమే కొంచెం పంచేంద్రియాలకూ శోష వచ్చి ఉద్రిక్తంతగ్గి కృష్ణా రామా అనేటట్లుచేస్తాను మరీ నిత్యకృత్యముగా చేయు మైథున నిద్రాహారములలో ఆహారమూ మైథునమూ మాని ఈరోజంతా దైవప్రార్థన క్రింద ఉపయోగిస్తూ వీలయినంతవరకూ జ్ఞాపకముంచుకొని అపద్ధములూ అప్రయోజకములూ మాట్లాడక చేతనయినంతవరకూ మౌనమువహించి చింత శ్రీహరిపైన పెట్టి ఒరులదూషించుటా నిందించుటా మాని మంచమూ పరుపూ తాంబూలము మొదలగునవి మాని కాలయాపనా లోలత్వములగు బీడీ, సిగరేటు, పొగాకు, చుట్ట, నశ్యమూ, చేరనివ్వక భూమికీ నాకూ మధ్యలో చాపవేసుకొని పడుకుంటాను గృహ భగవతిని ఆరాధించేది. అన్నంతలో సరోజ తటాలున రాము నోరుమూసి నవ్వూ ప్రణయకోపమూ మిళితముచేసి రాము ముఖమునకేసి చూచి అదుగో పెద్ద వారున్నారనేది కూడాలేకా అన్నది సరోజ.

రాము సరోజచేతినితీసి నేనేమన్నానే ఔనా అమ్మా అన్నాడు రాము.

ఈశొంఠెపనులూ అరకూతలూ ఇంక నిన్నుండీ పోవులే ఊ కానీ అన్నది జ్ఞానాంబ అనసూయ నోటికిపైట చెరుగుఅడ్డము పెట్టుకొని సరోజ ప్రక్కచూచినది.

చూడూ అల్లుని తరహా అన్నది సరోజ.

ఊ అవతలా కానీ అన్నది జ్ఞానాంబ.

ఆ అట్లు భగవంతునీ భగవతినీ రాత్రినిద్దురవచ్చునందాకా పద్యరూపముగానో పాటరూపముగానో ధ్యానముచేస్తూ మరచినా త్యాగరాజులవారు సంగీతజ్ఞాన హీనులకు మోక్షముకలదా అన్నాడని సంగీతముతోనే ధ్యానముచేస్తాను అదీగాక శ్రవణానందమయితే చెడ్డబుద్ధికూడా చెంతకొస్తుందన్నారు అందువల్ల భక్తాదుల కథలతో కాలక్షేపము చేస్తాను కన్నుల ఆనందబాష్పాలు రెండైనా విడుస్తాను భక్తిపారవశ్య

ముతో మైమరుస్తాను ఆరాత్రి నాల్గవయామము రాగానే ప్రాణాలు లేవనుంటాయి లేచి యథావిధిగా దైవాన్ని అర్పించి తొమ్మిదిలోపలనే పాయసముతోటి నైవేద్యము చేసి రెన్నాళ్ల ఆహారము కడుపు బరువై కాళ్లు ఈసేతటంతవరకూ భార్యకొంచెం చేయూత ఇచ్చేవరకూ పట్టిస్తాను ఇదీ వక్కపొడిష్టు అమ్మా నీకోశలు నన్నిట్టు కన్నగ చొప్పూపెట్టుతూ ఉందే ఈలాంటి శాసన్గాలు శాసించినది ఇవిశిలాశాసనాలే రామ రామా చదువుకున్న పెళ్లాంవద్దే ఎదో మొద్దుపద్దమ్మ అయితే ఆడించవచ్చు పాడించ వచ్చు ఇంట్లో పారవేసి బైటటీగమువేసి సినీమాలకూ పిల్లాటకూ పేవాట్లకూ పోవచ్చు చదువుకున్న పెండ్లాం ఆశయాలపాలిటి ఆగంతుక మృత్యువే పురుషుని పాలిటి శత్రువే అన్నాడు రాము.

అత్తా అమ్మా ఏంటూవుంటే ఆనందంగా చెప్పుతూ దేవునిమాట మరచి పోతారా అన్నది సరోజ.

ఏమే రాక రాక వచ్చినారు అందులో మోసేటంత తెచ్చినారు అదీగాక కాసీతీర్థం రామేశ్వరం తీర్థం కలిసినట్లు వదినా వదినా కలిసినారు. అనేటప్పటికి ముప్వురూ నవ్వినారు. నవ్వుతా రెందుకూ, అమ్మనూ సంతోషపెట్టవలె అత్తనూ సంతోషపెట్టవలె అది నావంతూ అని సరోజప్రక్క చూచినాడు రాము. నావంతూ అంతే లేండీ చూడవద్దూ అన్నది సరోజ.

నీవు చూచేది నాకు తెలుసులేవే స్వామితో చెప్పుకుంటానులే స్వామీ నన్ను కన్నతల్లీ నా భార్యను కన్నతల్లీ మా యమ్మా మా వాళ్ళమ్మ మా యత్తా మావాళ్లత్తా ఒకేసారి వచ్చినారు ఎంతో ఆనందమయింది. మాపైనే వారిజీవితయాశయాలు పెట్టుకొని మామేలుకై ప్రాణాలర్పించేవారు. ఇంటికివస్తే మంచీ చెడ్డా మాట్లాడవలె కదా మూతిబిగించుకొని మూలన గూర్చొని మాట్లాడితే పిచ్చికుక్కలాగా రెండు మాట్లాడి వెళ్లిపోతే ఏమనుకుంటారు స్వామీ తమరూ ఒక ఇంటికి అల్లుడేకదా ఎన్నో పడి ఉంటారు. అందరికన్నా అనుభవజ్ఞులూ మీకు తెలియనిది ఏముందీ మీది సంసారమేగా అత్తనూ అమ్మనూ విడచిరాను కాళ్లాడక మాట్లాడుతూ ఉండినాను క్షమించండీ అని క్షమాపణ కోరుతాను ఆప్త బంధువులూ మిత్రులూ గృహచ్ఛిద్రములూ జబ్బులూ తిరునాళ్లు తీర్థవాసులూ ప్రయాణాలూ వచ్చినప్పుడు దినచర్యలో కొంచెము తక్కువయినా చేసినవాడవే అవుతావు నైవేద్యమూ మంగళహారతీ మాన

వద్దన్నారు అనుభవజ్ఞులు ప్రాజ్ఞులు వారిననుసరిస్తాను రెండు ముక్కచెంపలు వేసుకుంటాను దాసునితప్పుదండముతో సరియని చేతులు జోడిస్తాను తెలుసునా అన్నాడు రాము.

మాయత్తా మీయత్తా ఎక్కడాపోరు నాలుగునాళ్లు స్కూలుకు సొలవుపెట్టి బాగమాట్లాడండీ చెప్పండి వింటారువాళ్లు సివేళప్పుడు భోంచేసినారో మీకుపుణ్యముంటుందిలేవండీ అన్నది సరోజ.

స్వయంగా సంపాదించి అమ్మకూ అత్తకూ అన్నంపెట్టే మొగవానికి చెప్పవలెనా అన్నాడు రాము.

అర్థమన్నా చేసినందుకుమాకు ఉండదూ అన్నది సరోజ.

పనిచేసినవానికి పాతికా అరువులు చెప్పినవానికి అర్థం అన్నట్లు అర్థమా నీకు అన్నాడు రాము.

లేవండీ అన్నది సరోజ.

ఊఁ లేవవలసినదే అమ్మ కాంగానా వినినా వినకున్నా అగ్రహించకుండా అన్నంపెట్టను అలూ మాటవించే మావటి అనునంతలో సరోజ నోరుమూసినది. ఏమేనోరు మూస్తావు తప్పా మాటవించే మావటికి భోజనము వేస్తుంది లేకుంటే తలకు శొంఠివేసి పడుకొని అయాసపడుతూ అనీళ్లు ఇట్లతేండీ అమంచమిట్ల పట్టుక రండీ ఒకగ్లాసు షరబత్ చేసి ఇవ్వండీ నేనుబ్రతుకను బ్రతుకనంటూ నరసింహావతారమెత్తి రొప్పుతూ దానితో నిద్రపోతే అయ్యో దేవుడా అని చింతించి అన్నం లేకుంటేపోనీ ఇప్పటికైనా బ్రతికిబైటపడినాను అని తలవాల్చవేసి వస్తుంది నాకు లోకానుభవం ఉంది లేవే అన్నాడు రాము.

పెద్దవారు పెద్దగా నవ్వుచుండగా.

చూడత్తా ఇట్లావాళ్ల దగ్గర ఆడవారికి నిజంగా జబ్బువచ్చినా చావే అని రామునుచూచి మీకు కడుపునొప్పి రావడములేదూ మాకు తెలియదా అన్నది సరోజ.

బైట బ్రష్టముండలతోవుండి రాత్రి భోజనానంతరం కడుపునొప్పులూ కాళ్లనొప్పులూ తలనొప్పులూ వచ్చి కంటారా నిద్రపోయే కపట సన్యాసులకథ చెప్పుతావులేవే అన్నాడు రాము.

పాప పుణ్య విచక్షణా పారమార్థిక చింతాలేని పావులకథకాదూ తమరు చెప్పేది అన్నది సరోజ.

అదిగో సరికాకం పట్టినావు భారతం ఎత్తినావు అంటూ లేచిపోయినాడు రాము.

ఇద్దరూ సరిపోయినారు అన్నది అనసూయమ్మ.

ఔను నేర్పూ ఓర్పు వుండవలె స్త్రీకి లేకుంటే సంసారం చక్కగా సాగదు అన్నది జ్ఞానాంబ.

రాము దేవుని పూజ కొంచెములో ముగించి నైవేద్యముపెట్టి మంగళహారతి ఇచ్చినాడు.

సరోజ అత్తనూ అమ్మనూ పిల్చినది.

రాము అమ్మకూ అత్తకు తీర్థప్రసాదము లిచ్చినాడు.

దేవునికీ అత్తకూ అమ్మకూ భర్తకూ నమస్కరించి చేయిపట్టినది సరోజ.

తీర్థప్రసాదము లిచ్చినాడు రాము.

అనసూయమ్మా జ్ఞానాంబ వారి కాపురమూ వద్దికా దైవపూజా మాటలూ చూచి సంతోషపడి జ్ఞానాంబ రామునుచూచి ఒరే నాయనా ఎంత మారిపోయినావురా అమ్మ చెప్పినావినని మాటలు ఆలుచెప్పితే వింటారన్నది. వాస్తవమే అవు చంటిలో అరవై పదార్థాలు ఉన్నాయన్నట్లు ఇల్లాలులో అమృతం ఉన్నదిరా మీ నాన్నను నేనెట్ల మార్చితినో నిన్నట్ల సరోజ మార్చినదిరా వదినా నీకు మహాసోమరి చెప్పితే వినేవాడుకాదు ఆమెవల్ల ఎంతమార్పు చెందినాడో నాకు తెలును పురుషునికి స్త్రీ అంగరక్ష. స్త్రీలో శక్తిలేకున్న వాని ఇహ పరములు రెండూ చెడును చూడూ నీవల్ల చక్కగా సంస్కారమయిన పిల్లగాబట్టి తన జీవితమూ భర్త జీవితమూ బాగు పరచు కున్నది ఇంక మావంశము పావనమైనక్షేమమ్మా నాకు ఏలాటి కష్టములూ లేకుండా సర్వవిషయములూనేర్పి పంపినావు నాజీవితము ధన్యమయినది సావిత్రి వలె పుట్టినింటినీ మెట్టినింటినీ అభివృద్ధికి తేగలదు ప్రకాశింపగలదు అన్నీ విన్నాను కన్నాను అన్నది జ్ఞానాంబ.

అన్నిటికూ పూర్వపుణ్యము ఉండవలె వదినా పూర్వపుణ్య ఫలములేక ఏసుఖమూ దొరుకదు అయన పూర్వపుణ్యము ఆమె ఆమె పూర్వపుణ్యము అయన ఇరువురి పుణ్యమూ ఫలించినవి. రెండూ పలించినప్పుడే ఆనందము వారితో

మనమూ పుణ్యము చేసినవారమే కన్నబిడ్డలకొరకై కన్నీరు విడక ఆనంద బాష్పములు విడువవలెనంటే సామాన్యమా మనమూ పుణ్యము చేసినవారమే నన్నది అనసూయమ్మ.

అంతలో విస్తళ్లువేసి ఉప్పూ ఊరుగాయా వడ్డించినది సరోజ.

ముప్పురూ కూర్చొన్నారు.

రాము ముఖముచూస్తూ మీకూ అన్నది సరోజ.

మీకూ నాకూ ఏమి దేవునికి చెప్పుకున్నాలేవే ఈనాడు అమ్మా అత్తా వచ్చినారు వైష్ణవాచారమవలంభించి అందులోమధ్యముల నడకనడుస్తాను అందులో పిండికూర అంటేనాకు ప్రీతిస్వామీ అకూరచేసినట్లుంది వాసనవస్తూఉంది స్వామితో చెప్పుకున్నాను తేవే అన్నం మినహా అన్నీవడ్డించు అన్నాడు రాము.

సరోజ చిరునవ్వు నవ్వుతూ సరేనని పెరుగుపచ్చడి పిండికూర ఒకవడా అప్పళాలూ నడియాలూ వడ్డించి అన్నము అమ్మకూ అత్తకూపెట్టి ఉప్పుపిండి రాముకుపెట్టి నెయ్యీ కాకరకాయ పులుసువేసినది సరోజ.

భోంచేస్తూ జ్ఞానాంబ ఈపొడికూర బాగున్నది ఎట్లచేసిరావే అన్నది.

ఏమి చేసినాను అత్తా మీరుచేసినట్లే చేసినాను శనిగబేడలూ కందిబేడలు ఊరవేసి ఊరినతమవరి పచ్చిమిరపకాయలూ ధనియాలూ పచ్చికొబ్బెరా ఉప్పువేసి మధ్యరకముగా రుబ్బి నెయ్యి కొంచెము ఎక్కువగా తిరుగవోతవేసి కొంతపిండీ ఉడికించి పొడిచేసిన ఉర్లగడ్డలూ తిరుగవోతలోవేసి పిండిఉడికి పొడియగు నంతవరకూ కలియబెట్టి దించినాను మిగిలించినపిండి నాలుగు వడలుతట్టి నూనెలోవేసి ఎత్తినాను ఇదిదేహబలమనీ ధాతుపుష్టియనీ వీర్యవృద్ధియనీ పొగడుతుంటారు మీ కొమారుడు అన్నది సరోజ.

అమ్మా ఈకూర నామిత్రుని ఇంటిలో తినివచ్చినాను అబ్బా ఏమి చెప్పుదులే బ్రహ్మలోకం పొలిమేరవరకూ పోయి వచ్చినానే అన్నాడు రాము.

నీవు ఏలోకమయినా పోయి వచ్చివుంటావులే నీసంగతి చెప్పవలెనా అన్నది జ్ఞానాంబ.

లేదులే అత్తా ఇందులో యెఱ్ఱగడ్డలు ఉడికినవో వేయించినవో కలిపినారట బాగుండినవట అదిపొగడుతూ నన్ను చేయమన్నాడు నేను ఎఱ్ఱగడ్డలు ఉష్ణము వద్దన్నాను సర్వత్రా అతివర్జయేత్ అనుశాస్త్రాన్ను గుణ్యముగా ఎఱ్ఱగడ్డలూ తెల్లగడ్డలూ ఎక్కువ అవాలూ ఎక్కువ ఇంగువా మునగాకూ మునక్కాయలు ఉష్ణమనీ ముల్లంగి వాసననీ సొరకాయా, బీరకాయ నేతిబీరకాయ చలవనీ ఏడచినారు. ఉష్ణము ఎక్కువై దేహము చెడుతుందంటాను అప్పుడప్పుడూ ఈలాంటివి లేకదీస్తూ ఉంటారు వస్తుగుణతత్వంతెలిసీ వాదిస్తారు అత్తా అన్నది సరోజ.

అతిగా ఉష్ణమున్న పదార్థములు తాను సాహారములనీ తామసము గలిగిస్తాయని పెద్దవారు వదలి ఆచారముక్రింద అమర్చినావా అవి యెందుకురా అన్నది జ్ఞానాంబ.

తామసాహారమయినా యెఱ్ఱగడ్డలు బిదలపాలిటి అమృతమమ్మా అవిలేకుంటే వారు చాలాచిక్కున పడతారు. ఏదిలేకున్నా పాపం అదివుంటే ఆహారం లోపల పంపుతారు బ్రతుకుతారు అన్నాడు రాము.

వంట చక్కగా చేసినావుకదే అమ్మా బాల్యమయినా నలభైవేండ్ల మనిషిలాగా నానారంగులా తయారైనావేతల్లీ అయినా జ్ఞాపకశక్తిగలిగి ఓర్పూ నేర్పూ గలిగితే ఇదెంతపనిలే అంటూ భోంచేసి చేయికడుక్కున్నారు.

సరోజ భోంచేసి చేయికడుక్కొని వంటగదిలో సవరించి తాంబూలం ఎత్తుకొని మధ్యహాలులోకివచ్చి తాంబూలం అంటూ అమ్మకు అత్తకూ మధ్యలో తట్టపెట్టి తానూకూర్చున్నది.

ముగ్గురూ కలసి తాంబూలం చేయుచుండగా రాము వేరుగదినుండీ వచ్చి అమ్మకెదురుగా కూర్చొని అమ్మా మరచినాను ఏడువిడచి ఏడుకూడమని అన్నావే అవేమిటో అర్థంకాలేదు కొంచెమట్లనూ విందాం అన్నాడు రాము.

జ్ఞానాంబ ఆకు వేసుకొంటూ పోరా అర్థమయ్యా అదేదో చేయడానికై వచ్చినావు నాకు తెలుసుపో అన్నది.

లేదే అమ్మా నాకు తెలియదూ హాస్యగాడు బావిలో పడినట్లుంటుంది నాకథ చెప్పవే విందాం అని బలవంతంచేయ సాగినాడు రాము.

అత్తా కొడుకు సంగతి తెలుసునే తలచినాడా తనకోర్కె తీరువరకూ మాట వెగ్గువరకూ తారుమారు శాస్త్రిలనే చేస్తాడు అదేదో చెప్పు అంతవరకూ పోడు పొమ్మంటే పోయేటట్లూ వుండమంటే వుండేటట్లూ కూర్చోమంటే కూర్చుండేటట్లూ బాల్యమునుంచీ నేర్పివుంటేకదా ఒకడే కొడుకని ముద్దుగా పెట్టుకున్నావు పెద్దైనా వద్దనే కూర్చుంటా నంటాడు కాళ్లవెంబడీ తిరుగుతాడు కటకట చేస్తాడు అపట్టుదల ఏదోతీర్చు అన్నది నవ్వుతూ సరోజ.

అదుగో శాస్త్రిలూ అనుభవాలూ కలిపి పుల్లగూర చేయడానికి తయారయిందే రాము డిట్టుండాడు అత్మారాముడు వెలువడితే అప్పుడు అమ్మి బొమ్మయ్యేది కానీవే అన్నాడు రాము.

ముగ్గురూ నవ్వుతూవుండి అందులో జ్ఞానాంబ అదే తెలియలేదేమిరా బడి పంతులయినావే అన్నది.

అమ్మా మీచదువు పరానికీ మాచదువు ఇహానికీ మాదిభౌతికం మీది అధ్యాత్మికం మాదీమీదీ కలిపి పిల్లలతయారుచేస్తే ఇహమూ పరమూ ఉంటాయి ఇప్పుడట్ల లేదే ఇహం ఇహమే పరం పరమే రెండూ కల్పిచెప్పకనే ప్రజలు బండైపోతుండేది లంచాలూ మోసాలూ దగాలూ దొంగతనాలూ దోపిడీలు దౌర్జన్యాలూ పెరిగింది పరం సంగతులు పాఠాల్లో వుండవు ఉండకనే సోమరితనం వచ్చిందీ చెడ్డతనం హెచ్చిందీ గర్వం మితిమీరిందీ అట్లలేకుంటే ఇక్కడివారు యిక్కడే అక్కడివారు అక్కడే ఉండి పోతారు ఇక్కడనుంచీ అక్కడపోవలె అక్కడనుంచీ యిక్కడ రావలె అక్కడనుంచీ వచ్చినవారే శ్రీమంతులూ గుణవంతులూ విద్యాధికులూ వారి జాతకములేవేరు అమర్మం జోస్యులకు తెలుసు వారినడకేవేరు అక్కడివారు ఇక్కడవస్తేనే తమాషా వారిబుద్ధులేవేరు వారినడకేవేరు వారిఆశలేవేరు ప్రజారక్షకులై కొందరూ ధర్మసంస్థాపకులై మరికొందరూ ఒకటననేల వారినడకేవేరు నిజంగా వారివేసుఖాలు వారివేమాటలు వారివేఆటలు ఇక్కడివారు ఇక్కడే ఉంటే ఇంతే మైథున నిద్రాహారములకై కటకటపడే అశాంతహృదయాలూ నిర్దయులూ ఇంతెందుకు ఇక్కడ భారతావనినుండీ పాశ్చాత్య దేశాలకువెళ్లి చదివివస్తే ఎంతో విలువవుంది ఇహదేవ లోకాన్నుంచీవస్తే విలువ అడుగుతావా ఈగొడవ అట్లుండనీ అమాటలకు అర్థంచెప్పమ్మా అత్తా వింటుంది కోడలూ నేర్చుకుంటుంది. ఉత్త వేంచేసే

లోపల ఇంటి నెత్తం కోడలికి అంతాలేకపోయినా ఇంతో అంతో మంచో చెడ్డోచెప్పి పోవలెగా ఉో కానీ అన్నాడు రాము.

రాము నవ్వీపున సరోజ రుద్దుతూ అత్తా కుమారుని గాయమయ్యేటట్లు కొట్టినావే ఏమి తులువచేసినాడూ అన్నది నవ్వుతూ.

ఆగాయం చూచిచెప్పుతున్నావా బాల్యములో బహుతులువ ఒకచోట ఉండే వాడుకాదు నేను పొయిలో నిప్పులను ఎత్తి బొగ్గులపోయిలో పోయడములో ఒక పెద్దనిప్పు క్రింద పడిఉండినది నేనుచూడలేదు ఏడుబయటినుంచీ తప్పటడుగులు వేసుకుంటూవచ్చి ఎట్లపడినాడో ఏపుపాటుకుపడి అరచినాడు నేనుదొడ్డిలోనుంచీ పరుగెత్తుకొనివచ్చి ఎత్తిచూడగా పెద్దబొబ్బ పోయినది అంతలో మీమామ వచ్చి చూచి నాల్గు ఆశీర్వచనాలు ఆశీర్వదించి వెనుదిరిగే టప్పటికి ఎదురింటి ఆయుర్వేద వైద్యుడొకాయనవచ్చి ఈసంగతివిని చూచి వెన్న తెమ్మని వెలిగారభస్మమువేసి కలిపి ఆ కాలినచోట పట్టించినాడు అరగంటలోపల చల్లబడి నిద్రపోయినాడు వారములోపల బొబ్బచితికి గాయము మాయమై పోయినది. అప్పటినుంచీ ఆవైద్యు నడిగి తెలుసుకొని ఆమందును తయారుచేసి అందరికీపెట్టు తుంటాను కాలినా కురుపులు లేచినా దెబ్బలు తగిలినా తీటా, గజ్జి, నుస్మిరి, ఉరిగజ్జి, పొడా, గండ మాలలూ, మలలూ, చిన్నపిల్లలకు నెత్తిలోలేయు కరపాణీ (కురుపులు) కాళ్లకులేచు కురుపులూ కాళ్లవ్రేళ్ల సందునలేచు కురుపులూ కాళ్ల పగుళ్లు పేనుగొరుగు చోట్లకు చెవునొప్పులకు ఎప్పుడూ బీదలు వస్తూనే ఉంటారు పెట్టుతూ సలహా ఇస్తూనే ఉంటాను పుణ్యముంటుంది చేసి బీదలకు పెట్టుతుండమని మీమామ ఒకే ఆజ్ఞ చేసినాడు అన్నది జ్ఞానాంబ.

చేసుకునే విధము కోడలికి చెప్పిపోమ్మా మాఇంటి కెదురుగా వైద్యుడులేడు నీకొడుకు తులువైనప్పుడు మనవడెందుకు కాడూ నాకు గుర్తువున్నప్పుడు వానికి లేకుండా ఎందుకు పోతుందీ అందులో ఇంటి నెత్తం లేకుంటేఎట్ల మీయత్త బీదలకు మందులుఇస్తూ ఉండెను. నీవునేర్చుకో లేదేమమ్మా అనబోతారు చెప్పు నేర్చుకోవే పిల్లవు తల్లివిగాబోతున్నావు ఏదిరాకపోయినా చేతగాకపోయినా పిల్లల తల్లివైనావే బుద్ధిలేదూ బుద్ధిరాలేదూ అనబోతారు. పిల్లలతల్లి అయ్యేవేళకు పదివిషయాలూ పరోప కారాలూ సంఘమర్యాదలూ సాలూమూలా తెలిసి ఉంటేనే మంచిది అందులో

పరమతులువ ఉంటాడు నీకడుపులో సవరించి సాలుకుత్రిప్పి చక్కచేయవద్దూ అని రాము అనేటప్పటికి ముగ్గురూ నవ్వినారు.

సరోజ జ్ఞానాంబను చూచి చూడత్తా కొడుకెంత సిగ్గులేనివాడో పెద్దవారున్నారేయని జంకూ గొంకూ సిగ్గూ ఎగ్గూ ఏమైనా ఉన్నదేమో అని ప్రణయకోపము ముఖములో ముద్దులొలుకు చిరునవ్వు మిశ్రమముచేసి వాడచూపుతో రామును చూచినది.

ఎందుకే అట్లచూస్తావూ మనిషి మశైపోయేటట్లు పొడిచే ఎద్దు చూచేటట్లు అమ్మదగ్గరా అత్తదగ్గరా అలిదగ్గరా సిగ్గూ బిడియమూ ఉంటే కుదురుతుందా కోర్కెలుతీరుతుందా అమ్మనడిగి పెట్టించుకోవలె అత్తనడిగి ఇప్పించుకోవలె అలినడిగి ఆనందాలవర్షం కురిపించుకోవలె ఈముగ్వురిదగ్గరా మెప్పులేనిది పప్పుఉడకదన్నారు. చనువులేకున్నా మంచిగాకున్నా మగవానికి సుఖము లేదన్నారు. బాగా చదువు నేర్చుకున్నానే అన్నాడు రాము.

బాగా చదువునేర్పించి నావత్తా ఏగాలికి అచావ బాగఎత్తగలరు పోనీలే ఈ గొడవ ముంధు మందుచేయు విధము చెప్పు అత్తా అన్నది సరోజ.

ఏమున్నదమ్మా కొందరు వైద్యులు వెలిగారము కలిత్తోనూరి బిళ్లచేసి మూకుళ్లలోపెట్టి శీలుచేసి ఇరవై ముప్పై పిడకల్లోపల పుటంపెట్టి సాంగశీతలానతీసి తిరిగీ బాగానూరి సీసాకు ఎత్తుకుంటారు. నేనుఅట్లలేమ వెలిగారము నున్నగానూరి ఇనప బాణలి (గోలము) శిలుము లేకుండా బాగాకడిగి దానిలో వెలిగారం పోడివేసి పొయిమీదబెట్టి కడ్డీతో బాగాత్రిప్పుతూ వచ్చిన పొడిఅంతా బొరుగులవలె పేలుతుంది. అంతా పేలినదీలేనిదీ గమనించి దించి నున్నగానూరి ఒకగిన్నెకు పతలాటి గుడ్డకట్టి ఆగుడ్డపై నూరినపొడివేసి చేతరుద్దు చుండిన గిన్నెలోపలికి నున్నని పొడి దిగును అదిచాలా సున్నగుండును. దీనినివైద్యులు వస్త్రగాలిత మంటారు ఆపొడి ఒకసీసాలోకి ఎత్తిపెట్టుకొని ఉండి వెన్నా, నెయ్యా, వ్యాస్‌లయిన్, కొబ్బెరనూనె నూగులనూనెలోవేసి వ్యాధి బలానుగుణ్యముగా కలిపి పూయుచుండిన నేనుచెప్పిన వ్యాధులన్నీ పోవును. ప్రతిఇంటిలోనా ఉండతగినది వేరేమందులు కొననక్కరలేదు అర్ధణా వెలిగారమయితే అరవై బొక్కల మాన్పగలదు సులభమయినది కాలినదానికి వెన్నలోగానీ వ్యాస్‌లయిన్‌లోకాని కలిపిపూస్తే పదహైదు నిమిషాల్లో

మంట తగ్గిపోతుంది. స్త్రీలకు ముఖ్యమయినది మొలలు గలవారు నిత్యమూ ఉదయ సాయంత్రముల ఎడమచేతి మధ్యవ్రేలికి కొంచెము మందుతీసుకొని గుదస్థానము లోపలిభాగములో మొలలకు తగులునట్లు పూయుచుండిన నయమగును బాధా నివృత్తియగును. తెగినవాటికి వస్త్రపావపోసి గుడ్డ కట్టిన ఒకకట్టుతోనే ఎండిపోవును పిల్లలపాలిటి ధన్వంతరి యనదగ్గు ఉష్ణాధిక్యముతో పాడిపగ్గు ఉంచిన గురిగింజ ప్రమాణము తేనెతోకలిపి తీసుకున్న నాలుగు పూటల్లో నయమగును రోగబలానుగుణ్యముగా మోతాదు హెచ్చించైనను వయసుతోను ఇదేవిధముగా పటికని పొడిచేసి మట్టిమూకుడులో పోసివేసి పొయిమీద పెట్టి వేయుచు పుల్లతో కలియబెట్టుచూ పేల్చిగాని ఇదినిర్ధై కడకు పేలును) అగ్నిపైపెట్టి పేల్చిగాని చక్కగానూరి సీసాలో పెట్టుకొని ఉంచి చనుపాలలోగాని పన్నీరులోగాని బియ్యపుగింజ ప్రమాణముకలిపి వేయుచుండిన కంటికి తిమ్మర్లు, కుట్లు, పొరలు, ఎరుపులు, చీకట్లూ, వాపులు, నయమగును. సన్నపిల్లలకుకూడా పనికివచ్చును కంటిజబ్బు వచ్చినవారు జబ్బుబాగా నయమగువరకు శిరస్నానము చేయరాదు సన్నపిల్లలచేయించరాదు కన్నులకేకాక పడిసెముపట్టినప్పుడుకూడా పిల్లలగాని పెద్దలుగాని శిరస్నానము చేయుటమంచిదిగాదు. అట్లుచేయించినా చేసినా దగ్గుఎక్కువై జ్వరమున మేర్పడును. జన్మిపుట్టి కొందరుపిల్లలు దెబ్బతిందురు పడిసెము పోకచాలా కాలము బాధించును. ఇదికాక సన్నపిల్లలకు పడిసెమూ దేమలా మూత్రము ఎక్కువ పోయుటా లేక రాకపోవుట భేదిగాకపోవుట తటస్థపడుచుండును. ఈవిషయముల చక్కగా గమనించి చూచు చుండవలయును. ఇదితల్లి పాలనలోవున్నది. ప్రవర్తులు ఎక్కువయిన సమానమునకు తెచ్చుటకూ కాకపోయిన అవునట్లు చేయుటకూ ఈ ఓషధులు రెండూ పిల్లల తల్లులవద్ద ఉండి తీరవలయును. మందు ప్రమాణము బాగా గమనించుకొని ఉండవలయును. స్నానము చేయించి నపుడు చెవులలో బాగా తుడుచు చుండవలయును. చెవులలో నీళ్లుపోయి పేలి [గూబ నొప్పిగలిగి] చీము గారు విధమయి చెవులు దెబ్బతిన్నవారున్నారు. ఇది తల్లి బుద్ధిలోపము చెవులలోకి నీళ్లు పోకుండా జాగ్రత్తగా మూచుకొనుటగాని చెవులలో ప్రత్తి పెట్టి నీళ్లుపోయుటగాని మంచిది. అట్లుపేలి చీముగారుచుండిన వెలిగారా భస్మము కొంచెము నూగుల నూనెలోవేసి వెచ్చచేసి చల్లగయిన తరువాత చెవులోపోసి కొంచెముసేపు పత్తి పెట్టి తీసివేసేది మరునాడు చెవులో ఉన్ననూనెజిడ్డును గుడ్డవత్తితోగాని మెలుకువగఉన్న పుల్లకు దూదిచుట్టిని తీసివేసి తిరిగివేసేది ఇట్లు అయిదారుపూటలు వేసిన చీముగారుట

నిల్చిపోవును. పండుజిల్లేడి ఆకుతెచ్చి బాగాతుడిచి నిప్పులపై సెగతో వాడునట్లుచేసి నల్చి రసము రెండుతొటుకులు పిండుకొని రసములో కొంచెము భస్మమువేసిచెవులో వేసిన రెండు మూడు పూటల్లోచీము ఆగిపోవును. పోటువెంటనే నిల్చును ఈమందులకై బీదలు అనేకులు ఉదయ సాయంత్రముల వస్తూనే ఉంటారు ఈమందులు తయారుచేసి పెట్టుకో బీదా సాదకుఇస్తే పుణ్యముంటుంది మనకూ ఉపయోగముంటుంది అన్నది జ్ఞానాంబ.

అంతా చదివినావే అమ్మా కోడలి తలకాయ పెద్దది వింటేసరి తలలో ఇమిడిపోయినట్లే అన్నీ ఒకతలలో ఇమిడేది కష్టమని బ్రహ్మకు నాల్గుతలలు పుట్టించినాడు భగవంతుడు ఆనాల్గు తలల్లోగలవన్నీ ఒకతలలోనే ఇముడ్చుకొన్నది కోడలు ఇంక విడుస్తుందా తయారు చేసేదినిజం ఈవీధిలో అందరికీవద్దన్నా పట్టించేదినిజం కానీ వెలిగారానికీ పటికికీ వచ్చింది గిరాకీ అన్నాడు రాము.

పోని మాటలకేమిలేవే చేసిపెట్టూ రేపు పిల్లలు ఆడపడీ ఊడపడీవస్తే పొయి కాడ ఉండేవారికి పొరపాటుతో కాలినా డాక్టర్ల దగ్గరకు పరుగెత్తుక పోతావా ఇల్లాలు కొంచెము ఓపికబట్టి స్వయముగా కొన్నిపనులు నెరవేర్చుకొన వలయును. ఒరులకు సాయము చేయవలయును. ఇదిమానవధర్మము పశుపక్షి క్రిమి కీటకములు ఒకటికి ఒకటి సహాయముచేసి పుణ్యము సంపాదింపలేవు మానవులు చేయగల్గి చేతనయీ చేసి సంపాదించక పాపులై మరుజన్మకు మానవత్వమురాక పశుత్వమువచ్చి పరిపరివిధాల కష్టములనుభవించు చున్నారు చూచి పొరబడుటెందుకు పుణ్యము సంపాదించుకోతల్లీ అన్నది జ్ఞానాంబ.

అమ్మా మాటల సందడిలో మరచినాను. ఏడువిడచి ఏడుకూడి బ్రతుకమన్నావే అవేవో కొంచెమట్లనూ విందాము కానీ అన్నాడు రాము.

ఆ చదువు కొంచెమయినా తెలియక విద్యాబోధకుడ వెట్లయినావురా నీదగ్గర తయారయిన పిల్లలకెంత బుద్ధిఉంటుంది. అందుకే అదుపూ ఆజ్ఞాలేక మానవజన్మకున్న ధర్మమన్నాలేవో తెలియక కనిపెంచిన తలిదండ్రుల మూఢపశువులనీ ఇంగిత జ్ఞానములేని జంతువులనీ జ్ఞానహీనులై లెక్కపెట్టక ధర్మవ్యతిరిక్తులై తిరిగేది దగ్గర సంబంధం ధర్మబద్ధం బీదలనీ రూపహీనమనీ బంధుమర్యాదను విడచి ఆపిల్లను విడచి పెట్టితే మరుజన్మకు నీకూఅంతే అవుతుంది. వారివిడ్చుకన్నా ఘిన్నగా

ఏడ్వవలసి వస్తుంది నీవు చదివినచదువుకన్నా మర్యాదవుంచి నీతికినిలు అన్నిపిధాల నీకు తగ్గగుటచేత నిన్ను ప్రేమించి నీచెప్పుచేతల్లో నిలుస్తుంది ప్రేమిస్తుంది. ధర్మంమిగిలి కర్మం నశిస్తుంది అనాధను రూపహీనను రక్షించిన పుణ్యం మరు జన్మకు ప్రాప్తిస్తుంది కష్టసమయాల్లో చేయిఇచ్చినవాడే ఆప్తబంధువు బంధుత్యాగము చేసుకోరాదు. అట్టివారికి మరుజన్మకు పశుపక్షి క్రిమికీటకాదులకు బంధువులులేనట్లు నాయను బంధువేలేక ఏకాకినై ఏడ్వవలసి వస్తుంది మా మాటవిని ఆపెండ్లిచేసుకో నాయనా అంటే అదినాఇష్టం మీరు నాప్రేమకు అడ్డురాకూడదు. మరుజన్మముందని బోధించే బుద్ధిహీనుల మాటవిని మీమతి కరుడుగట్టిపోయినది నాజీవితమంతాచేరుస్తా మనుకున్నారా. చదువుకున్నవారిదగ్గర ఈపప్పుడకదు అని అక్కడిస్నేత యారైన పిల్లనొకదాన్ని చేసుకొని ప్రేమవివాహము పోయి కడకు ప్రేతవివాహమై ఎటు పోవుటకు ఏమిచేయుటకూలేక కుమిలి కుమిలి ఇజిగి చచ్చుటో పడిబడి పోవుటో ఛిద్రాలతో చిత్తముచెడి దేశాంతరగతు డగుటో తలకు పట్టువేసుకొని ఏడ్చుతూ మాతృ పితృ దూషణలతో పాడైపోవుటో జరుగును. తలిదండ్రుల శుక్లశోణితము లతోపుట్టి వారికష్టధనముతో పెరిగి ఇంతో అంతోచదివి సర్వజ్ఞుడనని గర్వించి కడకు నాయిష్టమనే బుద్ధిహీనులు అంమకే తయారయ్యేది. తలిదండ్రులతో సేవ చేయించుకునేది తలిదండ్రులకు తెలుపక స్వయముగా ఒకకన్యను ప్రేమించి హామీ యివ్వరాదు యిచ్చి యిరువురిమధ్యా పరాభవమూ ప్రాణహాని పాపము తెచ్చుకొన రాదు మాతృ పితృ సోదర సోదరీ బంధుమిత్ర దూషణాద్వేషం కడకుత్యాగం కలుగుతుంది. ధర్మం విరుగుతుంది కర్మం పెరుగుతుంది జన్మం శోకసాగర మౌతుంది. అనే చదువు కొంచెమయినా చెప్పి ఉంపేకదా బుద్ధివచ్చిరానివారు బుద్ధిగరిపితేగాని ధర్మభద్ధులుగారు తప్పించుకొని తిరుగలేరు పాపమిదీ పుణ్యమిదీ ధర్మమిదీ అధర్మమిదీయని తెలిపితేగాని భావికాలాన్ని భద్రముగా దాటలేరు భౌతిక జ్ఞానములో ఆధ్యాత్మికము కొంచెమయినా మిళితములేకున్న ఉప్పులేని పప్పువలె జీవితము వ్యర్థమవుతుంది అన్నది జ్ఞానాంబ.

అమ్మా ఈ చదువు నాకు బాల్యములో నీవుచెప్పిఉండక పోయిన నేనూ అట్లే అయిపోయేవాణ్ణే ప్రేమలేఖలూ పెండ్లి జాబులూ గిలిగింతలూ కౌగిలింతలూ చేసైగలూ చెరుగుసైగలూ కంటి తళ్కులూ వంటి బెళ్కులూ తలత్రిప్పడం జడతో

ప్రేమతెల్పడం రెప్పలార్చడం చెప్ప నలవిగాదులే నన్నూ నాచదువునూ నలిచేసి నారే అబ్బా ఎవరికని జబాబిత్తు యివివడలేక మనసును నిలకడచేయలేక నీమాటలు మరుపురాక వద్దురా దైవమాఅని వంచిన తల ఎత్తకుండా వారిజిత్తులమారి సైగల చూడకుండా మర్మగర్భితమయిన మాటలు వినకుండా గదినుంచీ బడికి బడినుంచీ గదికి చేరేవాణ్ణి యిదిచూచి నాకు బెమరుజింకా అని పేరుపెట్టినారే అమ్మా అన్నాడు రాము.

అయ్యో పాపం అత్తా నమ్మవద్దు ఈ యిట్టి అ జింకలమందకు నాయకత్వం వహించి రాజ్యాలూ మదన సామ్రాజ్యాలూవీలి ఉంటారు. అమ్మా అత్తానమ్మవలె నని పైగా భార్యభర్తశీలసంపదకు ఏకపత్నీ వ్రతానికీ మెచ్చుకోవలెననీ అంతానిజం చెప్పుతున్నారు అన్నది నవ్వుతూ సరోజ.

ఛా అమాటంటావేమే బ్రహ్మచర్యములో అంజనేయులకు తమ్ముణ్ణి అసిద్ధాంతములో అగ్రగణ్యుణ్ణి అమ్మమాటలూ ఆచార్యులమాటలూ వినకున్నా ఆచరణలో ఉంచకున్నా అంతపనీ అయిఉండేదే జరిగిఉండేదే అమ్మవేసిన రోడ్డు సిమెంట్‌రోడ్డు చిందరవందరకాదు చీలిపోదు అదినాయదృష్టం జరిగివుంటే ముందు ముచ్చట్లు వెనుకచప్పట్లు తెలిసితే కొట్లాట్లు వీధివీధికీ జాకట్లు జీవితంలో అగచాట్లు వీధిలో తలఎత్తితే వల్లెతిట్లూ దానికి నోరెత్తితే సిగపట్లు అయ్యేవేగాని దారితప్పించింది ఆచార్యులమాటలూ అమ్మమాటలూ దారతో బ్రహ్మచర్యం విడచి గృహస్థునయి నాను యింక ఆదాగుడు బూచులన్నీ యిక్కడే వుంటాయి వారిమాటేల అమ్మా అసలుకథ మరచిపోతిమి కానీ అన్నాడు రాము.

అదెందుకూ కానివ్వండీ మధ్యమధ్యా పానీయం సమర్పయామీ అని ఏవో చెప్పుతుంటారుగా అదెక్కడయ్యేది అన్నది సరోజ.

దీనికి మూలంనీవే మొదలుకదిలిస్తే కొమ్మలూగవా అమ్మాకానీ అన్నాడు రాము.

ఏమి కానీరా నీవు విడుచునట్లులేదే ఏడు అనగా సప్తవ్యసనములు అందులో మూడు ఘోరమయినవి యివిమరగినవాడు ముందుకురాడు చింతనుండీ బయిటపడడు మొదటిది తమకము స్త్రీలపై వ్యామోహము దీనికి మునులుకూడా! దాసోహ

మన్నారు. దీనిని జయించుట మహాకష్టము దీనిలో తనామనా తెలుసుకొని ఒరులకు అపకృతిచేయక బ్రతుకమన్నారు. తమకము విడచినట్లుగామ అందులోగల దుఃఖమునూ విపత్తునూ అవమానమునూ పాపమునూ తెలుసుకొనమన్నారు. అన్యస్త్రీ సంపర్కమువల్ల పాపమెట్లు గలుగునో మనసారా యోచించ మన్నారు నీవు నీ బ్రహ్మచర్యము నాశనము చేసుకొనుట వివాహమై వుండిన నీదేహమును భార్యకు దానముగా ధారబోసిన ప్రమాణము నాశమునొందించుట అధర్మరూపముగా ఒరుల సొత్తును అపహరించుట అధర్మమని తెలుసుకొనని చెడిపెత్తోకకాకుట సాటి పురుషునికి పరాభవము గలిగించుట దాని తలిదండ్రులకూ వాని తలిదండ్రులకు అన్నతమ్ములకూ అక్కచెల్లెండ్రకూ అవమానము గలిగించి వారిని దుఃఖములో ముంచుట యింటిలో భార్యను దుఃఖపెట్టి లోకువగుట భార్య తలిదండ్రుల చింతలో దించుట ఆత్మీయులైకీర్త్యపకీర్తుల పంచుకొని తన్నేనమ్ముకొన్న తలిదండ్రుల ఆలోచనా శోకములలోనణగ ద్రొక్కుట వమగురి సహపాఠులలో హేళనకు వచ్చుట సంఘములోనిల్చి ధర్మమిట్టిదని చెప్పలేక పోవుట సమయ మెప్పుడో సందు ఎప్పుడోనని తదేక చింతతో కుళ్లిపోవుట కట్టుకున్న దానిగోడు కట్టుకొనుట కొట్టుకొనుట రచ్చకెక్కుటా చిత్రగుప్తుని చిట్టాలో దాఖలవుట ముందుజన్మకు చేసినది. బోసేయుట అప్పుతీర్చుకొనుట ఈఅందరిశోకము పరాభవ చింతా కోపమువల గలుగు పరితాపము ఏకమై రాబోవు జన్మలో కడవలకొద్దీ కన్నీరువిడచి చావసిద్ధమగుటో పరాభవాన్ని భరించలేక పలాయన మగుటో బాకీదారునికి తన దారను వప్పచెప్పి అవమానుషాలతో పౌరుషహీనమై నిత్యదుఃఖియై జీవచ్ఛవమై బ్రతుకుటో కాగలదు ఇదంతా చింతించి తెలుసుకొని చేయిపట్టి నిలవేసిన స్త్రీనయినా వలచి వచ్చిన వయ్యారినైనా నమస్కరించి ఏయుక్తితోనయినా విడిపించుకొని తప్పించుకొనిమనుట శ్రేయము ఇదీ తమకములోగల తారుమారు ఈబాధను సహించి ధర్మబద్ధులయిన వారిభార్యలే బుద్ధిమంతులు పతివ్రతలూ పరమపావనులు తప్పుడుదారుల నడచి స్థానభ్రష్టులై దిగజారి పశులోకమునకుపోక ఎగబ్రాకి తలిదండ్రికి మంచి పేరుతే నాయనా చేతనయినంత వరకూ లోకానికీ లోకులకూ బాకీపడక బ్రతుకవలెనని జ్ఞాపకముంచుకో అన్నది జ్ఞానాంబ.

అబ్బా చంపినావే అమ్మా అయితే అంతా మొగవారిలోనే ఉన్నదన్నమాట అయితే ఇప్పుడొకవేళ అధికారంతోనో అతిప్రేమతోనో నాభార్యతొడపై తలఉంచి పడుకొని అమ్మచెప్పేటివి వింటూ ఉంటాననుకో మళ్లీజన్మలో నాతొడపై తలపెట్టి

పండుకొని వాళ్లమ్మ చెప్పేటివి నాభార్య వింటుందన్నమాట అన్నాడు రాము.

ముప్పురూ నవ్వినారు.

సరోజ జ్ఞానాంబనుచూచి అత్తాప్లాను వేసినారు పెద్దవారి ఎదుటనే పెండ్లాము తొడపై తలపెట్టి పడుకొని అమ్మచెప్పే మాటల ఊకొడ్తూ నిద్దరపోదామని కూర్చొని వింటే చెప్పు లేకుంటే కథఎత్తి పెట్టు అత్తా అన్నది సరోజ.

ఒరే అధికారంలో అనాథలని మగవారిమాట చెల్లుతుందనీ అమపూ ఆజ్ఞలో ఉంచుకోవలెననీ ఆడవారిపైన అన్యాయాలు చెలాయించి బాధిస్తే ఆ అన్యాయం మొగవారని చిత్రగుప్తుని లెఖ్ఖల్లోడాఖలుగాక పోనిస్తుందా పొల్లుతప్పకుండా చిట్టాలో ఎక్కుతుంది. మళ్లీతిరిగి వచ్చేటప్పటికి ధర్మాలకట్ట ఎగబెట్టి దాయంబూచులాడే ఆడది దాపురించి కన్నీరు కడవలకొద్దీ కార్పిస్తుంది. చూస్తున్నాముగా లోకంలో ముందుమొనగాళ్లయి ప్రకృతం అనాధలయిన అయ్యగార్ల బ్రతుకు అన్నది జ్ఞానాంబ.

పెండ్లాన్నిబాధిస్తే తిరిగీ పెండ్లాము బాధిస్తుందంటావా అబ్బ అట్లయితే వద్దులేవే బాధించేదెందుకూ బాధపడేదెందుకూ ఇంకనీజోలికిరానే బాధిస్తే భాద్రొస్తుంది అన్నాడు సరోజ ప్రక్కమళ్లి రాము.

బాధించినందుకు బాధపడతారు కొంతకాలంలోనే బోధపడుతుంది అన్నది చెరగడ్డము పెట్టుకొని నవ్వుతు సరోజ.

అనసూయమ్మ సరోజనుచూచి ఛీ పడుకోనీవే పాపం ప్రేమపాత్రులై స్నేహపాత్రులై పడుకుంటానని తొడపై పడుకునే భర్తలేడనీ దాంపత్యంలేదనీ వడిలోకితీసుకొని వలపుల గురిపించి ముద్దులతో సుద్దులతో ఆట్లాడించే అయ్యగారు లేరని అంగలార్చే అంగనలనంతముగా ఉంటే వద్దంటావేమే పడుకోనీ అన్నది.

సరోజ నవ్వుతూ అయ్యో అప్పుడు అమ్మతొడపైతలబెట్టి పడుకున్నారు ప్రక్కలోపడుకున్నారు. పైబడీ పడుకున్నారు క్షీరపానముతో నిద్రించినారు అది జ్ఞాపకము చేసుకున్నారేమో ఆవయసు మీరింది అమ్మయారదోలింది కానీ ఎవరో ఒకరు ఆదరణ ఇవ్వవలసిందేగా అత్తగారుకూడా అల్లునిపరం మాట్లాడినారుపాపం తలవాల్చండీ అని రాము భుజముపైచేయివేసి వాల్చుకున్నది సరోజ.

రాము పడుకొంటూ అమ్మ పూరవోలుతూ పారవోలుతూ ఘుమ్మను యౌవనముతో ఘుమ్మను వాసనలతో నిండిన సరోజనొకదాని చూపిందిగా మాయమ్మ అధికారం ఇచ్చింది. పడుకొమ్మన్నది. మీయమ్మదానంచేసింది. పడుకోవే అన్నది. నీదేహంలో నీకేమీ హక్కులేదు. అంతానాదే ఓ అదృష్టదేవతా అమ్మా అత్తా ఎదుటి అలితొడపై పండుకొని అమ్మచెప్పే నీతిమాటలువినే అదృష్టవంతుల జాబితాలో నన్నూచేర్చుకో అమ్మా అత్తా అధికారమిచ్చినారు. అలు ఆదరణ ఇచ్చింది. ఇంతకన్నా సుఖమెక్కడుంటుంది. ఇదేఇంద్రలోకం కాదని అప్సరసలు కనుగీటినా కాదంటానుగాని కదలుతానా కదలన్నాడు రాము.

కనుగీటితే కాలుకదిలించకుండా పెండ్లినాటి ప్రమాణాలకట్టి ఉట్టిమీద పెట్టి కుండా పెండ్లాన్ని పెనుభూతంగా చూడకుండా పెద్దలమాటవిని పెందలకడనే భోంచేసి రామా క్రిష్ణా అనుకొని రాధోమేజన్మకు ఇట్లాటిసుఖాన్నే ఇట్లాటి త్రిదేవి స్వరూపాలనే తెచ్చుకోండి అమ్మను కథచెప్పనివ్వండి మీధర్మం అని పింబాము అని రాముకడుపుపై నిమురుతూ కానీ అత్తా అన్నది సరోజ.

త్రిదేవుల అనుగ్రహం పొందినవానికే ఈ త్రిదేవుల ఆదరణ దొరికేది. లక్ష్మిఅంశ అమ్మ, పార్వతీఅంశ అత్త ఇద్దరుపోగా త్రిదేవుల్లో మిగిలినది. నీవే దేవి అని గడ్డముపైకి చేయిపోబోయినది. రాముచేయిని పట్టుకొని సరోజ వినవేరూ అని రాము ముఖంలోకి తన చల్లని కనుతళుక్కులా చిరునవ్వులా పంపినది.

రాము కానీ అమ్మా అన్నాడు.

ఏమికానిస్తావు పింపేగా అన్నది జ్ఞానాంబ.

వింటానమ్మా అంటూ అమ్మప్రక్క తలత్రిప్పినాడు రాము.

రెండవది మద్యపానం పంచప్రాణాల ఉసురుదీసి పైనెక్కిత్రొక్కి ఉయ్యాల లూగించి మానం ప్రాణం ధనం తీస్తుంది. త్రాగుడు ఇదీఒక పెనుభూతం దీనిబారిన పడి తప్పించు కొన్నవారు అరుదు ఒకవేళ తప్పించుకున్నా అప్పుడప్పుడూ స్నేహముతో బాధించక వేధించక చీవాట్లు తినిపించకా మానదు. ఇదిగౌరవ ప్రతిష్ఠల పూర్తిగా నశింపుచేస్తుంది మంచిచెడ్డల గమనింపక ఎట్టిపాపము నయినా చేయు తలంపు గలిగిస్తుంది. సిగ్గూ బిడియమూ మానమూ మర్యాదా తలంపునకు

రానివ్వదు కన్న తలిదండ్రులా గురు వయోవృద్ధులా అగ్రజులా సరకుగొననివ్వదు భార్యాపిల్లల బాధిస్తుంది. మెటికలు విరచడం శపించడం తానితరులపాలై గృహచ్ఛిద్రముల గలిగించడం దుఃఖముతో దుమ్మెత్తి పోయడం శత్రువును చూచినట్లు చూచి నిరాశతో చావకపోయెనని తలంచడం చేయిస్తుంది. వేళకు తిండిలేకుండా చేయించి ఉష్ణాధిక్యముతో పైత్య ప్రకోపమై దేహము నశింపు చేస్తుంది. వీర్యము ఉష్ణావీర్యముగనూ నీరుగనూ చేసుంది. అట్టి సమయములలో గలుగు సంతతికి దేహబలమో జ్ఞానబలమో తక్కువగలుగ చేస్తుంది. గర్వమును పెంచి పాపములు చేయు తలంపులుగలిగించి పాపభూయిష్ఠుని చేయిస్తుంది. వరుస వావియను తలంపునే మరపిస్తుంది. కలహములకు కాలుదువ్విస్తుంది. పురుషజన్మకు మూలమయిన పౌరుషజ్ఞాన కీర్తుల రూపు మాపిస్తుంది. సర్వసుఖములా దూరముచేసి సర్వనాశనమూ చేయిస్తుంది. ఈ వ్యసనముతో పాడయి లోకదూషకులై లోక కంటకులై గౌరవ మర్యాదలకు దూరులై పాడవుతారు. ఇదిగమనించి లోకమున గల సంఘమర్యాదలకు లొంగి పాపమునకు వెరచి మనసున కూదుర్మిత్రుల బోధనలకూ లొంగక త్రాగుడుబోతని ఆబాల గోపాలముతో అనిపించుకొని లోకువగాక తప్పించుకొని తిరుగెడువాడు ధన్యాత్ముడు పుణ్యాత్ముడు నాయనా అంటు వ్యాధులంటారు. వ్యాధులుగాదు. ఇవేఅంటు వ్యాధులు భద్రము వారిజోడల్లో పోయినా వెన్నాడుతుంది. భయముగలిగి బ్రతికి తల్లిదండ్రులా ఆలుపిల్లలా బ్రతికించ మన్నది జ్ఞానాంబ.

సరీ రెండూ మద్యపానము తీసుకొను వారికి భార్య అధర పానమిచ్చి ఆదరిస్తే ఆనందమిస్తే అన్యాయమని ఆలింగనములో బంధిస్తే మరచిపోడూ వాడు మానవుడు కాడూ అన్నాడు రాము.

క్షీరపానమిచ్చి పెంచి పెద్దచేసి మంచిచెడ్డలు చెప్పిన మాతా పితృలమాటే చెవునబెట్టక పౌరుషజ్ఞానకీర్తులా సంఘ మర్యాదలా కాలదన్ని దుర్మిత్రుల మాటలకు చెవులొగ్గి బొగ్గైపోతూ ఉన్నారుగా వారితలవ్రాత బుద్ధిహీనత అన్నది జ్ఞానాంబ.

లేదమ్మా అంతా ఆడవారిలోఉంది. ఆనందం పరమానందం మద్యపాన సమయాల్లో అధరపానము త్రావించి అన్యాయమని వలపువలలో బంధించీ వప్పించి ఆలింగన సౌఖ్యాల ఆనందములోదించి మద్యపానము మాన్పించవచ్చు కన్నీరు పాదాలపైవిడిచి మనసు కరిగించవచ్చు మంచితో చేసేసేవతో మైమరపించి

మార్గమును త్రిప్పవచ్చు మగువ మాటల్లో మర్మమంపుంది. మైకముంది. నీకోసలు నన్ను మాన్పించిందిగా పీఘలు తికిగేది. అన్నాడు రాము.

ముప్పురూ నవ్వినారు. సరోజ రాము చెంపలపై చేయిపెట్టి నిమురుతూ ఆ అట్లనా మంచి మాటేనని తలఎగరవేస్తూ చిరునవ్వుతో రామునుచూచి అవతలకానీ అత్తా అడ్డుకట్లు వేస్తుంటారు. కథసాగనివ్వరు అధరామృతాలూ పంచామృతాలూ నిద్రలోకూడా మరచిపోరు సన్నపిల్లలు స్తన్యము త్రాగుతూ నిద్రపోయినట్లు అన్నాం తలో రాము అధరపానము అన్నాడు సరోజ రాము నోరుమూసిపెట్టి అత్తతట్టుచూచి అన్నివిషయాలూ బాగానేర్పించినావు ఒక్కకొడుకని కొక్కోకము ఒక అక్షరము తప్పకుండా మంచి అనుభవజ్ఞులతో చెప్పించినావు అన్ని ఆటలూ ఆడుతున్నారు. అన్నది హృదయానందముతో సరోజ.

అక్కడెవరూ ఉపాధ్యాయునిలేదే చదివినాను చదివినది నీతో అనుభవము లోకి తెచ్చుకున్నాను. ఉపాధ్యాయినివి నీవే తెలిసినా తెలియకున్నా అట్లగాదు ఇట్లా అని చెప్పే అమ్మయ్యవు నీవున్నావుగా అన్నాడు రాము.

పెద్దవారున్నారు వారికి కొంచెము గౌరవ మిస్తాము అ మ వూ అజ్ఞ లో ఉంటాము కనుమరుగున తింటాము వుంటాము అంటామూ అనే ఆచారంలేదూ అని రాము ముఖములోకి మృదుమధురమైన పల్కులతో ముద్దులొల్కే ముఖముతోచూచి అత్తా అధువూ అజ్ఞలో పెట్టుకుంటేనే కొడుకు యశోద కొడుకే "బ్రహ్మచారీ శత మర్కటః" అంటే "కుటుంబీ కోటివానరః" అన్నట్లు తయారయినారు కానీ అత్తా అన్నది సరోజ.

వాడు ఆడినట్లు నీవు పాట పాడుతున్నావు ఆలుమొగల దాంపత్య సుఖమిదే స్త్రీకి చదువు కావలెనన్నదిందుకే వాడు ఆడే ఆటకు చక్కగా పాడలేకపోతే బ్రతు కంతా నిరర్థకం అనుకుంటాడు ఆటకన్నా పాట మిన్నగావుంది. అన్ని అందాలా తయారై మంత్రివలె సలహాలిస్తూ మాటకు మాట చక్కగా అందిస్తూ మంచిమార్గ ములో గృహస్థునీ, గృహాన్ని పెట్టి మంచిపిల్లల తయారుచేసి లోకానికందిచ్చేటందుకే నీచదువు సార్థకమయింది సరోజా చాలుకు తెచ్చుకున్నావు సంసారములోగల సారం తెలుసుకున్నావు అన్నది జ్ఞానాంబ.

ఈమాటలువిని అనసూయమ్మ హృదయానందముతో కానీవదినా వాళ్లతో ఏమీ పాపపుణ్య విచక్షణా పారమార్థిక చింతనాలేక భర్త్రాదరణా భగవదాశీర్వచనం లేక బలుపాట్లుకులోనై సంఘములో లోకువయై సంసారానికి దూరమై బ్రతికే టందుకా చదువు ఇవన్నీ ఆర్జించుకొని భర్తకుచేదోడై వాదోడై కన్నపిల్లలా ఉన్న వస్తువులా గృహస్థునీ, గృహాన్ని, పరివారాన్నీ, ధనాన్ని, కాపాడి భర్తనూ భగవంతునీ వశవర్తుల చేసుకొని ఎదపై చేయిపెట్టుకొని భర్తచేయిపట్టుకొని భగవంతునీ భగవతీ ఆరాధిస్తూ కాలము గడిపేటందుకు ఈచదువు చక్కగా నేర్పినాను చాలా మూలా బాగాతెలుసు భర్తహృదయంలో అత్తా మామ హృదయంలో చోటేర్పరచుకొని ఏదుర్గుణములకూ చోటివ్వక చదువు సార్థకం చేసుకుంటుంది భయంలేదు చెప్పేదేదోకానీ అన్నది అనసూయమ్మ.

జ్ఞానాంబ సరోజను చూస్తూ మాధవది జూదం జూదంకూడా మానవుని మనసును లొంగదీస్తుంది. మంచిని మరపిస్తుంది. గౌరవ మర్యాదల చెరుస్తుంది. దినచర్యలా వృత్తినీ ఉద్యోగాన్ని నాశనము చేస్తుంది. మరపిస్తుంది. దిగులు పుట్టిస్తుంది. పోయినడబ్బు రాకపోయెననీ వచ్చినది మళ్లీపోవునాయనీ చింతపుట్టిస్తుంది. వచ్చినప్పుడు డబ్బును ఊరక దుర్వ్యయము చేయిస్తుంది. పోయినప్పుడు దీనతతో పౌరుష హీనముచేసి ఒరుల అడిగిస్తుంది. అప్పులపాల్ చేస్తుంది. నలచక్రవర్తిని జ్ఞప్తికి తెస్తుంది. ఇస్పేటుకాడని పదుగురిలో లోకువ చేయిస్తుంది. ఆలుపిల్లలూ తల్లిదండ్రులూ అప్రయోజకునిక్రింద జీవచ్ఛవముక్రింద జమకట్టి చేయిస్తుంది. జీవిత రక్షణోపాధులు చెడిపోయిననూ లెక్కచేయక ఒరుల మాటల సరకుచేయక రాత్రింబవళ్లు అచింతనే పుట్టిస్తుంది. దురాశను పెంపొందింపచేసి మిత్రద్రోహము చేయిస్తుంది. సర్వనాశనమయిననూ సంపాదింతునను ఆశను పుట్టిస్తుంది. ఈదుగ్ధతో ఉడుకై దేహముచెడీ జ్ఞానముచెడీ జీవితముపై నిరాశను పొందిస్తుంది. నిద్రాహారముల మాన్పిస్తుంది. భార్యాపిల్లల జీవితము పాడుగజేయిస్తుంది. జూదగాడని లోకులు నమ్మనితెరవుల కల్పిస్తుంది. శత్రురోగఋణ విపత్తుల మూటెను మూలను గుర్తొనచేయిస్తుంది. ఈబాధానివర్తికై భార్యపైగల నగలనమ్మించి భార్యకు దూరము చేయిస్తుంది. దుండగుల జట్టులోచేర్చి పోలీసులపట్టికలో దాఖలు చేయిస్తుంది. ధనం చాలనప్పుడు నేరస్తుని చేయిస్తుంది.

మానవుడై జన్మించినందుకు మాధవుసేవో మానవసేవో చేయుటమాని కాలము వృధాచేసి పశుప్రాయుడై వచ్చిన మానవత్వము విలువ చెరచుకొని మళ్లీ

పశుపక్ష్యాదులలో జనన మొందునట్లు చేస్తుంది. దైవమునకూ సాధుసత్వ సంపదయుంచు దూరస్థుని చేసి దూషింపచేయిస్తుంది. ఇవన్నీ గ్రహించి జూదము పాపహేతువని పాపహేతువనీ భావించి మొదటనే దానిజోలిక పోనివాడే బుద్ధిమంతుడు జీవితసుఖ నాశహేతువని హృదయశాంతికి మారికా ఉపద్రవమని ముందే తెలిసి బ్రతుకుట శ్రేయము ఇన్నిటి వర్జించనియెడల బారాకట్టు సర్కాయిష్టు పవరంగము క్యారం బోర్డు పులిగీతం చిత్తాట మొదలగు పోటీఆటలు జూదాల జూదములుగల ఆటలు మానవత్వమునే చెరచును. నాయనా వాటిలో కాలుపెట్టితివా సర్వనాశన మయ్యేదవు జాగ్రత్త అన్నది జ్ఞానాంబ.

నీకోడలు మంచినేర్పరిదే ఇట్లా వస్తూ మరపుకొన్నది. ఇక పేషీమాటయన్నీ అన్నిరంగములలోగల అగచాట్లన్నీ బా అమ్మ చెప్పిందిగా పేను అమ్మమాటనూ ఆలిమాటను జవదాటదు అన్నాడు రాము.

అమ్మ మాటంటేనరే ఆలిమాటకూడా జవదాటరా ఆలికన్న అవన అవనిలో లేదయా అననంటారా అయితే బ్రతికినాము బ్రతుకు చెరుచుకోము అన్నది నవ్వుతూ సరోజ.

ఎప్పుడు దాటినానే బాల్యములో అమ్మమాటా యౌవనములో భార్యమాటా వింటే బ్రతుకు చెడదన్నారు. అందులో అమ్మా భార్యా చదువుకొని సర్వమెరింగిన నాధ్వీమణులు కావలె లేకున్న అదీవక చెడదే బాగా తెలిసినభార్యా అన్నీ ఎరిగిన అమ్మానీకూ నాకూ తోడైనారు. దుర్వ్యసనాలు చేరవు మానవత్వము నశింపుకాదు భయపడకు కానీ అమ్మా అన్నాడు రాము.

జ్ఞానాంబ రామునుచూచి ఒరే ఇతరుల కష్టము కొంచెము గమనించేబుద్ధి ఉండవలె. ఇంతచదివి ఏమిమేలు తొడపై తలపెట్టి పండుకొని ఎంతసేపయినదో చూడు దానికాలు పీసికావలె ఘాతదయలేని జీవులిట్లుంటారు. నీసుఖమే చూచి నావుగాని ఇతరుల కష్టము గమనించలేదన్నది జ్ఞానాంబ.

పడుకొనీ అత్తా అమ్మ తొడపై కొన్నాళ్లు పడుకున్నాడు ఆలితొడపై పడుకో బుద్ధి పుట్టింది పాపం పడుకోనీ అంటూ మరొక తొడను. తలక్రిందికిపెట్టి పడుకోండీ ఎంతశ్రమ ఉందో ఏమో నేనెందుకు వద్దన వలెనంటూ ఎదపై చేయిపెట్టి నిమురుతూ రాము ముఖములోకి చిరునవ్వుతో చూచినది సరోజ.

ఇరువురి ఒద్దిగనూ ప్రేమనుచూచి అనసూయమ్మ ఆనంద పడుతూ కానీ వదినా అన్నది.

వేటకూడా మానవత్వాన్ని మసిచేస్తుంది. భూతదయలేక జంతువులనూ పక్షులనూ చంపుట హింసించుట చేయుదురు. మానవునికి షడ్రుచులు పదార్థముల ఎన్నో భగవంతుడు కల్పించి ఉండ పక్షులా మృగములా తింటూ ఉన్నారు. నోరులేనివి అపకారము చేయనివీ ఏకాకియై జీవించునవీ శుద్ధ పాప ఫలము ననుభవించునవీ దిక్కులేనివీ జ్ఞానములేనివీ ఇట్టి బుద్ధిహీనమై దుర్బలమైన జంతువుల చంపుట మహాపాపము వాటెనుచంపి మరుజన్మకు వాటెజన్మమెత్తి కష్టపడుట మరింత దుఃఖము సంపాదించుకొనుటే యగును. ప్రతిజీవ రాసులకూ తల్లీ తండ్రీ అన్నా తమ్ముడూ అక్కా చెల్లెలూ అను ఆత్మీయులుగానీ బంధు మిత్రులుగానీ కష్ట సమయముల ఆదురుకొను వారెరుగని అనాథ సముదయము కష్టసుఖముల పంచుకొని సహాయము చేయునేర్పులేనివి. పుట్టిన దాదిగా చచ్చువర్యతం దుఃఖమునే ననుభవించునవి మంచిగానీ చెడ్డగానీ ఒకటి కొకటి చెప్పుకొను నేర్పులేనివి నైజముగా పుట్టిన జాతీయ నేర్పుతో జీవించునవీ అనగా చాప నీటిలో ఈదునుపక్షి ఆకాశములోకి ఎగిరి సంచారము చేయును. మృగము భూమిపై నడచును. ఒకరు నేర్పకనే వచ్చునవి ఇట్టి అనాధ జంతు జాలమును కొట్టితిని తానుపాప భూయిష్టుడగుటగాక భార్యా పిల్లలకూడా పాపుల చేయును. తనకు భార్యా పిల్లలపైన ప్రేమ ఉన్నట్లు వాటెకూ ఉండుననీ తనకు ప్రాణముపై ఆశఉన్నట్లు వాటెకూ ఉండుననీ తాను సుఖము కొరకు ప్రయత్నము చేయుచున్నట్లు అవీ చేయుండుననీ తలంపక చేతికి అదవగా అణుకువగా ఉన్నవనీ అనేకమయిన సాధనోపాయములతో పట్టి బంధించి వధించి భుజించిన పాపము ఊరకపోదు కట్టి కుడుపును దీనిలో వామాచారులు జంతుబలి చేయుదురు. వీరుకొన్ని తెగలవారు దేవునికని నియమించినది. పాపములేదని వారిగురువాక్యము అహింసా పరమోధర్మయను వేదవాక్యమును నమ్మిహింస పాపమును మతములూగలవు వీరికీ వారికీ చాలా తేడాగలదు శాకాహారులకంతా అహింసాసిద్ధాంతము మాంసాహారులకంతా హింసాసిద్దాంతము ఈ రెండు తెగలవారికీ ఆచార వ్యవహారములూ కొన్నిధర్మములూ వేరుగానుండును వీరిరువురూ పూర్వపాపపుణ్యాను సరణముగా ఒకరి ఒకరు చేరుచుందురు ఒకప్పుడు శాకాహారులేమాంసాహారులలోచేరుచుందురుమాంసాహారులుశాకాహారులుగా మారుట అరుదు మానవత్వమునుండీ దిగజారిన క్రింద పశుత్వమున్నది. ఎగబ్రాకిన పైన

దేవత్వమున్నది. అదృష్ట దురదృష్టములతో దిగజారువారూ ఎగబ్రాకువారూగలరు నాయనా దిగజారక మంచి చెడ్డలెరింగి ఎగబ్రాకి మాకూ కొంతచేయూతనివ్వ తండ్రీ భూతదయతో సర్వజీవులూ నీవలెనేమాదు జీవహింస పాపమనీ పాపము మరుజన్మకు అనుభవింప చేస్తుందనీ నమ్మినదూ నాయనా అన్నది జ్ఞానాంబ.

అయితే పామూ, తేలూ మొదలగు, విషజంతువులూ ఎలుకలూ, నల్లులూ, మొదలగు బాధాకర జంతువులూ కొన్ని క్రూరజంతువులూ కలవే వాటెను చంపుటా పాపమేనంటావా అన్నాడు రాము.

ఇందులో రెండుతెగల వారున్నారు. ఎంతటి క్రూరజంతువులు నైనా హింసించరాదను వారొకరు మానవుని ఉనికికి మానవునికే కష్టము గల్పించు వాటెను సమయాను కూలముగా అనగా గృహములో గృహ పరిగణాంగములో పదుగురు తిరుగు చోట్లలో అపకార జంతువుల చంపవచ్చు ఎడారులలో మానవ సంచరణలేని చోట్లలో చంపరాదను వారుగలరు వీలయినంతవరకూ హింసకూడదు తప్పించుకొని తిరుగుటే శ్రేయము నాయనా ఇన్నీ వింటూ భార్యను హింసిస్తానే ఉన్నావులేరా కూర్చొని అడుగూదానిది ప్రాణముకాదేమి అదవని అలిని బాధిస్తే అవతలుంది అన్యాయానికి శిక్ష అన్నది జ్ఞానాంబ.

మోసేది మోస్తూఉంటే పైగాచూచేదానికి నీకెందుకే ఇంతబాధా ఈకొంచెమే పాపమని లేవమంటున్నావే ఇక నీకండ్లఎదుట నోరుతెరచినా చేయిసాచినా నాలుగు మంగళ హారతులవుతాయన్నమాట బాధిస్తే తప్పక వేధిస్తావన్నమాటే లేస్తాలేవే అన్నాడు రాము.

ఒరే నన్ను బాధిస్తేనేమి దాన్నిబాధిస్తేనేమి పాపము ఒకటే కనీపెంచినది అమ్మా ధర్మబద్ధయై కట్టుకొని కన్నవారిని విడచి కామునికిలొంగి సంఘమర్యాదల పాటించి కనిపెంచను వచ్చినదిభార్యా ఇందులో ఎక్కువ తక్కువవేమీలేదు అలి దూషణా అమ్మదూషణా ఒకటే అమ్మవల్లగలుగు పాపం అలివల్లగలుగు పాపం వకటే తెలిసి నడుచుకొనక పోతే తెలివితెల్లవారుతుంది. ఎవరి పాత్రపోషణవారు చక్కగా నెరవేర్చుకొనుటే ఇందులో సాహసం ఇక్కడా అక్కడా శభాష్ అని పించుకుంటారు ఒకరికొకరు బాకీపడరు అన్నది జ్ఞానాంబ.

కానీవేవదినా కట్టుకున్నవాణ్ణి సాకి సంతరించేవాణ్ణి మోయక ఎవరిని మోయవలె భర్తమనోభీష్టాన్ని తీర్చడమే భార్యధర్మం అన్నది అనసూయమ్మ.

భార్య కష్టాన్నిచూచేది భర్త ధర్మము కాదేమి నమ్మి తన్నాశ్రయించిన స్త్రీకి అన్యాయంచేసి ఆవలజన్మకు వలవలఏడ్చి బుద్ధిహీనులుంటారు అన్నదిజ్ఞానాంబ

కానీ యత్తా మధ్య మధ్యా కొడుకుకథ ఎందుకు నాకు బరువుకాడులే చాలా తేలికచేసి పెట్టినావు అన్ని ధర్మాలూ తెలిపి శుద్ధమగు ఆర్యునిగా తయారుచేసి నావు భూతదయా పశ్చాత్తాపం పూర్తి ఆపాదమస్తక పర్యంతం వ్యాపించివుంది నేను చేసినపుణ్యం మంచిది కనిపించి విద్యా బుద్ధులు చెప్పించి ఉత్తమ పదమునకు చెందిన ఆర్యునిగా తయారుచేసి నాకు దానం చేసినావు నేనూ పుణ్యముచేసి వుండినాను నాపుణ్యాలవంట లభించినది నాకే కొరతాలేదు నాఇల్లు స్వర్గతుల్యము మీరిచ్చిన దానము శ్రేష్ఠమయినది. మీరిచ్చిన ఈ దానములో పదిఫలాలు పండించి మీ వంశవృక్షానికీ మీకూ తిరిగీయిస్తాను. సుదర్శన అంగరక్షవలె మీ కుమారుడు అన్నియెడలా కాపాడగలడు ధర్మమూర్తి అందరూ కన్నీటితో కాలముగడిపితే ఆనందబాష్పాలతో కాలము గడుపుతున్నాను. నాకు ఇంతకన్నా స్వర్గముకూడా మిన్నకాదు. జన్మజన్మాలకూ నీవేకని నాకు దానంచేయవలె జన్మజన్మాలకూ నీ కోడలినే అంటూ రాము గడ్డము పట్టుకొని రాము ముఖములోకి వంగిచూచి చాలునా అన్నది సరోజ.

పొగడ్త చాలుగాని నేను ఈయమ్మకు పుట్టను నీకు మొగుణ్ణికాను సందూ ఎడసందూ లేకుండా ధర్మాలవగ్గాలతో చుట్టిబిగిస్తే మనిషి బ్రతుకుతాడా అయినా నీ కష్టము మాయమ్మ చూడలేకుంది లేస్తాతీవే అంటూ లేవపోయినాడు రాము.

వద్దు పరవాలేదు పడుకోండీ అని తలనులేపనివ్వక పట్టుకొని కానీ అత్తా అన్నది సరోజ.

సరే ఆలూ మొగడూ సరిపోయినారు చూడువదినా అన్నది జ్ఞానాంబ.

కానీలేవదినా వాళ్లతో ఏమీ అన్నది అనసూయమ్మ.

అయిదవది కఠినపు మాటలాడుట తగదన్నారు మనసు నొచ్చునవీ మరవ మరవురానివీ దుఃఖించునవీ వ్యక్తిని నిలబెట్టి అన్నయెడల అది ఆవ్యక్తిని అనరానిది

జీవితాంతమువరకూ బాధించును వేధించును. ఆపాపము పెరుగుతునే ఉండును నిరుపేదలా, అనాధలా, పసిపిల్లలా, స్త్రీలా, ఏమీతెలియని నిరక్షర కుక్షులా సాధువులా, సజ్జనులా, తలిదండ్రులా, అన్నతమ్ములా అక్కచెల్లెండ్రా బంధు మిత్రులా, దాసదాసీజనులా, అధికారమున్నదని. విద్యాబలము దేహబలమూ వయోబలమూ, ధనబలమూ, సైన్యబలమూ, బంధుబలమూ, ఉన్నదని కొట్టుటా తిట్టుటా, అనరాని మాటలనుటా, భయపడించుటా, బాధించుటా, నిర్బంధించుట, వారిపై చెలాయించుటా, పనికిరాదు. ప్రజలు పాపాత్ముల జట్టులో చేర్తురు ముందుపోనిచ్చి వెనుక దూషించుచుందురు పేరెత్తుటతోనే అక్కడున్న అందరి మనస్సులకూ చటాయింపూ ఏవగింపూ గలుగును. వానిపాడుగాననీ వానివంశము కుళ్లిపోననీ తిట్టుదురు ప్రజాదూషణ తప్పకతగులును. సమానులతో కలహములు సంప్రాప్తించి పరాభవములు జరుగును లేదా కలహములతో ధననాశనము ప్రాణ హాని జరుగును. క్రూరుడా కఠినకర్ముడా అని చావులోకూడా ఉమ్మివేయుదురు కఠినపుమాటలు కలుషముల మూటలై కావలసినంతా పెంచును. తెలుసుకొని మరుజన్మపై కనుగలిగి మాట్లాడవలయును. కాఠిన్యముగాగానీ పొడుపుగాగానీ ఎత్తివేయుటగానీ పనికిరాదు. ఇది ఈజన్మలో బాధించుటగాక మరుజన్మకూ బాధించును. నాయనా కఠినపుమాటలు చాలాచెడ్డవి భార్యకూడా జ్ఞాపకముంచుకొని చింతిస్తుంది మంచిమాటలే మానవునికి అంగరక్ష. జ్ఞాపకముంచుకో కోపము పాపము సంపాదించును. హేళనగానయినా అనరాదు అనిపించు కొనరాదు.

కం॥ ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము-తనమనంబున కగుతా
నొరులకునవి సేయ కునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్!

అన్నారు అని పాపము కట్టుకొనుటా అనిపించుకొని చింతించుటా రెండూ కష్టమయినవే అన్నది జ్ఞానాంబ.

అమ్మా నీకోడలి గర్భస్థుడగు శిశువు ఈ నీతిగాథలు విని మానవ ప్రహ్లాదు డగుతాడేమో ఇంకచెప్పవద్దే నాకెమరగుతాడు అన్నాడు రాము.

ముగ్గురూ నవ్వినారు జ్ఞానాంబ రామును చూచి ఒరే వాడు పాలు మరచితే నీదగ్గర ఉంటాడా వానికి పదేండ్లు వచ్చేటప్పటికే నీయట్లా వాండ్లకు నూరుమందికి జవాబిచ్చేటట్లు వాళ్లబ్బ తయారుచేయడా నీ విషమప్రశ్నలకు జవాబుల వర్షము కురిపిస్తాడులే పరవాలేదు మావంశములో మీవంశములో వీళ్లవంశములో జ్ఞానహీనులూ రూపహీనులూ ఎవరూలేరు వంశమర్యాధ వానికెందుకు ఉండదూ అన్నది.

లేదు అత్తా సక్రమముగా పోషిస్తూ ఉన్నాను జ్ఞానములో రూపములో యోగములో తండ్రికన్నా మిన్నయినవాడు దేవగురు బ్రాహ్మణ మాతృపితృ వయోవృద్ధ ఆశీర్వాదములు పొందువాడు సదాభూతదయా పశ్చాత్తాపముగలుగువాడు ప్రజామన్ననలందువాడు బంధుమిత్రులలో కీర్తిగౌరవము గడించువాడు వంశోద్ధారకుడూ గలుగవలెనని దీక్షాపర తంత్రనై దైవాన్ని ధ్యానిస్తూ ఆహారవిహార వ్యవహారాదులలో నియమ వ్రతనై ఉన్నాను. మీరు కోరినట్లు తయారుచేసిఇస్తాను దానానికి ప్రతిదానము చక్కగా ఉండవనిలేదా ఇరు వంశములలో కీర్తిగడించ పనిలేదా తాతగారూ మామగారూ బలీయులేగదా అంతటివాడు గాకపోయిన పిల్లను ఎట్లిస్తారు. అభయం నాకూ ఉన్నదిగా మాఇంటినుండీ మళ్లీనేను తెచ్చుకోవలెగదా మీరు కోరిన ప్రకారము తయారుచేసి ఇస్తానత్తా అన్నది సరోజ.

రాము తటాలున చేతులు జోడించుకొని ఓస్వామీ! వీళ్లు నాకూ నా కొడుక్కూ తగాదాలూ తారామళ్లూ గలిగించేటట్లు ఉన్నారు. పెంచేటట్లున్నారు పుట్టకముందే తండ్రికన్నా మిన్నగా ఉండవలెనను వారొకరూ లోకానికే పెద్దగావలెనను వారొకరూ తండ్రిని క్షణములో జయించువాడు గావలెనను వారొకరూ అంటూ ఉన్నారు తప్పక తగాదాలు పెంచుతారు. అయినా మంచిదే నాకొడుకేకదా స్వామీ వారికోరికే ఫలింపచేయి అన్నాడు రాము.

ముగ్గురూ రామునుచూచి నవ్వినారు సరోజ రామునుచూస్తూ "మీకుమారుడు మీకన్నా పెద్దవాడయితే మీకానందములేదా" అన్నది.

తనకన్నా పెద్దవాడైతే తండ్రికూడా ఓర్చలేడన్నాడు ఏమిచేస్తావు ఓర్పు తెచ్చుకుంటాను అన్నాడు రాము.

వదినా వీళ్లకథలో దిగితే అసలుకథను మరపిస్తారు కానీ ఆరవదేదో అన్నది అనసూయమ్మ.

అరవదా ఒరులసొమ్ము నపహరించుట సొమ్ముఅనగా ఎన్నోవిధములగు సొమ్ములున్నవి. దారా ధనధాన్యములూ గృహమూ గృహోపకరణములు భూమి వస్త్రభూషణ పశు సంపదాదులు తెలియనివారి దగ్గర యుక్తాయుక్తముగా నాల్గు మాటలు నచ్చచెప్పి తెగతినుట దొంగతనముగా నపహరించుటా దౌర్జన్యముతో లాక్కొనుటా దొంగసొత్తుల కొనుటా బాగాలా భూములా ఆక్రమించుటా దొంగగా పశువుల కట్టివేయుటా దోపిడీలు చేయించుటా దావులకొట్టించుటా స్త్రీలనపహరించుటా స్త్రీలతో సేవతో మాటలతో మోసముచేసి అపహరణచేయుటా జూదము నేర్పి మోసముచేయుటా ఇంటికిరమ్మని అపవాదులు గల్పించి అడిగినదిఇస్తావా రచ్చకెక్కించి పరాభవముచేయ మంటావా అని మోసముచేయుటా ఇచ్చినది ఇవ్వక ఎగరకొట్టుటా ఇవ్వనిదే ఇచ్చినానని ప్రమాణముచేయుటా చేతిలోదొరికి నారని సమయమిదేనని చేతికి దొరికినంతా తెగతినుటా ఏవస్తువదొరికినా మాదేనని ఎగబెట్టుటా రాత్రింబవళ్లు ఒరుల సొత్తులకై ఒక్కప్రొద్దులుండుటా కాయాకసురూ మొదలగువస్తువుల దొంగలించుటా స్వగృహములోనే దొంగలించి దాచుకొనుటా తల్లీ తండ్రీ అన్నా తమ్ముడూ అక్కా చెల్లెలూ బంధుమిత్రాలూ దేవుడూ గురువూ పిల్లలూ అను భావము విడచి వీరికతలకూడా దొంగలించుటా ఇదీఒక వ్యసనమే ఏమంటవా నీవెట్లతెస్తివో అట్లేతిరిగిపోవును. పోవునప్పుడు రెంటంతలు దుఃఖము తెచ్చును అవిషయము తెలియక జీవితము అవకతవకలు చేసికొందురు తిరిగి అవస్థలుపడుదురు. పరదారా పరాన్నము పరధనం విడచి తనవిమాత్రము వాడు కొంటూ తనివిచెందినవారికి మరుజన్మలో సుఖముగలదు భగవంతుడు ఎక్కువగా త్రోద్పడును ధనమూ దారా అన్నమూ తస్కరములుగావు. తనవెన్నంటేవుండును తృప్తిచెందక తొందరపడి దుంతగులై దురాశలతో నాశనమవుతారు.

కం॥ వ్యాప్తింజెందక వగవక
ప్రాప్తంబగు లేశమయిన పదివేలనుచున్
తృప్తింజెందని మనుజుడు
సప్త ద్వీపములయందు చక్కంబడునే॥

అన్నారు మానవుడు పరధనాలకై పదవులకై పొరాడక ఉన్నదానిలో తృప్తిజెంది స్థిరచిత్తుడై ధర్మ వ్యతిరిక్తముగాని కార్యములు సోమరిగాక చేయుచునే వుండవలయునుగాని కక్కుర్తికై ఒరులసొత్తు అపహరించు ప్రయత్నములు చేసిన

పైన నవగ్రహమండల మున్నది. ఆవగింజంతపోనీక అతుకు వేస్తుంది. కట్టికుడుపు తుంది. ఇక్కడనే చూడరా అమ్మా అత్తా ఎదుట ఆనందంగా భార్యతొడపై పడు కోగల పుణ్యం లక్ష్యమయ్యేదేది పడుకోబోతే ఈసడించుకొని అవతలలేచిపోయె భార్య అయివుంటే ఎక్కడ పడుకొందువు ఇదే పుణ్యం అత్తనూ అమ్మనూ ఒకే విధముగా భార్య హృదయాన్ని నీ హృదయాన్ని ఒకే విధముగా ముందు జన్మలో చూచి వుండే నీయానందానికి మేరలేకుండా ఉండేది అనురాగవతీ అపరూపవతీ భార్య అన్నిధర్మాలూ తెలిసి శాంతచిత్తులయిన అమ్మా అత్తా కావలెనంటే వస్తారా ముందుజన్మలో చేసుకున్నావు. ఇదే సుకృతము ఈ జన్మలో చేసుకుంటివా మరు జన్మకూ ఉంటుంది లేకుంటే చూస్తున్నావే అంతే నన్నది జ్ఞానాంబ.

అత్తఆశ కూతురిపైనా అమ్మఆశ కొడుకుపైనా ఉంటుందనితెలుసు నొప్పిస్తే నొప్పి ఉంటుందనీ తెలుసు నేనుజీవరాసులనే నొప్పించను. మానవుల నొప్పిస్తానా ముందుకు ఈఅమ్మే ఈఅత్తే ఈపెండ్లామే ఉండవలెనని కోరుకుంటూ ఉన్నానే ఈజీవికి ఈజీవులే ఉండవలే ననుకుంటాను, ఏండ్లకొలదీ అమ్మగారిఇంటికి పంపక అన్యాయమని తలంపక అగచాట్లపాలుచేసి శక్తికిమీరినవి తెమ్మని ఇమ్మని బాధించి నూతికో గోతికో బలిఅయ్యేటట్లుచేసి రెండవభార్యకూ రెండవకట్నానికి ఎదురు చూచు కటికరక్కసుల చూస్తున్నానుగా పాపంచేయవద్దూ మరుజన్మలో బాధపడ వద్దూ అమ్మా నాన్ననూ అత్తా మామనూ ఒకటిగానే చూస్తాగానీ వేరుగాచూడను భార్యకష్టాల గమనిస్తా సహకారినై సహకరిస్తా అడుగూ కోరల్సి అన్నాడు రాము.

నీవన్నంతపనీ తానన్నంతపనీ చేసినాడత్తా ...కనాడు పగలు దేహముజబ్బుగా ఉండి మరచి నిద్రపోయినాను నాకుతెలియకుండావచ్చి చప్పిడిగాకుండా కాఫీవేసి కాఫీ త్రాగుదువులెమ్మని లేపినారు. నన్నులేపకుండా ఎందుకట్ల చేసినారు అన్నాను అయ్యో గర్భభారంతో భార్యపడుకోనుంటే లేపి పాపము కట్టుకునేదాని కన్నా నేనుత్తమనిషిని గాబట్టి తేలికగా తిరుగుతూ కాఫీవేసి లేపినాను తప్పేముంది అన్నారు నాకా కాఫీ వద్దు వేరేవేసుకుంటాను. మీరేత్రాగండి అన్నాను. ఎందుకట్లా అన్నారు భర్తతో చాకిరీ చేయించుకొని కాఫీవేయించుకొని మరుజన్మకు దాసినై జన్మించే దానికన్నా నేనువేసుకొని తాగేది ఉత్తమము అయినా నేనుమీకు ముందు జన్మకు భార్యగా ఉండతగనా నన్నుదాసిగా జన్మింపచేయ తలంచితిరా అన్నాను.

దీయుటా ఎక్కడకూర్చున్నా ఎవరిసుద్దులో ఒకరిసుద్దులు చెప్పుతూ నిందించుటా హేళనచేయుటా తీసివేయుటా ఎత్తివేయుటా ఎట్టివారినైనా తుచ్ఛులుగా చూచుట తనకు లోకువగాచేసుకొన చూచుట విద్యాబలముతో ఔనన్నది కాదనీ కాదన్నది ఔననీ ఓడగగొట్టి పదిమందిలో వకరిని అవమాన వరచుటా ఇంగిత జ్ఞానములేని కుంకయని నిరక్షరకుక్షియని విద్యరానివారిని తూలనాడుటా చుఖార మాటలాడుట తనవి కొండతలూ ఒరులవి గోరంతలుగా మాట్లాడుటా వర నిందా అంటారు. ఇది మహాపాపము ఎవరి పాపం వారిని బాధిస్తుందనీ ఎవరిశక్తి వారికుంటుందనీ ఎవరి తెలివి వారికుంటుందనీ భావించక వాడు ధనహీనుడూ వీడు జ్ఞానహీనుడూ వాడు అప్రయోజకుడూ వాడు దుర్మార్గుడూ అని వాగుతూ దేవునీ దైవాన్ని తలంచక ఒరుల నిందలే రాత్రింబవళ్లు చేయుచుంటు జీవులకు ముందుండును ముప్పుతిప్పలు ఇవి సప్తవ్యసనాలు ఇవి పాప ఫలమును కూడబెట్టును దానితో జీవితము వెనక్కు తిరుగును. దానితో దుఃఖము సమీపించును వీటెలో గల పాప ఫలమునెరుంగక అభ్యాసము చేసుకొనెదరు. అటుగంటి అవస్థలపాలయ్యెదరు. ఈ వీడునూ విడచి వీడింటిని చేరతీసినవారు మహనీయులు మనుజన్మకు త్రిదేవీ పుత్రులు సౌఖ్యములన్నీ వారిపాలే అష్టైశ్వర్యములన్నీ వారిసొత్తే నన్నది జ్ఞానాంబ.

అమ్మా సప్తవ్యసనాలూ సప్తసాగరాలేనేవీటె ఈదేది దుర్ఘటమే తాతైనా తప్పక తారుమారౌతాడు. బ్రహ్మకైనా భారంగాకపోవు అయినా వీటెభారమిట్లుంది. వాటెభారమెట్లుందో వాటెనూ కొంచెము చెప్పు విందాము ఈ వీడూ మన కుదూరములే బయట పడినాను మంచివాడనే ఆ వీడులో వీవయినా నాలో ఉన్న వేమో వినవలెచెప్పు అన్నాడు రాము.

కం॥ బుద్ధియు ధృతియును నీతియు
శ్రద్ధయు సన్నుతియు క్షమయు శాంతియుననగా
వృద్ధశ్రమ సీద్ధ్యురుమద్
వృద్ధిప్రద దేవతలు శ్రుతిస్మృతి కథితల్॥

బుద్ధి ఇది మంచి చెడ్డలనక పాప పుణ్యములనక కష్ట నిష్ఠూరములనక చావు బ్రతుకులనక, కీర్త్యపకీర్తులనక, పెద్దచిన్నలనకా, ధర్మాధర్మములనక,

వావివరుసలనక, గౌరవా గౌరవములనక, నిందాప నిందలనక, రాత్రిబవలనక పరుగిడి చూచినదంతా కావలెనను చుండును. దానికి తగుసమాధానము చెప్పి చక్కగా త్రిప్పుకొనకున్న ఇంద్రలోకమేల వలెననును. ఇది మంచిగా ప్రవర్తించి మానవత్వమునుంచీ దైవత్వం సిద్ధింపచేయును. చెడ్డగా ప్రవర్తించి పశుత్వములో చేర్చును దీనిని మంచి మార్గమునకు త్రిప్పుకొనుటకై మహనీయులు బహుశ్రమ చెందినారు యోగులను, భోగులచేయును, భోగుల విరాగులచేయును కర్మననుస రించి ఈడ్చుచుండును. దీనివెంబడిపోయిన కుంభీపాక నరకములో కూల్చుదనుకా కనుమూయరు. అప్పుడప్పుడూ అధ్యాత్మికము నేర్పుచుండ వలయును. ఎట్లన ఓ బుద్ధీ నీ కోరికలు రాజులు తీర్చలేరు నేను తీర్చగలనా ధనవంతుల మేడలచూచి వారిసౌఖ్యములచూచి, వారిఆనందములచూచి నాకూ ఆట్లకావలె నంటావు విలాస వంతుల చూచి నేనట్లుండవలె నంటావు విలాసినుల చూచి అతివాకితో తిరిగి సుఖ పడవలె నంటావు కంటికింపైనది ఏది చూచినా కావలెనంటావు కోరకోరి కుళ్లిపో తావు. వారు పుణ్యముచేసినవారు నీవుచేయలేవు నికెక్కడవస్తాయి ఈజన్మలో నయినావారు చేసినట్లు పుణ్యముచేసుకో మరుజన్మ కొస్తాయి ఒరులచూచి దుఃఖ పడుతూ అసూయజెందితే ఏమొస్తుంది. పాపమొస్తుంది. వారిపుణ్యమది నా పాప మిదీ అని వారివస్తువుల ఆశించక భగవంతుని అడుగు భక్తిశ్రద్ధలతో పూజించు వారట్లడిగి పూజించి దానములూ వ్రతములూ, వక్క్రప్రొద్దులూవుండీ తెచ్చుకున్నా రని తెలుసుకో కామితార్థ ఫలప్రదుడు భగవానుడు కావలసినవి ఇవ్వగలడు మచిం మార్గములో ఈజన్మలోనయినా నడువమని బుద్ధిని త్రిప్పుకొని మనుట అన్నది జ్ఞానాంబ.

అమ్మా బుద్ధిని బద్ధంచేయవలె నంటే సాధ్యమా పండితులనైనా పశువుల చేస్తుంది తపసులనైనా తారుమారు చేస్తుంది బుద్ధిని మరల్చుట కష్టమమ్మా అన్నాడు రాము.

బుద్ధిని మరల్చుకొనక పోయినవారూ సోమరులై భగవద్ధ్యానముచేసి భక్తితో క్షీరమోనీరమో ఇవ్వనివారు ధర్మాధర్మ విచక్షణలేనివారూ పాపపుణ్యముల పాటించనివారూ ఉన్నారే కనబడలేదా ఉందన్నవారే ఉన్నవారు లేదన్నవారే లేనివారు అన్నది జ్ఞానాంబ.

అవతల కానీ అత్తా అన్నది సరోజ.

కొండవద్ది ధృతి అనగా లభించిన ధ్యానిత్తో సంతోషించుట ధచ్చిన కర్మలకు వెరువక ముందుచేసినవే వచ్చునుగాని చేయనివి రావుగదాయని ధైర్యమువహించి తల్లీతండ్రీ ఆల్లూ పిల్లలూ సోధర సోదరీలూ బంధుమిత్రులూ దాసదాసీజనులవల్ల గలుగు అలజడుల సహించి త్రిసంధ్యల దైవధ్యానము విడువక చేయుచూ దైవముతో మంచిచెడ్డల చెప్పుకొను. నభ్యాసము పెట్టుకొనుట సర్వమూ దైవముపైనే భారము పెట్టి ధర్మవ్యతిరిక్తముగాక నడుచుకొనుట ధైర్యముతో అజగర న్యాయము వహించి బుద్ధిని మరల్చుకొని ఉండుట ధర్మబద్ధముగా ఆర్జించి దైవనివేదనచేసి తలిదండ్రులా దారాపుత్రులా సంతృప్తుల చేయుట చేతగానప్పుడు దైవేచ్ఛయని ధైర్యముగా నిల్చుకొనుట ధర్మవ్యతిరిక్తముగాని మార్గముల తెలుసుకొని నడువవలెనను ఆశయముతో నుండుట ఇది మానవునికి వజ్రకవచము వంటిది దైవము వాని వెన్నంటి వుండును పంచాయుధములు పంచననిల్చి పరిపాలనచేయును. ఇదియే స్థిరప్రజ్ఞ వీనికీర్తి ఆచంద్రార్కముగా నిల్చును. భగవంతుడు నిల్చును కార్య సాధకుడు వీడేనన్నది జ్ఞానాంబ.

అమ్మా ప్రాణాలు పోయేటప్పుడుకూడా ధైర్యంగా వుండవలెనంటే మానవుల కవుతుందా వుండలేకనే దొంగతనాలూ దోపిడీలూచేసేది గసపట్టలేకనే ఖూనీలూ కుట్రలూ చేసేది ధైర్యంఅంటే ఎక్కడీకమ్మా అన్నాడు రాము.

మంచి ప్రయత్నాలతో మనిషి పోతూవుంటే చెడ్డలు ఎదురైనప్పుడూ కష్టములు తలపై పడినప్పుడూ ధైర్యముతో దైవముపై భారముంచి అధర్మచిత్తుడుగాక స్థిరచిత్తుడై నిల్చినవాడే పురుషుడు మనము ముందుజన్మలో చేసినదే వచ్చును చేయనిది రాదని వున్నవాడే మహనీయుడు అన్నది జ్ఞానాంబ.

పోయే బండికి కట్టువేసినట్లు సాగిపోయే తీగకు కొనత్రుంచినట్లూ చేప్పేనోటికి అడ్డమొసారు కానీఅతా అన్నది సరోజ.

నీతియు నీతి, ధర్మమునకు వ్యతిరిక్తముగానిది నీతికి వ్యతిరిక్తము అయినది. దుర్నీతి హిందూమత సంప్రదాయమునకుగానీ లేక వేరొక సంప్రదాయమునకుగానీ బద్ధుడై నిల్చుకొని శాస్త్రవిహితముగా నుండుట మనుట షట్కర్మాచరణ మరువక విడువక నీతిగానిల్చి తలిదండ్రులా దారాపుత్రులా దయతో స్నేహముతోచూచి

దేహకష్టముకానీ, మనోకష్టముగానీ వారికక్కించుట పర్యాయముల మండగముల మాని సాత్వికబుద్ధితో నుండుట ఇట్టివాడు ఇహపరములలో సౌఖ్యము పొందును. కీర్తినిగడించును. నీతీ నిజాయతీ మానవుని మహనీయుని చేయును కీర్తిగౌరవముల భువిలో దివిలో తెచ్చును. నీతులలో భారతనీతి శ్రేయోదాయక మయినది. ప్రపంచాదిగా నున్నది పారమార్థిక మార్గము చక్కగా చూపునది బహు సూక్ష్మమయినది. నీతికినిలువని మానవుని దర్శనముకన్నా ప్రేతదర్శనమే శ్రేయమన్నారు అన్నది జ్ఞానాంబ.

అమ్మా పరధనమూ పరాన్నమూ పరులవస్తువులా పరిగ్రహించక నీతికి నిల్చుకొనవచ్చుగానీ కనులకు మిరిమిట్లుగొల్పు నీ కో డ లి లా ం టి పడుచుపిల్ల ఎడారులో ఎవరూలేని స్థలాలలో వంటరిగా దొరికినా కనుమీటి చేయివిసరినా శత వృద్ధులయినా తపసులైనా యజ్ఞయాగాదులుచేసిన సోమయాజులయినా ధర్మ శాస్త్రాలు చదివిన పండితులైనా సర్వమూ సన్యసించిన సన్యాసులయినా నీతి నట్టేటిలోవేసి నియమాల నీళ్లలోకలపక నీతిని నిల్పుకోగలరా అమ్మా ఇక్కడనిల్వలేరు అన్నాడు రాము.

చేయకూడదనీ అట్టివారిచెంత చేరకూడదనీ నీతికినిల్చుకొని ఉన్నాను అవి నీతులు నాచెంతకు చేరకుండా నామనస్సు అవినీతులలో పాల్గొనకుండా నీదయ చూపు త ం డ్రీ య ని దేవునితో చెప్పుకొను చుండిన రావు దానికిమించివచ్చిన హృదయ పూర్వకముగా చేయక తటస్థించినవి. ప్రారబ్ధమని నీతిజ్ఞులు అనుభవించెదరు చేసినపాపము దైవముతో చెప్పుకొని చింతించెదరు పాపములో పుణ్యమూ పుణ్యములో పాపమూ మిశ్రమముగా నుండును. జీవి వెన్నంటియుండును అట్టివారెను తలంచనక్కరలేదు అన్నది జ్ఞానాంబ.

అత్తా కథ గమ్యస్థానము చెరబోదు బుద్ధిఊరకుండనీదు అడ్డుకట్టువేసేది మానేదిలేదు ఇదివినేదికాదు కానీఅత్తా అన్నది సరోజ.

శ్రద్ధా అశ్రద్ధా శ్రద్ధమానవుని మహనీయుని చేస్తుందీ అశ్రద్ధ అడుగంటిస్తుంది శ్రద్ధ శక్తినిచేకూరుస్తుంది అశ్రద్ధ అశక్తునిచేసి ఎక్కడా ఎక్కకుండాచేస్తుంది ఇహానికిగానీ పరానికిగానీ శ్రద్ధముఖ్యమయినది ఇవిలేక ఏమానవుడూ వన్నెఘటించలేడు చేయతగినదేదో శ్రద్ధతో చేయుటే మానవత్వంలోగల బలము శ్రద్ధగా బుద్ధిని నిల్పు

కొని ఆచార వ్యవహారముల ఆచరణలో ఉంచుకొనుట నీతిలో నిల్చుకొనుట ధైర్యము విడువక పొందుకొనుట శ్రద్ధాభక్తులతో భగవానుని మూడువేళల ఆరాధించుట మైథున నిద్రాహారములకు లొంగక దేహముగానీ మనస్సుగానీ సోమరితనంలో పాల్గొననివ్వక షట్కర్మాచరణలో శ్రద్ధగా ఉంచుట దుస్సహవాసములకు దురాదాయములకూ దుష్ప్రయత్నములకూ పరదారా పరాన్న పరధనములకూ బుద్ధినిపోనివ్వక బుద్ధికి బుద్ధిచెప్పి శ్రద్ధగా బుద్ధిని పట్టుకొనుట వందనీయులా పూజనీయులా సదా పోషించుట పూజించుటా యోగక్షేమము లెరుంగట కోపము నణచుకొని సర్వజీవులా తనవలె చూచుకొనుటా శ్రద్ధతో పురాణ కాలక్షేపములుచేయుటా నీతికథలా ధర్మశాస్త్రములా చదువుటా అటుగాక శ్రద్ధను చంపుకొని బుద్ధిని ముందుకు నడువనిచ్చిన ముందుకు పోయేజన్మకు క్రిందికినూకును అశ్రద్ధనుచేర్చుకొనక ఓర్పుతో ఆచరణల అలవరచుకొనిన దేవతలు సాధింపలేని కార్యము మానవుడయ్యూ సాధింపగలడు దివీ భువీ స్వాధీన పరచుకోగలడు అన్నది జ్ఞానాంబ.

అమ్మా ఈ ఆచరణా విధానము ఆగంతుక మృత్యువై హతంచేస్తుందే ఆశలన్నీ హతం సుఖాలన్నీగతం ఆచారాలూ విధివిధానాలూ నేర్పి కోడల్ని కొండంత చేస్తున్నావు కొడుకు కోర్కెల తీర్చుకోనిస్తుందా కూర్చోనిస్తుందా ఆచారం అనాచారం నీతీ అవినీతి భక్తీ విభక్తీ అనీ బ్రతుకనిస్తుందా ఇంకచెప్పొద్దే ఒక్కడికే సేరుకు సవాసేరు అయినది అన్నాడు రాము.

నీతీ అవినీతీ తెలుసుకొనే తొడపై తలపెట్టి గంటలకొద్దీ పడుకున్నా మోయలేకున్నా ఓర్పుతో మోస్తుండేదీ మోజుతీరుస్తుండేదీ నీతితెలియని అవినీతిజ్ఞులైతే అప్పుడే జారుకోదేమిరా ఆచరణ ఆగంతుక మృత్యువన్నవారే ఇహానికీ పరానికీ ఎక్కక తినతిండీ కట్టబట్టాలేక తీరని దుఃఖాలతో కుళ్లిపోతుండేది ఆచరణ కష్టమనక ఆచారము వ్యర్థమనక హరిధ్యానము నిరర్థకమనక ఆచరించినవారే అమితానందాలతో ఆఢ్యులమనీ అందరిలో కులికేది నీవలె నీలుక్కొని పడుకునేదీ అన్నది జ్ఞానాంబ.

సరోజ రాము ముఖములో తొంగిచూస్తూ చదువుకున్నదాన్ని తెలివిగలదాన్ని తెలిసినదాన్ని ఎందుకు చేసుకున్నారూ ఏమీతెలియని వెఱ్ఱిదాన్ని చేసుకోకూడదా ఎట్లతిరిగినా ఎన్నిచేసినా ఎంతకొట్టినా ఎన్నితిట్టినా పస్తుపెట్టినా ప్రక్కవిడిచినా పలుకకా తొలకకా వగవకా నిండుకుండవలె నుండునే ఆపాపము పర్వ

తమువలె పెరుగునే ఇక ఈనాటినుంచీ ఏమీతెలియని దానివలె పసుపూ సంధ్యా రానిదానివలె నటిస్తూ కాపురము చక్కదిద్దుకోండీ చూస్తాము అన్నది సరోజ.

ఓలి తక్కువని గుడ్డిదాన్ని పెండ్లాడితే దొంతికుండలు పగులకొట్టినదట అట్లే తెలిసీ తెలియనట్లు నటించటములో చారులో ఉప్పుఎక్కువా పులుసులో పులుసు ఎక్కువా పచ్చడిలో కారమెక్కువా పొడికూరలో అన్నీతక్కువచేసి అన్నము పోకుండా అటమటచేసేవే తెలియనివాళ్లకు నడిప్పునదెబ్బలనుడీ ఉంటుంది. ఎదిరించే వాళ్లకు ఎదరొమ్మున గుద్దులనుడీ ఉంటుందట ఉన్నవేమో చూచుకో అన్నాడు రాము.

సుళ్లుండే వాళ్లమొగుళ్లకు రెండు మూడు తాళిబొట్లయోగము ఉంటాయట అవి ఉన్నాయేమో చూచుకోండీ అన్నది సరోజ.

అవిఉండేవాళ్లకు వరకట్నాల మరాదాయరేఖలు రెండుమూడు ఉంటాయట చూడవే అంటూ చేయిచూపినాడు రాము.

ఆస్త్రీ శాపమూ వారి తలిదండ్రీ కన్నీటి పాపమూ ఆడపిల్లలై అందులో కుంటీ కురూపీఅయి అమ్ముడుబోక అమ్మానాన్నను కన్నవస్థలుపెట్టే అడ్డరేఖలు అక్కడే ఉంటాయి చూచుకోండీ అన్నది సరోజ.

పోయిన రోజుల్లో ఓలితో మొగోళ్ల ఏడ్పించినారు. ఆనాడుబుద్ధిలేదూ ఈనాడు వరకట్నాలు తీసుకుంటే అంత ఏడ్పెందుకే అన్నాడు రాము.

అతది అనాథ ఆడపిల్లనమ్ముకొన్న ఆతలిదండ్రులూ అనాథలూ నిర్ధనులూ ఆడవాళ్లతో ఆరణం భరణం రాబట్టి ఆడవాళ్లపయిన ఆధారపడే మొగోళ్ళ నేమంటారూ అందుకే చదివిన్నామను చదువరులూ చదివించిన తలిదండ్రులూ నేమంటారూ నాల్గుడబ్బులిచ్చి కొన్నానని ఎవరనవలెనంటారూ మాతో అనిపించు కుంటారా మీరంటారా అమ్మగారు అయ్యగారు మోసేటంతా అరణం ఇచ్చిఉంటే పట్టెడన్నం వేస్తుండారు పట్టమని నయాపైసా వస్తువేదయినా ఇచ్చినారేమో చూడండీ అని మేమా మీరా అనవలసింది. తల్లీఘండ్రీలేరు అంతా పిల్లపేరనే ఆస్తిఉంది ఒకేపిల్ల మామ సాకుతాన్నాడు తగినంతా ఆస్తీఉంది అనేశబ్దం వినబడితే ఏకుచావలు ఏటికి ఎగబ్రాకిపోయినట్లు మందలు మందలు బియ్యేలగుంపూ ఘాస్త్యాములగుంపు లక్షాధికారులగుంపూ ఎగబ్రాకివస్తుందే వాళ్ళనేమంటారూ వంశనాశనంపిల్లా బంధు

వర్గంలేనిపిల్ల మర్యాదలు నడువనిపిల్లా మాకెందుకనే మొగోళ్లేలేరే మళ్లీవాళ్లే వర కట్నాలిచ్చేటప్పుడు కంటనీళ్లిడిచే దెందుకూ అనుభవింప చేసినాము అనుభవిస్తూ ఉన్నామనుకోకూడదా అన్నది సరోజ.

మరి ఆపిల్లను ఎవరు చేసుకోవలె నంటావు అన్నాడు రాము.

అక్కడా ఏమీలేనివారే ఆశించవలెగాని అన్నీఉన్న మహారాజుల కెందుకూ వారికి మంచివంశం మంచిరూపం మంచినడక మంచిప్రవర్తనా విద్యాబుద్ధీ కావలె గాని వంశనాశన ధనమెందుకూ వైనం తప్పుతుందని తెలియదా ఓలిరూకలిచ్చి తెచ్చుకున్నా వకందాన మేలేనన్నారు. అత్తమామలరుణం అనాడే తీర్చుకున్నట్లు మరుజన్మకు అగచాట్లులేనట్లు అన్నది సరోజ.

అనాటి ఓలే వరకట్నంగా మారింది అనాడు వధువుకుకట్నం ఈనాడు వరు నికి కట్నం వాళ్లూవీళ్లూ ధర్మబద్ధులైతే కట్నాలు కాలిపోయేది అంతవరకూ కట్నాలు కన్నీళ్లుతెస్తూనే ఉంటాయన్నాడు రాము.

కానీ వదినా వీళ్ల కథముందుకు సాగిపోనివ్వరు విననివ్వరూ ఎక్కడెక్కడి పురాణాలోతెచ్చి అడ్డము వేస్తారన్నది అనసూయమ్మ.

అయిదవది సన్నతి స్నేహముగా సర్వజీవుల తోనుండుట ఏజీవికిగానీ అప కారముచేయక తన్నుచూచి సర్వులూ సంతోషించునట్లు నడుచుకొనుట చేతనయిన ఉపకారముచేయుటా లేదాఊరకుండుటా అపకారినిచూచి ఇదినాకర్మమని తలంచి ప్రత్యపకారము చేయక మానుకొనుట సర్వజీవులతో సఖ్యతగానుండుట భూతదయ గలిగి దేనికీ అపకారముచేయక చేతనైనంత మట్టుకూ ఆదరువుచూపి ఆదరించుటా పెద్దచిన్నలనక సర్వులా గౌరవించుటా వారివారి కర్మము వారినిబాధించును వారిని తడువు కొనినమనమూ భాగస్వాముల మయ్యెదమని భావించి వారిసుద్దులు మరొకరితో చెప్పక మరచిపోవుట స్నేహముతో వారిని మంచి మార్గమునకు త్రిప్పుట సాధుసజ్జన సహవాసము భగవత్సేవా మాతృ పితృ గురువయోవృద్ధసేవా గోబ్రాహ్మణ విధేయత గలిగి జీవించుట ఇట్టివారు అందూ ఇందూ సందేహములేక కీర్తిగౌరవముల పొందుదురు మరుజన్మకు మహనీయులుగా జననమొందుదురు సర్వసౌఖ్యములా పొందుదురు ఈగుణములుగలవాడు సర్వకార్యములా దైవముతో

చెప్పుకొనుచూ దైవమునే స్నేహము చేసుకొందురు భగవంతుడు స్నేహమయిన భారమయిన దేదీఉండదు ఇదితెలుసుకొని బ్రతుకు నాయనా అన్నది జ్ఞానాంబ.

అమ్మా పగ్గాలు కాబట్టివే కట్టివేయను తల్లి ఒక్కప్రక్క ధర్మపత్ని ఇంకొక ప్రక్క ఇంకా మిగిలింది అత్త వక్కప్రక్క ఈపద్మాల తాళ్లతోచుట్టి నావయసు వల్లకాడు చేర్చినారే వయసుందికదా వయినంగా అట్లతిరిగివస్తామూ పార్కులూ లూ చూచివస్తామూ విలాస వినోదములలో సంచరిస్తామూ అనుకుంటే ఆనగ బట్టి నీతిపగ్గాలు చుట్టుతున్నారు. కానీ మీమాటేఏంటా అవతలిప్రపంచము ఉందో లేదో అదటుండనీ అమ్మమాటా అనురాగవతియైన భార్యమాటా అత్తమాటా విన వలసిందేగా మానవుని మేలుగోరువారలలో ముఖ్యులు ఈముగ్గురే ఒకొకరికడ వక్రింతురుగానీ అదివారి పూర్వకర్మమే పురుషునికి ఈముగ్గురి ఆదరణముఖ్యము కానీఅమ్మా నీవుచెప్పి బాల్యములో బాధపెట్టినావు చెడ్డపనులు దలచేసరికి అమ్మ మాటలు జ్ఞాపకమునకువచ్చి సాబుదప్పకుండా ఉండినాను అమ్మయూరదోలిందిలే అనుకుంటే అలురడీ అయింది. అమ్మకన్నా అలుజాస్తి అయింది. అమ్మాఇంకా ఏమేమోచెప్పుతున్నావు ఇంక బ్రతుకనీదు పురుషునికెప్పుడూ స్త్రీబాధేనా బాల్య ములో అమ్మా వయసులో భార్య వృద్ధాప్యములో కూతుళ్లూ పుణ్యముచేసి హాయిగా ఉందామని ఇంద్రలోకంపోతే అక్కడ అప్సరసలూ పాపంచేసి యమలోకంపోతే కింకరీలూ ఎక్కడపోయినా అబ్బబ్బా మీబాధేనన్నాడు రాము.

స్త్రీలకు పురుషులబాధాఅని పెద్దలు చెప్పుతుంటే పురుషులకు స్త్రీలబాధాఅని తిరుగచదువుతారా బాల్యములో తలిదండ్రుల అదుపులో యౌవనములో భర్తఆజ్ఞలో ముదిమిలో కుమారులమాటలో స్త్రీ ఉండవలె స్త్రీకి ఎప్పుడూ స్వాతంత్ర్యములేదు ఈ అస్వతంత్రపు బ్రతుకు బ్రతికేదానికన్నా బండ గట్టుక నూతబడుటమేలు అడవిలో చెట్టై చామై పుట్టేదిమేలు అని ఆడవారంటూ ఉంటే కొత్తపద్ధతి చదువు తారు అయ్యగారు అన్నది సరోజ.

హరి హరాదులుకూడా అదుపులో ఆజ్ఞలో యెదలో తలలో తనలో పెట్టు కున్నారు. మానవులు పెట్టుకోకుంటే మానముంటుందా రత్నములలో ఏరత్న మెక్కువ శిష్యా అని గురువడిగితే లోకంలో స్త్రీ రత్నం విలువ ఎక్కువస్వామీ అన్నాడట శిష్యుడు ఈవిలువైన రత్నాన్ని వీధికి పంపుతే పరవాలేదా అన్నాడు గురువు అయ్యోస్వామీ సానబెట్టిన రత్నమయితే కాటికి కాలుసాచిన ముసలివానికి

కూడా కన్నుక దానిపైనే కాసుచేయని గాసగానికీ దానిపైనే కావిగుడ్డల సన్యాసికీ దానిపైనే కన్నన్నాడు శిష్యుడు. అదే నాయనా కావిగుడ్డలు కట్టినా మనసును చంపుకున్నా ఈ రత్నాలపై ఆశచావలేదు. చీరసింగారం చూస్తే చిత్తం చెడుతుంది కన్నెత్తిచూస్తే కలవరంలో వస్తుంది. కాదని కారడవుల్లో చేరుకుంటే కడితక్కువ వస్తుంది. ఏమి చేతాము అన్నాడట గురువు చిత్తాన్ని చితక్కొట్టి చంపేదానికన్నా శిష్యరాండ్రను చేర్చుకుంటే చిత్తము కుదురుతుంది. సంఘబలం పెరుగుతుంది. నాకలశరేఖా, గ్రోవిరేఖా, పాషాణరేఖా, మొసలరేఖా, జోలెరేఖా బాధతగ్గుతుంది అన్నాడట శిష్యుడు. శిష్యా ఆరేఖలు నాకులేవే అన్నాడు గురువు స్వామీ ఈ శిష్యుడు లేనప్పుడు తమనాశ్రయించి ఉండునవి ఇప్పుడు శిష్యుని చేరినవి. అండలేని ఒకరత్నానికి అండయిస్తే నన్నిడిచి నామె నాశ్రయిస్తాయి గురూ అండలేక హరిహరాదులుకూడా బ్రతుకలేదు. అండే ఉండవలెనన్నాడు శిష్యుడు. ఆరేఖాబలం ఏమన్నాడు గురువు కలశరేఖ నీళ్లు మోయిస్తుంది. గ్రోవిరేఖ కొరువు లెగదోయిస్తుంది. పాషాణరేఖ నూరిస్తుంది, ముసలరేఖ దంపిస్తుంది. జోలెరేఖ ఇంటింట కడపడగలెక్కిస్తుంది. ఈరేఖలు ఈశ్వరునైనా ఏడ్పిస్తాయి ఈరత్నాలకు అచ్చొస్తాయి అనందంగా చేస్తాయి ఆండలేనివారికి అండా దిక్కులేనివారికి దిక్కూ బ్రతుకులేనివారికి బ్రతుకూ, సుఖములేనివారికి సుఖమూ, అన్నము లేనివారికి అన్నం కల్పించడము పుణ్యమే భగవంతుడుకూడా దిక్కులేనివారికి దిక్కునేనా అన్నాడట చూడండీ అన్నాడు శిష్యుడు మంచిమార్గం మంచిమార్గం వీరేశలింగం పంతులకూ జై అన్నాడు గురువు సై యన్నాడట శిష్యుడు అంతటి గురువునే ఆ మాటనిపించి దింపించిన్ది చిత్తము చెరిచేదీ స్త్రీనే చిత్తము కుదిర్చేదీ స్త్రీనే స్త్రీలోనేవుంది చిద్విలాసం ఈ విలాసం వీధికిపోతే మన్నౌతుందని ఇంటిలో పెట్టితే అమ్మై, అలై, అత్తై, ఆడబిడ్డై, బిడ్డై బాధిస్తావున్నారు రామ రామా పగవానికికూడా వద్దు స్త్రీబాధ అన్నాడు రాము.

ఆ మాటలకు సరోజ నవ్వూ కోపమూ మిళితముచేసి వాల్ గన్నుల తళుక్కుతో రామునుచూస్తూ ఔ పాపము బాల్యములో కుమారునికొరకు నానాబాధలపడి అస్తులూ పస్తులూవుండి కొట్టినా తన్నినా అనందపడి మలమూత్ర విసర్జనలు మీద చేసినా ఓర్చి రక్తము పంచియిచ్చి జీవితమే ధారపోసి తాకుతప్పులుచెప్పి అవమానముల పాలుగాక అన్యులచే ఛీ ఛా అనిపించుకొని తెరవులునేర్పి విద్యాబుద్ధులకై

పాటుపడినతల్లి బాల్యములో బాధనీయఅయినదా కాహాస్సుకి తాగిసతూ కన్నవళ్ల పాలుగాకుండా సమయానికి వెతకి పెండ్లిచేసి పెళ్లినతల్లి బాధనీయా తినీ తినక సంపాదించి దాచినతల్లి బాధనీయా నమ్మివచ్చి నీబ్రతుకే నాబ్రతుకని నీప్రాణమే నాప్రాణమని నీయారోగ్యమే నాభాగ్యమనీ నీగౌరవమే నాగౌరవమని నీయానందమే నాయానందమనీ కష్టసుఖముల సగపాలు పంచుకొను భార్యమాటలు బాధనీయములా నీచెప్పుచేతల్లోనిల్చి గీచిన గీటుదాటక నలుగోడల మధ్యలో ధర్మబద్ధయైనిల్చి నీకీర్తిగౌరవముల కాపాడు భార్యమాటలు భారమా నీవుపెట్టినదీ నీవిచ్చినదానితో సంతోషించి నీసుఖమునే పదివేలుగా దైవమిచ్చినదింతే నేచేసిన పుణ్యమింతేనని సంతృప్తిచెంది. సంఘమర్యాదలకు లోబడి నీగౌరవము గుప్తగాపెట్టుకొని యిరుకుంటుబములకీర్తిని మనసులో దాచుకొని నీమేలుకై పెట్టు భార్యమాటలు భారమా నీమిత్రులు మిత్రులుగా నీశత్రువులు శత్రువులుగా నీబంధువులు బంధువులుగా నివారు తనవారుగా నీకురుచించినది రుచించినదిగా నీసంతృప్తి సంతృప్తిగా నీదేహము దేహముగా భావించి జీవించు భార్యమాటలు భారమా చెప్పండీ ఇది భావ్యమా అని ఎదపైచేయిపెట్టి నిమురుతూ ముఖమండలము చిరునవ్వుతో వికసింపచేసి రాము కన్నులలో చూచినది సరోజ.

అప్పు చూడవే అమ్మా నగారా వాయించినట్లు వాయించుతూవుందీ నానా రీతుల నానాధర్మముల నేర్పిస్తున్నావు నన్నిక కాలుకదలనివ్వదు నోరుతెరవ నివ్వదూ అమ్మకన్నా కష్టము అలిదేనంటుంది అమ్మకని విద్యాబుద్ధులుచెప్పి వీరదోలింది అన్నికష్టాలూపడి జీవితాంతమువరకూ బాధ్యతవహించి ప్రాణానికి ప్రాణమిచ్చి బిడ్డలకని పెంచి వారితోబాధ మితోబాధాపడుతూ వారికి క్షీరపానం మీకు అధరపానం అనులోపల సరోజ రాము నోరుమూసి అత్తా హద్దువాటుతుంది అకాశే మంటుతుంది ఇంక ఈఆశువు ఆపలేము అవతలికథ వినలేము కానీఅంటూ రామునుచూచి పెద్దవారు పెండ్లాము అనందములో అగుపడలేదా మాయమ్మా మీయమ్మా అక్కడుండేది వదినగారూ మరదళ్లూకాదు నవ్వించను అన్నది సరోజ.

రాము చేతులు జోడించి వద్దురా దేవుడా అన్నీ తెలిసిన అమ్మా ఇంకా రెండాకులెక్కువ చదివినభార్యా ఈ యిరువురిమధ్యా బ్రతుకువద్దు కదలకా మెదలకా కడి, తిని, వుండవలసినదే తికమకల దార్లుబూడ్చి తీర్చి దిద్దుతామంటారు. మహాకష్టము వీరు చెప్పతారుగానీ తియ్యనిదార్లు అవే ఇవికావు. ఇస్పేట్ ఆడుతుంటే

మనసు ఉల్లాసపడినట్లు దేవుని ధ్యానములో ఉంటుందా ఎక్కడిమాట నిషా ఎక్కించి పూలరంగనివలె తూలుతూవుండే ఆనందం బాదాంపాయసములో వుంటుందా ఏటిమాట కొంచెం పుచ్చుకొని లేతకయిపులో టీకు, టాగ్గా సాయంత్రం సాని ఇంటికిపోయి సరసాలూ సల్లాపాలూపడే హృదయానందంలో సంసారి సరసాల్లో చవిదొరుకుతుందా రామ రామ అమ్మో వాటెతీపు వీటెకురాదు వెయ్యిచెప్పినారాదు. ఇవి మానవునికి బ్రహ్మానందమిచ్చేటివి నీవుచెప్పేటివి నిర్భంధములో నిల్పేటివి సుఖంలేదన్నాడు రాము.

ఔనురా వరాయివస్తువులన్నీ పాప భూయిష్టముగాబట్టి ముందు పాయసము లాగావుండి వెనుకవిషయమై జీవితమునే నాశనము చేస్తాయి ఇంటివస్తువులు ముందు ఇంపులేకున్నా వెనుక యిబ్బందుల్లో కష్టకాలాల్లో అమృతప్రాయ మవుతాయి తెలుసుకొని నడచినవానిదే లోకం నీవు చెప్పేవానిదే అక్కడ నరకలోకం ఇక్కడ వీధులాడ్చేవాని శోకం అన్నది జ్ఞానాంబ.

అత్తానేను చెప్పలేదా విననీరని ఎట్లో అయిదయినవరకూ చిన్నచిన్న ప్రశ్నలు వేసినారు ఇప్పుడు పంచాంగము పూర్తివిప్పినారు. దినశుద్ధి చెప్పడములోనే మధ్యాహ్నమయేదినిజం దినశుద్ధివింటుంటే దినమంతా ఖాలీకాని అత్తా అని రాము భుజముపై చేయిపెట్టి నిమురుతూ రామునుచూస్తూ మీరు ఊరుకోరూ నిద్రపోండీ మేము వింటాము అని మరింత అంచుకుతీసుకొని పైటచెరుగుకప్పి కానిఅత్తా అన్నధి సరోజ.

పైట చెరుగుకప్పి పసిపిల్లకు పాలిచ్చేతల్లివలె పైట కప్పుతావెందుకే వాడు అడినట్లు నీవూ అడేటట్లూ ఎంతసేవయినా మోసేటట్లూ ఉన్నావే అని ఇరువురూ నవ్వినారు.

ప్రాణాలు రెండూ ఒకటిగా ఉన్నవి అట్ల ఉన్నంతకాలము ఎంతటి పాప బుద్ధిగల స్త్రీకైనా భర్తబరువుకాడని నామతము మీకొడుకు నాకుబరువుకాడు ఒకవేళ దైవానుకూలముతప్పి నేను మీకొడుక్కు బరువయ్యేదనో ఏమోకాని నాజీవితములో నాకుబరువుకాడు అందుకే చెప్పినానే మళ్లీజన్మకుకూడా మీరేనాకు అత్తకావలెనని కానివ్వండీ అని రామునుచూచి మీరు అమ్మప్రక్క చూడకండీ నోరు పనిచేస్తుందని చేతకండ్లు మూసింది సరోజ.

రాము సరోజ చేయికొరకను ప్రారంభించినాడు.

సరోజ ఆత్రపట్టుచూస్తూ కొరకంటే పొత్తున బాసపకుపోయి సహాన్త్రీ చెప్పే వేస్తురు ఏమదీ అని అడిగేవారికి మావారుకొరికినారు. ఈలోగా మనుషుల కొరికేది నేర్చుకున్నారని చెప్తుంటా కాని అత్తా అన్నది సరోజ.

ఈ చిన్నవయసుకే ఎంత ఓర్పో నీకూ పనిచేష్టలకు ఈ ఓర్పు లేకుంటే ప్రతి కలేవులే క్షమ అనగా ఇదే దీనిలోగల వదిలము దేనిలోలేదు ఓర్పుతో దైవమును నమ్మి పూలచెట్లనూ తులసిచెట్లవేసి పోషిస్తూ వాటెనుకోసి దేవుని పాదములపైపెట్టి మాలల కూర్చివేసి పూజించి కడకు ఇహపరములా వందనీయులయి పూజనీయులై వుండెదరు. భర్తమంతగములా మూర్ఖత్వముచూ, ముక్కోపము, మూర్ఖత్వముచూ, పట్టుదలసూ, ఓర్పువుండి భర్తతన పనికిమాలినతనమును తెలుసుకొని ఇంతకాలము సహించి నన్నూ సంతతిని గృహాన్నికాపాడి రోషము క్రోధమూలేక నాకీర్తి గౌరవములనిల్పి కాపాడిన నీకు నాప్రాణమర్పించినా ఋణముతీరదని చేతులు పట్టుకొని కన్నీరు పెట్టినప్పుడు ఆనందమనుభవించు శక్తినిచ్చును. సంతతి విద్యాబుద్ధులతో పెద్దవై ఈఇంటికై మాకై మాతండ్రికొరకై మాతల్లి పడినబాధలకూ ఓర్పుకూ ఋణపడతాము తీర్చలేమను కుంటామని ఒకరితో చెప్పుచుండగని ఆనంద మనుభవింప చేస్తుంది. పేటలో బంధు మిత్రులలో ఓర్పుగల్ల తల్లియని కీర్తినిగడిస్తుంది. రోజూ పనిలేని వేళలలో రెండక్షరముల వంతున కొన్నాళ్లు రెండు పదాల వంతున కొన్నాళ్లు నేర్చుకొని రెండు పద్యాలూ రెండు శ్లోకాలవంతున కొన్నాళ్లుచదివి కొన్నాళ్లకు శారదా దేవిగాచేసి బంధు మిత్రులలో ఎనలేనికీర్తిని పొందిస్తుంది. దినచర్యలను తప్పక చేయించి దేదీప్యమానమైన శక్తిని గలిగిస్తుంది. ఆర్జన గలిగించి అనందింపచేస్తుంది అలసటనక అన్ని కార్యకలాపముల నేర్పిస్తుంది. అందరికీమంచి అనిపిస్తుంది. ప్రబలమైన శక్తి త్రికరణలతో గడిస్తుంది. మరుజన్మకు రాణీగా పుట్టిస్తుంది సరోజా అశక్తినీలో ఉన్నట్లున్నది నీవల్ల మేమందరమూ సుఖపడగలము క్షమలోగలశక్తి భ్రమ అనేవారుండవచ్చు సుమతి క్షమతోనే భగవంతుని చూచినదీ భర్తను బాగుచేసుకున్నదీ క్షమ ప్రతిజీవికి ప్రాముఖ్యమయినది అందులో స్త్రీకి ప్రధానమయినది అన్నది జ్ఞానాంబ.

అంతవరకూ కనుమూసి వింటూవున్న రాము పైటను ప్రక్కకుతీసి కను తెరచి అమ్మా అన్నాడు.

అదుగో మొదలు పెట్టినారా అని నోరుమూసి చిరునవ్వు ముఖములో వెన్నెలై వన్నెగులుక ఆ వకటీ విననీండీ మీకు పుణ్యముంటుంది జోకొడ్తా నిద్రపోండీ అని పైటకప్పి జోకొట్టుతూ కానీ అత్తా అన్నది సరోజ.

అనసూయా జ్ఞానాంబ లిరువురూ పైటచెరుగు అడ్డము పెట్టుకొని నవ్వసాగినారు.

చూడే అమ్మా నన్ను సన్నపిల్లవాణ్ణి చేసుకుందీ అన్నాడు రాము.

పిల్లవానివిగాక పెద్దవానివా పెద్దవానివైతే అమ్మ చేప్పేమాటలు వినవూ పడుకో మళ్లి పెరిగిపెద్దవాడవగుమవులే అవక్కటీ విననీ అని చెప్పుఅత్తా అన్నది సరోజ.

నా కేవయినా తినేటివి తెచ్చిఇస్తే తింటూ ఊరుకుంటాను లేకుంటే నోరు ఊరుకోదన్నాడు రాము.

సరే తెస్తానుండండీ అని రాము తలను చాపపైపెట్టి వంటగదికి పోయినది సరోజ.

ఇప్పుడు తిన్నావుకదురా అప్పుడే ఆకలియా అన్నది జ్ఞానాంబ.

అబ్బా ఇవన్నీ వినేటప్పటికి గుండెలవిసిపోయి ఉడుకెక్కి ఉక్కిరి బిక్కిరై నీళ్లు దప్పికొతున్నాయి. ఆకలీపుట్టింది తింటావింటే కొంతచలువవస్తుంది. కొంత బుద్ధికి నిలకడొస్తుంది అన్నాడు రాము.

అంతలో సరోజ తట్టలో అయిదారు రకముల పిండీవంటల తీసుకొని మంచి నీళ్ల చెంబు ఎత్తుకొనివచ్చి లేవండీమరి అన్నది సరోజ.

ఊ లేస్తానని రాము లేచి కూర్చున్నాడు.

తట్ట ముందుపెట్టి కానివ్వండీ అన్నది సరోజ.

ఇవి అయిపోవులోపల మీరూకానివ్వండీ అని తిన ప్రారంభించి నాడు రాము.

సరోజ రామునుచూచి నవ్వుతూ కానీ అత్తా అన్నది.

కానీ అత్తా అన్నాడు రాము.

అదుగో అన్నది సరోజ.

నీవు మీఅత్తను అడుగుతున్నావు నేను మాఅత్తను అడుగుతున్నా నీదినీవు వినూ నాదినేనుకానిస్తా కాజేస్తా మాటకు మాట అందిస్తానంటూ తింటూ ఉన్న

రామును సరోజ వడిలోకిలాగి పండబెట్టుకొని మైసూరుపాగు నోటిలోపెట్టి చేయి మూసి ఇంకకాని అత్తా అన్నది.

అంత ఒకేతూరి నోట్లోపెట్టి పైనచేయి మూస్తేవేమకే అన్నది నవ్వుతూ అనసూయమ్మ.

కొంచెము కొంచెము పెట్టితే నోట్లో నంచుంటుంది ఆనందంలోకూడా అమ్మా అని అడ్డమువస్తారు. చిన్నగా తింటూ ఉంటారులే అన్నది సరోజ.

వారి ఇరువురి కథచూచి అనసూయమ్మ ఆనందముతో నవ్వుతూ వదినా అవకటీకానీ పసిపిల్లలతో ఆడుకున్నట్లైనది మనసు అన్నది

అలా మొగుళ్లు ఆడుకుంటూ పాడుకుంటూ చేసేకాపురానికి స్వర్గముకూడా సరిరాదన్నావే మీఅల్లుడు ఆడుతూ పాడుతూ సంసారము చేసేవాడు ఆహా పోరూ లేనివాడు అందరి మన్ననలందుకొనువాడు అంతేకమా అని రాముకంఠలోకి చూచినది సరోజ.

అమ్మా అన్నాడురాము అంతలో మరొక ఒస్తుంటదీని నోటిలోపెట్టి కాని అత్తా అన్నది సరోజ.

జ్ఞానాంబ నవ్వుతూ ఏమిచెప్పమనే ఇదేశాంతము ఈశాంతము ఏపనినైనా సాధిస్తుంది. చూడూ చిన్నపిల్లవాణ్ణి ఆట్లాడించినట్లు వాణ్ణిఆడిస్తూ ఉన్నావు శాంతము మానవులకు ముఖ్యమయినది. ముక్కోపియై మూర్ఖుడై తీవ్రవాదియై అహర్నిశము తిట్టుతూ కొట్టుతూ ఉండినా కోపగించక దుఃఖించక ముందుకర్మమని శాంతిజెంది కానివ్వండీ మీకిది సంతోషముగాఉంటే ఇట్లేచేయండీ నాకర్మము తీరిపోతే మళ్లీ అనరుకదా ముందుచేసినది. అనుభవించ వలెగదా అనండీ సాకి సంతరించేవారు అనక మరెవ్వరనవలె తిరిగిమీరు అనుభవిస్తారని నాకుభయం అని చిరునవ్వుతో సేవతో వలపుతో బంధించి భర్తను వశవర్తునిగా చేసుకుంటుంది. అత్తా మామా కోడళ్ళి అదుపులో ఆజ్ఞలో ఉంచుకోవలెనని అన్యాయప్రవర్తకులై ఆదరసేవ్యక చిటికీ, మాటికీ అంటూ కాళికాశక్తివలె కేకలువేస్తూ గాండ్రించి మీదపడుతూ ఉన్న అత్త మామలకు జవాబివ్వక అణిగి మణిగి అన్నారని కోపగించక భర్తకు అత్త మామలమాటచెప్పి భర్త మనసును పాడుచేయక భారమనక చెప్పిన కార్యములు చేయుచూ ఉదయ సాయంత్రిముల సర్వవిషయములా దైవముతో చెప్పుకొనుచూ తలిదండ్రులకుచెప్పి వారిని దుఃఖభాజనులచేయక తనకాలమును ఎదురు చూచుచూ

ఆత్మహత్యలకు పాల్పడక విసుగుచెందక ఇంటిగుట్టును బైటపెట్టక ఇంటి ఇక్కట్టుల వీధికెక్కించక దుఃఖింపక తనసంతతి తనచేతికి వచ్చునందాక శాంతమువహించి అత్త శక్తి ఉడిగి కోడలిని ఆశ్రయించి అమ్మానేనన్నవి లెక్కపెట్టక తుచ్ఛబుద్ధినై జాలనాడినాను. బుద్ధిలేక పోరుపెట్టినాను. బుద్ధివచ్చింది నీ ఓర్పూ నీ శాంతమూ నిన్నూ నీపిల్లలా కాపాడుతుంది. భగవంతుడు ధార్మికులకు ధర్మబద్ధులకూ శాంత చిత్తులకూ సేవానిరతులకూ అవూ, ప్రాపూ, నీపక్షమైనాడు నీవుధన్యాత్మురాలవు నేను అధర్మపరురాలను మరుజన్మకునీకు బాకీపడినాను. నీతల్లిరీతిమాచి నన్ను కడతేర్చుమని కన్నీరుపెట్టి నప్పుడు శాంతములోగల శక్తికి ఉత్సాహమూ ఆనం దమూ గలుగుతుంది. శాంతము సర్వదా శక్తిస్వరూపమై అంగరక్షగా నిల్చును ఈ ఏడు గుణములు ఎచ్చటఉండునో అచ్చట లక్ష్మినివసించును. లక్ష్మిఉన్నచోటికి శ్రీ మహావిష్ణువు పరుగిడివచ్చును అచ్చోట సకాముపా ఉండదు ఎచ్చట సప్తవ్యసన ములకు చోటేర్పడునో అచ్చట క్రమేణా లక్ష్మినివాసము పోయి అలక్ష్మినివాస మేర్పడును శ్రీ మహావిష్ణువు మరుగగును. వారిపాదస్పర్శ వారిఅనుగ్రహము గృహమునకూ మానవునికీ లేకున్న మానవుడు సదా దుఃఖియగును. లక్ష్మినివసించ వలెనన్న సద్గుణముల ఏడిటా అలవరచు కొనవలయును ఏడువీడి ఏడుకూడిన వారిదే లోకము ధర్మవ్యతిరిక్తులై సప్తవ్యసనములకు చోటిచ్చి ప్రపంచాన్నిచూచి పరుగిడిన వారిదే శోకము ముందు పరుగిడినవారికి ముక్తినిక్లేగతి అన్నది జ్ఞానాంబ.

సరోజ తొడపై తలపెట్టి పడుకున్నరాము తటాలునలేచి అమ్మా చెవులార విన్నా కడుపారతిన్నా కంటారనిద్రపోతా ఆశీర్వచనము బాగున్నదిగానీ ఆచరణలో ఉంచుకోవలెనంటే హడలెత్తుకొస్తుంది. సామాన్యమా ఇది రామ రామా అన్నాడు రాము.

అంతలో సరోజ ఇంకాకొన్ని ఫలాహారములు తెచ్చిఅత్తకూ అమ్మకూ ఇవ్వ బోగా ఇప్పుడెందుకే అన్నారు కొంచెముతిని మంచినీరు త్రాగిపడుకుంటే బాగుంటుం దని బలవంతముచేసి అత్తకూ అమ్మకూ ఇచ్చినది సరోజ.

రాము చేయిసాచి నీచేతిగుండా కొంచెము పెట్టమ్మా అమ్మచేతితిండి అమృ తం భార్యచేతితిండి విషం కొంచెం పెట్టమని పెట్టించుకొని నోట్లో పెట్టుకున్నాడు.

అప్పా ఆవేళనుంచీ తిన్నది బహూచేదు అత్తా అమ్మను ఉబికించీ భార్యను

ఈ వీకింపే అహోరాలూ ఆనందాలూ ఎట్లా సంపాదించుకోవలసినదీ వాగానేర్పుకున్నారు పంతులయ్యా ఎవరో అక్షరము పొల్లుపోకుండా అతికించినట్లు నేర్పించినారు అన్నది సరోజ

ఉపాధ్యాయినివి నీవేనే అక్కడెవ్వరూ లేరు అంతానేర్పింది నీవే నన్నాడు రాము.

ఔను నోట్లో వేలుపెట్టితే కొరకలేని పసివాడు ఆవామూ తెలియని ఆర్నెల్ల పిల్లవాడు అంతానేర్పింది నేనేనన్నది సరోజ.

అనసూయమ్మ స్నానం చేసి వచ్చినారు.

అమ్మా కడుపునిండాతిని కంచాలా నిమరమే నేను మడుచుకుంటానని తను శయనించు గదికి రాము పోయెను.

సరోజ మూడవ పరుపులు పరచగా చేసినది పడుకున్నారు.

ఏమమ్మా నీవూ ఇక్కడనే పండుకుంటూ ఉన్నావే అన్నది అనసూయమ్మ.

ఔనమ్మా మీఅబ్బాయి పెంచినగష్టము చూడలేదా దీక్షపక్కగా చేయుదలచినారు తొమ్మిది మాసములూ రెండువేళలాచేయు పూజా ధ్యానశక్తుల ధారపోసి మంచి కుమారుని పుట్టించుకొనవలె ననివారూ ఆహార విహారములలో నియమబద్ధులై భక్తితో శ్రద్ధతో సురత సుఖాసక్తివిడచి తొమ్మిది మాసములు త్రిశక్తి ధ్యానశక్తి శిశువుకేఇచ్చి మంచికొడుకును కనవలెననినేనూ ఇట్లి ఇరువురమూ భగవంతుని గొల్చుతున్నాము ఈపద్ధతిలో కట్టుదిట్టము చేసినదినేనే తనకు అసమ్మతమయినా ఆశలు ఎంతోఉన్నా ప్రేమ నాపలేకున్నా పాపము నామాటపై నిల్చున్నారు ఈబాల్యములోవారు ఈదీక్షను సాగించవలెనంటే మహాకష్టము నీవు రూపవంతుడవూ విద్యావంతుడవూ ధనికుడవని కోరిమావారు నన్నుఇచ్చినారు తిరిగి మాఇంటినుండీ పిల్లను తెచ్చుకోవలెనంటే నీకు ఏ పీ ఎందునా తగ్గిపోని కుమారుడు కావలె లేకుంటే మావారు యివ్వరు యివ్వనప్పుడు మనకు అవమానము అట్లలేకుండా అవ్వా తాతా మొదలుకొని అత్తగారి వరకూ పిల్లను ఇస్తాము ఇస్తామని యింటిచుట్టూ తిరిగేలాగు మనవాడుండవలెనంటే మనమీపద్ధతి అవలంబించి మంచి వానిని కనవలె నన్నాను. పాపము నామాట కాదనలేక నిలిచినారు ఒకొకప్పుడు ప్రేమ నాపుకొనలేక నాచుట్టూ తిరుగుతారు. అదిచూచినేను ఏమి దీక్షావిఘ్నము చేస్తారా అంటాను లేదు ఆంజనేయుల ధ్యానిస్తానంటూ జారుకుంటారు మనుమనికి

మనుమరాలిని యివ్వవలె మీయింటినుండే మాయింటికి తిరిగీ పసుపు కుంకుమ తెచ్చుకుంటాము యిచ్చినింటికి యిచ్చుట పరమ శ్రేయమన్నావుగా తెచ్చుకున్న యింటినుండీ తెచ్చుకొనుట మాకూ క్షేమమే మావదినగారికి చెప్పు అల్లుడు తయారవుతున్నాడు ఆడబిడ్డను రడీచేయమని అన్నది సరోజ.

నవ్వుతూ అనసూయమ్మ 'వదినా ఎంత ఆశఉన్నదో చూచినావా భర్తఇల్లు తనఇల్లని భర్తదేహము తనదేహమనీ భర్తగౌరవము తనగౌరవమనీ భర్తఆర్జన తనధనమనీ తెలిసినప్పుడు యిట్టి ఆశలు గలుగుతాయి పాపము ఆయన ప్రేమనంతా భిన్నముచేసి మూడునాల్గు మాసములు వరకైనా ఉండనివ్వకా వండనివ్వకా ఉత్తమ పద్ధతికిదింపి గడ్డము పెంచమని పూర్వ కాలము వానిగా చేసినావుకదే మాట వింటాడనీ ఆయనప్రేమను నాశనము చేయవద్దు పాపము అన్నది అనసూయమ్మ.

ఔనమ్మా ప్రేమను చూచుకుంటే పెద్దకుమారుడు తండ్రికీ తండ్రికుటుంబమునకూ వాదోడూ సైదోడూనై ఎడమభుజమై సహకరించవలె లేకున్న జ్యేష్ఠుడు పుట్టీ సుఖంలేదన్నావే ఆట్టిగుణవంతుడు పుట్టవలెనంటే తల్లీ తండ్రీ ఎన్నినియమాలూ వ్రతాలూ వక్కపొడ్దులూ ఉంటేగాని పుట్టడన్నావే నీఅల్లుడు ఊరకే వచ్చి ఉంటారా మా అత్తా మామా ఎన్నినోములు నోచినారో ఏమో ఏకొరతాలేని వారుగా వున్నారు లేకున్న నామాటపైన నిల్చుతారా ఛా ఎవరునీకు చెప్పినది. బుద్ధిలేదు అని ఒకగర్జనచేసి వుంటే దీక్ష దీక్షగా మన్నైపోయి ఉండు తలిదండ్రుల పూజాఫలముగల చోట్లలోనే సత్పుత్రులు పుట్టుతారు. సత్ప్రవర్తనకు లోనగుతారు సాత్వికులని పించుకుంటారు అన్నది సరోజ.

జ్ఞానాంబ నవ్వుతూ వదినా పిల్ల జాబు ముట్టినదోలేదో మీ అన్నగారు నన్ను క్షణకాలము కాలొకచోట నిల్వనీలేదు మూడవ మాసము పడినదీ అనివ్రాసినారూ దీక్షా విషయమూ పూజావిధానమూ భగవంతుని కోరువిధానమూ ఆహార విహారములూ ఆచరణావిధీ గర్భవతికి ముఖ్యము ఇరువురకూ చక్కగాచెప్పి జ్యేష్ఠపుత్రుడు పుట్టునట్లు మంచిరూపమూ జ్ఞానమూ ఉండునట్లూ చూడవలెగదా పోయిచెప్పిరావో అని తొందర తొందరగాదు లేదులెండీ తల్లివల్ల సంస్కారమయిన కోడలూ తాకూ తప్పు తెలిసినదీ ధర్మాలూ నీతులూ నియమాలూ గల్లపిల్లా తనగర్భరక్షణ తనకు బాగాతెలిసి ఉండును అన్నాను. విన్నారా ఊహూ తనకోడలు అన్నీతెలిసినదయినా కొడుకు అలవిగాని వాడనీ ఆమె మాటలు వినివుండడనీ దీక్షను సాగించబోడనీ

ఆమె మాటలెక్కచేసి వుండదనీ ఆయన నమ్మకం పాపంపిన్నాను వాణ్ణిచూస్తే సరోజా నీవు ఎంతోమార్చినావని నాకుతోస్తుంది. భార్యశాంత చిత్తయై మంచి నడవడిక గలదై వలపించుకొను విధానము సేవేనని తెలుసుకొన్నదైన భర్త ఏమిచేగలడు ముక్కోపియై లయకారకుడగు శివుడు పార్వతీ గంగల వశవర్తనుడై అర్థదేహమొకరికీ శిరస్సొకరికీ కూర్చొన చోటిచ్చినాడు యుక్తాయుక్తముగా లోకముల పడునాల్గిటా లొంగదీసి ఎత్తుకు ఎత్తుగా జిత్తులమారియై మత్తులా ప్రమత్తులా బత్తులానొకదారిన నడిపించు మహావిష్ణువును లక్ష్మీ వలలోవేసుకొని హృదయస్థలమున నెలవేర్పరచుకొన్నది. అంకస్థలమున గూర్చున్నదిచూడా స్త్రీకి లొంగని పురుషుడు ప్రపంచములోలేడు వలపులవలలో చిక్కించుకొని సుఖపెట్టుతూ సుఖపడుతూ మంచిత్రోవన నడిపించినదే ఇల్లాలు ఇహములో పరములో పికొరతలూ ఆమెకు ఉండవు కుమార్తెను బాగాతయారుచేసినావు వదినా కోడలు ఎట్లాటిది వస్తుందో ఏమోనని మాకుభయముగా ఉండీనది ఈమెతో మాకుటుంబము హాయిగా పరమానందముతో పెరుగుతుంది అని కోడలిపై చేయివేసి కౌగలించుకున్నది జ్ఞానాంబ.

అమ్మా అత్తకు కోడలు నచ్చింది అత్తకు అల్లుడు నచ్చినాడోలేదో కొంచెము చెప్పు అన్నది నవ్వుతూ సరోజ.

అనాడే చెప్పితికదే పిన్నాన్న అన్నమాట అల్లుడు అధికారాలమూటె భుజాన వేసుకొని దురాదాయాలదేవుణ్ణి నెత్తినెక్కించుకొని లాభాలసంచి సంకకేసుకొని వంగిన మీసాలు చక్కదిద్దుకొని లేనిపోని టీకుటాకుల్తోవచ్చి నడిమంచములో గూర్చొని పరమ భేతాళస్వరూపమై అవితే ఇవితే తే తెమ్మని దిగమ్రింగుతూ అధికారాలు చెలాయించుతూ అవిలేవు ఇవిలేవని మనుషుల నొప్పించుతూ ఉండే మాతుల భేతాళస్వరూపముగాదు. మన అల్లుడు శ్రీ మహావిష్ణుస్వరూపము మంచి కలయికగలవారు. మర్యాదా గౌరవమూ గలవారు పెద్దచిన్నలను గౌరవముగల వారు ఉత్తములు శాంతచిత్తులు అత్తగారు ఇవ్వవలె నేనుతినవలెనను ఆశలేనివారు అందులోగల ధర్మమెరింగినవారు ఇట్టివారికి మనమేమిచ్చినా దుఃఖముండదు మనకు ఇద్దరుగాదు కొడుకులు ముగ్గురని తలంచుకో మనలో కలసి పోవువారు పాపపుణ్య విచక్షులుగలవారు మనపుణ్యాను సరణముగా దొరికినారు మనఅమ్మాయి కొంచెము ముక్కోపి వారిని నొప్పించీ బాగాచెప్పు ఆయనను నొప్పించితే కుంభీ పాక నరకములో కూలుతుందనిచెప్పు అన్నాడు నీదేమాకు భయముగా వుండినది

అదితీరిపోయిందితల్లీ మాయల్లుడు శ్రీ మహావిష్ణువే మాసంతతిలో అనాడే చేర్చు కున్నామన్నది అనసూయమ్మ.

ఆ మాట జ్ఞానాంబ విన్నతోడనే హృదయానందముతో మైమరచి వదినా నీయల్లుడు అందరివలె అధికారాలు చెలాయించే వాడుకాడు అమితాశగలవాడుకాడు ఇతరులతో ఏదితీసుకున్నా మనుజన్మానికి బాకీఅనేవాడు చేతనయితే చేతిది ఇచ్చే వాడు పాపభీతిగలవాడు ప్రతిజీవినీ తనతో సమానముగా చూచుకొనువాడు భార్యనూ అత్తమామలా బావమరదులా చూడడా అమ్మా అప్పకుగానీ అత్తామామకుగానీ భార్యకుగానీ బరువుగానివాడు ప్రజలకు మరీబరువుగాడు మా సరోజ ఎవరికీ బరు వుగాని రీతిగనే గన్పడుతూ వున్నది అన్నది జ్ఞానాంబ.

ఉంటారు వదినా అమ్మానాన్నకూ అత్తామామకు అలుపిల్లలకూ గ్రామవాసు లకూబరువై భూమికి భారమై లోకకంటకులుగా మనుజన్మకు ఏమవుతామను అలో చనలేని బుద్ధిహీనులు వారికీ మనవారికీ చాలాతేడా అన్నది అనసూయమ్మ.

రాము గదినుండీ బైటికిపోతూ అత్తమెప్పు వడసిన కోడళ్లూ అత్తమెప్పు వడ సిన అల్లుడూ ఇప్పుడిప్పుడే పుట్టినారు ఇక ఈ ఇద్దరికీ పుట్టబోయేవాడు ఎట్లపుట్టు తాడో ఏమోస్వామీ అదినీవు చూచుకోవలసినదే అన్నాడు రాము.

రాము యింకా నిద్రపోలేదేమోకదూ యింకా ఏమయినా అహారంకొరత ఉంటే రాండీ లడ్డుంటలున్నాయి అన్నది నవ్వుతూ సరోజ.

అంతకన్నా తీపుగల మాటలు వింటూ ఇంకా అతీపు ఎంపరు నాకోడలు మంచిదని అలింగనము చేసుకొను అత్తనూ అల్లుని కొడుకుల్లో చేర్చుకున్నామనే అత్తనూ నాభర్తమంచివాడనే భార్యనుచూచి అమాటలువినీ కడుపులో యింకావెలితి ఉంటుందా అబ్బా ఈ క లి కా లం లో ఈలాంటి వారున్నారంటే వింతగాదా అన్నాడు రాము.

సరోజ అమాటలువిని నవ్వుతూ అమ్మమాటా భార్యమాటావిని ఇద్దరి హృద యములలో చోటుగల్పించుకొని అత్తమామలతో మా అల్లుడు మంచివాడనిపించుకునే అల్లుడుకూడా ఈ కలికాలంలో పుట్టడం పాపపుణ్య విచక్షణ తెలుసుకోలేని వయ స్సులో తెలుసుకోవడం సామాన్యమా తామొక్కరుగాక అన్నది సరోజ.

రాము బైటికిపోయివస్తూ అత్తా అమ్మ మధ్యలో చోటుగల్పించుకున్నావు నన్ను వీరదోలినావు భద్రమయినచోటు దొరికింది ముందు అమ్మకడుపులో పెరిగి నావు యిప్పుడు అత్తకడుపులో పెరుగపోతున్నావు కడుపులో ఒకనిపెంచుతూ ఉన్నావు నీకు ఇంటితోడూ దోవతోడు బాగా దొరికినవి నేనేగా ఒంటరిని అంటూ రాము గదికి పోయినాడు.

ముగ్గురూ నవ్వి ఆనందముతో ఆనందబాష్పముల అత్తా అమ్మాతో ప్రేమా నురాగములతో భార్యకను కూర్కినారు.

రాత్రి నాలుగున్నర గంట అయినది గదిలో అలారము కొట్టినది రాముతేచి అత్తా అమ్మా మధ్యలోఉన్న సరోజను వారికి నిద్రాభంగము గాకుండాలేపి కాల కృత్యములు తీర్చుకొని స్నానముచేయ పోయినాడు సరోజ కాలకృత్యములు తీర్చు కొని స్నానము చేయబోయినది. రాము దేవునిదగ్గర కార్యములు చూచుచుండెను సరోజ స్నానము చేసివచ్చి త్రిదేవులకు నమస్కరించి ముఖాలంకరణార్థం కుంకుమ పెట్టుకొని అగ్నిదేవుని ధ్యానించి పొయి ముట్టించి కాఫీకి నీళ్లుపెట్టి దేవునిదగ్గర దీపములు ముట్టించెను. రాము ధ్యానము చేయుచుండెను రాత్రి పాలతో కాఫీవేసి దేవునిదగ్గర పెట్టి నైవేద్యము చేయండీ అని పోయి అమ్మనూ, అత్తనూ లేపినది వారు దినకృత్యములు దీర్చుకొని పలుదోమివచ్చిరి వారికి ఇరువురకూ కాఫీ ఇచ్చినది సరోజ.

ఈవేళకే స్నానముచేసి కాఫీవేసి దేవునికిచూపి తాగుచున్నారు చూడవే వీళ్ల ఓర్పువీమో అన్నది అనసూయమ్మ.

ఔను సోమరులుగాక వేకువనేలేచి కార్యకలాపాలు చూచుకొని దేవుడూ దైవమూ అంటేకదా మరుజన్మలో మానవునికి కావలసినవన్నీ ఉండేది సోమరులై మరుజన్మకెట్లాఅనే దిగులులేక ఏడున్నర గంటవరకూ నిద్రపోయేవారిలో చేరితే ఉండనే ఉన్నది ప్రక్కనే దారిద్ర్యదేవత అన్నది జ్ఞానాంబ.

స్నానము చేయుపోండి నీళ్లు కాగినవి అన్నది సరోజ.

సరేనని ఇరువురూ స్నానము చేయబోయినారు.

సరోజ పాలవాడు పాలుతేగా తీసుకొని కాచి సూర్యోదయమగు తున్నది పాలు తెమ్మంటారా అన్నది.

సూర్యుడు కొంచెమయినా కంటికగుపడిన బాగుండును చీకటిలో పెట్టరాదు అయినా పాలు చల్లారులోపల సూర్యుడు అగుపడగలడు పాలుచల్లారనీ కాలే పదార్థాలు ఏవీ వినియోగము చేయరాదు అన్నాడు రాము.

సరోజ దినమూ చేయుప్రకారము దొడ్డిలో పీటవేసి దీపము మొదలుకొని సర్వమూ పీటపై ఉంచినది రాము సూర్యధ్యానము చేయుచూ నిలుచుకొనిఉండెను సరోజ సూర్యాష్టోత్తరముచెప్పి మొకరించి నమస్కరించి వంటగదికి పోయెను.

జ్ఞానాంబ అనసూయమ్మ స్నానముచేసి వంటశాలలోకివచ్చి సరోజా కూర గాయలేమున్నవి ఏమితేవలె ఈనాడు దినశుద్ధి బాగున్నది. పుంసవనం శాస్త్రానికి ఎక్కువా తక్కువా గాకుండా పౌరోహితుడులేకుండా నవీనముగా ఖర్చుఎక్కువ లేకుండా చేతాము అన్నది అనసూయమ్మ.

ఔనువదినా ఉన్నవారినీ లేనివారినీ అనుసరించక మధ్యవర్తిత్వముగా వర్తించేది అందరికీ మంచిదేకానీ అన్నది జ్ఞానాంబ.

అంతలో రాము సరోజను పిల్చగా పోయినది సూర్యునకు అర్ఘ్యపాద్యాదు లిచ్చి మంగళహారతి తట్టలో ముట్టించిపెట్టి ఊ అన్నాడురాము సరోజనుచూచి సరోజ పోయి తట్టపట్టు కున్నది.

ఇరువురూ కలిసి మంగళహారతియిచ్చి తట్టక్రిందపెట్టి మొకరించి నమస్క రించి లేచి చెప్పుకోతగ్గవి చెప్పుకున్నారు.

జ్ఞానాంబ అనసూయమ్మ వారిఓర్పునూ బాల్యభక్తినీ ఇరువురి కలయికనూ చూచి ఆనందపడుతూ నిత్యమూ ఇదేవిధముగా చేస్తారా అన్నది జ్ఞానాంబ.

సరోజ అత్తనుచూచి నవ్వుతూ ఔనత్తా దేహమును సుఖపెట్టిన సోమరితనము గలిగి ఆచరణా విధానము అడుగంటిస్తుంది. మైథున నిద్రాహారములకు లొంగ దీస్తుంది తల్లీ దండ్రీ గురువూ దైవము చిన్నా పెద్దా అనేభావము దుమ్ములో కల్పే స్తుంది పరదారా పరధనం పరాన్నములకు దోసిలొగ్గిస్తుంది దురాశలకు దుమికిస్తుంది

మీకుమారుడు అట్లాటివాడుకాడు ఆర్యధర్మాన్ని అనుసరిస్తారు ఆచరిస్తారు భార్యకు పుణ్యాన్ని పంచిస్తారు కన్న తలిదండ్రులకు పుణ్యముగడించి ఇస్తారు అత్తమామలకు ఆనందాన్నిగలిగిస్తారు ఇరువాగుల వారిలో పూజ్యత సంపాదిస్తారు సోమరితనానికి ఎడమివ్వరు పాపానికి చోటివ్వరు రాబోవు జన్మానికి ఇట్లాటి కొడుకునేకని నాకు దానంచేయి అత్తా ఈనాడే చెప్పుకుంటూ ఉన్నానని అత్తకు మోకరించి నమస్కరించి నది సరోజ.

జ్ఞానాంబ నవ్వుతూ రెట్టలుబట్టి ఎత్తుతూ కాదే లోకములో అమహాతల్లి నాకొరకయ్యే కనిపెట్టి కావలసినవన్ని దుర్నీతులునేర్పి నన్నువెతకుతూవచ్చి కనిపెట్టి పట్టి ఈమహాను భావునికి అంటగట్టింది నాజీవితము నాశనముచేసింది దానికడుపు ఏ రక్కసికడుపో ఏమో పేరివంశము నాశనముగానూ అని దూషించేవారు వుంటే నీవురాబోయే జన్మానికికూడా ఇప్పుడే బేరమాడుతున్నావుగదే ఇది నీపుణ్యము నాదికాదు స్త్రీ తనధర్మమును తాను తెలుసుకొని చక్కగా నిర్వర్తిస్తే అపురూప వంతుడూ అనువైనవాడూ అనురాగముగలవాడూ యౌవనవంతుడూ తానెదుగక ముందే తన్నానందపెట్టను సమయమెదురు చూచుచూ పావురము తనుతిన్నది పిల్లలకు పెట్టినట్లు తానుతినక తెచ్చిపెట్టుతూ కనుసైగలతో మెలగుచూ కలలో కూడా గన్పడుతూ తియ్యని భావముల చూపుచూ కాచిఉండును. దురదృష్టురాలై దూరమాలోచింపక దుండగములకు లోనైతే పెండ్లిగాక కొన్నాళ్లు దుఃఖము అయిన దాదిగా మగనిపోరు అత్తపోరు మగడురోగి తానురోగియై సదాచింతలో కుళ్లిపోతారు దుండగులు సంప్రాప్తమయి బాధిస్తారు దీనిలో ఉన్నమర్మమిదే ధర్మముగానీ అధర్మముగానీ మానవుని మైమరపిస్తుంది. ధర్మము అదృష్టముగా మరుజన్మకు మారుతుంది. అధర్మము దురదృష్టముగా మారుతుంది. ఆశే మానవుని అధోలోకానికి పంపేది ఆశే దేవతల కందరాని కైవల్యానికి మానవునిపంపేది ఆశలో భేదమున్నది మరుజన్మ ఇంకా మంచిది కావలెననునదీఆశే వారితీరుఇదే మరుజన్మ మెట్లున్నాకానీ ఈజన్మలో చేతనయినంత మట్టుకూ దొరికినంత మట్టుకూ దోచుక తిందామనెదీఆశే దురాశతో ఇదీ అదీ చెరచుకొని దుఃఖించేవారి జట్టు తల్లీ భర్తను కంటికిరెప్పలాగా చూపెట్టి కావలసినంతా సుఖపడి సుఖపెట్టు కాలాన్ని వృథా చేయక భగవంతునియందో గృహకృత్యములయందో జీవనోపాయములయందో గడుపుతూ ఒకరికొకరు భార్యాభర్తలు ద్రోహములు చేసుకొనక చక్కని పిల్లలగని ఇరువంశములవారికీ ఏియపకీర్తితేక నూరేండ్లు బ్రతుకండి ఇది కన్నతల్లులఆశ

మిమ్ములచూచి మాకష్టములు మాయమై మాఇనువురకూ ఆనందముగా ఉంది మీ తల్లి కోర్కెఇదే కనిపెంచి మాకప్పగించినది నీతల్లి కనిపెంచి నీకప్పగించినాను నేను కట్టుకున్నవాని జీవితమూ కాపురమూ నీచేతుల్లో ఉన్నవి నీఇష్టము పెంచినా త్రుంచినా విభజించినా త్యజించినా వంచించినానీదే అధికారము నీమేలునీవే ఆలోచించుకో అని జ్ఞానాంబ మరింత చేరదీసి ముందుకుపడిన వెంట్రుకల సవరించి ఇరువుర వంశముల పావనముచేయ పుట్టినావుపో మేము ధన్యాత్ములము అన్నది జ్ఞానాంబ.

ఆమాటలువిని అనసూయమ్మ మనసుకరిగి ఆనందబాష్పములు కన్నులనుండీ జారగా తుడుచుకొంటూ వదినా నీవుధర్మదేవతవు లేకున్న ఇంత భూతదయా శాంతమూ ఓర్పు గలుగదు కోడలిని చేరదీసి కన్నబిడ్డలాగా కనికరముతో బుద్ధి గరపి గౌరవించుట గలుగదు స్త్రీకి ఉండవలసిన శాంతమూ ఓర్పూ ధర్మమూ దయానీలో మూర్తీభవించి ఉన్నవి ఈనాడు చూస్తూఉన్నాను నాకడుపు పాల సముద్రమై పున్నమనాడు ఉప్పొంగినట్లు ఉప్పొంగుతున్నది నాబిడ్డ ధన్యాత్మురాలు నీపరను పవిత్రమయిన పాదసేవతో పావనియై ప్రకాశిస్తుంది. నీవంశను అచంద్రద్రస్థాయిగా ఉంటుంది. కన్నకడుపులోగల కనికరమూ కన్నతల్లిలోగల పాకురమూ కన్నబిడ్డ కష్టములకు తల్లిపడెడి దుఃఖమూ బిడ్డ బాగుకొరకై పడుతల్లి తహతహలా బిడ్డ జీవితరక్షణకై తల్లిపడు ఆరాటమూ నీవుబాగా అర్థము చేసుకున్నదానవు నీహృదయము పరమ పవిత్రమయినది అని చేతులుజోడించి కన్నుల నీరు విడచినది అనసూయమ్మ

జ్ఞానాంబ అదిచూచిపోయి చేతులు పట్టుకొని వదినా స్త్రీ జన్మము అందరిదీ ఒకటే అందరూ ఒకఇంటికోడండ్రే అందరికీ ఆశలుంటాయి అందరూ సుఖపడవలెననే వుంటారు అందరూ గౌరవమునే కోరుతారు అంధరూ అధికారము చెలాయించవలెననే ఉంటారు అందరూ మైథున నిద్రాహారములు కోరుతు సుఖముగా వుండవలెననే వుంటారు వద్దనువారెవరు గడచిన జీవిఏది చేసినంతా మహాదేవా అన్నట్లు ఈజన్మలోచేస్తే మరుజన్మకు సాక్షాత్కరిస్తుంది. మంచి చేసుకుంటే మంచే ఉంటుంది చెడ్డచేసుకుంటే చెడ్డే వుంటుంది కోడలూ మనలాంటిదేనను అత్తా అత్త పెద్దది అనుభవముగలది ఆదరణ యిచ్చినది అన్నివస్తువులకూ అధికారి అడిగి చేతాము అణుకువగా ఉందాము అడిగి అనుభవిసాము అనేకోడలూ ఇరువుర

లోగల ధర్మము నెరింగి రథము నడుపు కొడుకూ గలిగితే ఏచింతా వుండదు ఆ ఇల్లు అమరభూమి కాగలదు తెలియనివి జతపడితే నరకలోకము కాగలదు మన సరోజలో సర్వశక్తులూగలవు నాకుమారుడు చక్కగా తల్లీతండ్రీ గురువులవారితో సంస్కారమయిన వాడు ఈదాంపత్యములో చక్కదిద్ద వలసినదేమీ ఉండదు చక్కగాపోయి గమ్యస్థానము చేరగలరు. నన్నూ మామేనత్త అమ్మా అత్తా తానే అయి సంస్కరించినది. మీ అన్నగారు పతియై శ్రీపతియై సర్వధర్మములూ చక్కగా పిల్లలకు నేర్పినట్లు నేర్పినారు మాకుటుంబములో దుఃఖమునకుగానీ కోపమునకు గానీ క్రోధమునకుగానీ అధర్మమునకు అనాచారమునకుగాని చోటులేదు చోటు యివ్వము మాకుతగిన కోడలే దొరికినది మాకు సంతోషకముగాక దుఃఖమెక్కడిది వదినా అను నంతలో.

అమ్మా అన్నది సరోజ.

జ్ఞానాంబ అనసూయమ్మ లోపలికి పోయినారు రాము పూజ ముగించి తీర్థము పుచ్చుకున్నాడు.

తీర్థము తీసుకోండి అత్తా అన్నది సరోజ.

జ్ఞానాంబ అనసూయమ్మా చేతులు సాచినారు.

రాము యిద్దరినీచూచి వదినా వదినా యింటిలో ఎవరికి యుండూ అమ్మ పెద్దా అత్తపెద్దా అన్నాడు.

అంతలో జ్ఞానాంబ నవ్వుతూ వీడు శాఖామృగస్వామి వదినా నోరూ చేయి ఊరకుండదు. అని చేయి ఇంకాముందుకు సాచి వేయరా అన్నది.

నీవు పెద్ద వదినవా అంటూ తీర్థం వేసినాడు. అత్త చేయి సాచినది. చిన్న వదినా అంటూ తీర్థంవేసి సరోజను చూచినాడు రాము.

సరోజ దేవునికి నమస్కారముచేసి అత్తకూ, అమ్మకు మ్రొక్కి రాముదగ్గరకు వచ్చినది.

ముందు అందరికీమ్రొక్కి మొగునికి మ్రొక్కుతావా నీ మ్రొక్కు నాకొద్దు నా తీర్థం నీకొద్దునో అన్నాడు బిఱ్ఱుగా రాము.

ఇక్కడ తమకన్నా చిన్నవారు ఎవరూలేరు. దేవుడు చిన్నా, అమ్మ చిన్నా. అత్తచిన్నా, ఇందులో చిన్న నేనే మ్రొక్కుతున్నాగా విఘ్నేశ్వరుని మ్రొక్కులు గావలె నన్నా మ్రొక్కుతాను ఏవిగావలెనో చెప్పండిస్వామీ అంటూ నమస్కరించి చేయిసాచినది.

తప్పులు చేసినప్పుడు బింగిళ్లూ ముక్కుచెంపలూ ప్రదక్షిణాల మ్రొక్కులు అని తీర్మము వేసినాడు రాము.

తమరు తప్పులు చేసినప్పుడు తప్పుని వేలుబెట్టి చూపితే అమ్మదగ్గర బింగి ళ్లతో, గుంజిళ్లతో, ముక్కుచెంపలతో, విఘ్నేశ్వర మ్రొక్కులు మ్రొక్కుతారా చెప్పండీ అన్నది సరోజ.

ఓ అని మధ్యగదిలోకి పోయి చొక్కావేసుకొని కాగితమూ పేనా తీసుకొని వచ్చి సరోజనుచూచి ఊ ఏమికావలెనో చెప్పు అన్నాడు రాము.

సరోజ కాఫీ తెచ్చి రాముకుఇచ్చి కాగితమూ పేనా తాను తీసుకొని అత్తనూ అమ్మనూ చూచి బజారుకు పోతున్నారు ఏమి కావలెనో చెప్పండీ అన్నది.

జ్ఞానాంబ రామును చూచి ఈనాడు శివకేశవులకు అభిషేకం అర్చనా ముఖ్యము. ఇంటిలో ఏ శుభకార్యము జరిగినా అర్చనచేయించక శుభకార్యములు ఇంటిలో చేయరాదు. ముందు అక్కడచెప్పి డబ్బు ఎంత కట్టవలెనో అదిచెల్లించి పదకొండు గంటలకు వస్తామనిచెప్పి మార్కెట్టుకువచ్చి నాలుగైదు రకములపండ్లూ పూలూ అయిదారు రకముల కాయగూరలూ ఇంకా ఏమివదినా అన్నది జ్ఞానాంబ.

అనసూయమ్మ జ్ఞానాంబను చూచి అయిదు పందినైనా ముత్తైదువుల పిలుస్తా ముకదా వారికి పూలు, పండ్లూ ఇవ్వవలసి వస్తుంది. యాభై అరటిపండ్లు, పీసె పూలూ, ఏడుఎనిమిది టెంకాయలు అయినా ఉండవనిలేదా అన్నది.

సరే వ్రాయి అమ్మా పిల్లా జల్లా వస్తే ఇవ్వవనిలేదా ఉండనీ అంతమా త్రము అన్నది జ్ఞానాంబ.

సరోజ అవి వ్రాసి ఇంటిసరుకులు అన్నీ ఉన్నవి. ఏవీ అక్కరలేదు అయితే ఒక మనవి. ఈ టెంకాయలూ, పండ్లూ, పూలూ చిత్రిపట్టవు. రెండు చిత్తులకు

వస్తాయి ఖజానవేసుకొని రావద్దు. ఎంత సంసారము మీదే అయినా లౌకికము ఉండవలె ఇక్కడనుంచే బండి తీసుకొనిపోయి దేవాలయాలదగ్గర అభిషేకం చీట్లు కొని మార్కెట్లో కావలసినవి తీసుకొని బండిలో పెట్టుకొనివచ్చి ఇంటిముందు దిగండి నేను ఎదురువచ్చి తీసుకుంటాను. భార్య ఏమేమో మోయిస్తూవుంది అని లోకమనకుండా ఉంటుంది. ఇదీ నామనవి చిత్తగించండి అని నవ్వుతూ పేనా కాగి తము రెండుచేతులతో రాముచేతిలో పెట్టినది సరోజ.

అత్తగారి ఇంటికాడి అల్లునివలె నీలుక్కుంటే సంసారమవుతుందా సన్యాసి లాగా సత్రాల్లోకూర్చొని మధ్యాహ్న కబళానికై, ధర్మపిండాలకై పోయేవానిలాగా కూర్చుంటే అవుతుందా ఇది సంసారం తన సంసారానికి తన ఇల్లాలికి రాజులూ, రైతులూ అందరూ సేవకులే అదిలేదు ఇదిలేదు అంటే తెచ్చి ఇవ్వబనిలేదా మన ఇంటికి మనం తెచ్చుకోవడం అమర్యాదకాదు నేను గృహస్థుణ్ణి గృహిణిమాట విన వలసిందే గృహానికి తేవలసిందే చూడవే అమ్మా నన్నొక సోమరిలాగా తయారు చేయ సిద్ధమగుతూ వుంది అన్నాడు రాము.

చూడత్తా ఏదీ తానే ఖజానవేసుకొని వస్తారు. విలువ ఉండవనిలేదా ఆ మాటంటే ఇవన్నీ చమవుతారు అన్నది సరోజ.

ఔను వానిసంసారానికి వాడు ఎవడూ దాసుడే తనదే తాను చేసుకొనక పోయిన ఒరులది ఏమిచేస్తాడు. పుణ్యమేమి సంపాదించు కుంటాడు. తన్ను తాను చక్కగా రక్షించుకుంటూ ఒరుల రక్షణకు చేయూత ఇచ్చినవాడే పుణ్యాత్ముడు పరమలోభులూ, పాషండులూ, సోమరులూ, నాస్తికులూ ఏమిచేస్తారు. ఉన్న ధర్మాల పడగొడ్తారు. ఉన్నవి కాజేస్తారు స్వయార్జితముతో నలుగురినిసాకి నాల్గు మంచికార్యాలు చేసినవాడే ధన్యుడు. ముందుజన్మకు నలుగురు తన జీవితానికి సైదోడుగా ఉంటారు చేసిపెట్టుతారు వానిసంసారానికి వాడు చేసుకోకపోతే ఎవడు చేస్తాడు వానితాత చేస్తాడా అన్నది జ్ఞానాంబ.

ఇప్పుడు మాతాత వుంటే నన్నుచూచి మనుమరాలిని చూచి ఎంతో ఆనంద పడు కూతుర్నిచూచి మరింత సంతోషపడు పాపం ఆ పుణ్యంచేసిన వాడుకాదు అన్నాడు రాము.

ఆయనకన్నా ముందు నేను పాపిని కన్నతలిదండ్రులు చాలాకాలము బ్రతికి మంచికీ చెడ్డకూ అవుతూ మంచి చెడ్డా చెప్పుతూ ఆదరువై ఉండు నోము నోచుకో లేదు. ముందుజన్మలో తల్లీ దండ్రినీ నిర్లక్ష్యముచేసి అన్నపానీయములు విచారించక తృణీకరించి వారిముఖము చూడక వారికి సేవచేయక జారుకున్నాను. నా ముఖముచూస్తూ, నాకు మేలుచేస్తూ నాకాదరువుగా ఎట్లుంటారు. వారూ జారుకున్నారు మీయప్ప ధర్మస్వరూపుడై నాకి సంతరించి నన్ను చెంతచేర్చినాడు అందుకే ఎన్నికష్టాలు వచ్చినా ఏమన్నా ఎంత విసిగించినా యెంతగా కష్టపెట్టినా నా ధర్మాన్ని నేను మరువక సాగిస్తూ ఉన్నాను చేసింది తప్పక చేయిస్తుందనే నమ్మకము కలిగింది ఇంక మరచిపోతాన్నా మరువక సాగిస్తూఉన్నాను చేసింది తప్పక చేయిస్తుందనే నమ్మకము కలిగింది యింక మరచిపోతానాము రువను అన్నది జ్ఞానాంబ.

అర్చకుల వారికీ ధర్మకర్తకూ చెప్పేదానికి వేళ అతిక్రమిస్తుందేమో పోయి జాగ్రత్తగా రాపోండీ అన్నది సరోజ.

ఔనని రాము పోయినాడు.

అనసూయమ్మ సరోజనుచూచి అయిదుమంది అయినా ముత్తయిదువలు ఉంటే బాగుంటుంది ఈవీధిన ఎవరైనాతెలును నేమమ్మా అన్నది.

మనపని మనిషిని అడిగిపోయి పిలిచివస్తే సరిపోతుందిలే నాకెవరూ ఇక్కడ తెలియదని పనిమనిషిని పిలచి ఈవీధిలో శాఖాహారుల్లు ముత్తయిదువలు మనము పిలిస్తే వచ్చేవారెవరైనా ఉన్నారా అన్నది సరోజ.

అంతలో అనసూయమ్మ పనిమనిషినిచూచి వృద్ధముత్తైదువులైన మంచిదిగా ఉంటుంది అందులో పిల్లల తల్లులుగా ఉండిన మరీమంచిది అదీగాక అర్హవై ఎండ్లకు పైనఉంటే చాలామంచిది అట్లాటివారు ఎవరయినా ఉన్నారా అన్నది.

పనిమనిషి ఆలోచించి అమ్మా మంచివారు కావలెనంటే ముగ్గురు మాత్రము ఉన్నారు వారికి మీరేమయినా యిచ్చినా పుణ్యముంటుంది యింకానలుగురున్నారు వారికి సకలవిద్యా పారంగతులని పేరుఉన్నది వారికిచ్చి పుణ్యముండదనుకుంటా నన్నది నవ్వుతూ.

సరేవదినా ఆముప్వురినీ పిలిచితే మనమిద్దర మున్నాముగా అయిదు మంది సరిపోతాము ఒకరమే పోయేదానికన్నా యిరువురమూపోయి పిలిచివస్తాముపదా అన్నది జ్ఞానాంబ.

సరేనని కుంకుమబరిణె తీసుకొని అనసూయమ్మ సరోజ పోయి పిలిచివస్తాము నీవు వంటకు ప్రయత్నము చేయమ్మా అంతలోపల వస్తామని పనిమనిషితో కలిసి పోయి ఆ ముప్వురినీ గౌరవముగా కార్యముచెప్పి కుంకుమయిచ్చి వచ్చి కార్యము చూచుకొన ప్రయత్నము చేసినారు.

అంతలో రామువచ్చి సామానులు యింటిలోపెట్టి తిరిగీ పోజూచినాడు.

ఎక్కడికి అన్నది సరోజ.

హెడ్‌మాష్టరుతోకలసి మాట్లాడివస్తా ఈవేళ ఉదయం రాలేనని చెప్పి వస్తానన్నాడు రాము.

సరే నన్నది సరోజ.

రాముపోయి హెడ్‌మాష్టరుతో చెప్పివచ్చి స్నానముచేసి దేవుని కార్యములు చూచుకొనుచుండ పది గంటకొట్టినది

రెండుమూడు రకముల తీపులతో ఏడు ఎనిమిడి కూరగాయలతో వడా అప్పళములు పప్పూ పరమాన్నముచేసి చాలవా అన్నది జ్ఞానాంబ.

యివన్నీ మీ కుమారునికిగానీ మీకుమారుడు సేవించే దేవునికిగానీ యిష్టము లేదు వారిపదార్థములు యింకా కాలేదు అన్నది సరోజ.

అవేమిటే అన్నది జ్ఞానాంబ.

నవ్వుతూ సరోజ వారిదేవుడు అమృతాలతో కడుపు నింపుకునేవారు అందు కయ్యే ముప్పైరెండువేలా తొమ్మిదిమంది లెక్కకు తగిలినారు లెక్కకురానివారు యికెంతమందో తెలియదు వారిభక్తులుపేరు పంచామృతాలు కోరుతారు అదియింకా కాలేదు అన్నది సరోజ.

రాము తిరిగిచూచినాడు చిరునవ్వునవ్వుతూ.

సరోజ నిండుపూర్ణిమ చంద్రునివంటి ముఖమండలము వికసింపచేసి రామును చూచి అమ్మతో చెప్పుతున్నానని చూస్తారా అమృతం మరచినారని చూస్తారా మీరు మరచినా నేనుమరువనుగా పంచామృతం ఎందుకు దశామృతం చేస్తాను మీకూ

దేవునికీ నోటికింపుగా రుచిగా ఉండేటట్లే చేస్తానంటూ టెంకాయకొట్టి నీళ్లుజాగ్రత్తగా పాత్రలోపోసి అరడజను అరటిపండ్లూ పాలూ నెయ్యీ పెరుగూ తేనే చక్కెరా లేతకొబ్బెరతురుమూ చీనాపండ్లు జామపండ్లూ సపోటాపండ్లూ ద్రాక్షావేసి కొంచెము యాలకలపొడిచేర్చి చాలవా అత్తా అన్నది సరోజ.

పంచామృతముపోయి దశామృతానికి మించినవేచాలు ముప్పై రెండువేలా తొమ్మిదిమంది కృష్ణునికి ఎవరే అన్నది జ్ఞానాంబ.

గోపికలు పదహారువేలు రాచకన్యలు పదహారువేలు అష్టభార్యలూ పైన రాధవారు స్త్రీలోలురు తమరు వారిభక్తులవారు భద్రమని చెప్పుతుంటా నత్తా అని నవ్వినది సరోజ.

రాము చేతులు జోడించుకొని ఓస్వామీ ఎప్పుడూ నీసుద్దీనాసుద్దే నాభార్యకు స్వామీ మనల ఎప్పుడూ హేళనచేస్తుంది. స్వామీ ఆ నాటి నీచిలిపిచేష్టలన్నీ నీభక్తునికి ప్రసాదించు ఇకెప్పుడూ హేళనచేయకుండా ఎత్తివేయకుండా ప్రయోగించి ఇకెప్పటికీ అననని దండము పెట్టేటట్లు చేస్తాస్వామీ కొన్నిమాత్రమే తెలుసు అన్నీ ప్రసాదించు అవతలచెప్పుతా నన్నాడు రాము.

సరోజ నవ్వుతూ ఓస్వామీ మీకూ మీభక్తునికీ ఇప్పుడే దండము పెట్టుతున్నాను ఎన్నిమార్లు మీరుకోరితే అన్నిమార్లు పెడ్తాను. ఇప్పుడుండే చిలిపిచేష్టల భరించలేకున్నాను యింకా ఇచ్చినావంటే వెగటవుతాయి స్వామీ ఉపసంహరించి ఉన్నంతలో వుండనివ్వండీ అన్నది సరోజ.

జ్ఞానాంబ అనసూయలునవ్వుతూ ఇద్దరూ సరిపోయినారు అశుకవుల్లాగ ఎదురయినారు జబాబులు చక్కగా ఉన్నాయి సరోజ ఇకరామ్మా తలదువ్వీజడ వేస్తాము అన్నారు.

సరోజ నూనె దువ్వెనా తీసుకొనిపోయి కూర్చున్నది. జ్ఞానాంబ పువ్వులు అందిస్తూఉంటే అనసూయమ్మ జడ వేసినది. పూలుదండిగా నెత్తిలోపెట్టి పట్టుచీరకట్టుకొమ్మనిచెప్పి పీటవేసి పసవూ కుంకుమా తాంబూలం పూలూ పండ్లూ తట్టలలోపెట్టి క్రొత్తచీరా రెండురవికలూ పసపు అంటించి కుచ్చెబోసిపెట్టి ఇకకూర్చుండువురామ్మా అన్నారు.

సరోజ పట్టుచీర కట్టుకొనివచ్చి కూర్చున్నది జ్ఞానాంబ ఎఱ్ఱనీళ్లు కలిపి తెచ్చిపెట్టినది.

అంతలో ముత్తయిదువులు వచ్చికూర్చున్నారు ఈకార్యము అంతానీవేచేయి వదినా అన్నది జ్ఞానాంబ.

అదెందుకు వదినా అన్నది అనసూయమ్మ.

నాకు ఒంటీపెంటీ అని ఒకడే కుమారుడు నాచేతులారా చేయరాదు దండిగా పండిన కడుపయితే మంచిదే ఈకాలములో అకాలసంతతితో పదీపంౘ్రెండు మంది అయితే అదీపీడే నీవేఇప్పుడు ధన్యురాలవు ఇరువురు కుమారులూ ఒకకుమార్తె బరువుగాని సంతతి నీవే నీచేతులారా నాకోడలికిచేస్తే నీచాలే కలుగుతుంది. మాకు అంతే చాలు తల్లిదండ్రులఋణం తీర్చేటందుకూ వంశవృక్షము నిల్పేటందుకూ వంశోద్ధారకులు వారివల్ల గలుగుపుణ్యమూచాలు కన్యాదాన ఫలముతో తండ్రిసుఖపడను ఒక కూతురుచాలు నీవేచేయి అన్నది జ్ఞానాంబ.

ఆముత్తయిదువులలో ఒకాయమ ఈమాటలువిని ఏమమ్మా ఉన్నవాళ్లుగా ఉన్నారే గలుగనీ పదిమంది పిల్లలతల్లితో పసవుపూసి కుంకుమ పెట్టించు ఇంటినిండూ మనుమలూ మనుమరాండ్రూ ఉండనీ అన్నది.

వద్దుతల్లీ అదీఒక దరిద్రమే అదీఒక దుఃఖమే మనకన్నులారానే చూడవలసి వస్తుంది. ఉన్నదుఃఖానికన్నా లేని దుఃఖమే నయము పదిమందీ పన్నెండు మందీ పిల్లలున్నవారిని చూస్తున్నాముగా దారేషణకన్నా పుత్రేషణ పుత్రేషణకన్నా ధనేషణా భయమయినవి దారనెట్లయినా సంపాదించు కొనవచ్చు కలిగెడి పిల్లల రక్షణ కష్టముఅని కొందరు సన్యాసులై సంసారసుఖములకు దూరులై ప్రకృతి మాతకు ద్రోహులై దైవముంచిన కంచనుదాటి దొంగపశువులై పరాన్నములకూ పరదారలకూ పరధనానికీ దోసిలొగ్గి బుద్ధసన్యాసులయినారు కొందరు కంచెదాటక కుటుంబ రక్షణలోనే ఉండి ఇంతో అంతో పుణ్యము సంపాదిస్తూ ఉన్నారు మానవుని ఆర్జిత శక్తికి మితిమీరిన పిల్లలు తలిదండ్రికి మృత్యు స్వరూపులు కొందరికి పదిపదహైదు మంది పుట్టి అందరూగిట్టి అరవను పిల్లలేకపోగా దేవుళ్లకూ దైవాలకూ తిరుగుచూ దుఃఖించేవారూ ఉన్నారు పుట్టినపిల్లలు అప్రయోజకులైపోగా వారినిసాకలేకా కొంత అప్రయోజకులైరని మరింత దుఃఖించువారూ ఉన్నారు ఇదీజాస్తి అయితే చావే నమ్మా చాలు ఇద్దరుకొడుకులూ ఒకకూతురూ బుద్ధిమంతులూ శ్రీమంతులూ ఆరోగ్యవంతులూ అదృష్టవంతులూ ఎందరుకావలె అందుకే మా వ ది న నే నియమిస్తూ ఉన్నాను అన్నది జ్ఞానాంబ.

ప్రాప్తముగాని అట్లాటివారుచేస్తే అట్లనే అవుతారన్నమాట అబద్ధం అన్నది ఒకాయమ.

జ్ఞానాంబ ఆమెను ఎగాదిగాచూచి కాదమ్మా లోకమంతా ఆచరణలో ఉంచుకుంటూ వున్నారుగా గృహప్రవేశాలకూ శంఖుస్థాపనలకూ అవిష్కరణలకూ గొప్ప గొప్పవారిని పిలుచుకవచ్చి చేయిస్తూ వున్నారే వారిభావమేమి వారంటిస్థితి ఈ వస్తువులు పొందవలెననిగదా వారు పూర్వజన్మ సుకృతపరులూ వారుతగిలినా కాలుముందుపెట్టినావారు ఆశీర్వదించినా అందులో సుకృతముండునని ఆశ ఆశ మంచిదిగా మానవుడుంచుకున్న అటుపైదైవఘటన ఎట్లోఅట్లు జరుగుతుంది. అందువల్లనే ఏకార్యానికీ పెద్దముత్తయిదువులు కావలెననేది చూడూ ఆమెకు దాదాపు డెబ్భైఏండ్లవరకూ వయసు ఉండును పెద్దముత్తయిదువ ఆమెచేసిన పూర్వపుణ్యము భర్త ఆయుస్సును పెంచినది స్త్రీలకు ఆమె ఆశీస్సులు ముఖ్యము ఆమె నిండుగా పండిన మామిడిపండులాగా ముత్తయిదువ తనము ఉట్టిపడుచున్నది ఆమెకు నిత్యమూ నమస్కరించు చుండినాకూడా కన్యలకు శుభము చేకూరును ఒక్కొకరు ఒక్కొక పుణ్యముచేసి ఉంటారమ్మా ఒకాయమకు విధవత్వమువచ్చి ఉంటుంది గొప్పగా వైభవమూ ధనమూ ఉంటుంది. ఒకరికి విద్యాబలము వుంటుంది ధనముండదు కొందరికి పిల్లలుండరు అన్నీ వున్నవారు అరుదు వారువారు చేసిన పూజాఫలము మాసరోజకు మాత్రము దైవానుకూలముగా అన్నీ వున్నవి ఏకొరతాలేదు ఇకమీదట ఆమె అదృష్టమెట్లున్నదో భగవంతునికే తెలియునన్నది జ్ఞానాంబ

అమహాతల్లి ముందుజన్మలో మనసునుకట్టివేసి ధర్మమునూ దైవాన్నినమ్మి నడుచుకుంది యిప్పుడు సుఖపడుతూ వున్నదమ్మా తెలిసినట్లేవుంది ధర్మదూరులై దైవదూషకులై మనసుకు లోబడి నడచినవారిని చూస్తున్నాముగా చేసినంతా మహదేవా అన్నదొకాయమ.

ఔనమ్మా రూపమూ ఆరోగ్యమూ యౌవనమూ ధనమూ విద్యా వివేకమూ గౌరవమూగలిగి భూతదయా ధర్మమూ తెలిసినడిచెభర్త దొరుకవలెనన్న ముందు జన్మలో త్రిదేవి పాదపూజ చేస్తూ వారిచ్చినది వారికిచూపుతూ భర్తనూ భగవంతునీ ఒకటిగాచూస్తూ తనధర్మమేదో తానుతెలుసుకొని సర్వజీవులా సర్వులా ఆత్మీయులుగా భావించి వారిఆత్మా తన ఆత్మవంటిదేనని భావించి ధర్మబద్ధయైన స్త్రీ అయి వుండేనే ఈసుఖాలు లభ్యమయ్యేది లేకున్నసున్నే ఫీధులూడ్చువాడూ ఇహామూ

పరమూ తెలియనివాడూ రసికతా యౌవనమూలేని దేహభ్రష్టు మతిభ్రష్టూ వారికి ఒరులచూచి రాత్రింబవళ్లూ దుఃఖింపవలసి వచ్చును. తెలుసుకొని నడచి వారు తెచ్చుకున్నదాన్ని వారికిచ్చిన దేహాన్నీవారికే అర్పించి దైవమిచ్చినభర్త సౌఖ్యమింతే దైవమిచ్చిన ధనధాన్యసంపదా యింతే దైవమిచ్చిన సుఖమూ యింతేనని నెమ్మదిచెంది ముప్వేళల ఇచ్చిన శ్రీదయితునీ తెచ్చిన తనదైతునీ సేవిస్తూ వుండినవారిదే మరులోకము అడ్డదారుల అకలికొరకై తిరిగే అతివలదీకాదు అయ్యగారిదీకాదు అన్నది జ్ఞానాంబ.

ఎంత బాగాచెప్పి నావమ్మాతల్లీ ఉదాహరణకు ఈమె ఇక్కడనే వున్నది ఈమెతల్లిగారు పెద్దధనికులు చేసుకున్నవారూ ధనికులు గొప్ప వుద్యోగి భర్త ఈమెవచ్చిన మూడేళులలోపలనే ధనమూపోయె వుద్యోగమూపోయె తల్లిదండ్రీ గతించి తల్లిగారి యింటి ఆశాపోయె పిల్లలా కావలసినంతమందీ అయినారు అయన పెద్ద వుద్యోగమూపోయి నూరురూపాయల గుమాస్తా అయినారు దారిద్ర్యదేవత తాండవిస్తూ వుంది పాపము ఎటుపోవుటకూ ఏమిచేయుటకూ దారిలేదు అన్నది ఒకాయమ.

అమాటకు అమెకండ్లనీళ్లు పెట్టుతూ దైవవిధిని తప్పించు వారెవరు ఇది నావిధి అన్నది.

జ్ఞానాంబ ఎగాదిగాచూచి కంటనీరు పెట్టుతావెందుకమ్మా కన్నతలిదండ్రుల మనము మరచి కర్మతెచ్చుకున్నాము ఇప్పుడయినా కన్నుతెరవవలె కన్నుతెరిస్తే కనకవర్షాలు కురిపించుకోవచ్చు లేదా కటిక వుపవాసాలూ కార్యహానులూ కష్టకాలాలూ కూరివ్యాధులూ కూటిచింతలూ తప్పించు కొనవచ్చు కోటిజన్మల పాపాన్ని కూల్చవచ్చు కష్టాలకు - వెన్నిచ్చి కన్నీరు పెట్టరాదు. దైర్యము వహించి దైవాన్నినమ్మి త్రిసంధ్యలా సేవించి తీర్చుకోవలె గర్భభారము తొలగించుకొనవలయునన్న మనసును సంధించి ఋతుస్నానము అయిన పక్షమువరకూ ఋతుసమయమునకు రెండు మూడు దినములుముందు సాంగత్యముమాను కుటుంబనియంత్రణ అవును వేకువనేలేచి భర్తనులేపి సూర్యభగవానుని అర్చించమనూ త్రిదేవుల నీవు మరువక సేవిస్తూ ప్రార్థిస్తూ అగ్నిదేవునికి విధిప్రకారము అర్పించు నీకెందుకుండదో ముందుజన్మలో కొంచెమే పూజచేసినావు అంతమాత్రమే గలిగి అగిపోయినది ఇప్పుడు నీళ్లుపోయి చిగిర్చిపెద్దదై పూలుపూచి కాయలు కాస్తుంది. ఈతీగెఎండి

పోవునదిగాదు రేపటినుంచే ప్రారంభించు వెన్నీపున తట్టుతూ మూన్నాళ్లకే ముమ్మరు త్రిదేవులూ నీఇల్లు చేరుతారు వారుకాలుపెట్టినతోటే మూదేవత మూడునిమిషాలు కూడా నిలువదు ధైర్యముతో సాధించు పతికి సైదోడై వాదోడై నిలూనీకు కావలసిన సర్వవిధమంత్రములూ సర్వకార్య విధివిధానములూ మాకోడలిని అడుగూ చెప్ప గలదు దరిద్రులకూ బుద్ధిహీనులకూ అనారోగ్యవంతులకూ హరిధ్యానమే అంగరక్ష భగవతీ ధ్యానమే భద్రత రేపే మొదలుపెట్టూ గట్టెక్కగలవు అన్నది జ్ఞానాంబ.

ఈ మాటలు విన్నతోడనే ఆమె జ్ఞానాంబకు నమస్కరించి జ్ఞానభిక్షపెట్టి కన్ను తెరపించినావుతల్లీ మా ఇంటిలో దేవుని దీపము ముట్టించుటగానీ దేవుని తలంచుగాటనీలేదు మైథున నిద్రాహారములు మూడే నిత్యజీవనము వారెంతో నేనంతే నేనెంతో, పిల్లలంతే అయినది. తినతిండీ కట్ట బట్టాలేక కటకటపడేకొద్దీ దైవదూషణా పరనిందా ఎక్కువయినది చేసేవిధిచెప్పతే తప్పక చేస్తాను తల్లీ అక్రమముచెప్పి పుణ్యముకట్టుకొని నా పిల్లలా నన్ను నిల్పుమని మోకరించి నమస్కరించినది ఆమె.

అమ్మా లే నాకోడలి ననుసరించు నీకు కావలసిన విధానము తెల్పగలదు. తల్లివల్ల సర్వవిధములా సంస్కరింపబడినది. సర్వమూ తెలిసినది వయసు చిన్నద యినా మైనము చక్క నెరింగినది అన్నది జ్ఞానాంబ.

ఔనమ్మా నాపెండ్లాము చిన్నపిల్ల అయినా బుద్ధిలో ముదిరిన ముసిలిది. ఈ ముసలిని అడగండీ ముందుగతులూ వెనుకగతులూ తెల్పగలదు. చెప్పింది చెప్ప కుండా ఏడు అహోరాత్రిళ్లు చెప్పగలదు. ఆ బుద్ధికి తొంబైఏండ్లు ఉన్నాయి అన్నాడు రాము.

అక్కా మీ ఇంటాయనను మా ముసలాయనకు తోడయ్యేటట్లు చేయండి. సం సారములోగల హంగులన్నీ నేర్పగలరు. తొంబై ఏండ్లవారికుండే శాంతముంది. అన్నది నవ్వుతూ సరోజ.

అమాటకు అందరూ నవ్వినారు అంతలో అనసూయమ్మ కానీ యమ్మా అంటూ పసపు చేతికి తీసుకున్నది.

సరోజ రెండు చేతులుసాచి వేయిచేతిలో అన్నది నేనువూస్తానమ్మా అన్నది అనసూయమ్మ.

అమ్మతో అత్తతో పెద్దవారితో కాళ్లకు పసపుపూయించు కుంటే కర్లూ కాళ్లూ వుండవనిలేదా పసపు పూసుకునే ప్రాప్తము వుండపనిలేదా చేతిలో వెయ్యమని

తీసుకొని లేచిపోయి త్రిదేవులకుపూసి కుంకుమపెట్టి పూలుపెట్టి నమస్కరించి వచ్చి కూర్చొని కాళ్లకు పసపు రుద్దుకున్నది.

జ్ఞానాంబ అనసూయమ్మనుచూచి వదినా ఇద్దరు కుమార్లు ఒక కుమార్తె నీవలెనే గలిగేటట్లు ఆశీర్వదించి కుంకుమపెట్టూ అన్నది నవ్వుతూ.

అంతపిదప ఎందుకు వదినా మువ్వురు కుమార్లు ఇద్దరు కుమార్తెలు గలుగునట్లు అనుకుంటానన్నది.

వద్దుఅత్తా యిప్పటికే ఘూపిచిన్నఅయింది ప్రజమిన్న అయినదివద్దు యిద్దరి కొడుకులకు సంపాదించి ఇచ్చేటప్పటికే తలనున్న ప్రాణం తోకకూ తోకనున్న ప్రాణం తలకూ వస్తుంది అయినా నాకేల సాకేతల్లినే అడుగూ అన్నాడు రాము.

అదినాకెందుకు సాకే అయ్యగారినే అడగండి రక్తంపంచిచ్చి కనేవంతునాది రాత్రిం బవళ్లు కష్టించి చాకేవంతు వారిది ఎక్కడికి గెట్టువేస్తే అక్కడికి అన నోటికి పైట అడ్డము పెట్టుకున్నది సరోజ.

కనే వంతునాది అనూ ఆమాట నిల్పుతావెవెందుకు కాలికిపిల్ల ఏలికిపిల్ల డొక్కలోపిల్ల జోల్లోపిల్ల అయితే రంగరంగా పగవారు వేరేకాబట్టరు. అమ్మా అయ్యల పాలిటి ఆగంతుక మృత్యువులు అట్లవద్దు మూడు ఏండ్లకు ఒకరివంతున అయిదు మందివరకూ ఉత్పత్తి చేయమను కారుకోకరి వంతునచేస్తే కడీ పిరయమౌతుందని చెప్పు ఇప్పుడుండే వయసుపైన ఈ వయసుపడితే ముసిలిదై పోతుంది. అంతమాత్రము అందరూకలసి ఆశీర్వదించండి. అక్కడికి మానుకొమ్మనండీ అన్నాడు రాము.

అందరూ నవ్వినారు.

సరోజ ముసిముసి నగులు నవుతూ అమ్మగారికి చెప్పేదానికన్నా అయ్యగారికి చెప్పండి. అమ్మగారు ధర్మమే అవలంబిస్తే అయ్యగారు అధర్మ మవలంబించవద్దని అవలంబిస్తే ఆబ్దానికొకరు అవతరిస్తారు. అందులోవింతేమున్నది అన్నదిసరోజ

ఊరకుంటేగా ఉరకుండనిస్తేగా కన్నెగా తలమవ్వి మైసూర్ శాండిల్ సబ్బుతో కన్నెగా ముఖంకడిగి కాటుక నీటుగాదిద్ది కావలసినన్ని పూలుపెట్టి కంటికింపైన వన్నెకోకకట్టి తీరుగా తిలకందిద్ది ముందుకొచ్చి కండ్లుత్రిప్పితే కాలునాటిన ముసలి వాడైనా కనురెప్ప లెగవేయక ఊరకుంటాడా అట్లచేయవద్దు. అని చెప్పు అత్తా అన్నాడు రాము.

వదినా హద్దుమీరి ఒద్దంటే లేకుండాపోతున్నారు ఇద్దరూకానీమన్నది జ్ఞానాంబ.

అనసూయమ్మ నొసట కుంకుమా తలలో పూలూపెట్టి తట్టలోవున్న చీరా రవికలూ, వంచెలూ. పచ్చిపసపు గొమ్ములూ, కుంకుమా, పూలూ, పండ్లూ, తాంబూలం, దువ్వెనలు, కొబ్బెరగిన్నెలూ, బియ్యమూ, వడిలోపెట్టి పిండివంటలబుట్ట అంచునపెట్టి ఇంక కానీ వదినా అన్నది అనసూయమ్మ.

జ్ఞానాంబ ముత్తయిదువులచూచి కానీంతమ్మా ఒకటి రెండు పాటలు అని రామునుచూచి నీవూ వచ్చి కూర్చో మంగళహారతి ఇవ్వనీ అన్నది.

నే నెందుకమ్మా ప్రసవిస్తానా ప్రసవించే వారికి ప్రక్కందుకు జంటెందుకు అన్నాడు రాము.

జంటయ్యో జంటలో పంటైఉండేది పెంటికి జంటైతే పంటవెంటనే అన్నారు పెద్దలు పెంటి జంటైతే అందులో వంటైతే పేరుమ్రోగిన మునులయినా కొమ్ములు దిరిగిన ఘనులైనా మూడూపండిన పండితులైనా పండిస్తారు పంటఅన్నారు ఒంటైన ఆలువెంటుంటే పంటకు కొదువేమీ పండించిన పంతులయ్యగారు ప్రక్కనలేకుంటే ఎట్ల రండీ సిగ్గుపడితే పోతుందా అని ప్రక్కనున్న రామును చూచినది సరోజ చిరునగువుతో.

ఇద్దరూ ఉద్ది సరిపోయినారు సేరుకు సవాసేరు అన్నది అనసూయమ్మ.

ఒకరికి హారతి ఇవ్వరాదు రా అన్నది జ్ఞానాంబ.

సరే పదుగురాడు మాట పాటియై ధరచెల్లు నన్నారు అనివచ్చి ఏప్రక్క కూర్చోమంటారు అన్నాడు రాము.

అయ్యో ఆడవారికి ఎడమ ప్రక్క మొగవారు కూర్చునేది తమకు తెలియదా అన్నదినవ్వుతూ సరోజ.

ఓహో మోసము జేస్తావా నీవేషానికీ మోసానికీ మోసపోయే మొగవాణ్ణి గాదులేవే నీకన్నా ఏండ్లల్లోపెద్ద ఎత్తులోపెద్ద చదువులోపెద్ద అనుభవంలోపెద్ద బరువులో పెద్ద బలంలో పెద్ద ఆడ మొగ జాతిలో పెద్ద బుద్ధిలో మాత్రం పెద్ద లేకుండా వుంటుందా మొగవాడు కుడీ ఆడ ఎడమా అని కుడిభాగాన కూర్చొని నా ఎడమచేయి నీభుజంమీద నీ కుడిచేయి నాభుజంమీదావేసి రెండుదేహాలూ ఒకటిగా చేర్చితే నీ ఎడమచేయీ నాకుడిచేయీ మిగిలేది నాకునీవు ఎడమచేయి నీకునేను కుడిచేయి రెండుచేతులూ కలిస్తేనే కాపురమయ్యేది మనిపోకటయ్యేదీ చూపించేదా అని తన ఎడమచేతిని సరోజ భుజముపై వేసినాడు రాము.

మాడత్తా పెద్దవారన్నారనేది కూడాలేక పైనచేయివేస్తారు అన్నది రాము చేయిని పట్టుకొని కోపములో నవ్వు మిళితముచేసి

నీవూరకుంటేగా ఆయన ఊరకుండేది నీవుతడువు కుంటావు ఆయన తగులు కుంటాడు తప్పెవరిదీ అన్నది అనసూయమ్మ.

అందరూ నవ్వుచుండగా రాము అనసూయమ్మను చూచి మాడత్తా లోలోపల నీవు ఏమేమో చేస్తున్నావు ఇదిఎప్పటికైనా బైటికొస్తుంది బయట పడుతుంది పీటవేసి కూర్చుంటా తెచ్చేది గాకుండాచేసి పెట్టమంటా అప్పుడులే తెలిసేది తల్లిని పిల్లనూ చాకేటప్పుడుగా తమ తాహతు తెలిసేది అంటూ వచ్చింది పీటవేసి కూర్చుంటుంది ఇక తల్లినీ పిల్లనూ చాకేరోజులు వచ్చినవి అత్తా అన్నాడు రాము.

అందరూ నవ్వుతుండగా సరోజ నవ్వుతూ అవాడు పిల్లనుతెచ్చినది తల్లిని చేయడానికే పిల్లల ఉత్పత్తికేగదా మొదలిది ఇంకచాలు ఏడుకొండలవాడా అని ముడుపుతీసి కట్టుకున్నంతవరకూ నేనువిడువనుకన్న పిల్లలా కట్టుకున్నదాన్నికంటనీరు పెట్టించకుండా కట్టబట్టా తినతిండీ తెచ్చిపెట్టితేకదా మొగవానిఘనత తెలిసేదినేనూ ఒకమొగోణ్ణేనని తెచ్చుకొని కట్టబట్టా తినితిండీతేలేక పిల్లలా తల్లులా ముంచుకూ ర్చుండబెట్టుకొని కన్నీరుపెట్టే మొగవాడు మొగవాడా అంతకన్నా అంజనేయస్వామి దేవాలయము చేరుకొని బ్రహ్మచారియై భక్తితోసేవిస్తే ముక్తియైనా కుదురుతుందిగా అత్తా మా మామతోచెప్పు కుమారునికి చిల్లిగవ్వకూడా పంపవద్దను నీవూపంపేది మానుకో చేసుకున్నవారే చాకవలె చూతాము ఎట్లచాకుతారో పరీక్షకు కట్టినారు బాగాచదవండీఅంటే కామశాస్త్రాన్ని చదువవస్తానంటారు. కట్టుకున్నమోజు తీరనీవే అంటారు సాలూఅన్నంతవరకూ సాలుకొకరివంతునదిగి ఏలికి కాలికీ పిల్లఅయితే అప్పటికి తెలిసేది మాటఎత్తితే ఇంటియాలుపోరు ఇంతింతగాదయా విశ్వదాభిరామ వినరవేమా అంటారు డబ్బుగిబ్బు పంపవద్దు అత్తాఅన్నది సరోజ.

నీకుతెలిసింది నాకుతెలియ దనుకున్నావా అబ్బాజేజికీ అవ్వాతాతకు మనవల పైన బహుప్రీతి అన్నారు అవ్వా తాతా జేజీ అబ్బా అంటూవుంటే అనందమై అంతా వారికే పెట్టారన్నారు మొదటి అబ్బాయిని అబ్బాజేజికీ రెండవ అబ్బాయిని అవ్వా తాతకు పంపగా మూడోవాడుగదా అప్పటికి చూతాము ఇప్పటి ఉద్యోగులకథ ఇంతే విద్యాబలంతో సంపాదించేవారి పిల్లల చేతికష్టముపై భూకష్టముపై ఆధారపడేవారు

చాకవలెనని బ్రహ్మ ముద్రకొట్టినాడు అందరూ ఎంతో నేనూఅంతేననుకో నాతో సమానంగా ఏదోఒక చేతిపనితో ఆర్జనచేసేవిధం చూస్తివా జీతం చాలుతుంది లేదా తెచ్చినదానిలో సర్దుబాటుచేసుకునే విధం నేర్చుకొంటివా సరే మూడోమాట ఏమిటంటే ఒక మూడునెలలు నిన్నూపిల్లలా తల్లిగారి యింటికి పంపడం ఆజీతం మిగిలించుకోవడం అంగళ్లలో బాకీలూ మిత్రులదగ్గర బాకీలూ క్లబ్బులో బాకీలు సాని కొంపలో అప్పులూ దిద్దుకొని ఫిలుం ఆడుతుంది రావచ్చని ఒకకార్డు పడవేయడం జరుగుతుంది అన్నాడు రాము.

అందరూ వింతగా వింటున్నారు సరోజ నవ్వుతూ రామునుచూచి మీతల్లి గారింటికా మాతల్లిగారింటికా పంపేది అన్నది సరోజ.

రాము తలడోలుతూ కట్టుకున్నతల్లి ఇంటికిపంపితే కలహాలు తప్పవు కట్టుకునేదివాడూ కడేసేది మేమునా కట్టుకున్నవాని దగ్గరకే పొమ్మని కరుణలేక మెడబట్టి నెట్టుతారు కన్నతల్లిఅయితే కడీబెట్టిచాకి కావలసినపుడు పంపుతుంది ఈ చట్టం మాబడిలో బాగాచదివినాను ఇప్పుడు ఆయాశా పోతూ ఉన్నట్లున్నది మేమింకెక్కడ పంపవలెనో మీరింకెక్కడ ఉండవలెనో ఏల్లెవానికెరుక అరుణం క్రింద మీఆస్తి అప్పుడే అయిపోయిందని అవతల కొత్తనయాపైసాకూడా ఇవ్వరు ఇక్కడ ఉండనివ్వరూ అక్కడరానివ్వరూ అట్టి స్థితిఏర్పడినది దీనిలో ఆలోచిస్తే అవకతవకలు ఎన్నో కన్పడుతున్నవి బాగాఆలోచించుకొని వరదక్షిణ డబ్బు బ్యాంకిలో వేసుకొను పద్ధతి మాట్లాడుకొని మంచిపిల్లవాణ్ణి చూచుకొని చేతిపయిన ఆధారపడి బ్రతికితే బాగుంటుంది. గాని బియ్యేలూ ఎంఏలపైన ఆధారపడితిరా నామాటవేద వాక్యము నీసహ పాటిలకుచెప్పు గుణవంతులా రూపవంతులా బీదలనక పెండ్లి చేసుకొని దేహస్వాస్థ్యమూ దేహకష్టమూ వారికర్పించి వారిపుణ్యము తీసుకొని మరుజన్మకు ఒకవెల్లువెల్లమను డబ్బుచాలలేదనీ బాకీలు తీరలేదనీ భార్యను అమ్మగారింటికిపంపే అయ్యగారినీ పెండ్లికన్నాముందు అన్నిగండ్లూపడిన అతుకుల బొంతలా అన్నిదుర్వ్యసనాలునేర్చిన లంబోదరగిడ్డలా పాపపుణ్య విచక్షణలేని పరమపాపులా విద్యా ధన ఉద్యోగ గౌరవములకై పెండ్లిచేసుకొని సోమరులై జీవితాలూ జీవితాశయాలూ బలిచేసుకొని వెనుక చింతించవద్దను ఈ బియ్యేను చేసుకొని ఏమంత సుఖపడుతూ ఉన్నావన్నాడు రాము.

సరోజ చిరునవ్వుతో రామునుచూచి మీబియ్యేనుచూచి మానాన్నా అమ్మా తమకు ఇవ్వలేదు అత్తామామా మంచివారనీ ఇంటినెత్తము మంచిదనీ తాము చాలా బుద్ధిమంతులనీ, రూపవంతులనీ, భూస్వాములనీ, ఇచ్చినారు. బియ్యేలా ఎంఏలా చూచి తమకుఇవ్వలేదు ఉద్యోగంవైనంతప్పినా ఉన్నదిగా భూమాత్ర అనుకున్నాను అన్నది సరోజ.

వదినా పిండ్ల పోట్లాటా, అట్లాటా చూస్తూ పింటూవుంటే అన్నము తినేది సున్న కానీ అన్నది జ్ఞానాంబ.

అంతలో ఒకాయమలేచి అన్నానికి అకాలమయినా పరవాలేదు. వాళ్లిద్దరి మాటల్లో మానవజీవిత రహస్యములెన్నో బయట పడుతున్నవి. ఈ పాడు చెవుల వినలీతల్లీ సద్దుబాటు చేసుకుంటాను. వారు మాట్లాడేవి నిజమే నేను చెడిపోయిన దట్లనే భూస్వామికి ఇస్తామని మా తలిదండ్రులు చెప్పితే వినక ఉద్యోగీ విద్యావంతుడు కావలెనని విజ్జృంభగి వారిని బాధించి చేసుకొని బాధించినంతా బాధపడుతూ ఉన్నాను. విద్యావంతుడనని ఎవరి మాటలా వినక నాద్దే తెలివని ఎవరినీ లెక్క చేయక మహారాజుల జతపట్టి వారు బ్రొద్దుపోక అవలంబించే దుర్వ్యసనాలు తాను నేర్చుకొని చేతిదీవాతిదీ పోగొట్టి కూర్చున్నాడు. ఇప్పటికి రూపాయి సిగిరేట్లైమో తప్పవు ఇదేమండీ అంటే అడదానికి నీ కెందుకే అంటారు. ఆ చదువు ఈడికి విచ్చింది పార్కులూ, క్లబ్బులూ, సినిమాలూ, సిగరేల్లూ, ఇస్పేట్లూ, బోకాట్లు గౌరవమట ఇంటిపని ముట్టుకున్నా వీధివారితో మాట్లాడినా బంధు మిత్రుల పలుకరించినా పండుగ పర్వాలుచేసి దేవుడూ దైవమన్నా అగౌరవాలట అమ్మా ఏమీ తెలియని పిశాచాలుపట్టితే ఎట్లో ఒకట్లనయముతోనో, భయముతోనో, విడిపించుకొని సుఖపడవచ్చుగాని ఈ చదువుకున్న పిశాచాలుపట్టితే చచ్చినా విడువక సాగదీస్తాయి ఊర్లూర్లు మెరవణీ చేస్తాయి ఉన్నరక్తాన్నీ ధనాన్నికాజేస్తాయి. అఖరుకు ఉత్తచిత్తి చేతికస్తాయి. ఎవరో బుద్ధిమంతులు అయనమాట నిజమేతల్లీ అన్నదామె.

కానీవదినా భోంచేసి పోట్లాటపెట్టి కూర్చుంటే సరిపోతుంది వినతగినవన్నీ వినవచ్చునన్నది జ్ఞానాంబ.

రాము సరోజనుచూచి తలత్రిప్పుతూ అలుమొగుళ్లకు పోట్లాటబెట్టి తమాషా చూస్తామను కొంటున్నారు విన్నావా వీళ్లు కరిపిస్తారు కరువవద్దు పంజెత్తవద్దు పంజెత్తితివా పందెమున్నట్లే ఇదిబెడసపుంజు నోటకరుచుకొని ఉక్కిరి బిక్కిరయ్యే

టట్లు ఊపిరాడకుండా తన్నుతుంది జాగ్రత్త పందెత్తితే పందెమున్నట్లేనన్నాడు కన్నుఎగరవేస్తూ చిటికవేస్తూ రాము.

ఇంక పేరిసుద్దులు అయ్యేటివికాదని అనసూయమ్మ సరోజ కొంచెముసేపు ఊరుకోమ్మా అని ముత్తయిదువుల ముందుకురమ్మని ఒకపాట కానివ్వమన్నది వారు ఒకమాటా ఒకబాణము ఒకపత్నీవ్రతుడేమనసా అన్నత్యాగరాజకృతి పాడినారు ఆపైన అనసూయమ్మ ఇరువురకూ హారతిఇచ్చి తట్టక్రింద పెట్టి ఇకపోయి క్రొత్త గుడ్డలు కట్టుకొని రాపోండీ అన్నది.

సరోజ ముఖముచూచి రాము ఈపాట త్యాగరాజు ఏనాడో రామునిపైపాడి పొగడినాడు ఈనాడు వీరు ఈరామునిపైపాడి పొగడినారు ఆనాటి మాటానిజమే ఈనాటిమాటనిజమే అవగింజంతకూడా అబద్ధంలేదు ఏమంటావు మాఅమ్మతో ఇరవై రూపాయలు ఇనాముగా ఇప్పిస్తా ఈపాట ఈరామునిపైన పాడితే ఆనాడు కౌసల్యే ఉండి ఉంటే తనకొడుకును పొగిడినాడని గుమ్మడికాయంత బంగారిచ్చిఉండు త్యాగరాజుకు ఈనాడు కొడుకును పొగిడితే తకమికలై ఆనందపడి ఇరవైగాదు ముప్పైఅయినా యిస్తుంది ఇప్పిస్తా పాటపాడగలవా అన్నాడు ఉల్లాసంగా.

సరోజ వడిలోసామానులు పీటపైనపెట్టుతూ తమరుసంపాదించిన దేదయినా వుంటే ఇస్తామనండీ తప్పక పాడతాను అమ్మతోఇప్పించే అయ్యగారికి భార్య ఆటలూ పాటలూ ఎందుకు హాయిగా వినండి ఎవరోఒకరు పాడతారు లేదా నిర్జీవ గానము రేడియో ఉండనే ఉన్నదిగా సంపాదించే సాహసులకు భార్యపాట భార్య ఆట నూరురూపాయల జీతగాళ్లకుగాదు ఆడుతూ పాడుతూ అప్సరసలాగా ఆనందాబ్ధి తరంగములలో వుయ్యాల లూగించేభార్య ఊరకవస్తుందా ముందుజన్మలో ఉగ్రమయిన తపస్సుచేసి వుండవలె బంకమట్టిగాదు తట్టెడుపట్టు రెండుతట్లు తెచ్చుకోను భార్యగానం భారమయింది, మీకెందుకులేండీ పాపం ఎం. ఎ. పరీక్ష అయిననాడు నాచెవుల విన్ననాడు ఆటాపాటా అప్సరసలాగాచేసి ఆనందాబ్ధిలో ఉయ్యాలలూచుతా నాప్రేమా ప్రతిభా చూడవలెనన్నా నామనస్సును చూరగొనవలెనన్నా ఎం. ఎ. అంటూ కొత్తచీరకట్టుకొనుటకు వేరొక గదికి పోయెను.

అబ్బా ఒద్దుర్రా దేవుడా.

ఆ॥ ఆడవారియాశ కాద్యంతములులేవు
హరిహరాదులయిన ఆపలేరు
సత్యమంటివేని సాధింతురింటిలో
శుక్రనీతినేర్చి సుఖముపొందు అన్నారు,

శుక్రనీతిలో దిగితేగాని సుఖము దొరుకదు. దిగుదామనుకుంటే చదువు కున్నభార్య సర్వమూ గ్రహిస్తుంది. సాగదీకుతుంది సాధిస్తుంది. చట్టం మూల మట్టంగా చదువుతుంది. రామరామా వద్దుస్వామీ అంటూ క్రొత్తపంచె కట్టుకొని క్రింద క్రొత్తా పైనపాతా అన్నాడు రాము.

ఆ మాటవిని అనసూయమ్మ లేదప్పా మీదికండువా తెచ్చినాను నీభార్య ఏమిచేసిందోనన్నది.

అయితే తాను పైటకుపయోగించుకుంటూ ఉన్నదేమో కుచ్చులా పైటకుచ్చులా కష్టేకాలంపోయి క్రిందికీమీదికీ ఒకటే కష్టేకాలం వచ్చిందే అయితే కాలంవక్రించిం దేమో గ్రహాలే వక్రిస్తుంటే అడవాళ్లెందుకు వక్రించకూడదు ఇంపుకై సొంపుకై రాణింపుకై ఎన్నిగుడ్డలయినా వేయవచ్చులే వేయి అన్నాడు రాము.

నా దగ్గరఉన్నదమ్మా తెస్తానంటూ సరోజవచ్చి వడిలో అన్నివస్తువలూ పెట్టుకొంటూ కండువామీదవేసుకొని రామునుచూస్తూ క్రిందొకటీ పైనొకటీ గొంతు కొకటీ నడింకొకటీ నెత్తికొకటీగాక జోబీలోఒకటీ తమరువేయడములేదా మేమెం దుకు వేసుకోకూడదూ కొన్నిశుభకార్యక్రమాల్లో అంగువస్త్రంలేక అడవారుకూడా చేయరాదని కొందరిమతం నేనూ వారిననుసరించినా బాగలేదా గృహస్థులవారు దేవునిసన్నిధికి వేంచేసి కాయకొట్టి కర్పూరహారతిఇస్తే అవతలమాట అన్నది సరోజ.

ఆ అట్లనా అంటూ రాము కాయకొట్టి నైవేద్యముచేసి మంగళహారతిఇచ్చినాడు అందరూ మంగళహారతి తీసుకున్నారు.

సరోజ రామునుచూచి కానివ్వండీ ముందుదేవునికి దండము సమర్పించి అవల అందరికీ పెట్టవలె ఆపనికష్టం అంటే మీదండం నాదండం నేనేపెడ్తానన్నది సరోజ.

రాముదేవునికి సాష్టాంగదండ ప్రణామము చేసినాడు సరోజ మోకరించి నమస్కరించిలేచి దయామయులారా లక్ష్మీనారాయణులారా మాకోర్కెలపండించి ఇదేహృదయములతో ఇహములో పరములో ఇరువురమూ ఉండునట్లు ఆశీర్వదించుడు తండ్రీయని ముకుళించిన హస్తములపై శిరస్సుంచి నమస్కరించినది.

రాము చేతులు జోడించుకొని పురాణదంపతులారా అమ్మానాన్నకూ అత్తామామకు ఆలుపిల్లలకూ బరువుగాకుండా తేలికగా బ్రతుకునట్లు ఆశీర్వదించండి మరచిన్నా ఊరప్రజలకూ బరువుగాకుండా మరీవకటి యింటికి ఇరుప్రక్కలా ముందూ వెనుకలా యింతేల వీధివారికంతా బరువుగాకుండా బ్రతికేటట్లు అశీర్వదించండీ స్వామీ అన్నాడు రాము.

అక్కడున్న అందరూ నవ్వినారు.

అంతలో సరోజ కండువానువిప్పి రాముపైకప్పి తాబూలం పండ్లు చేతిలో పెట్టి మోకరించి పాదములకు శిరస్సుతగులునట్లు నమస్కరించినది.

రాము రెట్టలుబట్టి లేపుతూ పండితులకూ కవులకూ గాయకులకూ శాస్త్రజ్ఞులకూ ప్రతిభావంతులకు బహూకరించినట్లు నాప్రతిభకుమెచ్చి శాలువబహూకరించి నావా సై యికచాలు కొకపంచె యివ్వవలసివస్తుదని మాయత్తతోచెప్పు అన్నంతలో సరోజ నవ్వుతూ ఉత్పత్తిచేస్తుంటే ఊరకవస్తుంటాయని ఉవ్విళ్లూరుతారేమో వీకోత్పత్తికే అత్తగారి బహూమానం అ వ త ల పూ జ్యం అని నవ్వుతూ ప్రక్కకు పోబోయినది.

తాళుమని రెట్టబట్టుకొని. ఆశీర్వచనంవద్దా అని దైవానుకూలం భర్త అనుకూలం సంపాదించుకొని దైవసహాయంతో, భర్తసహాయంతో, భగవతీ అనుగ్రహంతో, భర్త అనుగ్రహంతో సత్సంతతిని చాలుగా మేలుగా కని మా వంశ లో మీ వంశంలో కీర్తిగడించి భర్తనూ, భగవంతునీ, భగవతినీ మరువక కల్పవృక్షంవలె కలకలలాడుతూ నూరేండ్లు మను అని రెండు భుజాలపైనా చేయి వేసినాడు రాము.

అబ్బా ఎంత దీర్ఘంగా ఆశీర్వదించినారండీ అయినా ఎంతదైవ సహాయముండినా మీ సహాయంలేక పుంసవనాలూ, సీమంతాలూ రావులేండీ తెలిసినట్లే ఆశీర్వదించినారు ఊ పొండి అమ్మకు దండంపెట్టరూ అన్నది సరోజ.

కన్నతల్లికీ, కన్యనిచ్చిన తల్లికీ దండం పెట్టవలసిందే అమ్మా నేనేదో తెలిసో తెలియకో చేయతగినది చేసినా తప్పుసవరించి తల్లినీ, పిల్లనూ భద్రంగా చూసేభారంనీదే నన్ను కన్నట్టుగాదు. కన్నందుకూ, కోడల్ని కట్టుకున్నందుకూ. కాన్పులో కంటికి రెప్పలాగా చూచి కరుణామయివై మాయామయివిగాక కాపాడుతల్లీ నమస్తే నమః అని దండం పెట్టవలసిందే సమయం గడుపుకొనవలసిందే అత్తతో కొట్లాడే కోడండ్లుకూడా గర్భసమయాల్లో స్నేహంగా ఉంటారట కొడుకూ అంతే మానవ మర్యాదనేర్చుకో అన్నాడు రాము.

అందరూ నవ్వుతుండగా ఇరువురూపోయి తాంబూలం పండ్లూ చేతిలోపెట్టి మోకరించి నమస్కరించినారు జ్ఞానాంబ ఆశీర్వదించినది.

రాము అమ్మనుచూచి అమ్మా ఆశీర్వచనం వినబడలేదే ఏమన్నావో కొంచెం బయటికి అనూ అన్నాడు.

ఒరే కానీరా పనిచాలా ఉన్నదీ మళ్లీ నీ యాటలూ, పాటలూ, హాస్యగాని వలె అతుకులేస్తావు అన్నది జ్ఞానాంబ.

అనసూయమ్మకు మ్రొక్కబోయి రాము అత్తా ఇచ్చిన యింటినుండీ పసపు, కుంకుమ తీసుకపోరాదని ఇచ్చిన యింటికే ఇస్తారు. కొందరు కన్యాదానం చేస్తున్నారు సమయము దొరికితే తిరుగుదానం తీసుకునే వాడుకుందోలేదో ఇప్పుడే చెప్పండీయని ముందే బేరమాడే వారున్నారు. కొందరు ఒకరికి మేము ఇచ్చేవాడుకేలేదు మేము మళ్లీ మీ యింటినుండే తెచ్చుకునేటట్లు ఆశీర్వదించు అత్తా కోడలూ ఒకింటికే ఆడబిడ్డ లయితే ఆ ఆదాయం చెప్పనక్కరలేదు. అత్తపోయి ఒకటీ కోడలుపోయి ఒకటీ తెస్తుంటే అత్తఒకటి, కోడలొకటీ ఇస్తుంటే వెంకటేశ్వర్లకాదాయం వచ్చినట్లుంటుంది. మనుమరాల్నియిచ్చే ఆశీర్వచనమేచేయి అత్తా అన్నాడు రాము.

మళ్లీజన్మానికి రెండంతలకు నాల్గంతలు ఇస్తారు ఇప్పుడు మురిసిపడినట్లుగాదు అన్నది సరోజ.

రాబోవుజన్మ అటుండనీవే ఈజన్మకథ చూచుకుందాము అత్తా అదియింకా బుద్ధిరానిపిల్ల అమాటలు లెక్కలేదులే ఆడపిల్ల యీపిల్లకుకలిగినా పనికిరాదు మా బావగారికి మగబిడ్డలులేరు హిందూమతధర్మం కడకు ఒకరోజైనా ఒకగంటైనా

మగవాడు పెద్ద వుండవలెనన్నారు అట్లాగాక విరుద్ధమయిన వంశనాశనమో లేక కన్నులుపోయి చాలాకాలము జీవించుటో విదవత్వము సంభవించుటో విడాకులు పుచ్చుకొనుటో సంఘములో అరడిగలుగుటో తప్పదన్నారు మనుమరాలు ముందు పుట్టీ ప్రయోజనముండదు. మనుమడు పుట్టేటట్లూ మీయింటి ఆడబిడ్డనే తెచ్చుకునే టట్లూ యీ పిల్లతల్లై ఎత్తై అత్తై చెలాయించేటట్లూ నీవుకనులారా చూచేటట్లూ కూతురిని చూడనొకతూరి మనవరాలిని చూడను ఒకచూరివచ్చి అందరినీ ఆశీర్వదించే టట్లూ మనవడూ మనవరాలూ అలూమొగళ్లై అవ్వాఅని ఒకరూ జేజేఅని ఒకరూ అంటూవుంటే ఆనందంగావింటూ వుండేటట్లు ఆశీర్వదించు అత్తాఅని నమస్కరించి నాడు రాము.

సరోజ పూలూ పండ్లూ తాంబూలం అమ్మచేతిలో పెట్టి చిరునవ్వుతో నమస్కరించినది.

సుపుత్రా వాప్తిరస్తూ అని ఆశీర్వదించినది అనసూయమ్మ.

రాము నమస్కరించిలేచి అత్తా అన్నాడు.

జ్ఞానాంబ రామునుచూచి వేళ అతిక్రమిస్తుంది అకాలమౌతుంది నీమాట్లాట అట్లాట అవతల చూస్తాముకానీ అన్నది.

పరేనంటూ ముత్తయిదువుల దగ్గరకుపోయి రాము వారినిచూచి వదినె వయసు ఒకరికీ, అమ్మవయసు ఒకరికి, అత్తవయసు ఒకరికి ఉన్నట్టున్నది. అమ్మనుంచే ధండము ప్రారంభం చేస్తాము. అమ్మా అల్లునికి అత్తగారై అంగలార్చకుండా అటు మట పడకుండా అపదల్లో చిక్కకుండా కోడలికి అత్తగారై చెలాయించుతూ శక్తికి మీరిన పనులు చేయిస్తూ కోడల్ని, కొడుకునూ అమవులో అజ్ఞలో పెట్టుకొని అటు కదలకుండా,ఇటు మెదలకుండా బద్ధులచేసి అవితే యివితే అని యిద్దరినీ బాధిస్తూ వేధిస్తూ తిన్నగా బోధిస్తూ తెచ్చినవి అరాధిస్తూ వుండేటట్లు ఆశీర్వదించండి అని నమస్కరించినాడు రాము.

అందరూ పైటచెరగులు అడ్డముపెట్టుకొని నవ్వుతుండగా జ్ఞానాంబ రామును చూచి సినీమాలో రేలంగి వెంకటామయ్యవలె హాస్యరస పోషకుడవై అందరినీ పొడుస్తున్నావు గదురా అన్నది.

రాము మరొకరి దగ్గరకుపోయి అత్తా మానరోజ తొందరగా పిల్లతల్లిగామారి పిల్లవాణ్ణి ఏడ్పిస్తూ అదిధర్మం యిదధర్మం అది మంచీ యిది మంచీ అది చెడ్డా యిదిచెడ్డా అట్లచేయరాదు. యిట్లచేయరాదని దబాయిస్తూ దండనచేసి ఏడ్పిస్తూ మంచిచెడ్డల మధ్యలో బంధిస్తూ బోధించడముతో వేధిస్తూ చెప్పినదిచేస్తే అన్నం లేకుంటే పస్తూ అని సాధిస్తూ అమ్మే అపమృత్యు దేవతరా తండ్రీ అనేటట్లు తొంద రలో అయ్యేటట్లూ ఆశీర్వదించుఅత్తా అని నమస్కరించినాడు.

'అయమ శీఘ్రమే సుపుత్రావాప్తిరస్తూ అని ఆశీర్వదించినది. రాము మరొకరి దగ్గరకుపోయి.

వదినా చెల్లెలికి అనుభవముచెప్పు పిల్లల బాధించవద్దు కొట్టవద్దు బజారుతిట్లూ బాపలతిట్లూ తిట్టవద్దు దానాలతో లంచాలతో దాపునచేర్చి ధర్మబద్ధుల చేయమని చెప్పుఏమే పిల్లల అట్లకొడ్తావుఅని భర్తఅంటే అట్లయితే నెత్తికెక్కించుకోండి విద్యా బుద్ధులు లేకుండా పాడుచేసి మీమాదిరే చేసుకోండి ఈ నా టి నుం డీ వాళ్లతంటా నాకక్కరలేదు మీరే చూచుకోండి ఒరే బొంగరాలు గాలిపటాలు గోలిగుండ్లూ తీసు కొని వీధులంబడిపోయి ఆటలాడండీ ఇస్పేటుఆకులు ఆడను. మీనాయన మాదిరే క్లబ్బులకుపోండి సినిమాబండ్ల వెంబడీ చిందులు త్రొక్కుతూ పరుగిడండి వీధిపిల్లలతో పోట్లాడి అమ్మనూ అక్కనూ పల్లెతిట్లతో గౌరవించండి అమ్మానాన్నను. పిల్లల కొట్లాటలలో కాట్లాడేటట్లు చేయండి అఖరుఆట జోబీలుకొట్టండి దొంగతనాలుచేయండి నాన్నకు మంచిగా ఉంటారని కాళికవలె తాలికలేక కేకలు పెట్టవద్దని చెప్పు కొట్ట కుండా తిట్టకుండా పిల్లల చల్లనిచూపులతో అభివృద్ధికి తెమ్మను నాకు అనుభవము గాబట్టి చెప్పుతున్నా నాన్నబయటనుంచీ వచ్చేటప్పటికి పరుగెత్తిపోయి నాన్నా అమ్మ కొట్టింది చంపేసింది అని చెప్పుకునేవాణ్ణి అమాటలువిని అమ్మ చెప్పా అన్నీచెప్పు నాన్న అవతలపోతే వీపుచీలిపోతుంది అనేది నాన్న అమాటలువిని ఒరే నాయనా మీయమ్మ నీప్రాణానికీ నాప్రాణానికీ మూలపెద్దమ్మరా.

చెప్పింది చేయకపోతే నిన్నూచెప్పింది తేకపోతే నన్నూదిగమ్రింగేస్తుంది చెప్పిందిచేస్తూ ఉండు చె ప్పిం ది చేయకపోయినా వినకపోయినా మాయమ్మా నన్నిట్లే కొడుతుండేది అమ్మ అమృతము బుద్ధిలేనిదయితే హాలాహలముఅని కూర్చుం డబెట్టుకొని చె ప్పే వా డు అట్లచేయవద్దు ముద్దుగా వద్ద కూర్చుండ బెట్టుకో బుద్ధిమంతుని చేయమను కొట్టితే నే ను చూ డ లే ను మా నా న్న కు వచ్చిన ఇబ్బంది నాకూ వస్తుందిగదురా అనిదిగులుగా వుందివదినా నీవు అనుభవనీయవు

చెల్లెలికి బాగాచెప్పు అందుకై సాష్టాంగదండము పెట్టుతున్నాను అని రాము నమస్కరించినాడు.

అందరూ నవ్వినారు.

రాము లేచిచూచి వదినా నీవు అనుభవజ్ఞురాలవు సంసారములో సార మెరింగినదానవు సంరవుసారమెల్ల సంగ్రహమయ్యేట్లు అని బాగా చదివినావు చెల్లెలికి బాగాచెప్పు చదువుకున్నతల్లి అయితే పిల్లలచాలుకు తేవడములో సగముచేస్తుంద న్నారు చదువురాని దయితే పిల్లల జీవితాలే నాశనముచేస్తుందన్నారు చదువురాక పోయినా వచ్చినవారివలె నడచుకొను డాంబికురాలైనా భూతదయలేని భూతమయినా శాంతములేని శాకినీఅయినా భ్రాంతిలేని బ్రహ్మరాక్షసి అయినా తనపిల్లలనే తాను భోంచేయు నాగుపామే అనవచ్చు వదినా ఇప్పటినుంచే కొంచెంకరుణ ఉండనివ్వ మను కడుపులో ఉండేది కసిగందువు కూర్చున్నప్పుడూ, లేచునప్పుడూ, కదిలి నపుడూ, మెదిలినపుడూ, పడుకున్నపుడూ, నడచునపుడూ, నీల్గినపుడూ, ఇరుకు సందులలో దూరునపుడూ, కూర్చొనునపుడూ, దిగేటప్పుడూ, దంచేటపుడూ, ఎక్కే టప్పుడూ విసిరేటపుడూ, నీళ్లు చేదేటపుడూ, కసువూడ్చేటపుడూ, కల్లాపుచల్లేటపుడూ కడుపులోఉన్న పసికూనపై జ్ఞాపకముండ నివ్వమను. జ్ఞాపకములేక గట్టిగా ఊది పట్టినాగట్టిగా బిగియబట్టినా గట్టిగాచీరగట్టినా గట్టిగాతుమ్మినా చీదినా వెల్లెలికలపండు కొనినా మొగనితో అత్తతో పోట్లాడీ, కాట్లాడీ, అస్తులూ, పస్తులూ, ఉండినా గర్భ స్రావమగునన్నారు. చెల్లెలికి అనుభవంబాగాచెప్పు పొరుగింటి పుల్లగూర బహు రుచి అన్నట్లు ఇంటివారు చెప్పితే వినేదానికన్నా పొరుగింటివారు చెప్పితే బహు ప్రీతిగావింటారన్నారు చెప్పిపుణ్యముకట్టుకో మళ్లీదండముపెడ్తానని చేతులు జోడించినాడు రాము.

సరోజ తాళండీ అని రామును ఆపి అక్కా ఒక్కమనవి మరదిగారికిచెప్పు మమతా మురులూ ఎగబెట్టి మనసును బాగాబిగబట్టి మాకునిమాటల పెడచెవిబెట్టి మంచినడకను మనసులోబెట్టి మగువమాటే మరచితిరా గర్భస్రావముగాదూ గర్భానికి బాధేలేదు గర్భస్థునకే చిక్కనురాదు, దుర్భరమగు కష్టముల నెదిర్చి గర్భస్థుని తమ భుజస్కంధమున కెక్కించగలదు నిర్భయముగ నుండమని మరదికి చెప్పు అని తాంబూలం పండ్లూ, పూలూ, చేతిలోపెట్టి మ్రొక్కినది సరోజ.

అక్కడున్న వారందరూ పైటచెరగులు 'అడ్డము పెట్టుకొని నవ్వుతుండగా అందులో ఒకాయమ జ్ఞానాంబను చూచి అమ్మా మీరిరువురూ ఎన్నిజన్మలు తపస్సు చేసినారమ్మా వీరినికని జోడాచేసి అచ్చట్లు ముచ్చట్లుగా, మాట్లాడుతూ ఆనందంగా కాపురము చేస్తుంటే ఉమా రమావలెనిల్చి చూచుచూ, వింటూ ఉండేటట్లుగా చూడూ రూపంలో జ్ఞానంలో చాకచక్యములో మాటల్లో ఒకరి కొకరుతీసిపోరు సమతూకంలో నిల్చినారు. వారికన్నా ముందు మీరుచేసిన పూజాఫలము మంచిది. తల్లి జ్ఞానాంబ నీవుచేసిన పూజాఫలము పండింది. నిత్యమూ చిలుకా గోరువంకల్లాగ పల్కుతూ చంద్రుడూ, వెన్నెలలాగా కాపురము చేస్తుంటే చూచేభాగ్యం నోచు కొన్నావు కొడుకునూ కోడల్ని కడుపులో పెట్టుకొని హాయిగా ఆనందమనుభవిస్తూ కన్నుమూయితల్లీ రతీమన్మధులాంటిజత ఇదంతా పురుషుడుచేసిన పూజాఫలము అన్నదామె.

అంతలో ఒకాయమ సెంతకు తీసుకొని చెల్లీ అమృతవెల్లిలో పుట్టిన అమృత వల్లి ఆదిమహావిష్ణువు వక్షస్థల మలంకరించినట్లు వారి అంకస్థల మలంకరించినావు. ఇది నీ పూర్వపుణ్యం వచ్చినభాగ్యాన్ని దౌర్భాగ్యం చేసుకొనవద్దు మాటకుమాట అందిస్తే నోరుమూయి అని గర్జించకుండా అదుపూ ఆజ్ఞలో వుంచు కొనవలెనని అధికారులు చెలాయించకుండా భార్యఅంటే దాసిదాన్నికన్నా హీనం అనే చదువు చదువకుండా పండ్లు పటపటలూ కండ్లు చురచురలూ గర్జనలూ తర్జనలూలేకుండా రంపులూ, గుజవులూ, దంపులూ తెగతెంపులూ గాకుండా ఆదరణిచ్చి అంచుకుదీసి చిలిపి చేష్టలతో శివమెక్కేటి మాటలతో హృదయమిచ్చేటి భర్తదొరికినాడు దొరికిన అదృష్టాన్ని దూరంచేసుకోక దుర్వ్యయముచేయక చక్కగా అనుభవించుతూ వంశో ద్ధారకులా దేశోద్ధారకులా కని నూరేండ్లుమనూ మేమూ ఉన్నాము బ్రతికి చచ్చిన వారిలో జమగా జతై అన్నది.

నిజమేనమ్మా అంటూ అందరూ నిర్జీవ ప్రతిమలవలె నిల్చుకున్నారు దండాలూ ఆశీర్వచనాలూ అయిపోయినవి యింకేమి అత్తా అన్నది సరోజ.

ఇంకేమున్నదీ చేసిన పదార్థములదేవునికి నివేదనచేసి దేవాలయానికి పోయి దేవుని దర్శనముచేసుకొని తీర్థప్రసాదములు పుచ్చుకొని రావడమే కొదువ అన్నది జ్ఞానాంబ.

అమాటవిని అనసూయమ్మ పదార్థములు అన్నీ దేవుని సన్నిధిలో పెట్టినది

రాము దైవనివేదనచేసి మంగళహారతి ఇచ్చిన్నాడు అందరూ మంగళహారతి తీసుకొని దేవునికి నమస్కరించినారు.

రాము ప్రదక్షిణ నమస్కారములుచేసి తీర్థముగిన్నె తీసుకొని జ్ఞానాంబకు అనసూయమ్మకు ముత్తయిదువులకూ తీర్థము యిచ్చినాడు.

సరోజ రాముకు నమస్కరించి లేచి దేహమునువంచి శ్రద్ధాభక్తులు ఉట్టిపడ తీర్థమునకు రెండు చేతులూ పట్టినది.

రాము తీర్థమువేసి తానూ తీసుకున్నాడు.

అనసూయమ్మ పదార్థముల యథాస్థానముల చేర్చినది జ్ఞానాంబ సరోజను చూచి వడివిప్పి అన్నీ దేవునిదగ్గర పెట్టి దేవాలయానికి అన్నీ బుట్టిలో పెట్టు తొందరగాపోయి వస్తామన్నది.

సరేనని సరోజ అన్నీ బుట్టిలో పెట్టి ఇంకపదండీ అని రాముతట్టు చూచినది రాము సరోజనుజూచి నీవుమాచేది గ్రహించుకున్నా చిల్లలదబ్బులతోసహా ఆయత్తుడనైనాను అందరూ వాకిలిదాటితే బీగము వేస్తానన్నాడు.

సరేనని అందరూ వాకిలిముందు నిల్చినారు సరోజ బుట్టతీసుకొని బైటికి వచ్చినది రాము బీగము వేసినాడు.

దేవాలయమునకు కాలుసాచి నడవ ప్రారంభించినారు పనిమనిషి సరోజను చూచి అమ్మా అబుట్టి ఇట్లివ్వండీ నేను తెస్తానన్నది.

సరోజ ఆమెనుకూచి నీచేతికి ఇచ్చేటట్లయిన అప్పుడే ఇవ్వకపోతినా గృహస్థుడో గృహిణో భక్తిశ్రద్ధలతో మంగళముగా మోసుక పోవలయుగాని దైవనివేదన పదార్థముల పనివారిచేతికి ఇవ్వరాదు ధర్మవిరుద్ధమన్నారు తిరిగివచ్చేటప్పుడు నీవూ పోయేటప్పుడునేనూ అన్నది సరోజ.

రాము అమాటవిని గృహస్థుడుండగా గృహిణికి భారమెందుకు ఇట్లివ్వు అని చేయిసాచినాడు.

గృహిణి మోయలేనిదయిన గృహస్థులవారు మోయవలసినదే సాధ్యములోనే ఉన్నది సాధ్యము కానిదైతే తమ భుజస్కంధ మలంకరించి ఉండును సాధ్యమే స్వామీ అక్కరలేదు అన్నది సరోజ.

అందరూ ముసిముసినగులు నగుతూ ఇద్దరి వద్దికలకు ఆశ్చర్య పడుతూ నడుచుచుండిరి.

భక్తుడా భక్తిశ్రద్ధలతో పూజాద్రవ్యముల నీవుతేక భక్తురాలితో మోయించుక వస్తివా ఇదేనా నీధర్మమంటే నేనేమి చెప్పవలె తే తెస్తాను నాధర్మమునేను పాటిస్తానన్నాడు రాము.

అమాటలకు చిరునవ్వు నవ్వుతూ సరోజ భక్తురాలా భక్తిశ్రద్ధలతో పూజాద్రవ్యములు నీవుతేక భర్తతో మోయించుక వస్తివా భర్తా భగవంతుడూ స్త్రీకి కుడి ఎడమైనిల్చి పాలించినగాని సుఖముదొరుకదే మైమరచితివా మరచితివా నేనే భర్తకడ ధర్మముపాటిస్తూవుంటే నాభక్తురాలవునీవెందుకుపాటించకూడదూఇదేనానీధర్మము సాధ్యాసాధ్యముల ధర్మాధర్మముల గమనించి ముందుజన్మను మంచిదిగా సృజించుకొని సుఖపడూ నీధర్మము నీవుతెలుసుకొని బ్రతుకు పెద్దచిన్నల గమనించినడూ అని అక్కడికిపోతూనే భగవతి హెచ్చరిస్తే నేనేమి బదులుచెప్పవలె నాధర్మము నేనుపాటిస్తా మోయలేనివైతే అని చిరునవ్వు నవ్వినది సరోజ.

రాము అది గ్రహించి పోతుపక్షితో మోయిస్తానను పెంటిపక్షి గర్భంధరిస్తే పోతుపక్షి గూడుకట్టిస్తుందిగా గిజిగానికథ తెలియదూ పక్షులే పెంటిపక్షిపై కనికరము చూపితే మానవులు చూపకపోతేఎట్లు చేయకపోతేఎట్లు ఎవరెవరి ధర్మము వారు పాటించవలెగదా ఓ భక్తుడా చూలాలితో మోయించుక వచ్చినావా సమాయాసమయముల గమనించవా అంటే నేనేమి చెప్పవలెనంటావు అన్నాడు రాము.

ఓ స్వామీ నిండు చూలాలుగానీ, పండు ముసలిదిగానీ ఇంకా కాలేదుగా భార్య చాకన్నా నాలుగేండ్లు పడుచుపిల్లే తనదేహం తనుమోయలేనంత లావుస్థితిలో ఉండి అయాసపడదు చలాకీఅయినపిల్ల నావెన్నంటి చకచకా నడుస్తుంది. నేనేమోస్తానంటుంది మీరిచ్చిన పిల్లమనసు మీకుతెలియదా నాధర్మము నేనుపాటిస్తానంటుంది నాతప్పేమీలేదు అనిచెప్పండీ అన్నది సరోజ.

అందులో ఒకముసలి ముత్తైదువ అనసూయమ్మను చూచి అమ్మా వీళ్లిద్దరూ ఇంట్లోఉంటే ఆ యిల్లు స్వర్గతుల్యం ఆ గ్రామం స్వర్గసీమ ఆవాక్కులు బ్రహ్మవాక్కులు ఆనడక వసిష్ఠ అరుంధతీనడక ఆపలుకులు చిలుకపలుకులు మీరువియ్యంకురాండ్రై కనివినేభాగ్యం నోచుకున్నారమ్మా అన్నది.

ఇంతలో దేవాలయము సమీపించినది అందరూ మహాద్వారముదగ్గర చేతులు జోడించి తలవంచి నమస్కరించి లోపల ప్రవేశించి ఆచారప్రకారము విధినిర్వర్తించి గర్భాలయములోపల ప్రవేశించినారు.

అర్చకులు ముందుకువచ్చి ఏమండీ ఆభిషేకం సహస్రనామార్చనా చేయ డబ్బుకట్టినది తమరేనా అభిషేకం అయినది మీకొరకై ఎదురు చూస్తుంటిమి అని ఒకరు సహస్రనామావళీ చెప్పుచుండ మరొకరు తులసీ పూలుకలిపి అర్చనచేసి లక్ష్మీదేవికి యథావిధి నివ్వర్తించి చక్కెరపొంగలి రెండుచోట్ల నైవేద్యముచేసి మంగళహారతిఇచ్చి అర్చకుడు తట్టపట్టినాడు.

రాము అంతకుముందే ఇచ్చిన చిల్లరడబ్బులు తట్టలోవేసి అందరూ నమస్కరించి తీర్థప్రసాదములు పుచ్చుకొని సాష్టాంగ దండప్రణామములుచేసి తొందరగా ఇల్లు చేరుకున్నారు.

సరోజ భర్తకు ఒకచోట విస్తరవేసి ముత్తయిదువులకు మరొకచోట విస్తరవేసి కూర్చుండ నియమించి భోజనము వడ్డించ ప్రారంభించినది. అనసూయమ్మ జ్ఞానాంబ సహకరించినారు.

రాము భోంచేస్తూ అమ్మా అన్నీముందే వడ్డించి అన్నము వడ్డించినావు. ఏది ఎక్కువగా పట్టిచూడవలసినదీ ఏది విడువవలసినదీ బాగాతెలిసి పోతుంది. ఇదే మంచి పద్ధతి అమ్మా అన్నాడు రాము.

మానవులు భావవిభేధము గలవారు ఒకరిపద్ధతి ఒకరు వప్పుకోరు అన్నది జ్ఞానాంబ.

అమ్మా అన్నీ దండిగా వడ్డించినావు సంతృప్తిగానే ఉందికానీ అజ్యదేవత దయ కొంతకొరత అనుకుంటా నన్నాడు.

సరోజ గమనించి అత్తా కొడుకు కొరతదీర్చ అరవైఅరు పిండివంటలూ ముప్పైమూడు కూరగాయలూ చేసిపెట్టినా అజ్యానికి ఒకటి సరిరావు రాగెరొట్టెతో చేరుకొని లోపలికిపోయిన్నా రాజ్యాలు పాలిస్తుంది. మదనసామ్రాజ్యాలు ఏలిస్తుంది అజ్యదేవతలేని అ ఇల్లెందుకు అ రాజ్యమెందుకు ఆ మనిషెందుకు అనేవారు అడిగి పెట్టడానికి అమ్మా అజ్యమేయడానికి ఆలూ కావలెననేవారు నీ వేసుకునేదికూడా నాకే వేయి నీకు మేలుంటుందీ అని చేయిపట్టేవారు ఉబికించి ఊర్ధ్వలోకానికెక్కించి గిన్నెలో ఊడ్చుకతిని ఓ ఊర్ధ్వలోకనివాసీ ఉన్నదయి పోయింది. ఇక దిగి

రావే నేను పోతున్నానని లేచి పైగా నీకాయిపాడో లేక నబ్బో ఈచేతికి కొంచెం తగిలించు జిడ్డుపోనీ అనేవారు అమ్మభాగం అలిభాగం అంతానాదే అనేవారు ఆనాభాగం, నీభాగం వారికే వేయి అన్నది సరోజ.

జ్ఞానాంబనవ్వుతూ నాభాగం వేసివేసి పెంచిపెద్దచేసి నీవంతుచేసినా యింక నాభాగంరాదు నీభాగం ఇచ్చేటంతఓర్పు వుంటే ఇచ్చి అనందపడు నావంతు చెల్లించుకున్నా ఆకులో పడినగడ్డలూ కాయలూ పిండివంటలూ వాడుతినంగా మిగిలినవి తిని వద్దన్నా పెట్టి ఇంతవాణ్ణి అంతవాణ్ణిగాచేసి మాతృబాధ్యత తీర్చుకున్నాను నీకువప్పచెప్పినాను నానోటికాడివి తినేరోజులు పోయినవి నీనోటికాడివి తినేరోజులు వచ్చినవి పెట్టి పెంచుకుంటివా సుఖపడగలవు పెట్టక ప్రేమతోచూడక జారుకుంటివా కష్టపడగలవు అమ్మను మరపించేఆలు అనిపించు కుంటివా అన్నిఅందాలా సుఖపడకలవు అన్నది.

ఏమండీ అమ్మ ఆదరణ కొంత దూరమయింది అలు ఆదరణ అంచుకొచ్చింది చచ్చిపోయిన ఎనుము పగిలిపోయిన ముంతెడు పాలిస్తూ ఉండెనని బానమోతాదు చేతులుచూపక పెట్టేవారు కన్నవారు కొట్టేవారు కట్టుకున్నవారూ అనకుండా అమ్మకు అలికీ ఒకే ఆదరణిచ్చి కుడి ఎడమలుగా భావించండి అని నేయిగిన్నె ఎత్తుకపోయి ఆనాడు అమ్మ నెయ్యివేస్తూ యింకచాల్లే రేపటికికావద్దా అని బుజ్జగించి అన్నం పెడ్తూ వున్న అమ్మభాగం ఈనాడే అంతాతినేస్తే రేపటికివద్దా మళ్లీతెస్తారా సంసారం సాగిపోవద్దా కొడుకులకూ, కూతుళ్లకూ, డబ్బుమిగిల్చవద్దా అంటూ లెక్కలుచెప్తూ ప్రక్కనకూర్చొని పచ్చడికింతా పప్పుకింతా వుంటే చారుకింతా వేసి మాటలతో సైయాటలతో మైమరపించి తినిపించే భార్యభాగం అయ్యో అల్లుడే దేహారోగ్యం బాగుండవలె కూతుర్ని బాగాచూడవల్లె అత్తగారు మంచి వారనిపించుకోవలె దేహభాగ్యంలేని జ్ఞానభాగ్యం వ్యర్థమే అనీ పిల్లిపట్టు పదిమిల్లెలువేసే అత్తభాగం అని వేసినది నెయ్యి.

అందరూ నవ్వినారు.

రాము నవ్వుతూ మాటలనీతేగాని చేతిలోనీతిఏదే నాభాగంపై మూడు భాగా వెక్కించచ్చినా అరచేతి గుంత నిండలేదు అన్నాడు.

చూడత్తా బ్రాహ్మణార్థం బ్రాహ్మణునివలె చేరబట్టి వ్రేళ్లసందున నెయ్యి జారగొట్టి ఇంకకొంచెమని దొన్నెబట్టే విధం నేర్చుకున్నారు నిత్యమూ ఇంతేఅత్తా

నెయ్యీ పెరుగుకాడికి వచ్చేటప్పటికి అమ్మా నీవెక్కడున్నావే చాలినంతా నెయ్యీ కావలసినంతా పెరుగూవేస్తూ ఉంటివే ఆలినంటగట్టి నీవుజారుకున్నావు కన్నతల్లి కడుపుచూస్తూంది కట్టుకున్నది కామంచూస్తుంది భాగమంతా పెట్టిభారంచూచేదిఅమ్మ భాగంలో సగభాగం పంచుకతినేది ఆలూ ఇంకెక్కడి నెయ్యీ ఇంకెక్కడి పెరుగూ తల్లీ అని నున్నగాతినేయుక్తి నేర్చుకున్నారు ఈచదువంతా మామగారిదా నీదా అత్తా అన్నది సరోజ.

నాన్నగారు తక్కువయితేగదూ కొడుకు తక్కువవాడయ్యేది నాన్నకు నెయ్యీ గిన్నె ప్రక్కనే ఉండవలె అక్కడెవ్వరో పిల్చినట్లున్నది చూడమనిపంపి అంతా గుమ్మరించుకొని కొంచెము వేసుకుందా మనుకుంటే అంతా పొరపాటుతో పడెనే అనేవారు అదివాడూ నేర్చుకున్నాడు అన్నది జ్ఞానాంబ.

అమ్మా ఆదిమహావిష్ణువు కాపురాన్ని ఆదిదంపతులయిన వారిని వేరుచేసి అయ్యా పెరుమాళ్ల దరిసెనముచేస్తే పెరుందేవి దర్శనము అక్కరలేదా రాండి జగన్మాత దర్శనము చేసుకోండి. అని రెండువిధాల ఆదాయం తీస్తుంటే నేనుమాత్రం ఊరకొమ్మంటావా వీరి ఆదాయంకొరకు వారికాపురం రెండు చేసినట్లు నా కడుపాత్రంకొరకు అమ్మదగ్గర ఆలిని ఆలిదగ్గర అమ్మను పొగిడేది తప్పా ఏమి ఈ బండికి కుడిచక్రం అమ్మా ఎడమ చక్రం ఆలూ ఏ చక్రంపోయినా బండికి కొరతే రెండు చక్రాలూ మంచివిగా తెచ్చుకున్నా ట్రంకు ఎక్స్ప్రెస్ విధంగా బండి పోతూఉంది అపమంటే విందుకు అపుతా అడగంది అమ్మకూడాపెట్టదంట ఆలు పెట్టుతుందా కమ్మనిమాటలు రెండుచెప్పితే తినేటిపికూడా పెడ్తారు మాటలుచెప్పి మనసును చూరగొనకున్న ఎవరూపెట్టరు ఇమ్మ పురాణదంపతులై మాతృ పితృ స్వరూపులగు శ్రీశమహేశ దంపతుల విడబీకి రెండుచోట్ల కాపురము పెట్టించి ఇరువురికీ ఒకేచోట అర్చనా ఒకేచోట దర్శనమూ ఒకేచోట దండప్రణామములు ఒకే విన్నపమూచేయు భాగ్యము ప్రజలకుఅందనివ్వక భావవిభేదజ్ఞులై భాగ్యమభాగ్యము చేసినారు మతపిచ్చి మనసుకెక్కించి భాషాతిక్క భుజానికెక్కించి కులతత్వవెఱ్ఱి మూటనెత్తికెత్తి ప్రజల పూజగొల్లలచేసి మతపెద్దలు కొమ్మ్మూదుతూ శివాలెక్కించి ఆడించుచున్నారు కొమ్ము శబ్దమాగదూ శివముతగ్గదూ ఇదిఏమయ్యాఅంటే దైవ చిద్విలాసమని రెండుచేతూలూ వెల్లెలకలవేస్తారు అయినా అంతపెద్ద విషయాలు మనకెందుకులే అద్నాడు రాము.

భావవిభేదముతో బాగును ఓగును చేయుట ఈనాడుకాదు సృష్ట్యాదినుంచీ ఉంది ఒకప్పుడున్నది ఒకప్పుడుండదు. మార్చుచుందురు. ఇది క్రొత్తగాదు. భగవంతునీ భగవతినీ వేరుచేయుట తప్పని అనువారు అరుదు ఒకరిని పూజించి మరొకరిని విడచిన సన్యాసిజన్మ మోస్తుందను వారులేరు దంపతుల విడబీకి సేవించుట, ధ్యానించుట, పూజించుట, పాపమనువారు. రాజ్యం ఒకొకరిభావం ఒకొకరకముగానుండును. భద్రాచలములో కోదండరాముడు గాక కూర్చొని సీతను తొడపై కూర్చుండ బెట్టుకున్నట్లుంది. ఘటకాచలములో అంజనేయులు చతుర్బాహువులతో నున్నాడు ఇట్లే భావములు అనంతములయినవి. పార్వతీమహాతల్లి దుఃఖించి దూషించేటట్లు రూపములేని వానిగా ఈశ్వరుని చేసినారు వారిభావము అట్లపోయినది భావవిభేదకాలమే కలికాలము భావవిభేదములేనివాడు భగవంతుడొక్కడే నాయనా అన్నది జ్ఞానాంబ.

ఔనమ్మా భావవిభేదము గాకుండా ఆలూమొగడూ అమ్మా నాన్నా నడిచేది తెలిసినడిస్తే నాకలోకంగా భూలోక మేర్పడుతుంది. ఆనందంగా సంసారం సాగిపోతుంది. కుడిచేయిగా నీవూ ఎడమ చేయిగా నీకోడలూ నిల్చి కష్టాలా గృహచ్ఛిద్రాలా నాచెవిన పడనీకుండా ఎదిరిస్తూ నన్నూ నాకడుపునూ ఒకకంట చూస్తూ నాసంసార నావను గట్టుచేర్చండి నీవు నీగమ్యస్థానం చేరుకునేలోపల నావను నడిపేవైనం నాణ్యంగా కోడలికి నేర్పిపో వైనంతెలియక నడిసాగరంలో నావనాపితే నాబ్రతుకు నానాగతులవుతుంది. నాఆశారేఖలు మొద్దుబారగలవు అన్నాడు రాము.

అమాటలకు అందరూ నవ్వుతుండగా సరోజ అత్తనుచూచి అత్తా ఇటువిను సంసార నావను నడిపేవైనం తెలిసి సుకాన్ని సూటిగా గమ్యస్థానానికి త్రిప్పుతూ లక్ష్యం తప్పక నిర్లక్ష్యం చేయక చేయివిడక ముందుచక్కగా కూర్చొని ఉంటే ఎంతటి తుపానువచ్చినా సుడిగుండాలు ఎదురైనా ధైర్యసాహసాల్తో అమ్మా భార్యా బ్రెడ్లను వెంటెనూవేస్తూ దరిచేర్చగలదు సుకానీత్రిప్పేది నీవంతేననిచెప్పు కోపాన్ని క్రోధాన్ని క్రిందవేసుకొని శీలాన్ని శాంతాన్ని చేతబట్టుకొని ధర్మమేజయం అంటూ ధర్మపత్నికి దాపుఇవ్వమను నావగమ్యస్థాన మెందుకుచేరదో అన్నది సరోజ.

నావ నడుపుతుంది లెమ్మని నమ్మి ముందుచూపే పెట్టుకున్నవారిని నడినీళ్లలోముంచి నానాషజీదుచేసి జలగర్భంలోకలిపి పోయిన చంచలాక్షులున్నారే అన్నాడు రాము.

షుకానీ సుడిగుండాల్లోకి త్రిప్పి నా వ ము ం చి నాదిన్యాయమనే అన్యాయ వాదులు అంతటా ఉన్నారు. ధర్మబద్ధులమై దారంతీస్తే దారంతెగకుండా కండె నిండుతుంది. పడుగూపేకా తయారవుతుంది స్నేహం శాంతంతోనేస్తే సాపుతెగు తుంది సంసారం సాగిపోతుంది అన్నది సరోజ,

అందరూ నవ్వుతూ నిజమేనంటూ వా రి మా ట ల కు ఆశ్చర్యపడుతూ ఆనందంగా భోంచేసినారు.

రామూ భోంచేసి సరోజకు ఎడమచేయి చూపినాడు.

చూడత్తా చేయిపట్టి లేపమంటున్నారు అన్నది నవ్వుతూ సరోజ.

కడుపార పెట్టింది కన్నతల్లి కొంచెం చేయూతనిచ్చి లేపు పుణ్యముంటుంది నాలాంటివారు నీకడుపున పడతారు అన్నాడు రాము.

కడుపున పడింది నీలాంటివారే నీవంటివారో నావంటివారో నిలకడమీద తెలుస్తుంది రక్తంలో ప్రేమలో ఎవరుమిన్నైతే వారివంటివారే నన్నారు నిజతత్వం తెలిసిపోతుంది కొలది కాలంలో అన్నది సరోజ.

పిల్లాటలతో ప్రొద్దుపోయింది. భోంచేస్తాము వేయరా లేచి వారికి తాంబూ లాలు ఇచ్చిపంపూ అన్నది జ్ఞానాంబ.

సరేనని రాములేచి చేయికడుక్కున్నాడు సరోజ తుండుపంచె చేతికిచ్చి తాంబూ లాలు తట్టలోపెట్టి దక్షిణా అన్నది.

రాము ఒకొక రూపాయివంతున తాంబూలాలలో పెట్టినాడు తాంబూలాలు అందరికీఇచ్చి రామును చూచినది సరోజ.

ఊఁ కానీ అని రాము అందరికీ సాగిలపడి దండము పెట్టినాడు సరోజ మోకరించి దండము పెట్టినది.

సుపుత్రప్రాప్తిరస్తూ అని అందరూ ఆశీర్వదించి వస్తామమ్మా అని వెళ్లినారు.

ఇంకరామ్మా అని అనసూయమ్మ విస్తళ్లువేసినది రాము వంట రూముకువచ్చి అమ్మా నేను వడ్డించేదా అన్నాడు.

సరోజ రామునుచూస్తూ అత్తా వద్దను పనిమనిషికి కూడాలేకుండా అంతా ఆకుల్లో పడవేస్తారు పాడుచేస్తారు అని రాము ప్రక్కచూచి రెండుచేతులాతినము ఒకచేతనే తింటాము ఒకచేయి తక్కువెక్కువలు పెట్టుతుంది. అందులో గరిటె

సహాయాను వర్తియై పనిచేస్తుంది ఎడమచేత ఎత్తివేసుకోము ఏహ్యామను పించుకోము తాము భుక్తాయాసము తీర్చుకోపోండి అంటూ పాన్‌బీడా నోటికందిచ్చినది సరోజ.

అదిచూచి జ్ఞానాంబ పాన్‌బీడా కొరకు వచ్చినావుగాని పాపమని వచ్చినావా పాపమనేటట్లయితే తొందరగాతిని లేయవా గంటలకొద్దీ మాటలుపెట్టుకొని ఎగనీల్గి దిగనీల్గి లేచినావు గంట కాలమయింది అప్పుడెక్కడ పోయిఉంటివి అయ్యో పాపం వాళ్లూతిననీ జాగ్రత్తగా లేతామనుకున్నావా అన్నది జ్ఞానాంబ.

రాము చిరునవ్వు నవ్వుతూ అమ్మా మాటల సంపట్లో మరింతతిననీ కొడుకని మాటలుపెట్టింది నీవేగా నేనిప్పుడు మాటలు చెప్పుతుంటా మరింత నీవూతినూ అని కూర్చొనిపోయినాడు రాము.

ఒరే ఆడవాళ్లు తింటుంటే నీకేమిపనిరా అక్కడ కూర్చొని ఆడవారిభోజనం మగవారు చూడరాదు అంటారు. భోజనాదులలో తల్లికైనా పిల్లకయినా మరుగుండ వలెనంటారు ఏనాల్కకేదిరుచో అది తింటారు సిగ్గుగల వారుంటారు ఒకరు చక్కగా తినగలరు ఒకరు చేతగాక ఎట్లెట్లనో తినగలరు నాల్కముందుకు మూరెడు సాచి కడి పెట్టుకొనువారూ పెద్దపెద్ద కళ్లుచేసి నోరుపట్టకుండా పెట్టుకొనువారూ నోరు ఉన్నంతా గుహవలె తెరచి ముద్దపెట్టుకొనువారూ ముద్దలుచేసి ఎగరేసుకొను వారూ పిడచలుచేసి సగము కొరుక్కొని తినువారూ మునేళ్లతో పట్టుకొని సగము నోట్లో సగము విస్తట్లో వేసుకుంటూ తినేవాళ్లూ మూతికంతా పూసుకొని వీరావేశముతో వికృతముగా నములుతూ ప్రక్కవారు ఏవగించుకొనునట్లు తినువారూ ఉసుళ్లు కొట్టుతూ ఎగచీదుతూ దిగచీదుతూ ప్రక్కవారు ఏవగించుకొనునట్లు ప్రక్కలు చీదుతూ అపానవాయువులు విడుచుతూ గుటగుటస్వరసేపు చెడనములుతూ తినువారూ విస్తరచుట్టూ అరడుగు దూరము మెతుకులు పడేసి కోడిచిదిగినట్లు చిదుగుతూ ముందువెనుకల గమనింపక ప్రక్కవారేమనుకుంటారను బిడియమువిడిచి ఎంగిలి మంగలముల తెలియక ఎడమచేత విస్తరను ఇటు అటు జరుపుకుంటూ పండ్ల సందున ఇరుక్కున్నప్పుడు వేలుపెట్టి వెళ్లబీకుతూ ప్రక్కన తినువారి మనసులు పాడుచేయు వారుంటారు సంస్కారములేని జ్ఞానహీనులు నీళ్లుత్రాగడములో చెంబూ గ్లాసూ సగము నోటిలోకి ఉంచి చప్పరించుతూ సగమునీళ్లు మీదపడుతుండ త్రాగు బుద్ధిహీనులూ ఉన్నారు వీరు సంస్కారశూన్యులు భోంచేయునపుడు భోంచేసినవారూ భోంచేయనివారూ ప్రక్కన ఉండరాదు అన్నది జ్ఞానాంబ.

ఔనత్తా సంస్కారము లేనివారు సంఘ మర్యాదలతో దెబ్బతింటారు చాలా మూలా తలిదండ్రులు చెప్పగా మిగిలినది గురువూ మిత్రులతో గ్రహించి చక్కగా తయారయినవారే అర్యులు లేనివారే అనార్యులు కుమారుని అన్నిఅందాలా బాగా తయారు చేసినావుగాని ఆడవారు తింటుంటే ప్రక్కనకూర్చొని అదివేసేదా ఇది వేసేదా అని వద్దన్నావేసి పదార్థాలు పాడుచేసే పనితనం ఎవరునేర్పినారో ఇది గురుగింజ కున్నట్లుంది అని రామునుచూస్తూ తమరు అపనికొరకేగదా హై జః రై ఉండేది అన్నది సరోజ.

అమ్మా ఎంగిలిచేత్తో కాకినదిలించ నంటుందే ఏదీ మిగిలించకుండా విస్తరంతా నున్నగా నాకిపారవేస్తుంది అట్లవేయవద్దే నాల్గుమెతుకులన్నా ఉండనివ్వవే కుక్కలూ కోతులూ చీమలూ మొదలగు జంతువులు ఆకు పారవేసినతోనే వచ్చిచూచి అన్నము తిన్నాకుకాదు అని నిరాశజెంది పోతాయి పాపము నాల్గుమెతుకులన్నా మిగిలించు అంటే అన్నం పరబ్రంహస్వరూపం అవతల పారవేయరాదు పాపమంటుంది వినదు కొంచెంజాస్తి పడేస్తే నన్నావిడుస్తుందను కుంటాను ఉహూ ఊడ్చితిని ఆయాస పడనన్నా పడుతుందిగాని అవతల పారవేయ దన్నాడు రాము.

అన్నం పారవేస్తే పాపం పారవేయకున్నా పాపం అంతా పాపమే అయితే మనుష్యులెట్ల పోవలెనప్పా అన్నది అనసూయమ్మ.

అట్లకాదత్తా భూత తృప్తి పుణ్యం అతృప్తిపాపం సమయా సమయముల గమనించి నడువవలెనత్తా విస్తరదేనికీ అందనిచోట వేయునట్లున్న సరోజ భావం మంచిది జంతువులకు అందుచోటైన నాభావం మంచిది అంతూ భావం మంచిదిగా ఉండవలె అమ్మా కాకరకాయ కూర ఇంకా కొంచెం వేసేదా వయసయినవారు కాకర బెండా మినుములూ ఎక్కువగా వాడవలెనన్నారు మేహజబ్బును రానివ్వవు మూత్రాధిక్యము గానివ్వవు వారానికి రెండు మారులైనా తినుట మంచిదన్నారు అన్నాడు రాము.

అత్తా మొదలు పెట్టినారు పనిమషికి కూడా లేకుండా పడవేయను అన్నది సరోజ.

అపక్కనున్న కట్టె నాచేతికిట్లీవ్వు అన్నది జ్ఞానాంబ.

అమ్మా పెండ్లాం ముందరా అత్తముందరా అపనిచేయవద్దే బాల్యములో కావలసినంతా చేసినావు కొరువులూ, గరెట్లూ, కత్తిపీటలూ, గుండ్రాళ్లు, సలాకులు,

గిన్నెలూ, చెంబులూ, చూపినావు. అక్కస పట్టలేక కోపమాపలేక పెదవులు కొరుకుతూ నాలుక మడతబెట్టి పండ్లు పటపటకొరికి వంశానికి నాల్గువడ్డిస్తూ గ్రుద్దినావు చెంపలు వాయించినావు తిట్టినంతా తిట్టినావు తీర్చినంతా తీర్చినావు కొట్టినంతా కొట్టినావు కోడెపిల్ల వానినైయిన్నానే పెండ్లాము ముందర అపని చేయవద్దే ఓ వాళ్లమ్మా ఇంతేకదా అని నాకొడుకును కొట్టి చంపుతుంటే అని మూడు అప్పళాలు చేతికి తీసుకొని ఏదో సంపాదించి పెట్టలేకపోయినా అప్పళాలు వేసియైనా మాతౄరుణమూ కన్యాదానరుణం కట్టుకున్న కులకాంతరుణం తీర్చుకుంటానంటూ ముగ్గరికి మూడు వేసినాడు రాము.

అయ్యో పాపము అప్పళాలతో రుణం తీర్చుకొని పుణ్యమార్జించుకొని అట్టే అమరలోకం పోయి అప్సరసలతో ఆనందమనుభవిస్తామను కున్నారు కొంటెపనులు చేస్తేకొడ్తుందీ తిడ్తుందీ తల్లి అని తలంచలేదు అన్నది సరోజ భోంచేస్తూ ఆనందంగా చూస్తూ.

అమ్మతిట్లూ, అమ్మకొట్లూ, ఆశీర్వచనాలే అమ్మతిట్లనూ అమ్మకొట్లనూ పిల్లలు జ్ఞాపకముంచుకోరు మాతృవునూ మాతృభాషనూ మతృదేశమునూ మరువరు శత్రుత్వము ఉంచరూ పెంచరూ బుద్ధి జాడ్యాన్ని కుదిర్చేకొరకు గుద్దులు పడీ ఉంటాయి కరుణలేకుండా కన్నపిల్లల వేచుకతినే తల్లులూ కొందరుంటారు. వారి వలె తయారయ్యేవే భద్రం నరసింహశతకము చూచినావా చూడకుంటే విను అని రాము.

సీ॥ తనఇంటి యర్థంబు తానెమ్మెచ్చిలుదాని
ననయంబు కొరకొరలాడుదాని
కయ్యంబునకు నెప్డు కాలుదువ్వెడుదాని
నెడపకనేవేళ నేడ్చుదాని
పొరుగిండ్లవెంబడి తిరుగుచుండెడుదాని
ధట్టించి శిశువుల కొట్టుదాని
పరహితశీలయై పరగు చుండెడుదాని
గయ్యాళియై పతి గలచుదాని!

తే॥ తవిలిపదుగురు బిడ్డల తల్లియైన
విడువవలెనండ్రు పెద్దలిప్పుడమియందు అన్నాడు.

విన్నావా నాకొడుకును కొద్దైనేను ఓర్చేవాణ్ణికాను భదరించుమా అన్నాడు రాము.

ఆపద్ధతులు నాకూ బాగాతెలుసు తండ్రీ మాడగా పిల్లలను నాలుగుతంతే ప్రక్కకు పిల్చుక పోతారు గృహ కార్యకలాపాలు జరుగుతాయి అదిమాయమ్మ మాకూ బోధించిన దన్నది సరోజ.

ఒరే ఛీయమ్మ బ్రహ్మ రాక్షసిరా పిల్లల పీక్కతినే ఘోరసర్పమురా పిల్లల కొట్టిచంపే కోపఘాతమురా లవుకికముగా బ్రతుకు అని బోధిస్తా కంటనీళ్లతుడుస్తా నన్నాడు రాము.

ఒరే పోతావా పోవా అప్పుడు కొట్టింది అబద్ధం ఇప్పుడు కొట్టేది నిజం అన్నది జ్ఞానాంబ.

అమ్మతో దెబ్బలుతినే రోజులైతేఉండేదీ రాజకీయవేత్తలయి ఉండేదీ హరిహరాదులకుకూడా అమ్మచేయి తగిలుంటున్నది అప్పయ్య సంస్కారానికి అమ్మచేయి అమృతమూ హాలాహలము కట్టెల్తో కంపలత్తో కొట్టక యుక్తి యుక్తముగా సంస్కరింప వలెనే అన్నాడు రాము.

కట్టెలూ కంపలూ చూపక కదిల్తేకదూ ఇప్పుడిట్లున్నావు అప్పుడెట్లుంటావో చూచినవారికి అనుభవించిన వారికీ తెలుసు అన్యులకేమి తెలుసురా అన్నది జ్ఞానాంబ.

అదుపులో ఆజ్ఞలో పెట్టుకొని గీచిన గీటులో నిలబెట్టి గిరుకుమనకుండా చేసి తయారు చేసినావు ఇప్పుడీ సంఘ మర్యాదలలో నీటిలో చేప ఈదినట్లుంది నీవప్పుడు త్రాటి జంపునా విడచిఉంటే ఇప్పుడు నీకోడలి చేతిలోనే భంగపడిఉండు అట్లకాదండీ ఇట్లకాదండీ అని త్రిప్పి ప్రిప్పి చెప్పుతూఉండు అజ్జు మార్చుకోకుండా లోనపడకుండా వెనక్కురాకుండా తలవంచకుండా కొనకోపుతీసుకొని ముందు చూపుతో జతెద్దుకు కోపివ్వకుండా ఎగరజిమ్మి నడిచేటట్లు నేర్పింది మాయమ్మ పడితే నీవే లోనపడవలెగాని నేను లోనపడను అన్నాడు సరోజను చూస్తూ తల ఎగరవేస్తూ రాము.

అజ్జు మంటకు ఓర్చుకోలేకా ముందు వెనుకలాడుతూ తలవంచుతూ అజ్జు మార్చుచూ జతెద్దు ముందుపోతే కొమ్ముతో కొట్టుతూ సేద్యానికి బరువయ్యే ఎద్దు

లుంటాయి ప్రక్కెద్దుకు పట్టువేసినా పండుకునే ఎద్దులుంటాయి తిండికి తిమ్మరాజు పనికి పోతురాజు అని పించుకుంటాయి నీవేలోనబడి పట్టువేసినా బరువనకుండా నిబ్బరంగా నిదానంగా బండిని ఈడ్చమని మాయమ్మ బోధించింది కొమ్ముతో కొట్టకుంటే చాలు బరువనకుండా బండిని గమ్యస్థానం చేస్తూతా జంపు కొమ్ముల ఎద్దులవలె జతెద్దును గుమ్మవాకండీ అన్నది సరోజ.

జత సరిపోయినారు కాట్లాడకా పోట్లాడకా మాట్లాటలతో ఆట్లాటలతో గమ్యస్థానం చేరితే సుఖపడతారు. చూచి ఆనందంతో మేము కనుమూస్తాము మాకు కావలసిందదేనప్పా అన్నది అనసూయమ్మ.

కాట్లాడనూ పోట్లాడనూ కావలసిన శాంతం నాకులేకుంటేకదా కాట్లాటకు వస్తే కోరలులేవంటాను పోట్లాటకు వస్తే కొమ్ములు లేవంటాను. పాట్లాటకూ ఆట్లాట వస్తే అక్షరము తప్పకుండా మంత్రివలె అందిస్తాను అన్నది నవ్వుతూ సరోజ.

అంతలో భోంచేసి అయినది రాము పడసాలలో కూర్చొన పోయినాడు సరోజ లేచి చేతులు కడుక్కొనివచ్చి విస్తళ్లు తీస్తూ అమ్మా ఎంగిలిచేత్తో ఎంగిలివిస్తళ్లు తీయరాదన్నారే అన్నీ ఎంగిలేకదా అన్నది సరోజ.

అనసూయమ్మ సరోజ తట్టుచూచి తనుతిన్న విస్తరకూడా ఎంగిలి చేత్తో కొందరు ఎత్తివేయరు చేయి కడుక్కొని వచ్చి తీసివేస్తారు కొందరు పాటించరు ఎంగిలిచేత్తో అన్యుల ఎంగిలివిస్తర తగిలితే అభుక్తశేషము తిన్నదానవవుతావు. చేయి కడుక్కొని వచ్చుటచేత నీకూ అఎంగిలికి సంబంధము లేదన్నారు ఏందుకింతా అందరుపోయే దారినేపోతే బాగు కష్టమయినదో ఖర్చయ్యేదో కర్మమంటుకొచ్చేదో అయితే విమర్శించ వలసినదే ఇందులో ఏముంది ఎట్లయినా ఒకటే పెద్దవారి దారినేపో అన్నది.

సరేనంటూ సరోజ విస్తళ్లెత్తినది వారిపదార్థములు చక్కపెట్టినారు చేతులు తుడుచుకొంటూ రామున్న మధ్యగదికి ముగ్గురూ వచ్చినారు.

సరోజ చాపవేసి తాంబూలం తట్టపెట్టినది. అనసూయ జ్ఞానాంబ శ్రీరామా అంటూ వచ్చికూర్చున్నారు.

వాండ్లనుచూచి రాము నవ్వుతూ అపరభారతీ రమా ఉమా అవతారాలు అన్నాడు.

సరోజ నవ్వుతూ అది వరాహావతారాలు అనకుండా విడిచినారు బ్రతికి నాము అన్నది.

జ్ఞానాంబ చిరునవ్వుతో వక్కపొడి నములుతూ రామునుచూచి నేనురేపు పోతానప్పా మరి సీమంతము ఎక్కడనో చెప్పితే ఏర్పాటు చేస్తాము అన్నది.

రాము జ్ఞానాంబను చూస్తూ చిరునవ్వుతో అమ్మా పిల్లవాళ్లు చేసేపని పిల్లవాళ్లు చేస్తే పెద్దవాళ్లు చేసేపని పెద్దవాళ్ళు చేయవలె మమ్ముల అడుగుతారెందుకూ మిమ్ముల నడిగి ఈపని చేసినామా చేసినపని ఏనాడయినా బయట పడుతుందికదా చేయండి అయినా మనఊళ్లో అయితే సర్వవసతులూ ఉండగలవు సర్వవస్తువులూ సులభముగా చేకూరగలవు ఇది పట్టణము విద్యాబలముతో ధనబలముతో ఉద్యోగ బలముతో వ్యాపారముతో వృత్తితో ఒకరినొకరు దోచుకతినే వర్గ సముదయము ఆదాయాల దురాదాయాల దేవుళ్లగుంపు ఇక్కడ ధర్మదేవతకు చోటులేదు. క్రిమికీట న్యాయముగా ఒకరినొకరు కొట్టుకొని పట్టుకొని చూపెట్టుకొని జీవింపతగినవారు ప్రజలపై పల్లెలపై ఆధారపడి నోళ్ళు తెరచుకొని చేతులు చూచుకొని ఎప్పుడు ఎప్పుడు దొరికే దెప్పుడని రెప్పవాల్చక చూచుచుండే పరమ భేతాళస్వరూపులుండే భూతలోకం ఇక్కడ రూపాయకు పదిరూపాయలున్నగాని పనులు చక్కగాజరుగవు భూతదయగలిగి ధర్మానికై పాటుబడు మానవులు కొరతగా ఉంటారు పల్లెలలో స్నేహమూ భూతదయగలిగి అయ్యో పాపమను జనులున్నారు. పరోపకార చింతన ఇంకా పూర్తిగా చావలేదు ఉంది పనులుకాగలవు పాలూ, పెరుగూ, నెయ్యి మొదలగు వస్తువులు అగ్గువా నిజాయతీ అయినవి కల్తీలేనివి దొరకును పేటస్నేహం స్నేహంగాదు పేడబెల్లంగాదు అంటారు అనగా లాభంలేనిది పట్టణ నివాసులు పలుకరు లాభం చూచుకొనే స్నేహం చేస్తారన్నారు అన్నాడు రాము.

ప్రకృతం పట్నాలకన్నా పల్లెలేమిన్నైనవి అమరాదాయాల దేవత పీఠనూ ఆవరించినది బంధుబలమున్నా దేహబలమున్నా సైన్యబలమున్నా ధనబలమున్నా ప్రజల పీడించి పిప్పిచేసి పశున్యాయ ప్రవర్తకులై పాపమనక ప్రజల పారదోలుతున్నారు. అందువల్లనే సగము పల్లెజీవులు పట్నాల కెగబ్రాకి ఉండేది ఏగబ్రాకుతుండేది అయినా పట్నాలకన్నా పల్లెలేనయం భూజీవనులకు పల్లెమేలూ వ్యాపారులకూ ఉద్యోగులకూ సేవకులకూ పట్నంమేలు భూమితో పశువులతో పల్లెజీవులు బ్రతుకగలరు. వ్యాపారముతో ఉద్యోగముతో సేవకా వృత్తులతో పట్నం జీవులు

బ్రతుకగలరు పల్లెలో కాయకష్టం పట్నంలో మనఃకష్టం కాయకష్టానికి విలువ తక్కువా మనఃకష్టానికి విలువ ఎక్కువా మానవునికున్న కాయబలం మనోబలం రెండింటిలో మనోబలానికే విలువగలదు. మనోబలములేనివారు మందభాగ్యులు మనోబలము గలిగినా పూర్వజన్మ సుకృతము లేకున్న అదీ నిష్ఫలమే యగును శక్తితో ఇక్కడా యుక్తితో అక్కడా బ్రతుకుతారు అదృష్టజీవు లెక్కడున్నా ఒక్కటే నన్నది జ్ఞానాంబ.

పట్నాలలో స్నేహపాత్రులూ పరమమిత్రులూ కొదువ ఈ రెంటికీ పల్లెలే మేలు అయ్యో పాపమని ఆదరువిచ్చే జీవులెందరో ఉన్నారు. ఇంకా ధర్మమూ దయా స్నేహమూ చావలేదు పల్లెలేమేలు అన్నాడు రాము.

కాయకష్టం మనోకష్టం రెండు విధాల్లో కాయకష్టంపై ఊమకొని ఎండా గాలీ వానా యెనక అరణ్యమే శరణ్యమని కాలము గడిపేది అజ్ఞానులూ దరిద్రులూ పాపులూ వీరిలో వృత్తితో చేతిపనితో కాయకష్టాన్ని మనోకష్టాన్ని మిళితముచేసి నీడపాటున కూర్చొని జీవించువారు. మధ్యములు వీరిలో మరింత చాక. చక్యము గల్గువారు ప్రజ్ఞావంతులై ప్రఖ్యాతితో బాగా బ్రతుకుతూ సుకపడుగలరు వ్యాపారులు మనోబలమూ ధనబలమూ గలిపి నీడన కూర్చొని ద్రోహచింతనతో అమాయకుల వేటాడుతూ యుక్తితో సర్వసౌఖ్యములతో జీవింతురు. మనోబలముతో విద్యసాధించి దానితో కవులై గాయకులై పౌరాణికులై వాద్యవిశేషములతో శిల్పులై కొందరు రాజభాషనేర్చి ఉద్యోగులై దాస్యోద్యోగులై ఉన్నతోద్యోగులై న్యాయవాదులై అన్యాయవాదులై నానారీతుల మాతృభాషాకు రాజభాషా తోడుచేసుకొని మంచివారు గౌరవ ప్రతిష్ఠలతో చెడ్డవారు అగౌరవ ప్రతిష్ఠలతో జీవింతురు వీరు సుఖపడగలరేకాని పాపము రెండంతలు సంపాదింతురు. జ్ఞానముండీ కనుగలిగి వర్తించిన రెండు విధముల పుణ్యమూ సుఖమూ అర్జనగలుగును కనుగానక డాంబికులై జీవమర్యాదనుపీడి కడుపాత్రము కొరకు కనుగానక ప్రవర్తించిన రెండు విధముల పాపమూ దుఃఖమూ సంపాదించి మానవత్వమునుండీ దిగజారి దుఃఖమనుభవింతురు అన్నది జ్ఞానాంబ.

ఔను వదినా అన్నిటకంటే భూజీవనమే మానవునికి శ్రేష్ఠమనుకుంటా ఏ జీవికీ అపకారము చేయక దైవముమీద ఆధారపడి కాయకష్టముపై ఆధారపడు మూఢజీవుల వదిమందిని బ్రతికిస్తూ నోరులేని పశువులకు ఆదరువుచేస్తూ ఆదర

విస్తూ పోషిస్తూ తెగుళ్లు చీడా పీడాలేక పైరుబాగా ఉండేటట్లు చూడుస్వామీ అని దైవముపై ఆధారపడి పండించుచూ చీమదగ్గరనుంచీ మానవుని వరకూ తిన్నా ఓర్చి తనునమ్ముకొన్న పరివారమును పోషించుకుంటూ ఉంటాడు గాబట్టి భూజీవ నుడే శుభపను కుంటాను అన్నది అనసూయమ్మ.

ఆమాటలకు తలఊపుస్తూ అనసూయమ్మను చూస్తూ వదినా దానిలోకడా ఉత్తమ మధ్యమ అధమాధములు ఉన్నారు. లేనిపాపాన్ని ఆర్జించుకొని మరు జన్మకు మాలకాకియై జన్మించి ఊర్లోకి రానుకూడా అధికారములేక ఊరకాకులతో తన్నబడి స్మశానములో తిరుగుతూ తినతిండి గానక మలమలమాడే మాలకాకులు లేకపోలేదు పశువులకు మేతా నీళ్లూ వేళకు వేయక ఎముకల బొమ్మలై కంటనీరు పెట్టుతూ పుసిపట్టి కాలు జదల్పలేని స్థితిచూస్తూ పోకపోయెననీ కదలక పోయెననీ కరుణలేక కఠినుడై కాలాచేతా తన్నుతూ ఎముకలు విరుగ దెబ్బలకొట్టుతూ కుంటు పడినా అజ్జు గడ్డకట్టినా కాలుకదపలేని స్థితిలో ఉండినా ముసలిదై కన్నులు కానరాని స్థితిలోఉన్నా కట్టికొట్టే వారున్నారు ఇక పాడి పశువులన్ననో పాలు ఇవ్వకపోయెననీ కాలతన్నెననీ కాళ్లకు బంధనవేసి చేపి పాలు ఇవ్వక చేపక ఎగ బట్టుతావా అని బడిశెలతో కొట్టుతూ దూడకుకూడా గుక్కెడు పాలు వుండనివ్వక పితికి దూడ ఆహారము సన్నగిల్లి దుర్బలత్వముతో కృశించి నశించగా చర్మముడీసి అందులో చెత్తదురిగి పశువుకెదురుగా ఉంచి పాలుపితికే పాపులున్నారు కుటుంబ ములోని వారికి తినతిండీ కట్టబట్టా తలకునూనె ఇవ్వక అసోమ గల్పించక రాత్రిం బవళ్లు వేచుకతింటూ కష్టసుఖముల గమనించక వారివయసునూ సుఖమునూ వల్లకాడు చేర్చేవారున్నారు చేనికిరువాగులా కాయా కసుర్లు దోపిడీలుచేసి గెట్లనెగ వేసి దోవలుబూడ్చి దార్లకు వంకలుత్రిప్పి కట్టలుకట్టి ప్రజలు హింసలు పడుతుంటే చూచిచావండీ యని కిలకిలనవ్వే కింకరులూ ఉన్నారు రాత్రింబళ్లనక జీతగాళ్లతో కూలివారితో పనులు చేయించుకొని తక్కువకొలత పళ్లతో గింజలు వేసేవారూ ఉన్నారు నలుగురు చేయుపనికి ముగ్గురునేపెట్టి పనికాకపోయెనని ఎదుటనే పళ్లెతిట్లు తిట్టు ప్రభువులూ ఉన్నారు తాను చేసినదిగాక తనవారిని తెమ్మన్నదిగాక రాత్రి కూలికి పిలచి పత్తి కంకి కాయా కూడబెట్టడం ఇతరులవి కట్టమార్చికట్టి తెప్పించ డం పొలాలలో పయిర్ల కాజేయడం కట్టలుతెంచడం ప్రజలకూ పశువులకూ పక్షు లకూ కంటిక ప్రాయుడై వీధివారికీ ఇంటికిరుప్రక్కలవారికీ వెనుక ముందు వారికీ

దుష్టగ్రహమై దూషిస్తూ కాలు పెట్టనివ్వక తానే ముందువెనుక వీధుల నాక్రమిస్తూ ప్రజానిరోధక మైన ర్పి పాపభీతిలేని పాపజీవులున్నారు వీరికి ప్రకృతమున్న యముడూ యమకింకరులూ చాలక క్రొత్తయముడూ క్రొత్తకింకరులూ కావలయును వీరిదెబ్బకే పల్లెవిడిచి ప్రజలు పట్నాలు చేరుతుండేది వీరు పాపాలభైరవులు కన్ను మిన్ను గానని కాలభైరవులు వీరికి ముందుంది ముసళ్ల పండుగ అన్నది జ్ఞానాంబ.

అందుకే వదినా అనుభవిస్తూ ఉండేది సాటిగృహస్థుల బాధించిన దోషం గృహమేలేక అద్దెఇండ్లలో ఉండుట వసతులులేక అల్లాడుట ఊరవెలుపల ఉండి ఈతిబాధలకు అల్లాడుట ఇరుగు పొరుగువారు బలవంతులై వత్తుతుంటే చూచి ఓర్వలేక అనలేక కుళ్లిచచ్చుటా ఇరుకులు పెట్టుతుంటే ఇమిడి చచ్చుటా కట్టుటా విడచుటా కొనుటా అమ్ముటా ఛిద్రగృహములలో నుండుటా చావిళ్లలో సత్రాల్లో పండుటా గృహము లేకపోయెననీ వసతులులేని గృహమాయెననీ అహర్నిశమూ చింతించి నిరాశ చెందుతున్నారు పశువుల హింసించినందుకు మరుజన్మలో పశువులు విడిపోవుట చచ్చుట దూడలు బ్రతుకక పోవుట పాడి ఎండిపోవుట పాలు ఇవ్వక పోవుట తగ్గిపోవుట నానారీతుల దుఃఖపెట్టుటా సంభవించును భూమి దొంగలించుట బలముతో ఆక్రమించుటా కాయా కసుల్లు మేతా మేటా ఎత్తుక పోవుటవల్ల ఈ జన్మలో భూమే లేకపోవుటో ఉండిన తకరార్లూ తారామళ్లూగలిగి తీరనివై బలవంతుల మధ్యలో ఇరికించి సదా దుఃఖింపచేయును. కూలీలకుచేసిన ద్రోహముతో తానూ కూలీయై నిరంతర కష్టజీవియై ఒరులతో ఛీ ఛా అనిపించుకుంటూ చాలీ చాలని సంసారముతో ఒరే తరే అనిపించుకొని సాటివారిలో చావుబ్రతుకుల మధ్యలో అవమానములతో అల్లాడుతాడు చేసినది చేయించకపోదు ఇదితెలియక జరుగుతున్నదని అధికారమూ అన్యాయమూ చెలాయిస్తారు తిరుగు మజిలీలో తిప్పలు పడుతూ పాపిలోకమంటూ పాడు బ్రహ్మ ఇట్లవ్రాసెనంటూ దుఃఖపడుతారు అన్నది అనసూయమ్మ.

ఔను వదినా పశువుల తనప్రాణంవలె చూస్తూ కూలీల కష్టపెట్టక తిట్టక కొట్టకా యుక్తి యుక్తముగా చూచుకొంటూ ఒరుల సొత్తుల అపహరించక గృహపరిపాలనలో లోకువలేకుండా కంటపూస్తూ ఇతరుల వసతుల చెరచక ఆక్రమించక భూతదయగలిగి దేవుడూ దైవమంటూ జీవితము సాలుతప్పక నడిపిస్తే భూజీవనుల కన్నా మిన్న ఎవరూగారు లేరు పశు పక్షి క్రిమి కీటకములకూ బీదలకూ ఆదరు

విచ్చుటకు ఒరులకే యపకృతీచేయక దైవముపై ఆధారపడి జీవించుటకూ భూజీవను లకు వీలగును భూజీవనుల చూచి భగవంతుడుకూడా మిగులా సంతోషించును జీవన ములలో తెలిసివర్తిస్తే భూజీవనమే జీవనము ఇహపరములలో సుఖస్థాన మేర్పరచు కొనగలడు ఏ దిగులూ లేనిది బాధగన్పడనిది పాపము రానివ్వనిది బుద్ధిగలిగి బ్రతికితే భూజీవనుడే మరుజన్మకు భూమీశ్వరుడయ్యేది దీనికి మించినదేదీ లేదన్నది జ్ఞానాంబ.

భూజీవనములో గౌరవములేదని ఉద్యోగములో ఉన్నదనీ వ్యాపారములో బాగా ఆర్జించి భార్యా పిల్లల పోషించవచ్చుననీ ముందంజవేసి అందరూ పరుగిడు తుంటే ఇట్లంటావెందుకత్తా అన్నది సరోజ.

ఔను వ్యాపారము బహు రుచికరమయినది లాభము మిగుల యుక్తిగాగడించ వచ్చును ప్రజల మోసముచేసి సంపాదించిన పాపము చిత్రగుప్తుని చిట్టానిండుతుంది మళ్లీజన్మకు ఆదేహమూ ఆబుద్ధీ చూచి నవ్వని వారుండగు ఆరోగ్రగ్రస్తత చూచి ఏమి పాపము చేసినాడోయని ఛీ ఛా యనని వారుండరు వానిజీవితము ఈప్రపంచములో వ్యర్థమై దుఃఖ భాజనమగు నన్నది అనసూయమ్మ.

చక్కగా ధర్మయుక్తముగా నడిపితే పాపమంటావా అమ్మా అన్నది సరోజ

తానుతెచ్చిన ధరచెప్పక పోయినా తగినంత లాభముతో ఇస్తూ సాటివారి కన్నా ఎక్కువచెప్పక కొల్తలో తూకములో కసరాయెత్తు పట్టక చిన్న పెద్దయనక ధనికుడూ ఉద్యోగీ బీదయనక సర్వులా నొకకంటనే చూస్తూ దూబరదిండి సరుకులు తేక మంచివేతెస్తూ సేర్లూ రాళ్లూ తక్కువయి పెట్టక వచ్చినవారిని మర్యాదతో చూస్తూ తెలియని వారిని కోపగించక కసురుకొనక నచ్చచెప్పి శాంతముతో పంపుతూ ఉదయ సాయంత్రముల దైవధ్యానము మరువక ధర్మమూ భూతదయా పెట్టుకొని చేయు వ్యాపారస్థుల కందరికీ వృత్తిపాపము ఒకటే ఉండును దీనికివ్యతి రేకించి కొల్తలో తూకములో సమయాను కూలముగా మనుష్యులకొద్దీ నడుచుతూ దైవధ్యానములేక ధర్మచింతనా భూతదయాలేక ప్రతిదానిలో వ్యాపార నడకే నడుస్తూ కూర్చున్నా లేచినా లాభమే గావలెనని దురాదాయ దేవుణ్ణే తలపులో పెట్టుకొని ఉన్నవారికి రోగములు స్త్రీ దుఃఖాలూ తల్లిలేని పిల్లలూ యౌవనలోపమూ దేహచింతా శత్రుభయం ఋణచింతా పెట్టి నేలబెట్టి కాలరాచును సర్వమూ మోసము తోనే పోయి నాశనమగును. ఊరక విడువదు మరుజన్మానికి అనుభవించునంతా

ఉండును అక్కడా ఊడుకొననీక పశుత్వమువరకూ ఈడ్చును వ్యాపారో ద్రోహ చింతనం అన్నారు పిత్రద్రోహం బంధుద్రోహం చేయిస్తుంది లాభంలేనిది దేవునికి కూడా పలుకడు ఓస్వామీ వేయిరూపాయలు లాభంవస్తే పదిరూపాయలతోనగు ఆను వూజకట్టిస్తానంటాడు లాభంలేనిది హరిహరాదులకుకూడా పలుకడు వ్యా పా రో ద్రోహచింతనమన్న పాపమే ఉంటే దానిలో కసరాయెత్తు తక్కువ కొల్తలూ తక్కువ రాళ్లూ పెట్టడం పసిపిల్లలా తెలియని వారలా అడుగలేని వారలా మోసముచేయడం చెప్పవలెనా ఈరెండు విధములగు పాపముతో వ్యాపారం జీవితము నాశనము చేయును భూస్వామికి వ్యాపారి ఏనాటికీ సాటిరాడు అన్నది జ్ఞానాంబ.

భూజీవనులకూ కూలివారికీ సంబంధము ఉన్నదికదా కూలీలు మాత్రము పాపము చేయడము లేదను కున్నావా సోమరులై ప్రొద్దు నెగచూడడమూ మల మూత్ర విసర్జనకే పాతిక ప్రొద్దును పాడుచేయడం ద్రోహబుద్ధితో పనికి మరింతపని అపునట్లు పాడుచేయడం చేయువారినికూడా చేయనివ్వక చెరచి కాలము వృథా పుచ్చడం తనదికాదనీ కూలిపనియనీ వల్లని మొగనికి తలబ్రాలు పోసినట్లు వళ్లు వంచకా పోసుజాలకా చేయడం వకడుచేయు పనిని నలుగురు చేయడం చేయుపనిని చెరచి యజమానిని నష్టపెట్టడం యజమాని మరుగైతే సామానులు ఎత్తిపెట్టడం వేగి లేచినది మొదలుకొని ఏది దొరికినా దొంగగా తెచ్చుకొనడం ధనికుడు గావలెననీ దురాశతో నానావిధాల వరులసొత్తును అపహరించడం డొర్లు కొట్టడం ధనాశతో కూనీలు చేయడం రౌడీపనముతో బెదిరించి దోచుకొనడం చేయుచున్నారే వీరినేమన వలె నంటావు అన్నది సరోజ.

వీరు మూఢులు పూర్వజన్మ పాపులు వీరికి బు ద్ధి బ ల ము సంపూర్ణముగా ఉండదు వీరికి అన్నానికి లేకున్నా త్రాగుడూ జూదమూ ఆకూ పొగాకు బీడీ నశ్యం భంగి చుట్టా శిగరేటు మొదలగు దురాభ్యాసాలు ఒకటీ చేసిన కష్టములో ఏదోవక రీతిని నాలుగణాలయినా మిగిలించుకొనకపోయిన రోగగ్రస్తుల మయినప్పుడూ మిత్రుడూ బంధువూ ఇంటికి వచ్చినప్పుడూ ఆలూపిల్లలూ వ్యాధులతో చిక్కినప్పుడూ పనిచిక్కక కాలము వృథాయయినప్పుడూ మిగులు ధనము కొంచెమయినా ఉండ వలెగదాయను బుద్ధిబలము లేనిదిరెండూ సంసారానికి ప్రతిమానవుడూ సేవకుడే గదా నేను చేయకపోయిన ఎవరుచేయగలరు కాలమువృథాచేసి సో మ రి నై తే అన్నము మాత్రము తప్పదుకదా ఏ ఆర్జనాలేక దుర్మిత్రులతో తిరిగితే బీదతనం

బాధిస్తుందికదా అనే లెక్కతెలియనితనం మూడు చాలలేదని లేకపోయెననీ దొంగ తనం మోసంచేస్తే ముందుజన్మకైనా తీర్చవలెకదా సేవకా ధర్మము చక్కగా నెర వేర్చని పాపము తిరిగీ సేవకా వృత్తినే కల్పిస్తుందికదా నాధర్మం నేనుచక్కగా నెరవేర్చుకొని యజమానికి బాకీపడక నడుచుకొనిన ఈజన్మ కర్మము తీరిపోవు గదా సోమరినై అన్యాయముచేస్తే అన్యాయము అవలజన్మలో అవస్థలు పెట్టునుకదా సంఘములో మర్యాద హీనమౌ బ్రతుకౌనుకదా అని పూర్వజన్మ కర్మమూ పుట్ట బోవు జన్మ కర్మమూ తెలియని తనంతో పశుపక్షి కీటకములలో కలిసిపోవు పాపముచేసి పాడైపోతున్నారు తెలిసి శాంతముతో దారిద్ర్యాన్ని ఎదిరిస్తే బాధా నివృత్తి గలిగి బాగుపడ గలరన్నది జ్ఞానాంబ.

ఉద్యోగులదే మేలు చేసినంతాపని చేయవచ్చు తారీకులు ఎదురుచూస్తూ ఉండవచ్చు చేను బొందుపోయినా జీతం బొందుపోదు ఏ పా ప మూ చేయము అన్నాడు రాము.

సరోజనవ్వుతూ అత్తా ఉద్యోగులు పోయే పట్టణంపేరు మళ్లీవచ్చేజన్మల పేర్లు కొంచెము చెప్పు వినని నిష్కళంకం నిష్కల్మషం ఉద్యోగ లక్షణం అను కున్నారు కర్షకులకూ కూలీలకూ వృత్తిపనివారికీ వ్యాపారులకూ వకందాన పాప మయితే రెండందాల పాపము సంపాదించే పరమ పా ప సు ల క్ష ణ ననీ అని రామును చూచినది.

రెండందాల పాపమేమిటే మానవులకు రెండుచేతులే పెట్టి దేవతలు నాల్గు చేతులు పెట్టుకున్నారు అనగా భుజబలముతో బంధుబలముతో ధనబలముతో విద్యా బలముతో ఒరుల బాధించము పరోపకారానికే ఉపయోగిస్తాము ఈనాల్గు చేతులు మీకుఇస్తే నాల్గందాలా బాధిస్తారు. రెండుచేతులేచాలు ఒరుల బాధించక చేతనయితే ఉపకారం చేయండీ చేతగాకుంటే ఊరుకోండీ వస్తుగుణ తత్వం తెలియనివారు తెలియనట్లుండక తెలిసినట్లు వర్తించి లోకులచెరచి తానుచెడును మంచీ చెడ్డా తెలిసి బ్రతుకండి తెలియకపోయిన ఊరకుండండి ఈరెండుచేతులే మీకు చాలునన్నారు మేము వారుచెప్పినదాన్ని మరొకవిధంగా మార్చుకున్నాము తప్పేముంది కుడి ఎడమలనకుండా రెండుచేతులా ఇచ్చేవాళ్లుంటే పడ్తాం ఇవ్వనివాళ్లుంటే ఇరుకులు గల్పించి చేబడ్తాం కుడిచేత్రవ్రాస్తూ డబ్బుకు ఎడమచేయి అనకుండా పడ్తాం రెండు

చేతులా ఉపయోగము చేస్తూనే వున్నాముగా పదవులంటే అందరికీ వస్తాయా దైవత్వం కొంతకలిగే వుద్యోగి అయ్యేది మీఇంటి బంకమంట్టిగాదు అన్నాడు రాము.

ఉద్యోగం పురుషలక్షణం అన్నారు పురుషులందు పుణ్య పురుషులు వేరయా అని వేమన అన్నారు ధర్మ అర్థ కామ మోక్షములు నాల్గు అర్జిచువారు పురుషులు అని పెద్దలన్నారు తెలిసి వర్తిస్తే పురుషలక్షణం వక్రిస్తే ఉద్యోగం పాపలక్షణం రెండందాల పాపులు వుద్యోగులు ప్రజారక్షణకై ప్రభువులు ఉంచితే ప్రజా భక్షణం ప్రజాశిక్షణం చేస్తారు ప్రజాద్రోహం రాజద్రోహం చేయము అని ప్రమాణాలుచేసి పదవి ప్రమాణ స్వీకారం అని నోటపల్కి రాజద్రోహం ప్రజాద్రోహంచేసి మరు జన్మ మానవత్వమే లేకుండా చేసుకుంటారు. రాజచిహ్నం నెత్తినుండుకొని రాజ ముద్ర చేతబట్టుకొని అవు రాజధాని ఉన్నదని ప్రజల పలువిధాలా బాధించివేధించి అవమానపరచి నేనే దేవేంద్రుడనని నేనే జ్ఞానవంతుడనని విఱ్ఱవీగునది ఒకటి ద్రోహం లేకుండా సోమరితనం లేకుండా ధర్మబద్ధుడనై రాచకార్యము నెరవేరుస్తా నని ప్రమాణంచేసి పనులు చక్కగాచేయక ప్రజల కార్యకలాపాలే చూడక సప్త వ్యసనాలు నేర్చుకొని కాలము గడుపుతూ దినాలలెక్కించుతూ జీతాలతెగదింటూ ఇంకాముందు వుద్యోగానికి ఎప్పుడు పోయేదని లంచాలిచ్చి ముందుకుపోతూ లంచాలు తీసుకొని వుద్యోగాలిస్తూ కార్యము తొందరగా చేయుటకై ప్రజలతో లంచాలు తింటూ పైఉద్యోగుల మోసముచేస్తూ క్రింది ఉద్యోగుల అవమాన పెట్టుతూ గర్వోన్మ త్తులై తిరుగుతారు అలవెన్సనీ బత్తాయని కరువుబత్తెమనీ టీ. ఏ. లనీ పనికిపోకనే తీసుకుంటూ అటు రాజకీయానికి ఇటు ప్రజలకూ ద్రోహంచేస్తూ రెండువిధాల పాప మార్జించి దైవోపహతులై మానవత్వమునుండీ దిగజారి మతిహీనులై జ్ఞానమేలేని పశు ప్రాయులై ముందెట్టి ఇక్కట్టుల ప్రజలపెట్టినారో అట్టిబాధలతో అలజడిపడుతూ దుఃఖించుతూ వుద్యోగులు దుర్మార్గులంటూ దూషించు చుందురు. ముందుచేసిన పుణ్యాన్నీ భగవంతుడిచ్చిన అధికారాన్నీ నిలుపు కొనవలెనని రాచకార్యములో ఏలోకువా చేయక ప్రజోపయోగములు చెయుచూ లంచాలకు లోనుగాక పైవ మిచ్చినజీతం ఇంతే యనినమ్మి క్రింది వుద్యోగులకు తండ్రియై పై వుద్యోగులకు తనయుడై సోమరిగాక ఇహపరముల రెంటినీ మనసులో ఉంచుకొని చేసినదీ చేయుచున్నదీ చేయబోవునదీ పై వుద్యోగికి చెప్పుటకన్నా ముందు ఆఫీసుకు పోవు నపుడూ వచ్చునపుడూ సూర్యభగవానునితో చెప్పుకొంటూ జీవితము నడిపించిన

ముందుజన్మకు ఉత్తమ పదవులందగలరు వున్నతోద్యోగులై సర్వజ్ఞాన సంపన్నులై సర్వసిరిసంపదలతో సర్వసౌఖ్యములూ సూర్యభగవానుని అనుగ్రహముతో పొందగలరు. సూర్య చంద్ర గ్రహానుగ్రహములేక వుద్యోగములేదు రాజకీయరంగములో కాలుపెట్టలేడు ఇది జ్యోతిష్యులకే తెలియునుగాని ఇతరులకు తెలియదు అన్నాడు మీనాన్న అన్నది జ్ఞానాంబ.

అమ్మా అంత నిజాయితీగా ఎవ్వడుంటారు.

ఆ॥ ఆకుదానిగన్న నర్థంబు పొడగన్న
సారమైనరుచుల చవియుగన్న
ఎట్టివానికైన పుట్టుబోయాశలు
విశ్వదాభిరామ వినరవేమా॥ అన్నాడు.

అంతట వేమనే ఆమాటంటె వచ్చేడబ్బునూ వచ్చే స్త్రీని పోగొట్టుకొని ముందు జన్మాని కెదురుచూచే మూర్ఖుడెవడు అన్నాడు రాము.

ఈ ఆశే మానవుని అడుగంటించేది ఇది మూఢ తనమన్నవారే సేవకోద్యోగులై పై వుద్యోగిక్రింద మంచాలెత్తుతూ ఒకడూ కంచాలు కడుగుతూ ఒకడూ కాళ్లకు బూట్లందిస్తూ ఒకడూ కసువునూకుతూ ఇంకొకడూ కాళ్లు పిసుకుతూ ఇంకొకడూ అమ్మయ్యకు కాయగూరలు మోస్తూ మరొకడూ వుంటూ వారనేమాటలు వింటూ చేసేకార్యాలకంటూ తాను ఉట్టి వున్నతస్థితికిపోను వీలులేనందుకు చింతిస్తూ ఎన్నిఅన్నా సహిస్తూ వారుచూపి చెప్పే అప్రయోజక కార్యాలయినా చేస్తూ తన హీనస్థితికి ప్రలాపిస్తూ వుండే వారగుపడలేదేమిరా క్రింది దాస్యోద్యోగు లనుభవించు హీనమునూ లోకువనూ జీవితకష్టమునూ నీబుద్ధిలో ఊహిస్తే ఊహకందలేదా కరుణ కలుగలేదా అన్నది జ్ఞానాంబ.

అయితే ముందుజన్మలో వుద్యోగులై ఊద్చుకతిని అటు రాజ్యాంగమునూ ఇటు ప్రజాంగమునూ బాధించి అందరినీ ఛా ఛీ అని ప రా భ వి ం చి న పరమ పుణ్యాత్ములేనంటావా ప్రకృతం దాస్యోద్యోగులయి వుండేది రెడ్డింటివద్ద కుక్కవలె పైబడి బెదరించి పీక్కుతింటూనే వున్నారే మళ్లీ పోయివచ్చేటప్పుడు ఏమవుతారంటావు అన్నాడు రాము.

సరోజ చిరునవ్వుతో రామును చూస్తూ అయ్యో స్వామీ వీరు రాజ్యద్రోహులై రాజ్యవస్తువుల దొంగలించిన నెపమువల్ల కారాగార శిక్షలనుభవిస్తూ ఉద్యోగులకు ఏయపకారమూ చేయక అన్యాయముగా కారాగార మాయెనే యని దుఃఖిస్తూ కొందరులతో ఇరుకులుగలిగి ఆదాయము వచ్చునదిపోయి సోకించువారు కొందరు ఉద్యోగులుచేసిన కార్యములకు వారి వ్రాతలకూ తనకార్యములుచెడి వారెను సమర్ధించుకొన వృధాగా ధనము వేనవేలు వ్యయమయి తలకు పట్టువేసుకొని ప్రలాపించువారు కొందరూ ఉన్నారేవారు అగుపడలేదా తమరు మాత్రము చేయకండీ అన్యాయంగా సంపాదించి తెచ్చిన ధనము తినుటవల్ల ఆలుపిల్లలుకూడా ఆచింతకూ ఆకష్టానికీ పాత్రులే అవుతారు. చేసేది మొగవారూ అందులో అర్ధం మోసేది ఆలూ పిల్లలూ తమరట్లుచేయకండి మరుజన్మలో తమ శోకవరాళీ రాగములో శృతికల్పి నేనూ పాడవలసి వస్తుంది. తలపట్టుకొని నాకెదురుగామీరూ మీకెదురుగానేనూ కూర్చొని ఇంకెట్లని ఉద్యోగము ఊడిపోయెనే బ్రతికేదెట్లని ఏడ్వవలసి వస్తుంది అన్నది సరోజ నవ్వుతూ.

నేను పొరబడనులేవే మానినీమణి వాళ్లిచ్చిన టయానికన్నా పదహైదు నిమిషాలుముందు పోతూ ఓ సూర్యభగవానుడా నాపనికి నేనుముందుగానే వచ్చినా స్వామీ నాపనిలో ఏలోపమూ లేకుండా సోమరితనం లేకుండా చేస్తానని నమస్కరించి లోపల వెళ్లుతాను స్కూల్లో ఉన్నంతకాలమూ కాలము వృధాచేయక చక్కగా మావారుగా పిల్లలకు బోధించి పదహైదు నిమిషాలు ఆలశ్యంగా వస్తూ సూర్యుని చూచి చక్కగా నాకార్యంనేను చేసినాస్వామీ నీవు కర్మసాక్షివి నీకు తెలియనిది ఒక్కటీలేదు మంచిలో చేరుస్తావో చెడ్డలో చేరుస్తావో తమదయ నాడూటీనినేను చక్కగాచేసి వెళ్లుతున్నానని ఒకదండంవేసి వస్తుంటా మళ్లీజన్మకు అటురాజ్యాంగానికి ఇటు ప్రజలకుగానీ బాకీ పడను మళ్లీతిరిగి వచ్చేటప్పటికి చూడూ మనప్రతాపం సూర్యభగవానుడు వృధాచేస్తాడా అబ్బా ఆయన ఉన్నతపదవే ఇస్తాడు వేలువేలుగా వేనకు వేలుగా జీతాలూ తెస్తాను నీచేతికిస్తాను ఎంచలేకా ఎగబెట్టలేకా జమా ఖర్చులడిగితే చెప్పలేకా నాకీగుమాస్తాపని ఒద్దురా రామా అని ఏడ్వాల సక్రమముగా జమా ఖర్చులు చెప్పక పోతివా వీపులు మేపులడుగుతాయి చూడూ నాదెబ్బ అన్నాడు రాము.

అయ్యో రామా అంతమాత్రము తెలియదనుకున్నారా త్రిమూర్తులకు త్రిదేవులు ప్రధమ కింకరీలు త్రిమూర్తులు తెచ్చినదంతా త్రిదేవుల చేతికిచ్చి అధికార

మిచ్చే త్రిదేవులు త్రిమూర్తులకన్నా ముందుకొచ్చి లోకంలో మెరుపువలె వెలిగేది అసలు త్రిమూర్తుల తలంపేలేదు. కింకరీలతోనే ప్రొద్దుపోతున్నారు. లోకులు అయ్యగారి ఆర్జనతో అమ్మయ్యగారే ముందు వెలిగేది. ఆలు పిల్లల సాకేదానికే చదువులూ, సంధ్యలూ, వృత్తులూ, ఉద్యోగాలూ సంపాదించలేని అయ్యగారిని చచ్చిన వారిలో లోకంలో జమ కట్టుతుంది. ఆలు పిల్లలు నిర్జీవప్రతిమగా తలంచుతారు. అయ్యగారు జీతాలు ఇంటికితేక క్లబ్బులకు వెళ్లితిరా ఇంటిలో మబ్బా వీధిలో గబ్బు తప్పక అమ్మయ్యగారికి దయ్యము పట్టితీరుతుంది భద్రంసుమా అని సరోజ చిరునవ్వు నవ్వినది.

రాము ఆశ్చర్యముగా చూస్తూ అబ్బా దయ్యాన్నిమాత్రము పట్టించుకోకే గుండె ఆగిపోతుందినాకు దయ్యముపట్టిన పెండ్లాని బాధకన్నా దండధరుని బాధే మేలన్నారు. మొగనిబంధువులు ఇంటికి వచ్చిననాడు తప్పక పట్టుతుందట పనులు పూర్తి ఉన్ననాడు పలుకుతుందన్నారు. పండుగా పర్వాలనాడు ఆడబిడ్డలు ఇంటికి వచ్చిననాడూ శుభకార్యములు ఇంటజరిగిననాడూ శుభకార్యములకు పోయిననాడూ తిరునాళ్లకు తీర్థయాత్రలకు పోయినాడు మొగుడు తనమాటకు రానినాడు అత్తా మామా అదుపులోకి రానినాడు తనకోర్కెలు పలించనినాడూ కోరిన సొత్తులూ, కోరిన గుడ్డలుతేక నిరాకరించిననాడూ అయిదు నిమిషాల్లో వచ్చిగర్జిస్తుందన్నారు. సాధించి వేధించి బాధించి ముప్పుతిప్పలు పెట్టి మూడుచెరువుల నీళ్లుతాగిపుతుందన్నారు. వద్దే పట్టనీవద్దు నయనానందము కర్ణానందం స్పర్శానందం, వస్త్రానందం. భూషణానందం, ఆహార విహార వ్యవహారానందం నిద్రానందం గలిగిస్తా గిలిగింతలతో కాలము నడిపిస్తానన్నాడు రాము.

నలుగోడలమధ్యా విడచి నానారీతుల కష్టాలనుగల్పించి క్లబ్బులూ, మబ్బులూ మరగితిరా వస్తుంది దయ్యం లేదా రాముడో భీముడో సోముడో కాముడో తప్పక పడ్తాడు ఆటుపై గండిఆంజనేయుని దేవాలయానికి ప్రయాణంకట్టిస్తా సంసారం నానా ఘటీము పడిస్తా భద్రంఅన్నది సరోజ.

ఆ మాటలకు నల్వురూ నవ్వినారు అందులో అనసూయమ్మ జ్ఞానాంబను చూచి వదినా ఆయన అన్నదినిజమే ననిపిస్తుంది మాఊళ్లో మాయింటి ప్రక్కన ఒకాయనకు తొంభైఅరు సంవత్సరాలు వయసున్నది. ఆయన ఉన్నతోద్యోగంలో పింఛనుకు వచ్చినాడు నెలకు వేయిరూపాయలు వంతున డబ్బు వచ్చేది. మీ యన్నయ్య ఆయన్ను చూచి ఏమయ్యా రాజ్యాంగములో బాకీ ఇంకా తీరలేదా ఇంతింతజీత

గాళ్లు ఇన్నాళ్లు బ్రతికితే ఎట్లు సంవత్సరానికి పండెండువేలు పృథ్వాగ్గా డబ్బుయివ్వ వలెనంటే ఎంతకష్టం ఇంకా తీరలేదా నీబాకీ అనేవారు బ్యాంకిలో ఉద్యోగులు అందరూ ఇట్లే అనేవారట అయన నవ్వుతూ ఇంకా బాకీ ఉందయ్యా అప్పుడే ఎక్కడ తీరిందీ ఇప్పటికీ మరువకుండా డూటీ చేస్తున్నానన్నెనట్లు మరుస్తాడు కర్మసాక్షి అని నవ్వేవారు ఆ మాటలకు మావారు నవ్వుతూ ఏమి డూటీ అయ్యా నీవుచేసేది నెలనెలకూపోయి తెచ్చుకోవడమూ రుణపడతావు అంటే అయన తలఊపుతూ ఎగాదిగాచూస్తూ ఏమయ్యా డూటీ చేయలేదంటావా అయిదు గంటలకులేచి స్నానంచేసి సూర్యభగవానుని అర్చించనిదినం ధ్యానముచేయని దినం లేదయ్యా నావయసు ఏడుసంవత్సరముల నాటినుండీ ఇంతవరకూ ఈ వృద్ధాప్య ములోకూడా మరువక సేవిస్తూ, ధ్యానిస్తూ, శక్తికొలదీ నైవేద్యములిస్తూ ఉన్నాను ఉద్యోగము చేసినన్నాళ్లూ లంచాలుతీయక పనికి సోమరిగాకా నామంచినీ చెడ్డనూ ఆ భగవానునికే చెప్పుకొంటూ ప్రజోపయోగములేచేస్తూ ప్రజల కన్నపిల్లలలాగా చూచినాను ముందు చేసినా ఈజన్మలో ఇంతవరకూచేసినా ఇంకాచేస్తా కర్మసాక్షి సూర్యభగవానుడుకనే ఇస్తున్నాడు ఇంకా బాకీఉంది. ఇప్పిస్తూ ఉన్నాడనేవాడు అందరికీ వింతగా ఉండేడి ఆయననుచూచి వగవని వారేలేరు అయనమాట నిజమే వదినా సూర్యధ్యానములో సారమున్నట్లే నన్నది అనసూయమ్మ.

ఔనువదినా బ్రాహ్మణులూ, రాజులూ, వర్తకులూ, బ్రహ్మణేతరులలో వంశ పరంపరగానో మధ్యలోనో కొందరూ సూర్యభగవానునికి అర్ఘ్యమిడుతూ అర్చిస్తూ ఉండేది కొందరుధనికులు మాఘమాసములో సూర్యభగవానుని ఎన్నో విధముల అర్చిస్తారు. కొందరు ప్రతినెలాఖరులో సూర్యుడు ఒకఇంటినుండీ ఒక ఇంటికి పోవునాడు మేషాయనం వృషభాయనం అంటారు అదినాల్లో తప్పక గోధుమహల్వాచేసి నైవేద్యమిస్తారు త్రిసంధ్యలా ధ్యానించే గాయత్రిలో మిశ్రమ ముగా సూర్యధ్యానముండుట అందుకే త్రిదేవులూ సూర్యుడూ త్రిసంధ్యావందన ములలో నున్నారు త్రిశక్తులు మానవునికి ముఖ్యావశ్యక మయినవి మాతృభాషా మాతృసుఖం మాతృధనం ఇస్తా దేహశక్తి జ్ఞానశక్తి అర్జనశక్తి ఇవ్వగలరు సూర్య భగవానుడు ప్రభుశక్తి రాజ్యభాషనిచ్చి రాజధానిలో రాజుగాచేసి కాపాడగలడు అటుపై మువ్వేళలగానీ రెండువేళలగానీ వకవేళగానీచేయు దేవతార్చన కూరకు తిరుగువాత పెట్టినట్లు అన్నిటనూ మిళితముచేసి సువాసన గల్పించి రుచింప చేసినట్లు ఈజన్మలో సహాయమై ముందుజన్మకు అన్నిటా ప్రోగుచేసి మళ్లీవచ్చే జన్మకు సుఖాలమూటనెత్తి కెత్తగలరు ఇవి మానవులకు ముఖ్యము పీటెను మరచినజీవులే

మందభాగ్యులు ఆయన ముందుజన్మలో సూర్యోపాసకుడు ఈజన్మలో కావలసి నంతా రాజధనం తింటున్నాడు ఈజన్మలో తిరిగీ చేయుచుండుటవల్ల నియమితుడై నిజాయతీగా ఉండుటవల్ల మరుజన్మకు కూడా తినగలడు సుఖపడగలడు నమ్మిన వారికి సొమ్ము నమ్మనివారికి దుమ్ము ఇదితెలిసినదే నన్నది జ్ఞానాంబ.

అయితే సూర్యభగవానునినమ్మి సేవిస్తూ చేసేఉద్యోగం చక్కగాచేస్తూ వారికి నిత్యమూ తప్పొప్పుల చెప్పుకొంటూ ప్రజల పీడించక సహకరిస్తూ లంచా లకు చేజాచక కర్మసాక్షికి సాక్షిగాపెట్టుకొని ఉన్నవాడు మరుజన్మకు గొప్ప ఉద్యోగి అవుతాడంటావా అన్నాడు చిరునవ్వు నవ్వుతూ రాము.

జ్ఞానాంబ భావోద్రేకముతో తెలిసీ అడుగుతాడనే .కోపముతో కొడుకును చూస్తూ ఒరే సమాధానము చెప్పలేనని భావిస్తివా నిత్యమూ మీ నాన్నతో వింటుండేది ఊరసుద్దులుగాదు ఊరసుద్దులుచెప్పే వ్యర్థులుగాదు వినే వ్యర్థురాలినీగాదు ఊర సుద్దులు మాట్లాడి లేనిపాపము సంపాదించుకొని ఊరేగే అప్రయోజకులముగాదు నిత్యమూ చేస్తున్నావే అందులో ఫలశ్రుతి ఎట్లున్నదీ తెలియలేదా సంవత్సరము పాసిత్వా సామ్రాజ్య పదవీంలభేత్ అని ఉండలేదా మీయప్ప చెప్పుతుండగా విన లేదా రాజధనము తిను ప్రతిఉద్యోగీ ముందుజన్మలో అంతో ఇంతో సూర్య నమస్కారము చేసినవాడేను బలముగా చేసినవాడూ నమ్మినవాడూ గొప్ప ఉద్యో గియై సుఖపడుతున్నాడు పోరుకుజాలక ఇన్నో అన్నో నీళ్లుఅర్ఘ్యమనీ ప్రాతఃకాల వందనమనీ కంటికగపడునపుడు తలవంచి చేతుతు జోడించి నమస్కారం స్వామీ అని. ముఖ ప్రక్షాళనము చేసుకున్నప్పుడు పైకెగజూచి చేతులుజోడించి శిరస్సున ఉంచుకొని రెండుమాటలు చెప్పుకొని వున్నవారే ఇటూ అటూ గాని రాజోద్యోగులై చాలీచాలని జీతముతో బ్రతుకు తుండేది ధ్యానశ్లోకములూ అష్టోత్తరాలూ కొంత వరకూచెప్పి నమస్కరించి అర్ఘ్య ప్రదానమని ఉత్తనీళ్లు దుత్తలకొద్దీ దోసిళ్లకొద్దీ విడచినవాళ్లు మధ్యమ తరగతికి చెందినవాళ్లనీ పీటవేసి పాలూ పంచదారా పూలూ గంధమూ దీపమూపెట్టి ఊదువత్తులు వెలిగించి ధ్యానించి నైవేద్యమిచ్చినవారే రాజ్యాలు ఏలుతూ తూగుటుయ్యేలలో తూగుతూ ఇరువాగుల పదునుగలిగిన కత్తి వలె ఇహపరములకు సంపాదిస్తూ చూచువారు యువ్విళ్లూర పరమానందముతో కులుకుతుండేది అంటూ చెప్పగా వినలేదా ఆచార్యులవారు చెప్పుతుంటారే సూర్య చంద్రగ్రహబలములేక రాజకీయ రంగములో ఏమానవుడూ చోరలేడనే వారిని సేవించనివారికి రాజ్యోద్యోగులతో కష్టమూ నష్టమూ గలుగు తుండునని ప్రతి

మానవుడూ ఇరువురా సేవించే తీరవలయుననీ చెప్పుతుండగా విని నిత్యమూ చేస్తూ మళ్లీ అడుగుతావెందుకురా అన్నది జ్ఞానాంబ.

తను కారకుడు సూర్యుడూ మనఃకారకుడు చంద్రుడూ తనబలం మనోబలం మానవునికి ముఖ్యమ ఖనవీ మిగతాగ్రహములు వీరిననుసరించే ఉండవలెననీ వీరే ప్రతిజీవికీ మాతృ పితృకారకులనీ వీరిఅనుగ్రహమే పొందవలెననీ మతయీర్ష్యతో హిందువుల సూర్యునీ ముసల్‌మానులు చంద్రునీ సేవిస్తూ హిందువులు చంద్రునీ ముసల్‌మానులు సూర్యునీ దూషిస్తారుగానీ ఇరువురూ మానవులకు అవశ్యకమేనని మాయప్ప చెప్పుతుండగా విన్నాను ఆచరణలో ఉంచుకున్నాను అయినా నీవే మంటావోయని అడిగినాను విన్నది జ్ఞాపకముంచుకొని చెప్పగలశక్తి బాగున్నదమ్మా నీకు అయితే భూజీవనమే మానవునికి శ్రేష్ఠమంటావా అన్నాడు రాము.

అయితే గియితేలేమ తెలిసినడిస్తే భూజీవనమునకన్నా మిన్నయైనది వేరొండు గానము ప్రతివాడూ తన సంసారమునకు తానుచేసుకొనుట శ్రేయము గౌరవము భూజీవనములో మోసములేదు. దగాలేమ దైవమునునమ్మి పైరుపెట్టడమూ వడుపుకోవడమూ మధ్యలో ఏవయినా పైరుకుతెగుళ్లు రావడం వర్షము తక్కువగావడం మొదలగు విపత్తులను దైవముతో చెప్పుకొంటూ పైరును చూచుకొంటూ వేనోళ్ల దైవమును స్తోత్రముచేస్తూ కాలము గడుపుతాడు నడుపుతాడు రైతు వ్యాపారి అట్లకాదు పమగురు అంచుకు రాకపోయిరే సరుకు అమ్ముడు పోకపోయెనే మోసపోవువారు దొరుకక పోయిరే మోసపు మంత్రతంత్రములు పారకపోయెనే అని చింతిస్తాడు ఇక ఉద్యోగి అన్ననో సెలవులు ఎప్పుడొస్తాయి ఆదివారము ఎప్పుడొస్తుంది. పై ఆఫీసరు ఏమీ తెలియనివాడొస్తే బాగుంటుంది పనిలేకుండా జీతమిచ్చేది ఎట్లా లంచాలు ఏమీ రాకపోయెనే ఎవరినేమిచేస్తే వస్తుంది ఎవరిని అంచుకు తీసుకొనవలె ఎవరిని ఎట్ల బాధించవలె ఎవరిపనులు బిగిస్తే డబ్బురాలుతుంది ఎవరికి ఎట్టి ఉసుర్లు ఒడ్డవలెను ఏ విధంగా మనిషిని బంధించవలె ఏఏ చట్టాలక్రింద ప్రజల బాధించవలె ఉన్నవిలేనట్లూ లేనివి ఉన్నట్లూవ్రాసి ఎట్ల రాజధనం ప్రజాధనం తినవలె రాష్ట్రవస్తు సామగ్రినెట్లు దొంగలించవలె దొంగలించినవి దాచుకతినే విధమెట్లు దురాభ్యాసాలకూ, దుర్వ్యయాలకూ రాజకీయమిచ్చే ధనంచాలదే ఈ లోటు తీర్చుకొను విధమెట్లనని నిరంతరమూ ఆలోచిసూ నూమూళ్లనీ మావాళ్లకనీ చందాలనీ, చేబదుళ్లనీ అర్జంటు కార్యమనీ ఇరుకు సమయాలో డబ్బుతీసుకొని ముఖము త్రిప్పుకునేదెట్లనని ప్రభువులా ప్రజాలా వేచుకతింటూవుండే రాజకీయోద్యోగులు వీరిమాట చెప్పనక్కరలేదు. ఇక కూలీలూ వృత్తినారూ ఉండనే వున్నారు.

మరుజన్మకు మానవుడై మహత్తరమయిన సుఖము లనుభవించవలెనంటే మనసు నుకట్టి దురాదాయాలకు లోపడక దేహాన్ని సోమరితనంలో దించక పాప పుణ్యా విచక్షణగలిగి ప్రభు కార్యములో ప్రజాకార్యములో లోకువచేయక తనదర్మమేదో తాను తెలుసుకొని నడచినవానిదే లోకము లోకసుఖమూ అన్నది జ్ఞానాంబ.

అబ్బా ఈమాటలన్నీ ఎక్కడ విన్నావమ్మా వింటివనుకో జ్ఞాపకముంచు కోవలెనంటే సామాన్యమా అన్నాడు రాము.

మీయప్ప చెప్పుతుండగా .విన్నాను చేసేవారి నడతలన్నీ కన్నాను ఈనడ తలు విడచి నడవడిక మంచిది ఆచరణలో ఉంచుకున్నవారే మానవులు నాయనా నీవుమాత్రము పొరబడి తలిదండ్రులనూ ఆలు పిల్లలనూ పాపలోకానికి నీవుపోవు నదిగాక వారినీ అతిథులుగా పంపవద్దు మాకొరకైనా మానంలేని పనులు మానుకో నాయనా అట్లు పీడించిన పాపభూయిష్ఠుల చాటుచాటున చాటుతూ పల్లెతిట్లతో ఆశీర్వ దిస్తూ యమదండనలో సాక్ష్యానికి వస్తారు తండ్రీ అన్నది జ్ఞానాంబ

అమ్మో అట్లు ముందుజన్మలో నియమబద్ధులైనవారే నంటావా .గొప్ప గొప్ప వారు అన్నాడు రాము.

ఔను నాయనా నీతికి నిజాయతికి నిలచి మాతృ పితృ వయోవృద్ధ గురుదేవ బ్రాహ్మణ ఆశీస్సులపొంది ధర్మబద్ధుడై ముందుజన్మలో ఉండే మహనీయులుగా మహారాజులుగా మానవులలో మానవులుగా పుణ్యపురుషులుగా జననమొంది ఉండేది మహత్తర సౌఖ్యములతో తులతూగుతూ ఉండేది కనబడలేదా అన్నది జ్ఞానాంబ.

మాటలలో మైమరచి కాలమే తెలియకపోతూ ఉండగా గంట మూడుకొట్టి నది అబ్బా అప్పుడే మూడు గంటలా అన్నారు అందరు.

సరోజ అత్తనుచూచి కాఫీవేస్తానత్తా అంటూ లేచినది.

ఓసి నీకాఫీమీద బండబడా ఏమికాఫీనే పంచభక్ష్య పరమాన్నములు తిన్నా పైగా ఈమసినీళ్లు లేకుంటే మనసే కుదురదనే మనుష్యులున్నారమ్మా ఇది కొంపలు తీస్తూఉన్నది భోగులకు రోగులకు జోగులకు విరాగులకు కడకు బైరాగులకూ కాఫీనే అన్నములకే కష్టమగు దరిద్రులకూ కాఫీనే ఇదిదారిద్ర్య. దేవత ముందుకాలంలో మారియై ఊరఊరా ప్రవేశించి ప్రాణాలు తీస్తూ ఉండినది ఇదిబీదాసాదా అనకుండా ఇంటింటదూరి ధనమంతా ఊడుస్తూఉన్నది అది ప్రాణాలకుమారి ఇదిధనానికి మారి అదిలేనిచోటు గలదుగాని ఇదిలేనిచోటులేదు దినాల్లోకాఫీ తద్దినాల్లోకాఫీ పెండ్లిండ్లలో

కాఫీ పేరంటాల్లో కాఫీ చావుల్లో కాఫీ సందళ్లలో కాఫీ విలాసాలకూ కాఫీ కులాసాలకు కాఫీ అష్టభోగులకూ కాఫీ అష్టదరిద్రులకూ కాఫీ నీకాఫీ కాలిపోను. వేగి లేచినది మొదలుకొని పండుకొను పర్యంతం బంధువువచ్చినా మిత్రుడొచ్చినా ప్రత్యక్షము కావలసినదే నాకువద్దనే బుద్ధిమంతుడేలేడు తెస్తూఉంటే పోస్తూఉండేదే మనపూర్వులు వేగిలేచినతోడనే దినకృత్యములు తీర్చుకొని దేవుడూ దైవమూ అనుకొని చద్దిఅన్నము పేలపిండి మొదలుకొని ఫలాహారాల పర్యంతం ఏదో ఒకటి తీసుకొని ఎవరి పనిమీదవారు పోవువారు లేదా జనాభా ననుసరించి వుదయమే కొంతఅన్నముచేసి ఉప్పో ఊరగాయోనెయ్యో మజ్జిగనెయ్యో రాత్రిపాచకాలో సహాయము చేసుకొని ఉపహారముగా నీళ్లకడ్డముగా కొంచెముతీసుకొనిపోవువారు వారికి బలము దుర్బలముగాక వీర్యము నిర్వీర్యముగాకా వుష్ణమూ పైత్యము వుద్రిక్తముగాక నీరసాలూ నిసత్తువలూ లేక కాయము పుక్కు కాయమై వున్నంతకాలము ఏరోగము లకు లొంగక వుండినారు చద్దీచల్లా పురుషునికి అంగరక్ష మేహవ్యాధుల పాలిటికి బ్రహ్మాస్త్రము పైత్యవ్యాధులకు పాశుపతము వుష్ణవ్యాధులకు నారాయణాస్త్రము చద్దీ చల్లా మరచి కాఫీనేకుడిచి ఆలూ పిల్లలపిడచి టీ. బీ. అస్థిమూలకు శ్రమనివారణకు పోతూవుండేది చద్దీచల్లా రోగాల తెస్తాదనే వారేగాని కాఫి రోగాలతెస్తాది నిర్వీర్యుల చేసి పుట్టిన వాళ్లనుకూడా చెరచి కడకు వంశాన్నే మేహవ్యాధుల్లో ముంచుతుందనే వాళ్లులేరమ్మా రోగులకుకూడా కాఫి మంచిదనే వైద్యులు అనుభవజ్ఞులూ వున్నారమ్మా ఇదీ ఒకకాలము అన్నది జ్ఞానాంబ.

ఆ మాటలు విని అనసూయమ్మ ఔనువదినా గౌరవానికనీ ఘనతకనీ ఈ కాఫీ కొంపల్ల కూల్చుతున్నది. నేను మా పిల్లలకు ఏనాడూ చేసిఇచ్చుటలేదు రాత్రి మిగిలిన అన్నములో తోడంటు వేసినపాలు కలిపి భద్రపరచివుంచి తెల్లవారి పిల్లలు దినకృత్యములు తీర్చుకొని స్నానముచేసి దేవుడు దైవము అనుకొనులోపల తిరుగు బోత దండిగావేసి ఆ అన్నము అందులోవేసి త్రిప్పి ఎవరెవరికి ఎంత పెట్టవలయునో అంతపెట్టి నిమ్మకాయ ఊరగాయ వేసేదాన్ని మజ్జిగ చిక్కనిది కావలసినంతా ఇచ్చేదాన్ని మీ అన్నగారుకూడా దాన్నే తీసుకొనువారు పైగా ఫలాహారమువున్నా లేకున్నా సవరించుకునేవారు కాఫీ దేవతను మాత్రము ఘనతకూ, గౌరవానికి ఎవరైనా నిత్యసేవకులువస్తే వేసి యిచ్చేదాన్ని ఇప్పటికీ కాఫీవేస్తే అది అట్లుండవలసినదే ప్రీతిగా త్రాగేవారులేరు. మా యింటి ప్రక్కన ఒక కుటుంబమున్నది సాయంత్రములోపల పిల్లలక్కు తల్లులకు నాలుగుతూర్లుకావలె దానితో వారిఆర్జనా ముంచు

న్నఆస్తీ పాస్తులు వ్యయమయి తిననుకూడా కట్టబట్టా హీనమైనది అయినా యిప్ప టికీ విడువలేదు. చెక్కెరకూ కాఫీపొడికి అంగడిలోబాకీ పాలవారికి బాకీ తీరేది లేదు బాకీవారు అడుగుట మానేదిలేదు. ఏమమ్మా యిది అని నేనంటేఅభ్యాసమైన దమ్మా అంటారు. యిదీ సప్త వ్యసనాలలో ఒక వ్యసనమనవచ్చు దీనితో అష్టవ్య సనాలు అయినవి. మాపిల్లలు చద్దీ చల్లాతోనే పెరిగినారు. దృఢకాయులై ఏ రోగ ములకూ లొంగక వృద్ధికి వచ్చినారు యిప్పటికీ పెరుగన్నము ఒక్కనాడు లేకుంటే అయినట్లే అడవారికి మంగళహారతులు అన్నది అనసూయమ్మ.

ఔనమ్మా చలిప్రదేశములో ఉడుకును లోపల పంపవలెగాని ఉష్ణ ప్రదేశ ములో వుడుకును లోనపంపుట వుష్ణ పైత్య ఆహారముల పంపుట శ్రేయముగాదు. అది తెలియక ఒకటి ధనికులు గౌరవస్తులు, విద్యాధికులు. వైద్యులు సేవించుట తోటి రోగులకు యిచ్చుటతోటి గౌరవము దీనికిగల్గి సర్వులు సేవించు చున్నారు. దీనికన్నా విషము వేరొండులేదు ఈ కాఫి వున్నవాళ్లు చిక్కనిపాలలో కొంచెము చెక్కెర చిక్కని కషాయము (డికాషన్) కొంచెమువేసి కలిపిన చిక్కగానుండును. దానిని త్రాగుతారు ఇదికొంచెము నయము బీదలన్ననో పదిగ్లానుల నీళ్లలో ఒకసేరు బెల్లము నలియగొట్టివేసి కాగనిచ్చి రెండు చమ్చాలు పొడివేసి వడియగట్టి ఒకగ్లాసు పాలుపోసి బంటుకు రెండుగ్లాసులు త్రాగువారు వున్నారు పలురకముల మనుష్యు లున్నట్లు పలువిధములగు కాఫీలు వున్నవి.

అమాటలు వింటూవున్నరాము అమ్మనుచూచి లేచి నావిన్నపము కొంచెమా లించండీ అని చొక్కాసవరించుకొని కొంచెమటుదగ్గి గొంతు సవరించుకొని వకటి రెండు గుటికలు మ్రింగి ఇటూ అటూ ఊగుతూ అమ్మా కాఫీఅంటే అంత అప్రయో జకమైనదని భావిస్తావా యువకులూ యువతులూ ఈమాటలువింటే వట్టిచెత్త మాట లంటారు అబ్బా ఆ కాఫి దేవతా మందిరములో ప్రవేశించి స్పెషల్ కాఫి ఒకటి త్రాగి అయ్యగారికి పావలా సమర్పించుకొని బైటికివచ్చి కిల్లీకిఅర్ధణా శిగరేటుకు అర్ధణా అర్పించి కిల్లీనములుతూ శిగరేటు ముట్టించి పీల్చుతూ పొగపైకెగరూదుతూ చక్కగా నీల్గిపదములటు వేస్తూ పోతూవుంటే అధిదేవతా ప్రత్యధిదేవతా తానే అయినట్లు తోస్తుంది తానొక పైల్‌మాన్ అయినట్లు దేహము వుబికి వుబ్బితలూగి స్తుంది ధనికులలో చేరినట్లూ పై వుద్యోగులలో వున్నట్లూ వుత్సాహదేవత తానే అయినట్లూ మనోల్లాసము గలిస్తుంది ఊర్ధ్వ లోకంలో నడిచినట్లు వుంటుంది

ఉజ్జ్వలదీప్తిని గలిగిస్తుంది శక్తిని భక్తిని మరపిస్తుంది. పొగలోసెగలో ఉన్నశక్తి ఈ ద్విశక్తులకేమెరుక పై త్రిశక్తులకేమెరుక ఈభక్తులకే ఎరుక అన్నాడు రాము.

నవ్వుతూ జ్ఞానాంబ ఓరిశుంఠా ఏమి చదివినావురా శిగరేటు ఏమైనా మరిగి నావా ఏమి ఔనా సరోజా అన్నది.

లేమతల్లీ నీకోడలు ఇల్లూ వళ్లూ మరపుకుంది పీడినే మరపించింది మర్యాయ దేవతలపొత్తు విడిపించింది మడుకులనన్నీ తుడిచేసింది డబ్బంతా మిగిలించింది తల్లీ మణిప్రభావముతో బాల్యమంతా బాగుపడి తోటిసోదరులలో ఏలాటి చిక్కులు లేకుండా బయటపడినాను మైనరు తీరీతీరని కాలంలో జ్ఞానము వచ్చీరాని రోజుల్లో యౌవనము వచ్చీరానిదినాల్లో ఛీ ఛా అనిపించుకోకుండా పరాభవపడి పరారు గాకుండా మణిప్రభావముచాలు తు చ తప్పకుండా నడిచి పెద్దల్లో చిన్నల్లో సైఅని పించుకున్నాను ఈమైనరు తీరినకాలంలో జ్ఞానము వచ్చినరోజుల్లో యౌవనమొచ్చిన దినముల్లో తరుణీమణి వెలుగుల్లో తప్పుడుకాలు పడకుండా తల్లీనడుస్తున్నా భయము లేదు భయములేదు అన్నాడు రాము.

అమ్మా అత్తా నవ్వుతుండగా సరోజ నవ్వుతూ కాఫీ తెచ్చి ముప్వురికీ యిచ్చినది.

రాము అందుకుంటూ అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత మభిముఖీకరోమి అంటూ తీసుకున్నాడు.

జ్ఞానాంబ అనసూయమ్మ నవ్వుతూ ఇంత ఎంపుకమ్మా అని అర్ధమర్ధము ఒకగ్లాసులోపోసి తాగిగులోపల మధ్యాహ్నము వచ్చి ఉండిన ముప్వురిలో ఒకామె వచ్చినది కూర్చొమ్మని ఆ మిగిలించిన కాఫీ ఆమెకివ్వగా తాగివచ్చినానమ్మా అన్నది ఆమె.

తాగిగమ్మా ద్రవపదార్థము ఎంతపోసినా వద్దనదు అనిచెప్పగా ఆమెత్రాగినది

ఏమమ్మా వచ్చినారే అన్నది జ్ఞానాంబ.

ఔనత్తా రేపుమీరు ఉంటారో ఊరికి పోతారో పెద్దవారికి ఈనాడే నాజీవిత గాథ చెప్పుకొని తగుసమాధానము తీలుకుందామని మళ్లీవచ్చినాను అన్నది.

నీపేరు ఏమమ్మా అన్నది అనసూయమ్మ.

జ్ఞానజ్యోతి అని పేరుపెట్టినారు అంతపిలువలేక జ్యోతి అంటారు.

మీ ఇలువేల్పు దేవుడు ఎవరమ్మా అన్నది జ్ఞానాంబ.

మా ఇలువేల్పు వెంకటేశ్వరుడు అయితే మావారు కోదండ రాముల బుద్ధి పుట్టినప్పుడు అనుకుంటూ ఉంటారు వారికి దేవుడూలేదు దయ్యమూలేదు నావిధీ అట్లనే ఉన్నది నేనుమాత్రము ఒక తులసిచెట్టును వేసినాను ప్రతి శుక్రవారము కొంచెము చెట్టుచుట్టూ అలికి ముగ్గుపెట్టి దీపము వెలిగించి ఊదుబత్తీ వెలిగించి ప్రదక్షిణ నమస్కారములో చెస్తాను నిత్యమూ దేవునిదగ్గర దీపము వెలిగించి ఊదుబత్తీ ముట్టించి దండముపెత్తాను ఇంతే నానిత్యవిధి అప్పుడప్పుడూ ఇదికూడా తప్పుతుంటుంది ఇంతకు మినహా ఏమీలేదు పండుగ పర్వదినాల్లోనూ ఇంతే అత్తా అన్నది జ్యోతి.

తల్లి సంస్కారములేని జీవులందరికీ ఇదేగతి అట్లచేయవద్దుజ్యోతీ దీపములు ఒకటిపట్టు రెండు ముట్టించిననూ సువాసనా ద్రవ్యములు ఇల్లంతా ఘుమ ఘుమలూ ఘుమ ఘుమలూ నిండునట్లు పెట్టిననూ సేరుపట్టు అరుసేర్ల పూలు దండలుకుట్టి వేసిననూ ఫలములేదు ఏమీ చేతగాకపోయిన గచ్చకాయంత బెల్లమైనాపెట్టి నమస్కరించి అది నలుగురి చేతుల్లోవేసి తాను దైవభుక్తశేషమని భావించి ప్రీతిగా కన్నుల కద్దుకొని సేవించిన పుణ్యము దీపాలతో సువాసనలతో పూలతో ధ్యానాలతో ప్రదక్షిణ నమస్కారాలతో నక్కవినయాలతో వక్కప్రొద్దులతో వ్రతాలతో ఉండదు ఆహారములేనిపూజ దైవార్పితముకాదు అధర్మమై దయ్యాల అర్పితమౌతుంది ఆహారముంచక దీపముంచిన దేవుని గూళ్లలోన పాడుపడిన దేవాలయాలలో పాడుపడిన గృహాలలో సంజెదీపము పెట్టని ఇండ్లలో శివశక్తి పరిసరాలలో శివాలయప్రహరీ చుట్టుపట్లలో మలమూత్ర విసర్జనచేయు ఇరుకుసందులలో గంగమ్మకు బలియిచ్చు స్థానములలో నిరంతము వ్యభిచరించు స్థానములలో, గృహములలో, పాడుబావులు, దిబ్బలు, స్మశానములు, అకస్మాత్ ఆగంతుక మృత్యువువాతబడినచోట్లు పాడుసత్రాలు, పాతబురుజులు, కోటవాకిళ్లు, పాతకోటలు, అగడ్తలు, మఱ్ఱిరాగె, జువ్వి, చింత, జమ్మి, చెట్లలో చోటు చేసుకొని ఉండి ఇట్టి అధర్మస్థానముల కనిపెట్టివచ్చి అయోని సంభూతమైనవి. యోనిసంభూతమైన అంతర్గత పిశాచములు పాతవి కొత్తవీకలసి దైవార్పితము చేయక వండకతినే గృహాల్లో వట్టిదీపాలుపెట్టే గూళ్లల్లోచేరి భజరేభజ అని శివతాండవ మాడుతూ చిందులు త్రొక్కుతూ ఇంటిలోవండిన పదార్థముల సత్తును గ్రహిస్తూ దుస్సత్తువుల ఉంచుతూ ఇంటిలోవారి నావరించి అంతఃకలహములు అమితకోపము అన్యాయ కార్యములు అన్యోన్య అనుకూలధ్వంసములు చేయింతురు

చిత్తశుద్ధి దేహశుద్ధి లేకుండాచేసి స్త్రీలను బుద్ధిలేని పెద్దమ్మలచేతురు కోపగ్రస్తల నేరగ్రస్తల రోగగ్రస్తలచేసి అవలీలగా ఆలుమగల అన్యోన్యము అన్యాయముచేతురు దుర్బుద్ధుల పుట్టించి పండువంటి సంసారాన్ని సంతోషాన్ని రెండు చేతురు కడకు దారిద్ర్యానికి నెలవేర్పరతురు. అన్నం పరబ్రహ్మ స్వరూపం అన్నం మయం విష్ణుం అన్నారు పెద్దలు అన్నములేక దేవుడులేడు అధర్మమై దయ్యములకు నెలవగును ఈ కలికాల మర్యాదల ననుసరించక వేదహిత ధర్మమునే అవలంబించి అందరుపోయే మార్గముననేపో సుఖపడగలవు. ఈ మతగురువువేసే క్రొత్తరస్త్రాల్లో పోతే కొయ్యలో మూడుముళ్ళాల రాళ్లో గ్రుచ్చుకొని రక్తముఖమగును. గమ్యస్థానముచేరలేవు విను ఇలువేల్పును ఇష్టదైవాన్ని మరువరాదు ఇలువేల్పు అనాదిగాను గా వచ్చువారు వారిని మరచిన వంశనాశన హేతువగును. ఇష్టదైవమేలేక ఇలువేల్పునే గొల్చువారు ధన్యులు చపలచిత్తములేని మాన్యులు ఇష్టదైవాన్ని నమ్మి ఇలువేల్పును మరచినవారు మతిహీనులు అన్యదైవము అన్యగ్రామము అన్యమతము అన్యభాష అన్యదేశము అన్యకాంత అన్యధనము అన్యబలము దుర్బలములు స్వదైవము, స్వకాంత, స్వగ్రామము స్వమతము, స్వదేశము, స్వధనము, స్వబలము స్వశక్తి సభక్తి స్వభావ బలీయములు ఇలువేల్పే వేల్పు ఇల్లాలే ఆలు.

ఆ॥ విడిచియింటియాలు వెలయాలుబాగని
వెంటతిరుగువాడు వెఱ్ఱివాడు
పంటచేనువిడచి పరిగేరినట్లయా
విశ్వదాభిరామ వినురవేమ! అన్నారు

అదిఅటుండనీ జ్యోతి ఇలువేల్పు వెంకటేశ్వరుడని చెప్పుచున్నావు వెంకటేశ్వరుడు ఒకదేవున్న పటము పెట్టుకొనక. భూనీళలసుధ్య ఉన్నస్వామి పటముతెచ్చి పెట్టు ఇష్టదైవము మీవారికి రాముడన్నావుగా కోదండము ధరించి సీతా లక్ష్మణులతో నిలుచుకున్నపటము పెట్టుకొనక పట్టాభిరాముడై సీతను తొడపై కూర్చొన పెట్టుకొని ఉన్నపటము పెట్టుకొని ఒకప్రక్కన త్రిదేవుల పటములు ఉంచుకొనుము స్త్రీలకు త్రిదేవులసేవ ముఖ్యము జలాగ్నులతో నిత్యగండమూ గృహయజమానులతో నిత్యపరాభవములు గర్భసమయములలో గర్భధారణలు జరుగకుండుటకు ప్రసవకాలములో విపత్తుల పాలుగాకుండుటకు భర్తవ్యాధిగ్రస్తుడు కోపగ్రస్తుడు నేరగ్రస్తుడుగాక ఆస్తికుడై ఆదరించుటకు మంగళసూత్రము జీవితాంతము ఉండి వృద్ధ పుణ్యాంగన అని పొగడించుటకు త్రిదేవులసేవ త్రిసంధ్యలా ఉండవలసినదే

అదీగాక ఎట్టిదేవుని సేవించిన అట్టిగుణము అట్టికష్ట సుఖములు అట్టిచేష్టలు అట్టిబలము గలుగునన్నారు పెద్దలు కోదండ రాముడు అరణ్యసంచారి అవస్థలకూ అష్టకష్టాలకు పుట్టినిల్లు కోదండరాముని పేరు పెట్టుకున్నా కొంపమునిగినట్లే పట్టాభిరామా సీతా రామా శ్రీరామా జగదభిరామా అనే పేర్లు కొంతనయము అట్ల పట్టాభిరాముని పటముపెట్టు అదిఅటుండనీ ఇక ఆచారవిచారము లేమన రాత్రి సంగమము జరిగి ననూ సుమంగలికి దోషములేదని కొందరు శిరస్నానము చేయరు దోషమేనని కొందరు శిరస్నానము చేయుదురు చేయుట ఉత్తమము శిరస్నానములేక వంటికి మాత్రమేచేయుట మధ్యమము స్నానమే చేయకపోవుట అధమము నీవుమధ్య వర్తివై అయినా చేయుపదార్థములు శుభ్రముగా ఎంగిలిలేక దైవమునకనిచేసి చేసి నవి ఉప్పు వున్నదాలేదా కారమూ పులుసు సరిపోయినదాలేదా అని శబరివిగాక యజ్ఞేశ్వరునికి ముందు సమర్పించి పిదప యథావిధిగా దైవమున కర్పించి భర్తకు ప్రీతిగాపెట్టి ఈముప్వురి భుక్తశేషము నీవు భోంచేయుట ఉదయము తులసిచుట్టూ అలికి ముగ్గుపెట్టి నీళ్లు ప్రత్యేకముచేది మంత్రముతో పోయుచూ ప్రదక్షిణ నమ స్కారములుచేసి కొన్నిదళములుకోసి ఇలువేల్పుకు ఇష్టదైవానికి త్రిదేవులకు పెట్టి నివేదన చేయవలయును తులసినివేసి ధూపదీప నైవేద్యములు చేయక చేసినతోడనే కొన్నిదళములైనాకోసి దేవతార్చన చేయకపోయిన ఫలములేదు తులసి దైవప్రీతి కరమైనది దైవప్రీతికరమొనర్పక వృథాచేసిన ఇరువాగుల ఫలమునకు బదులు ఇరువాగుల పాపము సంభవించును తులసినివేసినంత మాత్రమున ఫలములేదు ఫల ప్రదుని పాదములపైన పడినగాని ఫలింపదు కన్యనుకని పెద్దచేసినంత మాత్ర మున ఫలములేదు అనుభవింప తగునంతటి వానికి ఇచ్చి సద్గుణములతో అది పెంపొందినప్పుడు కన్యాదానఫలము లభించునట్లు తులసినిపెంచి భగవంతునికి ధ్యానశ్లోకములతో మాలలుకట్టిగాని కట్టకగాని అర్చించినప్పుడు ఫలముగలదు అట్లు చేయుము అన్నది జ్ఞానాంబ.

ఆ మంత్రములు చేయువిధి తెలియదే అవిచెప్పి పుణ్యముకట్టుకోండి ఇంకనైనా బుద్ధిగలిగిచేసి దారిద్ర్యాన్ని ఎదిరిస్తూ రాబోవు జన్మనైనా సరిచేసుకుంటానన్నది జ్యోతి.

రాము నవ్వుతూ అయ్యో ఆమంత్రాలూ తంత్రాలూ వీళ్లనడుగవలసిన పనేలేదు మాముసలిది ఉందిగా పనిలేనివేళల్లో వస్తూవుంటు అకడుపుపట్టక బుద్ధిలో ఇమరక ఉబికి వచ్చేటివైతేచాలు అక్కడికే మనబుద్ధికు బరువుగాగలవు అబుద్ధిలో భార్యా సహితుడై బ్రహ్మగూర్చున్నాడు నీతులకు నియమాలకు కొదువలేదు అన్నాడు.

ఆ మాటలకు చిరునవ్వునవ్వుతూ సరోజ అక్కా అప్పుడప్పుడూ మీ అయన్ను మాముసలాయనను కలుసుకొమ్మనుమని చెప్పండి బోధించడములో బృహస్పతి వంటివారు తెల్లవెంట్రుకలు మాత్రములేవు బుద్ధిబృహస్పతి ననుసరించినది దేహము ఇంక ననుసరించ బోతుంది అన్నది.

అమాటలకు జ్యోతి నవ్వుతూ అమ్మా వీరివద్ద ఎంతసేపున్నా పోదామని పించదు హృదయానందముగా ఉంటుంది భార్యాభర్తలంటే వీరికేచెల్లు ఇరువురూ ముందు జన్మలో ఎంతో తపస్సుచేసినారు తల్లీ నాకర్మము కాలిపోను. మావారూ ఉన్నారు భార్యతో మాట్లాడితే పరువు పోతుందంటారు భయము తగ్గుతుందంటారు గౌరవానికీ ఘనతకూలోటు గలుగుతుందంటారు స్త్రీవక ఆటబొమ్మని వర్తిస్తారు స్త్రీ హృదయములేని మొరపరాయని భావిస్తారు ఏమండీ అని నోరెత్తులోపలనే అడదానికి నీకెందుకే అధిక ప్రసంగము అంటారు వింటేగాతల్లీ దేవుడైనా మొరా లిస్తాడుగాని వీరువినునట్లులేదు తల్లీ అన్నది జ్యోతి.

ఔనమ్మా తెలిసి వర్తించేవారూ వుంటారు తెలియక జీవితము నాశనము చేసుకొని కడకు దుఃఖించేవారూ ఉంటారు సాలుకు నీనైనా నడుస్తూ నడిపించుకో దారిద్ర్యాన్ని ఎదిరించు కాఫీదేవత కాళ్లకు తాళ్ళుగట్టి నడివీధికియీడ్చి వేకువనేలేచి గృహకలాపములు చూచుకొని స్త్రీ చేయరాదనక సూర్యనమస్కారము ధ్యానము చేసి పిల్లలకు పేలపిండితో చేయబడినవిగాని రొట్టెగాని లేక చద్ది చల్లాగానిపెట్టి కావలసిన భర్తకు మాత్రము కాఫీ వేసీ ఇచ్చి అగ్గువ పదార్థములు తెచ్చి ఆహార పదార్థములుగా మార్చుకొని వస్త్రములలో కొంతవిలువ తగ్గించుకొని అకూ, వక్క, బీడీ, శిగరేటు మొదలగు దురభ్యాస వస్తువుల జోలికిపోక ప్రతివస్తువును మితముగా వాడుకుంటూ నోటిరుచిని తుత్తరను వశవర్తినిగా చేసుకొని మితములోకి దింపుకొని శక్తిననుసరించి నెలనెలకూ ఏదోకొంతైనా మిగిలించుకొని ముందుకుపో పురుషుని కన్నాముందు స్త్రీకి ఆర్జించవలెనను తలంపు గలిగిననగాని ఊర్జితముగాదు ఒక నూరు రూపాయలు రూపాయి వడ్డీతోగాని రెండునూర్లను అర్ధరూపాయి వడ్డీతోగానీ లేదా మూడునూర్లను సర్కారు వడ్డీతోగాని దాదాపు అరవైఏండ్లు వాడుకొనకుండా పెంచితే యాభైవేలరూపాయలు చూడగలరు అటుపై ఏడువేండ్లు దాటితే లక్షరూపా యల చూడకలరు సంవత్సరాని కొకతూరి వడ్డీని అసలులో కలిపితే యాభైఏండ్లకే లక్షాధికారి కాగలడు ఇదిగొప్ప పనిగాదు జిహ్వోపస్థల కట్టితేనే ధనమూ దైవము

అన్నారు శక్తినెరింగి జిహ్వోవస్థల నడుపకనే ధనదారిద్ర్యమూ దేహ దారిద్ర్యము వచ్చి అగచాట్లు పాలయ్యేది ఖర్చు జమతెలియకనే వళ్లుమాసేది తలమాసేది నీభర్తకు నూరు రూపాయలు జీతము వస్తుందంటూ ఉన్నావు ఇరువురూ మంచివారైన ఏల దారిద్ర్యము వుంటుంది అని జ్ఞానాంబ అనునంతలో అనసూయమ్మ జ్ఞానాంబను చూస్తూ ఔనువదినా మాయింటివెనుక భావివున్నది అక్కడ ఒకవ్యాపారి క్యారియర్ తో భోజనము తెచ్చుకొని మధ్యాహ్నము భోంచేస్తూ వుండగా నేనుచూచినాను అన్నమంత ఉర్లగడ్డ పొడికూర సన్ననిమ్మకాయంత పప్పు వుండెను. ఎందుకీయన అంత పొడికూరను తెచ్చుకున్నాడు అని తలంచి అయినా అడిగి తెలుసుకుందామని ఏమప్పా అన్నమంత రెండంతలు పొడికూర తెచ్చుకున్నావే అదినీకంత రుచిమైనదా అంత ప్రీతిఅయినదా అన్నాను ఆయన నామాటకు నవ్వుతూ రుచికొరకు కాదమ్మా ఈవిషయము లెక్కాచారము తెలియకనే దారిద్ర్యం చాపుకు తెచ్చుకునేది ఇది తెలిసివుంటే శోత్రియాలుపోవు భూమీ బుట్రాపోదు ఇల్లూ వాకిలిపోదు ఇది తెలియక నోటినికట్టక ఉన్నదయిపోయి తినను తిండీ కట్టను బట్టాలేక చావిళ్లలో సత్రాలలో వుండేది తెలిసివర్తిస్తే అందరూ ధనవంతులే నన్నాడు ఆ మాట విని నేఆశ్చర్యపోతూ.

ఏమయ్యా అన్నాను.

ఏమమ్మా రూపాయకు పడిబియ్యము అమ్ముతున్న కాలము ఎట్లో నిడివశాత్తు అణాకు మూడుసేర్లు ఉర్లగడ్డలు అమ్ముతున్నాయి అందువల్ల అన్నానికన్నా అన్న సాదకము ఎక్కించినాను బియ్యము అగ్గువై కూరగాయలు పిరియమైతే అన్నము ఎక్కిస్తాను అగ్గువేదో తెలుసుకోవలెగదా అవిశాకు మనగాను పొన్నగంటి ఆకు కొయిగూర, తోటకూర, రంపముండాకు, చిట్టిఆకు, చెంచలాకు, దేవదారు ఎలుకచెవిఆకు, దుసారాకు మొదలయినవి పొడికూరకు అక్కరకు వచ్చునవి తెచ్చి దండిగా పొడికూరచేస్తాము అన్నము తగ్గుతుంది కూరఎక్కుతుంది కాలము జరుగుతుంది దారిద్ర్యము తొలగుతుంది ధనముమిగులుతుంది. కాలానుగుణ్యముగా మనుష్యుడు మారవలెనమ్మా అందరూ నీలుక్కొని నడుస్తారే నేనూ నడువవలెనంటే గూనివానితో అవుతుందా కొమవయిన తడపరి పోయిమీద ఘుమఘుమలూ ఘుమఘుమలు లేపినా దేవుడు మెచ్చుకుంటాడు మనమూ తెచ్చుకుంటాము ఆ విషయము స్త్రీలు బాగా నేర్చుకోవలెనమ్మా ధనికులు దరిద్రులయ్యేదీ ఈలెక్క తెలి

యకనే నిర్ధనికులు ధనికులుకానిదీ ఈ లెక్క తెలియకనే అన్నాడు. నేను ఆశ్చర్య పడినాను జ్యోతీ మైథున నిద్రాహారములకు మూడెకే పనికివచ్చు మూదేవుళ్లలో చేరక కనువిచ్చి భగవంతుని భక్తితో భర్తను ప్రేమతో బంధించి ఖర్చు జమా తెలుసుకొని సుకాని భగవంతునికి త్రెడ్లను భర్తకూయిచ్చి సంసారనావలో సాలుకు నిల్చి చక్కగా కూర్చో గమ్యస్థానము నావ ఎందుకు చేరదో.

కం॥ జ్ఞానులచే మౌనులచే
దానులచే యోగసంవి ధానులచేతన్
బని నిజస్థింపగునే
శ్రీనాథుడు భక్తియుతుల చేతన్ బోలెన్.

అని అన్నారు పెద్దలు భక్తితో భగవంతుని బంధువుగా చేసుకొన వచ్చును. సేవతో ప్రేమతో భర్తను వశవర్తునిగా చేసుకొనవచ్చును. అప్పుడు నీ మాటలు ఇరువురూ వింటారు. ఉండమన్నచోట ఉంటారు నీకు కొదువవుండదు అన్నది అనసూయమ్మ.

జ్ఞానాంబ జోతినిచూచి అది అటుండనీ బాగా జరుపుకుంటూ ఇరవై ముప్పయివేలు డబ్బు వుంటే ఆయనకేమి మహారాజు అంటారు. లక్షఅవుతూనే ఆయనకేమి లక్షాధికారి అంటారు. ధనముపై అధికారమువచ్చిన దన్నమాట అట్టివి నూరు సంపాదించిన కోటీశ్వరుడు అంటారు. అక్కడికి ఈశ్వర శబ్దమువచ్చి పైనపడినది కోటి రూపాయలకే ఈశ్వర శబ్దమువుంటే కోటి నారాయణ శబ్దములకు ఈశ్వరత్వము ఎందుకు వుండదు. ఆ ఎక్కడిమాట అనే దద్దమ్మలేగాని చేసి లేదనువారు లేరు. వారిజాడల్లో కాలుపెట్టక రాత్రింబవల్లయిన కష్టించి సాదించుకో ఇహము పరము సంపాదించుకో మా కోడలినిఅడిగి కావలసినవి తెలుసుకో అన్నది జ్ఞానాంబ.

అంతలో గంట అయిదు ఆయినది అందరూలేచి ఎవరి పనిమీదవారు మనసును విడచినారు.

సరోజ అత్తనూ అమ్మనూ చూచి అన్నిపదార్థాలూ కావలసినన్నీ ఉన్నవి పనివారికి కావలసినంతా ఉండును మనమీనాడు కొంచెము ప్రొద్దుగలుగా భోంచేస్తే మిగులు పదార్థాములు వారికి ఇచ్చేస్తాను అన్నది.

ఆమాటలువిని జ్ఞానాంబ ఉడుకు చల్లారినంత మాత్రముల్లో నిస్సారములు కావులే సారము చెడిపోవుదనుకా ఉండును మనదేశమునకు చలిదేమంచిదిలే పరవాలేదు ఇంకేమీ చేయవద్దు అన్నది.

ఆనాడు ఏడు గంటలకు లోపలనే కార్యకలాపాలు అయిపోయి భోంచేసి పడసాలలో అనసూయమ్మా జ్ఞానాంబ కూర్చున్నారు రాము అటూ ఇటూ తిరుగుతుండెను సరోజ పనివారికి మిగులు పదార్థములువేసి దేహము కొంచెమువేడిగా ఉన్నట్లుఉంటే మెంతులు ఒక తులము మోతాదు చేతికితీసుకొని ఒకగ్లాసు మజ్జిగ చేతబట్టుకొని ధన్వంతరిని ధ్యానించు చుండగా రాముపోయి రెండుచేతులు పట్టుకొని ఏమిటివి అవి అన్నాడు.

ఔషధము అన్నది, నోటఅంటూ ఉన్నదీ అన్నాడు వైద్యులవారి ధ్యానము వైద్యులెవరు, వైద్యులకు వైద్యుడు దేవవైద్యుడు నారాయణాంశజుడు ధన్వంతరి, వారిని ఏమని ధ్యానించినావు యీసారిఅను, ఏలా, విందాము, మీకురాదా, రాకుంటే కడుపువాస్తుంది కొంచెము అనే పెండ్లికూతుర, ఓ శోభనమునాటి పెండ్లికొడుకా విను.

శ్లో॥ సంపూర్ణ చంద్రసదృశం అజానుబాహుద్వితయం
కృష్ణసర్పనిభాలకం కుందకుట్మల జైర్దంతైఃసర్వావయ శోభితం
శాంతం కృపాజలనిధిం అక్రోధం శాస్త్రపారగం
దైవతానాం భిషక్‌శ్రేష్ఠం వ్యాధిజాలవిదారణం
ఔషధజ్ఞం హ్యనిమిషభిషక్‌శాస్త్ర విశారదం
సర్వజ్ఞం జ్ఞానసంపన్నంధ్యాయే ధన్వంతరింసదా॥

అని ఔషధము సేవించునప్పుడు ధన్వంతరిని ధ్యానిస్తారు అట్లుధ్యానించిన ఎట్టి ఔషధమైనా అమృతసమమై మానవుని రక్షిస్తాదన్నారు అందరు పోయేబాటనే పోతున్నాను స్వామీ పోనివ్వండి చేయివిడండి అన్నది సరోజ.

ఊతిరుగబోత గింజలు ఎందుకు తింటున్నావో ఏ గుణమేమో వినిపిస్తే తిననిస్తా చేవిడుస్తా నన్నాడు రాము.

మహారాజా కొంచెము ఏమో వేడిగాదేహము ఉన్నట్లుంటే చలువకు తిరుగనివ్వమని తింటున్నాను ఇవి ఉష్ణశాంతి నిచ్చును విరేచనములు ఒంక విరేచనములు కట్టును శ్వేతప్రదరము రక్తప్రదరము అపును చురుకు నీరుచురుకు తొలగించును బెట్టను వైతొలగించును బలమునిచ్చును ఉష్ణపైత్యమై కడుపు నొప్పిగలిగించి వచ్చు విరేచనముల కట్టును శంకానివర్తికి పోవలెననుకున్నంతలో తొందర పెట్టు

ఉష్ణపైత్య భేదములనాపును పురుషులకు వీర్య పటుత్వమిచ్చును చలువచేయును ఇది జిగట పదార్థముగాబట్టి పురుషులకు శ్లేష్మము నిర్వీర్యులనైనా నిలబెట్టును మీగడ తోటి పెరుగులోకలిపి త్రాగిన ఎంత ఉష్ణమునైనా సవరించును ఉష్ణముతో నీరస ముగా నున్నప్పుడు పురుషులకూ స్త్రీలకు అమృతమువంటిది. అయ్యగారు కాముక చక్రవర్తులై రాజ్యమేలితే ఏలి పులిసితే వెట్టిచేయవచ్చు శూలకలుగవచ్చు పాలచేర్లు బిగియబట్టవచ్చు పైత్యము శైత్యముగమ్మి మూర్ఛగలుగవచ్చు ఉష్ణాధిక్యముతో మూత్రమురాక బిగియ పట్టవచ్చు తలనొప్పి కన్నులనొప్పి గలుగవచ్చు పైత్యాధిక్య ముతో కడుపులో వికారము గలుగవచ్చు అప్పుడు డాక్టర్లకొరకు పరుగెత్తితే అవ మానము అయాసము ధనవ్యయము కలుగుతుంది. భార్య కొంతధన్వంతరియై భర్తకు బాధానివారణ చేయవలసినవిధి ఉన్నది తెలుసుకొమ్మని తెలిపిన గృహ వైద్యం అట్టివేళలో ప్రథమం ఈమందు ఇచ్చి ఆహారం ప్రకృతం వున్నది కడుపు నిండుకూ తిననిచ్చి ఒకగ్లాసునీళ్లు వేడిచేసి అందులో నాలుగు చెమ్చాలు చక్కెర ఒకచమ్చా నెయ్యివేసి కలిపి త్రాపేది అక్కడికి తగ్గకపోయిన పెదవులకు నెయ్యి పూసి కౌపీనముగుడ్డ వెన్నెముక క్రిందిభాగమునకు బాగాతగులునట్లు చల్లనీళ్లతో తడిపి చెక్కి చల్లనీళ్లలతో కాళ్లుకడుగు కొమ్మనిచెప్పేది అక్కడికి తగ్గకపోయిన శిలా జత్తు భస్మముగానీ వెన్న భస్మముగానీ కాసీససింధూరముగానీ నెయ్యిలో కలిపి నాకించి చక్కెరా నెయ్యి నీళ్లను త్రాపేది అక్కడికి తగ్గకపోయిన రాతినార భస్మము నెయ్యిలోఇచ్చి మజ్జిగగానీ పెరుగుగాని నిమ్మరసము చక్కెర నీళ్లలో వేసిన షరబత్‌గానీ ఇవ్వుము అనిచెప్పుతూ కావలసిన ఔషధములు సమకూర్చి కూతురిని పంపినది అవి శయనగృహములో ఉన్నవి ఈప్రకృత చికిత్సలు తెలియక రోగులై అపథ్యులై కడకు డాక్టర్లకు సూర్లాల్లు ఇచ్చుకొనేది అమ్మ పెట్టిన దీపము అఖండలమై అఖండజ్యోతియై అయ్యగారికి ఆపై ప్రాపై నిల్చుకుంటుంది మాతృ వుంచిన జ్యోతి పరంజ్యోతియై ప్రకాశిస్తుంది ప్రభో ఇప్పటికి చాలులే మాటలు మందును తిననివ్వండి అన్నది సరోజ.

అయితే మరి పటుత్వమంటున్నావే నాకర్థ మివ్వరాదా అన్నాడు రాము.

అయ్యో ఇప్పుడు మీకెందుకండీ పటుత్వ మహత్వ సంపదల్ ఎవ్వరికడ చూపపోతారు అని చిరునవ్వునవ్వి కలికిచూపు చూపినది సరోజ.

మరచినా మరచినా కలికిచూపుల్లో చిరునవ్వుల్లో ఇచ్చినమాటనే మరచినా

అంజనేయులకు తమ్ముణ్ణై హనుమంతున కగ్రజుణ్ణై బ్రహ్మచర్యము వహించితా కన్నులు గలిగి కాపాడుతాను వెళ్లుతాను అన్నాడు రాము.

శోభనము నాటి అనాందాన్ని లంకణాల్లో తలంచుకొని చింతించక లెక్కించక మనస్సుకుదురు పరచుకొని చేయివిడండి అని నోటిలో పోసుకొని మజ్జిగ సహాయముతో మ్రింగి ఇరువురూ పడసాలలోకిపోయి కూర్చున్నారు.

జ్ఞానాంబ రామును పరికించి రేపు పోతానప్పా అక్కడనే కార్యము నిశ్చయము చేసుకుందా మన్నది.

ఔనమ్మా ముహూర్తానికి మూడునాళ్లు ముందువస్తాము అక్కడనే కానివ్వండి అన్నాడు రాము.

సరోజ పడక వేసి ఇవ్వగా జ్ఞానాంబ అనసూయ పడుకున్నారు సరోజ అనాడు శయనగృహములో వేరు మంచములో పడుకుంటూ పద్మాసనస్థితయై కాళ్లకట్టు వైపుమళ్లి చేతులు జోడించి కన్నులు మూసుకొని ధ్యానము చేయుచుండగా రాము తనమంచమునుండి లేచిపోయి ఎదురుగా నిల్చుకొని ఉండి సరోజ కన్నులు విప్పిన తోడనే.

ఓ భక్తురాలా అంతర్గతములో ఆత్మారాముని కేమని చెప్పుకుంటివో ఈ రాముడు వినునట్లు మరొకతూరి బహిర్గతము చేయుము భగవంతుడు సర్వజ్ఞుడు అంతర్గతములో అన్నదైనా వినును ఈ నీభర్త కించజ్ఞత్వముగలవాడు బహిర్గతమైనదే వినును భగవంతుడు అనందించినా భర్త అనందించక అనందములేదు ఈ రాముడు కాముడై అనందమివ్వగలడు అత్మారాముడు కామితార్థములిచ్చి అనందింపచేయగలడు మనో వాక్కాయములలో వాక్శ్రీకాయములు నావలన మనస్సు వారి వలన అనందపడును వారికన్నా ఓటువారీగా నేనేమిన్న చారువిన్నారు నేనువిన పనిలేదా నాకుహక్కులేదా ఏదీ కొంచెమట్లను కోవెలస్వరమైతే వింటా దానిశ్రోత్ర స్వరమైతే హరహరయని చెవులు మూసుకుంటానని కాళ్లకట్టపై కూర్చున్నాడు.

అయ్యో అవైపు కూర్చునేనోము నోచలేదండీ అరోజులు దూరమువైనవి ఇటు ఈవైపురండీ తలవైపు చెప్పుతాను వినండీ ఓస్వామీ ఈరాములవారిని అర్చించి నన్నాళ్లు అర్చించినాను నాసర్వస్వము అర్పించినాను నాఅర్చనకూ అర్పితమునకూ అనందపడి వరాలు ఇచ్చినారు ఇక ఈవరాలను మీరుచక్కగా నెరవేర్చండి స్వామీ రైతుకు కపిలగండము స్త్రీకి గర్భగండమన్నారు మీదయవుండనీ మారాములు

ఇచ్చినవరాలు దినదినాభివృద్ధిగా పెరుగుతున్నది ఈవరాన్ని నన్నుసర్వదా కాపాడి వరఫలాన్ని నాచేతుల్లో పడవేయమని ఆత్మారాముని ధ్యానిస్తూ ఉన్నాను వరాలిచ్చిన స్వామికి తమకు తెలియదూ అని నవ్వుతూ సరోజ ఈ వైపు ర ం డీ అని చేయి చూపినది.

కొంచెము అనవే ఏమని తలంచినావో ఈవైపూవద్దు ఆవైపూవద్దు అన్ని వైపులా బంధించినావు అష్టదిగ్బంధన అందరూచేస్తే దశదిగ్బంధన చేసినావు ఓో కానీ అన్నాడు రాము.

ఏమున్నదీ మీరు మాత్రము పండు కొనునప్పుడు దైవాన్ని తలంచుకోరా పగలు చేసినపాపము పోయేటందుకు రాత్రి దుఃస్వప్నములు రాకుండా సుఖనిద్ర వచ్చేటందుకు ఏవో దుశ్చేష్టలు దుర్గుణాలు దురాలోచనలు మనసుకురాక శ్రీఘ్రముగా నిద్రపట్టేటందుకు నిద్రపోవునపుడు వృశ్చికాది విషజంతువులు క్రిమికీటకములు భూతాది బ్రహ్మరక్షస్సులుతో బాధకలుగకుండుటకు చోరులచే గృహోపకరణములు వస్త్రభూషణములు ధనధ్యానములు అపహరణ గలుగకుండుటకు దైవధ్యానము అవశ్యకము కాదా గృహస్థుడు మరుగైనప్పుడు గృహమెంతో జీవుడు మరుగైనప్పుడు దేహమంతే సర్వదా కాపాడుటకు భగవంతుడు సర్వోలకూ అవశ్యకమే అయినా నేసనుదనుకా మీరువినుదనుకా పోరు వినండీ.

శ్లో॥ ఔషధే చింతయేద్విష్ణుం భోజనేచ జనార్దనమ్
శయనే పద్మనాభంచ వివాహేచ ప్రజాపతిమ్
యుద్ధే చక్రధరందేవం ప్రవాసేచ త్రివిక్రమమ్
నారాయణం తనుత్యాగే శ్రీధరం ప్రియసంగమే
దుస్స్వప్నేస్మర గోవిందం సంకటే మధుసూదనమ్
కాననేనారసిహంచ పావకే జలశాయినమ్
జలమధ్యే వరాహంచ పర్వతేరఘునందనమ్
గమనే వామనంచైవ సర్వకాలేషు మాధవమ్
షోడశైతాని నామాని ప్రాతరుత్థాయ యఃపఠేత్
సర్వపాప వినిర్ముక్తో విష్ణులోకే మహీయతే॥

అన్నారు విన్నారూ అమ్మతో నేర్చుకున్నాను నిత్యమూ చెప్పుచూ ఉన్నాను దుస్స్వప్నే స్మరగోవిందం అన్నందుకు స్వప్నములో అందునో అనలేనో జాగ్రద

వస్థలోనే తలంచగలను ఆ యా సమయములకు నీవేదిక్కు అని తలంతును ఏమన

వనమాలీ గదీశార్ఙ్గీ శంఖీ చక్రీచ నందకీ
శ్రీమాన్నారాయణో విష్ణుర్వాసుదేవో భిరక్షతు.

అని ధ్యానించినాను ధ్యానిస్తాను ఇంతకన్నా ఏమీలేదు ప్రభో విన్నారా అన్నది సరోజ.

అట్లకాదే అతివామణీ.

శ్లో॥ రామస్కంధం హనూమంతం వైనతేయం వృకోదరం
శయనేయః స్మరేన్నిత్యం దుఃస్వప్నం తస్యనశ్యతీ!

అని తలంచుచుంటారు నా నామస్మరణచేయి స్వప్నాలురావు అన్నాడు రాము.

తమ నామస్మరణచేసే ఇద్దరికి ముగ్గరము కావచ్చినది తమ నామస్మరణ వృద్ధిచేస్తుంది ప్రభో ఇప్పుడువద్దు పడుకోండి అన్నది సరోజ.

రాము తనమంచముమీదికి పోతూ నిత్యమూనేను వినేటట్లుచెప్పు వినడము తోటి నాకుచెప్పడముతోటి నీకు ఇద్దరికీ సరిపోతుంది అన్నాడు రాము.

రేపునేను తింటూ ఉంటాను మీరు చూస్తూ ఉండండి కడుపు నిండుతుంది అన్నది సరోజ.

ఇది అట్లకాదే చదివే వానికన్నా వినేవానికే ఫలంమెండు కాలక్షేపమునకు పోయి వినేవారు ఏకమనస్సుతో వింటూ ఉంటారు చెప్పేవాడు రాగము తాళము హావమూ భావములోమునిగి భక్తినేమరచి పోతాడు వీనికి చెప్పేదానిలో లోకం ఉంటుంది వచ్చే పద అర్థములో రసములో ప్రేక్షకునికి లోకం ఉంటుంది ఫలం వినువారికే అధికం అన్నాడు రాము.

సరే ఈనాటికి పండుకోండి ప్రభో రేపటినుంచీ అట్లే చెప్పుతాను వింటూ నిద్రింతురు అంటూ సరోజ పండుకున్నది.

మరునాడు అమ్మనూ అత్తనూ బస్సుఎక్కించి మార్కెట్టులో అవిరెండు అవి రెండు నాల్గురకాలు పండ్లు పూలు తీసుకొని ఇంటికి వచ్చువేళకు సరోజ స్నానము చేసి పొడిచీర కట్టుకొని పైటచెరుగు ముందుకుత్రిప్పి చెక్కుతూ పడతల సవరించు కుంటూ ఎదురైనది.

రాము ఎదురుగావచ్చి మంచిసమయం మంచిసమయ మంటూ పైటచెరుగులో

పండ్లూ పూలూ పెట్టి బిఱ్ఱుగా పైటను తానేచెక్కి స్త్రీలకు వడిబాలు కూడా ఒక అందమే నన్నాడు.

సరోజ చిరునవ్వు నవ్వుతూ భర్తచేసే చిలిపితనానికి ఆనందపడుతూ అయ్యో ఈ వడిబాలు అందమెందుకు అసలు వడిబాలే కట్టినారే ఈ అందమేచాలు కన్య శబ్దం మటుమాయ మయింది తల్లిశబ్దం దాపుకువచ్చింది అవ్వశబ్దం వచ్చేదనుక ఇక తల్లిశబ్దంపోదు అంటూ ఎందుకు తెచ్చినారండీ ఇంట్లో ఉన్నవన్నీ చెడిపోతూ ఉన్నాయే ఎవరు తింటారు అన్నది సరోజ.

భార్యగర్భవతిగా నున్నప్పుడు భర్త ఎక్కడపోయినా ఇంటికి వచ్చునప్పుడు పండ్లో పూలోతేక తెమ్మన్నవితేక నిరాకరించిన పాపమన్నారు. కోరికలడిగి వీలున్నంత వరకూ తెచ్చిపెట్టక పోయిన గౌరవాది నరకమన్నారు తేగలశక్తిఉన్న కోరితే కొండమీది కోతినైనా తేవలసినదేనన్నారు ఇంటిలో వంటకములు తానుచేసు కొనుటకు తినుటకు వస్తు సామగ్రి తక్కువలేకుండా పెట్టవలయు. సిగ్గుపడి తాను అడుగక పోయినా భర్తబుజ్జగించి అడిగిఅయినా తెలుసుకొని తెచ్చిపెట్టవలయు భర్త గాని అత్తమామలుగాని ఆడబిడ్డలుగాని తోడికోడండ్రు బావ మరదులుగానీ అనరానీ మాటలవల్ల అవమానపరచి కంటతడిపెట్టించరాదు కంటతడిపెట్టిన ఏడ్పుగంటివాడు అన్నలోపయిన దేహలోపము సుఖమూ సంతోషమూ లోపమయిన జ్ఞానలోపము గలవాడు పుట్టుదురు భక్తుడు భగవతిని పూజించినట్లు విటుడు విటకత్తెను ఆనంద పెట్టినట్లు ఆర్యుడు అమ్మను గౌరవించినట్లు భర్త భార్యను గౌరవించి కోరినకోర్కెల తీర్చుతూ కోపము వచ్చినా దిగమ్రింగి సంతోషాన్ని ఆనందాన్ని వెలిబుచ్చి ఆనంద మనుభవించునట్లు చూడవలయు గర్భసమయముల భార్యచేయు కార్యకలాపాలకు పనిమనిషిని తోడుచేయుటముగాని భర్తసహకరించి తోడ్పడుటముగాని ఉండవలయు ఏమీలేని వాడైనా ఉన్నంతలో తాను తిని తినకనైనా కనికరముతో తెచ్చిఇవ్వ వలయు తింటూ ఉన్నదయినా మిగిలించి చేతిలోవేసి కష్టాన్ని రుణాన్ని తీర్చుకో వలెనన్నారు ఇలువేల్పునూ ఇల్లాలిని మరచితే ఇల్లూ వళ్లూ గుల్ల వంశవృక్షమేకల్లా ఇలువేల్పూ ఇల్లాలు అభిమానంచెడితే అమృతం హాలాహలమయినట్లే నన్నారు మ్రొక్కులతో, ముడుపులతో, మీదులతో, పిండిదీపాలతో, వడపప్పు పానకాలతో, వడలతో, అతిరసాలతో, పాయసాలతో, పులగాలతో, పులిహోరాలతో, సంతో షించి ఎట్టికష్టాలనైనా తానుతీసుకొని సుఖాలనిచ్చి గట్టుచేర్చే ఘనుడు ఇలువేల్పు

కంటికి రెప్పవలె కాపాడుతూ తనవారని ఎక్కువ తక్కువల సవరించుకొని చేయి విడనివాడు ఇలువేల్పు వంశము ఆదినుండీ అంత్యమువరకూ వెంటనంటి చూచు వాడు ఇలువేల్పు పాతదిరోత క్రొత్తదివింతా అని అన్యదైవములగొలచి అన్యమతము నవలంభించినా కోపించక దూషించక నిండుకుండవలెనుండు వాడుఇలువేల్పు అట్టి ఇలువేల్పును మరచి అన్యదైవమును గొల్చువాడు పంటచేను విడచి పరిగేరినట్లే కామాగ్నిజ్వాలలు ప్రజ్వలించి ఊర్ధ్వలోకమంటి చెంతచేరగా అవలీల అరక్షణ ములో చల్లగ చల్లార్చి భయపడకుమని గాఢాలింగనతో గౌరవించును ఇల్లాలు కామప్రవాహము గట్లుతెగ్రెంపుకూ ఉధృతమై మన్నూమిన్నూ ఏకముచేస్తూ పోయినా జలరాసి చిరునవ్వుతో చిట్టిపలలతో ప్రవాహమును చెంతకుచేర్చి తన గర్భములో చోటిచ్చి తనలో ఐక్యము చేసుకున్నట్లు తనలో ఐక్యము చేసుకొని ఆనందమిచ్చి ఆనందపడి ఎందుకింత ఉద్రుతమని ఎదకుహత్తుకొని సేదతీర్చునది ఇల్లాలు కాటుక కొండవంటి కష్టాలు ఎదురైనా సహకరించి ఎదఇచ్చి పోరాడుతూ వెనుకవేసుకొని సుఖాల చూరగొన నిచ్చునది ఇల్లాలు అట్టిఇల్లాలును విడచి ఇల్లాలి మాటలమరచి అన్యకాంతల చూచుట పంటచేను విడచి పరిగేరినట్టే యజమాని యింటికి వచ్చుటచూచి ఆనందపడి ఎదురేగివచ్చి కౌగిలి అందుకోండీ అని అలూ ఎత్తుకొమ్మనిపిల్ల చేతులుసాచుకొని చిట్టిపరుగుతోరా చేసుకొనవలెనే ఇలువేల్పుతిని ఇష్టకామ్యార్థ సిద్ధిరస్తూఅని దీవించాలనే యజమాని వీధికిపోయినా విందుకుపోయినా ఊరికిపోయినా ఉత్సవానికి పోయినా రాగోరవలె ఇల్లాలు ఇలువేల్పు పోగోర కూడదే అదిలక్ష్మి అనునంతలో అయ్యో చెంచులక్ష్మి అనకుండా విడచినారు మీరు మాత్రము నరసింహావతారము ఎత్తకండి ఇద్దరాండ్లపోరు ఇంతింతకాదయా అన వలసివస్తుంది అని నవ్వినది సరోజ.

ఎందుకట్లు నవుతావే వంశాదిగా వచ్చినవాడు. ఇలువేల్పు సృష్ట్యాదిగా వచ్చినది. ఇల్లాలు అన్నారు పెద్దలు పెద్దవారి సుద్దుల విన్నాను విన్నందుకు పూలూ పండ్లూ తెచ్చినాను తెచ్చినదిగాక మనసూర్తిగా వడిలోపెట్టినాను పెట్టినది గాక వలిచి నోటిలోపెట్టుమని కోరితే చిలుకకు బెట్టినట్లు పెట్టుతాను కోరికతీర్చిన వాడే ఏలిక కోరినవరముల ఇచ్చినదే కాళిక ఓయమ్మ నీకు చెప్పినట్లు మాయమ్మ నాకూ చెప్పినదిలేవే భామా.

భామాలేదు సత్యభామాలేదు పాపము చాలాపొగడినారు. అలు ప్రాణానికి ప్రాణాలిచ్చే పుణ్యపురుషులు ఇల్లాలికి పండ్లూ పూలూతెచ్చి వడిబాలుకట్టే ధర్మ

పరాయణులు ఇలువేల్పును ఇల్లాలిని పొగడి పొగడి వడిబడినారు. శ్రమనివారణార్థం ఈ కొంచెము కాఫీ త్రాగండి కంఠశోష, దేహశోష తగ్గుతుంది అని కాఫీ చేతికిఇచ్చి రాము త్రాగుతుండగా.

అమాంతంగా అమాయకత్వాన్ని వెలిబుచ్చితిరే స్త్రీలు ఎట్టివారలున్నారనుకున్నారో భర్త శక్తి సామర్థ్యములు తెలుసుకొనక వేళా పాలలగమనించక కోర్కెల కోరి భర్త తేలేకపోయిన చేయలేకపోయిన అపర సత్యభామలై కాలుజాడించేవారు. మూతి ముడుచుకొని గృహోపకరణములపై, కోళ్లపై, కుక్కలపై, పిల్లలపై కోపము చూపుతూ పాడుసంసారం పాడుకొంప అని భర్తను సుఖాలకు దూరము చేయువారు అన్నంతలో రాము.

పాడు మగడు అనకపోతివే వెనుక మెటికలువిరచి వంగ్లుకొరికేది అనకపోతివే అన్నాడు.

ఆ పీపన్నారుగా అననిది అందుకొనడానికి ద్విభాషా ప్రవీణులు.

మూర్ఛ వచ్చెనండీ నీరసంగా ఉన్నదండీ యని నీల్లదోలి కాళ్లు దుప్పటి గప్పి పండుకొనువారు పిశాచమావరించినదని ఊగుతూ అక్కడుండివచ్చినా ఇక్కడుండివచ్చినా నాకుసొత్తులు కావలె గుడ్డలు పెట్టవలెనంటూ ఇష్టమైనవారి పేర్ల చెప్పి ఇల్లూవాకిలి గాబరాచేసి భర్తను నానాఫజీదు చేసేవారూ రాముడూ భీముడూ వీరభద్రుడూ వీరాంజనీయులు పట్టినాడని మంత్రగాళ్లను తిట్టుతూ చేతనయిన కొట్టుతూ సిగ్గూ బిడియము విడచి వీధివీధులంబడి పరుగులెత్తి కట్టుకున్నవాని మానప్రాణములు తీసి కన్న తల్లిదండ్రుల రచ్చకుతెచ్చి కనికరమూ అభిమానమూలేక కట్టుకున్నవాని కన్నవస్థల పెట్టువారు నెలలపర్యంతము దేవాలయాల ప్రదక్షిణాలు చేయుచూ వింతావిశేషాల కంటూ నోటికిరుచిగా తింటూ ఒంటరిగా ఉంటూ సంసారాన్ని జలగర్భంలో కల్పువారు యింటిగుట్టును వీధికెక్కించి పాపభీతిలేక భర్తకూ అత్తమామలకు అవమానము గల్పించువారు ఉన్నారు కోర్కెలు తీర్చుతానని అంటూ ఉన్నారు తేలేకపోతే యిట్లుంటుంది భద్రమునుమా అన్నది నవ్వుతూ సరోజ.

రాము ఆమాటలనువిని అట్టిఅవినీతులకు వుండనే వున్నదికదా శుక్రనీతి రాతసత్వము సత్యానికి సత్యము అసత్యానికి అసత్యము అతుకు పడుతుందిగాని సత్యానికి అసత్యము ఎట్లఅతుకు పడుతుంది వీడు ముందుజన్మలో ఆలును బాధించిన చిద్దగ

నానంద స్వాములు లేకుంటే తనవస్తువెందుకు తారుమారౌతుంది అదంతాకర్తలోనే ఉందిలేవే అన్నాడు రాము.

సరే విట్లన్నాగాని మీపని చూచుకోపోండి అని వంటపనిలో నిమగ్నురాలై పోయెను సరోజ.

అంతలో మూడు గంటకొట్టెను అబ్బా సాయాహ్నమాయెను కార్యకలాపాలు కావలెనమ్మా అని కరుణ లేచి పూలచెట్లలోకి పోయెను.

శాంతమ్మ వంటగదికి లేచి పోయెను.

కమలా కరుణ కలిసి మల్లెజాజి మొగ్గలు సంపెగపూలు మరువము దవనము కోసుకొనివచ్చి కట్టుచుండిరి.

శాంత రాగమ్మనుచూచి పిన్నమ్మా రా అంటూ కమలా మీఅన్నను పిలుచుకొని రా అన్నది.

ముగ్గురు వంట గదికి పోయినారు.

శాంత ముగ్గురికి మూడు తట్టలలో ఫలాహారము పెట్టినది.

రాగమ్మ తింటూ శాంతా ఏమిటివమ్మా ఇవి అన్నది.

శాంతనవ్వుతూ ఇదిపూర్వపు ఫలాహారము ఇప్పటి ఫలాహారముకాదు అన్నది

ఎప్పటిదన్నాకానీ దేహానికి బలము ఆరోగ్యమూ కారణము రుచిగానూ ఉన్నది అన్నది రాగమ్మ.

ఈలాంటి ఆహారాలు పూర్వులు చేసుకుంటూ వుండినారు మేము వారిలో చేరుకున్నాము ఇప్పటి ఆహారాలు మావారికి అంతగా నచ్చవు అసలు మా అమ్మకు నచ్చవు అంటూ ఒకఉంట తెచ్చిపెట్టినది శాంత.

మళ్లీ ఇదేమిటమ్మా అంటూ కొంచెముతిని బాగావున్నదే అన్నది రాగమ్మ.

అంతలో కొన్ని అప్పళములు తెచ్చివేసినది అవితింటూ వీటెఫలమూ బలమూ చేయువిధమూ ఎట్లనే అన్నది రాగమ్మ.

కరుణ తింటూ రాగమ్మా మనహిందూదేశమునకు వేరుపురుగులవలె కాఫీ గింజలు పొగాకు త్రాగుడు ఏర్పడినవి ఏఇంటచూచిననూ కాఫీ దేవత గజ్జెలపెద్దమ్మ అయి తిష్ఠవేసి కూర్చున్నది. వేగిలేచినది మొదలుకొని సాయంత్రము లోపల అయి దారుతూర్లు పుచ్చుకునేవారు వేగిలేచినతోడనే ఆమెను సేవించక ఏపనీ ముట్టుకోని వారు లేకుండిన తలనొప్పి అనేవారు లేకపోయిన దిక్కుతెలియదనేవారు బుద్ధే పని

చేయదు అనేవారు ఉన్నారు ఈకాఫీ పైత్యము గలిగించి ధాతువుల మర్బలముచేసి వీర్యమును చెరచును. ఆకలిని చంపును రానురాను ఉష్ణపైత్యము దేహమంతటా వ్యాపింపచేసి ఆహారము తగ్గించి దేహమును శుష్కింపచేయును లేదా స్థౌల్యమును పెంచును అరుచిని గలిగించును పైత్యమువల్ల గుండె కష్టమును ఓర్వలేక ఎక్కువ కొట్టుతూ గస ఆయాసము నిచ్చును గసగలుగు సమయముల మైకము వచ్చును పైత్యమువల్ల వెంట్రుకలు తెల్లనగుట కన్నులు చీకట్లువచ్చుట పండ్లు తొందరగా ఊడిపోవుట తిమ్మిర్లువచ్చుట కడకు మేహవ్యాధి గ్రస్తుడగుట అజబ్బు దేహముతో పుట్టినపిల్లలు అట్లనేయగుట సంభవించును వీర్యమును అభివృద్ధిచేయు పదార్థముల భుజించక వీర్యనాశన పదార్థముల వాడుట బుద్ధితక్కువగదా ఇకపొగాకన్ననో బీడీ చుట్ట, శిగరేటు, నశ్యము. అకులోవేసుకొనుట పలువిధములుగా అంటువ్యాధివలె నూటికి తొంబైమందినిబాధించుచున్నది. ఈపొగాకుమరింత మేహవ్యాధినిపుట్టించును రక్తమును తగ్గించి దానిశక్తిని రోతపట్టించును. వీర్యము పతలాయగును. గుండె మర్బలము చేయును ధాతువుల బలము తగ్గించును. సప్తధాతువులకు పైత్యము ఎక్కించి కడకు పుట్టబోవు పిల్లలనుకూడా చెరచును. అకులో వేసుకొను వారికి ఉమ్మి ఎక్కువపోయి అరుచినిచ్చి రక్తము పాలిపోవజేయును. ఆకలినితక్కువ జేయును. మూత్రము ఎక్కువచేయును. నిర్వీర్యునిచేయును. ఇక త్రాగుడువల్ల కలుగు విపద్దశలు ఉండనే ఉన్నవి. కాఫీహోటళ్లు సినిమాలు కొంపల తీయుచున్నవి వీటెవల్ల రాజధానికి ఆదాయము ఉన్నది గాబట్టి వారేమీ తలంచరు వీటెతో లోకులు చెడుచున్నారు. కాఫీగింజలు పొగాకు వీటెంత మరేవీ ఖర్చుఉండవు ఇవి ముఖ్యాంగములై ఉన్నవి మానవులకు మేముమాత్రము వీటెను అంతగావాడము కొన్ని పదార్థముల తయారు చేసుకుంటాము వాటెవల్ల సంతృప్తి పడతాము ఈవుంట వరి పేలాలతో చేయబడినది పేలాలు ద్రాక్ష వేరుసెనగ పప్పులు కొబ్బెర తురుము అల్లము పప్పులు ముంతమామిడిపప్పు యాలకలు ఉన్నవి. ఈవస్తువులు అన్నీ విర్యాభివృద్ధి అయినవి ఇది ఒక ఉంటతిని చక్కగా తిరుగబోతపెట్టిన మజ్జిగ ఒక గ్లాసుత్రాగిన నిర్వీర్యుడైనను వీర్యవంతుడగును. పేలాలు తిన్నట్టులయిన మేహవ్యాధి రాదు మూత్రము ఎక్కువెవగాదు జ్ఞాపకశక్తి తగ్గదు వీర్యము పతలాకాదు. రక్తము కండరములు నరములు గుండెబలకొనును. వీర్య జీవరేణువులు అభివృద్ధియగును. డెబ్బ ఏండ్ల వానికికూడా కాళ్లతీపులు ఉండవు సర్వాంగములను సర్వధాతువులను చక్కగా కాపాడును పచనమూ అపచనముగాక వుండబడినది పేల్చబడినది. అంతా

బియ్యములో వున్నబలము మరి ఏ ధ్యానములోనూలేదు దేహబలం జ్ఞానబలం రెండూ ఇవ్వగలదు వీర్యవృద్ధి అయినది అన్నది కరుణ.

ఈ పొడి ఏమిటిదమ్మా అన్నది రాగమ్మ.

పొడిగా వున్నది మినుములతో తయారయినది అవి అప్పళాలు ఈమూడు ఆహారములు పురుషులకు చాలామంచివి అపహాంష్లు ఈపదార్థముల చక్కగా సేప్చ కొనియే వుండవలయును అన్నది కరుణ.

తయారుచేయు విధము ఎట్లనో కొంచెము చెప్పు వింటాము అన్నది రాగమ్మ.

అట్లయితేవిను వడ్లను పేలాలు వేయించుకొని చక్కగా పోట్లు వీర్పరచుకొని కావలసినంత ద్రాక్షను పుల్లలుతీసి కొంచెము నెయ్యివేసి ఎచ్చచేసి వేరుసెనగపప్పు వేయించి పొట్టుతీసినవి ముంతమామిడి నెయ్యిలో కొంచెము వేయించినవి కొబ్బెర తురుము అల్లము గోధుమ గింజలంతసన్నగా తరిగి నెయ్యిలో వేయించినవి తగు మోతాదు ఈవస్తువులు అన్నికలిపి పిండిపు సరిపోవునంత అనగా కొలతకొల్చి అంతే బెల్లముగాని చక్కెరగాని వేసుకొందురు. కొందరు తీపుఎక్కువ పనిలేదనువారు తగ్గించు కొనవచ్చు లేత పొగుపట్టి ఈవస్తువులువేసి కలియబెట్టి కొంచెము ఏలకుల పొడి పచ్చకర్పూరముచల్లి ఉండలు చేసుకునేది ఇందులో కొందరు నెయ్యిలో వేయించిన సెనగపిండిగాని గోధుమ రవ్వనుగాని పప్పులను కలుపుదురు ఈ ఉండలు నెలవరకు చెడవు నిత్యమూ జీర్ణశక్తిననుసరించి సేవించుచు పాలుగాని చిక్కని మజ్జిగగాని త్రాగిన దేహబలము తగ్గక పురుషుడు యౌవనవంతుడై జీవించును ఇందుకే పూర్వీకులు పేలపిండిని చేసుకొని తిని పెద్దకాలము వీర్యవంతులై జీవించినారు. ఇప్పుడు కర్మజాలక ఎవరైనా తిన్నయెడల పేలపిండీ ముఖమాఅంటూ హేళనచేస్తారు ఒకాయన బావమరది వచ్చిఉంటే ఈలాటి పేలపిండి వుంట ఒకటి ఇస్తే పేలపిండి వుంటా అని నవ్వినాడట.

అదిచూచి బావ ఏమినవ్వుతావు ఈపేలపిండి బలము మీయక్కనడిగి తెలుసుకో అన్నాడట ఆమాట బావమరది తలవంపులుగా భావించి తలవంచి ఊరకున్నాడట.

అది అక్కగమనించి ఈద్వినంధి మాటలతోనే వచ్చించి అంటూ ఔను అప్పా నాకొకజబ్బు ఉండినది ఈపిండి తిన్నప్పటినుండీ ఆజబ్బు ఎట్లపోయినదో పోయినది దానికై అట్లంటూ వున్నాడు మీబావ నాకుశ్వేత ప్రదరము మీబావకు అతిమూత్రము

ఉండినది దీనికై ఎంతోడబ్బు పోగొట్టుకున్నాము ఏమీసుఖము లేకపోయినది ఇది ఒక ఆయుర్వేదవైద్యుడు చెప్పినాడు ఆయన ఇల్లూ వళ్లూ బంగారుగాను మీబావవల్ల నావల్ల ఎంతో బాగుపడినదిరా అన్నదట అట్లగా ఈవుంట బలము తెలిసిన వెనుక విడువరు ఆడవారుచేసి మగవారికి ఇస్తూనే ఉంటారు కర్షకుడు ఎద్దులతయారుచేసుకుంటేనేగా పనిచేసేది లేకుంటే కుంటుపడతాయి పనిచేయలేక పడుకుంటాయి అట్లే స్త్రీలు పురుషుల చెడకుండా వుంచుకుంటేనే సుఖములేకుంటే పరాఙ్ముఖమే కర్షకుని విధమే అవుతుంది అన్నది కరుణ ఆమాటలకు రాగమ్మ నవ్వుతూ ఎక్కడనుంచీ ఎక్కడికి తెస్తివమ్మా ఇంకొకటిచేయు విధమెట్లా అన్నది.

అంతలో శాంత ముగ్గురికీ మూడుగ్లాసులు మజ్జిగతెచ్చి ఇచ్చినది రాగమ్మ తాగుతూ అంతా క్రొత్తవంటలుగానే ఉన్నవే అంటూ త్రాగినది

బాగలేనా అన్నది కరుణ.

బాగనే వున్నవి చేయువిధమెట్లా ఇందులోగల సుగుణమేమి అన్నదిరాగమ్మ

కరుణ మజ్జిగత్రాగుతూ రాగమ్మా దీన్ని వైద్యులు నవ్వుతూ తక్రాసవమంటారు. చిక్కని మజ్జిగలో ఉప్పు కావలసినంతవేసి తిరుగబోతపెట్టిన ఉప్పగ కారముగా పుల్లగనుండును. మరీకొందరు నిమ్మరసము పిండుకొందురు. ఇది సాయంత్రము ఫలహారసమయములలో చాలా శ్రేష్ఠమంటారు. ఇదిజీర్ణకారి పైత్యము హరించును దేహము శాంతపరచును ఉమ్మెని ఎక్కువ ఊరనివ్వదు అమృతము వంటిది గౌరవానికై కాఫీబుత్రాగి ఐఫీలుపెట్టి గంగపాలయ్యేదానికన్నా ఉదయమే ఈదేవతనుగొల్చి చల్లగా బ్రతికేదిమేలు దేవతలు అమృతముత్రాపి జరామరణముల భయము వదలినట్టు మనమీ అమృతము త్రాగితే జరామరణముల అపలేక పోయినా అనారోగ్యముల ఆపగలదు టీబీల మాపగలదు వీర్యాభివృద్ధినిచ్చి నూరేండ్లు కంటిబలమూ కాలిబలమూ ఇవ్వగలదు అమృత గుణముండే దీనికి అమృతమని పేరుగలిగినది గుణమునుబట్టి పేరు ఓషధులకు వచ్చినది వస్తుగుణతత్వము తెలియనివారు తెలియనట్లుండక తెలిసినట్లు వర్తించిన తప్పక ప్రమాదమువచ్చును అన్నారు పెద్దలు మజ్జిగమానవునికి అమృతము అందులో బీదలకూ కర్షకులకూ అగ్నిదగ్గర కూర్చొనిపనిచేయు వారికి ఎండలో సంచరించువారికి పరమామృతము ఈకాలమువారు ఈమాట వింటారా బాగుపడతారా అయినా వారివారికర్మ వారివెంటనంటే ఉంటుందంటూ లేచినది కరుణ.

రాగమ్మ కరుణనుచూచి ఈవక్కాటే చేయువిధముచెప్పు అటుపై లోకము విషయము మాట్లాడుదాము అన్నది.

మినపపిండిని నెయ్యిలోవేసి బాగాదోరగా వేయించి పేలపిండికి వేయునట్లు పప్పులు అన్నీవేసి చక్కెర పాగులోకలిపి వుంటలుచేసి పెట్టేది లేదా ధనబలమున్న లేహ్యపక్వమునకు వచ్చుపర్యంతమూ నెయ్యీ తేనెవేసి రోటిలోపోసి దంచి కుండ లోగాని పింగాణీపాత్రలోగాని ఎత్తివుంచేది ఇది శోభరనం పెండ్లికొడుకులకూ వీర్య బలము తగ్గినవారికీ నిర్వీర్యులయిన వారికీ వీర్యము పతలా అయినవారికీ ఉష్ణముతో కాళ్లమంటలూ, కండ్లమంటలూ వున్నవారికి మూత్రము ఎక్కువగువారికి బలములేని వారికి ప్రదరవ్యాధులున్న స్త్రీలకు (తెల్లచీర అమృతము దేహబలాను గుణ్యముగా తిని చల్లారిన పాలుగాని లేక చిక్కనిమజ్జిగగానీ త్రాగిన పాడిఆవుకు చెన్నంగిబియ్యపు కడుగు, (పోసినట్లే పావుయిచ్చేది పడియివ్వగలదు) పురుషుడుయౌవనలో పాపము లేకుండా నూరేండ్లు జీవింపగలడు. భోజ్యేషుమాతా అనే నీతివాక్యమును పాటించి స్త్రీ పురుషునికి చేసిఇచ్చి జీవనోపాదులకు జీవితసుఖానికి వాడుకొను తల్లిఅయితే పురుష లకు ఇవి లభ్యమవుతాయి. పూరకగావుతల్లీ మాశాంతమ్మ సర్వకష్టములూ పడ గలదు సకలసౌఖ్యములూ పొందగలదు రాగమ్మా ఇక అప్పళాలు ఇవి ఇరవైఅప్ప ళాలైనా ఒకసారి నోట్లోకి సాలనట్లుచేసి అమ్ముకొనువారు పేరుకు చేసినామని చేసి వేసుకొనువారూ ఉన్నారు. అట్లుగాదు నల్లేరురసముపోసి పిసికి లావుగా అప్ప ళములుచేసి నూనెలో పొంగించినవి నాలుగైదు తింటే కొంతవరకూ ఆహారముగా మారగలవు ముందుచెప్పిన గుణములకు పైన జీర్ణశక్తికూడా ఇవ్వగలవు. నల్లేరు రసము అనగా నల్లేరును తగుమోతాదుతెచ్చి రుబ్బి పిండికి ఎంతనీరు కావలయునో తెలుసుకొని రుబ్బినదానిలో నీరుకలుపుకొని కొంచెముసేపు సెగనవుండనిచ్చి వడి యగట్టుకొనవలయును. ప్రతి ఇంటిలో వుండతగిన ఆహారములు చిన్నలు పెద్దలు సేవింపతగినవి అన్నది కరుణ.

అంతలో కమలకు శాంతమ్మ జడవేస్తూవుండగా పెండ్లివారు పదిపదహైదు మందివచ్చిచూచి వారు జడలల్లుకొన ప్రారంభించిరి అందులో కొందరు నిల్చు కొని దువ్వుకొనువారూ నిల్చుకొని జడవేసుకొనువారు వుండగా కరుణవారినిచూచి.

అమ్మా నిల్చుకొని జడవిప్పుట జడఅల్లుట నిల్చుకొని వేసుకొనుట దువ్వు కొనుట కూడదు కూర్చొని వేసుకొనవలయును అటు ఇటూ తిరుగుతూ వేసుకొన రాదు ఊడిన వెంట్రుకల జాగ్రత్తగా చూచుకొనవలయును. అవి నీటిలోగానీ పశు వుల మేతలోగానీ అన్నములోగాని పడిన చేయకవచ్చు పాపమువచ్చును కూర్చొని

దువ్వుకొని జడఅల్లుకొని ఊడివచ్చిన వెంట్రుకల బాగా క్రింద పరిశీలించి ఎత్తుకొని దిబ్బకుపోవు వస్తువులలో చేర్చవలయును. పురుషుల కెదురుగా వాకిటికెదురుగా వాకిలిముందు వంటశాలలో దేవుని పీఠముకెదురుగా కూర్చొని దువ్వుకొనరాదు పెద్దవారుచూచిన సంస్కారములేని మొద్దులందురు ఊరక పాపమువచ్చును ఊరక వచ్చుపాపములలో ఇదీఒకటి దారిలో ఉమ్మివేయుట వీదిగోడలకు కొమ్మలకు పూయుట దారికిరువంకల మలమూత్ర విసర్జనల చేయుట యెబ్బిగా ఆకునమిలి దారిలో మూయుట ఊరబావిలో పాదములు రుద్దికడుగుట బావిలో పలుదోమి కడిగి పుక్కిలించి మూయుట స్నానముచేయుట పొరలాడుట ఎంగిలిచేసిన పదార్థ ముల ఒరులకు పెట్టుట పదిమందిలో తానొక్కడే ఫలాహారము చేయుట పెద్దవారి ఎదుట ధిక్కరించి తిరుగుట పెద్దవారిమాటల లెక్కచేయక సంచరించుట ఏమో గొప్పతనము తనలోగలవని విఱ్ఱవీగుట పెద్దల ధిక్కరించి అగ్రస్థానముల కూర్చొనుట శక్తికిమీరిన నడగనడచుట చేయరానిపనులు చేయుట ఒరుల హేళనచేయుట ఒరులచూచి అసూయపడుట ఊరక వచ్చుపాపములు చేయతగ్గచోట్లు చేయతగ్గనిచోట్లు తెలిసి చేయవలయును. అన్నతోడనే కూర్చొని దువ్వుకుంటూ జడల్లుకొను చుండిరి

కమల జడవేయించుకొని పూలను దేవునివగ్గరవుంచి నమస్కరించి తెచి. ముత్తయిదువులకు ఇచ్చుచుండెను.

కరుణ చూచి దేవుని దగ్గర పెట్టి తెచ్చి రావా కమలా అన్నది.

పెట్టి నమస్కరించి తెచ్చినాను అవ్వా అన్నది కమల.

ఆమాటలువిని రాగమ్మ ప్రతివస్తువూ దేవునికిచూపక మరచునట్లులేదే అన్నది

ఔను ప్రతివస్తువూ దైవనిర్మితము వారికిచూపక ముందుపెట్టక తిన్నది అనుభవించినది రాక్షసత్వమగును ఆవస్తువులు మరుజన్మకు అడుగంటును ఈజన్మలో కొరతగలుగును దేవునికిచూపి అనుభవించిన వస్తువులు ఈజన్మలో అభివృద్ధియగుటయేగాక మ రు జ న్మ లో కావలసినంతా అభివృద్ధియగును. మళ్లీజన్మమున్నది ఆ జన్మలో కొరతరాకూడదు బాగుపడి మరింతముందుకు పోవలయును. సాటిమానవులలో వెనుకపడి అవమానపడరాదను ఆశగలవారి పంథా ఇది ఇదితెలుసుకొని మరువకుండా దేవునికిచూపి అనుభవించువారు ఇందూ అందూ సుఖపడగలరు ఏమున్నదని మళ్లీపూతములెమ్మని ఎక్కడిజన్మో ఎక్కడిపాపమో అని మరచి సోమరులై తి రు గు వా రి కి ఏవస్తువులభించక దుఃఖపడగలరు దీనిమర్మమింతే నన్నది కరుణ.

రాగమ్మ ఆమాటలువిని తలవూచుతూ సూక్ష్మములో మోక్షమన్నారు. అణువణువులుతోడై మహామేరువు కాగలవన్నారు. సరితూగగలవన్నారు దైవనివే దనాపద్ధతి షట్కర్మవిధి అణువులు మహామేరువు అయినట్లుగా మానవుని సూక్ష్మ రూపముగా మోక్షసామ్రాజ్యము ఏలింపగలవు కుటుంబులకు ముఖ్యమయిన పద్ధతి ఇదే యింతకన్నా మరొండు విధములులేవు లేవన్నవారికి లేదు వున్నదన్నవారికి వున్నది అన్నది.

కరుణ రాగమ్మనుచూచి అమ్మా.

శ్లో॥ హోమం తర్పణయజ్ఞ యాగఫలితం కింతేనదానం
వినా వీణాగానసరాళి గీతఫలితం కింతేన కంఠం
వినా శయ్యావాసన గంధ పుష్ప ఫలితం కింతేన కాంతాం
వినా వేదంశాస్త్ర పురాణ తర్కఫలితం కింతేన జ్ఞానంవినా॥

అన్నారు మానవులకు పెట్టిన పెట్టినదే వచ్చును పెట్టినవస్తువు అయిపోవును దైవమునకు పెట్టినవస్తువు అక్షయమై పెరుగును పెరిగి మనవంతే కాగలదు. ఆహ రమయిన చూపించి తిందుము. వస్త్రభూషణములు పూలు మొదలగు సుగంధ ద్ర వ్యములైన కడకు మనమే అనుభవింతుము ఒకవంతు నూరువంతులో వేయి వంతులో యివ్వగలశక్తిదాత గోరంతకు కొండంత బదులివ్వగల కల్పవృక్షము యిదిగమనించలేక మానవులు దైవనిర్మితమైన వస్తువుల దైవమునకు చూపకతిని దైవోపహతులై మరుజన్మకు అష్టదరిద్రులై అటుమట పడుదురు.

రాగమ్మా యజ్ఞయాగాదులు ఎన్నిచేసినా జపతపాదులు ఎంతచేసినా కంచిత్ దానమునకు సరిరావన్నారు దానములో రెండువిధములు దైవార్పితమై మానవార్పి తము గావడము దైవార్పితముగాక మానవార్పితముగావడం ఈఅంటిలో దైవార్పి తమై మానవార్పితమైనది మేరువు మానవార్పితమై దైవార్పితమైనది మధ్యమము మానవార్పితమే అయినది అధమము అన్నంతలో ఆశ్చర్యమభినయిస్తూ.

మానవార్పితమై దైవార్పిత మన్నావే అవిఎట్ల అన్నది రాగమ్మ.

ఏమిరాగమ్మా అంతమాత్రము తెలుసుకొనలేక పోతివా సత్పురుషులకు వస్త్రభూషణములుగానీ ధనధాన్యములుగానీ గుళ్లు మళ్లు మొదలగు మాన్యాములుగానీ తిను పదార్థములుగానీ దానమిచ్చిన దైవనివేదనచేయక వారుముట్టరు దైవనివేదన చేయుటతోటి దైవబలముగలిగి మరుజన్మకు ఇచ్చినవారికి ఇవ్వగలశక్తిగలిగి ఋణము తీర్చుకొందురు మానవార్పితమే అయినదానము తిరిగి ఇవ్వగలశక్తిలేక ఇచ్చినవారి

పాపము గ్రహించి పుణ్యము గోల్పోయి పాడగుదురు సత్పురుషులు దైవార్పితము చేసి పుణ్యము గోల్పోక పాపము మూటగట్టక దానము దానముగా ఇచ్చినవారికి ఇవ్వగలరు. శుద్ధమానవార్పితమైనది వచ్చిన వచ్చును లేదా వానిపుణ్యము లభ్యమగును కాదా భూతతృప్తిలోచేరి భూతమయునివల్ల ఇంతో అంతో రానిబాకీవలె వచ్చు రాగమ్మా దైవార్పితమై మానవార్పితమైన దానమేదానము మార్వాడీ డ్డీవలె ఇరువురివల్ల సమకూరును మానవార్పితదానము భూతదయతో చేయవలయును ఫలముగోరక కృష్ణార్పణ మనవలయును. రాగమ్మా అదిగో చూడు పురాణ ముత్తయిదువులగు త్రిదేవులకుచూపి ఈముత్తయిదువులకు ఇచ్చుచున్నది దైవార్పితమై మానవార్పితమైన దానమిదే నన్నది కరుణ.

ఔను కరుణా అదిగో ఆమె పూలను రెండుచేతులలో వుంచుకొని దైవార్పితముచేసి కన్నులకద్దుకొని అలంకరించు కొనుచున్నది ఇదీవక పథా అన్నది రాగమ్మ.

ఔను దైవమే యిచ్చెను దైవప్రసాదమని భావించి దైవార్పితమేచేసి తాను అనుభవించిన తిరిగీ యిచ్చినవారికి ఇవ్వగలశక్తి కలుగును దైవబలమూ సమకూరును. ఆమె సంస్కరింపబడినది గాబట్టి ఆచరణలో వుంచుకున్నది అన్నది కరుణ

రాగమ్మ కరుణ మాటలలోగల అర్థము గ్రహించి భక్తిపారవశ్యముతో తలవంచి ఏకమనస్సుతో దైవము శక్తికొలదీ ఏది యిచ్చినా స్వీకరించును స్వీకరించినది గోరంతైననూ కొండంతగా ఇచ్చును. దీనికి సాదృశ్యము కుచేలుని మూడుపిడికెళ్లి అటుకులే ఎడతెగని ఐశ్వర్యము భగవంతుడు ఇచ్చినాడు ఆస్తికునికి ఇది నిజము నాస్తికునికి ఇది అబద్ధము నమ్మితేసొమ్ము నమ్మకపోతే దుమ్ము అన్నారు పెద్దలు నమ్మిచెడినవారు ఎవ్వరూలేరు మనసు నిల్పుకొని భగవంతుని నమ్ముకొని సేవించు చున్నవారికి ఏకొరంతలూలేవు అన్నది.

కరుణ రాగమ్మనుచూస్తూ రాగమ్మా చిత్తశుద్ధిలేని శివపూజలేయేల నన్నాడు వేమన చిత్తశుద్ధి గలిగేదెన్నడు శివపూజ చేసేదెన్నడు పూజలేకున్న చిత్తమెట్ల శుద్ధికాగలదు చిత్తశుద్ధిగలిగి పూజించేవారు పక్వబుద్ధులు అనగా ముందుజన్మలో కష్టించి తయారై వచ్చినవారు వారు మినహా మరెవ్వరితోనా అపనిగాదు మనోవాక్కాయ కర్మలను మూడిటిలో వాక్కును కాయముమ ఈజన్మలో వంచిపనిచేయిస్తే మరుజన్మకు దానంతట అదే పీటెననుసరించును మూటెలో రెండు ఒకప్రక్కకైన ఒకటి వెంబడిరాక ఎక్కడపోవును దానంతకు అదే వచ్చును. దానిని

లెక్క పెట్టపనిలేదు ఘోర ధ్యానము చేయుచున్నది దేహము నిల్చుకొని ఉన్నది. మనసు ధ్యానము ననుసరించి నడిచిన నడువనిమ్ము లేదా పోనిమ్ము వాక్కు దేహము ఏకీభవించి చేయు దినచర్య) షట్కర్మవిధాన పుణ్యమేచాలును ఆపుణ్యమే దానిని మరుజన్మకు ఈడ్చుకొనును మానవుడు పీకెతో తప్పక ముందుకు సాగి పోవును భగవంతుడు తిన్నగ దారిచూపుతూ గావునచేర్చుకొనును తప్పటడుగులు వేయు పిల్లవాని నడకకు తల్లిచ్చే సహాయమిచ్చినట్లు తాను సహాయమిచ్చి దాపుకు చేర్చుకొనును వారి అనుగ్రహములేక దేవదానవ మానవులలో మనసును కట్టగ లుగువారు మాయను గెల్చువారు లేరు పురుషునికి స్త్రీలపైనా స్త్రీకి పురుషులపైనా పరుగెతుబుద్ధి దేవునిపైకి పరుగెత్తితే పరమాత్మపిలుపు దూరములోనే ఉండును సర్వము సన్యసించినా సిరిస్త్రీ దానంతట అవి వచ్చిన వలదనువారు వసుధలో లేరు జాగ్రదావస్థలో వలదన్ననూ స్వప్నావస్థలో వలదనడు స్వప్నావస్థలో వలదని వైతొలగిన ఎదుటనే శ్రీమన్నారాయణమూర్తి శ్రీలక్ష్మీసమేతుడై గన్పడును అయ్యలో అమ్మయ్యలో పరుకున్నదీలేనిదీ అక్కడనేగన్పడేది ఉండెనా అష్టసిద్ధులు వారివెన్నంటే ఉండును అష్టసిద్ధి బడసిన వారిజాడేవేరు.

సీ॥ ఆశీర్వదింపగా నష్టదారిద్ర్యుండు కలియుగ ధనదుడై వెలుగవలయు
కోపించిత్తిట్టెనా కోటీశ్వరుండైన కూటికిలేకనే కుళ్లవలయు:
మట్టిచేబట్టెనా గట్టుబంగారమై వెలగగ్గి వసుధలో నిలువవలయు
మతిహీనుచేబట్ట మహానీయుడైధర ప్రఖ్యాతినార్జించి బ్రతుకవలయు!

తే॥ అష్టసిద్ధులు నార్జించినట్టి దీరు
లిట్టులుందురు కనుగొననిందు నంచు
దైవసములయి పావవి దారులగుచు
వారు పరిపక్వమైనట్టివారు తలప॥

రాగమ్మా త్రికరణములు ఏకీభవించి చిత్తశుద్ధికలుగ వలయునన్న సామాన్యమా అజగరన్యాయము బడయ వలయునన్న నలవియా అయినా వారి వారి ప్రారబ్ధము వారివెన్నంటును అని సాయంకాల మయినదమ్మా పోవలయునవి వనములోకి పోయెను రాగమ్మ వెంటనేలేచి అమెననుసరించెను.

## శ్రీ ఉమామహేశ్వర సీతారామార్పణమస్తు.



# మాతృ జ్యోతి.

## సాయాహ్నము.

కరుణ ఒక చిన్నకొడవలినీ పుటికను తీసుకొని గడ్డికోయ ప్రారంభించెను.

రాగమ్మ కరుణనుచూచి ఏమమ్మా గడ్డికోస్తావా అని తానూ ఆదేపనిచేయ బూని కరుణా గోపోషణచాలా పుణ్యమైనదమ్మా ఇది పుణ్యులకే లభ్యమగు తుందంటారు అన్నది.

కరుణ నవ్వుతూ రాగమ్మా గోపోషణలో పాపముకూడా ఉన్నది సక్రమముగా మేతవేయక వేళకు నీరుత్రాపక చోటుమంచిదిగా చేయక విడిచి త్రిప్పక రాక కొట్టి తిట్టి శల్యావశిష్టముచేసి కంటనీరుపెట్టి అమ్మాఅని అరచుచున్నా కనికరము లేక కావలసినన్నీచేస్తూ సక్రమముగా చూడనివారికీ నరకలోకప్రాప్తి తప్పదు గోవును సాకుట పుణ్యము గోవును సాకుట నరకము వున్నది తెలుసుకొని గోవు విష్ణుస్వరూపమని సాకినవారికి ఇహపరముల రెంటికు సుఖముగలదు. గోవును కామధేనువుగా తలంచి సాకి ఆ పాలను దైవనివేదనచేసి వాడుకొన్నవారికి మోక్షము కరతలామలకముగా నుండును. ఆనెయ్యితో దీపమువెలిగించిన వారికి ఇహచెప్ప నక్కరయేలేదు మాత మరుగైననూ గోమాత మాతయై సాకగలదు చతుష్పాదజంతువులలో శ్రేష్ఠమయినది ఆజన్మలో పరోపకారముచేసి మానవత్వమునకు రాగలినది మహత్తు గలిగినది దేవతలకు మానవులకు ముఖ్యమైనది. గోవునుసేవించిన లక్ష్మీనారాయణుల సేవించినట్లేయగును ఇట్టిదీని వధించితిను కలియుగ రాక్షసులూ ఉన్నారు వారిమాట ఈచల్లటి వేళలోఏల పోనీ.

రాగమ్మా గోపూజచేసి మనమిచ్చు ఆతిథ్యములు ధూపదీప నైవేద్యములు సుగంధ ద్రవ్యములు కామధేనువు ఈ ధేనువున నిల్చి స్వీకరించును ఎన్నిచేసినా ఆహారముపెట్టక అర్చనకాదు ఈ ధేనువును కామధేనువని భావించి పూజింతువారు

కొందరు లక్ష్మీనారాయణులని పూజించువారు మరికొందరు గౌరీశంకరులని పూజించువారు మరీకొందరు గోవును పూజించిన ముప్పది మూడుకోట్ల దేవతలు తృప్తిచెందుదురని భావించి పూజించువారూ ఉన్నారు ఒకానొకప్పుడు వాయు కుమారునికి దేవతలందరూ వారివారి శక్తినిచ్చి చిరంజీవినిచేసి సర్వశక్తి సమోపేతునిగా చేసి సర్వులు తనయందేయుండి దైవసమానునిగా చేసినట్లు మహిషాసుర వధకొరకై పార్వతికి త్రిమూర్తులు మొదలుకొని దేవతలందరు వారి వారి శక్తిని ఆయుధముల నిచ్చి సర్వశక్తి సమోపేతను చేసినట్లు త్రిమూర్తులు మొదలుకొని దేవతలందరు కామధేనువు నందునిల్చి సర్వులచే పూజింప చేయవలసిన సమయమువచ్చి దేవత లందరికీ తెల్పగా మంచిచోటునాకు దొరుకునో దొరుకదోయని చిల్లలసమూహమంతా పిక్కబలమున్నంతా పరుగెత్తిపోవుటచూచి శనిదేవుడు నేనూ జాగ్రత్తపడవలసినదే నేనంటే. అందరూ దిగులు పడునట్లూ పరుగెత్తునట్లూ నిర్జీవులవునట్లు చూచినంత మాత్రమున విన్నంతమాత్రమున విల విల తన్నుకొని ప్రాణములు విడుచునట్లు సర్వాశలు వదలుకొని చచ్చునట్లు ఈపాడు జోతిష్యులు చేసినారు గురువు మొదలు కొని సూర్యునివరకూ నిర్ధనులా నిర్వీర్యులచేసి ప్రాణముల తీయువారుగారా నాకు సమానుడై సర్వప్రపంచమున అర్థజీవుల అగంతుక మృత్యువు వాతవేయుట లేదా కుజుడు నన్నొక్కనిమాత్రమే ఎత్తిపెట్టి లోకములో గౌరవహీనము చేసినారు నా మిత్రులగు శుక్రబుధులు శుభులని పేర్కొనుటకు వీరికి నాల్కెట్లులాడెను. నామిత్రులు శుభులు నేను అశుభుడనా కానీ నాయుగమున ఈ జ్యోతిశాస్త్రమును జోతిష్కుల అధఃపధమునకు త్రొక్కి అష్టదరిద్రులా అధమాయుర్దాయులచేసి మతిహీనమొనర్చి మాటలు ఫలింపకుండ మటుమాయమొర్చి వీరికెందునా గౌరవములేకుండ చేయక పోదునా ఎవ్వరుపట్టి బాధించినా నేనేనని సర్వులకుచెప్పి సర్వప్రపంచములో లోకువ చేసినదిచీరే వీరిని వాసనబట్టి వీరి విటిపాలుచేయక మానను గ్రహమండలమున గొప్ప భాగస్వామినై ఎవరేవస్తువు నాలోవలదన్ననూ వలదన్నవి నాకేఇవ్వమని హీనవస్తువులనెల్ల గ్రహించి సర్వదేవతలలో మెప్పువడసిన నన్ను పాపియని పేరు పెట్టెదరా మిగులువారు మాత్రము పాపులుగారా వారుచేయరని వీరుచెప్పగలరా జోతిశ్శాస్త్రమునకు ఔషధములకు మంత్రములకు శాంబరీ విద్యలకు భూతములకు అధినేతయైన బుధుడు నామిత్రుడు అయనకుచెప్పి జోతిశ్శాస్త్రముతల క్రిందులుగచేసి నానాదేశముల నానాకూతలుకలిపి నానామతముల గల్పించి నానాఫణీదు చేయు వారిని పుట్టించి మంత్రములు ఓషధులు తద్విధముగానేచేసి వీరి అగ్రస్థానముల

మర్యాదల గౌరవముల పలుకుబడిని అధోగతి పాలుచేయమని నామిత్రునికి చెప్పు దును చేయింతును నావీలుబడిలో వీరివాసనేకూడదు వీరిజాడే ఉండకూడదు తెలి యనివారు తెలియనట్లుండక విద్యావంతులై జోతిశ్శాస్త్రము అవకతవకలుచేసి నన్నధో గతికిపంపిన వీరి రూపునామక్రియలే లేకుండ చేతునని వీరావేశముతో జోతిష్కుల దూషిస్తూ వాయువేగ మనోవేగముల పరుగెత్తుకొనిపోయి ముందుపోయినవారు అగ్రస్థానమని త్రిమూర్తులకు విడచిన ముఖములో కూర్చొనగా అప్పటికి అందున్న వారు అయ్యో త్రిమూర్తులక అనగా కూర్చున్నచోటునుంచి లేచిన అవమానమని ఎందూ చోటుగానక అంతకువారువచ్చి లేవమన్న నాకొలువునేవిడచి పోదమని మనోనిశ్చయము చేసుకొని కూర్చున్న తమపరి త్రిమూర్తులువచ్చి చోటెందూగానక ముఖమున శనియుండుటగని మూత్రపురీష స్థానములలో మూత్రస్థానమున లక్ష్మి నారాయణులు భారతీ బ్రహ్మలు పురీషస్థానమున గౌరీ శంకరులు కూర్చొనగా నా ముఖమునకు పూజలేకపోయె నా ముఖమును ఇంకెవరు చూతురని కంటనీరు పెట్టినదట కామధేనువు అదివేల్పు అదిచూచి సురభీ నీవు చింతించవద్దు నీముఖము నకు గౌరవము లేకున్నను నీమూత్ర పురీషస్థానములకు మూత్ర పురీషములకూ గౌరవముండును. ఎట్టి అనిష్టములయిననూ నీమూత్ర పురీషములవల్ల పవిత్రమౌ నట్లు నేను బ్రహ్మయు మూత్రస్థానముననుండు సకల వస్తుసముదయముల గల్గించి ఆ స్థానమునకు గౌరవమిత్తుము. మూత్రమున లక్ష్మి సరస్వతులుండి అపవిత్రస్థల ముల ప్రోక్షించినంత మాత్రమున పవిత్రము చేయుదురు. పురీష స్థానమున శంకరుడుండి నీవేది తిన్ననూ పవిత్రమౌనట్లు చేయగలడు. పురీషము పవిత్రమై దానిచే స్థలము పవిత్రమై గోమయమనునట్లు సర్వమంగళి చేయగలదు. దేవదానవ మానవులలో నీ మలమూత్రములు పవిత్రములై ప్రకాశింపగలవు. నీవల్లగలుగు పాలు, పెరుగు, వెన్న, నెయ్యి పరమ పవిత్రములై మాకు అమృతసమమై ఆనం దింప చేయగలవు సర్వజీవులకు మాతృరూపమై వర్ధిల్లగలవు నీకెట్టి ఇక్కట్లులు వచ్చి ననూ మాకు వచ్చినట్లు భావించి రక్షింతుము. మేముంతుటచే నీ పుచ్ఛము నీ మల మూత్రద్వారములు పవిత్రములై పూజనీయములు వందనీయములు కాగలవు నీ పుచ్ఛమునకే పూజలు జరుగును. దేనిలో సుగుణముండునో అచ్చోట నీచమనక మేముంచుము. ఈస్థానములే నీలో పవిత్రమైనవి. అట్టిచోటనే కూర్చుంటిమి నీవు దుఃఖిపకుమని దుఃఖోపశమన మొనర్చినారట రాగమ్మా అందుకే గోవుకు ముందు గా తోకకు మూడుచోట్ల పసపు కుంకుమ పెట్టి లక్ష్మి సరస్వతీ పార్వతిగా భావించి

వెనుక పాదములకుపెట్టి వెన్నీపునా చెండుకూపెట్టి సవ్యముగావచ్చి ముందు పాద ములకు పెట్టి ముఖమునకు పెట్టుదురు. అట్లే సవ్యముగానే పోయి పూలుపెట్టి ధూప దీప నైవేద్యములుయిచ్చి పిదప ప్రదక్షిణ చేయుదురు. రాగమ్మా దైవసమమని భావించి గోపూజ చేయువారికి మంచిదేగాని అదివేల్పును గొల్చక ఫలములేదు మొ దులుకు నీరుపోయక శాఖలకు పోసినట్లుండును అన్నది కరుణ.

రాగమ్మ ఆశ్చర్యపడుతూ కరుణా అడిగినదానికి చక్కగా సమాధాన మివ్వ గలవు లోకానుభవము పురాణ శ్రవణానుభవము జ్ఞాపకశక్తి శాంతము చెప్పగల చాకచక్యము ఆశుధార బాగావున్నవి నీవెంట కొంతకాలము ఉండుట మంచిదిగా తోచుచున్నది అది ఇది అనక అన్నిటిలోనా అనుభవమే ఉన్నట్లున్నది నీజన్మ పుణ్యజన్మ అన్నది.

అమ్మా విన కుతూహలముండ వలయునన్న అదీ ఒకణ్యామే వుండవలయును విన కుతూహలమున్నవారికీ విన్నది కన్నది తిన్నది కంఠస్థముచేసి పెట్టవలయునను కొనువారికి ఏనాడైనా లభ్యమగుతూనే ఉండును మాఇంట శాస్త్రపరిశోధకులు గ్రంథ శోధకులు ఉండినారు వారివల్ల విన్నవి చెప్పుచున్నాను వినుటవల్ల భౌతికము కొంత నశించి ఆధ్యాత్మికము కొంతఅలవడి స్థిరప్రజ్ఞగలిగి దైవము నే న మ్మి అజగర న్యాయము వహించినాను జ్ఞాపకశక్తి విద్యాభిలాష ఉన్నవారే పౌరాణికులు కవులు గాకుయలు పండితులు శాస్త్రవేత్తలు వీరెకన్నిటకు జ్ఞాపకశక్తియే ప్రాధానము ఒక్కొక జీవికి ఒక్కొక దానిపై ధ్యాసగలుగును అది వానిపూర్వజన్మ ఆశాఫలము అన్నది కరుణ.

ఇవన్నీ ఎట్లున్నాగానీ ఆసరోజా రాములు అటుపై వీమైరో కొంచెము వారికథ కానీ ఆదంపతులు లోకమునకు ఆదర్శకిప్రాయులుగా వున్నారు వారికథ వినవినా అభిరుచిగా వున్నది వారివల్ల ఎన్నో లోకానుభవములు వెలువడుచున్నవి వారిని పుణ్యదంపతులన వలయును కానీ కరుణా అన్నది రాగమ్మ.

రాగమ్మ పాపపుణ్య మిశ్రితులు మానవులు పుణ్యము ఎక్కువగాఉన్న జీవులు మానవులలో వన్నెగడింతురు సుఖింతురు పాపము ఎక్కువవున్నజీవులు మానవు లలో హీనులై జీవింతురు దుఃఖింతురు.

ఆ॥ మిశ్రితంబువలన మేలిమిబంగారు
విలువతగ్గి వన్నెతొలగినట్లు
పాపమిశ్రితమున పాడయిపుణ్యంబు
పరమదుఃఖములను పొరలుజీవి!

కం॥ పాపము పుణ్యము రెండును
మాపయి పోయేడివిగావు మనవెన్నంటే
అప యివచ్చెడి జన్మకు
గాపయి ఫలములను గుడుపు గనుగొనుపత్సా॥

అన్నారు అట్లే ముందుజన్మలో ఆదంపతులు కన్యాదానములుచేసి ఏకపత్నీ వ్రతులై సర్వదా భగవదారాధనచేసి దంపతులు ఒకరికొకరు ద్రోహములుచేయక ప్రేమతో ఒకరి కొకరు సహకరిస్తూ కష్టములు పంచుకొని ఈజన్మకు వచ్చిన పరమపుణ్యులు వారిగాధ ఎవరికి వినకుతూహలముండదు అయితే విను.

వారట్లు ఊరు చేరగా అనసూయమ్మను ఇంటిలో అందరూ ఏమి ఏమని చుట్టుకొని వారివిషయములు విను కుతూహలముతో అడుగగా అనసూయమ్మ దాహముపుచ్చుకొని కూర్చొని తనచుట్టూ కూర్చున్న కొడుకులా కోడండ్రా భర్తనూచూచి సరోజ పూర్వపుణ్యము చెప్పనలవిగాదు రాము నిశ్చయముగా శ్రీమహావిష్ణువే అనవచ్చును జ్ఞానాంబ సరస్వతీ మహాతల్లియే అనవచ్చు లేకున్న అంత శాంతము అన్ని ధర్మములుతెలిసి పలుకుట పలికినవి. ఆచరణలో చూపుట వుండునా ఎంతదయ ఎంతఓర్పు రామరామాజరిగినదంతాచెప్పిన ఒకరామాయణమగుతుంది. ఆలుమొగుళ్లిద్దరూ సరిపోయినారు వారివద్దికలు వారిహేళనలు వారి సంతోషము వారి సవాకారము వారి ఓర్పు వారినేరు వారిసాహసము వారి శాంతముచూడ రెండు కండ్లూ చాలవు దంపతులనగా వారే దంపతులు ఎందరినో చూచినాము గాని ఇట్లలేదమ్మా ఈ నాల్గుమాసములకే తయారయినారు దాంపత్య సుఖమనగా వారిదేసుఖము వారిని వారిమాటలను ఆటలను కని వినినగాని తెలియదు చెప్పనలవిగాదు అన్నది అనసూయమ్మ.

ఆమాటలు భుజంగరావువిని సంతోషముతో రాము చాలారసికుడు విద్యా వివేకము గలవాడు తల్లీ తండ్రీ గురువరులతో సంస్కరింపబడినవాడు అవినమ్రత భక్తిశ్రద్ధలు బంధుప్రీతి బుద్ధికుశలత జాగ్రత్త భూతదయ చెప్పనలవిగానివి పెద్ద చిన్న

లను భావముతెలిసి గౌరవముగా నడుచుటలో మేటి అనవచ్చును. అనాడు నాకు చేసిన మర్యాద ఇంత అంత అనరాదు అతడు ఉత్తమపురుషుడు నాకు ఇంతవయసు వచ్చినది డాంబికము అధికారగర్వము విద్యాగర్వము విడువలేదు అతనికి అణుమాత్రముకూడాలేవు నిగర్వి మనకు దైవసమానుడు మన సరోజాదేవే ఆగంతుక మృత్యువు అతని ప్రారబ్ధదేవత అనుకొని ఉంటిని అతని శాంతముతో ఈమె అట్లనే తయారయిన దన్నమాట అన్నాడు.

అందరూ నవ్వినారు.

శివప్రియా హరిప్రియా సంతోషముతో అత్తనుచూచి వారిఇద్దరి కాపురము నాలుగు నాళ్లు ఉండి చూచి సంతోషించాలె అత్తా అన్నారు.

అదీదగ్గరకు వచ్చిందికదా అందరమూ పోతాము నాలుగు నాళ్లుపట్టు పది నాళ్లు ఉండి చూచిరాండమ్మా వద్ధనుతల్లీ పదినాళ్లలో జాబువస్తుంది సీమంతము వారి స్వగ్రామములోనే జరుపుకుంటారట అన్నినిశ్చయము చేసుకొని జ్ఞానాంబ పోయినది నేనూ ఆమె ఒకేతూరి బస్సుదిగినాము ఇద్దరమూ వకేతూరి వచ్చినాము అంటూ భుజంగరావు వైపుమళ్లి సీమంతానికి కావలసినవన్నీ చక్క పెట్టండి అల్లుడు అడిగేవాడు గాకపోయినా మనము గౌరవానికి లోటులేకుండా పోవలెగదా అందులో వారు సీమంతము చక్కగా చేసేవిధము గన్పడుతూ ఉంది. ఆమెప్రసవానికికూడా మనయింటికివచ్చు విధము గన్పడలేదు వకరిని విడచి వకరు క్షణముండలేని స్థితి ఏర్పడినది ఆయనను దీక్షాబద్ధునిచేసి తానూదీక్షతో త్రిదేవుల పూజిస్తూ ఉన్నది వారికి కొడుకే పుట్టవలెనట వదినకు కూతురు పుట్టవలెనట వారిరువురి పెండ్లి వైభవోపేతముగా నడుపగా అవ్వా తాతా మనుమనీ మనుమరాలినీ చూచిపోను పదేపదే వస్తూ పోతూ ఉండవలెనట అని కూతురంటుంది కూతురెకని వకతూరి మనవరాలి కని వకతూరివస్తూ తెస్తూ ఇస్తూ ఉంటే వేంకటేశ్వరస్వామికి ఆదాయము వచ్చినట్లు ఉండవలెనట అందుకై దీక్షను పెంచినాడట మాబావకు కూతురే పుట్టేదని చెప్పు మన్నాడు అల్లుడు కూతురిఆశా అల్లునిఆశా చూచినారా అన్నది అనసూయమ్మ ముసిముసి నగువులతో.

శివప్రియ నవ్వినది.

భుజంగరావు నవ్వుతూ బౌనువారికి కొడుకుపుట్టితే తప్పనిసరి అవుతుంది వారన్నట్టే అవుతుందేమో మంచి కోర్కెకోరినారు ఇచ్చిన ఇంటికి ఇచ్చుట మనకు

మంచిదే ఇదిముఖ్యమయిన న్యాయము వారిఇంటినుండీ తెచ్చుకొనుటకన్నా ఇచ్చుటే శ్రేయము దానముచేసిన యింటినుండీ తిరిగీ దానము తెచ్చుకొనుట అంతధర్మము గాదు దాత దాతగనే ఉండుట మంచిదిగదా వారికోరికో ఫలించనీ దానమేచేతము ఏమమ్మా ఆడబిడ్డకోరిక విన్నావా అని నవ్వినాడు భుజంగరావు.

శివప్రియ నవ్వుతూ వారిమాటే నిజమయ్యేనట్లు వున్నది అత్తా నాకు రెండవ మాసము నడచుచున్నది వారికి ఆడబిడ్డ గలిగిన మనకు పనిరాదు మనకు ఆడబిడ్డ గలిగిన వారికి పనికి వచ్చునన్నది.

అంతలో హరిప్రియ అతికినట్లు ఇరువురకూ మగబిడ్డలు గలిగితేనో అన్నది.

అందరూ నవ్వినారు.

ఇక్కడ జ్ఞానాంబ యిల్లుచేరగానే రంగనాథం ఎదురువచ్చి జ్ఞానా ఏమి సంగతి ఏమిసంగతీని ఆతురత్వముతో అడుగమొదలుపెట్టి ఏటుదిగిన అటు తిరుగ ప్రారంభించినాడు.

అయ్యో కొంచెము మంచినీళ్లయినా త్రాగనివ్వని చెప్పుతాను అని సామాను లక్కడపెట్టి బచ్చలికి పోయినది. కాళ్లు కడుగుకొనడానికి రంగనాథం అక్కడికి పోయినాడు.

నేను వస్తాను పదండీ చెప్పుతాను చెప్పులోపలనే అంత తొందరా అన్నది జ్ఞానాంబ.

నా తొందరనాదీ నీ తొందరనీదీ కానీ అంటూ వంటగదికిపోయి మంచినీళ్ల చెంబు గ్లాసుతెచ్చి గదిముందు పెట్టుకొని కూర్చున్నాడు రంగనాథం.

జ్ఞానాంబ కాళ్లు కడుగుకొనివచ్చి వంటగదికి పోతూవుండగా.

ఇదిగో ఇక్కడ తెచ్చినా నీళ్లు అన్నాడు రంగనాథం అయ్యో ఏమి ఆతురత ఏమి ఆతురత వచ్చినాను చెప్పుతాను వింటారు. అంతలో ఇంత తొందరా మంచి నీళ్లు నేను త్రాగలేనూ త్రాగి వచ్చేలోపల ఆలశ్యమగుతుందని నీళ్లు తెచ్చిపెట్టి కూర్చున్నారు. నేను వచ్చేది తెలిసివుంటే ఎదురొచ్చేవారేనని కూర్చొని నీళ్లు త్రాగను గ్లాసు చేతికి తీసుకున్నది.

రంగనాథం నీళ్లువేసినాడు.

జ్ఞానాంబ త్రాగినది తిరిగి వేయబోయినాడు రంగనాథం.

వద్దని చేయిపూపి గుక్క మ్రింగి జ్ఞానాంబ మూతి తుడుచుకొని అబ్బాబ్బా అక్కడ కొడుకట్లా ఇక్కడ అబ్బడిట్లా ఊపిరి ఆడనిచ్చేవారుగారు అంటూ ఊ వినండీ పోతిని అన్నంతలోనే రంగనాథం ముందుకుజరిగి పోతిని అవతలా అన్నాడు.

అయ్యో చెప్పనివ్వండి వినపడేటట్లు గట్టిగానే చెప్పతానులేండీ ముందుకు జరిగి వడిలోకూర్చోవద్దు అన్నది జ్ఞానాంబ.

వడిలో కూర్చోనూ మడిలో కూర్చోనులేవే చెప్పు వింటానంటూ ఇంకా ముందుకు జరిగి ముఖం ముఖమువద్ద పెట్టినాడు రంగనాథం.

ఎవరన్నావచ్చేరు కొంచెం దూరంగా ఉండండీ ముసలివారయినా యింకా విడువలేదే అని నవ్విపోయేరు అన్నది జ్ఞానాంబ.

నీవెప్పుడయినా అమ్మగారింటికనీ, తిరుణాలకనీ, తీర్థవాసికనీ, పెండ్లికనీ, పేరంటానికని మగనివిడచిపోయి విచ్చిఉంటే తెలిసిఉండుని ఎప్పుడూ పోయి ఎరుగవు నీకేమితెలుసు నాకుతెలుసు యిల్లువిడచిపో వచ్చిన భార్యదగ్గర కూర్చొని మగవాడు యోగక్షేమములడుగక మరెవ్వరినడుగవలె నంటావు. ఆనందముగా మగనికెదురుగాకూర్చొని కండ్లుత్రిప్పుతూ కనుసోగలెగరవేయుచు హావభావములతో చిలుక పలికినట్లు పలుకుతూ ఉన్నభార్యమాట లాలింపక మగవాడు ఊరకుండగలడా ఊరకుండ మనసయ్యేనా సిగ్గుపడువాడు మాటలు చేతగానివాడు ఆడదంటే అసలేకానివాడు దగ్గుపల్లె పొగాకు చూటిలోవున్నా నోటిలోవున్నా ఒకటే ననువాడు సరిపోనివాడు సరుకులేనివాడు ఊరకుంటాడు నావంటివాడు ఊరకుంటాడా చెప్పవే విందాము అని మరింత అనుకున్నాడు.

వెనుకకు కొంచెము జరిగి జ్ఞానాంబ అయ్యో యాభైయేండ్లు పడవచ్చినా మనుమడో మనుమరాలో పుట్టవచ్చినా ఈవులును ఇంకా చావలేదే రామా కృష్ణా అనుకుంటూ రానురానూ సంసారాన్ని సంసారసుఖాన్ని దూరము చేసుకుంటూ ముందుగతుల చూచుకుంటూ పోతారనుకుంటే రానురాను పోనుపోనూ ముదురుతూ వుందే అన్నది కండ్లుత్రిప్పుతూ ముఖములో కోపమూ నవ్వూ మిళితముచేసి జ్ఞానాంబ.

వసేయ్ భామిశాలి ముందుజన్మలో చేసిన పాపాలతో అలు చచ్చినవాడు పెండ్లి కానివాడు పురుషత్వము లేనివాడు సరిపోక విడాకులు పుచ్చుకున్నవాడు

రూపము నచ్చక దూరమయినవారు రోగులై విడిపోయినవారు సన్యాసులై కూసిన కాకికూతల కోవెలలని నమ్మి ఆనందాన్ని దూరము చేసుకుంటావా ప్రహ్లాదుడు ఆలు పిల్లలతోలేడా ధృవుడు పెండ్లిచేసుకొని రాజ్యాలుయేలి యుద్ధాలు చేయలేదా మునులకు భార్యలులేరా త్రిమూర్తులకు పెండ్లాలులేరా ముక్కోటి అధిష్టాన దేవతలకు ఇల్లాండ్రులేరా ఒసేయ్ జ్ఞానా యోగులకు జోగులకు త్యాగులకు భోగులకు విరాగులకు బైరాగులకు ఆడదే అవు ఆడది ఆవులేక హరిహరులుకూడా కాదని వకరిపట్టు ఇద్దరిని చేసుకున్నారు. కానరాలేదా ఆడదిలేని ఇల్లు అడవి మగవాడులేని యిల్లు మఠము ఈ లోకమువిడచి ఆ లోకాలకు పోయినా అక్కడా ఆడవారే ఫలం డేది వారితోనే ఆనందం అష్టభోగాల్లో ఆడది అష్టైశ్వర్యాల్లో ఆడది ఇక పేటెను ఇచ్చేమహాతల్లి ఆడదేననుకో ఆడలేక మగ ఈలోకాల్లోకాదు ఏలోకాల్లోకూడలేదు ఆడవారితో ఆనందపడకూడదని ఏశాస్త్రాల్లోకూడా ఉండదు ఆడవారితో హరిచింతనా హరిసేవా దూరమగుతుందని చెప్పడం తప్పు సన్యాసము పుచ్చుకొమ్మనడము మరింతతప్పు మగవాడు సద్వృత్తితో ఆర్జించినది స్త్రీపరిపక్వముచేసి భగవంతునికిచూపి నాల్గు చేతులతో నమస్కరించి తింటూ ఉంటూ మంచిమార్గముతో ఒరులకు అపకృతిచేయక అతిథీ అభ్యాగతిని సత్కరిస్తూ సంతోషముతో కాలము తోసియవలెనంటే అందరికీ అలవి అవుతుందా కానివారు కానిమాటలు మాట్లాడుతారు నమ్మకు కామిగాక మోక్షకామిగాడు అన్నారు. పెద్దలు-కామం అనగా కోరిక అన్నారు-భగవంతుని అనుగ్రహం పొందవలె రాబోవుజన్మ మంచిదిగావచ్చువిధము ఏర్పాటు చేసుకొనవలె పుణ్యము ఆర్జించుకొనవలె మంచి వారనిపించుకొనవలె దైవనివేదనలేక ఏదీముట్టకూడదు పండుగ పర్వదినాలలో శక్తికొలదీచేసి భగవద్నివేదనచేయవలె భార్యాభర్తలు ఒకరికొకరు ద్రోహము చేసుకొనరాదు ఒరుల దుఃఖపెట్టక యుక్తియుక్తముగా కాలము నడుపవలెననునదీ కోరికే కామాన్ని మంచి మార్గానికు త్రిప్పవలెననునదీ కోరికే కామాగ్ని చెలరేగినప్పుడు ఆర్పి ఆదరించే ఆడవారికి ద్రోహముచేయక అంచున పెట్టుకొని బుద్ధిని కైవశముచేసుకొని పాపాన్ని పెంచేకోర్కెల వశవర్తివిగాక బ్రతుకమని త్రిమూర్తులు చెప్పుతూ ఇట్లుండవలెనని వారివారి భార్యల తొడపై కూర్చుండ పెట్టుకున్నారు. నీతొడపైనేను కూర్చోలేదు నాతొడపై కూర్చుండ పెట్టుకొనలేదు నీకింత కోపమెందుకే తెచ్చుకున్న అదృష్టాన్ని దూరము చేసుకుంటావా సప్తమ స్థానములో పాపగ్రహమున్నవాడు వంటిపూట కూడు తినవలెనని వ్రతమూనినట్లు వ్రతము పూనుతావా ఏమి మనము అదృష్ట

వంతులమే రోగగ్రస్తులముగాక కోపగ్రస్తులముగాక దూరగ్రస్తులముగాక నేరగ్రస్తులముగాక అన్యోన్యముగా రతీమన్మథులవలె కాలముగడుపు తున్నాము అందరూ ఈవిధంగా సుఖపడ తెచ్చుకొనలేదు మనము పూర్వము పుణ్యముచేసిన దంపతులము సన్యసించే దెందుకు దీనివల్ల తప్పులేదు.

ఆ॥ దీన శుభములేదు దివ్యకీర్తియులేదు
జగతి పుట్టిపుట్టి చచ్చిచచ్చి
పొరలనేల నెందు పుట్టని చావని
తోవ వెతకికొనుట దొడ్డబుద్ధి॥

అన్నా రేగారి అక్కడా ఏదో వకబాధ ఉండనే వుండును. సుఖంగా పడుకుందామని మంచము సంపాదించుకొంటే నల్లులుపడి బాధించునట్లు మోక్షము సంపాదించుకొన్న పోదు నహుషుడు అథఃపతనముకాలేదా శంతనుడు అధఃపతనమై వచ్చినవాడుకాదా గోలోకమునుండి గోప గోపికలై ఈ లోకములో పుట్టలేదా! భగవద్ కటాక్షము సంపాదించుకొనిపుట్టితే ఈ లోకముకూడా ఆ లోకమునకు సాటియే ఆ లోకముపోను సంపాదన ఈ లోకములోనే యున్నది. యమలోకము పోను సంపాదన ఈలోకములోనే యున్నది. ఏది సంపాదించుకొన ఉద్దేశ్యమున్న అది సంపాదించు కొనవచ్చును. మనము ముందు పుణ్యము సంపాదించుకొన్నాము. సంపాదించినదానికి అనుభవిస్తూ కావలసినంత తిరిగి సంపాదిస్తూ వున్నాము. ఇంతకన్నా రూపము, ధనము, విద్య, భూమి, గృహము, పాడిపంట, బంధు, మిత్రబలము, ఆరోగ్యము, అవయవముల సౌష్టవము, డెబ్బయి ఏండ్లవరకు తగ్గనియౌవనము, రసికత, అన్నంతలో జ్ఞానాంబ చిరునవ్వుతో వాలుచూపుతో చూస్తూ యౌవనము రసికతవుంటే చాలులేండి మిగతవి తమకున్నా లేకున్నా వరవాలేదు రామ రామ రాను రాను శోభనమునాటి పెండ్లికొడుకు అవుచున్నారు. ఇంటికి వచ్చినది అపరసరస్వతియైన కోడలు నవ్విపోతుంది. ఈ ముసలిపీనుగలకు యింకా పులుసు చావలేదమ్మా యని చాటుతుంది కొంచెము జాగ్రత్తగా వుండండి అన్నది జ్ఞానాంబ.

వసేయ్ అపర సరస్వతి అయితే అమాట అనదు అంటూ వుండగనే జ్ఞానాంబ

ఇదెక్కడ నేర్చుకున్నారు వసేయ్ బాయిశాలి పిల్లా భామా నపేనకాలమొచ్చినా తమరు మాత్రము విడువలేదే అన్నది.

ఇవి ముద్దుమాటలే భామా ఈమాటల్లో ఆనందముంది. అన్యోన్యతుంది విలాసము వినోదము మిళితంగావుంది ఇది తెలియనివాళ్లు పేరుతో పిలువలేవూ అని చీదరించు కుంటారు. పాడిచేయెద్దు ముందుగా చీదినట్లు బుసకొడ్తారు నీవు మాత్రము బుసకొట్టవద్దు ఇది అట్లుండనీ అపర సరస్వతి అయితే ఆనందపడుతుంది, అజ్ఞానాంబ అయితే అంటుంది ఇటు విను చింతచచ్చినా పులుసు ఉంటుంది చావదు అవస్థలు మారినా ఆశ చావదు కౌమారమునకు వృద్ధాప్యమునకు సందులో అర్థము పైనా ఆడవారిపైఆశ మరింత హెచ్చన్నారు. ఇలువేల్పును ఇల్లాలిని పూటతప్పకుండా పూజిస్తేనే పలుకరిస్తేనే ముక్తి భుక్తి అన్నారు ఇలువేల్పును మరువలేదు. ఇల్లాలిని విడువలేదు ఆయన్ను మరచి వండి కుడిచేదిలేదు నిన్నువిడచి క్షణముండేదిలేదుచెప్ప వే కొడుకూ కోడలికథా కొంచెము విందాము అని పెన చేయివేసినాడు రంగనాథం.

ఇదేమికర్మము బద్ధమేలేకుండా దిగితిరే అని చేయితీసివేయ పోయినది జ్ఞానాంబ.

రంగనాథం గట్టిగపట్టుకొని చుబుక మంటుతూ జ్ఞానా నాకోరిక ఒకటి వున్నది చెప్తాతా వింటావా అన్నాడు.

ఏదో మంచికోరిక సంపాదించినట్లున్నదే మంచికోరికైతే వినవలసిందే కానీ నీవుకోరడము నేనువద్దనడమునా నేనుకోరినా మీరువద్దనవచ్చు అన్ని అందాలా మీదే పైచేయి అన్నది నవ్వుతూ జ్ఞానాంబ.

కాలానుగుణ్యముగా నాచేయిక్రిందూ నీచేయిమీదూ వకప్పుడు కావచ్చులేవే. అదట్లుండనీ నీవు కుమారునికని ఒక కన్యకకు దానము చేసినావు నీకు ఫలముగలదు కన్యనుగని దానము చేయలేదు కన్యాదాన ఫలము నాకులేదు మాధవరావు తన కుమార్తె పెండ్లికై నాలుగునూర్లు డబ్బు నన్ను అడిగినాడు అతను యిప్పుడు వివాహము చేసేస్థితిలోలేడు కటికబీద వారియింటి నెత్తము మంచిది మంచివారు ఆనాలుగునూర్లు మనము పెట్టుకొని మన సీమంతములో ఆవివాహము మనమేచేసిఇచ్చి ఆ బిడ్డకు చీరలూ రవికలు మనమే జరుపుతూ వత్తాము కన్యాదాన ఫలము నాకుముట్టుతుంది మళ్లీ వచ్చేజన్మలో సమయస్ఫూర్తి వివాహమగుతుంది. అపురూపవతి అనుగుణ్యవతి వచ్చి ఆనందపెడ్తుంది ఏమంటావు అన్నాడు రంగనాథము.

జ్ఞానాంబ చిరునవ్వు ముఖములోనాపి ఏమండీ నన్ను ఈజన్మతో వదలు తారా ఏమి ఇంకొక కన్యకకు దారివిర్పరచుకున్నట్లుందే నేనేమి అపకారముచేసి

నానండీ వదలను న్యాయమేనా అన్నది చిరునవ్వు నాపుకొని దీనత్వముతో.

అట్లకాదే బొమ్మా ఆకన్యాదానఫలం నీలోచేరి రూపమూ జ్ఞానము శాంతము వినయము విధేయత లోకజ్ఞానము గుణము రసికతచూపి నన్ను ఆనందపెట్టును కన్యాదాన ఫలము ఆడవారిలోచేరి మొగవారిని ఆనందపెట్టును వరదానఫలము మగవానిలోచేరి ఆడవారిని ఆనందపెట్టును దానఫలం ఆడమగల మార్చుచు బలము గలిగించును బ్రహ్మ ప్రళయ మొనర్చుదనుక నిన్నువిడువనులే భయపడకు అయితే బ్రహ్మరాక్షసివైపుట్టి నాబ్రతుకు నాయాశ నాశనము చేయకు మన్నాడు రంగనాథం.

అయ్యో తమరు భేతాళస్వరూపమై పుట్టి నాయాశా నాబ్రతుకు పాడుచేస్తేయెట్ల అన్నది జ్ఞానాంబ.

బుద్ధిమంతుని కొడుకును కన్నావు కన్యకకు దానము చేసినావు ఇక కోడలిని బాధించకుండా ఏడ్పించకుండా కొడుకునకు సమాధానము చెప్పుకుంటూ కోడలిని కూతురువలెచూస్తూ పనికి పాటకు సైదోడై తోడునీడై ఉంటే నేను మంచివాడ్నైపుట్టి నిన్నానంద పకుస్తాను ఇంతే ఇందులోవున్న పరమరహస్యం ఏమంటావు అన్నాడు రంగనాధం.

ఏమంటాను మనసీమంతం అన్నావుగా దానీ మనసీమంతము అనాడు చేతాము అన్నది నవ్వుతూ జ్ఞానాంబ.

మన సీమంతము ఇక ఈజన్మలోలేదు. రాబోవు జన్మలో ఉంటుంది. మొదటి గర్భానికే సీమంతమని తెలుసులేవే బొమ్మా కొడుకూ కోడలిదే భామా సీమంతం నీదీ నాదికాదు అన్నాడు రంగనాధం.

నేననేది ఏముంది కానీయండి పుణ్యము ఆర్జిస్తాము. అంటే కాదని ఆపాపం నేనెందుకు కట్టుకొనవలె కన్యాదాన ఫలమనుభవించండి. ఎంత అనుభవించినా తమకు తమిదీరదులే అన్నది జ్ఞానాంబ.

మైథున నిద్రాహారములు తీరేటివిగావే మనిషి ఉన్నంతవరకూ వుండును. అందులో పాపపుణ్యాను సరణముగా లభ్యపడును. చూడు ముందు పుణ్యముచేసే నీకు నలభైఏండ్లకుపైన వయసున్నా నీ ముఖములో చంద్రకళలుట్టిపడుతున్నవి. అన్నంతలో రంగనాధం జ్ఞానాంబ చేజాచి చాలుచాలు వర్ణనచేయవాకండి ఇప్పుడిప్పుడు వయసు తమకు వస్తూవున్నది. ఆశవారి ముఖాల వర్ణిస్తూ ఉన్నారు వర్ణనలో వైనంతప్పి జ్వరంవచ్చేని అన్నది ముసి ముసి నగుత్తో.

జ్వరము ఎందుకొస్తుందే కావలసినంత పాపాలుచేసి ఈజన్మలో ఆలులేక అల్లాడే అధిక ప్రసంగులకు అనాడు మొగోళ్లమని అదుపూ ఆజ్ఞాలేక తిరిగిన గోసంగులకు ముసంగులకూ కాస్తుంది జ్వరము రంభలాంటి ఇల్లాలు మందులసంచి ముందుంచుకొని ఎదురుగా కూర్చొనుంటే జ్వరము ఏమూలనుంచీ వస్తుంది వచ్చెనో సంజీవి పోసి బ్రతికించుకోదు అంతటి సామర్థురాలు సవ్యసాచి ఉందిగా నాకుభయమేమి ఆ మన్మథుని అస్త్రనైపుణ్యము ఇక్కడ పనిచేయదు ఏమే వచ్చినాడు శతృవు అన్నంతలోనే వేయ్ కొట్టు పిక్కబలమున్నంత పరిగెత్తేటట్లు అని అండగానిల్చుకొనే ఇల్లాలు దండిగా వున్నదిగా కాదే ముందుజన్మలో కన్యాదానఫలమే చేకూర్చుకొనక అయ్యేవివాహాలచెరచి ఆడవారి కన్యాయముచేసిన అష్టదరిద్రములకడ పనిచేస్తుంది నాకడ పనిచేయదు అన్నాడు రంగనాథం.

వివాహానికి ముఖ్యమయిన పుణ్యము కద్యాదాన ఫలమేనంటారా అన్నది జ్ఞానాంబ.

ఔను జ్ఞానా ఆలుమొగుళ్లు అన్యోన్యముగా వకరికొకరు నచ్చిన రూపవంతులుగా యౌవనవంతులుగా వకరి నొకరు చూడక వుండలేని ప్రేమస్వరూపులుగా వకరిమాట వకరు ప్రేమతో విను జంటగా వకరి కోరిక వకరు తీర్చుకోగల దంపతులుగా మనవలె పుట్టువారు ఉండవలెనంటే నాలుగైదు కన్యాదానములు కని పెంచి చేసినవారుగానీ లేక బీదపిల్లలకు ఇద్దరికి ముగ్గురికైనా పెండ్లిచేసిన వారుగాని పెండ్లిచేసి జీవితాంతమువరకు కన్నబిడ్డకు నడిపినట్లు చీరలు రవికలు నడిపి పుణ్యమార్జించిన వారుగానీ వివాహములకు ధనము, ధాన్యము కావలసినంతా దానము చేసినవారుగాని వుంటారు. అష్టసుఖములలో అష్టైశ్వర్యములలో అన్నిటిలో అగ్రస్థానము వహించిన స్త్రీ సుఖము పొందవలయునన్న మన ఇంటి బంక మట్టిగాదు చేసిన పాప పుణ్యములే వెన్నంటునని ఇది తెలియక మూఢులు మూర్ఖులు పరమలోభ దేవుళ్లై తమ గతులుగానక పుత్రులకని పౌత్రులకని కూడబెట్టి కూడ బెట్టి కూలిపోయి తిరిగివచ్చి కూడబెట్టిన ధనముపై కూర్చొనునుగాని అనుభవించుటకు జ్ఞానముగానీ దేహసౌష్ఠవముగాని లేక ఏడ్చిఏడ్చి చచ్చెదరు తిరిగీ వచ్చునప్పటికి దేహసంపదా జ్ఞానసంపదా గలిగి అనుభవించవలెనను ఆశ ఉంటేకదా పుణ్యము చేసుకునేది ప్రకృతం తింటేసరి అనుభవిస్తేసరి యనువారు గొందరు పాపమువల్లనో పెనులోభమువల్లనో అర్జించి పేరుగడించినవాడే గొప్పవాడని అర్జించి లెక్కించు

కొంటూ సంతోషించు కుంటూ కూర్చుంటే చాలుననువారు కొందరూ ఉన్నారు వారితో మనకు పనిలేదు త్రిదేవుల పూజించినఫలము కన్యాదానములుచేసిన ఫలము బీదాబిక్కు వివాహాలకు శోభనాలకు వస్త్రములకు ఇచ్చినఫలము పండుగపర్వదినాల్లో తిండికిలేక దుఃఖించువారికిఇచ్చు వంటసామగ్రిఫలం ముత్తయిదువులకు చిన్నపిల్లలకూ పండ్లూపూలు ఇచ్చినఫలం అంతా వకముద్దై మరుజన్మకు నీలోచేరి నీదేహసౌష్ఠవము రూపముఅప్సరసలతలదన్నుతుంది అప్పుడునిన్నుచూచి నేనుమైమరచి ఎడతెగకుండా.

అనులంతలో జ్ఞానాంబ రంగనాధం నోరుమూసి చాలుచాలు కవనముకా మంగా మారిపోయింది తలపిచ్చికి తిరిగింది ముదిరితే వైద్యులు కావలసి వస్తుంది చాలు అన్నది కన్నులలో తళుకు మెరవువలె మెరిపిస్తూ.

తలపిచ్చి వకటేచెప్పితివి ఇంకొకపిచ్చి చెప్పకపోతివే వాటెకు సంబంధ బాంధవ్యమున్నది మొలలో సక్రమముగా మూత్ర పురీషస్థానములు నడుచుచూ ముందు వెనుకలాడక పోయిన తలలో ఏవీజనింపవు వాటెకు అతివృష్టి అనావృష్టి దోషముపట్టి తలలో ధాతువులు వక్రించి తలపిచ్చి వచ్చేది అదితెలియక పిచ్చివారికి ఏమేమోచేసి నానాఫజీతు చేస్తున్నారు వైద్యులు మలమూత్రముల సక్రమ పద్ధతికి త్రిప్పిన పిచ్చిలేదు అదివైద్యవిధాన మటుండనీ మొలలో ముదిరి తలనాశ్రయించు కున్నదని పిచ్చిఎక్కినదని తెలుసుకున్నావుగదేజాణా అని బుగ్గలపై అట్ల వ్రేళ్లతో కొట్టినాడు రంగనాధం.

జ్ఞానాంబ కోపములో చిరునవ్వు చురుకుచూపు మిళితముచేసి తలవంచి తీక్ష్ణ ముగా చూస్తూ ఏల నాలుగునాళ్లకే ఇంత మారిపోయినారు అన్నది.

అన్యోన్యముగా జంటపక్షులవలె ఉన్నదంపతులు నాలుగునాళ్లు ఎడబాసి తిరిగి వచ్చి గూడు చేరుకున్నతోడనే వకరినొకరు చూచు చూపులసొంపు ఒకరినొకరు పిలుచు పిలుపుల మాధుర్యం ఆనడకలోగల చలాకి వకరివెన్నంటి వేరొకరు తిరు గుటలోగలవైనం వకరినొకరు పోతూ వస్తూ స్పర్శించగా తగలగా నిలచి చిరునవ్వు పొడచూపు చూపులలోగల పరమ రహస్యం చుం.

అనునంతలో జ్ఞానాంబ రంగనాధం నోరుమూసి మితిమీరుతున్నది బ్రహ్మ కూకటి దాటుతుందిక దాటనివ్వకండి పుణ్యముంటుంది అన్నది కలికిచూపుతో.

వసేయ్ అన్యోన్యమయిన దంపతుల ఆనందమట్లుంటుంది నీకులేదా నాకులేదా ఈబోకి ఇల్లుచేరెనేమో నని మూతిముడుచుకొను ఇల్లాలు ఈశనిదేవత వచ్చెనేమోనని ప్రక్కకు మూతిత్రిప్పుకొను పురుషుడు అయిన నరకము తప్పదు అట్లకాదేబొమ్మా ఎప్పుడు వస్తుందని ఎదురేక్కి చూస్తూ ఉన్నపురుషున్ని ఎప్పుడు ఇల్లుచేరవలెనను ఇల్లాలవు ఇంకెట్లుంటుంది అనుకున్నావు అన్నాడు రంగనాధం.

జ్ఞానాంబ కోపమూ చిరునవ్వు మిళితముచేసి చిన్నప్పటి చిలిపిచేష్టలు జ్ఞాపకము చేసుకొనుచున్నారా లేక వయస్సు వెనక్కు మళ్లినదా లేకున్న ఇట్లుండరే అన్నది జ్ఞానాంబ.

జ్ఞానా దేహమునకు జరసంభవిస్తూ వచ్చినా బుద్ధికిదీప్తి ఎక్కి వస్తూ వస్తుంది బుద్ధికి లోకానుభవము ఎక్కువ కలుగుతుంది. అనుభవించ వలెనంటుంది ఈఅనుభవ జ్ఞానము ఇరవైవేడులలో స్త్రీపురుషుల కుండి దేహభాగ్యములు చెడనివైన వారిపుణ్యమేమన వలయును వారుఎట్టిపుణ్యాత్ములుగా నుండవలయునోచూడు పురుషుడు ముందుకువచ్చిన స్త్రీ వెనక్కుజరుగుట పురుషుడు వెనక్కు తిరిగిన స్త్రీ ముందుకు వచ్చుట స్త్రీలకు నైజం అగ్నిని అర్పక చెలరేగనివ్వక పెట్టి కుమిలి కుమిలి మండుట గని నవ్వుచుందురు ఇదిస్త్రీల చెలగాటము ఇందులో వకఆనందము గన్పరుతురు ఇదిస్త్రీకి నైజమే ఇదిఅంతయూ నేచేసిన కన్యాదానఫలం నీవుచేసిన వరదానఫలం భగవదనుగ్రహము మనట్టి దంపతులు అరుదుగా ఉంటారు భర్తలేని స్త్రీలు భార్యలేని పురుషులు ఇరువురూ ఉండి అనుభవించుటకు శక్తిలేని మందభాగ్యులు వకరికొకరిపై అనురాగములేక విడివడి దుఃఖించు పావులు ముందు ధర్మరహితులై దొరికినవన్నీ అనుభవించి వకరికొకరు మోసము చేసుకున్నపాపులు ఏ అంగముతో చేసిన పాపము అయంగమునకే తప్పక వచ్చునన్నారు యౌవన మదముతో వావి వరుసలలెక్కింపక చిన్నపెద్దలను భావములేక గురువును గురుతుల్యుల లెక్కింపక సంచరించిన దోషమే జీవుల నీరీతిచేసి దుఃఖింపచేయునది మనము ముందుజన్మలో చేయలేదు ఈజన్మలో చూడలేదు ముందురాబోవు జన్మలోకూడా ఇట్లేఉంటుందనుటకు సందేహములేదు నాబాకీనీవు నీబాకీనేను తీర్చవలసిన పనిలేదు ప్రపంచమంతా వకరికొకరు బాకీనే జ్ఞానా ఇప్పుడు దొరికెనని సంతోషించువాడు వెళ్లివాడు తిరిగీ తీర్చవలసివచ్చును ఇందుకే జ్యోతిశ్శాస్త్రజ్ఞులు పూర్వపుణ్యం పూర్వపాపం అనిరెండు భాగలేర్పరచి చెప్పేది వ్రాసేది జోతిష్యము పరికించిన గుండెదిగులు పుట్టుతుంది

చేసినది పరమాణువుకూడా విడువకుండా మంచిచెడ్డల సినీమారీలు తీసుకున్నట్లు గ్రాంఫోనుప్లేటు లాక్కున్నట్లు మానవులుచేయు సర్వస్వము ఈనవగ్రహ మండలములు తీసుకొనగలవు తిరిగి పుట్టుక వచ్చేటప్పటికి అరీలు ఆ యాటే ఆడును ఆప్లేటు ఆపాటేపాడును అప్పుడు ఆటబాగలేదనీ పాటతలనొప్పి అని ఏడ్చితే ఏమిఃమేలు పరోపకారము దైవచింతన చేస్తూ అపకారము చేయకుండిన చాలు రాజై రాణియై పుట్టవచ్చు ముందునేచేసిన పుణ్యముతో దైవమిచ్చిన భర్తయని స్త్రీ-చేసిన సుకృత దుష్కృతములతో దైవమిచ్చిన భార్యయని పురుషుడు-తలచి వకరికొకరు ద్రోహము చేసుకొనక చేసిన కర్మమని చింతచేయక అనుభవిస్తూ ముచ్చటగా భార్యదేహం భర్తదని భర్తదేహం భార్యదని తెలునుకొని వప్పచెప్పుతూ ఆనందిస్తే మరుజన్మకు మనవలె పుట్టవచ్చును అన్నాడు రంగనాధం.

అంతటి అజగరన్యాయము అందరికీ ఉండవలెనంటే ఉంటుందా మానవ ధర్మము ఎరిగినవారు మీరు మిమ్ముల అనుసరించు దాననునేను ఇదిదైవికము మనవలె అందరూ ఉండవలెనంటే అవుతుందా అయినా ముందుకాలములో కన్యలకు దైవబలము పెద్దలు కల్పిస్తూ ఉండినారు ఎట్లన గౌరీనోములు లక్ష్మీవ్రతములు భారతీ వ్రతములు వేగిలేచినది మొదలుకొని ఆ యా వేళల్లో పూజలు ధ్యానములు చేయిస్తూ బుద్ధిచక్కగా చెప్పినారు చెప్పగల వృద్ధముత్తయిదువులు ఉండినారు ఇక పురుషులకన్ననో బ్రహ్మ చర్యముతో దేహమును బుద్ధిని పెంచవలసిన విధము బ్రహ్మచర్యములోగలబలం అనుష్ఠానములోగలుగు సత్వలం ముందు జరుగబోవు సంసారకష్టసుఖములుచెప్పి మంచి గృహస్థునిగా తయారుచ్చేయు గురువరులు ఉండినారు కాలముబాగా నడచుచుండినది ఇప్పుడన్ననో మమకారము ఎక్కించు మందులేగాని విరుగుడు మందులేలేవు పిల్లలుఎట్ల ముందుకు వస్తారు పెద్దలు ఎట్ల నీతికి నిలుస్తారు అంటూ జ్ఞానాంబ ఇల్లాలి ప్రేమలో కొడుకూ కోడలిసంగతే మరచి పోయినారే అన్నది.

కవనము కామము దుఃఖము చింత పరాభవం దేహమునే మరపించును పీటెలో మైమరచినట్లు దైవభక్తిలో మైమరచితే అప్సరసవై నీవు నాకెమరున్నట్లు భగవంతుడు ఎదురుగనే ఉంటాడు కోరుకోర్కెలు పండగలవు ఎగువమెట్టులో ఉండగలడు అది కుదరదు కుదరకపోయినా షట్కర్మల విడువక ఆచరించుచుండిన శ్రీవారే కుదిరింపగలరు బుద్ధి పరిపక్వానికి రాగలదు పరమాత్మని చూడ

గలదు. అంతదనుకా ఈ సుద్దులు ఈ ముద్దులుపోవు పోకపోయినా తన వస్తువులు తానను భవించుట ధర్మమేలే అంటూ రంగనాథం ఏదీ కొడుకూ, కోడలి సుద్దులు కొంచెమట్లను విందాము అన్నాడు.

కోడలికి నాల్గవమాసము పడినది. వారినడక చాలా బాగున్నది. దీక్షాబద్ధులై జ్యేష్ఠ పుత్రుడే పుట్టవలెనని దైవస్తోత్రము ఎడతెగకుండా చేస్తూ ఉన్నారు. సీమంతమునకు ముహూర్తము ఏర్పాటుచేసి జాబువ్రాస్తే వస్తామన్నారు. ఇక్కడనే జరుగులాగు ఏర్పాటు చేయమన్నారు. సరే నన్నాను అనసూయమ్మవచ్చి వుండినది. ఆమే నేనూ వకేతూరి చేరి వకేతూరి ఇల్లు విడచినాము. తమరీ మమకారమువిడచి ముహూర్తము ఎప్పుడైతే బాగో పంచాంగముచూచి కొడుకునకు వకటి వియ్యాలుంకులకు వకటి జాబులువ్రాసి వస్తుసామగ్రి ఏమేమి కావలయునో సరిచూచుకొనుట మంచిదని మనవి ఈవృద్ధ చాందసముతో బుద్ధిని పోనివ్వకుడని మరొకమనవి అన్నది జ్ఞానాంబ.

అయితే ఇద్దరూ సంతోషంగా ఉన్నారన్నమాట అన్నాడు రంగనాథం.

అయ్యో ఏమిసంతోషమండీ చెప్పనలవియేగాదు అబ్బాడెంతో కొడుకంతేనండీ అయిద్దరి ప్రేమానురాగ పోరాటం ఆ మాటలు ఆ యాటలు వినను రెండుచెవులు చాలవు చూడను రెండు కనులుచాలవు ప్రక్కన చూచువారికి నోటనీళ్లూరేటట్లు ఉన్నది ఈ దంపతులచూస్తే చూచినవారు వారివారి దాంపత్యముల తలంచుకొని చింతించని వారుండరు ముందుజన్మలో తపస్సుచేసి పుట్టి ఉంటారనుకొని తల ఊచి వారివారి జన్మలకై దుఃఖించని వారుండరు అన్నది జ్ఞానాంబ.

అబ్బాడెంతో కొడుకంతే నంటివే అత్తఎంతో కోడలంతేనా కోర్కె ఉండేదీ కొరకొరలాడేదీ ఆశ ఉండేది అవతలుండమనేదీ ప్రీతిఉండేదీ మూతిముడిచేదీ దగ్గర చేరేది దగ్గరకు రావద్దనేది మాట్లాడించేది నాతోమాట్లాడ వద్దనేది చింతలోదిగేదీ ఎప్పుడూ ఇదేచింతఅనేది సరస సల్లాపాలాడేది సగమయినా సరసాలు మానరుగా అనేది చుట్టుచుట్టీ తిరిగేదీ ఎందుకట్ల చుట్టుచుట్టూ తిరుగుతారు అనేదీ వళ్లు కులుకూ కండ్లతళుకూ వలపుపిలుపూ వళ్లుమెరుపూ చూపి శివమెక్కించి పురుషుడు ఆడుతుంటే అయ్యో మీకింకా ఈ తిక్కవిడువలేదే అని విరగబడినవ్వి మరింత చిందుత్రొక్కించేది త్రొక్కడములో కాళ్లుతొక్కితే ఛీ ఛీ ఛీ ఇదేమి శివమో ఇదేమి త్రొక్కడమో మనుష్యుల పీక్కతింటారు చెడత్రొక్కేస్తారు ప్రాణాల తీసేస్తారు దేహాన్ని నులిపేస్తారు రామరామా ఇదెక్కడిశివం అంటూ అర్ధనిమీలితనేత్రాల్లో అమరలోక సౌఖ్యాలన్నటై తొంగిచూచే అత్తకుసరి దీటేనా అన్నాడు రంగనాథం.

రామ రామా ఏమీ తెలియని ఇల్లాలయిన దాన్ని ఈ కంటినీళ్లు ఆకంటికి ఆకంటినీళ్లు ఈ కంటికి పోయించి ముక్కుకుగవ్వకట్టి ముప్పుతిప్పలు పెట్టి ముప్పేరువుల నీళ్లుత్రాపిఉందురు ఇటులోకానుభవం అటు ఇంతో అంతో శాస్త్రానుభవం ఉన్నదాన్నై సరిపోయింది లేకుంటే బ్రతికేపనిగాదు అన్నది జ్ఞానాంబ.

సర్వానుభవాలు ఉండి సేరుకు సవాసేరుగానున్న నన్నేఅట్ల ఆడిస్తాఉన్నావు ఏమీతెలియని వానినైతే గంగిరెద్దునుచేసి తింటావా బసవన్నా పత్తిగింజలు అని కొరడాచూపి తల ఆడించేటట్లుచేసి ఉండవుగా చూడూ కొడుకూ కోడలికథ చెప్పమంటే ఎన్నిచదివి వెక్కిపట్టిస్తున్నావో అన్నాడు రంగనాథం.

అయ్యో నన్ను చెప్పనిస్తేగా చెప్పేది అయినా మళ్లిచెప్పుతాను సూరుదండాలు పెడ్తాను పోయి జాబులు వ్రాయిపోండి అన్నది జ్ఞానాంబ.

కృష్ణుడు గోపికల కోరినట్లు వకవేళకోరితే పెడ్తావా అన్నాడు రంగనాథం.

జ్ఞానాంబ రెండుచేతులతో కండ్లను మూసుకొని సిగ్గునభినయిస్తూ ఓమదన రాజా ఎదనదూరేటట్లు బాణాలు మావారినెందు కేస్తావయ్యా అర్ధవయస్కులపైన అడ్డములేకుండా పడేటట్లున్నావే హరీ నారాయణా అనుకునే సమయంలో అలితో పోట్లాటలు కొట్లాటలు ఇదేమయ్యా నీకు అదుపూ ఆజ్ఞా వేళాపాళాలేదా ఆడా మొగా వకచోటుంటేసరి అడ్డము ఎవరూలేకుంటేసరి ఆదిలించేదేనా ధర్మం కర్మం నీకేమీ లేదా ఇంక మాయింటి అయస్సువదలు ఇంక దేవుడూ దైవమూ అని నాకింత పుణ్యమీనీమొగడుచేసిన పుణ్యం భార్యకు అర్ధమన్నారు భార్యచేసిన పాపం భర్తకు అర్ధమన్నారు ఇదితెలుసుకొని మేము ముందుకుపోనీ కొంచెం ఆయనచేయనీ ఇల్లాలినటుంచి ఇలువేల్పును కొల్చేకాలమయ్యా కొంచెము అదును పదును చూచివాడుకో నీకుపుణ్యాలతో పనిలేదా పాపలోకాలకే పోతావా ఇదేనా నీపని వకతూరి బూడిదయ్యావే అయ్యో లోకంలో నీభక్తులు నీచాతినీచమనక వేళాపాళాలేక పాపాల తాపాలనెంచక వకతూరి పట్టుపదితూర్లు హరతులైనా అలా అమ్మా చస్తున్నా ఇల్లూ వాకిలిగుల్లయినా వీరులు కదనంలో దుమికినట్లు దూచుకపోయి దుముకుతుంటారు వారి ప్రభుడనీవు నీకెంత నియమముంటుంది ప్రభోదండము మావారిజోలికిరాకండి మావారు చాలాభయస్థులు ఖడ్గహస్తులుగారు గృహస్థులు అభయహస్తమిమ్మని అలి మరుగు చేరుతారు నేనేడనీతో పోరాడేది నాతోగాదు దండము పోస్వామీ అని చిరునవ్వుతో వకవాల్చూపు విసిరి వంటగదికి పోయింది జ్ఞానాంబ.

అదిచూచి రంగనాథం నవ్వుతూ శబాష్ పిల్లా అన్నాడు.

జ్ఞానాంబ తిరిగిచూచి ఆ అన్నది వాడచూపులో వయ్యారము కలిపి.

ఊఁ అన్నాడు రంగనాథం అదేవిధంగా.

జ్ఞానాంబ ఫక్కున నవ్వింది. రంగనాథం ఆ నవ్వులో నవ్వుకలిపి పంచాంగము చూడపోయినాడు జ్ఞానాంబ వంట కార్యకలాపాల్లో పాల్గొనింది.

రంగనాథం పంచాంగముచూచి ముహూర్తము నిశ్చయము చేసుకొని జ్ఞానా అన్నాడు.

ఏమీ అని జ్ఞానాంబ వంటగదినుండి తలచూపినది.

ఈరోజుకు పదిరోజులు ముహూర్త ముంటుంది నిడివిచాలదా ఈ నెలలో ఈ రోజే బాగున్నది వానిజాతకాను గుణ్యముగా గురు చంద్రులు శుభులు గురు చంద్రులు కలిసి లగ్నపంచమ భాగ్య ఏకాదశమముల నున్నప్పుడే సీమంతము మంచిది సమయానుకూలముగా గురు చంద్రులు లగ్నపంచమములో నున్నారు పురుషరాశి పురుషుడే పుట్టగలడని శాస్త్రప్రమాణము ముహూర్తము మంచిది దొరికినది ఏమంటావు అన్నాడు రంగనాథం.

తదేవలగ్నం తారాబలం అన్నట్లుగా ముహూర్తం దొరికింది మనవంశములో అందరికీ జ్యేష్ఠపుత్రుడేగా వంశమర్యాదకూడా నూటికి తొంభైవంతులు వర్తిస్తుందికదా అందుకే యిటువంటి ముహూర్తము దొరికినది అటువంటి గ్రహసంపత్తి కుదిరినవేళే అన్వయించినది మనువుని ఎత్తుకుంటారులే యువ్విళ్లూరకండి అన్నది నవ్వుతూ జ్ఞానాంబ.

పురుషుడు అల్లెన్నటికీ తలపడు వివాహమయిన వెంటనే కన్యాత్వముచెడి తల్లిగామారుట తనకర్మమని తలంచును వానికి అనుభవించే యోగములేకనే వెంటనే సీమంతం దాపురించినది కన్య తల్లిగామారుట ఆమెచేసిన పాపమనియే అనవలెను అయిదారు ఏడులయినా ఇరువురూ సుఖపడకుండా దొంగ ఎనుమునకు గుదెకట్టినట్లు అవును ఇరువురిని నిర్బంధపరచే సంతతి కావలెననే వెఱ్ఱివారుంటారా ఏమీతెలియని వెఱ్ఱివారేవారు తెలిసినవారు అయిదారు ఏడులైనా పిల్లలువద్దని దేవునికోరుతారు అన్నాడు రంగనాథం.

అయ్యోరామా పెండ్లిఅయిన సంవత్సరములోనే దగగొన్నట్లు పిల్లలు పిల్లలనేవారు రెండేండ్లు మూడేండ్లు లేకపోతే రెండవ వివాహానికి ప్రయత్నాలుచేసే తల్లి

దండ్రులు పిన్న పెద్దలు ఉన్నారు గొడ్డురాలని భావించి గోలచేసి ఏడ్పించే బుద్ధిమంతులున్నారు కన్యాత్వము చెడుతుంది వయసుచాలక రక్తముచాలక అనుభవములేక దేహము చెడుతుంది పిల్లనుసాకే తాహతులేక బుద్ధినికట్టే శాంతములేక ఓర్పునుపట్టే ధీమాలేక ఓపికపట్టే స్తోమతలేక పిల్లా తల్లీ గుల్లౌతారు స్త్రీలోనున్న మూర్తిపూర్తి పాలిపోతుంది అని ఇప్పుడేవద్దని దేవునికి చెప్పుకునే దంపతులెవరున్నారు ఆవిషయం తెలిసిన తలిదండ్రు లెవరున్నారు ఏమమ్మా కోడలికి పిల్లలా అని నోటితుక్తర మనుష్యులంటే అనీ అనకముందే అందుకుంటుందత్త అయ్యోరామా పెండ్లిఅయి సంవత్సరమయింది పిల్లాలేదు జల్లాలేదు పోతువలె పెరిగిపోతు ఉందమ్మా ఆతగాడు అధఃపతనమౌతున్నాడు ఇది అకాశమంటుతూ ఉంది ఏమన్నా చెప్పదానునుకునేది అయినా నాకేల అత్త ఆడిపోసుకుంటుందని అంటేయెట్ల అనే భయంఅంటూ దానినోరు దీనినోరు వకటీచేసుకొని దానికాలం దీనికాలం వకటేసుకొని గుక్కత్రిప్పకుండా మూడుగంటలుచదివే అత్తగారున్నారు విన్న పిన్నపెద్దలూ ఉన్నారు తమరే ఈ సందులవెతకి చప్పరించే పెద్దలు కానీవ్రాయండి పూర్వజన్మఫలమెట్లున్న అట్లగును మనము వద్దంటే పోతుందా కావలెనంటే వస్తుందా ఆ మహాతల్లి అనుగ్రహం వానికంతే వుండినది. ఇంకా వక సంవత్సరమన్నా గర్భంగానుంటే ఎంతో ఆనందపడుదురు. అదృష్టముండపనిలేదా అనుభవించే భాగ్యములేకనే అప్పుడే ఆటంకమొచ్చియుండేది వ్రాయండి వ్రాయండి అన్నది జ్ఞానాంబ.

రంగనాథం పలానా రోజని కుమారునికొకటి వియ్యంకుల వారికొకటి వ్రాసి బంధువుల కందరికీ రేపు వ్రాస్తానని చెప్పి ఆ రెండుజాబులు పోస్టులో వెయ్యమని పంపి తనకార్యములో తాను నిమగ్నుడయినాడు.

ఆనాడు గురువారం ఉదయం యెనిమిది గంటలకు రాము బయటనుంచీ లోపల వస్తూ వచ్చింది వచ్చిందీ అన్నాడు సంతోషము చిరునవ్వు మిళితముచేసి.

సరోజ లోపలనుంచీ ఎదురువస్తూ హేళనా చిరునవ్వు మిళితముచేసి లేడివలె కనులు త్రిప్పుతూ చంద్రబింబమువంటి ముఖబింబము వికసింపచేసి. వచ్చింది ఏమొచ్చింది జ్ఞాపకమువచ్చిందా శోభనమునాటి పట్లు సురతసుఖాల్లోపాట్లు చుంబనాల్లోకాట్లు జడకుచ్చులయేట్లు జ్ఞాపకంవచ్చినవా అంటూ అందుకొచ్చినది సరోజ.

అయ్యో ఆ జ్ఞాపకం చేయవద్దే పుణ్యముంటుంది. హరిహరులుకూడా ఆ జ్ఞాపకములోపడ్డప్పుడు అన్యాయాలకు ముందడుగు వేసినారు. అబ్బబ్బా ఆడవారలో ఏ

ముంచిన్నాడోగాని బ్రహ్మ హరిహరులుకూడా శివమెక్కి అడుగువేయవలసినదే అజంతా గుహల్లోదూరినా అక్కడికీ ఆ కేకలేవినబడతాయి ఆకలలేవస్తాయి రామ రామా ఎప్పుడూ ఈ చింతేనా ఈ మొగబ్రతుకు బ్రతుకనేరాదు అన్నాడు రాము.

అంతలో అందుకున్నట్లు ఆడబ్రతుకు బ్రతుకుతారా బాగుంటుంది అన్నదినవ్వుతూ సరోజ.

తూ తూతూ ఇంతకన్నామరీ అధ్వాన్నం ఆడబ్రతుకు అసలేవద్దు వకరిక్రింద వుండడం వకరిక్రిందపని.

ఆ హద్దుమీరవద్దు అని రాము నోరు రెండుచేతులామూసి హద్దుమీరి నడచువాడు దండింపబడును. వద్దయెవ్వరూ లేరనుకున్నారా ఇప్పటినుంచే నావద్ద ఇంకొకరున్నట్లే భావించండి. హద్దులుమీరినడిచ్చే బుద్ధిమంతులకు వృద్ధి అడ్డమేననుకోండి అయినా ఆతల్లి అదుపులోపెట్టి ఉంచేకదా వలపులో పెట్టింది నారీభారతం బాగానేర్పింది చిలిపిచేష్టలన్నీ అకారాది క్షకారాంతంవరకు తప్పకుండా నేర్పింది అంటూ రొమ్ముల గుండీల సవరిస్తూ అయితే అడా మొగా గాని బ్రతుకు బ్రతుకుతారా డక్కీ చేతికితీసుకొని బాగా ఆడవచ్చు పాడవచ్చు ఆడవారిలో మొగవారిలో తిరుగవచ్చు బాగా చేతులు విసురుతూ కులుకుతూ నడువవచ్చు భయములేక తిరుగవచ్చు అని నవ్వినది సరొజ.

ఛా ఛా ఆమాటంటావేమే స్త్రీ పురుషుల అవమానముచేసి అన్యాయాలుచేసి గర్వోన్మత్తులై గాంభీర్యము ఘనతాచూపి డాంబికులై ప్రతిమాటను తప్పుపట్టుతూ ప్రతివారిని హేళనచేస్తూ ప్రతిదీ తనదే పైచేయిఅని గర్వించి తిరిగిన జోగులు అట్ల తయారవుతారు వారిముఖము చూచినాపాపమే అట్లకాదేజాబా పెద్దపెద్ద వుద్యోగస్థులు ధనికులు వేసవికాలాల్లో యెండవేడిమికి తాళలేక విశ్రాంతి అని నీలగిరికి పోయినట్లు నిన్నుతీసుకొని ఇంద్రలోకంపోయి విశ్రాంతిగా కొంతకాలం ఉందామనుకున్నాను దేవతలకు గర్భాలులేవట బిడ్డలు అసలేలేవట చావుపుట్టుకలు అసలేలేవట వున్నసంఖ్య పెరిగేదీ విరిగేదిలేదట ఎప్పటికీ ఇరవైఅయిదేండ్ల వయసేనట జరసంభవించేదేలేదట ఎప్పటికీవకే యౌవనము ఎప్పటికీవకే ఆనందంఅట ఈలోకంలో వుంటే ఈ గర్భాల్లోవకపోరు ఈ బిడ్డల్లోవక కంగారు ఛ ఛ పగవానికి వద్దీ పాడులోకం ఏదో కొంతకాలం హాయిగా భార్యతో సుఖపడదామని గంపెడాసతో వుంటే వెంటనే గర్భభారం గర్భభారం అంటారు ఇంకొద్దీలోకం నీలగిరికిపోను డబ్బు అవశ్యకం దేవలోకంపోను భక్తి అవశ్యకం టికెట్టు తెచ్చినాను పాపోదాం

పోతేనే ఈగర్భభయాలు పోయేది ఆశయాలుతీరేది పా పోదాం అని జాబుచేతికి ఇచ్చి టికెట్ అన్నాడు రాము.

సరోజ మామవ్రాసిన జాబుచదివి అయ్యోపాపం అందుకేనా ఈ గడ్డము పెంచివుండేది. ఆ లోకానికి పోయేవారికి తెల్లగడ్డం వుండవలెనేమోనే నల్లగడ్డం వారికి ఆ లోకంలో చోటువుందా ఈ లోకం పోనిస్తుందా ఈ ఆశల్లో అదికనిపిస్తుందా వినిపిస్తుందా మైమరపించే భార్య వళ్లు చిగురించే తగుచర్య పరిచర్య అటుపై నాన్నా అనేపిలుపూ పిలుపులో మరొకపిలుపూ పిలుపుల్లో వలపుల్లో కాళ్లాడుతాయా తలెత్తి ఆలోచన చేయండీ అబ్బా నేను రాను గర్బాలూలేవు గిర్బాలూలేదు పాపంలేదు పుణ్యంలేదు చావూలేదు పుట్టుకాలేదు అన్నంలేదు సున్నంలేదు ఎన్నాళ్లు పుట్టక చావకవుంట్గది. అన్నము తిన్ననోరు అందులో ఉప్పు కారము పులుసు పూర్తివాడకం వున్ననోరు ఎన్నాళ్లుకట్టేది శుద్ధబెల్లమువంటి తీపు అమృతాలు ఎంత నిత్రాగేది వెగటుకావు ఇక్కడనే పంచామృతాలుచేసి దండిగా త్రాపుతాను దొరా నామనవి ఆలించి ఆలోకానికి నాకు దానంచేసిన ఈ దేహాన్ని తీసుకొనిపోవద్దు నీ దేహంపైన నీకు గుడ్డి గవ్వంతయైనా అధికారములేదు. దేవునిదగ్గర దావాచేస్తా భద్రంసుమా అయినా అన్నము అందరికీ కల్పించేందుకు రాజ్యాలు ప్రజారాజ్యాలై బాధపడుతూ వకటొకటిగా కల్పిస్తూ ముందుకు పోతూవుండేది చూచి అన్నములేని దేశానికి పోదామంటారు. ఎందుకు అన్నములేక కట్టను బట్టలేక పిలిస్తేచాలునని పెట్టితేచాలునని ముక్కోటి దేవతలు అక్కడనుంచీ ఇక్కడికి వస్తుంటే ఇక్కడ నుంచీ అక్కడ పోతారా అన్నంపెట్టి పుణ్యమార్జించి అక్కడికి అవతల మెట్టులో కూర్చొనే సంపాదన ఇక్కడే వుండేదని అందరూ చెప్పుతుంటే అక్కడెక్కడ పోతారు. ఇక్కడే వుండండి. పుణ్యముంటుంది సంపాదించుకుంటే అక్కడుంట్గది కలిసిమెలసి ఇక్కడనేవుంది. నీ దేహంపైన నాకు హక్కువుంది నేనెక్కడ విడుస్తా పంపేటట్లువుంటే నీ దేహమయిన నను పంపించుకోండి అన్నది సరోజ.

ఓ వంటరిగా అక్కడ పోయినా ఆడవారికి అగచాట్లే అందులో రూపవతులకు పడుచుపిల్లలకు పూర్తిగిరాకిపూడు వంటరిగా దొరికెనని అదవయైన మునిభార్యయని తనకు బలమున్నదని అహల్యపై ఇంద్రుడు దాడిచేయలేదా మొగవెంటలేకుండా ఆడపోతే నీలాటివారికి అన్నీఅవుతాయి వద్దు వంటరిగా పోవద్దు గౌరవాలు గౌరవనీయులూ అక్కడా ఇక్కడా వకటే అన్నాడు రాము.

అట్లయితే నల్ల వెంట్రుకలు పండితెల్లగగానీ ఈదేహంతో ఈ వయసులో ఈ వేషంతో పోతే అక్కడ అప్సరసలు ఉన్నారట ఈ వేషం ఈ వయసుచూచి వారుకోరితే అయ్యో మాది హిందూదేశము భారతీయులము ప్రవరాఖ్యుని కథమీకు తెలుసుకదా అంటే అర్జునునికథ చదువలేదా అని వారికివడ్డించిన శాపంమీకువడ్డిస్తే అవేషంనేనుచూడలేను వద్దు అలోకానికి భ్రష్టుముండలు మనసు పట్టలేని బుద్ధిహీనులు అక్కడా ఉన్నారు గడ్డానికి మెరుగువేస్తా కడుపుకు తరుగువేస్తా పంచామృతాలు చేసియిస్తా వద్దుగర్భంఅంటే వదలేస్తా మీవంటి కళాపిపాసి ప్రేమోపాసి నౌకరి తొందరలో అందిస్తా రండీఅని కండ్లల్లో పండ్లల్లో తళుకును జతజేసి రాముపై విసరినది సరోజ

అబ్బా అన్నాడు రాము.

ఏమి అన్నది సరోజ.

ఆకండ్లలో పండ్లలో తళుకు తొలిముంగారవు మెరుపై కండ్లు మూతపడి నవేజావా ఆతళుకే కాలకంఠుని గుట్టు రచ్చకెక్కించినది నన్నుబ్రతుకనిస్తుందా పంపకే వళ్లువేడెక్కుతుంది మైజల్లరిస్తుంది అన్నాడు రాము.

చల్లబడేటట్లు కొంచెము కాఫీ త్రాగండి ఊరికిపోను ఏమికావలెనో చూడండీ భార్యమనవి ఆలించండి చిత్తగించండి అన్నది సరోజ.

ఏమికావలె అయినదంతా తయారయిచావు నన్ను వేషభాషల్లో మార్చినావు ఏమిరా తమ్ముడూ గడ్డంపెంచినావు అని ఎవరన్నాఅంటే అన్నాముందు నీకొచ్చిన కష్టాలేనాకూ దాపురించినవిరా అంటాను తెలుసుకోలేక తికమకలైతే మరదలు అని చేత్తో ఇట్లచూపిస్తా సామానులంటావా కొడుకూ కోడలు చేసినదానికి అమ్మానాన్నా అన్నిసవరించి వుంటారు కూతురు అల్లుడు చేసినదానికి అత్తామామా కావలసిన వస్త్రాలు తెస్తారు పా రేపుచూడు నాప్రతాపం మంచి దోవతులుతేకుంటే పీటల మీదికి నేనురాను అప్పుడు అత్తా మామకుచింత అత్తకూతురికి వంత అన్నాడు రాము.

మాయత్తా మామా మంచి చీరతేకుంటే నేనూ పీటల మీదికిరాను అన్నము తినను నీళ్లుత్రాగను అప్పుడు అత్తామామకు చింత అత్తకొడుక్కు గిలిగింతా అత్త కొడుకు గడ్డముక్రింద చేయిపెట్టి ఏమి నామాటవిను నేనుతెస్తాను నామాటనమ్ము అని అడుక్కొన్నంతవరకు తెలుసునా అని ప్రణయకోపము ప్రణయోద్రేకము కలిపి తలఎగరవేసినది సరోజ.

అట్లననులేవే అనేవాళ్లు అనిపించుకునేవాళ్లూ వేరేలే సైకల్ మోటారుసైకల్ తేకుంటే శోభనంచేసుకొను అడిగినంతా పైసాతక్కువలేకుండా వుంటేగాని తాళి గట్టబోను అప్పుడప్పుడూ అడిగినవన్నీ ఇవ్వకుంటే కూతుర్ని పంపమంటే పంపను పండుగలకు పర్వాలకు పెండ్లిండ్లకు పేరంటాలకు పంపమన్నా రమ్మన్నా పంపనూ రానూ అని ఎగనీల్గి అత్తామామతో అనపించుకోను ఆలిప్రేమను వద లించుకోను అన్నాడు రాము.

వారు మతిహీనులు పాపపుణ్యవిచక్షణ తెలియని జోగులు ప్రభూ తీసుకున్నది మరుజన్మకు ఇవ్వవలెనని తెలియని బైరాగులు యాచనసేయక వచ్చినదానికి సంతృప్తిపడుట శ్రేయమని ఎరుగని బుద్ధిహీనులు వారితోపనిలేదు మహాపూరుషా ఏమేమి కావలయునో యోచించండి అన్నది సరోజ.

ఏమి కావలయును చీరలు పంచెలు మా అత్తా మామా తెస్తారుగా ఇంక చీరా రవిక ఎట్లాటివి కావలెనో చెప్పు తెస్తాను అన్నాడు రాము.

అయ్యో నన్నడుగుతా రెందుకు తమ కులకాంత ఏరంగుచీర కట్టుకుంటే మీకందముగా వుంటుందో మీమనసును అడగండి చెప్తుతుంది భర్త మనోవర్తియై భార్యనడువవలె భర్త ఇష్టానుసారముగా ప్రవర్తించవలె భర్తమనోగత మెరింగి నడువవలె భర్తకు యిష్టమయినది. చేసిపెట్టి తాను కుడువవలె భర్త ననుసరించి తిరుగవలె భర్త ఆరోగ్యమెరింగి శృంగారించుకొనవలె భర్త ఇష్టా యిష్టముతెలిసి రుచులెరింగి వంటచేయవలె మనసెరింగి సమయముతెలిసి మాట్లాడవలె భార్య మనసుకు నచ్చినది అన్నదేదైనా ఇందులో వున్నదా చూడు తమకేదినచ్చునో ఏది మనసాకర్షించునో ఏది మనసును రంజింపచేయునో ఆరంగు అచీరతెచ్చిఇవ్వండి మనసారకట్టుకుంటాను మనసారాచూచి మనసేమంటుందో మళ్లిచెప్పండి శాస్త్రము చెప్పేది ఇంతే ప్రవర్తించవలసినదీ ఇంతేగా పురుషులదయ స్త్రీల ఇదృష్టము అంతామీదే అన్నివ్రాతలుమీవే అన్నది నవ్వుతూ సరోజ.

ఉపాసనా వుద్వాసనా రెండూ చెప్పినావుగదే సై చదువుకున్నందుకు ఫలం చూపినావే అట్లకాదే భామా భర్తకురుచి ఏదో తెలుసుకొని చేసిపెట్టితే కడుపారా తింటాడు. పుష్టిగా వుంటాడు సంతుష్టితోపుష్టి పురుషుని సంతుష్టిలోపుష్టి సృష్టి ఆగి ఆణగివుంది సత్తువపెట్టినయేడు పుట్టెడు పండుతుంది భూమి సత్తువవేయని యేడు పాతిక పండుతుంది పురుషునిసంతుష్టిలోపుష్టి స్త్రీల ఆనందం అణగి

ఉంది కట్టెలో అగ్ని అణగిఉన్నట్లు రక్తంలో వీర్యము దాగిఉన్నట్లు పాలలోవెన్న ఉన్నట్లు ఉంది పురుషుల సంతుష్టులచేసేది స్త్రీల ఆనందముకొరకే చెన్నంగి తవుడు చెన్నంగిబియ్యము పిల్లపీచరగడ్డలు తుంగగడ్డలు మొదలగు బలపదార్థములు పాడి ధేనువులకు రుబ్బిపోసేది రైతుబిడ్డ పాలకొరకే స్త్రీ పురుషుని దేహముతగ్గకుండ కాపాడేది సౌఖ్యముకొరకే ఇక భర్తకునచ్చిన అలంకారము చేసుకున్న భర్తమనసు ఆకర్షిస్తుంది మనసు రేకెత్తిస్తుంది మగువ ఆనందిస్తుంది అదీ స్త్రీ మేలుకే గృహస్థుడు గృహస్థుని ఆర్జన కుక్క పిల్లి మొదలగునవన్నీ స్త్రీ మేలుకే పురుషునిమేలు కొకటీ లేదు నీవుతినేదికూడా నాకేపెట్టి పుష్టిగా ఉండేటట్లు చూచుకుంటివా సుఖపడతావు లేకుంటే ఊహూ బంధు బంధు బంధు అష్టదిక్కులూ బంధు అంతరిక్షం బంధు పై ఊర్ధ్వలోకాలు బంధు క్రిందీ అధోలోకాలు బంధు అంతాబంధు అన్నాడు రాము.

అయ్యో పాపం కర్షకుడు ఎరువుపెట్టేది భూమికొరకు గావలె తనకొరకుగాదు పురుషులు స్త్రీల అలంకరణార్థము వస్తువులుతెచ్చి ఇచ్చేది తనఆత్మానందానికికాదు స్త్రీల ఆత్మశాంతికేమో పాపం ఇదిఅంతా మాకూతెలుసులే అన్నది సరోజ.

స్త్రీ పదేడుల వయసునుంచీ ఆతళుకు ఆబెళుకు ఆవలుకు ఆహాయలు చూపేది పురుషునికొరకేగావలె తనకొరకుగాదు కంటితళుకు వంటికులుకుచూపి పురుషుని మరపించుకొని తనమనోభీష్టం తీర్చుకొననుగాదు పాపంనాకుతెలుసులేవే ఈమర్మం ఆకాశంనుంచీ చినుకులు పడకున్నా భూమిసస్యశ్యామల మౌతుంది ఫలిస్తుంది కౌనన్నాడు.

నాల్గు చినుకులు పడిపోతే నానాకష్టాలలో నానావస్తూత్పత్తిచేసి ప్రజలకందిచ్చేది ఆకాశముగావాలె కష్టమూ నష్టమూ గగనానికేకాబోలు నాకెందుకు పాతచీర కట్టుకొని బయలుదేరమన్నా ఊ రడీ అయ్యగారికే అవమానము భూమిపండకుంటే వర్షాన్నే అనేది భూమినిగాదు మంచిచీరతెస్తానండీ కాఫీతెస్తా మనసారా త్రాపిస్తా ఆనందాన్ని గలిగిస్తా పరమోల్లాసము వెలిగిస్తా తెస్తానంటూ పోయి కాఫీతెచ్చి త్రాపినది.

ప్రపంచములో పురుషులు స్త్రీకొరకై రాజ్యాలు పోగొట్టుకున్నారు. ప్రాణాలూ పోగొట్టుకున్నారు స్త్రీకొరకై పోగొట్టుకొనని దేదీలేదు. స్త్రీకన్నా విలువైనదేదీ లేదు. అమృతమూ, హాలాహలము స్త్రీనే సరోజా నీ దేహచ్ఛాయ ఎట్లున్నదో అట్లా టీరంగే కావలెనని వెతకి వెతకి తెచ్చినాను ఆ పుస్తకాల మధ్యలో నున్నదిచూడు నాకు కాఫీ త్రాపినఋణం తీరుతుందో తీరదో అన్నాడు రాము.

ఆతురతగాపోయి సరోజ తీసిచూచి సిగ్గు నభినయిస్తూ ఇక్కడికి తమప్రీతి తీరినదా నాదేహచ్ఛాయ చీరచ్ఛాయలో ఎప్పుడూ కన్నుల చూచు చుండవలెనని ఆసించినట్లున్నది. నాదేహచ్ఛాయ, ఈ చీరచ్ఛాయ ఒకదానికొకటి తీసిపోదు. నాకు సిగ్గగుతున్నది అబ్బా తమకు ఎంతదయ ఎంతప్రీతి నాపై వున్నది. ఇప్పుడు ఇంకా తెలిసినది అయ్యో నా యానందము వెలిబుచ్చి మిమ్ముల ఆనందపెట్టుటకు పసిఫిక్ మహాసముద్రము అడ్డమున్నట్లు వ్రతము అడ్డమున్నది. ఏ విమానమో ఓడో తీసుకొని పోదామంటే మహామేరువువలె ధర్మము అడ్డమున్నది ప్రభూ తండ్రి గుడ్డలు తెచ్చి యిచ్చినప్పుడు దైవముదగ్గర పెట్టి నమస్కరించి కట్టుకొని తండ్రికి తల్లికి నమస్కరించేదాన్ని అప్పుడు కన్యను ఇప్పుడు ఇల్లాలునునమ్మిన ఇల్లాలికి ప్రీతిగా తెచ్చి ఇచ్చినారు వ్రతము ధర్మము అడ్డములేకున్న అప్లేపైబడి దేహాన్నిమరచి దేహసౌష్టవమంతా మీసొత్తుచేసి ఆనందాన్ని వెలిబుచ్చి ఆనందింపచేసివుందు ప్రకృతం ఏమీ చేయలేనిదాన్ని రేపు త్రిదేవులకు సమర్పించి అలంకరించుకొనివచ్చి నొసలు పాదములు సోకునట్లు నమస్కరిస్తాను మనసారా ఆశీర్వదించండి అంతే ఈ దాసురాలు చేయతగ్గసేత తనభర్త నాలుగుపూలుగానీ కాయో పండోగాని తెచ్చి చేతిలోవేస్తే స్త్రీ హృదయానందము బ్రహ్మకూకటి దాటుతుందన్నారు అప్పుడే అక్కడే తన ఆనందాన్ని వెలిబుచ్చుతుందన్నారు. ఇంతవిలువైన చీరా రవికాతెచ్చి పట్టుమని చేతికిస్తే నాయానందాన్ని వెలిబుచ్చి మిమ్ముల ఆనందపెట్టుటకు వారాసివలె వ్రతము ధర్మము అడ్డమొచ్చినది దాసురాలి ఆనందము దండముతోసరి ప్రభో అన్నది సరోజ.

సరోజా! గోరంతను కొండంతగా పొగడుతూ ఆనందాన్ని వెలిబుచ్చుటకు వేళగాకపోయెనని చింతిస్తూ ఉన్నావు కొండంత తెచ్చిఇచ్చినా గోరంతగాచూస్తూ భర్తను నిర్లక్ష్యముచేసి మాట్లాడుతూ తానుచేసినకర్మ భర్తపైపెట్టి యౌవనము లేనివాడని రూపహీనుడని మాటలు చేతగానివాడని ఏవీతెచ్చిఇవ్వలేని వాడని అప్రయోజకుడని అనామికుడని అర్జనచేయలేని వాడని ప్రజ్ఞావంతుడు కాడని దాస్యముచేసి జీవించువాడని తూలనాడుతు మమ్మెత్తిపోయుచు మెటికలు విరచుచు తన్నాసించిన తానాసించక చెంతచేరిన తోకత్రొక్కిన నాగువలె కొనతోకపైనిల్చి బుసకొట్టుతూ కాటందే కామినీ కాలసర్పములు ఉన్నారు దయ్యమైపట్టే దైతలున్నారు ఇట్టిభర్త దొరుకుట నాకర్మమని కర్మను ఎదిరించి కామితము లందుకొనుట ఎట్లని యోచించు వనితలేదు కట్టుకున్న వానిపై కాటుకుతిరిగే కామినులున్నారు వారివలెగాక యింత

ప్రీతిగా మాట్లాడే భార్యదొరికినందులకు నాయదృష్టమును నాలోనేను పొగడు కుంటూ కాలమును ఎదురుచూస్తాను అన్నాడు రాము,

వారికర్మమును వారుతెలుసు కొనలేక వరులనిందించేవారు బుద్ధిహీనులు వారు సంస్కారములేని జీవులు సుకృతముచేసి భర్తను స్త్రీ సంపాదించు కొనవల యునని పురుషుడు పుణ్యముచేసి భార్యను సంపాదించు కొనవలయునని ధర్మము నకు లోబడి దైవమునునమ్మి దైవమిచ్చినభర్తగాని తలిదండ్రులుచేసిన వాడుకాడని తానుచేసిన పూజాఫలము ఇంతేనని తప్పటడుగులు వేయక కట్టుకున్నభర్త ఆశీర్వా దము తానుగొల్చు దైవఆశీర్వాదము పొందిన స్త్రీదే. మరుజన్మ ఆమెను మించిన స్త్రీలు ఆమె సౌఖ్యమునకు మించిన సౌఖ్యము మూడులోకాలలో ఉండదు ఇంతో అంతో చేసికదా నాకు అన్నీతెలిసిన అత్తా మామా.

కం॥ శ్రీయును కులమును రూపము
ప్రాయము శుభలక్షణంబు బాంధవవిద్యా
శ్రేయముగల వరునకు క
న్యాయుతుగా జేయవలయు నధికప్రీతిన్!

అన్నట్లు అన్నీ అమరిన తమరు దొరికిఉండేది నాయానందానికి మేరేలేదు ఇప్పుడుభర్తను అవమానపరచి నిరాదరిస్తే మరుజన్మకు తన్నవమానపరచి నిరాద రణచూపే భర్తఎదురౌతాడనీ భర్తకు తెలియక తానుసుఖపడితే తనకు తెలియక సుఖపడేభర్త ఎదురవుతాడని తెలియచెప్పేవారు లేకనే ఎక్కువమంది చెడిపోవు చున్నది భర్తేతన బ్రతుకుతెరువని భర్తేతన ఆనందాల మూటయని భర్తేతన జీవితాశ యాల కల్పవృక్షమని భర్తకు మించినవారు తనకు ఎవరూలేరని స్త్రీ తెలుసుకున్నా భర్త అన్నదానికి భర్త కోపముతో చేజాచినదానికి భర్త చేసినదానికి భర్తహేళనచేసిన దానికి భర్త అబలుడైనదానికి భర్త సంపాదనచేయలేని దానికి భార్య చింతించదు రోషగించదు ప్రాణత్యాగము చేసుకొనదు దూరము చేసుకొనదు ఇదంతా తనకర్మ మేనని త్రిసంధ్యలా త్రిమూర్తులతో త్రిదేవులతో చెప్పుకుంటూ దూరముచేసినా సమీపించుతూ తూలనాడినా రోషగించక సంతోషము వెలిబుచ్చుతూ సాధించుకొని సుఖపడును శాంతము కార్యసాధనచేయును అన్నది సరోజ.

ఏమి నేర్చినావే పిల్లా అన్నాడు రాము.

మీనోట పిల్లా అంటే ఆ పదంలో ఎంత మాదుర్యమున్నది. నా యంతరాత్మకు తెలుసు నిండు జవ్వనమునకు రెండు రెక్కలుమొల్చి రెప రెపాకొట్ట బుద్ధి పుట్టుతుంది. నిండుగాపూచి తులతూగుతున్న పూలచెట్టుపై వాలుటకు తుమ్మెదకెంత ఆనందముండునో అట్లుంటుంది పిల్లను పిల్లగా వుండనివ్వక తల్లిగా మార్చితివి పిల్లవాడుగా వుండక తండ్రిగా మారితిరి ఇంక పిల్లా అంటే నేనూరుకోను ఓ పిల్లలతల్లీ అనండి పిల్లలతండ్రీ అని పిలుస్తాను అంతేకదూ అని తనప్రీతిని వెలిబుచ్చుటకై చిరునవ్వు వెన్నెలలు వెదచల్లినది.

పిల్లా అంటే పిడుగువలెపడి ఏమీ పిల్లోడా అనే పిల్లలుంటే చల్లగ మాట్లాడతావెందుకు ఒకనాడైనా కోపము కల్పించుతాము ఆ కోపరసము నీ ముఖములో ఎట్లుండునో చూతాము అనుకుంటే మరింత చల్లగవుతావెందుకన్నాడు చిరునవ్వుతో రాము.

పిల్లా అని ప్రీతిగా భర్తపిలిస్తే వకచిరునవ్వు నవ్వి చాలా పెద్దవారు పిల్లను తల్లిగా మార్చటానికి ప్రీతిగా పిలుస్తున్నారు. అయ్యో పాపము తెల్లగడ్డము వచ్చిన మామయ్యగారు వయసు చెల్లింది కూర్చుండ పెట్టవలెనా లేవబట్టవలెనా లేక అని నవ్వి వక విసురట్ల విసరి వాలుచూపుల వలలోవేస్తే ఆవు వెంటవచ్చు కోడెభంగి అని నవ్వినది సరోజ.

ఆతెలివి అందరికీ ఉండవనిలేదా అన్నాడు రాము.

అమ్మతో సంస్కరింపబడి ఉంటే అందరికీ ఉంటుంది సంస్కారము లేనివారు ఏమిచేయగలరు పాపము భర్తహేళనచేయక యింకెవరు చేయవలెను రోషగించుకుంటే మరొకతూరి ఎట్లచేస్తాడు ఇదెక్కడనో చీదరగొట్టు పశువని దూరమౌతాడు రోషగించుకొనక తగురీతినవ్వుతూ సమాధానమిచ్చి తనఆనందానికి చోటుఇస్తే మరునాడు మర్లుమందుతిన్న మానవునివలె పొగలేటువేసిన ఆవులవలె వెన్నంటి చిలిపి చేష్టలు ఎన్నోచేసి చేయించు కుంటాడు కోరినకోర్కెల పండిస్తాడు వేగిలేచినది మొదలు పలుదోమను పల్లుపొడి నీళ్లు ఇచ్చి వచ్చులోపల తుండుపంచె తుడుచుకొననిచ్చి తుడుచుకొను లోపల అద్దము దువ్వెనయిచ్చి దువ్వుకొను లోపల కాఫీయిచ్చి ఇట్లనే నాదువ్వకునేది అని కొంచెము నూనెపట్టించి రుద్ది చక్కగాదువ్వి ఇప్పుడు బాగున్నదని వకచిరునవ్వునవ్విన అతని హృదయములో నిల్చుకొన నెలవేర్పడును స్నానానికి వేడినీళ్లుతోడి రండనిపిల్చిపోస్తూ వీపు మొదలుకొని అపాదమస్తకమురుద్ది

స్నానము చేయించి వళ్లుతుడిచి కట్టుపంచె పైపంచెయిచ్చి పంచెకట్టుకొనులోపల అద్దము దువ్వెన శ్రీచూర్ణముగాని గంధముగాని విభూతిగాని తిలకముగాని వారికేది యిష్టమో అదిపీటవేసి పీటదగ్గర పెట్టి పెట్టుకొనులోపల క్రాపును కొంచెము సవరించి ఆకువేసి భోజనముపెట్టి భోంచేయునప్పుడు యింకకొంచెము యింకకొంచెమని వేయుచుంట పారవేస్తాననిగాని తీక్షణమైనచూపు చూచినగాని నవ్వుతూ పారవేసినభాగస్థురాలను ఉన్నాగా భయములేదులే అని భోంచేయనిచ్చి చేయికడుగుకొను నప్పుడు సహాయపడి నీళ్లిచ్చి తుండుపంచె అందిచ్చి ఆకువేసుకొనకుండా పాన్ బిడాచుట్టి నోటికి అందిచ్చుటగాని మడిచి యిచ్చుటగాని చేసిన ప్రాణం ప్రాణములోలీనం చేయక ఎందుపోగలడు తేనెలోపడిన ఈగ చందమగును ఈపరిచర్యలు భర్తకు మర్లుమందు భార్యను విడచి క్షణముండగలడా గూబలై ఎగనీల్గిన గూట్లో పారవేసి ఊరుతిరుగబోతారు వారికిసంతోషముంటేకదూ రాగిరొట్టె రాగిఅన్నము తింటూ జీవనముచేసే దంపతులుకూడా భార్య భర్తననుసరించి భర్తకోరకపోయినా సపర్య చక్కగాచేస్తూ ఉండే కష్టమనక రెక్కలువిరచి రాత్రింబవళ్లు కష్టముచేసి ఆలుపిల్లలకు పెట్టుతూఉండేది కామాని కొక్కదానికేగాదు కర్మజాలక కాలముతీరి స్త్రీ గతించినా తలపునకు వచ్చినప్పుడంతా కంటనీరు వకచుక్కైనా భూమిపై విడువవలయును పీడముండ పోనీలెమ్మని సంతోషించు విధముగా చేసుకొనరాదు ఇది దాస్యలక్షణం రూపముకూడా వున్నదానిలో చక్కగాపెట్టుకొని భర్తకు ఇష్టమయిన వేషము ధరించి తల గుడ్డలు వళ్లు మాపుకొని కుటుంబిని ఎట్టున్ననేమని విరియబోసుకొని పిశాచిరూపమెత్తి దగ్గరివారికి దుర్గంధపు వాసనకొట్టునట్లు చేసుకొనక భర్త మనసు ఆకర్షించువిధముగా చూచుకొనవలయును ఇది రెండవలక్షణము అన్నాతో డనే సరోజ.

ఓ నీవనేవి నాకు జ్ఞాపకమునకు వచ్చినవి షడ్గుణములు దిగితివే దిగరాని చోటికి భార్య అట్లు దాస్యము చేసినప్పుడు పురుషుడు వెన్నాడపనిలేదా కోరినా కోరకున్నా శక్తికొలదీ చీరలూ గీరలూ రవికలు గివికలు సొమ్ములూ సొమ్మందాలూ తిండీ తీర్థము బాగూ ఓగూ సర్వమూ చూచుకుంటూ అప్పుడప్పుడూ దేహస్పర్శ కరస్పర్శచేస్తూ ఇంటినుండి వెలుపలికి పోవునప్పుడు బైటినుండి యింటికి వచ్చినప్పుడు గాఢాలింగన చుంబనలతో ఆనంద పెట్టుతూ మైమరపించి కష్టసమయములలో కార్యకలపాలలో సైదోడై తాను తనదేహమును చక్కగా వుంచుకొని భార్య ఆకర్షించునటుల వున్నకదా పురుషుడు పురుషుడయ్యేది అన్నాడు రాము.

ఔను మంత్రియై కుటుంబపు చిక్కులతెలుసుకొని తగునుపాయముల చెప్పూ చూ యుక్తి యుక్తముగా సమయమెరింగి సహాయముచేస్తూ వలదన్నదానికి పట్టుపట్టక భర్త మానప్రాణములకు అంగరక్షకియై బంధు మిత్రులలో ఎక్కడా లోకువతేక స్త్రీ కామరా పురుషుడురా అని ప్రజలలో అనిపించుకున్న భార్యను చూచినప్పుడు భర్త ఆనందము చెప్పవలయునా ప్రాణమంతా భార్యపైనే పెట్టుకొని డొక్కలో సుఖనిద్రచెందు పిల్లవలె ప్రక్కలో సుఖనిద్ర చెందడా అంతా స్త్రీలోవుంది అన్నది సరోజ.

ఔను చనువిచ్చి కష్టాలలో సహాయపడి యోగక్షేమములు అడిగి తెలుసు కొనుచు,

శా॥ ఆదిఁ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీ యంబుపై
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమర్యాదఁ జెందు కరంబు

అన్నది భాగవతము ఆ మహామహుడే భార్య ఆనందానికి తన ఆనందానికి అంతవరకూ పోయివుంటే మనమెంత అన్నట్లు అంచుకు తీసుకొని దేహమంతటా హస్తస్పర్శనచేసిన పతికౌగిటిలో కనుమూసి కనుదెరచిన మంత్రి సలహాలు వెలువడుమ కష్టాలలో ప్రాణమిచ్చి అయినా వెన్నాడుతుంది. జీవచ్ఛవాన్ని చూచినట్లు చూస్తే మాట మాటకు పదతాడనాలు పలువకూతలూ కూస్తే ప్రాణముండీ లేనట్లు భర్తను సంతోషపెట్టు తళుకులుండి లేనట్లు సంచరిస్తూ దాగుడు మూతలాడుతూ తన ఆశయాల దూరముచేసుకొని సంఘ వ్యాఘ్రమునకుబలియై ధర్మమునకు బద్ధయై చచ్చిన శవమువలె పడివుంటుంది. ఏమి చేస్తుంది అన్నాడు రాము.

ఔను క్షమగలిగి ప్రశాంత వదనముతో లక్ష్మివలె కలకలలాడు వేషముతో కాళ్లచుట్టూ తిరుగుతూ చురచురచూచే చూపులకు వలపు చూపుల స్వాగతమిస్తూ పనిలేకున్నా పనిగల్పించుకొని సేవచేస్తూ వచ్చిన వ్యాఘ్రమయినా వ్యామోహపు వలలో పడుతుంది. వలలో పడినప్పుడు వైనంగా సంకెళ్లు తగిలిస్తే చెప్పినమాట వింటుంది మానవుడు వినడా అన్నది సరోజ.

అంతవరకూ నిన్ను అడనిస్తేకదా ఎవరికొరకే ఈవేషం సానివలె తయారయ్యావే సరసాలకు దిగినావే సంసారివా సానివా పనీ పాటామాని గంటలకొద్దీ వేషంతీర్చి దిద్దినావే భ్రష్టాఅని నాల్గువడ్డిస్తే ఏమిచేస్తుంది అతగాని విజ్ఞానము అక్కడికి దిగివుంటుంది అన్నాడు రాము.

అక్కడనే స్త్రీ శాంతము తెలిసేది కన్నీటితో పాదములు తడిపి కనికరము గలుగుమాటలతో సేవను మానుకొనక వలపును వైతొలగింపక కోపము మూర్ఖము ఈర్ష్య అసూయ దిగమ్రింగి శాంతము ప్రశాంతము వెలిబుచ్చుచు భూదేవివలె భర్త అప్రయోజకముల కొన్నాళ్లు భరించిన కోరికలు తీర్చుకొనవచ్చును. శాంతము వేష భాషలనేర్పు స్త్రీకి ముఖ్యము భర్త ఆఫీసుకు పోయిగాని కష్టానికి పోయిగాని కార్యానికి పోయిగాని ఇంటికివస్తే ఏమీ లేకపోయినా రాగెరొట్టె అయినా చేసిపెట్టి వుండి వస్తూనే తల్లివలెపిల్చి ప్రీతిగా తిననిచ్చి సమయమెరింగి వలపుచూపులతో అయ్యో పాపము తినలేకుండా వున్నారని వకముక్కతుంచి తన చేతులారా నోటి లో పెట్టితే మర్లుమందు అవుతుంది. ఇట్లు దినమూ చేయుచుండిన ఎందున్నా జ్ఞాపక మునకువచ్చి ఇల్లుచేరి ఆవువెంటనంటు కోడెవలె వెన్నంటి తిరుగును మాతయై తిండి తో మరపుకొని వేశ్యయై వలపులో బంధించవలె అప్పుడు ఎంతటి మూర్ఖుడయినా ముక్కోపియైనా మూఢుడయినా ఏమి తెలియని వెంగళప్ప అయినా సవరణయై సతీ తిలకము చేతిలో కీలుబొమ్మగును దాస్యము తగురీతిమాటలు తగినవేషము ఓర్పు నేర్పు వినయము భోజనాది విచారణా విషయములలో కూర్పు నేర్పు శయనమం దిరమున చాకచక్యముగల స్త్రీ పురుషుని బంధించుట పెద్దవిషయముగాదు జంతు వులుకూడా తినబెట్టువారిని వెన్నాడుతుంటే మానవుడు ఎందుపోగలడు అన్నది సరోజ

రసికత తెలియక సిగ్గూ బిడియముగలిగి సుఖించువిధమే ఎరుంగక చూడనే సిగ్గుపడుచూ ప్రక్కల ప్రక్కలనేతిరుగుతూ భార్యకంట పడవలెనన్నా పండవలె నన్నా సిగ్గుపడుతూ కన్నెత్తిచూచినా ఏమోనని మాట్లాడుటకుకూడా బిడియపడి అను భవించుటే తెలియని పూర్వజన్మ కర్మ మందభాగ్యులు ఉంటారు వారినేమి చేస్తావు అన్నాడు రాము నవ్వుతూ.

అయ్యో తమవలె అనంగశాస్త్రము అమూలాగ్రముగా చదివి అనితేరి ఆలినస్త్రీ ఆకర్షింపచేసుకొని ఆలింగన చుంబన అధరామృత పానాలతో కొక్కోకమంతా చదివి ఆలిని అమరలోకముపంపే అయ్యగారు అందరికీ ఎక్కడదొరుకుతారు ముందు జన్మలో త్రిదేవుల పూజచేసిఉండవలె ప్రకృతము ఈజన్మలో చేయుచుండవలె అందరికీ అలవికాదు స్త్రీ ఆనందమునకు కావలసినంత రసికత యౌవనము భర్తల్లో ఉండవలయునన్న పూర్వజన్మసుకృతము బోలెడంతచేసి ఉండవలయును ఇది తెలియక భర్తను దూషించి దూరముచేసుకునే భ్రష్టులున్నారు ఎట్లత్రిప్పినా ఎట్లతిరి గినా ఎక్కడేగినా తూర్పునే ప్రొద్దుపొడిచేదని తెలియని బుద్ధిహీనులు విడిపోవు

వారున్నారు నీకెందుకు భార్యయని ముఖాముఖి అడిగి భర్తను అవమానపెట్టి జీవితాశయముల పోగొట్టుకునే పశువులున్నారు భర్తను దేశాంతర గతునిచేయు మూల పెద్దమ్మలున్నారు నాకర్మమని తెలుసుకొని అంచుకుపిల్చుకొని మాట్లాడించుచు వలపుచూపి దాస్యము చేయడములో సిగ్గుబిడియముపోవు విధముగల్పించి తాను రసికురాలై ఉపాధ్యాయినియై నేర్చుకొనవలయును చూడనే సిగ్గుపడువానిని తాను చూస్తూ చూచునట్లు చేసుకొనవలయును ఆహారము యిస్తూ తానేదేహస్పర్శచేస్తూ ఇస్తూ వలపులో బంధించిన కొన్నాళ్లకు సిగ్గూ బిడియము పోయి రసికుడు కాగలడు స్త్రీకి లేకున్న పురుషుడు పురుషునికి లేకున్న స్త్రీ నేర్చుకొని జీవితాంతము వరకు శాంతచిత్తులై యుండుటశ్రేయము ఇరువురమూ రసికులమై యౌవనారోగ్యములతో ధనధాన్యములతో రూపవంతులమై విద్యా వినయములు సమయస్ఫూర్తి జ్ఞానము గలిగి గౌరవప్రతిష్ఠలతో సుఖింపవలెనని త్రిదేవీ పూజతానుచేస్తూ త్రిమూర్తుల భర్తను సేవింపుమని అదును కాలమూ చూపుతూ ఉండిన మరుజన్మకు రతీమన్మథులై సుఖింపగలరు అంతేకదా స్వాములవారు యిక్కడచిక్కినారు మంచి ఆకలిలో రుచిగల సాధకమయిపోయి అన్నం మిగిలింది. పారవేయుటకు ఆకలితీరలేదు. తినుటకు సాధకంలేదు నీళ్లువేసి పిసికి త్రాగు అభ్యాసములేదు. పాపం తికమకలయినది అంగటిలో అష్టభాగ్యములు వున్నవి. అల్లునినోట్లో శనివున్నదన్నట్లు ధనమున్న దరిద్రులయినారు మూతికి చిక్కెముపెట్టి పచ్చనిపైర్లో వదలినాడు భగవంతుడు మనశ్చింత చేయకండి మానవులకు అన్నిభాగ్యములు వుండవు ఏవోకొన్ని కొరతలు వుండనే వుండును. ఇంక ఏమి స్వామీ వేళకాలేదా అన్నది సరోజ.

తీవే గబ్బురామాన్నెం చదివి మొబ్బులో మనసునిరికించి మేలుకొల్పుతావు లేకుంటే ఈవేళకు కొంత పూజఅయిపోయి ఉండును అన్నాడు రాము.

నేనేమిచేసినాను కట్టుకున్నభర్త కంటికింపైనది వంటిచాయ గలిగినది కంటచూచువారు మాకూకావలెనని ఆసించునది కష్టమనక వెతకి వెతకి కాంతకోరకున్నా తెచ్చికట్టుకో కన్నారాచూచి ఆనందపడతానని ఇవ్వగా ఆనందం వెలిబుచ్చడములో తాము అందుకున్నారు ఇంతై అంతై ఇంతసేపయినది నాదేమితప్పు ప్రభూ తప్పైతే దాసురాలితప్పు దండముతో సవరించుకోండి అని నవ్వుతూ కన్నులార్చుతూ నమస్కరించినది సరోజ.

సై కట్టుకున్న భర్తనేగాక కాలయమునికూడా దండాలతో వలపుపిలుపులతో వాల్చూపులతో చిరునవ్వులతో మైమరపిస్తావులే తప్పులు వప్పులుగా మార్పించుకుంటావులే అన్నాడు రాము.

మా పిల్లలో తప్పులులేవని పదిమంది సాక్ష్యమున్నారండి ఈ కాలయముడు చిత్రగుప్తుడు కాలకింకరులు నన్నేమీ చేయలేరు అన్నది సరోజ.

నేనేకదా సాక్ష్యం నేనుగాక తొమ్మిదిమంది ఎవరే అన్నాడు.

తమసాక్ష్య మటుండనివ్వండి పాపం నాభార్యయని తప్పును వప్పుగా నయినా చెప్పగలరు ఉన్నది ఉన్నట్టు సాక్ష్యమిచ్చే పెద్దలున్నారు ఏడుగురు అన్నది సరోజ.

ఏడుగురు వారెవరే అన్నాడు చొక్కావిడచబోతూ రాము.

అ చొక్కాగుండీలు తీస్తూ చేతులగుండీలు తప్పిస్తూ మీద కండువాపంచె తుండు పంచె ఇరు భుజములవేసుకొని లేరా జ్ఞాపకమునకు రాలేదా నిత్యకృత్యముగా అందరికన్నాముంధు అరగించే అగ్నిదేవుడు ప్రథమ సాక్షికిరాడా నీనాడూ భర్తకన్నా ముందు అపచన పదార్థముకూడా భోంచేయలేదు ఎరుగకకూడా ఎంగిలి మంగలం చేయలేదు కడకు వాసనకూడా పీల్చలేదు ఆహారముపై బుసకూడా విడువలేదు భక్తి శ్రద్ధలతో నాకుఅర్పించినది భద్రముసుమా ఏమయినా అనేరు నిన్నూ నీలోకము నీలోకస్థుల కాల్చిభస్మముచేసేనని ముందుకురాడా అగ్నిదేవుడు.

వక్కడూ అపైనా అన్నాడు రాము.

ధర్మము తప్పకచేసినవన్నీ ప్రతినిత్యమూ ధూపదీపములతో పుష్పసుగంధ ములతో అర్చనలతొ ఆరగించిన త్రిమూర్తులూ త్రిదేవులు రారా నన్ను యమయాత నల పడనిత్తురా కాదని చిత్రగుప్తుడు వ్రాసిపెట్టినా కనికరములేక కాలయముడు నిలువబెట్టినా ధర్మబద్ధులయిన పిన్నపెద్దలు ధర్మదూరులైచే విడతురా మరతురా వచ్చిన త్రిమూర్తులా త్రిదేవులచూచి యముడు నిర్వీణ్ణుడై గద్దెడిగ్గి నాతోపాటు మని చేతులుపట్టుకొని వినమ్రుడై నిల్చుకొనడా వారు చేయెత్తి నన్నుచేరపిల్చి ఈపిల్ల మాపిల్ల మమ్ము త్రిసంధ్యలా భార్యాభర్తలపిల్చి తనకున్నది చేసినది పెట్టనిదినము లేదు ధర్మమునకు వ్యతిరిక్తమై నడచిన రోజులేదు నీవేల తెస్తివి మేము ముష్వరము ఈమెను ఏలోకమున నుంచవలయునని ఆలోచించు చుండునంతలో నీవిక్కడికి తెచ్చితివి ఇట్లైన్నడేని పొరబడిన నీ ఉద్యోగము ఊడబెరికి మరియొకతూరి మనుజ లోకములో విదురునిగా దాసికి పుట్ట శపింతుమని యముని బెదరింపరా ఆ సమయ ములో అమరలోకమునుండీ అత్తా మామా అపత్తును తప్పింప ఎనిమిది తొమ్మిదో సాక్షులై వచ్చినిలచి అయ్యా ధర్మరాజా మేము ఆమె అత్తమామలము కోడలిభావము

విడచి కన్నబిడ్డకన్నా మిన్నయై వృద్ధులమయిన మాకు కావలసినవిపెట్టి కావలసినంతాయేగి కాలముతీరిన వెనుక తనభర్తకుచెప్పి కర్మలుచేయించి మాపేర నూకలుకట్టించి బోర్డువేయించినది దేవాలయములో మాపేర వక ఉభయముతీసి దస్తరములో ఎక్కించినది భర్తకు జ్ఞాపకముచేసి సైదోడై శ్రాద్ధములు చక్కగా చేయించుచున్నది. పుణ్యశీల ఈమెనేల తెచ్చితివి. పుణ్యలోకమునకు పంపెదవా లేక భూలోక నరకమనుభవించునట్లు శపింపమందువాయని గర్జింపరా ప్రభో వీరుగాకింకిద్దరు ఉన్నారు పుట్టినింటినా మెట్టినింటినా కీర్తిగడించి పుణ్యాంగనల జెట్టులోచేరినదండీ కావలెనంటే వేనవేలు సాక్ష్యాలుతెస్తాము మీలోకానికి తేతగ్గపిల్లకాదండీ చూడండీ లెక్కలెత్తి అని నాన్నా అమ్మావచ్చి తప్పకవాదిస్తారు అందులోమానాన్న వకీలు న్యాయాలుఅక్కడా ఇక్కడా వకటేగా కూతురి తరుపున ఎక్కడలేని లాలు తెచ్చి బల్లగుద్దివాదించడా మానాన్న వీళ్లుగాక తమది పదియవసాక్షి. ఏమందురా నేను పోయినతదుపరికొంత కాలమునకు తమరు వచ్చువారు లేదాఒక నెల అటో ఇటో అయినా సాక్ష్యము అయిపోయి ఉంటుంది వకేదినములో భార్యభర్తలు గతించిఇద్దరూఒకేపలక ఎక్కవలయునంటే మేరమీరిన పుణ్యముండవలయును అంతవరకూ పుణ్యము చేయగలమోలేమో భగవంతుడు అంతకనికరము చూపునోలేదో సందేహంకదాస్వామీ ఆనాడు తమరుసాక్ష్యము చక్కగా ఇచ్చినా పోయె ఇవ్వకున్నాపోయె నాభార్యమంచిదనే పురుషుడు ఉన్నాడా ఎంతో ధర్మమూర్తులయినగాని ఆమాట అనరు తనతప్పుతాను తెలుసుకున్నప్పుడుగదా ఆజాడకువచ్చేది పతిజీవితమే నా జీవితమని భర్త కీర్తిగౌరవముతే తన కీర్తిగౌరవములని తన జీవన్యాయము తనసేవకాధర్మము తానుతెలుసుకొని తనతప్పులతాను వెనుదిరిగిచూచి విమర్శించుకొని చక్కగా పతిపరిచర్య చేసినగాని భర్తనోట ఆమాటరాదు అక్కడికి ఏమయినా వకసైనా సందేహిస్తారు ఆనాడు తమమనసు ఏమంటుందో స్వామీ. నాకేమితెలుసునంటూ రాము విడచిన చొక్కాను తనభుజముపైన వేసుకొని కండువాకప్పి నిజం చెప్పండీ ఇల్లాలిపరంలో తగిన సాక్ష్యమే ఇస్తారా లేక పట్టండీఅని కరుణలేక యమునికి వప్పిస్తారా మనసే మంటుంది అని పండ్లలో కండ్లలో వెలువడు తళుకు అమృతబిందువుల రాముపై రాముయెడ జల్లరించునట్లు చిత్రవిభ్రమముగలుగునట్లు చల్లి రెండుచేతులు రాము భుజముపైనూని తల రామువక్షస్థలముపై వాల్చిబోయి తప్పు తప్పు అని చిరునవ్వుతో చొక్కా చిలుకునవేసి చెంబుతో నీళ్లుతెచ్చి ఇచ్చినది సరోజ.

రాము కాళ్లు కడుగుకొంటూ సరోజా ఇది భూలోకమా ఇంద్రలోకమా అని సందేహమౌనట్లు నాహృదయాన్ని మరపిస్తూ ఉన్నావు నీరుణం తీర్చుకోగలనా లేనా అని సందేహమౌతున్నది అనుచుండగా సరోజ రాముచేతిలో చెంబుతీసుకొని క్రింద పెట్టి ముందే తనపైన వేసుకొనివున్న తుండుపంచెతో కాళ్లూచేతులు తుడిచి యింక పదండి వేళ అతిక్రమించింది నాకుమీరు రుణపడినా పరవాలేదు మొగవారు తీర్చుకుంటారు నేనురుణపడరాదు రుణపడిన స్త్రీని తీర్చుకోలేను మీరేనాకు రుణపడితే మరుజన్మకు నావెన్నంటే ఉంటారు నామాటవింటారు నన్ను ఇహపరములలో అగ్రగణ్యనుచేస్తారు తొందరగా పిల్లను తల్లిగా మారుస్తారు అన్నంతలో రాము ఫక్కున నవ్వినాడు.

ఎందుకునగుతారు నవ్వినట్లుగాదు పిల్లను తల్లిగామార్చి నట్లుగాదు తల్లిలో పిల్ల పెరిగి పుట్టి తండ్రిననుసరించవలె లేకున్న ఉందికథ ఏవైపుచూచినా రూపులో ఎటు త్రిప్పి చూచినా బుద్ధిలో అలుకడుపున మగడువుట్టె మగనికడుపున అలువుట్టెనని తత్వంపాడినట్లు ఉండవలె లేకున్న ముక్కుచెంపలు తప్పవు నావలెఉంటే మీకు పన్నెండు ముక్కుచెంపలు మీవలెఉంటేనాకు ఆరు ముక్కుచెంపలు అన్నది సరోజ.

అదెందుకు నాకు పన్నెండేమి నీకు ఆరు ఏమి ముద్దులాడివనియా అన్నాడు రాము.

అయ్యో ఇది రూలేగా రూలంటే రూలే వకీలు కూతురిని అంతమాత్రము తెలుసుకోలేనా అన్నిటిలో ఆడవారు మగవారికి తక్కువ అన్నప్పుడు దెబ్బలలోతక్కువలేక సమానంగా ఉంటారా చెప్పండి ఇంకొకటి ఇద్దరము గాకవుంటే నన్నది సరోజ.

పన్నెండు కాలితన్నులునీకే నన్నాడు రాము.

ఇక్కడనే తప్పుతేలేది ఇది ఎవరి పొరపాటంటారు అన్నది సరోజ.

ఇది ఎవరిదికాదు జన్మకర్మది భార్య గర్భవతి అయినదాదిగా భర్త ఎక్కువ మక్కువగలిగేటట్లు తానుతెచ్చి యిచ్చు పండు పూలు ఆహారముతో చూపుప్రేమతో విచారణా మొదలగు స్నేహవాత్సల్యములతో తానుధరించు వేషము మాటల చాకచక్యముతో స్త్రీ హృదయము చూరగొన్నట్లయిన స్త్రీ హృదయములో భర్త విహరించును. ఆ మూర్తియే ప్రతిఫలించును. అట్లుగాకున్న స్త్రీ మూర్తియే ఫలించును. ఈ రెండూగాక పుట్టి భర్తమనసును ఆలోచనలో త్రిప్పి అధఃపతనముచేసి ఆగంతుక

మృత్యువువలె అవిర్భవింతురు. ఇది జ్యోతిషునకు ఒక్కనికిమాత్రమే తెలియును. ఇది మర్మమైన విషయము రూపవంతునకు విరూపవంతుడు బుద్ధిబలముగల వానికి బుద్ధిలేనిదద్దమ్మ పుట్టుటకు కారణము వానిపుత్ర స్థానములోయున్న గ్రహములబట్టి తేలును శనియున్న శనివలెనేయుండును. సూర్యుడువున్న సూర్యునివలెనే వుండును. దీనిని అనుమానించ పనిలేదు అన్నాడు రాము.

అయ్యో పిల్లల రూపుచూచి ఒక మహానుభావుడు భార్యను వదలి నాడండీ అన్నది సరోజ.

అతనికి లోకజ్ఞానమేకాని శాస్త్రజ్ఞానము ఉండదు ఉండనపుడు అతడు మాత్రము ఏమిచేయును? లోకజ్ఞానము లోకుల మాటలువిని జీవితము నాశనముచేసి కొని యుండును. గొప్పపండితునికి మహాకవికి, వైజ్ఞానికి, అప్రయోజకులు అనామికులు, పుట్టుదురు. వారికిపంచమ స్థానాధిపతి స్వస్థానమువిడచి ఉచ్ఛస్థితిలోనో మిత్రక్షేత్రముననో ఉండి కవియై పండితుడైవుండును పంచమస్థానములో పాపగ్రహములుండిన అప్రయోజకులు అనామికులు పుట్టుదురు వారికార్యములు వారికావ్యములు వారిఅధికారము కొంతకాలమునకు భిన్నమగును భిన్నమగునవే వారిని చేయించును అపంచమాధిపతి పంచమములో వున్నవారు దరిద్రులయినను వారి సంతతి వన్నెగడించును విద్యావంతులయ్యేదరు ఇదితెలియక ఏన్నో అలోచనలు చేయుదురు ఇది ముఖ్యమైనదని దీనివిషయ మింతేనని మానాన్న చెప్పచుండగా విన్నాను అన్నాడు రాము.

ఇదినాకు భయముగా ఉందండీ భయములేదని నావెన్నీపున తట్టండి ధైర్యము వస్తుంది భయము విడుస్తుంది అన్నది సరోజ నవ్వుతూ అర్తత్రాణ పరాయణి భయమువిడచి భద్రముగా వుండమని వీపున తట్టినాడు రాము.

ఫక్కున నవ్వినది సరోజ నవ్వులో నవ్వునుకలిపి స్వామికార్యములో నిమగ్నుడైనాడు రాము.

సరోజ అందులో పాల్గొన్నది పూజానంతరము భోంచేసి భోజనానంతరము పడసాలలో కూర్చొని ఆకుమడచి యిచ్చుచూ సరోజ రేపు మధ్యాహ్నము బండికి పోదామా అన్నది పోదామని నిశ్చయం చేసుకొని తలవాల్చినారు యిరువురు.

అది జ్యేష్టమాసము శుద్ధద్వాదశి బుధవారము రాత్రికి బంధువులు, వియ్యంకులు. అందరు చేరినారు. కావలసినన్ని సౌకర్యములు ఏర్పాటు చేసినారు అందరు బంధుమిత్రులు భోంచేయగా పండుకొనుటకు రాముసరోజ ఏర్పాటుచేసినారు అందరు

సంతోషముగాఅయింటివసతులకు, వారిమర్యాదకు, వారిప్రేమకు, వారిభోజనాదులకు మెచ్చుకొంటూ ఆరేయి నిదురించినారు. రాము సరోజ వారిశయన గృహములో పండుకొన్నారు సరోజ రామునుచూచి నేనుచెప్పినది చేసిపెట్టినారా అన్నది.

ఓ రడీ నాల్గుగంటలకే తెస్తాడు అన్నాడు.

సరే నాల్గుగంటలకే అలారము పెడ్తానని పెట్టి సరోజ పడుకున్నది.

కరెక్టుగా నాలుగు గంటలకు అలారముకొట్ట టంగుమన్నది కొట్టీకొట్టకమునుపే అలారము ఆపి రాము సరోజ చెంపపై చేయిపెట్టినాడు

మేలుకున్నానని లేచినది సరోజ.

ఇరువురూపోయి ఒరులకు తెలియకుండా నీళ్లక్రిందవేసి దినకృత్యములు తీర్చుకొని స్నానముచేసి కాఫీవేసి దేవునికి నివేదన చేయునప్పటికి అయిదు గంటలకుపైన అయినది సరోజపోయి స్త్రీల నందరిని లేపినది రాము పురుషులనందరినీ లేపినాడు వకరొకరే లేచిపోయి పలుదోమువారు దినకృత్యములకు పోవువారు ఉండగా శివప్రియ హరిప్రియ వంటగదికిపోయి చూచినారు.

వదినా బెడ్‌కాఫీ త్రాగుతారా లేక పలుదోముకొనివచ్చి త్రాగుతారా అయినా లేడిపిల్లలు పలుతోమవుగా అని చిరునవ్వుతో వదినగారిని గేలిచేస్తూ స్నానానంతరమా వద్దులే పిల్లముత్తయిదువులకు అంత నీమమెందుకు కొంచెము ముఖముకడుగుకొనివచ్చి మా అన్నగారికియిచ్చి త్రాగితే బాగుంటుందనుకున్నానని చెంబులతోనీళ్లు పల్లుపొడియిచ్చినది సరోజ.

ఆతీరు చూచివారు ఆశ్చర్యపడి సరోజ అప్పుడే స్నానముచేసి కాఫీవేసినావా ఏమి మారిన్నావమ్మా అన్నగారు అప్పుడే ధ్యానము ప్రారంభించినారు హిందూమత సాంప్రదాయము మీయందు మూర్తీభవించినట్లున్నది ప్రశంసనీయముగా నున్నదమ్మా అని పలుదోమ పోయినారు శివహరి ప్రియలు.

అంతలో జ్ఞానాంబ అనసూయమ్మవచ్చి ఏమమ్మా మమ్ముల లేపలేక పోయినావా అప్పుడే తయారు చేసినావే అయినా నీ కాపురము నీవు చేసుకొనడమునకు వకరి సహాయమెందుకు ఇది సాంసారికలక్షణము అన్నారు.

మీరిద్దరు ముఖము కడుగుకొనివస్తే మామకు నాన్నకు కాఫీయిచ్చి మనము అందరము నిదానముగా కూర్చొని త్రాగుదాము అన్నది సరోజ.

జ్ఞానాంబ అనసూయమ్మ ముఖప్రక్షాళనము సేయబోగా సరోజ వారివెంటబోయి పల్లుపొడి పెద్దచెంబుతో నీళ్లాయిచ్చి మామకు తండ్రికి ఎదురెక్కిపోయి

పల్లుపొడి నీళ్లు యిచ్చి వచ్చి లోపల గ్లాసులలో కాఫీవేయులోపల అందరూ పలు దోముకొని వచ్చినారు. కాఫీతెచ్చి మామగారికి అత్తా అని అత్తచేతికియిచ్చి మరొక గ్లాసుతెచ్చి నాన్నకు అమ్మా అని అమ్మచేతికి యిచ్చి రెండుగ్లాసులకాఫీ వారనుంచి అన్నగారిని పిలచి వదినగారిచేతికి యిచ్చినది. అత్తను అమ్మనుపిలచి వారికాఫీ వారికి వప్పచెప్పి వధినగారికియిచ్చి మధ్య మధ్య బంధు మితు్రలకు సర్వులకుయిస్తూ వచ్చినది. రాము మంగళహారతి ముట్టించి ఆయెనా అన్నాడు అయినదంటూ పోయి తట్ట పట్టుకున్నది. మంగళహారతి యిచ్చి రాము క్రింద పెట్టి చేతులు జోడించుకొని చెప్పా కొనతగ్గది చెప్పుకున్నాడు.

సరోజ అష్టేచేసి దేవునికి భర్తకు నమస్కరించి చేయిపట్టగా తీర్థమువేసినాడు రాము.

తీర్థము పుచ్చుకొనిపోయి సరోజ కాఫీతెచ్చి రాముకిచ్చి తానుతీసుకొని త్రాగను ప్రారంభించినది ఇదంతాచూచి శివప్రియ హరిప్రియ సరోజా ఎంతమారి పోయినావమ్మా ఈవేళకే మెలకువగాలేచి స్నానముచేసి కాఫీవేసి అందరినిలేపి పెద్ద చిన్నగమనించి ఎవరెవరికి ముందీయవలెనని తెలుసుకొని ఇస్తూ దేవునిమరువక తీర్థముపుచ్చుకొని కాఫీత్రాగుతూ ఉన్నావు ఏమినీఓపిక తల్లీ ఎంతమారిపోయినావు మా అన్నను దీక్షాబద్ధునిచేసినావు అయినావు ఇట్లవుతావని కలలోకూడా అనుకొన లేదు సరోజా అబ్బా ఏమితెలివి ఏమిఓర్పు ఏమినేర్పు ప్రశంసనీయ వయినావమ్మా అంటు స్నానానికి లేచిపోయినారు.

ఏడున్నర గంటలోపల అందరూ స్నానముచేసి ప్రాతఃకాల వందనాదుల ముగించుకున్నారు ఫలాహారముల రాము శివప్రసాద్ హరిప్రసాద్ పురుషులకు సరోజ?

శివప్రియ హరిప్రియ స్త్రీలకు ఇస్తూవున్నారు జ్ఞానాంబ అనసూయ అందిస్తూ ఉన్నారు భుజంగరావు రంగనాధంగార్లు కార్యక్రమాలు చూస్తూ వున్నారు బైట జంట సానాయిలు జంట డోళ్లు ఖరహరప్రియ రాగములో త్యాగరాజులవారి కొని యాడ అనేకృతిని సాగబీకి మూలసుట్టంగా చంపేస్తున్నారు. డోళ్లవారి తలలు అటు హిమాలయము ఇటు వింధ్యవరకూ పోతూ వస్తూ వున్నవి. తినేవారిమనసు అటు సానాయీలనుండీ వెలువడు అమృతోపమానమైన కళలకు డోళ్లనుండీవచ్చు మృదు మధురమైన శబ్దములకు తినుమధుర పదార్థరుచులకు తికమకలై తిరుగలేక పెట్టే

పదార్థములవద్దనలేక తేలగన్నువేసి నములుతూ ఊో అనువారు తాళానికిసరిగా నము లువారు తలవూచుతూ ఆనందముతో శివమెక్కి మైమనచి ఊగువారు వకచేత తింటూ మరొకచేత తాళమువేస్తూ ప్రక్కవారు పిలచినా పలుకక పరధ్యానములో వున్నవారు భూతములవలె ఆడువారునై కడుపునిండినది నిండనిది తెలియక లోప లికి పంపుతుండగా మేళగాళ్లు ఆకృతితో చాలించినారు వీరందరికీ శివముతగ్గి కడు పుబ్బి మానవత్వములోకి మనసువచ్చి చాలునని కాఫీతో కదలిపోయినారు వియ్యంకులు ఫలాహారానికి కూర్చున్నారు శివప్రసాద్ ఫలాహారముచేస్తూ అమ్మా అన్నాడు.

ఏమప్పా అన్నది అనసూయమ్మ.

బావను మనసరోజనుచూస్తే గౌరీశంకరులవలె గన్పడతారు ఆదాడీ మీసము వేషము అవయను ఆదేహచ్ఛాయ శంకరావతారమే అయితేబావా మేమంతా భూత గణముగాదు మమ్ములందరినీ భూతగణములో చేర్చేవు అన్నంతలో అందరూనవ్వి నాడు సరోజనుంచీచూస్తే లక్ష్మీనారాయణులవలె భారతీ బ్రహ్మలవలె గన్పడతారు అయితే వారిని చూచినావా అంటారేమో నాయనపోలిక సంతతిలో కొంచెమయినా ఉంటుంది దీనిబట్టిచూస్తే దేవునిపోలికా కొంచెము యించు మించు ఇట్లేఉంటుంది అనుకోవచ్చు దేవుడు నిరాకారుడుకాదు సాకారుడే నిరాకారుడు సాకారులనేల పుట్టి స్తాడు నిరాకారులనే పుట్టించు కంటికి మిన్నైవన్నై యుండిన వస్తుసమితిని అట్లవర్ణి స్తాము బుద్ధితో ఊహిస్తాము వీరిద్దరినడకా రూపము భాషా పద్ధతీ మారిపోయినవే అన్నాడు శివప్రసాదు.

సరోజనవ్వుతూ మాచెల్లెలితప్పు మాతప్పుక్షమించి మన్నింపప్రార్థన అన్నా వుగా మన్నించినాడు మనసునే మార్చినాడు మనిషినీ మార్చినాడు వేషభాషలా మార్చినాడు తానూ మారినాడు ఇట్ల మారినాము చూతురు రండీ అని పిలువనంపి నాడు ఇంక పిల్లనడుగబోతాడు అన్నది నవ్వు చిరునవ్వుగా మార్చి సరోజ.

ఓహో కథ యిక్కడికి వచ్చినదా అంటూ అందరూ నవ్వినారు.

అందుకున్నావుకదే అప్పుడే అన్నది అనసూయమ్మ ఇప్పటినుంచే అడుగు ఏమి చెప్పుతారో అన్నది శివప్రియ.

చెప్పేదేమున్నదే వాళ్లకన్నా వెనుకెప్పుడు పడినామో అప్పుడే చెడిపోయింది ముందే వుందాము కానీవే అంటే అయితేకదూ నాతప్పేముంది వర్షము కావలసి

నంతా కురిసినా చౌటభూమిలో ప్రయోజనం అయినా అరుద్ర రాలేదంటావేమో ఇప్పుడు అడిగేదానికి జబాబుచెప్పు అన్నాడు శివప్రసాదు.

అందరి ముఖాల్లోఉన్న చిరునవ్వు పెల్లుబికి ప్రతిధ్వని గలిగేట్లు నవ్వించినది.

వెంటనే అందుకున్నది శివప్రియ అవిఅన్నీసరే జబాబుచెప్పేదీసరే చూడండీ మా అన్నగారు ఎట్లపూర్వాచారాన్ని పాటించి నడుచుచున్నారో తమరూ ఉన్నారు చూడండీ నవీనం నవీనం అంటూ నన్నూపోనివ్వక మీరూపోక అధ్యాయంచేస్తున్నారు పూర్వాచారం వద్దేఅంటారు అంతాతప్పుగా ఉన్నదేదయినా ఉంటుందా అందులో కొంతైనా మంచిది ఉండదా మంచితీసుకొని చెడ్డవిడువండీ అంటే వింటేగా నన్ను పోనివ్వరు మీరుపోరు నేనీనాటినుంచీ సరోజ మార్గమవలంబిస్తా మీరు బాధించినా వేధించినా సరే బాధలనైనా ఓర్చుకుంటాను కర్మజాలక ఆడబిడ్డ పుట్టితే భర్తననుసరించేటట్లు ఉండపనిలేదా ఆనాడు మేనల్లుడు బాగలేదు నీకూతురు నేనుచేసు కోనన్న ఏగతిగావలెచూడు సరోజా ఆనాడే నేనుచెప్పినా అత్తచెప్పింది వింటేగా దానంతట ఆది పెరిగే పైరుకూ కావలసినంత సత్తువా నీరు మొదలగు సహాయము చేసిన పైరుకు భేదముంటుంది దీక్షను సాగించండి కష్టపడక కార్యముగాదు అని కాళ్లు పట్టుకొని చెప్పుతున్నా వింటేకదా మా అన్నను చూచి అయినా నేర్చుకోండీ అని శివప్రియ శివప్రసాదుపై ప్రేమానురాగముల పరిణయ కోపములోకలిపి చల్లినది.

శివప్రసాదు చిరునవ్వు స్వాగతమిచ్చి చల్లచేసినది.

అంతలో రాము అందుకున్నాడు ఔను బావా మాఅక్కయ్య చెప్పేది నిజం మీ అక్కయ్య మంచి రూపవంతుని జ్ఞానవంతుని బుద్ధిమంతుని శ్రీమంతుని ధీమంతుని కనేదినిజం మా అక్కయ్య చెప్పినట్లు కూతురుబాగలేకుంటే వరేచేసుకోవద్దురా అని మీఅక్కయ్య పట్టుపట్టేది నిజం అప్పుడు మీఅక్కయ్యకూ మీకూ మనస్తాపం వచ్చేది నిజం నేనుఎక్కడా చెప్పలేక మీఅక్కయ్య యిష్టం మీయిష్టం అనేదినిజం మీఅక్కయ్య బుద్ధీమీకు భాగాతెలుసుగదా పట్టుపట్టితే భూమికదిలినా పట్టువిడువదు పట్టుభల్లూక పట్టు మాఅక్కయ్యమాటవిని జాగ్రత్తపడి బొమ్మను చక్కగా తయారుచేయి అన్నాడు రాము.

మీ కొడుకుకథ అంత గిరాకిగా ఉంటుందేమప్పా అన్నది నవ్వుతూ అనసూయమ్మ.

గిరాకిగా ఉండవలెననే కూతురు కృషిచేస్తూఉందికద మిఅత్తా అన్నాడు రాము.

ఆమాటవిని శివప్రసాదు అయితే బావా మానవ ప్రయత్నములోకూడా కొంత మేలు ఉంటుందంటావా అన్నాడు.

ఏమిబావా అట్లంటావు ఆహార విహార వ్యవహారములు కాలానుగుణ్యము పిండోత్పత్తికి సహాయమిస్తాయి రూపమునుమారుస్తాయి భూమిబలమయినది గాకున్నా సత్తువబలముతో కొంత పైరునయముగా పండినట్లుండును ఇక దైవబలము సమకూర్చిన జ్ఞానదీప్తిగలిగి వజ్రమునకు సానబట్టినట్లు ప్రకాశిస్తుంది. ఆహార విహార వ్యవహారములలో మార్పు త్రిసంధ్యలా దైవశక్తి పూరించినట్లైన దేహశక్తి జ్ఞానశక్తి సంపూర్తిగా గలిగినవాడు ఉత్పత్తి కాగలడు ఇది వప్పుకోతగ్గదే వప్పుకో తగ్గదనే మీచెల్లెలు మాటవిని బెత్తెడెత్తు గడ్డము కోరమీసాలువచ్చి ఘాతనాయకునివలె ఉండేది వర్ణించినావుకదా ముందే ఇల్లాలిమాట వినకున్నా ఇలువేల్పును కొలువకున్నా అవస్థలుతప్ప వన్నారుబావా వింటేనే ఈ ఇద్దరూ వరాలిచ్చేది లేకుంటేసున్నా అన్నాడు రాము.

నవ్వునలుమూలలా ప్రతిధ్వనించి సరోజలో తలెత్తినది వకవేళ ఇల్లాలు చెప్పినా తమమనస్సుకు నచ్చకపోతే వింటారా ప్రజో అరవై అను అవకతవకలు చెప్పి కాగలకార్యముచేసి వత్సరానికొకరొంతున వెలువడిస్తారు తమరు పోనిస్తారా బావవింటూ ఉన్నాడని తమమంచిని బాగాచెప్పండి అన్నది సరోజ.

అందరూ స్త్రీలు పైటచెరుగులడ్డము పెట్టుకొని నవ్వుతూ వేయి దండాలు ఈ మొగాళ్లుచేసేపనిఇదే పుట్టినపిల్లకూ పుట్టబోయేపిల్లకూ పదినెలలే సంధుఅయ్యేటట్లు చేస్తారు కనికరములేనికాలయముళ్లు కడుగూ పిళ్లతో ఆడవారికిబెడ్డపేరేకానీ అన్నారు

కానీ అని పదిరోజులుగాక మునుపే కండ్లకు కాటుకపెట్టి చక్కగా శృంగారించుకొని కండ్లలో తళుకును తొలిముంగారవు మెరువులాగ పైకిపంపితే కండ్లు మూతలుపడక ఏమౌతుంది కానీమంటేకానీ కారుకొకరువంతునకానీ రానీ పోనీ అదటుండనీబావా మీచెల్లెలు బహుమంచిది తాను తారుమారులో మారింది మారింది గాక నన్నూమార్చింది తానుపోయిన మార్గము నడిచెడిమార్గముతప్పని తెలుసుకొని వప్పులోదిగి వప్పులకుప్పయి మానవాతీతమయిన మంచిమార్గాల్లో కాలుపెట్టి నన్ను పెట్టించి నడిపిస్తూఉంది అయినా మీచెల్లెలు విషయం మీకుతెలుసుకదా చెప్పనేల అయినా చెప్తున్నానన్నాడు రాము.

చెప్పు చెప్పండి వినేబావా దొరికినాడు చెప్పండి మామమామ ఉన్నట్లు బావ బావ తయారయినారుకానీ చెప్పుచేతల్లో తిరిగే ఆడవారు దొరికినారని దొరలవలె చెలాయిస్తూ ఇష్టాలు తీర్చకుంటే తిరిగిచూడని బావబావ ఏకమై వకరికొకరు తీర్చుకోండి మేముఇక్కడ వకరికొకరము చెప్పుకుంటాము ఊరకుంటామా అన్నది చిరుకోపమూ చిరునగూ మిశ్రితముచేసి సరోజ.

అందరూనవ్వే నవ్వులమధ్యలో రంగనాధంవచ్చి అక్కడఅంతా తయారయినది ఇంక గంట టయమున్నది శాంతి హొమానికి ప్రారంభించి నామవ్వా మీరిద్దరూ రావలసి వస్తుందన్నాడు.

సరేనని శివ హరిప్రియ లిరువురు సరోజకు జడవేయ పోయెనారు వంటకార్యక్రమములు అతిజరూరుగా జరుగుతున్నవి శాంతి హొమము ప్రారంభమయినది భుజంగరావు రంగనాధం అకార్యక్రమములకు కావలసినవి తెప్పించి బృహస్పతుల వారికి అందిచ్చుచున్నారు బృహస్పతులవారు శిష్యులతో కలిపి మంత్రము పల్కుచుండ జమ్మని గృహము ప్రతిధ్వనింప ఎక్కడవారక్కడ ఎవరి పనులమీదవారు అతి జాగ్రత్తలో చురుకుగా తిరుగు చున్నారు.

రాము పింఛబోసి పంచెకట్టి కండువాపంచెను పైనకప్పుకొని ఇటూ అటూ తిరుగుతూ కొన్నికార్య క్రమములలో పాల్గొంటూ కొన్నివస్తువులు అందిచ్చుచూ సరోజ అన్నాడు.

వస్తూ ఉన్నదన్నా అన్నది శివప్రియ.

పిలుపు వస్తుంది జాగ్రత్త అన్నాడు రాము.

వస్తున్నాను అని చేతులు జోడించుకొని చిరునవ్వుతోపోయి ఎదుటనిల్చినది సరోజ.

ఓహో ముస్తాబౌతుండినా వన్నమాట సై మాఅక్కయ్యగారు వేషాన్ని తీర్చి దిద్దినారుగదే అందుకే ఇంతసేపు మరుగైనది అచ్చము అవనికి దిగివచ్చిన అప్సరసవే అన్నంతల్లో చిరునవ్వు వెన్నెలలు రాము ముఖముపై ప్రసారింపచేసి ఆవెనుక చూడు కవిత్వాలకు అమనోకాదో అన్నది సరోజ.

రాము వెనుదిరిగి చూచినాడు.

బావా మీ ఇరువురిని రమ్మంటున్నారు అన్నాడు శివప్రసాదు.

ఓ వస్తున్నాము అంటూ రాము సరోజను చూచినాడు ఓ అన్నది సరోజ శివహరిప్రియలతో సరోజ రాము వెనుకపోయి హోమస్థానమున నిల్చినారు.

రామును బృహస్పతి శంకరశర్మగారు చూచి యజ్ఞేశ్వరుని అష్టదిక్పతుల త్రిమూర్తుల అధిదేవతా ప్రత్యధిదేవతా సహితముగ మనస్సులో తలంచుకొని నమస్కరించి కూర్చొనండీ అన్నాడు.

రాము చేతులు జోడించుకొని తలంచులోపల అందున్న స్త్రీ పురుషులు సరోజ శివహరిప్రియల ముఖ్వరిని చూచి అపర త్రిదేవులురా అబ్బా ఏమిరూపము ఏమి రూపమని కన్నులుఅన్నీ కేంద్రీకరింపచేసి వక్కపెట్టున చూచినారు.

రాము సరోజ సాగిలపడి నమస్కరించి పీటలపై కూర్చున్నారు శివ హరిప్రియలు ప్రక్కన కూర్చున్నారు.

గిరిజా కల్యాణములో పీటలపైకూర్చున్న ఈశ్వరునివలె రాము నల్లటిగడ్డము కొంచెము మెలికతిరిగిన మీసములు ఎగుభుజములు బిగువయిన కండరములు విశాల వక్షము నల్లటి నూగారు వన్నెఅచ్చిన ఒంగారువలె మిరిమిట్లుగొల్పు దేహకాంతి చంద్రబింబము వంటి ముఖముచూచి పదే పదేచూచి తనివితీరక చూచు పురుషులు తమభర్తలకు రాముకుగల తారతమ్యము గమనించి తలలువంచి అట్లలేనందుకు వగచుచు అపర గిరిజవలె అతని ప్రక్కన కూర్చొనిఉన్న సరోజ పుణ్యమునకు ఆమె ధనకనక వస్తువాహన సమృద్ధికి సర్వసంపదలు కూడినందులకు ఆమెపుణ్యము మును పొగడుచు తమజీవితములకు తమఅదృష్టమునకు రోయుచు ముఖములు చిన్న చేసుకొని తదేకధ్యానముతో చూచుచుండు నంతలో శాంతిహోమము అయిపోయినది విధిప్రకారము శీమంతము చేయవలసినవిధుల కుపక్రమించి చేయుటకు గాను అత్త గారు తెచ్చిన కొత్తవస్త్రములు తట్టలోపెట్టి పౌరోహితుడు ఆశీర్వచనముచెప్పి రాముకు సరోజకు ఇచ్చినాడు వారుకట్టుకొనుటకు లేచిపోయినారు.

పురోహితుడు ఉదకశాంతికి కావలసినవన్నీ తెప్పించుకొనుచు హోమము చూచుకొనుచుండగా ఏడెమూ సేయవేయను త్యాగరాజకృతిని జంటగా మేళములు శబ్దము మేళవింపచేసి మృదువయిన సంగతులు వెలువడింప డోలు వాళ్లువారిననుసరింప అనుసరించిరని అట్లే సంగతిపై సంగతి విసరుచుండ రోషము తీవ్రత జంటచేసి వెంటనంటి తరుముచుండ డోళ్లశబ్దములు ఉరుములు గుమ్మరించినట్లుండెను కన్నుల చూపేగాని చెవులు పనిచేయక పనిపాటలవాళ్లు పరవళ్లు త్రొక్కుచూ మూగివాళ్లవలె

చేసైగలు చేసుకొనుచుండిరి అందున్న ప్రజ కన్నులు చెవులు వారిపైపడి లీనమై వారిలో కలసిపోయి దేహములేమరచిపోయి ఉండిరి పురోహితుడు మంత్రము చెప్పు చూచెప్పుచూ ఎక్కడనో ఆగిపోయి కొనసాగపోవుటకు వీలులేక విసుగెత్తి కన్నులు మూసుకొని వింటూ శివమెక్కిన వానివలె ఆడుతుండెను అంతలో రాము సరోజ నూత్నవస్త్రము లలంకరించుకొనివచ్చి పీటలముందు నిల్చినారు నాగస్వర నాదముల నాట్యమాడుతూ మైమరచుజీవుల ఇటుచూడుడని కన్నులుమేలుకొల్ప ఒక్కుమ్మడి వీరియందు కన్నుల కేంద్రీకరింపచేసి చూచి అద్భుతానందము లలముకొనగా అబ్బా అన్నారు సరోజకట్టినచీర గొప్పవెలయై ఉండవచ్చు బంగారు చాయగలిగి అందులో బంగారు జలతారు కయ్యాలుండి అడుగు వెడలుపు జలతారులో చిత్రవిచిత్రములుగా నేయబడిన అంచు అబ్బురపడి చూచినదే పదేపదే చూడవలెనను పైటకొంగు కలిగి ఉన్నది దేహకాంతికి మిన్నగావలెనని జలతారును జలతారును మించవలెనని దేహచ్ఛాయ నొకదానినొకటి మించలేక ఉజ్జ్వలతతో వెలుగును క్రక్కుతుండెను చీర అంచునగల ఎరుపురంగు నాకుదీటుగల దిందేదీలేదని విఱ్ఱవీగుచుండ నిన్ను కాలదన్ను ఎరుపు మాయందు చూడమని పెదవులు తెల్పుచుండెను అంచున గీతై మిసమిసలాడు నలుపురంగు మిసమిసలు గ్రక్కుతూ మిన్నమిన్న నీకన్నమిన్న అనుచుండ మీకన్నమిన్నై మేమిందుంటిమని కనుసోగలు కోరలు దీటుచుండెను రవ్వల కరకంకణములు తళతళలు జిగజిగలు వెలిజిమ్మి వీరవిహార మొనర్చుచుండ కన్నులనుండి వెలువడు తళతళలు మెరుపులై వెన్నంటి కొట్టుచుండెను ముక్కుపుడక పాపటబొట్టు చెవులకమ్మలు ఒకరికన్నఒకరు వెలుగవలెనని సొంపు పెంపు చూప వలెనని హోరాహోరి పోరాడుచుండ సమయమెరింగి వెలివడు దంతములదీప్తి వాటెను పరాభవించి క్రిందికిరావద్దని పైకివిగదరుము చుండెను పాపభీతిలేక మనసుపట్టులేక మానవత్వముపీడి పశుప్రాయులై పైబడువారిని కాటందుమనని పూల వన్నెవన్నెలలో వకవన్నెయై నల్లత్రాగువలె జడముందుకు వ్రేలాడుచుండెను ముందున్న ఉదక కలశము సరోజ వక్షోజములచూచి వెరగుచెంది అందున్నవారిరు వురు నేనొంటరి వారువెలువడిన నావన్నెతగ్గునేమోనని సంకోచించి ముఖము వాడ్చు చుండెను ధర్మదూరులై మానవత్వము చంపుకొన్నజీవుల కాల్చి భస్మీపటలమొనర్తు పుణ్యులకు సర్వము చేకూర్తునని ప్రజ్వలించి నాల్కలు నలుమూలలకు చాచుచున్న హోమ యజ్ఞేశ్వరుడు జడకుచ్చులకున్న పైడిగిన్నెలలో తన్నుతానుచూచి వీడెవ్వడని విస్మయమంది తగ్గుచుండెను చంద్రబింబము ధిక్కరించినా కీడుగావని వెక్కిరించు

ముఖమున నెలవంకవలె ముద్దులొలుక తీర్చిదిద్దిన బొట్టును ఈశ్వరుడీనాడు తా త్రినేత్రము ఈశ్వరికిచ్చెనిదేల ననునట్లుండెను అట్లు సర్వాభరణ భూషితయై వెలు గొందు సరోజను చూచువారు కనుచూపును మరల్చుకుంద మన్ననూ వీమరించి ఆమెపైకేపోవును ప్రక్కనున్నవారు ఏమని తలంతురోయని తలంచి తప్పుకున్ననూ అటుదిరిగి ఇటుదిరిగి అక్కడికేవచ్చి వాలును ఇట్లు అందున్న ఆ మగ ఆననేల అబాలగోపాలము కన్నులు మనస్సులు శ్రమజెందుచూ కడకు దిగ్భ్రమచెంది యోచించువారుకొందరు ఎందో అయోమయముగా చూచువారుకొందరు వారిజీవిత ములకు తమజీవితములకు సరిచూచి తాముచేసుకున్న దుష్ఫలితమునకు తలలొంచు కొనువారు కొందరు ఏమిఫలము ఏమిపూజ ఏమివ్రతముచేసిన ఇట్లిమరుజన్మ మునకు రాగలమని యోచించువారు కొందరు వీపూజచేసి వచ్చిరోయని దిగ్భ్రమ చెంది నిలచూచువారు కొందరు భార్యాభర్తలిట్లు వకరికొకరు తీసిపోని అందమూ వయసు రెండుసతగ్గ ధనమూ విద్యా విజ్ఞానము బంధుమిత్ర పరివారసంపద ఇట్లి కుదిరి ఉండుటకు ఏపూజ ఏపుణ్యము చేయవలయునోయని దీర్ఘాలోచన సేయువారు కొందరు ఇట్లు వారివారి మనస్సులో యోచించు చుండగనే గంటకాలము నడచిపో యెను బృహస్పతులవారి వాగ్ఝరీ గంగాప్రవాహమువలె ఉప్పొంగి పోయిపోయి గమ్యస్థానముచేరెనది సీమంత కార్యకలాపములు ఆచారప్రకారము వడివడిగానడచి నడచి అవలగట్టుచేరినవి ఊఁ ఇంక కానివ్వండమ్మా హారతి అన్నాడు బృహస్పతి.

అదివరకే తయారుగాడున్న శివ హరిప్రియలు వసంతపుతట్ట తీసుకొని వారికి ఎదురుగానిలచి హారతిపాటను శ్యామ రాగములో శాంతముగా ఇరుపురిధ్వనిని మేళ వింపచేసి చక్కగాపాడ నారంభించగా రాము సరోజ ఒకరిముఖము ఒకరుచూచు కొని చిరునవ్వుతో తలలూచుచున్నారు అదేమిటైఉండునని చూచినవారు ఆలోచించు చుండిరి ఈపుష్పములకు వన్నెగొప్ప అనుకుంటే సువాసన సువాసనే అనుకుంటే రుచికూడా బ్రహ్మనిర్మించినాడు కదరా వీరిని గురించి పదిపద్యములు శ్రీనాథకవివలె ఆశువుగా చదువుదమాయని కవుల మనస్సు అట్టెముందుకు దూకుచుండెను నాగ స్వరముల వారిబుద్ధి ఆపాటలోదూరి అతికిపోయి కదలక మెదలక అట్టె నిర్జీవప్రతి మలై నిలచిఉండిరి డోలు వాళ్లు తలలూచుచూ శబ్దగతుల మనస్సులో నడిపించుచూ అర్ధనేత్రముల మూతతో ఆనందపడుచుండిరి నాగస్వర నాదములో నాగులుమనస్సు లీనమై తలలూచినట్లు తలలూచువారు తాళమువేయువారు కొందరు ఈముప్పేరు

ఏపుణ్యమూ ఏపూజాచేసి ఇట్లు బ్రహ్మచేనిర్మింప బడిరో తైతక్కల గురువుల నడుగక జోస్యులవారినడిగి తెలుసుకొని తప్పకసాధించి మరుజన్మలోనైనా ప్రజలలో చుక్కలలో చంద్రునివలె ప్రకాశించి వేనోళ్ల పొగడించు కొనవలెనని పడుచు పిల్లలు మొదలుకొని పరిపక్వమయిన పండువంటి ముదుసళ్లవరకూ స్త్రీలు తలంచు చుండిరి ఇట్టిస్త్రీల వివాహమాడి నయనానందము కర్ణానందము స్పర్శానందము సురతానందము నొందని పురుషుని బ్రతుకు వ్యర్థము ముమ్మాటికి వ్యర్థము అట్టిజన్మను సృజించు కొనుటకు ఎట్టిసుకృతము చేయవలయునో ధర్మశాస్త్రజ్ఞుల జోస్యులకలిపి తేల్చుకొని జీవితాంతము వరకు కష్టించి తపస్సుచేసి మరుజన్మలోనయినా ఈయానందాన్ని పొందవలసినదేనని యువకులు మొదలుకొని నిండువయసుమెల్లిన తాతయ్యల పర్యంతము తలంచుతూ ఆపాటలోగల మృదు మాధుర్యమునకు కర్ణములు రూపమునకు కన్నులు ముగ్ధతచెంది మనసునగలుగు ఆశలతో ముసిముసి నగవులు ముఖమునదోప కన్నులు కర్ణములు కలిసిమెలిసి శివ హరిప్రియులపైనే నిలచి ఉండగా పాట అయిపోయినది ఇంతపాటకు ఎంత జమకట్టుమరో దంపతులు అని చెవుల సర్దుకొని కన్నుల చురుకుగా దంపతులపైకి పంపినారు రాము తనచేతిలో ఉంచుకున్న రాళ్ల ఉంగరములతీసి సరోజ చేతికొకటియిచ్చి తాను తాంబూలములో పెట్టి శివప్రియకు ఇస్తూ ఏమికావలెనో ఇంకా అడుగు ఆపాటకు ఈతానుకచాలదు అన్నాడు రాము నవ్వుతూ.

ఊఁ అడుగూ అంటూ హరిప్రియ వ్రేలికి ఉంగరము పెట్టినది సరోజ.

ఇరువురూ సంతోషించినారు శివప్రియ ఛలోక్తిగా కలుగబోయే అబ్బాయికి కలుగబోయే అమ్మాయిని చేసుకుంటామనండి చాలునంతే నన్నది.

ఊఁ చెప్పు అంటూ సరోజను చూచినది హరిప్రియ సరోజసిగ్గుతో తలవంచినది.

ఇద్దరూ ఇద్దరినిచ్చినా చేసుకుంటాము వద్దనము ఊఁ ఇంకా అన్నాడు రాము.

చాలుశక్తికి మితిమీరి అడిగినాము ఇంకధర్మము కాదంటూ వసంతము ఇరువురకు బొట్టుపెట్టి దండముపెట్టి వసంతము వాకిటిలో పోయను శివప్రియ పోయెను.

హరిప్రియ ప్రక్కన నిల్చెను.

ఈ పుష్పములకు వన్నెవాసన రుచిగాక వెలుగుకూడా ఉన్నది గదరా అరెరే అని మనసు పట్టలేక కవిత నాపలేక భావముల అపలేక ఒకమహాకవి లేచి రాము ప్రక్కచేయిసాచి.



కం॥ కలియుగ దేవేంద్రునివలె అన్నాడు

అంతలో రంగనాధం చేతులుజోడించి కవిగారూ భోజనానంతరం చక్కగా కూర్చొని తమపద్యాలతో ఆనందిస్తాము ఇంక కొన్నికార్యము లున్నవి తమ ఆశు ధారకు అభిప్రాయమునకు ఆనందమునకు అడ్డము వచ్చితిననుకొనక కొంచెము ఆపండి వినోదకాలమున్నది వెనుక అన్నాడు.

అబ్బా ఆపకుండా ఉండిన ఇప్పటికి రామశరమువలె పదిపద్యాలు వెళ్లిపోయి ఉండునేస్వామీ అంటూ కూర్చొన్నాడు కవి.

వేరొక వేదపండితుడు ఫలాక్షతలు తీసుకొని ఆశీస్సు మూర్థికను ప్రారంభింప బోయినాడు.

భుజంగరావు వారినిచూచి స్వామీ వేళఅతిక్రమించకుండా తామూ బృహస్పతులవారు స్వరము మేళవింపచేసి దంపతులవెంట చెప్పతూపోతే పూజనీయులకు వందనీయులకు వందనములు సమర్పించి ఆశీస్సులు పొందవలెకదా తమ ఆశీస్సులు వందనములు రెండూ అయిపోతాయి పదండి అన్నాడు

ఆయన సరేనని ప్రారంభించినాడు దంపతులు పీటలపైలేచి దేవుని దగ్గరకు ముందుపోయి నమస్కరించి చెప్పుకోతగ్గవి చెప్పుకొని వెనుదిరిగి అమ్మానాన్నను పిలిచి దంపతులకు ఇరువురికి వకేతూరి నమస్కరించేది ఇరువురితో వకేతూరి ఆశీస్సులు పొందేది శ్రేష్ఠము నాన్నా అన్నాడు రాము.

బృహస్పతులవారిని మరచినావా అన్నాడు రంగనాధం.

లేదు నాన్నా ఋషులను వంశపరంపర గురువులను తలంచి నమస్కరించి నాను బృహస్పతులవారికి నమస్కరిస్తాను అని వెనుకకు చూచినాడు రాము.

ఊఁ వెంటనే ఉన్నాను అన్నది సరోజ.

ఇరువురూ బృహస్పతులవారికి నమస్కరించినారు శతమానం భవతి అని ఆశీర్వదించి ఫలాక్షతలు ఇరువురపైనవేసి కీర్తివంతులై ఎడతెగని సంపదలతో పుత్రపౌత్రాభి వృద్ధితో ఆయురారోగ్యములతో నూరేండ్లు మనండీ అన్నాడు పౌరోహితుడు.

తల్లీ తండ్రికి అత్తామామకు యింకాపెద్దవారికి నమస్కరించి వచ్చి బావా అన్నాడు రాము.

ఆ నాకెందుకు బావా పెద్దవారికిచాలు నీకన్నా ఏమంత పెద్దవాణ్ణి అన్నాడు శివప్రసాదు.

అట్లకాదు బావా చెరివక కూతుర్నికని నాకొడుక్కు ఇద్దరుభార్యలు అయ్యేటట్లు కష్టములేనట్లు ఇప్పుడే వకదండంపెట్టి అడుక్కుందామను కున్నాను వంటి అలుతో ఎంతకష్టముండేది తెలుసుకున్నాను వానికైనా ఈకష్టముంటుంది అని గ్రహించు కున్నా దండముపెట్టి అడుగుతా బావా అన్నాడు రాము.

అందరూ నవ్వులో నవ్వుకలిపి నవ్వేవేళకు నలుమూలలనున్న వారందరూ ఏమోనని అక్కడికే గుంపుగా చేరినారు.

సిగ్గూ బిడియము తమ్మాశ్రయింప జారుకుందమని జారుకొను బావగారికి రాము అడ్డమునిల్చినాడు శివ హరిప్రియల సరోజ పట్టుకవచ్చి అన్నగారి ప్రక్కనిల్పి రామూ తానూ నమస్కరించినది.

ఆనందము ఆశీస్సులు గృహము నాక్రమించి ఉబికి బైటికి పోవుచుండెను ఫలాక్షతలు నలుదిక్కుల నలుమూలల నాక్రమించి చూచి కాలుంచుడని చెప్పు చుండెను అతిజరూరుగా గృహము శుభ్రము చేయువారు కానివ్వమని తొందరించు వారు కోతులవలె వాసనబట్టి తొంగిచూచి పదార్థములకై పిల్లలు తల్లుల బాధింపగా ఇకభోజనాలకు లేస్తారు తొందరపడకుడని పిల్లల అదుపులో పెట్టుకొనువారు కొంచెము ఓపికపట్టమని అరవకూడదని అడుగకూడదని బుద్ధిని గరపువారు ముందే సంస్కరింపబడిన పిల్లలు ఆజ్ఞాబద్ధులై వకచోట కూర్చొని ఎవరేమి చేయునది చూచు చుండ వీరుసంస్కరింపబడిన పిల్లలని అనుకొనువారు పిల్లలబాధ భరింపలేక కోప మును బట్టలేక నాలుగు వడ్డించువారు ఇక్కడకొట్టితే ఏమొస్తుంది ముందే చక్కగా తీర్చి అదుపులో పెట్టుకొని ఉండవలెననువారు తీర్చనిపిల్లలు తులువలై ప్రతివానికి అడ్డమువచ్చు చుండ పిల్లలా పిడుగులాయని దూషించువారు సంస్కారములేని పిల్లల పోరు పగవానికొద్దురా రామా అని చీదరించుకొనువారు ఉండ జ్ఞానాంబ కొడుకును కోడలిని పిలచి ఈకొంచెము కాఫీ త్రాగండి ప్రొద్దుపోతుంది అని యిచ్చినది.

రాము తీసుకొని త్రాగుతుండగా సరోజ ఇంకకొంచెము ముందుకుపోయి త్రాగుచుండెను అంతలో శివప్రియ సరోజ చెంతకుపోయి మాఅమ్మ కోడలిపైన ఎంతప్రీతి అని రెండుచేతుల సరోజనుచుట్టి అలింగనముచేసి ముద్దుపెట్టుకున్నది వక ప్రక్కన పెట్టరాదుఅక్కా అని రెండవప్రక్క హరిప్రియ పెట్టినది.

సరోజనవ్వుతూ చూడవే అమ్మా అన్నది

అత్తా అమ్మా చిరునవ్వు నవ్వినారు.

ఏమోనీవు అమ్మకుచెప్పితే మేము అన్నకు చెప్పలేము అన్నకు దీక్షను కుల పర్వతమువలె అడ్డపెట్టినావు లేకున్న అబుగ్గలు కందిపోయి ఉండు నీసోయగము నకు విలువవచ్చి ఉండు మా అన్నవంతు మేము తీర్చుకున్నాము అవి నీసొత్తా మా యన్నసొత్తు ప్రకృతం మాసొత్తు అన్నారు నవ్వుతూ.

అంతలో రాము అక్కడికివచ్చి ఎటూనన్నుచేరనీదు యారదోలింది యల్ల దోలింది నావంతు మీరైనా చెల్లించండి అరూపమూ వేషము వృథాపోకుండా అన్నాడు రాము.

వెనుదిరిగిచూచి సరోజ ముఖమండలములోవెల్గు అమృతకిరణుని చల్లదన ములో ప్రణయకోపము పొడసూపు తలవూపు కలిపి ఊ చూస్తారు కావలసినంతా చేసినన్నాళ్లు నేనుచేసినా విడచినా మిగిలింది మీరుచేయండని చెల్లెంద్ర ఎగదోలు తారేమో ఇక్కడగిట్టవు స్వామి అన్నది సరోజ.

అన్నంతలో శివప్రియ అందుకున్నది,

వదినా ఇదిశివప్రియ హరిప్రియకాదు ముప్పది మూడుకోట్ల దేవతాబలమంతా నాలోఉన్నది శివశక్తిని ముజ్జగాలు ఆల్లాడించే సామర్థ్యురాలను నా ముందర నీయాటలు సాగవు మాయన్న ఆజ్ఞయిచ్చినాడా అయిపోయింది ఆచెక్కల నునుపు మెరుపు కందిపోవలసిందే హరిప్రియ ఊరకున్నా శివప్రియ ఊరుకొనదు లయం లయం విలయం ప్రళయం అని ముజ్జగాలు మ్రోగేటట్లు డమరుకం వాయించుతుంది అన్న ఆజ్ఞను జవదాటక శిరసావహించి కావలసినంతా చేస్తుంది అన్నది నవ్వుతూ.

అనసూయమ్మ జ్ఞానాంబ నవ్వుతూ ఇంక కానివ్వండమ్మా మీ అట్లాటా పోట్లాటా మళ్లి చూచుకుందురు వేళఅయినది అంటూ భోజన కార్యక్రమములో పాల్గొన్నారు.

స్త్రీలకంతా వక్కవైపు పిల్లలతల్లులకంతా మరొకవైపు పురుషులకంతా ఇంకొకవైపు ఏర్పాటుచేసి గొప్పగొప్ప అరటిఆకులు వేసినారు అందరూపోయి కూర్చున్నారు ఉపపాత్రలతో పాత్రలు మంచినీరునింపి ఉంచి వంటవారు వడ్డించు వారు జట్టీలవలె తగుపరికరముల పదార్థములు నింపుకొని ఏమి ఏమి అంటున్నారు.

వకడంములో గరిటగదవలె భుజమున నిడుకొని అగ్రజా వెరగందెదవేల దర్వీమాత్రి ద్వితీయుండనై నేనొక్కండనేపోయి క్షుద్బాధా పీడితులై ఎప్పుడెప్పుడని ఎదురుచూచు ఆబాల గోపాలంబులకు క్షణంబులో వడ్డించెదను చూడు అన్నాడు.

ఓరీ శుంఠాగ్రేసర చక్రవర్తీ సకలగృహవర్తి మార్జాలచక్రవర్తీ ముష్టిఘాతంబున మున్నిద్దర పదఘాతంబున పన్నిద్దర శిరోఘాతంబున మరిద్దర వధింపగల వలలుండిందుండగా వంటింట రద్దుచేసెదవెందుకురా శుంఠా అని పులిఆట ఆడ ప్రారంభించినాడు.

చూడుచూడమ్మా వీళ్లేమి చేస్తున్నారో అన్నది ఒకామె.

ఈపనులకు వచ్చేవారిలో బుద్ధిమంతుడు ఉండేది అరుదు అదృష్టహీనులయిన వారికి పరులచూచి నేర్చుకొను నేర్పు గౌరవప్రతిష్టలతో బ్రతుకవలెనను తలపు ఉండదు ఇటువంటి తుంటరితనాలు వేనకువేలు నేర్చుకుంటారు వీరిబుద్ధిలో శనిదేవత తిష్ఠవేసికూర్చొని ఉంటుంది వారిబ్రాత అని అన్నది.

సోమనాథరావుగారు పంక్తిలో అందరిఎదుటానిల్చి స్వామిగారు ఈ పంక్తులలో ఏవయినా లోపములు జరుగునప్పుడు సవరించమని రంగనాథముగారు నాకు ఆజ్ఞాపించినారు అందరూ అన్యథాభావించక భోంచేయు సంతవరకు దయయుంచి నామాటను వినవలసివచ్చునని మనవి అంతా పిల్లవాండ్రు ఒకవైపునకూర్చొనుట న్యాయసమ్మతము ఆచార వ్యవహారములలో వ్రతనియమములలో సర్వవిషయములు తెలిసి ఆరితేరిన వయోవృద్ధులమధ్య పిల్లలు కూర్చొనరాదు ఏవోకొన్నిలోపములు జరిపిన వారిమనస్సుకు నొప్పితగిలి ఏవగించుకొందురు. వారిమనస్సును నొప్పించిన పాపము ఆగ్నేయాస్త్రమై బాధించును సమవయస్కుల చెంతకూర్చొనుటే శ్రేయము పెద్దవారివద్దనుండి లేవండని పిల్లవాండ్రలేపి అదొకపంక్తిగా కూర్చుండ నియమించి ఒకరి కొకరికి కొంచెము దూరముగా కూర్చొనండీ భోంచేయునప్పుడు చేయిజారిపడి అవతలి విస్తరవరకు ఎగిరిపోవుటో విరచి తినడములో గడ్డలు మొదలగునవి ఎగిరిపోయి అవతలి ఆకులోపడుటో నములు తున్నప్పుడు దగ్గువచ్చి దగ్గినప్పుడు అటూ ఇటూ పడుటో చారూ పులుసూ మజ్జిగా మొదలగు ద్రవపదార్థములు ఒకాకునుండి మరొకాకువరకు పరుగిడిపోవుటో మెతుకులు ఎగిరిపడుటో జరుగును కొంచెము సందువిడచి కూర్చోనండి అని ఒకపిల్లవానిని చూచి సోమనాథం అబ్బాయిామీద తుండుపంచలేదేమయ్యా భోంచేయునప్పుడు తుండుపంచెగాని లేదా షష్టిపంచె మొదలగు గుడ్డలుగాని ఉండి తీరవలెనప్పా చూడు పెద్దవారు ఎట్లు కూర్చున్నారో నవయువకులవద్ద హాండ్ కర్ చీఫులు రొండికి ఎక్కినవి భోంచేయునప్పుడు కారమయిగాని పొరపోయిగాని దగ్గువచ్చిగాని కంటినీరు చీమిడి చెమట రావచ్చు మెతుకులు మూతికి ఇరుప్రక్కల కావచ్చు పొరపాటుతో గ్లాసులు దొర్లినీళ్లు

క్రిందికిరావచ్చు వాటన్నిటకు ఉపకరించుకొనవచ్చు పైన అంగవస్త్రం వుంటే అన్ని రంగములా ఉపకరిస్తుంది పాత్రకు ఉపపాత్ర ఉన్నట్లు వస్త్రమునకు ఉపవస్త్రం ఉండవలెనప్పా మంత్రులలోకూడా ముఖ్యమంత్రి ఉపముఖ్యమంత్రీ ఉంటే వుప నీకువద్దా ఉపలేకుంటే ఉప్పు లేని పప్పు అంటారు అన్నంతలో ఫక్కున నవ్వినారందరు.

నాకు పడిసెము పట్టలేమతే తాతా అన్నాడు ఆ పిల్లవాడు.

మేము అనుభ వజ్ఞులము మనుమడూ తెచ్చిపెట్టుకో చీమిడివచ్చి నప్పుడు నీరువచ్చినప్పుడు పదుగురు వినునట్లు బఱ్ఱునచీది ప్రక్కన తుడిచితే ఏవగించు కుంటారు పనికిమాలినబోకియని తలంచుకుంటారు మనుమడూ ప్రక్కనపంచెవుంటే ప్రక్కవారికి తెలియకుండా దానిని దానిలోకిపంపి ప్రక్కనకూర్చుండబెట్టి పనిఅయి పోయిన తదుపరి ఏపని అయినా చేసుకొనవచ్చు తెచ్చుకోపో అన్నాడు ఇంతలో వడ్డించడము కావచ్చినది ప్రక్కన వకముసలాయన గొంతుగూర్చొని చూపరాని మూటెముడ్లమూటెవలె మాపుతూవుండ ఎదురుగా కూర్చున్నవారు అసహ్యించితలలు వంచుకొనుటచూచి సోమనాధం స్వామీ పద్మాసనస్థితులుకండీ పెద్దవారు పరము పైనేకన్ను యిహముపైనలేదు ఎదుర కూర్చున్నవారు తలలు వంచినారు పెద్దవారు ఇట్లైతే ఎట్లు అన్నాడు.

ఆయన వెంటనే పద్మాసనమువేసి కూర్చొని తలవంచినాడు.

ఆదెబ్బతో అందరూ బాగాసవరించు కున్నారు వకాయన అర్ధపద్మాసనము అన్నట్లు ఆడవారివలె కూర్చొని వుండగా సోమనాధంచూచి అయ్యా స్వామీ అర్ధ పద్మాసనస్థితులైనారే పూర్తిచేయండీ ఆహారగొట్టము చిత్తులు చక్కగా నిలుస్తాయి లేకున్న వరగబడి ఉంటను ముందుకువంగి భోంచేయడమునకు చక్కగా ఉండదు దండిగా పట్టదు ఇది స్త్రీల హక్కు తమరు తీసుకొనకండీ వారుమన పద్మాసనము గుంజుకుంటారు అన్నాడు.

ఆయన అట్లనా యని పద్మాసనస్థితుడై కూర్చున్నాడు.

అంతలోపల రాము శివప్రసాద్ హరిప్రసాద్ ఇంకాముప్పురి త్రోడుత్రో ప్రతివిస్తరా తక్కువెక్కువలు పరిశీలిస్తూ ఉన్నారు వంటవారు వడ్డించువారు నూత్న వేషములతో నూత్నవిధానముగా తిరుగుచుండుటచూచి అందరూ ఎగజూడ ప్రారంభించినారు అందులో వకరు వడ్డించు వారినిచూచి అయ్యా వేషాలు ఎట్లన్నాఆయె వకేఅంచుగల తుండుపంచలు డజను ఎట్లవచ్చెనా అనుకుంటూ వున్నాము అన్నాడు.

ఈచోటు అన్నిచోట్లవలె కాదయ్యా అందాల చందమామా అటుచూడు వని వారికన్నా మేస్త్రీలు జాస్తీ వుండేది కానరాలేదా త్రిలోభుల సంస్థానం కాదిది త్రిదేవుల సంస్థానం నూరుమందికి పాత్రలు వుపపాత్రలతో నీరువుంటే అటూ ఇటూ మంచినీళ్లనిల్వ గంగాళాలు వక్కొక్క గంగాళందగ్గర ఇద్దరు చెంబులు చేతబట్టుకొని చూపెట్టుకొన్న జట్టీలు వున్నారు తక్కువెక్కువలు చూడను త్రిమూర్తులవలె బావ బావమరుదులు ముగ్గురు వియ్యంకులు ఇద్దరూ ఈ అయిదుమంది ఎట్లుచూచు చున్నారోచూడు ఈ విశాల హృదయములలో జీవన్యాయము తెలిసిన బుద్ధులలో లోభత్వం వుంటుందా వంటవాళ్లకు నీళ్లవాళ్లకు వడ్డించువాళ్లకు వీరందరినీ సరిచూచు తహసీల్‌దార్లకు మూడుడజన్లు తుండుపంచెలు అయి పోయినవయ్యా ఎట్లుంటేనేమి కార్యము అయిపోయిన దొకటి కడివేసిన దొకటి కాలమునడిచిన దొకటి అని చేసే లోభదేవుళ్లు దయలేని కాలభైరవులుకాదు త్యాగమూర్తులు విను చెప్పుతా వంటవారు మసి అవుతుందని మలిన మవుతుందని పాతపంచెలు కట్టుకొని సిగ్గూ బిడియములేక జట్టీలవలె ఎగచెక్కి చూచువారు అసహ్యించుకొనునట్లు వకపంక్తిలో వడ్డిస్తూ వుంటే వెనుక పంక్తిలోవారు తలలు వంచుకొనునట్లు చేస్తూ అయ్యా స్వామీ అర్ధబౌద్ధ మతము పుచ్చుకున్నారెందుకు ఆకొంచెం విడచి దిగంబరులు కాకూడదా అని నవ్వు వారు సామాను వంటగదిలోపెట్టి రాకూడదేమయ్యా పోయ్యేటప్పుడు ఎత్తుకపోమవే బరువెందుకయ్యా అని నవ్వుచుండ మనబల పరాక్రమముచూడు మాఘవా అని మరింత ఎగజెక్కి తిరుగుచుండెడి అతిరథులు మహారథులు వుంటారని వంటవారి తంటాలు తారామళ్లు తెలుసుకొని వడ్డించునపుడు ప్రతివాడు నడిమికి తెల్లటి తుండు పంచె చుట్టుకొనే తీరవలెనని చెమట బొట్లు బొట్లు చారులో పులుసులో అన్నములో పడుచుండ గమనించక తుడుచుకొన తుండుపంచె షష్టిపంచెలేక చేతతీసివేస్తూ పొగలో వేడిమిఎక్కి ముమ్మరమై తలకెక్కివచ్చు కంటినీరు వంటినీరు ముక్కునీరు చేతతీసివేస్తూ అడ్డమయినదానిలో ఆ చేతులేపెట్టుతూ పాపభీతియేలేక సంచరించు వారిని రోటివద్ద రుబ్బునప్పుడు ముఖముపైవెలువడు చెమట సెలయేర్లు పిండికి నీళ్లతో అవశ్యకములేక సరిపోవునట్లు పడుతుండ భుజముల వెల్వడి మిన్నేరు దిగజారి భూమి నాశ్రయించినట్లు మణికట్లవరకు ప్రవహించి పిండికి ఉప్పుకొరత దీర్చు చుండ కంఠమున గంగయై వక్షస్థలమున యమునయై ఉదరమున సరస్వతియై వెల్వడి పొంగిపొర్లి గట్లుతెంచుకొని త్రివేణి సంగమమగు బొడ్డునపడి అధఃకాయము నదాటి భూమినాశ్రయించు చుండ ఊగి ఊగిరుబ్బు చుండుటలో చిత్తకార్తిలో

జిల్లులవలె ఎగిరి ఎగిరి పిండిగట్టిపడనీక తడుపుచుండగా తుడుచు కొనుటకు గుడ్డలేక అందున సంభవించు పాపము తెలుసుకొనలేక సంచరించువారిని గమనించి ప్రతివక వ్యక్తి నడిమికి చుట్టుకొని ఉండి చిరుచెమ్మటలను కంటినీరును ముక్కునీరును తుడుచు కొనండని చెప్పియిచ్చినాడు ఇచ్చినదిగాక కర్తను అపాపము చేరనివ్వవద్దని ప్రాథేయపడి చెప్పినాడు అయ్యా మామయ్యా అందుకే వక తుండుపంచెను కట్టు పంచెపై కట్టినాము నడిమికి వకటి చుట్టినాము లోభదేవుళ్లస్థానము కాదులేవయ్యా త్రిదేవీ పరిపాలనా స్థానము అన్నాడు వంటాయన.

అబ్బా ఏమి చదివినావయ్యా షట్ కాండలు అయిపోయనా ఇంకా ఉన్నవా అన్నాడు మరి ఇంకొకాయన.

లేదయ్యా ఇంకా రెండు కాండలున్నవి వస్తాను చెప్పుతానని ఆయన లోపలికి పోయినాడు.

అంతలో వడ్డెనలన్నీ అయిపోయినవి గజము పొడవునకు తక్కువలేని అరటి ఆకులలో పిండి వంటలు కూరలు పచ్చళ్లు మొదలగు వాటెకు చోటుసరిపోయి అన్నము వడ్డించనే చోటు తక్కువయిన భోజనముచూచి నోటనీరూర ఎప్పుడెప్పుడని చప్పరించుచూ ఆజ్ఞకై అందరు ఎదురు చూచుచుండ అజ్యము అభికరించుచు ఢిల్లీ మెక్సుప్రెస్‌వలె పంక్తిలో వకాయన వెళ్లినాడు.

ఆసమయములో ఘనపాఠీ అక్షతల శంకరశర్మగారు తనశిష్యునిచూచి నాయనా భోజనశ్లోకము వకటి కానీరా తండ్రీ అన్నాడు.

కల్యాణీ రాగములో.

శ్లో॥ శబ్దబ్రహ్మమయీ చరాచరమయీ జ్యోతిర్మయీ వాఙ్మయీ
నిత్యానందమయీ నిరంజనమయీ తత్వంమయీ చిన్మయీ
తత్వాతీతమయీ పరాత్పరమయీ మాయామయీ శ్రీమయీ
సర్వైశ్వర్యమయీ సదాశివమయీ మాంపాతు మీనాంబికా!

అని శ్రవణానందముగా తలలూపి శబాస్ అనుచుండగా శ్లోకము ముగించినాడు వక పిల్లవాడు.

వెంటనే ఊరుకొనక వక అబ్బాయివక శ్లోకాన్ని కర్ణకఠోరమయిన స్వరముతో వకపాదము చదివినాడు.

అంతలో వకాయన వానిచూచి నాయనా నిల్పరా తండ్రీ అపరా కర్ణానందముగా ఉన్నదిరా నీకీస్వరము సృజించిన బ్రహ్మను వేనోళ్లపొగడ వలెరా సృజించి

నదిగాక తారతమ్య జ్ఞానము తారుమారుచేసి తక్కువెక్కువల గమనించు బుద్ధిని తల్లక్రిందులుచేసి వందలాది ప్రజ్ఞావంతులలో చెప్పుబుద్ధిని ఎట్లపుట్టించెరా నీపాడు గానూ ఊరుకోరా అన్నాడు.

మామయ్యా ముందుజన్మలో స్వరవిహీనులచూచి నీవలెనే మందలించి నవ్వి అల్లరుచేసి నానారీతులగోలచేసి ప్రజ్ఞాబలముచూపి అందరినీ అవమానించిన పాప ఫలము సంగీతము వచ్చినందులకు భగవంతుని ఎదుటవకనాడైనా పాడి నమస్కరించని దోషము చుట్టుకొని ఇట్లచేసినది పాప పరిహారము కానివ్వమని చెప్పుతున్నానన్నాడు అందరూ నవ్వినారు.

నాయనా భగవత్ సృష్టిలోగల విద్యగాని వస్తువుగాని తానునేర్చినది చేసినది వకనాడైనా శ్రీవారిఎదుటనిల్చి నాకుతెలిసినదినేర్చినదిఇది స్వామీ నీయనుగ్రహమున ఈజన్మకు లభ్యమయిన దింతేనని చెప్పుకున్నవానికి మరుజన్మకు మరింత ముందుకు పోవు శక్తినిస్తాడు దేవుడు లేకున్నలేనట్టే నాయనా సంగీతము విలువైనది సర్వ ప్రాణుల ఉత్సాహ లూగించిరంజింపచేయునది అట్టి సంగీతమునేర్చి భగవంతుని ఎదుటనిల్చి వకనాడుకూడా పాడని దోషమునీకు ఈజన్మలో చుట్టుకున్నది ఈకర్ణ కఠోరస్వరముతో తప్పుడు తాళముతో పాడితివా గుడితెంచుకొని గుట్టకెక్కుతాడు దేవుడు మనచెవులకన్నా వారిచెవులు చాలాసున్నితమైనవి వినలేవు వద్దు మానవులకే అక్కరకు కానివస్తువు దైవయోగ్యమగుతుందా నామాటవిని సహస్రనామ పారాయణ మొదలగు పారాయణులు జపములు సేవచేసి తరించు సంగీతము నీకువద్దు లేదని అందరు వినునట్లు పాడితివా పోతావు బలిచక్రవర్తి యింటికి బంధునై అన్నాడు అయన.

ఊ కానివ్వండి కానివ్వండని ఆపోశనముచేసి అందరూ తీర్థము పుచ్చుకొని ప్రాణాహుతులు వేసుకొని ఎగచూచినారు పంచప్రాణులవలె అయిదుమంది సోమ సూత్రములతో నెయ్యివేస్తూ వస్తూ ఉన్నారు బ్రాహ్మణార్థం బ్రాహ్మణుని కాదయ్యా అన్నా విడువకుండావేస్తూ ఏమయ్యా మానవునికి ఆజ్యం అయువు వట్టని తెలిసీ వద్దంటావే కానీ అరగక అజీర్ణానికి పడితే కొంచెం యెఱ్ఱగడ్డల కారముగానీ యెఱ్ఱ గడ్డల పొడికూరగాని చేయిస్తాములేఅవిమాకు సరిపోవన్నా అగకపోయినా ఆవాలరు మసి ఉండనేఉంది అదీకాదని ముందుకువచ్చిన వైశ్వానరమూర్ణం వకతులంవాడితే వరసందు పుట్టిస్తుంది వేడివేడినీళ్లు వకగ్లాసు లోపలపంపితే రాజబాటవేస్తుంది

ఆజ్యం ఆగంతుక మృత్యువుకాదులే భయపడకు పట్టినంతా పంపించు దేహానికి ఆరోగ్యం గాత్రానికి శాంతి అని దండిగా వడ్డించు చుండగా భూర్భువస్సువరోమితి దిగ్బంధః అని క్రిందినుంచీ పైకివుంటే సువర్లోకమునుండి భూలోకము వరకుదిగి బంధించుకుంటూ సువర్లోకము పోవువార్లుకొందరు నఖశిఖ పర్యంతము నాడులాడకుండా బిగించువారు కొందరు పదార్థములు మిగిలెనే ఏమిచేయవలెనని ఆశతో ఉదరము సవరించి కట్టువస్త్రము సడలించి వెగుటును పాడికూరల మధ్యవర్తిత్వముతో ఆపుతూ కారము నాల్కకు రాచుతూ రోషమును పురికొల్పి తిరోగమనములేకుండా పురోగమించువారు కొందరు ఇంటివారి మర్యాదను వారి ఆదరాభిమానమును వారి బంధుప్రేమను వారిత్యాగమును వారిఓర్పును శాంతమును వారి వినయ సంపదను భక్తిశ్రద్ధలనుచూచి ఆనందించువారు మెచ్చుకొనువారు కొందరు ఎంత తిన్నది ఎరుగక తిని మైకమై అర్ధకన్నుల మూతలతో నమలుతూ యోగి నిమీలిత నేత్రముతో భ్రూమధ్యమున జ్యోతిస్వరూపముచూచి ఆనందముతో మైమరచినట్లు తినేదానిరుచిలో కనేది వినేది మరచినవారు కొందరు ఏమికావలెనయ్యా అని వడ్డెనవారు హెచ్చరించగా ఆయాస మభినయిస్తూ మూసిన కన్నులు తెరచి ఆ అని చేసైగతో వద్దనువారు కొందరు అర్ధనిమీలిత నేత్రులై అటూ ఇటూ పొర్లుతూ అపాన వాయువులు వొరులు వినకుండా ఉపాయముగా విడుచుతూ ఎగబోసుకుంటూ కడుపు బరువై పంక్తి ఎప్పుడులేస్తుందని నలుదిక్కుల అర్ధకన్నులతో చూస్తూ.

శ్లో॥ అగస్త్యం కుంభకర్ణంచ శమ్యంచ బడబానలం
ఆహారపరిణామార్థం స్మరామిచ వృకోదరం॥

అని ఎడమచేత ఉదరము నిమురుకొనువారు. అమృతోపమానమయిన ఆహారం అమృతానికి మిన్నైన ఆజ్యం గిరిజా కల్యాణమున్నాటి భోజ్యం అన్నాడు. వకడు ప్రక్కనే మరొకడు ఛా ఛా గిరిజా కల్యాణములో భూతాలపోరు క్రిందా పైనా నీరు రుక్మిణీ కల్యాణమనరా అన్నాడు. ఓరీ బుద్ధిలేని దద్దన్నా రుక్మిణీ కల్యాణము రక్త ప్రవాహమురా ఎక్కడ చూచినా వీడ్పులూ చేమోడ్పులు ఓదార్పులు వడిగాల్పులు సీతాకల్యాణమనరా అన్నాడు. వరే గోపీ పూర్తితెగిన ముండమోపీ సీతాకల్యాణము రాముని కొకటే పోరాటం సీతకు వకటే ఆరాటం నీకూ నాకూ చేయివాటం లక్ష్మీకల్యాణమనరా వదరుపోతా అని వక దీర్ఘనిశ్వాసవాయువు విడిచినాడు. ఆయనప్రక్కవాడు చూచి అబ్బా ఎదురుగా ఎవరైనా వుండి వుండిన కొట్టుకపోదురుగదరా ఎంత బుసవిడిచితివిరా నీబుజ్జపగలా అన్నాడు.

పోరా మూదేవతా అజ్యముదెబ్బకు ఆ పాదమస్తకము చలవగమ్మినది. పది మందీ తినసీ పాపమని మంచినెయ్యిని తెప్పించి పంచపరమాన్నములుచేసి తినమని పారమార్థిక భూతదయ పశ్చాత్తాపముతో సంతోషముతో పంక్తిలోనిల్చి పారజూచు ధర్మాత్ములసొత్తు కడుపారతిన్నా అన్నదాతా సుఖీభవా అని కడుపార దీవించనున్నా నీవుమాత్రము ఉపపాత్రల కాటువేసి కోటుజోబీళ్లలో పెట్టవద్దు. ఆ బ్రహ్మాస్త్రము లోభులపై ప్రయోగించు త్యాగులపై ఉపసంహరించు అన్నాడాయన.

ఛీ పోరాజోగీ నాజోబీ వకటిపట్టీ రెండుపట్టీ అటుచూడుపో వకచీరా వక రవికా పైనతెచ్చుకున్నా వకమనిషిమోత పెద్దపెట్టెను తెచ్చుకొని ఇంటివారు వచ్చిన వారి సౌకర్యాలకు బాధపడుతుంటే వచ్చినవారు పిండివంటలకాడ ప్రారంభించి కాయగూరలు దొరికినా పోనివ్వక సోమర్లవి రవికబట్టలు కట్ బాడీలు సబ్బులు దువ్వెనలు అద్దాలు సవరాలు కాటిక బరిణెలు కుంకుమబరిణలు కుంకుమ పసపు సీకాయ పొడి కాఫీపొడి చక్కెరవరకు కంటి కగుపడిన చిన్నవస్తువులన్నీ కానక కొన్ని యజమానురాలిని యజమానిని అడిగికొన్ని మాపుణ్యమా అని పెట్టెలు నింపుకొని బండెడంత సంతోషముతో వకమనిషి ఎత్తుకపోలేనంత బరువుతో భద్రంగా ఇల్లు చేరుకొని సంవత్సరానికి ఇట్టివి నాలుగైదు అయితేచాలునంటూ పీళ్లపాడుగాను పెండ్లిండ్లు చేస్తేకదూ పిల్లవయసు వల్లకాడు చేరేటుంతవరకు అందులో సౌరభము కాంతి సౌకుమార్యము అడవిచేరేటంతవరకూ ముదరబెట్టి అయిదుమంది పిల్లలు అవతరించిన దానివలె తయారుచేసి పాపదమని పంపించే పెద్దలున్నారు మూర్తిపోయి ముచ్చెరువులలోపడి కుళ్లిపోయిన పిల్లలు యికమొగవారంటే పదహారు ఏండ్లలోనే ఇద్దరు పిల్లల తండ్రులయ్యే ఉంటారు ఎక్కడి పెండ్లిండ్లు అమ్మా అని తమ ఆదాయానికై ఎదురుచూస్తూ ఇతరులకు పిల్లల మాట్లాడే భా మా మ ఋలుంటారు బాగాపరికించి చూడయ్యా మేము కప్పులోళ్లమే నన్నాడు.

సరే వారట్లు ఉండనివ్వరా నీకథ చూచుకో బుద్ధిలేని పనిచేస్తావుకదరా అంటే నేనొక్కడనేనా అనేపాడుబుద్ధిని ప్రయోగించ వద్దురా పాడుబుద్ధిని వజ్జచేర్చుకొని పశుప్రాయులై పోతారు శుభసమయములలో శుభము పండుకొరకు అందరి ఆశీస్సులకొరకు భూతతృప్తిచేసి భూతమయుని మన్నన లందుకొను కొరకు బంధుమిత్రుల కలయికకొరకు శుభకార్యములు చేస్తుంటే ఇట్లమేము చేసేదెన్నడు చేసే శక్తిగలిగేదెన్నడు ఈబుద్ధి పుట్టేదెన్నడు అని మంచిబుద్ధిని తెచ్చుకొని ఇచ్చే ఇలువేల్పును అడుగక దొంగతనాలు శుభసమయాల్లోచేసే దౌర్భాగ్యులు మరుజన్మకు

మర్కటాలైపుట్టి చెట్లెక్కి ఆహారంకొరకుఅటమటపడుతూ పిల్లవాండ్రతో చిల్లరరాళ్లు వేయించుకొంటూ జీవితము నడుపవలసి వస్తుందిరా పిలిచి అన్నముపెట్టిన యింటిలో దొంగతనముచేసిన ద్రోహము పోదురాశుంఠా ఈ తంటా ఇంకనైనా మానుకొని మాన్యులవద్దచేరి మంచిమార్గము నేర్చుకో నేనొక్కడనేనా చేసేది ఎందరోఉన్నారనే తెలివితక్కువ వదలుకో అందుకే వారనుభవించు చుండేది రూపహీనతకై దుఃఖించు వారు కొందరు ధనహీనతవల్ల ఏడ్చువారు కొందరు వస్త్రభూషణముల కొరతకై చింతించువారు కొందరు విద్యావిజ్ఞానములు వెనుకబడినందులకై శోకించువారు కొందరు ఇందేయెందరో ఉండుట కన్నడలేదా పోతారు పోరాని అధోలోకాలకు పోతారు వారివద్ధతులు నేర్చుకొనవద్దురా మొద్దుపెద్దన్నా అన్నాడాయన.

అంతలో వకాయన తిరుగుబోత మిరపకాయను త్రిప్పి త్రిప్పి చూస్తూ ఉండుట వడ్డించు అయనచూచి నాతండ్రీ ఆలాటి చోటుగాదులే రిక్షల పులుసు బల్లుల తాళింపు ఈగెలచారు ఇక్కడ ఉండవులే అరుమంది స్త్రీలు షట్కృత్తికలవలె వలంటరీలవలె వంటవారిపై మేస్త్రీలవలె మూతతీసేటప్పటికి మూత రోత పడేటప్పటికి తోత చేయువారు కొందరు అటిగి ఎత్తించేవారు కొందరు చేతిపాత్రలలో మిగులు పదార్థములు భద్రపరుచువారు కొందరు వడ్డించువారు వంటగదిలో కాలు పెట్టులోపల పదార్థము అందిచ్చువారు కొందరు వస్తువ కొకరివంతున వైనము వరుస వైఖరి వడ్డెన నేర్పు, కూర్పు, ఓర్పు తెలిసిన యోధాన యోధులు స్త్రీలు ఉన్నారయ్యా వంటగదిలో మొగవారికన్నా ఆడవారిదే అందెవేసినచేయి అని అట్టే పెట్టి గట్టికట్టడి చేసినారు అటుచూడుపో అమరావతీ అలకావతీ మూతి మూడుచుకో వలె నన్నాడు.

అబ్బా తలతిరిగెనయ్యా అఘటనా ఘటనా సమర్థులయ్యామీరు వేలుచూపితే హస్తము దిగమ్రింగుతారు నా అంతరాత్మను గమనించి అరుకాండ వెళ్లచదివినా వయ్యా అన్నాడు.

వడ్డించెడి అయన అటుచూడగా వకాయన తిరుగబోత మిరపకాయల కరివేపాకును ఏరిపెట్టుట కంటబడినది ఎందుకయ్యా అట్లతిరుగబోత వస్తువుల ఎరిపెట్టావు అమ్మబోద చక్కగా తలకెక్కక అప్రయోజకుల బోధపారిందే తిరుగబోతకు కరివే పాకు మిరపకాయలు మేముచేసే దెందుకు పారవేయనా తిరుగబోత వస్తువుల తింతే జ్ఞాపకము నశిస్తుంది బుద్ధిబలము తొలగుతుంది అంటారు ఇదేమి శాస్త్రము

తిరుగబోత కూరకాగుణమురాదా అవిషయము అమ్మచెప్పలేదా ఓమహాపూరుషా అకరివేపాకు మిరపకాయలు నెయ్యిలో ఉడికినవయ్యా పప్పులోనంజుకున్నా వీరి వారగ ఉంచి మజ్జిగఅన్నములో నంజుకున్నా మంచిజీర్ణకారి తీపుయెంత తినివున్నా నెయ్యి ఎంతత్రాగిఉన్నా తలతోక వరకు పూరించి నిశ్వాసవాయువు విడువను సమాన వాయువు ప్రసారముగాను వీలులేకున్నా వీలుచేస్తాయి మంచిస్థితిలోకి తెస్తాయి చాదస్తుల మాటలనమ్మక తినవయ్యా కమ్మగా ఉంటాయి అజీర్ణభేదులు పెట్టే పిల్లవాండ్రకు ఉడుకుడుకు అన్నములో నెయ్యితో తయారయిన తిరుగబోతను వేసి చిటకా ఉప్పు అందులోచేర్చి కలిపి తినమంటారు భేదులు నిలుస్తాయి జీర్ణకోశ ముబాగా పనిచేస్తుంది నీవట్లబాల్యములో తిన్నవాడవుకాదు తిను అన్నాడు.

ఇంకొకశ్లోకము చెప్పండి నాయనాలేస్తాము అన్నాడు ఒకాయనశంకరాభరణ రాగముతో ఒకపండితుడు చక్కగా చెప్పను మొదలు పెట్టినాడు.

శ్లో॥ శ్రీమచ్చందన చర్చితోజ్జ్వల వపుశ్శుక్లాంబరామల్లికా
మాలాలాలిత కుంతలా ప్రవిలసన్ముక్తావలీశోభనా
సర్వజ్ఞాన నిధానపుస్తకధరా రుద్రాక్షమాలాంకితా
వాగ్దేవీవదనాంబుజే వసతుమే త్రైలోక్యమాతాశుభా!

ఔ ఏమిస్వర మాధుర్యము నిన్నేతల్లి గన్నదిరా మాయబ్బా ఏమితపస్సుచేసి సంపాదించినావు తండ్రీ నాల్గుమోముల నలువైనా తలలూచుతాడు గదురా జిహ్వా వాందము నయనానందము ఘ్రాణానందముగలిగి బ్రహ్మనందములో ఉన్నవారిని పరమానందములోకి దింపితివి గదప్పా మాయప్పా అనిలేస్తూ ఇంక లేవండయ్యా అన్నాడు.

అన్నదాతా సుఖీభవా అని అందరూలేచినారు.

మధ్యహాలులో తాంబూలాలతట్టలు సర్వవస్తుసామగ్రితో అక్కడొకటి అక్కడొకటి పదిచోట్లపెట్టి ఉండగా అందరూవచ్చి కూర్చొని తాంబూలాలు చేయుచుండ వంటవారితోసహా మిగులువారు భోంచేయ కూర్చున్నారు.

అక్కడ స్త్రీల భోజనము అతిచురుకుగా అయిపోయి మిగతా వడ్డేనవారు భోంచేయ కూర్చున్నారు.

అచోటు చాలా ప్రశస్తముగా ఉన్నది యాభైగజములు పొడవుతో ఇరవై అయిదుగజముల వెడలుపుతో నాలుగుగజముల ఎత్తుగోడలు చతుర్దిక్కులకట్టి లోపలి

భాగమున ప్రహరిచుట్టూ మూడుగజముల వెడలుపుతో వరండా నమర్చి మధ్యలో సువాసనగలిగి దైవయోగ్యములగు పూలచెట్లతో కాయా పండూ ఆకూ మానవ యోగ్యములగు చెట్లతో అలంకరణీయమై చూచువారి మనస్సుల చూరగొనుచుండెను అందులో పశ్చిమమున పురుషులకు తూర్పున స్త్రీలకు భోజన సౌకర్యములు ఏర్పాటు చేసినారు పుపుషులు ఏవోకొన్ని కాలయాపనకు మాట్లాడు చుండిరి తూర్పు దిశన స్త్రీలు భోంచేసి కూర్చొని విడియము తీడితీడి వేయుచుండగా అనసూయమ్మ సరోజనుచూచి సరోజా అందరూ కూర్చున్నారు అనుభవనీయులు ఉన్నారు కొన్ని అనుభవాలు అడిగి తెలుసుకోవమ్మా పిల్లల తల్లులున్నారు సంసార సారమంతా త్రాగి బాగా జీర్ణించుకున్న పండు ముత్తయిదువలు ఉన్నారు లోకానుభవమెరింగిన వారు ధర్మసూత్రములు మూలమట్టముగా నెరింగినవారు అనుభవచికిత్సలు అశ్వి నులకే తెల్పతగువారు గర్భపోషణ అర్భకరక్షణ ఆమూలాగ్రముగా తెలిసినవారు లౌకికనటనా చతురతలో దక్షులైనవారు ఆసేతు హిమాలయమేగాక ఉదయాద్రి నుండి హస్తాద్రివరకుగల ధర్మము లెరింగినవారు బ్రహ్మలోక పొలిమేరక్షణములో దాటగల వ్రతనియమ మంత్ర యంత్రములు తెలిసిసాధించి పేరుగడించినవారు మంత్ర యంత్రములేగాక తంత్రము లనంతముగా తెలిసినవారు భౌతిక ఆధ్యాత్మిక ములలో ప్రకృతకాలము నెరింగి కన్నూకాటిక చెడకుండా తిరుగుశక్తి నెరింగినవారు గలరు వారివారి అనుభవముల తెలుసుకొని జీవిత రక్షణోపాధి చక్కజేసుకోతల్లీ అన్నది అనసూయమ్మ.

ఔనని శివ హరి సరోజలు ముప్వురు పుస్తకములు పేనాలు తీసుకొని వచ్చి కూర్చొని వకాయమనుచూచి సరోజ చెప్పు అక్కా అన్నది.

ఏమి చెప్పుదునే నేను లేడీడాక్టరునా లేక నరుసునా లేక మంత్రసానినా అనుభవముగల అరవైయేండ్ల ఆడదానినా అని చిరునవ్వునవ్వినది ఆమె.

ఆమాటవిని జ్ఞానాంబ ఏమే అట్లంటావు ముగ్గురు పిల్లల తల్లివి నీకింకా అను భవము కాలేదా నీవు అనుభవించినవి అనుభవములో ఉన్నవీ చెప్పు ఒకరికొకరు చెప్పుకొని శ్రేయస్సు పొందవలయునుగదా సీమంత సమయముల అనుభవజ్ఞులు సీమంతినికిచెప్పి శ్రేయోదాయినిగా చేయవలయునుగదా అన్నది,

చెల్లీ ఇంతమంది పెద్దవారుండగా నన్నే పెద్దగా భావించి అడుగుటగొప్ప నాకుతెలిసినది అనుభవించినది చెప్పుతావిను నేను ప్రథమగర్భముతో నున్నప్పుడు ఏవోకొన్ని ప్రీతిఅయినవి మీబావకు బాగాతెలుసు ఒకరి అంతరంగికము ఒకరము

దాచుకోనివారము ఒకనాడు ఉర్లగడ్డ బోండావేసి పచ్చికొబ్బెరా బియ్యము నున్నగా రుబ్బి పాలుదండిగాపోసి చక్కెర తగుమోతాదుచేర్చి పొయిమీద పెట్టి చిక్కగా ఉడకనిచ్చి వేయించిన ముంతమామిడి ద్రాక్ష దండిగావేసి లేహ్యాపక్వముగానిచ్చి కొంచెము నెయ్యివేసి యాలకలు పచ్చకర్పూరం కుంకుమపువ్వుపొడి తగుమోతాదు చల్లి హల్వాపక్వములో దించినాను బోండాహల్వానాకు యిష్టమయినవి ఆశగా రెండు పూటలాతిన్నాను అదినాకు ఆరవమాసము ఏమిచెప్పుదులే అర్ధరాత్రిఅంతా భేదులు కడుపునొప్పి చెప్పనలవిగాదు ఆ మిగులు రాత్రి అంతా బాధపడినాను తెల్లివారినది మొదలుకొని చీము భేదులు మొదలుపెట్టినవి అయిదు నిమిషముల కొకతూరి పోవలసివస్తుంది పీకడ పీకడగాదు భేదివస్తుందనగా పొత్తికడుపు వడేసి నొస్తుంది చింత పిచ్చంత చీము వెలువడేటప్పటికి చచ్చి బ్రతికినట్లౌతుంది అదిమావారికి చెప్పు కొనలేక బిడియపడి ప్రక్కయింటి ముసలమ్మతో అన్నాను ఆమె ఉదయమే ఎందుకు చెప్పకపోతివే అని శొంఠి 2 తులాలు తెప్పించి దంచి వస్త్రగాలితంచేసి గరిటలోవేసి నెయ్యితో అనుకువగాకలిపి నిప్పులపైబెట్టి ఉంటయౌనట్లు ఉడకనిచ్చి గచ్చకాయంత ఉంటలుచేసి అప్పుడే ఒకఉంటను మ్రింగమన్నది మ్రింగినాను,

పథ్యం అవ్వా అన్నాను దీనికేమి పథ్యమన్నదామె సరోజా పదిగంటలకు తిన్నానోలేదో మూడుగంటలకంతా అర్ధం చక్కబడినది రాత్రికి ముప్పాతిక తగ్గినది రాత్రికొకమాత్ర తిన్నాను రాత్రిబాగా నిద్దురపట్టినది తెల్లవారి ఇంకతినలేదు అన్నది.

అంతలో పెండ్లిగాని పడుచుపిల్ల ఒకతె సరోజ దగ్గరకువచ్చి నవ్వుతూ అక్కా నేనొక అనుభవం చెప్పుతా వింటావా నీకేమితెలుసునే అంటావా అంటూ మోకాళ్ల భూమినానిచి మెడిమలపై పిరుదులనుంచి సరోజ భుజములపై రెండు చేతు లుంచినది ఇరువురి చిరునవ్వులు ఇరువురి కనుతళ్కులు ఏకీభవించి ఇరువురిముఖ మండలముల కెగబ్రాకి మినమినలాడు బుగ్గల ఆశించినది ఆశనటుంచి చంద్రకళ అక్కా భార్యగర్భవతియై భర్తను విరదోలి వేరుబండినప్పుడు భర్తగారు భార్యకని చేసినవాటిలో సారెలు తెచ్చిన వాటిలో వంటలు చేసినవాటిలో బాగా సగముతిని భుజము లెగబెరిగి కంటికింపుగా బలేసొంపుగా అక్కగారికి వుంటుంది మనసు మరి మరి చూడమంటుంది ఆలింగన సౌఖ్యము కోరుకుంటుంది సురత సుఖములను భవించ మంటుంది పోయినగాధల జ్ఞప్తికి తెస్తుంటుంది పతికౌగిటిలో వాలమంటుంది అని రెండు హస్తములు సరోజ చెంపలపైకి పోనిచ్చి తలడోచుతూ అనదూ మనసు అనదూ అని ముఖమువంచి కన్నులలో చూచినది.

అక్కడున్న వారందరూ ఆపిల్లమాటలకు చేయుచేష్టలకు ఆశ్చర్యపడుతూ ఓసి నీపుణ్యం పండా ఏమిమాటలే నేర్చుకొని చెప్పినట్లుందే అన్నారు.

ఆమె రచయిత్రి అన్నదౌకాయమ.

అబ్బా రచయితలు బోయి రచయిత్రీలు జాస్తిఅయినారు కాలం అన్నదొకామె.

ఇప్పుడేనేమమ్మా తొడదట్టి నేనున్నానని ఎదతట్టి నిల్చిన మొల్ల ముందటిది కాదా ఎందరో ముందుండినారు రూపభేదము లింగభేదమేగాని జ్ఞానభేదమేమీ లేదమ్మా అన్నదొకామె.

అందరూ నవ్వినారు.

నవ్వినది చూచి ఆమె ఎందుకట్ల నగుతారు ముందు ఆడవారు యుద్ధాలు చేయలేదా కవిత్వాలు వ్రాయలేదా సంగీతాలు పాడలేదా రాజ్యాలు ఏలలేదా ఏది చేయలేము నగుతారే జ్ఞానములో స్త్రీ పురుష భేదమేమీ లేదమ్మా అన్నది.

అంతలో చంద్రకళ మళ్లీ మొదలుపెట్టినది ఆ మమకారము పెరిగి పెను భూతమైపట్టి బాధించును భర్తదగ్గరచెప్పిన సిగ్గుపోవునని ఈ మమకారాన్ని మాన మువిడచి ఆయనతో చెప్పుకునేదెట్లనని పదేపదే వారినిచూచి నవ్వుతూ సమీపించుతూ కాటుక కంటితళ్కుల సంకెళ్లు కాళ్లకువేస్తూ చిరునవ్వుల సంకెళ్లు చేతులకువేస్తూ పెదవులపై నాల్కాభినయము చూపి అభిరుచిగొల్పి మాటల చాతురీమహిమా మంత్రముతో మరులుకొల్పి ఏదో పనిగలిగినట్లు అంచుకుపోయి కరస్పర్శచేసి చిరు నవ్వు వెన్నెలల చల్లదనము చూపితే అక్కా బావా మనస్సు చివ్వక్కుమనును పంచా యుధుడు పంచప్రాణము లెగిరిపోవునట్లు పొంచికొట్టును ఆదెబ్బలకు తాళలేక వెను దిరిగి చూడలేక చేతనాయుధములేక ఆగాయములకు ఓర్వలేక అవస్థపడుతూ దుఃఖము కుమిలి కుమిలిరాగా ఈకాలానికి నాభార్యేనాకు శత్రువాయెనని బాధాని వర్తికై అన్యుల నాశ్రయించును అన్నంతలో సరోజనవ్వుతూ.

అయ్యో మరదలవు నీవున్నావుగా నాభారము నీవేవహించి బావ బాధా నివర్తిచేసి పుణ్యము కట్టుకోవే పుణ్యముంటుంది అన్నది నవ్వుతూ.

బావ బాధానివర్తికి నాదగ్గరకువస్తే శంకానివర్తిచేయించి ముక్కుచెంపలువేసి పంపిస్తా చెల్లెలికి అంతమాత్రము తెలుసు ఇటువిను బావపైప్రేమ దినదినాభివృద్ధియై మమకారము మనసుచేరి బాధింప ఉష్ణమగును అదిపెంపొంది ఇంతకు అంతై అంతకు ఇంతై ఆపాదమస్తకము వ్యాపించి నిద్రాహారములలో లోకువచేయును

దానితోమరింత ఉష్ణమధికమగునుఉష్ణాధిక్యముతో సన్నగకడుపునొప్పి చీముభేదులు కడుపులోబాధ కాళ్లతీపులు రాకున్నా శంకానివర్తికిపోవలె నసుబాధ చిట చిట తల నొప్పి మనోవికాసముతగ్గి మనస్తిమితము లేకపోవుట చిన్నగ తెల్లఛీరలగుట గర్భ స్రావములక్షు ద్వార్ధిక్షీయుట గర్భస్థునికి తగుఆహారములేక అంగములు లోపించుట చికిత్సలు లోపించిన జ్వరరూపమై బాధించుట తటస్థించును అక్కా అప్పుడు చెంపలు వేసుకొని ఇంకసురతసుఖాన్ని మనసులో చొరనివ్వకూడదు భ్రాంతిదానిపైకి మరలనివ్వకూడదు ఏకారి ఏకారి దేహము ఉడుకెక్కి దేహబాధగలుగును మనసు మార్చుకోవలెను లేకున్న గర్భమునకు గండమగును ఇంకబుద్ధివుంటే ఈపనిచేసు కోను వారికి కామవికారము గలిగించను సోదరులవద్ద వర్తించునట్లు వర్తిస్తా వారిని బాధపెట్టినేబాధపడను అని చెంపలువేసుకొని బావగారితో డజన్ అరటిపండ్లు తెప్పిం చుకొనిపూటకు రెండుపండ్లువలిచి గిన్నెలోవేసి నాలుగుతులాలనెయ్యి వకచమ్చా చీనా కలకండ పొడిగాని చక్కెరగానివేసి నురుగువలె అవునట్లు పిసికి బాగా చమ్చాతో కలియబెట్టి పుచ్చుకుంటే బాధానివర్తి అవుతుంది అన్నంతలో సరోజ తగ్గకపోతే ఇట్లి బుగ్గలుచీల్చేదా అని రెండు బుగ్గల పట్టుకున్నది.

ఆశ్చర్య పడువారు కొందరు చీల్చుఅనువారు కొందరు పిల్లగాదు పిడుగను వారు కొందరు వుండ.

విడూ చెప్తానన్నది నవ్వుతూ చంద్ర.

సరోజ పొపటబొట్టు ఇటుఅటు త్రిప్పుతూ శిలాజిత్తు భస్మాన్ని నాలుగైదు గంజలయెత్తు అదేపండ్ల గుజ్జులోవేసి కలిపి అయిదారు పూటలు పుచ్చుకుంటూ కారము పులుసు తగ్గించుకొని చలువ పదార్థములు వాడుకుంటూ బావపై పోవుబుద్ధికి బుద్ధి చెప్పి మరలించుకుంటూ వచ్చిన తప్పక నయమగును ఇవిలభ్యముగాకున్న పూటకు పొర్లుదోసెడు బొరుగులుతిని దోసెడు పెరుగుత్రాగేది నిలువకున్న కాసీససింధూరము గురిగింజయెత్తు శిలాజిత్తు గింజయెత్తునెయ్యితో కలిపి తీసుకొని ద్రాక్షకషాయములో కొంచెము నెయ్యి చక్కెరవేసి త్రాగేది ద్రాక్షకషాయమనగా నాలుగుతులాల ద్రాక్ష బాగానలియగొట్టి వకటిన్నర గ్లాసునీళ్లలోకలిపి బాగాకాచి సోపు నాలుగైదు గింజలు పొడిచేసివేసి కొంచెము ఉండనిచ్చి వడియగట్టినది ఇది ఉష్ణశాంతినిచ్చును కొందరు కాసీసము గర్భవతులకు ఇవ్వరాదందురు ప్రసవించినంతవరకు సమయానుకూల ముగా ఇవ్వవచ్చును అయితే వగరుగాని చేదుగాని ఉండక నెయ్యిలోకలిపితిన్నా నాలుకకు ఇంపుగా ఉండవలయును ఇదిఅందరూ వాడుకొనవచ్చు ఈ ఔషధము

ఇంటికి గృహలక్ష్మియెట్లో ఒంటికి అట్లక్కరకువచ్చును అయిదారువూటలతో ఉష్ణము పైత్యము హరించును జీర్ణముచేయును వాంతులు ఎక్కిళ్లనయము చేయును ఉష్ణము వల్లగలుగు నీరసము బలహీనత నరములలో సలుపు తలనొప్పి మనశ్చాంచల్యము చిత్తవిభ్రమము పోగొట్టును నిద్రపట్టకుండుట అన్నముపై యిచ్ఛలేకుండుట నోట నీళ్లూరుట రక్తము పాలిపోవుట వడిసెము పట్టుట వడిసెమువల్లగలుగు సచ్చు దగ్గు తలబరువు ముక్కులదిమ్మ పోగొట్టును ఆహారేచ్ఛ పుట్టించును వీర్యము ఉష్ణవీర్యమై నీరైసప్త ధాతువులు శోషించి రక్తము పాలిపోయి అన్నసారము రక్తముచక్కగా గాక మూత్రమై మూత్రముఎక్కువై లేకకాలిపోయి పచ్చగై దేహము నశించువానికి అమృతమై కాపాడును వీనిని క్షయలక్రింద జమకట్టుదురు క్షయాగాదు అక్షయాగాదు ఉష్ణాధిక్యముతో నిర్వీర్యుడై దేహముకృశించి యమాలయమునకు అతిథిగాపోవ నుద్యమించి ఉండును ఉష్ణమూ ఉష్ణపైత్యమువల్లనే సర్వవ్యాధులు జనించును వైనమెరింగి అనుపానవిశేషములతో యిచ్చిన సకలవ్యాధులను పట్టును చేసేవిధము నల్లకాంచాకు అంటారు ఇది అకుతోటలలో దొరుకును ఈయాకు అర్ధసేరురసము వచ్చేటంతతెచ్చి మూడుసేర్ల అన్నభేది కల్వములోవేసి ఈరసముతో చక్కగానూరి అనుకనుకుగా మూకుళ్లలోపెట్టి శీలుచేసి కుక్కుట పుటముపెట్ట వలయును నుగ్గులు ఎక్కువయిన కాలినల్లగగును కాలకున్న వగురు నిల్చునుగాన వకతూరి అనుభవము గల వైద్యునితో పుటముపెట్టించి చూచి అటుపై తయారుచేసుకో కుక్కుట పుటమనగా పెద్దకోడియెత్తు లేదా మోకాటికిలోపల అనిఅర్థం ఈమందు నీకూ నీమగనికి తప్పుతప్పు మాబావకు అమృతమై కాపాడును నిజము అక్కాఅని చెంపలపై చేతులు జారబెరికి తలకేసి నెటికలు విరచుకున్నది.

చిరునవ్వునవ్వుతూ సరోజ చంద్రకళ బుద్ధికుశలతకులోన మెచ్చుకొని తన రెండుచేతులతో కళనడుమును పట్టుకొని తల్లత్రిప్పుతూ అయిపోయెనా చెల్లీ అన్నది.

ఊహూ అయిపోలేదు నీముఖము ఇక్షుసముద్రము మహామధురము చంద్రునికి చంద్రకళలకు సముద్రమంటే మహాప్రీతి సముద్రమునకు చంద్రునకు దగ్గర సంబంధమున్నది. చంద్రుడు నీటికి అధిపతి చంద్రునిచూచి సముద్రుడు ఉప్పొంగి చెలియలికట్టదాట నుద్యుక్తుడౌతాడు సముద్రునిచూచి చంద్రుడు చంద్రకళలు మిన్ను నుండి మన్నువరకుదిగి సముద్రమును నీబోటి ముఖమండలముల చూరగొనదలంచువాడు మినమినలాడే నీబుగ్గలపై ఈచంద్రకళకు మనసుపోయింది. ఒక ముద్దివ్వు నీవద్దనేకూర్చొని వద్దన్నవరకూ చెప్పుతానంటు ముద్దుపెట్టుకున్నది.

అదిచూచి అక్కడున్నవారందరు నవ్వుచుండ వకామెలేచిపోయి చంద్ర మూతిపై చేయిపెట్టి వంగిచూస్తూ కాదె చుప్పనాతి బంగారును బంగారు సుత్తెతోకొట్టితే సాగదే ఉక్కుసుత్తె కావలయును దానికి పదును బాగానిలిచి వుండలయును స్త్రీ అందాన్ని చూరగొనేది పురుషుడు పురుషుని అదాన్ని తమిదీర త్రాగేది స్త్రీ స్త్రీ స్త్రీని ముద్దుపెట్టుకొనడములో లాభమేమి దీనికి అర్థమున్నదా వివాహము చేసుకో బుగ్గలు కందేటట్లు పడబిండుతాడు మోజుతీరుతుంది మోహమాగుతుంది మోమువాడుతుంది బుద్ధికుదురుతుంది దాన్ని ముద్దులాడుతా వెందుకే అన్నది.

అట్లుకాదత్తా విషయం స్త్రీని చూచి స్త్రీ అబ్బా ఏమిరూప మనవలెనంటే సామాన్యమా బుద్ధికి అతీతమై ఉంటేగాని అనలేదు పురుషుడు పురుషుని చూచి బాగున్నాడనవలెనంటే అవుతుందా ఎంతో రూపముంటేగాని అనలేడు ఏజాతి ఆ జాతినిచూచి మెచ్చుకొనదు అట్లమెచ్చుకొనిన అందులో గొప్పతనముంది మా అక్కనుచూచి ఏస్త్రీ మెచ్చుకోదు పురుషుడు స్త్రీని చూచి మెచ్చుకోవడం స్త్రీ పురుషుని చూచి మెచ్చుకోవడం వకవింతగాదు అదిసహజం నైజం ఓముసలీ చూడు పటికార్చి వన్నెబెట్టిన బంగారువలె నిగనిగలాడు చెంపలు గడ్డము పీటెలోగల రూపామృతాన్ని కడుపార త్రాగిన మాబావహృదయాన్ని అడిగితేగాని పీటెవిలువ బయటపడదు నీకూ నాకూ ఏమితెలుసునే వృద్ధనారీ అంతా అయిపోయిన దానివి నీవు ఏమితెలియనిదానిని నేను అవునా అక్కా తుమ్మెదకుతెలుసు పూల పుప్పొడిలోగల మాధుర్యము రెక్కలున్న పంక్షులకంతా తెలియునా నీయౌవనాన్ని రూపాన్ని పడబిండి పడదీర త్రాగిన మా బావకుతెలుసు ఈవృద్ధ జంబుకానికేమి తెలుసు ఈచిన్నపిల్లకు అంతకూ ఏమి తెలుసు అనునంతలో అమె తోకత్రొక్కిన నాగువలెలేచి బానే దీనికేమి తెలియదు మగడొచ్చి వుంటెచాలు కొకరివంతున ముక్కాలు డజను పిల్లలయివుంటారు యౌవనమూ దేహసౌష్ఠవము అశలూ కాలమూ స్కూలుపాలు పుస్తకాల పాలుచేసి వడబోయిన పండువలె కన్నెగాటువుంది యావన్నెలాడి సరోజనీకు అక్కఎట్లవుతుందే నీ వయసు ఇరవైరెండు దానివయసు. పంతొమ్మిడి చెల్లెలాఅని పిలువక అక్కా అంటుంది కథఎవరికీ తెలియదని అన్నదామె తల విసురుకుంటూ.

ఓ బుద్ధిబలములేని వృద్ధనారీ సరోజ పెద్దదిగాకున్నా పుణ్యములో పెద్దదేనే అతుకున్నట్లు అదృష్టాలు వాటెంతకవివచ్చి సమయానికి వాకిటిముందు దూకినవి సమయానికి వాకిటిముందు దూకినవి నాకట్లరాలేదే అందువల్ల అదృష్టంతో

అక్క సుఖంలో అక్క సుందరంలో అక్క ధనంలో అక్క జ్ఞానంలో అక్క కీర్తి గౌరవాల్లో అక్క కనడంలో అక్క అన్నిటల్లో అక్క అందుకై అన్నానే ముసలి నక్కా పెద్దవారు స్త్రీలూ పురుషులు చిన్నపిల్లల అక్కయ్యా అమ్మణ్ణీ అంటారే దానికి అర్థమేమి అమ్మయ్యా అంటే దానికిఅర్థమేమి గౌరవానికై ప్రేమనుచూపుటకై అట్లు పిలుస్తారేగాచి అక్క అయ్య అమ్మ అయ్యా ఏమిటిది అట్లనేప్రేమతో అక్కా అంటూ ఉన్నానే పుత్రి ప్రేమతోపెట్టిన ముద్దుకూ కామ ప్రేమతోపెట్టిన ముద్దుకు ఈరెంటి లోగల తారతమ్యము హృదయానికి తెలుసు నీకూ నాకూ ఏమితెలుసునే వృద్ధనారీ జంబుకమా అన్నది చంద్రకళ.

ఓసేయ్ సీతాకోకచిలుకా అని ఏమో చెప్పబోవునంతలో రాము ఇక్కడే విషయము సభజరుపుతున్నారని తలపూపగా.

అందరూ గబగబాలేచి నిలుచుకొని చిరునగవుతో పెద్దవారుచూచిరి సమ వయస్కులు సిగ్గు బిడియముగలవారు పండ్లు అగుపడకుండ నవ్వుతూ చంద్రునిచూచి కలువలు వికసించినట్లు ముఖకమలములు వికసింపచేసి ప్రక్కకు తలలు త్రిప్పు కొనిరి ధైర్యోత్సాహము కలవారు వస్త్రముల సవరించుకొనుచు నిలుచుకొని ఏమి చెప్పునోయని చూచుచుండిరి.

చంద్రకళ దిగ్గునలేచి బావొచ్చె బావొచ్చె బావొచ్చా అక్కకు ప్రీతిగా పిలు పొచ్చ అని పాటపాడి పైటను నోటికి అడ్డము పెట్టుకన్నది.

అక్కకు పిలుపులేదిక మరదలికే అక్క ఉద్యోగానికి మరదలు రావలసిందేగా హక్కుదారు అన్నాడు రాము.

అంతలో హనుమంతురావువచ్చి గురూ రామప్రభూ నమోన్నమః అని చేతులు జోడించుకొని తమశిష్యుడు హనుమంతుడు ఆశించిన ఈ మచ్చెకంటిని ఈ కలకంఠిని ఆశించబోకుడు రేపోమాపో సంజీవపర్వతము హస్తమున పెట్టుకొని ఆకాశంబునకెరిగి మున్నా రాముకడకువచ్చిన హనుమన్నపగిది ఈ చంద్రికను ఈ శరచంద్రికను హస్తగత మొనర్చుకొని తమకడకు వచ్చెదను గురూ ఆశీర్వదించి రెండు ఫలాక్షతలు తమచేతులారా వేయండి శీఘ్రమే వాసుపుత్రావాప్తి అనండి అని మోకరించి నమస్కరించినాడు.

అందరూ పకపకనవ్వినారు.

చంద్రకళ మూతిచిట్లించి ఈర్ష్యాకోపమూ ఉద్రేకింప షాడచూపుచూస్తూ పండ్లు పటపటకొరికి ఓస్వామీ రామచంద్రా తమకు వీరుభక్తులైనాకూడా వానరమూ

కలోవాడు వానరుడు ఆకోతులకు వాటెనైజము ఉన్నది దీనినైజము దీనికిలేమ మూడుమూర్ఖ యస్. యస్. యల్. సీ. తప్పిన ప్లవంగాధిపతి. అవినీతులన్నీ అమూలాగ్రముగానేర్చిన భల్లూకనాధుడు అచారవ్యవహార అహారవిహారము లెరుంగని శంతాగ్రేసర చక్రవర్తి నీతినియమములు భూతదయాలేని అసురనాధుడు పెద్దల మాటలు వినని పోతురాజు స్త్రీల పాలిటి మృత్యువు నాకు బంధురూపమై దాపురించిన పెనుభూతము స్వామీ దీనిబారినుండి తప్పించు ప్రభూ రూపములో అష్టావక్రునికి అన్న చేష్టలలో కోతికిమిన్న దయా అసురదయ జ్ఞానమా పశుజ్ఞానము బుద్ధిలో ఉచ్ఛిష్టగణపతి అబ్బబ్బా ఎంత బంధువైతేనేమి ఎంతన్యాయమైతేనేమి ఎంతధర్మమయితేనేమి స్త్రీ ప్రేమిస్తుందా అంచుకు రానిస్తుందా నీకుభార్యయైపుట్టి అందరిలో అవమానపడే దానికన్నా అగంతుక మృత్యువుపాలై అంతర్గత పిశాచియై మనుటయే మేలు పురుషుడైపుట్టినా స్త్రీయై పుట్టినా సార్ధకముండ పనిలేదా స్త్రీకుండే పౌరుషము కూడాలేని పురుషుని ఏమనవలె నారీపిశాచ మనవలెనా మాతా పితరులకు మారికా ఉపద్రవ మనవలెనా చెప్పుబావా అన్నది చంద్రకళ.

ఔనా హనుమంతా బాల్యములో మూడవ తరగతినాడే గురువరుడో మిత్రుడో చెప్పలేదా మాతాపితలు వక్కాణించలేదా.

కం॥ గడనగల మగనిచూచిన
నడుగులకును మడుగువిడుదు రతివలుదమలో
గడనుడుగు మగనిచూచిన
నడుపీనుగువచ్చె ననుచు నగుదురు సుమతీ!

అన్నది చదువలేదా అర్జించెడి ధనము జూచిగాని రూపము చూచిగాని పిత్రార్జితము జూచిగాని ప్రజ్ఞాబలము చూచిగాని స్త్రీలు పురుషుని ప్రేమిస్తారని చదువలేదా వినలేదాప్రజ్ఞావంతునిపేరు పెద్దలుపెట్టినారే పెట్టినందుకు సార్ధకము ఉండపనిలేదా అను చుండ అంతలో చంద్రకళ బావగారూ తమశిష్యులవారు హనుమప్పగుణాలు దూరముచేసి తిమ్మప్పగుణాల అనుసరించినాడు. ఆతిమ్మప్పకు గురువరులు ఏండ్లు మాత్రము ఇద్దరన్ని ఉన్నవి నాపాలిటికాలభైరవుడు ఎక్కడపోయినా వెన్నంటే ఉంటాడు ఇదినేను చేసినపాపము నాజీవితాశయాలు అడవి పూసిన మల్లెలైపోతున్నవి అడవి పూసిన మల్లెల సౌరభము దారిద్ర్యుని యౌవనము వకటే అన్నట్లు నాఆశలు నిరాశలయినవి అని వక నిట్టూర్పు విడచి పరాభవ పడినట్లు కంట నీరు పెట్టుతూ కూర్చున్నది చంద్రకళ.

అది రాము చూచినాడు అందులో ఏమో ఉన్నదని అందరూ వింతగాచూచి నారు హనుమంతరావు అదిచూచి తనజీవితాన్ని తనురోసి రామునుజూచి గురూ రామచంద్ర ప్రభో ఇటువిను నాసహపాఠీల కదందరికీ సప్తవ్యసనాలలో గురువునై విద్యాసంపదల కాలదన్ని కావలసినన్నీ చేసినాను పెద్దల దూషణలపొంది యిహాన్ని పరాన్ని ఇంతవరకూ చెరుచుకున్నాను మేనమామ కూతురితో కావలసినన్నీ చీవాట్లు వేనవేలు మందిలో నోర్లార్లసార్లు అనిపించుకొని అవమానపడినాను ఇంక యిహ సంబంధమయిన ఆశలువదలి పరసంబంధముగా పాటుపడతాను రెండవ వేమ నార్యుడు అని అనిపించు కుంటాను మాతృ పితృల సాక్షిగా భగవంతుని సాక్షిగా యిక సప్తవ్యసనముల జోలికిపోను ఇదే ప్రమాణము ఆనాడు ఆంజనేయులకు బోధిం చినది సీతారామాంజనేయ మయినది ఈనాడు నాకు బోధించినది లోకజ్ఞానమను పేర గ్రంథరూపమై ఉండునట్లు బోధించి జగద్విఖ్యాతమయిన కీర్తిని గడించు ఇక వివాహేచ్ఛమానుకొని స్వచ్ఛందమయిన హృదయముతో స్వేచ్ఛానుసారముగా యిచ్ఛవచ్చినట్లు కాలము గడుపుతాను అని నమస్కరించినాడు హనుమంతరావు.

ఎందుకంత ప్రతిజ్ఞాచేస్తావు వివాహము మానుకుంటావు అన్నాడు రాము.

ఔనుస్వామి నన్ను చూచినవారు విన్నవారు ప్రతిజీవి అనుమానిస్తుంది నేను చేసినచేష్టలు అట్లున్నవి ఈనాటికి ఈచీవాట్లతో జ్ఞానము వచ్చినది లోకము నమ్మ డమునకు నాబాధను తప్పించడమునకు తనయిష్టాను సారముగా తాను పోవడము నకు వ్రాతమూలకముగా వ్రాసుకొని వచ్చినాను చూచి ఆ అమ్మాయికి ఇచ్చేయండి నేను వెళ్లుతున్నాను గురూ నేను గుంటూరులో తమరిని కలుసుకుంటాను అని హనుమంతరావు వెళ్లిపోయినాడు.

రాము ఆ కాగితము విప్పి చదువ ప్రారంభించినాడు.

మహారాజ రాజేశ్రీ గౌవర్నమెంటు ఆఫీసరు రిజష్ట్రారుగారికి దేవరా మనవి నాకు తలిదండ్రులులేరు వారసులు అంతకూలేరు నామేనమామ నన్ను అయిదేడుల ఈడులో చెంతకుచేర్చి విద్యాబుద్ధులు కొంతవరకు చెప్పించినాడు నేను దుస్సహవా సముతో దురలవాట్లను నేర్చుకొని ఇంతవరకూ చెడిపోయినాను ప్రకృతం నామన సుమారి యిహసంబంధమయిన వాంఛలు మానుకొని దేశాంతరము వెళ్లుతున్నాను ఇంకవీరిని కలుసుకుందునోలేదో తెలియదు నేనిందు గనబరచిన ఆస్తిని యావత్తు నా మామగారి కుమార్తె చిరంజీవి చంద్రకళకు వప్పచెప్పుతున్నాను ఈనాటినుండీ నాకుగానీ నావారసులకుగానీ ఏలాటి సంబంధములేదు నేను స్వయముగా వ్రాసినాను

ఇదేరిజిష్టరు చేయప్రార్థన. నా ఆస్తీవివరము సర్వేనంబరు **381** తరి యిరవైయెక రములు రోడ్డువారమడి **292** సర్వేనంబరు ఏడునూర్ల యెకరములు కుష్కి దోవ వార చేను -ఈభూమీ వేయితులముల బంగారము వేయితులముల వెండీ లక్షకుపైన నగదు -ఈయావదాస్తిని దానవిక్రయము చేయించకోరి వ్రాసినాను ఇట్లనే దస్తావేజు చేయ ప్రార్ధన.

ఇట్లు,
బొందలదిన్నె హనుమంతరావు
బొందలదిన్నె పోష్టు
తాటిపత్రితాలూకు
(అనంతపురం జిల్లా)

అని వకకాగితము ఉన్నది రెండవకాగితము చదువ ప్రారంభించినాడు రాము.

చిరంజీవి చంద్రా నీతలిదండ్రులు నన్ను తలిదండ్రులకన్నా మిన్నగా సాకి సంతరించినారు వారిని నొప్పించుటకు నామనస్సు వప్పలేదు అఖరుకు తప్పలేదు యస్. యస్. యల్. సీ. తప్పిపోకున్న కాలేజీకి పొమ్మందురని వివాహ వాంఛతో కావలసి తప్పితిని నామనోగతము నీకుచెప్పితిని ఇంతటితో చదువు చాలించు వివాహము చేసుకుందాము మనము ఉద్యోగము చేయబోవునదిలేదు ఇంటివద్దనే చదువుకొని విద్యఅభివృద్ధి చేసుకుందాము పిల్లల అభివృద్ధికి బుద్ధిబలమునకు గౌరవమునకు కుటుంబరక్షణకు -ఈవిద్యచాలు దీనిఆధారము చేసుకొని ఎంతోపోవలయునన్న ముందుకు పోవచ్చును కుటుంబయాత్ర నడుపుతూ దినక్రమేణా విద్యాభివృద్ధి చేసుకొనవచ్చు జీవితాశయములు తీర్చుకొనడమునకు మంచితరుణము పోయిన కాలము తిరిగిరాదు అని శతవిధ ప్రయత్నములతో చెప్పితిని చెప్పించితిని తలిదండ్రులు కన్నీటితో చెప్పిరి చెప్పినకొలదీ మమ్మొక అబలుల క్రింద జమకట్టి అంతూ వంతూలేని అవినీతుల చూపితివి అనరాని మాటలంటివి పోరాని పోకడల పోతివి నీయట్టి ద్రోహినినేనయి వుండిన -ఈవేళకు నలుగురు పిల్లలతల్లి నాదగ్గరఉండును సాటి స్త్రీ ఎదిరించి నాల్గుచివాట్లు పెట్టుచుండిన నీవిద్యా నీఅధిక ప్రసంగము అధఃపతనమై అవమానములతో తలవంచి నీఅవక తవకలకు అవినీతికి చింతించి ఉందువు అది గమనించి మానుకొంటిని అభిమానించి ఇంతవరకూ ఉంటిని అదినాదుర్బలముగా భావించి కన్న తలిదండ్రుల కన్నీటి బిందువుల కంటచూడక భవిష్యత్ కాల గతుల గమనించక నామాటల లెక్కింపక లోకులను కొనునవి తలకెక్కింపక కాలేజీలో కాలుపెట్టితివి అనాడే నా ఆస్తిని వితడ్రా చేసుకొని విడిపోవుటగాని వెళ్లిపోవుటగాని

చేసిఉండిన నీవిద్య ఆగిపోయి ఉండును ఆటంకముచేసి నీయాశను ధ్వంసము చేయలేక తల్లిదండ్రులవలె సాకిన అత్తమామల దుఃఖింప చేయలేక విడిపోయి వివాహము చేసుకొని అత్తామామా అనుభవించే అధికారాన్ని భార్యకు అప్పగించలేక మేనరిక ధర్మాన్ని విడనాడలేక నాయాస్తిని నేను తీసుకున్న మీరుపడు కష్టముల గుర్తెరింగి పొందనలేక దీర్ఘాలోచనజేసి ముప్వురిని దుఃఖితుల చేయుటకన్నా నేనొక్కడ దుఃఖించుటయే శ్రేయమని వైతొలగుతుంటిని పరులకు ఉపకారము సేయుట ధర్మమన్న సూత్రముపై ఆధారపడితిని ఈశరీరమును వృధాసేయక దేశసేవపై వినియోగింప తలంచితిని నాకు మంచిమార్గము నీవల్ల లభ్యమయినది మేలుచేసినావు ఇదినావిధి ఈ కాలమునన్నంతగా బాధించలేదు దుఃఖమునకు తెలిసినవెనుక చోటులేదు త్యాగికి ఎందూచింతలేదు ఇంకనైనా నీవు తలిదండ్రులమాట తలకెక్కించి వారిని దుఃఖముల పాలుచేయక నాదేజ్ఞానమని తలంచక స్త్రీ జాతికే చెడ్డపేరుతేక చిత్తమును మంచి దారికి త్రిప్పి స్త్రీ ధర్మమేదో పెద్దవారినడిగి తెలుసుకొని కట్టుకున్నవాని మనస్సుకు వెగటుగాక ధర్మబద్ధవై సుఖపడు నన్నూ నిన్నూ ఎంతో అప్యాయముగా ఆనందముగా కంటికి రెప్పవలె కాపాడి మనజీవితములవారి జీవితములుగా భావించి ఎన్నో ఆశలతో పెంచి పెద్దచేసిన తలిదండ్రుల తలపుననుంచి వారిజీవిత రక్షణోపాదుల ధర్మమని జాగ్రత్తగా చూచుచు నొప్పింపక పాపము తప్పించుక తిరుగు వినయము విధేయతలేక మాతృపితృ వయోవృద్ధ దేవబ్రాహ్మణ గోసాదు సజ్జన ఆశీర్వాదము నొందని విద్య తెచ్చునది పాపమేనని తెలుసుకో చదివితినను గర్వము వదలుకో వకచోటనుండి వకచోటపండి వకచోటతిని వకచోటపెరిగి బాల్యము గడచుకొద్దీ తనువులూ తలపులూదూరమైబుద్ధులు మారిపోయినవిదేనివల్లనో ఎవరివల్లనోతెల్చుకో నాసర్వస్వము ధర్మమని నీయోగక్షేమములకై నీకే వినియోగించితిని దుర్వ్యయము చేయక సద్వ్యయముతో కాలము నడుపుకో ఎవరిమాట వినకూడదని తలచితివో ఎవరిని చూడకూడదని యెంచితివో ఎవరుండిన ఆటంకమని భావించితివో ఎవరిని చూచిన కంటక్రాయముగ చూచితివో ఎవరినిచూచి చీదరించి మూసితివో ఎవరికి తలంచి మెటికలు విరచితివో వారికన్నులకు కనబడరు వారిమాటలిక చెవులకు వినబడవు నీసుఖమే నాసుఖము ఇకశాంతిజెంది నీకోర్కెలనే పండించుకో నీవుకోరిన బియ్యే కొండలపైన వానకురియు నంతవరకు నాలుగేండ్లకాలము జీవితము వృధా చేసుకొంటిని అనరానిమాటలని పించుకొంటిని పడరానిపాట్లు పడితిని పరులపంచల పండితిని పరులతో అప్రయోజకుడని పించుకుంటిని సర్వమూ ఉండి ధర్మబద్ధుడనై

వరుల సుఖానికై సన్యాసము పుచ్చుకుంటిని శ్రేయోదాయినివై శ్రేయస్కామినివై నీవేసుఖించు ఇంక అయింట మనమిద్దరము ఉండి పెద్దవారికి నిరంతర దుఃఖము తప్పదు వారుదుఃఖపడుట చూచుటకు మనసొప్పదు నాకింక అయింట చోటులేదు ఆ చోటునీదే చోటు అపవిత్రము సేయబోకు నేచేసినవి నేమాటాడినవి మరచిపో నేను ఉన్నట్లుగానే కన్న తలిదండ్రుల దుఃఖోపశమన మొనర్చి కట్టుకున్నవాని మన సెరిగి ధర్మము చక్కగా పాలించుకో ఇంతవరకు తలిదండ్రులవలె పోషించినవారిని పోషించలేక పోయితిని ఆభారము పూర్తి నీవు వహించి నన్నుమరచి పోవునట్లుచేయి నీభర్తతో చేయించు నాకుమంచిమార్గము చూపినందులకు నీకు నన్ను పెంచి పెద్ద చేసి నందులకు వారికి కృతజ్ఞుడను ఇంతకన్నా మరేమీసేయలేని మందభాగ్యుడను ఈనాటితో ఈఖాతము నిన్నువదలు చున్నది నావంశము అంతరించిననూ వరుల వంశమునైనా ప్రీతిగా పెంచి సత్కీర్తిగడించు కన్న తల్లిదండ్రులపై కాటుకుదిరిగి కట్టుకోబోవు వానియాశల న్యాయాల కాలదన్నిన తులువవు నామాటనీకులెక్కా అని భర్తతో అనిపించుకొనక జీవించు మాతృ పితృ స్వరూపులగు అత్తమామలకు నావందనముల తప్పకతెల్పు ఈవిషయముల వారికితెల్పకుము నాకొరకై వెతకు దురు దుఃఖింతురు నాపై ఈర్ష్యపెరుగు పద్ధతులను కల్పించి వారికి మనశ్శాంతి కల్పించుటనీకు ధర్మము నీవు నన్నొక మందబుద్ధిగా అప్రయోజకునిగా పశుప్రా యునిగా భావించితివి తెల్పకపోయిన పోవలసి వచ్చినది వకవిధమున మరింత తప్పితము హీనత అయిననూ వప్పుగా భావించ ప్రార్థన.

ఇట్లు నీశ్రేయస్కామి దైవదూరుడు ఖాతం.

అని రాము చదివి కంటనీరు విడచి కాగితము క్రిందవిడచి నిట్టూర్పు విడచినాడు.

చంద్రకళ మామా అని క్రిందపడి పోయినది.

మెత్తని హృదయము భావోద్రేకముగల స్త్రీలందరూ కంటనీరు పెట్టినారు. కటువైన హృదయముగలవారు చంద్రకళను చూచి ఓసి పాపీ ఎంతబాధించినావే ఎంత ధర్మాత్ముని ఎంత చేసినావే ఇంతవరకు అన్ని శ్రీరంగనీతులు చెప్పితివిగదే చిన్నెలమారి అనువారు స్త్రీబుద్ధిః ప్రళయాంతకః అన్నది పురుషులు ఇందుకేనమ్మా అనువారు ఇట్టాటి ముండలుండే స్త్రీలకు చదువువద్దని నెత్తిననోరుపెట్టుకొని పెద్దలు చెప్పేది ఊరకేనా ఓసి గయ్యాళీ ఎట్టివాని ఎట్టిస్థితికితెచ్చినావే అనువారు ఇన్ని నీనులునేర్చిన పీనుగలన్నీ ఇంతేనమ్మా నీతేగాని నియమములేదు చదువేగాని చది

వినది అర్థము చేసుకునేది అంతకూలేదు -ఈచదువుకున్న పిశాచాలకు మైథున నిద్రాహారాలు వుంటేసరి ఎంతబుద్ధిలేనితనాలకైనా దిగుతారు తెగిస్తారు అనువారు ఆ మాటలువిని చదువు చదువుకున్నది. జ్ఞానోదయానికికదేనమ్మా వప్పులవదలి తప్పులనే తీసుకొని చెడిపోయేవారిని చదువేమి చేస్తుంది. ఎవరేమి చేస్తారు జ్ఞానాభివృద్ధి అటు ఏడులోకాలకు ఇటు ఏడులోకాలకు పంపుతుంది. మంచిగా నడిపితే ఊర్ధ్వలోకాలకు పంపుతుంది సిగ్గూ బిడియము విడిచి కీర్తిగౌరవాల పోతుడిచి ఎవరేమనుకున్ననేమి ఎవరెట్లపోతేనేమి నాజీవితాశయాల తీర్చుకున్నదొకటీ అని మనసును విడచితే అతల వితల సుతములదాటి తలాతలము కావల రసాతలముచేర్చును. జ్ఞానము పంపుటలో ఉన్నది దానికి సంస్కారము ఉండవలయుననువారు.

అయినా తెలివిగలవారు పొరబడితే తెరలేకనే తెలివి తెల్లవారుస్తారు అన్నారు అని వకామె నవ్వినది.

అందరూ ఏడుస్తుంటే నీవు నవ్వుతావెందుకే అన్నది ఒకామె.

నాబ్రతుకూ ఇట్లే నవ్వులపాలై కడకు కన్నీళ్లతో భర్త పాదప్రక్షాళనచేసికుమిట పడినాను. అది జ్ఞాపకమునకువచ్చి నవ్వినానమ్మా నేనూ ఇట్లే పట్టుపట్టి కడకు కావలసినన్నీ చివాట్లై చక్కపడి చేసుకున్నానమ్మా మావారు నాకు మేనత్తకుమారుడు కొంచెము విద్యతక్కువ ఏదో తిననూ కట్టనూ కావలసినంతా వున్నది. మెత్తనివాడు ప్రజ్ఞావంతుడనై పేరు నిల్పాలను కొనువాడుకాడు దేవుడూ దైవమూ దైవమూ అనుకొంటూ పెద్దవారు కూర్చొమ్మనేస్థితిలో ఉండేవాడు తల్లీ కొడుకే వున్నారు మంచిచోటని మంచివాడని అమ్మా నాన్నా ఎంతచెప్పినా ప్రజ్ఞావంతుడే కావలె పదిమందిలో పేరు ప్రఖ్యాతిగడించినవాడే గావలె పదిమందీ ఎగజూచే ప్రతిభావంతుడే కావలెనని పట్టుబట్టి వద్దన్నాను అనరాని మాటలన్నాను ఆయన ఆమాటలతో అవమానపడి ఆనాడే గ్రామమువిడచి మూడేడుల పర్యంతము సంగీతము సాహిత్యము రాత్రింబవళ్లు కష్టించి నేర్చుకొనివచ్చి మాగ్రామములోనే హరికథచెప్పను ప్రారంభించినాడు ఆయన నాతోనే పూరువిడచెనని అబాలగోపాలము అన్నారు. మాఅత్త మాయింటిని తొక్కిచూడడములేదు అంతవరకు నాకూ వివాహము కాలేదు మానాన్న వెతకి వెతకి వరులపట్టుకరానూ నేను వద్దననూ యెట్లవుతుంది దేవుడిచ్చిన భర్త పుణ్యమున్నంతజంట తప్పదని స్థిరత్వానికి వచ్చినప్పుడుకదా పెండ్లి ఆ నాడాయన ఆశుధార ప్రవాహమువలె వెళ్లుతుండగా కమ్మని సంగీతము మలయమారుతమువలె వీచుతుండగా మనుష్యుల ఆకర్షింపచేసుకొని పొగ

త్తలతో పొంగిపొంగి ఉప్పొంగి నింగి నంటుకొను వానినిచూచి నేను ప్రక్కనున్న ఆమెతో ఎందుకీయన గడ్డము పెంచుకున్నాడు అన్నాను. ఆమె ఎడమీయకుండా గుక్క త్రిప్పకుండా అనేసింది ఎవతో దానితలపండుపగుల నరపశువు ఇతనిచేసుకొనుటకన్నా పశువునుచేసుకొనుటమేలన్నదట బందుత్యాగముచేసి ప్రజ్ఞావంతుడేకావలె నన్నదట ఇట్లా పాడుపశువులు స్త్రీలలో పురుషులలో ఉన్నారమ్మా జన్మకర్మను తలంపనే పలంపక కడకుతారుమారయ్యేపిశాచులు వీళ్లకు పాతయముడుచాలడు కొత్తయమునివేసి విచారిస్తారు నానాశిక్షలవిధిస్తారు వకజీవినిఅవమానిస్తే మనకూ అవమానముంటుంది చిత్రగుప్తునిచిట్టాలోచోటువుంటుంది తప్పదనిభావించక అనేస్తారమ్మా బుద్ధిలేని పలుగాకులు ఆపాడుముండతో ఇతనిజీవితము నాశనమైనదమ్మా ఇంకనాకు వివాహముఅక్కరలేదని భీష్మునివలె భీష్మించుకున్నాడట మాఅమ్మాయినిఇస్తామని అడిగించితే ఎవరైనా యింతేకదాఅనేది అని ఇంక వివాహమువద్దు జీవితము దేశసేవ దైవసేవక్రింద వినియోగిస్తా నన్నాడట చూడు ఇట్లాటివాణ్ణి అన్నముండకు ముందుగతులుంటాయా దానికడుపుకాల దానికామము వల్లకాడుచేర అని జాడించింది ఆమె ఆమాటలతో నాకు తలతిరిగి లేచిపోయినాను ఆరాత్రి అంతా నిద్దురలేదు నాపట్టుదల నామాటలు ఆయన మనోలతల కూకటివ్రేళ్లతో పెరికి తలక్రిందులుగ పూడ్చినది అయనవంశము అంతరింపచేసినది. ఆయన ఆశాబీజముల చితుకదంచినది. సుఖజ్యోతిని ఆర్పినది ఇప్పుడేమి చేయవలయును ఆరిపోయిన జ్యోతిని వెలిగించి పాపమూ ప్రజాదూషణ తలిదండ్రి కష్టమూ దుఃఖమూతీర్చి బంధున్యాయమూనిల్పి ముందుకురావడమా లేక పీటెలో తగుల్కొని పాడైపోవడమా అని ఆలోచించి ఆలోచించి ఎట్లయినా అయననే చేసుకొని అయన వంశాన్నేనిలబెట్టి పాప పరిహారమొనర్చుకొనవలెనని ఆనాడే చీకటితోలేచి అమ్మా నాన్నకుకూడా చెప్పక వాళ్ల యింటికి వెళ్లి ఆయనకాళ్లమీద పడినాను ఆయన విస్మయమంది ఆశ్చర్యముగా ఏమన్నాడు ఉన్నసంగతి అన్నసంగతి ముందున్నసంగతి చెప్పుకొని కన్నీతో కాళ్లుకడికి వప్పించుకున్నాను ఆయనకేకన్నాను భీష్ముడని పేరు పెట్టుకున్నాను పిలిచినప్పుడంతా వకరినొకరము చూచుకొని నవ్వుకుంటున్నాము. అది జ్ఞాపకమునకువచ్చ ఆడవారిలో మగవారిలో అజ్ఞానులతలంచి నాబ్రతుకెట్లా దీనిబ్రతుకూ అట్లోనన్ని నవ్వువచ్చి నవ్వినానన్నదామె.

సరోజ కండ్లనీళ్లు తుడుచుకుంటూ రాము ప్రక్కచూచి పాపము ఆయనన పిలుచుకరండీ అట్లున్నారే అన్నది.

రాము గిజ్జునతిరిగి బయటికి వచ్చుచుండగా వక పిల్లవాడువచ్చి అయ్యా రామప్రసాదుగారికి ఈ బీగంచెవులు ఇవ్వమని వకాయన ఇచ్చినాడండీ అని చేతికి ఇచ్చినాడు ఆయన ఏదారిన పోయేనన్నాడు రాము.

ఇదిగో మనకెదురుగాపోవు జ్ఞానవాటికలో పోతున్నాడండీ అన్నాడు.

ఆ మాటలు విని అక్కడున్న హనుమంతరావు కారునే తీసుకొని రాము వెళ్లినాడు.

సరోజ చంద్రకళను లేపి ఏమిటీదేయిధి నిజమేనా అన్నది.

చంద్రకళ కండ్లనీళ్లు తుడుచుకుంటూ అక్కా నాకు మేనత్త కుమారుడాయన నాకొరకై ఇంతచేసినాడని నాకుతెలియదు తలిదండ్రిమాటలు వినక ఆయనిను లెక్కపెట్టక తిరిగినది నిజము నావక్కదాని ఆశకు ముప్పురిజీవితాల నాశనముచేసి నాను నాకిక ఏలోకములోనా చోటులేదు నేను ఎన్ని అన్నా ఎన్నిచేసినా పల్లంత మాట అనినవాడుగాదు నేను ఇంట్లో వున్నంతకాలము బయట వుండువాడు నాకెదు రుపడకనే తప్పించుకొని తిరుగుతూ వుండేవాడు తలవంచుకొని చూడనియట్లు జారు కొనువాడు తనజీవితము బయటబయటనే కాలము గడుపుకొనువాడు లక్షలాది ఆస్తి మానాన్నచేత వున్నది. తనదేనని తెలిసి మాకు గుడ్డిగవ్వకూడా ఆస్తిలేనిది తెలిసి నయాపైసాకూడా మానాన్నను అడిగేవాడుకాలేదు ఎదురుగా నిల్చుకొను వాడు కాదు అమ్మా అమ్మా అని మా అమ్మచుట్టూ తిరిగి తనకు కావలసినదేదో చెప్పుకొను వాడు ఏదయినా మాఅమచేతిలో పెట్టితే చేయిపట్టువాడు స్కూలుజీతముకూడా మా అమ్మేయిచ్చేది. నేను వంటరిగా ఇంటగాక ఎక్కడైనా ఉన్నట్టుతెలిస్తే అక్కడ ఇట్లా హేళనచేసేవాడు అందరిలోనే నన్నవాకెకు చింతించేవాడుకాదు అపకారము చేయు తలంపు వున్నదా అంటే తలఎత్తి చూచేవాడుకాదు మాఅమ్మా నాన్నా ఎప్పుడూ ఆయనపరంగానే మాట్లాడేవారు వారిమాటను జవదాటేవాడుకాదు నేనే అమ్మా నాన్నమాటను లెక్కసేయక సంచరించినాను ఆయన వారికెదుట తలఎత్తిన రోజు లేదు ఆయన అణిగి సంచరించుకొద్దీ తరుమకపోయి మాట్లాడినాను తాహతేతెలియక తారుమారైనాను తనను వివాహము చేసుకోనని నిర్దుష్టముగా నిర్భయముగా నీచాతి నీచముగా మాట్లాడినాను మాట్లాడినా నవ్వుతూ వుండేవాడేగాని ఏనాడైనా నీచంగా వకమాటైనా అనేవాడుగాదు ఈపని అనాడే చేసివుంటే నావిద్య అనాడే అడుగంటేది నాతలిదండ్రులు నాచెడ్డను వారినోటారావిప్పి చెప్పక తప్పదు ఆయ నకు ఇంతదయ నాయందు వున్ననని అర్థము చేసుకొనలేక నన్నాశించిన ఘాతమనే

ఇంతవరకూ తలంచినాను నేను ప్రతిదినమూ భోంచేయునప్పుడు మా అమ్మదగ్గర కూర్చొని చంద్రా నీలోవున్న ప్రతిరక్తబిందువూ వానిదేనమ్మా ఇప్పుడు తింటూవున్న ప్రతికడీ వానిదేతల్లీ ఇంతకాలము తినిసుఖపడినది వానిదేనమ్మా కడకు కట్టితిరుగుచున్న బట్టావానిదేతల్లి నీదేహాన్ని న్యాయంగా వానికే అర్పించవలసినదిగాక ఇన్ని వానివి ముప్పూటమూ తింటూవుండి వానిని నీవు చేసుకొనక వానిని ప్రేమించక వేరొకని ప్రేమించిన లోకమేమంటుంది. ధర్మమేమంటుంది వానిని వేదుచేసిన మనమెక్కడ పోవలెనో యోచించు నీకున్న కాఠిన్యము వానికుండిన మనమే గతి అవుదుమో తలఎత్తిచూడు వాడుమంచివాడై మనము ఆడినదిఆట పాడినదిపాటగావుంది లేకున్న నీవుచేసేపనికి ఈవేళకే తినతిండి కట్టబట్టలేక అటుమట పడవలసినదే మీనాన్న చింతతో కుమిలిపోతూ ఉన్నాడు వారు ఇంటికేరాక పాపం కుళ్లిపోతూ పరులపంచల తలదాచుకుంటూ ఉన్నాడు నీవు పేరవిహారంగా ఝుళిపిస్తూ ఉన్నావు నీవలె వారూ అయివుంరేని నీగతి ఏమయివుండునో తెలుసుకో మంచివారయ్యేకొద్దీ మించిపోతున్నావు ఇది యెన్నటికైనా తప్పక చేటుతెస్తుంది స్త్రీకుండే గుణాలూ నీయందు వక్కటిలేవని చెప్పేకొద్దీ నాబుద్ధి గడ్డితినింది. అక్కా, అమ్మా, నాన్నా నాలుగైదు రోజులుగా ఎన్నితూర్లో ఇల్లువిడచి పోయినారు నేనే వంటచేసి పెట్టవలసి వచ్చినది. ఆదినములు ఎప్పుడెప్పుడు వచ్చినవో అప్పుడంతా ఎక్కడనో తిని ఎక్కడనో పండుంకొటూ అమ్మా నాన్నావచ్చి వంటచేసినంతవరకూ తలయెత్తి ఇంటిని చూచేవాడుగాదు వచ్చేవాడుకాదు మాయింటివురిసందూ తగాదాలు మేమే తెంచుకోవలెనని సందుయిచ్చి వారు పోతే ఇంటికేరాక పోయేవాడు ఇంటికి వచ్చి ఏమిచేస్తాడో ఏమోనని భయపడేదాన్నిగాని ఏనాడైనా తలెత్తిచూచినవాడుగాదు బాల్యములో అంతస్నేహంగా వుండేవాడే ఇప్పుడిట్లు భీష్మించు కున్నాడెందుకని వకనాడైనా అనుకున్నపాపాన పోయినదాన్నికాను పోయినకొద్దీ పీడపోయిందనుకున్నాను తనతప్పును తానుతేల్చుకొను శక్తిని ఇవ్వని విద్యవుండీ లాభములేదు మరొకరయిన నన్ను మానంగా బ్రతుకనిస్తురా ఈనాడు ఆయనమంచి నాకంటికగపడుతున్నది దుఃఖమింక తరుగదు ఆయనకెదురుగానిల్చి క్షమించమని అడుగుటకు చూడా నోచుకోనిపాపిని ఇంక నేనుండీ ప్రయోజనములేదు. నేనుచేసినవి క్షమించునవిగావు అనుకొనుకొద్దీ ఆయనమంచి నాచెడ్డా ఇప్పుడు నాకంటికగపడు తున్నవి ఇంకనన్ను క్షమించడు నాచేతులారా సుఖాన్నికాలదన్ని ధర్మాన్ని ఎగజిమ్మి న్యాయాన్ని కూలద్రోసి విడిబడి సంచరించినందుకు శిక్ష యముడు విధించవలసినదే నా

కడుపు తరుక్కుపోతున్నది. ఆయన పడినకష్టముల తలంచుకున్న అక్కా నన్ను క్షమిస్తావా లోకంలో నాకు తిరిగీ చోటున్నదా అని వెక్కివెక్కి ఏడుస్తూ సరోజ భుజముపై తలవాల్చినది చంద్రకళ,

అది కనీ వినీ సరోజ చంద్రా తీవ్రబుద్ధి పురుషులది అంటామేగాని మనదేనని వప్పుకొనక తప్పదు ఆయనవచ్చిన తోడనే మామా నన్ను క్షమించమని పోయి కాళ్ల మీదపడి పట్టు విడువక కనీళ్లతో కాళ్లుకడుగు మీబావచెప్పి వప్పించగలడు స్త్రీ యెన్ని తప్పులుచేసినా కన్నీటితో కాళ్లమీదపడితే తప్పును క్షమించి తానూ కంటనీరు పెట్టుతూ కౌగలించుకోగలడు చెంత చేర్చుకోగలడు పురుషుడు దీర్ఘకోపిగాడు క్షణిక మాతని కోపము స్త్రీనే జీవితాంతమువరకు సాధించునది మరువనిది వ్యభిచారము మినహా మరెన్ని తప్పులుచేసిననూ కన్నీటితో దండముతో పాదములపై పడుటతో వినయ విధేయతలలో కనికరముగలుగు మాటలతో ఆకోపము అమృతముగా మారి పోగలదు వీటితో కానిపనిలేదు కన్నీటితో కనికరముగలుగు మాటలతో కానిపనిని కూడా చేయించుకొనవచ్చు చంద్రా మీ మామవచ్చిన తోడనే ఈపనిచేయి తప్పక క్షమించును నీకుటుంబము కుదుటపడి కూర్చోగలవు అని చెప్పుచుండగా రాము హనుమంతరావుకు అడ్డముపోయి చెప్పతగుమాటలుచెప్పి పిలుచుకొనివచ్చి బలవంత ముతో పట్టి ఈడ్చుకొనివచ్చి చంద్రకళముందు నిల్పినాడు.

చంద్రకళ మామాఅని పోయి కాళ్లమీదపడి కాళ్లుపట్టుకొని ఏడ్వసాగినది.

కొండవలె కాఠిన్యమున్నవ్యక్తి క్షణములో హృదయము కరిగి నీరైపోయి ఉన్నచోటుకూడా తెలియకుండా ఎవ్వరీ ఆటంశక్తిని ఉపయోగించినారు ఏలనాకాళ్లు పట్టుకొనెదవు నాబాంధవ్యము ఈనాడుగాదు ఏనాడో త్రెంపుకున్నావు అయినా బంధుప్రేమను ధర్మాన్నివిడువక ఇంతవరకూ తెచ్చినాను నీకోర్కెగట్టెక్కినది ఇప్పుడేందుకీపిచ్చి విడు నాకాళ్లు నీవెవరికాళ్లు పట్టదలంచుకుంటివో నీకోర్కెల కంద గలిగిన పురుషుడెవడో నీయాత్మచెప్పగల చోటెద్దియో అచ్చటచేరుటకు నేను అటంక ముగా నుండుదునని తలంచి అటంకము తీర్చుకోర్కెతో వెళ్లుతున్ననాకు అటంకము ఎందుకిస్తావు నాకాళ్లువిడచి తలిదండ్రి కాళ్లపైనబడి కన్నీరువిడు పాపపరిహారమగు తుంది నీతలిదండ్రులు నాతలిదండ్రులవలె సాకినందుకు నాధర్మము నేను ఇంత వరకు నిర్వహించుకున్నాను ముప్పురి ఏడ్పుకన్నా వకడు ఏడ్చుట శ్రేయమని తలంచి వెళ్లుతున్న నన్నేల ఇప్పుడు నిర్బంధింప దలంచినావు అశ్వాసాంతముయిన కథను తిరిగీ పెంచడమెందుకు తెగిపోయిన త్రాటిని అతుకువేసినట్లుండును విడుకాళ్లు

ఇక ఈజన్మలో కథరక్తికట్టదు మరుజన్మకైనా కథకుదిరేపద్ధతి చూస్తాము ఓ విడు అన్నాడు హనుమంతరావు.

ఆడవారు అందరూ చుట్టుకున్నారు చంద్రకళ ఏడుస్తూ పాదలములపై తల వుంచి పట్టుకొని క్షమిస్తానను విడుస్తా లేదా నన్నుచంపి నీయాశయాల తీర్చుకో ఇంతవరకూ క్షమించి సహించిన హృదయాన్ని ధర్మాన్ని ఇప్పుడు ఉండనీ మామా క్షమించమంటూ వెక్కివెక్కి ఏడ్వసాగింది పాదములు కన్నీటితో తడిసిపోవు చున్నవి చూచి హనుమంతరావు.

చంద్రా అని పిలుచుటకుకూడా హక్కులేక వైతొలగినవానికి ఈనాడు శరీరమే వప్పచెప్ప వలయునన్న సాధ్యముకాదు నీనోట మామా అని పిలిపించుకొను భాగ్యవంతుని నేనుకాను ఆ పుణ్యాత్ముడెవడో వానిచూచుకో పెట్టు బుద్ధిదెబ్బతింటుంది పుట్టుబుద్ధి మెరుగిస్తుంది ఈబుద్ధి నిలుపుకొనలేక ఇరుకున పడతావు వరుల దూషిస్తావు సంఘములో చవుకవుతావు నీహృదయములో నాకు చోటులేదు నాహృదయములో ధర్మానికి చోటుందిగాని నీకులేదు అద్యంతము వరకు నీకొక్కర్కే చోటిచ్చినాను అనుభవించుకో విడునాకాళ్లంటున్న హనుమంతరావును అందరూచూచి.

నాయనా లక్షలాది ఆస్తిని ఈముప్వురికై విడచి నీజీవితానికై చింతించక ధర్మబద్ధుడవైపోవు నీతెగువ నేమనవలె తంత్రీ నీధర్మము ఈమె ఆశయాల నాశనముచేయక పోనిస్తుందా భగవంతుడు గ్రుడ్డివాడా ధర్మదేవతకు చెవుడా యముడు కుంటివాడా. నాయనా నీధర్మాన్ని త్యాగాన్ని తలుచుకుంటే అన్యులమైన మాకు కడుపు తరుక్కపోతున్నది ఆ యమ్మాయికి మాత్రముపోదా అంతరాగుండియా తెలియకచేసిన తప్పులక్షమించు పదిమందిముందు అవమానపెట్టింది పదిమందిలో క్షమించమని కాళ్లమీదపడింది. తప్పు తెలుసుకున్నది క్షమించి చేరదీయి నాయనా భగవంతుడు నిన్ను ఆశీర్వదిస్తాడు లేనాయనా లేవనెత్తి అంచుకుతీసుకొని ఆదరించు అన్యులు కాదని ఇంతవరకు చూసినదయా ధర్మము ఉండనీయప్పా అని జ్ఞానాంబ చెప్పగా.

అమ్మా నేను తగులరాదు నా అడుగుజాడల్లోకూడా నడువడానికి అర్హతలేదని ఎన్నడో అన్నది అదికూడా లెక్కించక తనజీవితానికై అత్తమామల జీవితాలకై నా జీవితము బలిచేసుకొని ఇంతవరకు ఉండినాను ఇంక ఉండరాని సమయము వచ్చినది నాకుమారుగా మరొకరికి చోటుగల్పించి పోదలచుకున్నాను తెల్పక

వృధాగాపోయిన అప్రయోజకులలో మరింత జమకట్టునని తలంచి తెల్పితినిగాని వేరొండుగాదు చోటులేని హృదయములో చోటు ఏర్పరుపవలెనన్న కష్టముకదా అన్నాడు హనుమంతరావు.

అంతవరకూ వింటూ చూస్తుండిన రాము హనుమంతరావును చేయిపట్టుకొని శిష్యా స్త్రీల హృదయము హాలాహలమునకు అమృతమునకు మధ్యవిహరించును హాలాహలమాయెనా నాటకం ఇట్లుంది అమృతమాయెనా ఇక యేమిచెప్పుదులే ఊలవగింజే నానదు ఉడకదు నములుపడదు పతివ్రతగింజ అంటారు అంతే హాలాహలము అమృతమై కాళ్లమీదపడింది ఇక హాలాహలముగాదు ఇప్పుడే మజా కామశాస్త్రమంతా కంఠస్థంచేసి నేర్పుతారు; ధర్మాలన్నీ చెప్పుతారు కాలాన్నంతా నడుతారు కావలసినవన్నీ చేస్తారు సంసారమంతా నాదేనని కౌగలించుకుంటారు ఈమర్మమంతా గురువుగారిని అడుగు చెప్పుతాడు గురువెంతో శిష్యుడంతే దేవుడెంతో భక్తుడంతేలే లేపు పడినబండిని మగవాడులేపక ఆడదిలేపుతుంతా అన్యులుగాదు అన్నది మేనమామ కూతురు అవివాహిత ధర్మము తెలియనిది లే తగిలిఎత్తి అంచుకుతీసుకో ఈమజాచూడు అబ్బా ఇప్పుడే అనందము ఊం లే అని తొందరించగా రాము.





# మాతృజ్యోతి.

## సాయాహ్నము.

హనుమంతరావు రామునుచూచి గురూ నీమాటవినక తప్పదుగాని లేతవయసంతా అడవిపాలు చేసుకొనిఆశలకు అంతూ పంతూలేక అవకతవకలై అన్యుల ఆశ్రియము గోరువ్యక్తి ధర్మమెరుగని కన్య దారగా చేపట్టితే సుఖముంటుందా భర్త వకలెక్కుంటుందా సంసారము సాగుతుందా అన్నాడు.

శిష్యా ఇదంతా నాకనుభవము అనునంతలో సరోజ శివప్రియ హరిప్రియ ఫక్కున నవ్వినారు.

రాము వెనుదిరిగి చూచి ఏమట్ల నవుతారు గురువుగారు అనుభవజ్ఞులు శిష్యునికి బోధిస్తున్నాడు కాదంటారా శిష్యా లే అన్నాడు రాము.

హనుమంతరావు ఏమిచేయజాలక చంద్రకళను రెండు చేతులాపట్టి లేవదీసినాడు చంద్రకళలేచి కన్నీటితో హనుమంతరావు ముఖముచూచి మామా అని మెడ చుట్టి పట్టుకొని స్పృహతప్పి పడబోయినది హనుమంతరావు పట్టుకున్నాడు.

గుండె పట్టుకున్నది పట్టుకున్నదని ఆడవారు చుట్టుకున్నారు పరుండబెట్టి హనుమంతరావు గొంతుసాదీనాడు నీళ్లుతెచ్చి సరోజ వకచుక్క నోటిలో విడచినది రొమ్ముపై తడిపినారు వునిక నీళ్లతోతడిపి ముఖముపై నీళ్లు చల్లినారు దేహమంతా చల్లనీళ్ల కుండవలె చెమటలు పోసినవి గొండె తీవ్రముగా కొట్టుకొను చుండెను. కన్నులనీరు వెలితిలేక పరుగిడుచుండెను. ఎక్కడి ధాతువులక్కడ స్థితిగతులు తప్పి పడి పోయినవి అర్ధోక్తిలో మామా మామా అంటూ వున్నది అదిచూచి ఆమాటలువిని హనుమంతరావు మనస్సుకరిగి కన్నులనుండి కన్నీరు విడిచెను.

రాము అదిచూచి శిష్యా భయపడకుము ఆడవారిగొండె అతిదుర్బలమయినది అందుకే కవులు అబలలు అన్నది. ఇద్దరి కన్నీటితోగాని వద్దికలు కుదరవు అదినాకు

తెలుసు కన్నులు తెరచులోపల స్నివక్కడనే వుండవలె అప్పుడు ప్రేమ ప్రవాహము పొంగి పొర్లి గడ్డలపైకి ఉబికి పారుతూ గమ్యస్థానము చేరుకునేది అగదిలోకి ఎత్తుకొని పో అన్నాడు. సరోజ గదిలో పరుపువేసినది శివప్రియ మంచినీరు పెట్టినది హరిప్రియ విసనకఱ్ఱ పెట్టినది. హనుమంతరావు చిన్నపిల్లను ఎత్తుకపోయినట్లు ఎత్తుకొనిపోయి పరుండపెట్టినాడు.

నెలతక్కువైనా మగవాడే కావలెనమ్మా ఎంతైనా ఆడ ఆడే మగ మగేమాడు అంతమనిషినీ చిన్నపిల్లను ఎత్తుకపోయినట్లు ఎత్తుకపోయినాడు మగవాని ధాతుబలమునకు స్త్రీ ధాతుబలమునకు భేదమే ఇది తెలియక మేమూ సమానులమేనంటారు గాని ఎక్కడిమాట అన్నదొకాయమ

రాము హనుమంతరావును చూచి శిష్యా నీవన్నట్లే సంజీవి పర్వతము తెచ్చినావు లక్ష్మణుని బ్రతికించి వంశాభివృద్ధితో వర్ధిల్లవోయ్ అంటూ తలుపు మూసినాడు.

అందరూ చిరునవ్వులతో అదొక విధమయిన ఆనందముతో తలలువంచినారు తలలు ఊంచినారు ఎంతటి సంఘటన అనువారు దైవచిద్విలాసమనువారు ఎంతటివానిని ఎంతపనిచేసింది పాపిముండ అనువారు పూర్వజన్మకర్మమనువారు ఉండగా కాకిదేవత కాళ్లుకాళ్లు కొట్టుకుంటూవచ్చి కాళ్లముందు కా కా అన్నది.

హనుమంతరావు విసరుచుండగా స్మృహవచ్చి రానట్లుండెను అంతలో మామా క్షమించవూ క్షమించవూ అన్నది చంద్రకళ.

ఆ మాటలోగల జాలికి హనుమంతరావు కన్నులనుండి హటాత్తుగా పటపటా కన్నీటి బిందువులువచ్చి చంద్రకళ చెంపలపై పడినవి చంద్రకళకు ఆ బిందువులు స్పర్శను గలిగించ తెలివివచ్చి కన్నులువిప్పి చూచినది మామా అని రెండుచేతులా కంఠమూనిపట్టి ముఖము ముఖమునకుం వచుకొని ముద్దుపెట్టుకొని క్షమించవూ అని తనలేతచిగురాకువంటి బుగ్గల మామనోటికందిచ్చి పుష్పములవంటి మెత్తనిచేతుల చెంపలపైకి పోనిచ్చినది చేతికి కన్నీరుతగిలినది కనువిచ్చి చూచినది మామ కనుమూసినాడు కన్నీరు వెల్వలై కారుతున్నవి. కన్నీరు తుడుచుచూ మామామన్నింపవూ మన్నింపతగిన దానినిగానా అని లేచి మామను తనఎదకాంచుకొని పైటతోకన్నీరు తుడుచుచూ మామా నాలోవున్న ప్రతిరక్త బిందువూ నీదేనని అమ్మచెప్పినదే నీవినీవు తీసుకోవా నాపై ఇంతవరకు ఇంతదయచూపి ఇప్పుడు ఇంతనిర్దయ చూపెదవా చేసిన తప్పును వప్పుకొని కాళ్లబడిన నన్నురక్షింపవా నీదానిగా ఆదరింపవా

ఇంక నాజీవితాంతము వితప్పచేయను నిన్ను నాప్రాణంగా చూచుకుంటాను హృదయంలో ఉంచుకుంటాను సమయమువచ్చిన ప్రాణమైనా ఇస్తాను మామా నామాట నమ్మవూ నీహృదయంలో నాకుచోటుఇవ్వవూ నాకర్మము నన్నిట్లాడించినది నేడు మేల్కొల్పినది మేలుకున్నాను ఇంకనిద్రతగలదు ప్రమత్తురాలనుకాను నమ్మమంటూ ముఖము తుడిచి క్రాపుసవరిస్తూ కాలము వృధాచేసిన పాపిని మీమాటవిని మిమ్మానందపెట్టని పాపిష్టిని అన్యధా తలంచక అదరించి ఇల్లాలిగా నేలవూ మామా అని ముఖము ముఖమున చేర్చినది.

అంతలో సరోజ కాఫీతెచ్చి చంద్రా అన్నది.

వస్తిని అక్కా అంటూ పోయి వాకిలితీసి కాఫీ తీసుకొనివచ్చి చల్లార్చి చేతికి యిచ్చి త్రాగిపెదా అన్నది చిరునవ్వు నవ్వుతూ త్రాపపోయినది.

నీకు ఇంతలో ఇంతమార్పెట్ల గలిగినది చంద్రా ఏనాడు లేనిప్రేమ ఈనాడెట్లు వచ్చి హటాత్తుగానిల్చినది అన్నాడు.

నీ ధర్మాన్ని ఎడబాటును దయను బంధుధర్మాన్ని వినేటప్పటికి న్యాయధర్మములు అవినీతులు అన్ని అర్ధమయినవి చణములో మేల్కొల్పినవి గుండెపగిలిపోయినది రక్తం అగిపోయినది దేహానికీ జ్ఞానానికి సంబంధము తెగిపోయినది. ఇక ఈజీవికి ఏలోకములోనా ఎవ్వరివద్దా స్థానములేదని గ్రహించుకున్నాను నీ ధర్మము నాహృదయ కాఠీన్యమును మూర్ఖమును మూఢతనమును భేదించి నా హృదయ కమలమున నిన్నునిల్పి నన్ను అంకితముగా తీసుకున్నది ఇంక జీవితాంతము నాహృదయమునుండీ మీరు దాటిపోలేరు పోనివ్వను అన్నది చంద్ర.

ఆ మాటలకు హృదయానందమొంది హనుమంతరావు చేరతీసుకున్నాడు.

చేరతీసుకున్న మామ వచస్థలమున వచస్థలమూని హృదయము హృదయమునకల్పి మనసు మనసుననిల్పి వకచేత మామ శిరస్సును చుట్టిపట్టి కన్నులలో వెల్గులెల్గు వకరి నొకరికి స్వాగతము చెప్పుచుండ మామ విస్మయమంద చంద్ర కాఫీ త్రాగిపుతూ మీయౌవనకాలమును మీయానందాన్ని వృధాచేసిన కఠినురాలనైనా మీరు చెప్పించిన విద్యను వ్యర్ధాచేయక సాటిసోదరులకు లోకజ్ఞానమిట్లున్నది. ధర్మమిట్లున్నదని చెప్పుటకు ఉపకరింపచేసి కీర్తిగడించి మీకే యిస్తాను దేశసేవకై సంఘసేవకై వినియోగించి ఆపుణ్యము మీకే ఇస్తాను మీబిడ్డల విద్యాబుద్ధులలో అగ్రగన్యులచేసి మీకుఅందిస్తానుమిమ్ములకీర్తిగౌరవాల్లో కల్పేస్తాను నా దేహసౌభాగ్యాన్ని

తమకేఅంకితము చేసేస్తాను. మీరు చెప్పించిన విద్యకు వన్నెగడిస్తాను. తమ చెప్పుచేతల్లో జీవితము గడిపేస్తాను. నమ్ము మామ అని మామభుజముపై తల వాల్చినది చంద్రకళ.

హనుమంతరావు చంద్రను మరింత అంచుకతీసుకొని కన్నులలోచూస్తూ చుబుకమంటి చుంబనమొనర్చి ఎంతలో ఎంతమార్పు. దరిద్రుని యౌవనము నకు కాలమువచ్చినట్లు మూగది మామాఅన్నట్లు నాయౌవనమునకు శాంతి ఏర్పడినది. ఏర్పడినకాలము ఉండునో ఉం. అనులోపల వాకిలి దగ్గరరాము. ఉండును నిశ్చయముగా నిల్చిఉండును. ఈవసంతములోనే సీమంతము రా బైటికి అన్నాడు.

బావా! రా. అంటూ లేచి చీరను సవరించుకున్నది చంద్ర.

గురూ! లోపలికిరండు బ్రహ్మచర్యమునుండి వకేతూరి శంకరాచార్యు లు ఎగిరినట్లు సన్యాసమునకు ఎగురుపక్షినిపట్టి బాల్యసన్యాసము నాల్గందాల చేటని బుట్టలోపెట్టి సన్యాసానికి బ్రహ్మచర్యమునకు మధ్యలో కుటుంబమున్న దని దీనికన్నమిన్న ఏలోకానా కానమని వప్పించి చూపించితివే. ముందు హనుమంతునికీ బలవంతాన్నే పెండ్లి. ఇప్పుడీ హనుమంతునికి, బలవంతా న్నే పెండ్లి. పేరులోకూడా ఏమోఉన్నట్లుంది బలం గురూ, అనుచుండగా రాము లోపలికివచ్చినాడు.

చంద్రపోయి మోకరించి నమస్కరించినది.

శిష్యురాలే నమస్కరిస్తే. శిష్యుడుమాత్రం అంటూపోయి నమస్కరించినాడు.

ఉత్తనమస్కారాలు వక్కనిఆశీర్వచనాలు. కుదరవు శిష్యా. అక్కడ అంతా ఆయత్తమయినది. రారమ్మనిపిలుచుకపోయి లోపల దేవునిపీఠముదగ్గర ఇరువురినినిల్పి పురోహితుల వారినిరమ్మని దోవతులజోడు, చీరరవిక తాం బూలం పూలుపండ్లు పెట్టినతట్ట రాము ఆయనచేతికి యిచ్చినాడు. అయన ఏమిఅన్నాడు. కాయకొట్టి హారతియిచ్చి ఆశీర్వచనముతో వీరికి అది అంది వ్వండి అన్నాడు ఆయన. ఇరువురికి అట్లఅందివ్వగా ఏమిదిఅక్కా అన్నది చంద్ర.

కట్టుకుందువురా. ఈనాటితో దుఃఖముపోయి సుఖము చేరవస్తూయున్నది నాసీమంతములో నీవివాహము జరుగవలె. రెండుజీవులవకటిగా చేయవలె. ఎడబాయకుండా వలువురి, ఆశీర్వాదాలుపొందవలె.

కయ్యము వియ్యముగా మారవలెనని, ఉండినది రారమ్మని పిలుచుక పోయి కొత్తచీరకట్టుకొమ్మని తలదువ్వి జడవేసి పూలుపెట్టి పెండ్లికూతురిగా చేసినారు. త్రిదేవులు ముచ్చ్వరేసే ఈమెవ్వరుఅన్నట్టుండెను చంద్రకళ.

రాము హనుమంతరావును కొత్తవస్త్రము కట్టుకొమ్మని తన కండువా పంచెనుకప్పి దేవునిదగ్గర నిలువబెట్టి రా చంద్రా అన్నాడు.

చంద్ర సరోజనుచూచి నవ్వినది. ఊ. పా. వివాహమంటే వివాహం ఏకారతాలేదుపా. తాళిమళ్లికట్టించుకొందువు అన్నది.

పోయి మామప్రక్కలో చిరునవ్వుతో తలవంచి నిల్చుకున్నది చంద్ర.

పురోహితుడు మంగళహారతియిచ్చినాడు. రాముఅందరినిపిల్చి అందరిని చూచి వేదమూర్తులు, ఆర్యులు, పండితోత్తములు, పిన్న పెద్దలు తమయెదుట ప్రకృతంజెప్పబోవునది ఏమనగా వీరికి ఈమె మేనమామకుమార్తె, ఈమెకు ఈయనమేనత్తకుమారుడు గొప్పభూస్వామి, ధనికుడు. వీరికి తలిదండ్రులు బాల్యములోనే దివంగతులైనారు. మేనమామే తలిదండ్రి బాధ్యతవహించినాడు. సర్వము నిర్వహించినాడు. వీరికి ఈమెరెండేండ్లచిన్న, అల్లారుముద్దుగా వకచోటతిని, వకచోటపెరిగినారు. నాలుగేండ్లుగా భావవిభేదాలతో మనస్సులు ఏకీభవించక విడిపోయి, శాంతి అశాంతిగామారినది. అమ్మాయి తీవ్రవాదము అబ్బాయి శాంతవాదము రెంటికిమధ్య పెద్దవాదము పెరుగుటతోటి ఇంత కాలము వకరినడక వకరికి సరిపోక కాపురము వకేచోట వల్లనిమగనికి కాపురముచేసినట్లు పెద్దలమధ్యలో ఎట్లోకాలము నడచిపోయినది. నేడునా సీమంతమునకు కాదుకాదు నాభార్య సీమంతమునకు అన్నంతలో, అందరూ గల్లుననవ్వినారు. వచ్చిఈమెతోవీరునాల్గు చీవాట్లుతిని రోసి సంసారముకడజేసి పెండ్లినిలిపేసి ఆశాలతలకోసివేసి, కోపముజేసి సన్యాసముపుచ్చుకొని సర్వఆస్తులు అమ్మాయికి అబ్బాయి వ్రాసియిచ్చి దైవసేవా దేశసేవా, చేయబోతుండగా చలికాలము గాలిశత్రువై వేసవికాలము మిత్రుడయినట్లు, వేసవికాలము యెండ శత్రువై చలికాలము మిత్రుడయినట్లు గాలి ఎండ ఒకటేగాని కాలముచెడ్డదైనట్లు కాలముచెడ్డదైఉండి మంచికాలము కలిసివచ్చి హఠాత్తుగాధర్మముతెలుసుకొని దారయైవెన్నంటగా సన్యాసముతిరిగీ కుటుంబముగామారి మీఆశీర్వాదముల గోరుతున్నది' అని ఇరువురచేతికి పూలమాలలు యిచ్చి వేసుకొమ్మన్నాడురాము.

వారు పూలమాలలు వేసుకున్నారు.

దేవునికి ముందు దండము పెట్టి అటుపై ఈవేదమూర్తులకుకానీ అన్నాడు రాము. వారు దేవునికి దండము పెట్టుతుండగా రాము అందరిప్రక్క చూచి అయ్యా స్వాములవార్లు, వివాహము దీనితో తమఆశీస్సులతో అయిపోయింది కథా. ఇంక ఈనాడు శుభదినం ఆకొంచెం శోభనం గర్భాదానం అంతా అయిపోతుంది. ఈరెంటెకూ పైనుండేదేమిటే అని సరోజప్రక్క చూచినాడు రాము. ఫక్కున అందరూ నవ్వినారు.

సరోజ సిగ్గుతో ముఖమునకుపైట అడ్డముఉంచుకున్నది.

శివప్రియ రామునుచూచి నవ్వుతూ అన్నా మావదినచెప్పకున్నా ఉదరమూ ఉదరముననున్న శిశువూ, సీమంతమంటున్నారుగా అన్నది,

ఆ. ఆ సీమంతానికి అందరమూ పోవలసినదే. ప్రకృతం శీఘ్రమే సుపుత్రప్రాప్తిరస్తు అని మంచిపూర్ణికచదివి ఆశీర్వదించండి. వీరు మాశిష్యులవారు. మనకు యదేచ్ఛగా ఏకగ్రీవముగా మూడునాళ్లు దేవతా భోజనము పెట్టగలరు. చేతనయినంతా చూడవచ్చు. మనసార ఆశీర్వచనాలు కానివ్వండీ అన్నాడు.

పౌరోహితుడు ఆశీర్వచనపూర్ణిక ప్రారంభించినాడు. అందరూ ఆయిరువురినీ చూస్తూ వింతపడువారు ఎందుకట్లయిందోనని ఒకరినొకరు అడుగువారు జంటబాగా ఉందే. ఈపెంటఎట్లాచ్చెననువారు. మంచిసమయమే ననువారు, రాము కార్యక్రమము చెప్పెడివిధముచూచి ఆశ్చర్యపడువారునై ఉండగా పూర్ణిక అయిపోయినది.

హనుమంతరావు చేతులు జోడించుకొని. చిరునవ్వుతో తలయెత్తి అందరినీ చూచి వేదమూర్తులకనమస్కరించి చేయు విన్నపము. ఇంతవరకు మాగురువులవారు చెప్పినది. వాస్తవము తలవని తలంపుగా ఈకార్యమునకు ఇక్కడికిరావడము మాయిరువురి అభిప్రాయముల ఏకీభవింపచేసి, కోపము తాపముగా తాపము మదనతాపముగా మార్చి పెండ్లి శోభనము వకటిగాచేర్చి ఈసన్నివేశమంతా ఈనాడేగూర్చి సీమంతానికి పిలుస్తున్నాడు. మంచిదే దైవికముగా చెడిపోయి దైవికముగా కలిసివచ్చువేళ మాగురువుల వారియందుచేరి చేయిచేయినికలిపింపచేయించింది. ముహూర్తము నాలుగయిదు రోజులలో ఈనాడే ఏర్పాటుచేసి తమ

ఏమి చేయవలెనన్నదని అందరూ చూచినారు. రాము అది గ్రహించి అల్లివారిని చూచి మామరదలు బి. ఏ. చదివింది. అందులో ఉభయభాషా ప్రవీణరచయిత్రి ఈ ఇరువురిని భావవిభేదములు గల్పించి ఎడబాటు చేసినది ఈ విద్యే ఇంత చదువు చదివింది ఎందుకు వివాహము చేసుకొని సుఖపడుతూ గ్రంథశోధనతో, లోకజ్ఞాన మార్జించి లోకమునకు మేలు చేస్తాము డిగ్రీలతో పనియేమున్నది. మనకు అని వీరి పట్టు డిగ్రీనే ఉండవలెనని ఈమె పట్టు ఈ పట్టుదల బాంధవ్యమునే త్రెంచివేసి వారికి సన్యాసము ఈమెకు లోకనింద ఉభయ సంకటము తెచ్చిపెట్టినది ఒకరికొకరు కంటకప్రాయులై ఒకచోటనే ఉండి ఒక ఇంటనే ఉండి ఒకరిమాట ఒకరికిగాక ఒకరిమాట ఒకరు మెచ్చక పెద్దవారిని కంటనీరు పెట్టించుచూ ఉండి ఈనాడు వీరు ధర్మబద్ధులై సన్యాసమవలంబించి తన సర్వస్వము రెండులక్షలకు పైన ఆస్తిని ఈమెకు వప్పచెప్పి పోవునప్పుడు ఆ మహాధర్మానికి ఈమె మనస్సు కరిగి వారిలో మామ మనసులో కలిసిపోయింది. భక్తుడు భగవంతునిలో ఐక్యమయ్యి పోయినట్లు అవి నీతుల కడిగివేయగా మిగిలింది. నీతి నీతిలో మామ మేలు గమనించి మామ చెప్పించిన చదువు అంటూ ఉన్నది. మామకు బిడ్డలికని ఇక లోకమాన్యుల చేయబోతుంది. ఇట్టి వీరి చరిత్ర అయ్యా మగవాడై మొలత్రాడు గట్టినంత మాత్రాన మగవాడుగాడు చూడు ఇక్కడ ఎంతమంది విద్యావిహీనులున్నారో ఇది తలిదండ్రి లోపము పాతిక వారి బుద్ధితక్కువతనం ముప్పాతిక బాల్యములో తలిదండ్రుల సంస్కరణ అటుపై వరుల విద్యావరుల ధనము వరులనుంచి వరుల జీవితచరిత్రల నుచూచి తాను అట్టిస్థితి జెందుటకు కృషి చేయడములేక సోమరితనముతో తిరుగుట చేత వెనుకబడి జీవనోపాధులకే దుఃఖించువారున్నారు. - ఇట్టి స్త్రీలచూచి స్త్రీలు పురుషులచూచి పురుషులు మేల్కొనవలెగాని విరుత్సాహపడి కూలబడరాదు. ఎట్టికష్టములయినాపడి దైవశక్తి విద్యాధనము ఆర్జించి ప్రజ్ఞావంతుడై సత్కీర్తివంతుడై బ్రతికెడివానినే పురుషుడనవలెను. మొదట దైవశక్తిని ఆర్జించిన మిగతా విద్యాధనముల ఆశక్తియే ఈడ్చుకొనును ఈ జంటనుచూచియైనా నేర్చుకొనుడని నామనవి అన్నాడు రాము.

అందరూ ఆలోచనతో తలలు వంచినారు.

రాము హనుమంతరావునుచూచి శిష్యా రథమాయత్తముగానున్నది సత్యాకృష్ణులవలె కూర్చొని అటుపోయి ఇటురా నూత్నదంపతులకు ప్రజలు కంటక

ప్రాయులు. ఇదిగురువులవారికి అనుభవము. శిష్యునికి ప్రబోధిస్తున్నా అట్లా పోయివస్తేనే సీమంతాలు సమీపించేది. శకుంతలా, దుష్యంతులవలె సమీపస్థల ములతిరిగిరండి. అంటూపిలుచుకొనిపోయి కారుఎక్కించి బీగాలుచేతికిచ్చినాడు.

గురూ! ఈపూలమాలలతో గృహప్రవేశముచేసి పెద్దవారిని పిలుచుకొని భోజనసమయములోపల తిరిగివస్తాను సెలవా అన్నాడు.

శిష్యా! ప్రేమరసప్రవాహములో మైమరచి కొట్టుకపోయి చేతిలో చక్ర ము మరచిపోయేవు. మరదలా మయిమరపించవద్దు. కారుహద్దుమీరుతుంది బావమాటజ్ఞాపకముండని అన్నాడు రాము.

ఇద్దరూ నవ్వినారు.

రామునుచూచి హనుమంతరావు సెలవా అన్నాడు భగవానుని సెలవు అన్నాడు రాము.

కారుబుర్రుమన్నది.

సీమంతములో వివాహమంటూ రాములోపల ప్రవేశించినాడు.

రేపువకవివాహమున్నది రా చెల్లెలుగానిచెల్లెలు వస్తూవున్నది అన్నది జ్ఞానాంబ.

విన్నాను సమ్మతించివున్నాను. ఒకటికి తోడు రెండు అవుతాయి భయ ములేదు. అన్నాడు రాము.

అద్దాలు. నూనెలు. దువ్వెనలు ఏట్లాడడానికి ప్రారంభమయినది.

ఇదీ మంచివేళని సరోజపుస్తకము తీసుకొనివచ్చి అందరిమధ్యలో గూర్చొని ఇంకకానియ్యండమ్మా వ్రాసుకుంటానన్నది.

వకడెబ్బైఏడుల ముసలిముత్తయిదువ ఒకాయమ వ్రాసుకొవే. జోలపాట చెప్పుతాను యశోద కృష్ణునికి బాలగ్రహపీడసోకకుండా దృష్టిదోషము తగుల కుండా రోగబాధలకు చిక్కకుండా పీడాపిశాచభితి తగులకుండా ఉండేటట్లు భగ వన్నామములతో కవచముగానుండునట్లు పాటపాడినదట ఇదివెవరు నిత్యమూ పాడుతూపిల్లలనిద్రపుత్తురో అపిల్లలకు ఏబాధలులేక కృష్ణునివలె చంద్రునివలె దినదినప్రవర్ధమానులై తేజోవంతులైపెంపొందుదురని మాయమ్మ నాకుచెప్పినది. నేనావిధిగా ఆచరించినాను. మాపిల్లలు సుఖంగా ముందుకువచ్చినారు ఎంతో బుద్ధిమంతులై శ్రీమంతులై గుణవంతులై దేశోద్ధారకులుగా వున్నారన్నది.

చెప్పుఅవ్వా అన్నది సరోజ.

అందరూ పేనాలకు కాగితాలకు వెతకనారంభించినారు.

అది గ్రహించి సరోజ అందరికీ అన్నికాగితాలు ఇచ్చినది.

అందరూ వ్రాసుకొన ప్రారంభించినారు.

జో. జో. నందన. అన్నదిఆమె. అంతలోనే ఇదిమగపిల్లవాండ్రకు ఆడపిల్లలకో అన్నది ఒకపదివీండ్లపిల్ల.

చెప్పుతాలేవేరేవు నీవూపిల్లలకని పాడుదువు అన్నదామె.

ఏమవ్వా అట్లంటావు ఆడదైపుట్టిననక పిల్లలకనవలసినదే. మగవాడై పుట్టిననక తల్లులా పిల్లలా సాకవలసినదే. తప్పుతుందా? తప్పించుకుందామన్న కామదేవతపోనిస్తుందా అన్నది.

ఏమి కున్నిముండవే కున్నికాలమమ్మాయిది. మాకాలంలో పెండ్లిఅంటే బహూసిగ్గు చూడనువచ్చినారంటే మూలనదూరుకొని ఎంతపిల్చినారాక గడగడ వణకుతూ పెద్దవారిగర్జనలకు ప్రాణంపోకారాకా వచ్చి చూచీచూడకముందే చెలాయించి మూలనానుకొని తనదేదోపోయినట్లు చించించేవాళ్లము ఇప్పుడన్ననో పెండ్లికొడుకు ఇంటికి వచ్చిరాకమునుపే వెనుకా ముందుచూడక ఏమనుకుంటారోనని తలంచక ఎదఇచ్చినిల్చి ఏడీ, ఆయన చూపించండి. అని ఎగ్గూ సిగ్గూలేక చూచి వీరేనా బింగిముఖము వృద్ధజంబుక మంటూ వెక్కిరించే కున్నికాలమమ్మా మేము చూచేదిలేమ. గీచేదీలేమ. ఎంతపుణ్యము చేసినానో అంతేజరుగుతుంది. అట్లాటివాడే దాపురిస్తాడు. అదిన్నావిధి ఎవరేమిచేస్తారని కష్టాలఎదిరించను కావలసిన దైవశక్తిని అర్థిస్తూ పనీపాటలనేర్చుకుంటూ అక్కడ అత్తశూలము త్రిప్పితే వాలము త్రిప్పకుండా చక్రము త్రిప్పేటట్లు సర్వకార్యముల సంగ్రహించి సంస్కరింపబడి అత్తకు ఈతనేర్పే ధీమాతోఉండే వాళ్లమమ్మా ఈకున్నికాలము మాకుతెలియదు అన్నది.

అవ్వా అనాటి పెండ్లి కొడుకులకు ఏముప్పైయ్యో నలభైయ్యోఏండ్లు వచ్చి కోరమీసాలతో పెండ్లానికి జడకుచ్చులయ్యేటట్లు దాడిపెరిగి బ్రహ్మచర్యముతో అబోతువలె ఎగబెరిగి ఏనుగుతలలంతటి ఎగుభుజములు గలిగిన మహానుభావుల కన్యచూడవలెనంటే, సాధ్యమా నల్లకట్లపులిని చూచినట్లుంటుంది. కర్మజాలక కండ్లట్లురిమితే కాలయముడే తలయెత్తట్లచూచితే పరమభేతాళుడే అవ్వా ఇకమీద

చెయివేస్తే నాయననాయనజేజినాయనకానవస్తాడు అట్లాటివారినిచూస్తేభయముండదా ఈనాడు అట్లకాదే వచ్చీరాని మీసాలతో వచ్చినా కొరిగిన సన్నివేశాలతో వేషాలతో మెరుగైన వస్త్రాలతో పెట్టుడువేషం పెట్టుడు భాషలతో ఉండే మొగోళ్లను చూడ కేంభయమా అ అట్లా విద్యావివేక ధనసంపత్తులుగల మొగోళ్లయితే ఇప్పుడూసిగ్గు ఉంటుందిలే అవ్వా సిగ్గులేకేమి అన్నదా పిల్ల.

ఈయీడుకే ఎన్నినేర్చినావే కున్నిముండా అన్నదామె.

నాకు ఈడులేకున్న మాఅమ్మకు ఈడులేదా అమ్మ అమ్మకు వయసులేదా వారివారి పిల్లలకు చెప్పుతూనేఉంటారు తయారవ్వుతూనే ఉంటారు నేనుపిల్లనయినా మా తల్లిపిల్లగాదులే అవ్వా కానీ అందరూ చూపెట్టుకునారు పాటగానీ అన్నదా పిల్ల.

ఓసీ నీపిల్లగాల పిల్లవా పిడుగువా ఎన్నినేర్చినావే అమ్మా అంటూ పాట చెప్పడమునకు ప్రారంభించినది.

## —( మధురగతి రగడ )—

జో. జో. బాలక జోజోనందన జోజోసుందర జోనాతనయ
నీపాదంబుల నీరజగర్భుండే. పారందయనేలును గావుత
జానువులను నాజ్వలనుం డేలుత భానుడు తొడలను బాయకయేలుత
నడుమును ఎప్పుడు నరహరి గావుత కడుపును పీపును కపిలుండేలుత
హరిహృదయంబును హరుడునురంబును కరములనింద్రుడు గాచునుగావుత
రవికంఠమురేరాజు ముఖంబును భవుడు భుజంబుల పరిపాలించుత
శారదబుద్ధిని శాంకరిశిరమున సారసమందిర సర్వము గాచుత
మునుచక్రంబును మూపునశంఖము వెనుకగదన్గొని వెన్నుడుగాచుత
క్రిందాఫణిపతి క్రీడలసురపతి మీదాఖగపతి మేలిమిగాచుత
ప్రాణంబులనీ పార్శ్వంబులశిఖి స్థాణుడు గుణముల సఖుడయియేలుత
నడచెడివేళల నారాయణుడును కుడిచెడి తరివైకుంఠుడు గావుత
శయనించెడితరి సర్వేశ్వరుడును భయముననాబలభద్రుడు గావుత
బాలగ్రహముల బారిన పడక యకాలమృత్యువుల కంటనుపడకను
సర్వావస్థల సర్వవేళలను సర్వత్రను హరిసఖుడై గావుత ॥జో॥

ఇంతేనమ్మా ఇదిమధురగతిరగడ అంటారు. సామాన్యంగా చదువువచ్చు రాగము తాళముతోపాడవచ్చు. అదితాళములో రాగము దేనినయిన తోడుచేసి శక్తికొలది చెప్పవచ్చు. మీమీఇష్టప్రకారము పాడుకొనవచ్చుతల్లీ ఇరోజ ఇది పూర్వాచారమమ్మా పాతకాలమువారము అన్నదామె.

అంతలో వక ముత్తయిదువ చిరునవ్వుతో సరోజనుచూస్తూ నాకుతెలిసిన అనుభవమూ వకటి చెప్పుతానమ్మా దాచుకోరాదు సాటివారికిచెప్పి మేలుచేయ వలెనని వేదములవద్దనుండి నవలలవరకూ చెప్పుచున్నవి. దాచుకొనిఏమిమేలు. ఏమంటే తల్లి పిల్లకుపాలిచ్చునప్పుడు మంచిచోటుగాచూచి కూర్చొని అందున్న ఆడమగ మర్యాదతెలిసి స్తన్యము పిల్లవానినోటికందిచ్చి పైన దృష్టిదోషము తగులకుండా ఇతరులుచూడకుండా పిల్లవానికి ఊపిరాడునట్లు పైటకప్పుకొని చింతలతో కుటుంబచిక్కులతో దీర్ఘాలోచనలతో దుఃఖముతో కోపము క్రోధ ముతో ఆహారముతింటూ కామోద్రేకమగు ఆలోచనలతో ఆకలి అగుచుండగా పాలుఇవ్వరాదు. అట్లుఇచ్చినపాలు దుర్గుణముల చేకూర్చును. వ్యాధిగ్రస్తుల, కోపగ్రస్తులచేసి నేరగ్రస్తులగునట్లుచేయును. జ్ఞానమునసింపుచేసిఅ జ్ఞానమావహింప చేయును. ఇదీకాక భార్యాభర్త సంగమానంతరం పాదప్రక్షాళనముచేసిస్తన్యముల తడితోతుడుచుకొని క్షీరమో నీరమోత్రావిపదినిఃషుసములకాలమైనా తాళిపాలివ్వ వలయును. లేక వెంటనే ఇచ్చిన బాలారిష్టముతుసోకడము, ఛేములు, పడిసెముగలు గును. గ్రహపీడకగులును. కొందరు నేర్పరులు శిశువునకుపాలుఇచ్చే సంగమమున కుపక్రమింతురు. అయినాదేహము శాంతించి క్షీరములు శీతలమునకు వచ్చుటకైపాద ప్రక్షాళనము మొదలగునవిచేసుకొని ఆహారమే, పానీయమో పుచ్చుకొనెదరు. ఇది మంచినడక. అట్లుపాలిచ్చునప్పుడు యేమిచింతాచీకులేకుండా, త్రిదేవీస్తోత్రముచేయు చూపిల్లవాడుమంచివాడుకావలె కీర్తిగౌరవములుతేవలెనను ధ్యానతోపాలిచ్చి పరుండ బెట్టినఏచీరూ ఛిద్రములేకుండాతయారై అటురాజ్యాంగమునకో, ఇటుప్రజానీకము. నకో పనికివచ్చును మైథున నిద్రాహారములకైపుట్టు జెట్టులోచేరడు. వ్రాసుకోండి చెప్పుతా.

## దండకము.

శ్రీదేవులారా త్రిదేవాది దేవేరులారా మహాపూజ్యులారా మహోదారు లారా దయామూర్తులారా సదామిమ్ము ధ్యానింతు

పూజింతు హృత్పద్మమందుంతు మాతాపితల్
మీరుగానెంతు నాపాప మీపాపగా జూడరే
ఆయురారోగ్యముల్ భోగభాగ్యంబులుఙ్ జ్ఞాన
వైరాగ్యముల్ సర్వసంపత్తులున్ గూర్పరే
నాదుక్షీరంబులున్ మీదుక్షీరంబులై జ్ఞానదీప్తిన్
ప్రసారించి ధీవింపరే దేహసౌభాగ్యముఙ్ రూప
లావణ్యమున్ గల్గివర్ధిల్లగాపల్కరే మీదుదాసాను
దాసుండుగా మీదుసత్పుత్రి శిష్యప్రశిష్యుండుగా చేర్పరే,
ధర్మసంస్థాపనల్ చేయుబుద్దిన్ ప్రసాదింపరే చేయ
దైవ్యంబు సంపూర్తిగానియ్యరే కీర్తికాముండుగా
లోకమాన్యుండుగా రాజపూజ్యుండుగా సత్య
శీలుండుగా నిర్మలాత్ముండుగా శాంతచిత్తుండుగా
చేయరే చాలదాక్షిణ్యమున్ చూపరే! నాకుసంతో
షమున్గూర్పరే తల్లులారా మహోదారులారా నమస్తే నమస్తేనమః.

సరోజా ఈదండకమునేర్చుకొని మరువకుండా పాలుఇచ్చునప్పుడంతా లేకున్నాత్రిసంధ్యలా పాడుతూ పాలుఇయ్యితల్లినీపుత్రుడు త్రిదేవి పుత్రుడవుతాడు ఇదిసనాతనధర్మము మరుతవద్దు అన్నదామె.

ఇంకొక అమ్మముందుకువచ్చి సరోజానాకొక అనుభవము గలదమ్మా అయితే వినినన్నొక అపరియోజకురాలనుకొనకండి. అనుభవాలుఎంతచెడ్డవయినా చెప్పిమరొకరిని పొరపాటుపడనివ్వకుండా చూడడమే మానవలక్ష్యం. కాబట్టి చెప్పుతున్నాను. అందులో యుక్తవయస్కులుమీరు కాముడువెన్నంటితరుముతాడు వానిదాడికి అరువదేడుల ముసలివారుకూడా తాళలేరు. అందులో కర్మజాలని సమయములలోనే అధూర్తుడు మగవానిని వెనుకముందుచూడకుండా వెన్నంటి కొట్టేది ఆడవారు శరణ్యమివ్వకతప్పదు. ఆర్తువైశరణుజొచ్చినవారిని సమయ ముకాదంటే అవుతుందా వెన్నివ్వకఘోరాడి పతనముసేయవలసివస్తుంది సరోజా నమ్మితేనమ్ము నమ్మకపోతేపో నాకుమారుడు సంవత్సరముపిల్లవాడు నాకు పాలులేకపోగా పోతపాలుపోస్తూఉంటిమి. వానికిజ్వరము ఖేదులువచ్చి నిలిచి పోయి కొంచెము నెమ్మదిగాఉండెను. వకదినం పిల్లవానిప్రక్కనేను పండుకొని

ఉన్నాను ఆయన పదకొండుగంటలవరకు వ్రాసుకొంటూఉండి వచ్చిపిల్లవాని చూచినాడు బాగానిద్రపోతూఉన్నాడు అప్పుడు తమకామాన్ని ఆపలేక నన్నుచూచి ఏమే శత్రువువచ్చినాడు శరణ్యం శరణ్యం అన్నాడు. ఏమండీ, పిల్లవాడు అట్లున్నాడు కరుణకొంచెమయినా ఉండవనిలేదా? మళ్ళీజబ్బుఎక్కువయితే ఏమి చేస్తాము శత్రువుకు నాలుగునాళ్లు వాలుదావేయమన్నాను.

శత్రువువచ్చి వెన్నంటికొట్టుతూఉంటే రేపురా మాపురా అంటేపోతాడా వాన్ని తుదముట్టిస్తేనే చెప్పినమాటవినేది. అయినాపిల్లవాడు పాలుత్రాగేదిలేదుగదా అందులోనుమారుగానున్నది ఏమిపరవాలేదమ్మని బాధపెట్టగా ఇటుకన్నకొడుకు అటుశత్రుబాధానివర్తికై, కట్టుకున్నవారు ఇరువురిలో ఎవరినికాదనవలెనని యోచించి కడకు ఇష్టములేకున్నా ఎక్కువబాధపడుతున్న వారిపక్షమేపోలి శత్రు సంహారమొనర్చులోపల పిల్లవాడు నిద్రలేచినాడు. ఆచరణాభిధానముల విడచి పోయిపక్కలోపండుకున్నాను. సరోజా ఏమిచెప్పుదులే అయిదునిముషములలో ఇటుఅటుపొర్లడం అటుఇటుచూడడము గట్టిగానన్నుకరుచుకోవడం కెవ్వునకేక వేసిఏడ్వడం పోరుపెట్టుకున్నాడు చెప్పనలవికాలేదు వానిబాధచూస్తే నాకుభయమొకప్రక్క దుఃఖమొకప్రక్క చెప్పనలవికాలేదు. తరుముకొస్తున్నాయి హృదయముతరుక్కుపోతూఉన్నది. చూడలేక ఏమండీ ఇటుచూడండి పిల్లవాడేమో దిక్కులు దిక్కులు చూస్తాడు అరుస్తాడు అన్నాను. మావారు ఆయుర్వేదము మంత్రశాస్త్రము జోతిష్యము కొంతవరకు తెలిసినవారు. వచ్చిచూచి నీవన్నంత వరకూ వచ్చింది అన్నంతపనీ అయింది ఇప్పుడేమిచేయవలెనన్నాడు.

ఏమీ అన్నాను.

మళ్లీ చెప్పుతానంటూపోయి ఆ అర్ధరాత్రిలో శిరస్నానముచేసి పిల్లవాని చొక్కాతీసివేసి నాచేతికిచ్చి మంచములో గుడ్డలన్నీ తీసివేసి నన్నూ స్నానము చేయమన్నాడు. పిల్లవానిని చేతికి తీసుకొని విష్ణుశతనామ స్తోత్రముచెప్పుచూ భుజమున కాంచుకొని తట్టుచూ ఇటూ అటు త్రిప్పుచుండెను. అంతలోనేను శిరస్నానముచేసి వచ్చినాను అగ్నిరగుల చేయమని సాంబ్రాణి అదేస్తోత్రముతో మంత్రించి సాంబ్రాణి వేయుచు విష్ణుకవచము చెప్పుచూ పిల్లవానికి మూడుమార్లు దిగదుడిచి వేరేగుడ్డల మంచములో పరచమని పరుండబెట్టి జోకొట్టుతూ ఉండగా క్షణములో నిద్రపోయినాడు. నన్నుచూచి నవ్వుతూ తలబాగాతుడుచుకో శిరస్సు

ఆరక తడివెంట్రుకలతో పండినిదురపోరాదు. పాలివ్వరాదు. తల్లికిపిల్లకూజబు చేస్తుంది అన్నాడు.

అయ్యో తండ్రికికూడా చేస్తుందేమోనే అన్నాను. నాకెందుకు చేస్తుందే అని నవ్వినాడు.

ఎందుకు చేయదు వద్దన్నావినక తప్పుడుపనులు చేసినందుకు శిరస్నానాలన్నా చేయించదు వేళాపాళా లేనందుకు శిరస్నానం చేసినందుకు నిద్దరచెడి ఉష్ణాధిక్యమయినందుకు రేపు ధన్వంతరీభాగం వచ్చేజీతంలో తీస్తే, అప్పుడు దొరగారికి కానవచ్చేది. భగవదనుగ్రహంతో తప్పు వప్పుగా క్షణంలో మారింది. లేకుంటే దొరగారి తప్పుకు జుల్మానా పదిరూపాయలు డాక్టరుగారికి వప్పించవలసివచ్చి ఉండును. ఇన్నినియమాలు తెలిసిన దొరవారికి ఈనియమము ఎందుకు తెలియక పోయె నంటాను. అర్ధరాత్రిలో స్నానాలు చేసేటట్లు ప్రాణాలకు తెస్తిరే అన్నాను.

ఔను పొరపాటు నడిరాత్రి వరకు కలంప్రేమ ఘట్టాలలోనే నడిచింది ఆఘట్టములో వకయోగి అన్నాడు. భగవంతుని గురించి స్వామీ నాకా విటకత్తెపై బుద్ధి పరుగిడినట్లు, నీపైపరుగిడినా ఆవిషయ వాంఛలతలంచి మైమరచి తన్మయము జెందినట్లు, తన్మయము చెందినా ప్రతిఅవయముల సౌకుమార్యము సౌందర్యము వర్ణించుచూ సురతసుఖములోగల ఆనందము ఆనందములో వెల్వడు చిలిపిచేష్టలు చిలుకపలుకులు. శబ్దస్పర్శరూప రసగంధముల గలుగు ఉత్సాహము ఉత్సాహములో పంచేంద్రియములు స్పర్శలుతప్పి ఏకగ్రీవమై ఆవిటాంగనాగాఢ ప్రేమలో లీనమైనట్లు, నీలో లీనమైతే నీలోకము దూరమెంత నీవెంత నీశక్తియెంత స్వామీ ఆతెర ఇట్లత్రిప్పలేవుగా అని భగవంతుని ప్రశ్నించినాడట యోగి ఆఘట్టమేవ్రాసి తలవాసి ఇటువచ్చి చూతుగదా. నీవెంతో ఆనందముగా సుందరముగా అగుపడదము ఆముఖములో విద్యుత్ కేంద్రములో వెలుతురువలె ప్రకాశించ అనునంతలో నేను ఇంకపోనివ్వండని తలంచి.

ఔలే అక్కడ కాగితాలలో ఆడించినకలం నాముఖములో ఘూడించకండి ఆముండాకొడుకు వేళాపాలా తెలియకుండా మళ్లీవచ్చిని నేనింక చల్లనీళ్లలో మునగలేను అన్నాను.

నవ్వుతూ ఇదీవక అనుభవమే అన్నాడు.

మంచి అనుభవమే చూడుపాపము ఎట్లనిద్రపోతున్నాడో ఆకసిగందువును చూస్తే కనికరములేదా. కామమంత చంపుతుందా అన్నాను నవ్వుతూ.

కాముడంటేఎట్లాటివాడో తెలుసునా? త్రిమూర్తులకూడ తైతక్కలాడిస్తాడు. తాతలకూడా శివమెక్కించి ఆడిస్తాడు. వానికి ముఖ్యమయిన ఆయుధాలు స్త్రీలు దృష్టి దోషముసోకి కాయలు పిందెలు కుళ్లిపోయినట్లు మీదృష్టిసోకినా, మీపైకిమనుసు పీకినా పురుషుడట్లేకుళ్లిపోవలసినదే. అలయిటువెలుతురులో నీముఖము చూచేట ప్పటికి మనసుచివుక్కుమనేటట్లు వెంటనేపనిచేసినాడు. పారచూచినాను పార చూచినదోషం శిరస్నానమువరకుదింపినది. అయినామనమెంతటివారము ఒకమ హానీయుడు నిగ్రహోదగుృడు ఆయనతండ్రి అవసానస్థితిలోనున్నపుడు భార్యా తానుకూర్చొని చూపెట్టుకొనిఉండగా అదిఅర్ధరాత్రి మేఘాడంబరములతోచిమ్మ చీకటితో ఝుమ్మని వీచుగాలితో ప్రకృతి భయంకరముగానుండువేళ భార్య పూర్తినవమాసములు నిండినిండనిగర్భవతి. భార్యాతానూ నిద్రమేల్కొని తండ్రిని చూపెట్టిఉండినసమయము అట్టిసమయములో మనస్సుమారి భార్యనుచేయిపట్టు కొనగా ఆమె అదిగమనించి దీనవదనముతో జాలిగలుగునట్లు ఏమండీ తమరే ఇంతఅన్యాయానికి లోబడి బుద్దినిపోనిస్తే లోకమేమవుతుంది. లోకులుఏమాత్ర ము నీతికినిలువగలరు. ధర్మదేవతకు ప్రపంచమున నిలువనీడగలదా యోచిం చండి తండ్రిఅవసానకాలస్థితిలో ఉన్నారు. నేనుప్రసవకాలస్థితిలో నున్నాను. ఇంతధర్మవ్యతిరిక్తమా అని కంటనీరువిడుచుతూ వద్దని గడ్డముపట్టుకొని జాలిగా దండముపెట్టి అడుక్కున్నదట అదిచూచుకొద్దీ మాటలువినుకొద్దీ బుద్ధి బద్ధము లేకుండాపద్దకు ఈడ్చుకొమ్మని బలవంతపెట్టినది. ఎంతబుద్ధిని నిల్పుకొందామన్నా నిలువవేదు. గంటకాలమయినది బుద్ధిమారినీవుఇప్పుడు నియములపాటిస్తే ఇంక ఇక్కడనిలువలేనుఅని బలాత్కరించి ఎత్తుకొనిపోయి మన్మధునిబారినుండి తప్పిం చుకొనివచ్చులోపల తండ్రిగతించినాడు, వెనుదిరిగి చూచులోపల భార్యప్రసవించి బాధపడుతున్నది. ఇరువాగుల జరిగినకర్మనుచూచి ఛీనాబుద్ధితక్కువను ఇప్పుడెట్లసవ రించుకొనవలయును అబ్బాఅనితలపట్టుకొనికూర్చొని కంటనీరుపెట్టినాడట నేనెంతటి వాడను అనుహానీయుడు దాచకతనఅనుభవము వ్రాయడముతోటి మనకుతెలిసినది. మనఅనుభవము మనజీవితచరిత్రలోమనమువ్రాయవలయును అయినావినుఅంటూ ముట్టూఅంటారుచావుపురుడూ అంటారు ఇవితగులరానిసమయములు ఎక్కడపోరాని సమయములు తెలియకచేసినాపాపమువచ్చుసమయములు. అట్లాసమయములలోచెట్ల

న్న, చేమలను తగిలిన అవికూడా దెబ్బతిని ఎండిపోవును- తలలువాల్చును పెరుగక ఎదుగక ఆగి చీడ మొదలగు పురుగులతో చెడిపోవును తెలిసినవారు తగులరు దైవవినియోగపదార్థములుకూడా తగులరాదు. అనగా అట్టివారుతగిలినపదార్థము మరొకరు తెలియక దేవునిఎదుట పెట్టిన ఆదోషము తగిలినవారికి అపాదించి బహిష్ఠుసమయముల కడుపునొప్పి కాలుసలుపు తలనొప్పి యోనిశూల నడుముల ఈడ్పు రక్తాధికము రక్తమునుచెడి దుర్గంధమగువాసన రక్తమునిలువక ఏడెనిమిదిరోజులపర్యంతము బాధించుట రక్తమునానారంగులతో వెలువడి కడకు సంతతేలేక చింతలపాలుచేయుట మున్నగుబాధలపాలుచేయనగు నీతికి నియమానికి నిలువవలయును. అట్టివారికి ముట్టుసమయములలో ఎట్టిబాధలుఉండవు. నియమానికి నిలువనివారికి దండనఇదే. అంటుముట్టును జాగ్రత్తలో ఉంచుకొనవలయును భావులలోదిగిన నీల్లుచెడును అగ్నినిముట్టుకున్న ఉండనేఉన్నది కాలుట బొబ్బలుపోవుట కన్నులలోశుక్లములుమొలిచి చూపుచెడి వరులపై ఆధారపడి వారితో చీ.ఛా. అనిపించుకొనుట బహిష్టసమయములలో దేవాలయసమీపముల తిరుగరాదు. వరులపిల్లలతగులరాదు. వ్యాధిగ్రస్తుల సమీపములకుపోరాదు శుభకార్యములలో పాల్గొనరాదు పాలుపిండరాదు, దారులలో తిరుగరాదు.రుతు రక్తము వెలువడకున్న ఉష్ణపదార్థముల ఎక్కుగావాడుకొనవలయును. ఎక్కువయినచలువపదార్థముల వాడుకొనవలయును దీనివల్లదోషము ప్రజాదూషణ దైవదూషణ ధర్మదూషణగలిగి జీవితరధమునకు అష్టకష్టవలె అష్టపడును యింకసరగమదోషమన్ననో ప్రాణాపాయమేతెచ్చును ఇప్పటిమనగతేననినివ్వినారు

అయితే స్త్రీ ఏమిచేస్తుంది. కాముకులై కాళ్లకు చుట్టుకొను పిల్లివలె చుట్టితే ఏమంటుంది. ఏమిచేస్తుంది. కాదంటే కటువుచేస్తారు. కటకటచేస్తారు. మరింత కాదంటే మంగళార్తులకు దారితీస్తారు దానికికాదంటే బలముంది అని కర్తనని మగవాడనని వినకుంటే పోనిస్తావా అని పొగరుబోతు తనంతో ఎత్తుకపోతారు. చెప్పినా వినరు కానిమ్మని ఊరకుంటే శంఖినీజాతి అంటారు ఇటునుయ్యి అటు గొయ్యి అంతామీమాటే మామాటేమున్నది. అన్నాను నవ్వుతూ.

అట్లుకాదే కామాన్ని చల్లార్చేది కరుణగలిగించేమాటలు గడ్డము పట్టుకొని లాలనగా సమయముకాదని లాలించి బేలించే వినయ విధేయతలు అన్నంతలో ఇంక పోనివ్వండని గంటలకొద్దీ చెప్పుతాడని.

ఈ లాలనలు బేలనలు తెలియని మగవానికడనైతే ప్రయోగింపవచ్చు పదహారుమంది పిల్లలయినా పదహారవేండ్ల పడుచువానివలె కామశాస్త్రం అకులు తిరగబట్టే అయ్యగారికి ఏమిచెప్పితే పోనిస్తారు కడుపునొప్పండీ అంటే కడుపు నొప్పికి మందిదేనండీ పదండి అనేకాముకులకు ఎవరేమిచెప్పగలరు అన్నాను.

అన్ని అంట్లకన్నా సంగమము అంటు చాలఅంటు ఈఅంటుసోకితే దేవతా వర్గము పిక్కబలమున్నంతా పరుగెత్తి పోతుంది పిశాచవర్గమంతా ప్రీతిగాఇల్లుచేరి భజరేభజ అని నృత్యముచేయుచూ వేయిడమరుకముల ఒకతూరి వాయించుచుడు దానితో ఇల్లుగుల్లగును. ఇదిగాక ఇంటిలో రోగులున్నప్పుడు, అమ్మవారు పోసిన వారున్నప్పుడు దైవకార్యములు శుభకార్యములు ఇంటిలో జరుగునప్పుడు అట్టికార్యములలో పాల్గొనునప్పుడు ఈ దోషము ప్రాణాపాయముచేయు ప్రయాణము పోవునప్పుడయిన కార్యహానిచేయును. అందుకొరకయ్యే అట్టిసమయములలో రోగులవయిన అవుపంచితము పెద్దవారు చల్లుచుండునది. అవు ఇంటిలోనుండిన ఎట్టి దోషములయినా పోవునని అవునుసాకుమన్నదీ ఇందుకొరకే అట్లతటస్థపడితే ఈవిధముగాచేయమని త్రిదేవీకవచములు చెప్పినాడు. తల్లీ సరోజా రాము ప్రేమ స్వభావుడు మన్మధస్వరూపుడు నీరూపమన్ననో పురుషులనైతేక్క లాడించెడి మోహినీస్వరూపం కన్నీటితో కాళ్లమీదపడి కన్నబిడ్డలదక్కించుకో పిల్లల రోగగ్రస్తులచేసి బాధించక పుణ్యము దక్కించుకో అన్నది ఆమె.

అంతలో కంటనీరు పెట్టినది వరఅయ్యమ.

ఏమమ్మా అన్నది సరోజ.

ఇప్పుడీమె చెప్పినది వింటే నాకుమారుని చేచేతులారా చంపుకున్నామమ్మా ఇప్పటికి నెలరోజులయినది పిల్లవానికి అమ్మవారుపోసి చల్లబడి బాగయినట్లు బాగయి భేదులు జ్వరమూ వస్తూఉండి తిరిగినయ్యమయి నాలుగునాళ్లు అయి ఉండెను. అప్పుడీల్లే కామానికాగలేక వద్దన్నావిడువక పట్టుపట్టితే అయ్యో అమ్మ వారికి సంగమ దోషము బహూచెడ్డదన్నారు. ఏమంత పాసిపోతున్నది. స్నానము చేయడానికికూడా వేళగాదు. అని బ్రతిమాలినా వచ్చీరాని ఇంగ్లీషు చదువుతో ఏది చూచినా సైన్సుకు విరుద్ధం విరుద్ధమంటూ పెద్దవారికి బుద్ధిలేదు. దీనికి దానికి సంబంధమేమంటూ తెలిసీ తెలియని తెలివితో వచ్చీరాని వయసులో పీల్లచదువుపైన బండపడా వీరిసైన్సుపైన గుండుపడా వినక తనఅక్కరకు కక్కుర్తిబడ్డారు.

అప్పుడే గంటలో జాస్తిగాను ప్రారంభమాయెను. ఊరక ఈప్రక్కకు అప్రక్కకు తలత్రిప్పడం అరువడం వకేబెదురు దడ, దప్పిక, దిక్కులు దిక్కులు చూడడము కన్నులు మూస్తేకలవరించడం భయపడడము మొదలుపెట్టినది. అదిఎన్నిచేసినా విడువక రెండురోజులలో వానిని ఎత్తుకపోయెనమ్మా ఇదినిజమేతల్లీ ఈవిషయాలు ఆడవారికి తెలియక పోయిన గండు పిల్లులవతె పిల్లల మగవారు చంపుతారమ్మా అప్పటినుంచీ జాగ్రత్తే ఏమేవచ్చినాడు దాసరిఅంటే కొట్టూమూతిమీద అనడమే పీళ్లకామంమీద మన్నుబోయ పిల్లజావనీ తల్లిచావనీ ఏమి ఇంగ్లీషుగాల్లో, ఈఅవక తవకలుచూస్తే ఇట్లున్నవి సాంగో పాంగముగా చదువుకున్న వారున్నారుగదా ఈఆర్బాటాలు హటావిడులు ఈహంగులు రంగులు వారికేమీఉండవు దేవుడూ దైవమూ నిష్ఠానియమములుంటాయి అబ్బాపీరంటేనోభయం అబ్బావద్దు అంటూ తలవిదలించుకున్నది.

ఇంతలోవకాయమ సరోజనుచూచి సరూ నేనొక అనుభవము చెప్పుతా విను నాకుఎనిమిదోనెల అప్పటిలో అర్ధరాత్రిలో హఠాత్తుగా ఆయాసము ఊపిరి ఆడనిదగ్గు వచ్చినది కూర్చొలేను పండుకోలేను అయాసము తోసుకవస్తుంది అప్పుడా ఇప్పుడా అనేటట్లు అయిపోయింది మావారికి ఇట్లాటివిచూస్తే బహాభ యం పరుగెత్తిపోయి పెద్దడాక్టరును పిలుచుకవచ్చినారు వారువిన్నెన్నోసూదులు మందులు ఇచ్చిచూచినారు ఊహూ కుదరలేదు అప్పుడు ప్రక్కయింటి ఆమెవిని వచ్చిచూచి పెద్దరేగుపండంత బెల్లము అయిదారు మిరియాలు మెత్తగా నలియ గొట్టి ఉంటచేసి దవడనపెట్టుకొని రసముమ్రింగమన్నది మ్రింగినాను అయిదారు నిముషాల్లో దగ్గు అయాసము నిలచినది పండుకున్నాను మంచిఅనుభవమ్మా అన్నాడు డాక్టరు ఇదిజ్ఞాపకముంచుకో గర్బవతులకు కొందరికి అప్పుడప్పుడూ వస్తూఉంటుంది అన్నది.

ఆది అందరూ వ్రాసుకున్నారు.

మరీవకటిచెపుతాను వ్రాసుకోండి అయిదుతులాలు శొంఠి అయిదుతులా లుతుంగగడ్డలు అయిదుతులాలు కరకవలుపు నున్నగానోరి వస్త్రగావితముపట్టి పదితులాల బెల్లమువేసి ఉడుకునీళ్ళతో బాగాజిగటగానూరి రేగుపండంతమాత్ర లుచేసి నీడన ఎండించి సీసాలోపెట్టుకొనవలయును దగ్గు ఉష్ణమువల్ల వచ్చిన ప్పుడు వక మాత్రను నమిలి దిగమ్రింగుటగాని దవడన పెట్టుకొని రసము దిగ

మింగుటగాని చేసిన దగ్గులునిలచిపోవును. జీర్ణముబాగా అవును నుసిపురుగుల చంపును ఆయాసమునాపును. ఏడికపాములచంపును ఉదరకోశముశుభ్రముజే యును మూడునాలుగేడుల పిల్లలకు జీర్ణములేనప్పుడు ఉదయ సాయంత్రముల నాలుగైదురోజులు తినిపించిన నుసిపురుగులుచచ్చిపోయి మలకోశము శుభ్రమగును దీనివల్ల ఏలాటి అభిప్రాయమూవుండదు అన్నదామె.

అంతలో డెబ్బదిఏడుల ముసలి ముసలిపండు ముత్తయిదువ ఒకాయమ సరో జను చూచి ఏమే పిల్లకోతులన్నీ అయిపోయినవా ఇంకా ఉన్నవా అయితేనమ్మా డెబ్బదిరెండు వెల్వలకపులలో జాంబవంతుడున్నట్లు ఇందున్నవారిలో వృద్ధురాలను జలరాసిని లంఘించే జవసత్వాలులేవు. ఆ అదుగో బిక్కికాయలుతిన్న బక్కకోతివలె వారనకూర్చున్ననాతి జవసత్వాలుగలకోతి దానికి సర్వమూ తెలుసునన్నది.

ఆమె ఈ మాటలువిని నవ్వుతూ ఏమే వృద్ధజంబుకమా చెప్పుతున్నావు వళ్లు చిక్కినా కళ్లు నిక్కిచూస్తాయన్నట్లు నిక్కినిక్కి చూస్తున్నావే అన్నది,

ఏమీలేదు రావే చుప్పనాతీ నీ బలపరాక్రమము చెప్పుతున్నానే అన్నది ముసలాయమ.

సరూ విను మా యింటిలో వాడుకొనునది వంశపారపర్యముగా వస్తూ ఉన్నది. ఆచారవ్యవహారాల్లో ఉన్నది చెప్పుతాను దేశాచారము కులాచారము అని రెండు విధములలో కొందరు గర్భవతికి ఏడవమాసములో కొందరు ఎనిమి దవ మాసములో కొందరు, తొమ్మిదవ మాసములో మరికొందరు అత్తా అమ్మా కలిసిగానిలేకున్న ముగ్గురు ముత్తయిదువులు కలిసిగానిచేరి సుదినముగాచూచి గర్భ వతిని శిరస్నానము చేయించి ఇలువేల్పును పూజించి శక్తికొలదీ క్షీరాన్నాదులు దైవనివేదనచేసి గర్భవతిని సుఖముగా ప్రసవించునట్లు తల్లీ, పిల్లా చల్లగుండునట్లు చెప్పుకొని దండము పెట్టుకొమ్మని భోజనానంతరం బజారుకు వెళ్ళునపుడు అపశ కునములు ఎదురుగాకుండా చూచుకొని పోయి బాలింతమందుకు కావలసిన దిను సులు తీసుకొనివచ్చి ఆ ముప్పురే దేవి ప్రార్థన చేయుచూ నలియగొట్టి తయారు చేసి దేవుని ఎదుటపెట్టి ధన్వంతరీ ధ్యానముచేసి స్వామీ ఈ ఔషధము అమృతమై తల్లినీ, పిల్లనూ చల్లగా కాపాడునట్లు ఆశీర్వదించి నీ చేయితగులు తండ్రీయని చెప్పు కొని నమస్కరించి రాగులలోగాని, వడ్లలోగాని ధాన్యములో పెట్టి దాచివుంచెదరు.

ధాన్యములేనివారు వకకుండలో బియ్యముపోసి వాటెపై మందు ముంతపెట్టి గాలి పోకుండా కుండపైన గుడ్డవేసి దానిపై మూకుడుమూసి ఉంచెదరు. గర్భవతి ప్రసవించి మాయ మొదలగు చిక్కులు తీరినవెంటనే చిన్నమేడికాయంత మందునుయిచ్చి నమిలి మ్రింగమందురు. ఇట్లే నిత్యమూ, చీకటితోలేచి పలుదోమి పెద్దరేగుపండు మొదలుకొని మేడిపండు ప్రమాణమువరకు దేహానుగుణ్యముగా తిని తాంబూలము వేసుకొని అందులో తాంబూలము మాత్రలు వకటిగాని రెండుగాని సమయానుకూలముగా వేసుకొందురు. ఒకఆకు అర్థంవక్క నమిలి మాత్రలు వేసుకొనవలయును. వేసుకొని మ్రింగవలసినదిగాన ఎక్కువ ఆకులు వక్కలు నములరాదు పైత్యమగును. ఇట్లు దేహారోగ్యము ననుసరించి **21** రోజు ఉదయము మాత్రము తిని ఆటుపైమందు ప్రమాణము తగ్గించుకొని **21** దినము తినినట్లయిన దేహములోనున్న నీరును పీల్చును గర్భసమయములలో ప్రసవమునకన్నా ముందు కొందరికి వాపు, అయాసము, దగ్గు, జ్వరము, భేదులు, కామిలానరములవాపు, పైత్యము, మలబద్ధకము ఈ విధమగునవి ఎన్నో వ్యాధులుండును అవి తీసివేయును ఆకలి గలిగించును. శిరస్సులోనున్న జలుబును పోగొట్టును మైలను యధారీతిగా గాక నిలచిపోయినది జారీచేయును మలతిత్తిని గర్భతిత్తిని శుభ్రము చేయును అహారకోశము, గర్భకోశము, శుభ్రములేకను ప్రసవమునకు ముందున్న జబ్బులవల్లనూ మైలవెలువడక లోపల నిల్చుటచేతను ప్రసవానంతరంవచ్చు జ్వరము, తలనొప్పి, దప్పికి వణుకు, నాలుకకొరుడుగట్టుట అపస్మారము తగులుట భేదులు, చీముభేదులు కాళ్లమంట, కన్నులమంట, కాళ్లతిమ్మర్లు, దేహతిమ్మర్లు, తలదిమ్ము, ముక్కులధిమ్ము పడిసెము, దేహముచచ్చు యోనిశూల, బొడ్డుశూల, డొక్కశూల మొదలగు వ్యాధుల రానివ్వదు ఇది బాలింతలకు ప్రాణభిక్ష పెట్టుతుంది. ఈమందుసేవించ దముకోటి పిల్లకుకూడా జబ్బురానివ్వదు అన్నదామె.

ఈమాటలు విన్న స్త్రీలంతా జడలువేసుకొనుట మాని కాగితాలు తీసుకొని చెప్పమని చూపెట్టినారు.

తాంబూలం మాత్రలు ముందు చెప్పమనువారు. మందు ముందుచెప్పమనువారు అవ్వా అనువారు. అత్తాఅనువారు గోలయినది.

సరోజ నవ్వుతూ మీ సీమంతాలలో అడిగి తెలుసుకోలేదేమే నేర్చుకోలేదా ఇప్పుడడుగుతారే అన్నది.

మా సీమంతాలకు తెలిసినవారు ఇంతమందిరాను. ఇంతమందిని పిలువను అదృష్ట మెక్కడనుండీ తేవవెనే సీమంతమంటే సీమంతం. అయిందంటే అయింది పొట్టకూ బట్టకూలేక అల్లాడే జీవులకు సీమంతాలు వకటా చావూలేమిడీ వ్యసనాలలో బలమయినవన్నారు. చావువల్లవచ్చు వ్యసనము దిన క్రమేణాపోతుంది. లేమిడీ వల్లగలుగు దుఃఖము దినదినాభివృద్ధియై చావుతో విడచిపోక పిల్లలకూడా పట్టిబాధిస్తుంది. సరోజా మేమూ మానవులమా మావీసుఖములా ముందుచేసినాము అనుభవిస్తూ ఉన్నాము. ముందుచేసినావు అనుభవిస్తూ ఉన్నావు రెండూ అనుభవాలే పాపానుభవంమాది. పుణ్యానుభవమునీది. నీచలువతో సీమంతమంటే ఎట్లుచేయవలయునో ఎట్లుండవలయునో ఎట్టిపద్ధతులు జరుపవలయునో చూచినాము విన్నాము పదివిషయాలు గ్రహించు కున్నాము. ఎక్కడశుభకార్యములకు పోయినా కొట్లాటలో, పోట్లాటలో, చీట్లాటలో, మాట్లాటలో, తిట్లాటలో, రంకులో, బొంకులో, చూచినాము. ఇట్ల పవిత్రమయిన చోటెక్కడా చూడలేదు తల్లీ ఇది నీపుణ్యము అన్నదామె.

కానీ అవ్వా అన్నదొక పడుచుపిల్ల.

ఔనేపిల్లా సరసాల్లోకి పనికి వస్తుంది. సరసం విరసంగాక మదను స్వరసం క్రిందమారినప్పుడు బాలింతకు పనికివస్తుందని ఇది అడుగుతున్నది. నీసీమంతానికి వస్తాలేవే అన్నదామె.

కానీ అత్తా అన్నది సరోజ.

వ్రాసుకో సొంతి పిప్పళ్లు మిరియాలు ఇంగువ జిలకర వాము చిత్రిమూలమువలుపు జాజికాయ జాపత్రి మోడి సైంధలవణము వాయులవంగాలు నాగకేసరాలు అక్కలకర్ర లవంగాలు లంగపుచెక్క తుంగగడ్డలు మానిపసపు కూరపసపు యాలకులు దినుసుకు అరతులము వంతున చూర్ణముచేసి వస్త్రగాలితముపట్టుకొని వెల్లుల్లిపాయలు (అనగా తెల్లగడ్డలు) పైపొట్టును లోపలి పొట్టునుతీసి కండను మాత్రిమే గ్రహించినవి. ఇరవైఅయిదు తులములు నేతిలో దొరగావేయించుకొని బెల్లము ఇరవైతులములు తూచుకొని అన్నీ పట్టుపాత్రలో బెల్లముమాత్రము వేసి పొయ్యిమీద పెట్టి వేతపాగుగా వచ్చునంతవరకు కాచి అందులో నేతిలోవేయించిన వెల్లుల్లిపాయలవేసి కలియబెట్టి అటుపై వస్త్రగాలితముచేసిన పొడినివేసి

కలియబెట్టి వేయించునపుడు మిగిలిన నెయ్యినిపోసి రోటిలోవేసి బాగామర్దన సేయుచూ మెత్తగా ఉంటలు చేసుకొన వీలగునట్లు నెయ్యిచేర్చి మృదువుగానిచ్చి మట్టిపాత్రలోగాని, గాజుపాత్రలోగానిపెట్టి గాలిపోకుండా భద్రపరచి ధ్యానములో ఉంచుకునేది దీనిని బాలింతలేహ్యం అంటారు అన్నదామె

మాత్రలు మాత్రలు అన్నదొక పిల్ల.

కలవరించవద్దే చెప్పతాను అన్నదా ముసలామె.

చెప్పు అత్తా అన్నది సరోజ.

కానీ వ్రాసుకో జాజికాయ, కిచ్చిలిగడ్డ, కోష్టు చలువమిరియాలు, జాపత్రి, యాలుకలు, చందనము, ఈదినునులు అరతులమువంతున కుంకుమపువ్వు. రెండు న్నర తులముం లవంగాలు, ఒకటిన్నరతులం కస్తూరి, పచ్చకర్పూరం పావలా ఎత్తు ఈ వస్తువుల నున్నగానూరుకొని ఎనిమిదితులముల చక్కెరచేర్చి టెంకాయ నీళ్లతో మెత్తగానూరి గురిగింజ ప్రమాణం మాత్రలుచేసి నీడనఎండించి సీసాలోవేసి వుంచుకునేది ఇవి తాంబూలములో వేసుకొని నమిలి మ్రింగినగానీ లేక భోజనా నంతరం పండుకొనునప్పుడు ఒకమాత్రను చప్పరించి మ్రింగి వకగ్లాసు పాలు త్రాగి పండుకున్నగాని వీర్యవృద్ధియగును. జీర్ణశక్తి పూర్తిగలుగును దేహము పుష్టిగా నుండును స్త్రీలు కష్టించియైనా చేసి భర్తకు ఇచ్చుచుండవలయును. ఏమే పిల్లా మాత్రలు మాత్రలని కలవరిస్తివి వీటెకన్నా మిన్నయినది వీర్యవృద్ధి చేయునది పటుత్వము రానురాను తగ్గినా దీనితో పటిమ గలిగించునది దేహం చెడనీనిది ధాతుపుష్టి నిచ్చునది స్త్రీ. కష్టమనక తయారుచేసి పురుషునికి తిని పించుచుండతగినది. చెప్పతా వ్రాసుకో రేపు ఎట్లాటివాడు వస్తాడో ఎట్టి విపత్తు లతో దేహబలము నిల్చిపోతుందోఏమో అట్టివిపత్సమయాలలో తిరిగి తయారు చేసుకోవలసిన విధినీదేగా ఆనాడు పొరుగింటికి ముంతతీసుకొని చట్టకుపోను ఇది భారతదేశం పాశ్చాత్య దేశాలుగావు కాదనిపోతే కంటినీళ్లు కాలితన్నులు అపనిందలు అపకీర్తులు ప్రాణభయాలు తెగతెంపులు ఇంటాబైటా రంపులు దం పులు అందరికీ తలవంపులు ఆడికీ తెగించితే ముంతనిండదూ కోర్కెపండదు. తయారుచేసి యిచ్చుకో అప్పుడు అవ్వను తల్చుకో తమాషాచూచుకో అన్నది అవ్వ-అవ్వా అదేకావలసినది ఇప్పటినుంచే నాకు భయముగానున్నది అందరి

అవస్థలా కనీవినీ పెండ్లిమాటవింటే గుండె దడామంటుంది ఆవిషయం వరునిలో గమనించేదికాదు ఆదిజ్యోతిష్యులకొకరికి తప్పమరెవ్వరికీ తెలియదని మాఅప్ప అంటూ ఉండగా విన్నాను గంగిరెద్దువలె వేషంవేసుకొని కూర్చున్న వానిచూచి సంతోషించవలసినదేగాని పాశ్చాత్యులవలె పరీక్షించి చేసుకొనేదిగాదు అది స్త్రీ పాపపుణ్యాను సరణంగా ఉంటుంది అని మాఅమ్మ చెప్పుతూ ఉండేది స్త్రీలో పుణ్యముఉన్నంతా పురుషునిలో .యౌవనముంటుంది అప్పటిలో స్త్రీ కొంతవరకు భర్తను చక్కచేసుకొనవలయునని చెప్పినది అదియెట్లఅంటే నాకర్మబాగనే ఉండినది నేనట్టివి నేర్పుకొననేలేదు చెప్పువారు దొరుకనూలేదు అక్కడికే సంతోషించినాను అన్నది. అవ్వా నీకెన్ని విధాలు తెయుసునో అన్నివిధాలాచెప్పి నాభయముదీర్చు నమస్కారముచేస్తానన్నదాపిల్ల.

అందరూ పకపకనగినారు గాని అవ్వచెప్పితే వ్రాసుకోవలెనని అభిలాష మాత్రము అందరి హృదయాలలోతగిలినది.

ఒసి నీపిల్లగాలా ఈవయసుకే ఇట్లున్నావే మళ్లీఎట్లనే అయితే అసుఖాల్లో నన్నుమరచిపోక అవ్వపుణ్యమంటావా మరచిపోతావా అన్నది అవ్వనవ్వుతూ.

అవ్వా దీపముపెట్టి మ్రొక్కుతా తాళిఅమ్మిఅయినా భర్తను తయారుచేసుకుంటా, నీమేలు మరచిపోకుండాఉంటా కానీ అవ్వా అంటూమరింత దగ్గరికి వచ్చినదాపిల్ల.

ఇప్పటినుంచే ఈభయం ఎందుకేనీకు అనాడుసూపుపులే అన్నది సరోజ నవ్వుతూ.

అబ్బా ఉక్కుతుంటవంటి మగవాడు దొరికినాడని నీవు వద్దంటావు, అందరూ నీయట్ల అదృష్టముచేయవద్దు. బాగానేయిస్తుందని పాడిమెనుమును తెచ్చుకొని అదిఇవ్వక తన్నుతుంటే ముంత పగిలిపోను గాజులురాలిపోను కొట్టనూ, తిట్టనూ చూస్తున్నాముగా అప్పుడో దాన్నిచక్కచేసుకునే విధానం తెలియకుంటే ఎట్లా పాడిమెనుముకన్నా ముందు దానిని సాకిసంతరించి దానివల్ల పాలుపితుకుకునే విధానం బాగా తెలుసుకొని ఉండవలయును లేకుంటే మూలనకూర్చొని ఏడ్వవలసిందే అదితెలిసి నిత్యమూ త్రిదేవుల పూజిస్తూ రాబోవు కష్టముల చెప్పుకొంటూ

ఉన్నానమ్మా అట్టాకష్టాలలో నన్నుపెట్టవద్దు తల్లుల్లారా ఆడవారికష్టంమీకు తెలిసిందేకదా నీకష్టాన్నైనా పడతానుగానీ ఈకష్టంరానీవద్దని మనస్ఫూర్తిగానమ్మి మనసారా పూజిస్తూఉన్నాను అవ్వాఅన్నదాపిల్ల.

అయితే రాసుకో పాపం నీకెందుకాదుగ్ధ అన్నది అవ్వ.

అందరూ కాగిదాలు తీసుకున్నారు.

అది ఆపిల్లనూచి అయ్యో మీవారంతా యోధాన యోధులైనట్లు నవ్వినారే మావారే షండాగ్రేసర చక్రవర్తి అయినట్లు బిడియమిడిచి అవ్వను అడిగింది నేనేగా నేనేవ్రాసుకోవలె మీకెందుకు అన్నదాపిల్ల,

కాదే ధనముంటే ధనము సంపాదించరా వకపదార్థంతింటే మళ్లీ ఆపదార్థం తినరా ప్రతిజీవీ ఇంకొద్దు అనేవస్తువేదీ లేదు కష్టము తప్పా అన్నదొకామె.

చెప్పు అత్తా అదిపోనివ్వదింక అన్నది సరోజ.

అయితే వ్రాసుకోండి ఇక్షుర గోక్షుర మర్కటబీజం ముసల శతావరి శాల్మలి ఫేనం ఘృత మధుశర్కర సమయాతుల్యాం శతనారీదినమేకం రమతే అన్నదామె.

అవ్వా ఇదేకావలసింది అబ్బా నా దిగులు తీరింది బ్రతికినా ఊ కానీ అన్నదాపిల్ల.

పైటచెరగులడ్డము పెట్టుకొని అందరు నవ్వుతుండగా ఆమెపిల్లనుచూచి ఓసిబడవా ముండా ఎంతాశ ఉన్నదేనీకు అన్ని నవ్వినది.

అది ఆపిల్లచూచి ఏమవ్వా అట్లనవుతావు అడుగనివారు. అప్రయోజకులన్నట్లు అనిపించుకొనకుండా మావారిని తయారుచేసుకునేది తప్పా ఇంటిగొడ్డుకు గడ్డివేయక ఎండబెట్టి పొరుగింటికి చల్లకు పోయేదిమేలంటావా అట్లపోకూడదని అడుగుతున్నా తప్పంటావా ముసుగులో నవ్వుతూ మూలమేమో వ్రాసుంటూనే ఉన్నారు. చూడు నీదృష్టికి రంకులాడినినేనే మాసరోజ అక్కకూడా వ్రాసుకుంటూ ఉన్నదిచూడు బంగారువంటి మాబావవుండి ఇంకెందుకని ఊరకున్నదా ఎవరి

మొగనిపైన వారికిప్రేమేలే అయినా మావారిపైననాకు బహుప్రేమమ్మా అన్నదా పిల్లనవ్వుతూ.

ఓసి కున్నిముండా ఒకటికాలేదు ఒకటిపోలేదు ఎన్నినేర్చినావే అన్నదామె.

కాదవ్వా కామం పుట్టుకతోపుట్టి నన్నుమాత్రం పోనిస్తుందా కాగలపని అంతాకానిస్తుంది. వద్దంటే బాధిస్తుంది. అదితెలిసిందేగా ముందే అన్నీనేర్చుకొని ఉంటే బాగని నాయభిప్రాయము అన్నదాపిల్ల.

సరే కానీ పెన్నేరుగడ్డలు పీనుగ పల్లేరుకాయలుగానీ పెద్దపల్లేరుకాయలు గానీ ఒకటి తీటకసిందవిత్తనాలు నేలతాటిగడ్డలు శతావరిగడ్డలు బూరుగబంక అయి దేసితులములు పొడిగాగొట్టి సేరున్నర చక్కెల లేతపాగుబట్టి అందులో పొడిపోసి కలియబెట్టి అయిదుతులముల నెయ్యి అయిదుతులముల తేనెవేసి కలిపి రోటిలోవేసి మెత్తగవునట్లుదంచి మృదుత్వమునకు రాకపోయిన మరింత నెయ్యిచేర్చి ఎత్తి పెట్టుకొని రాత్రి సంగమానంతరం పెద్దరేగుపండు ప్రమాణం మొదలుకొని మేడి పండు ప్రమాణంవరకూ యిచ్చి వకగ్లాసుపాలు త్రాగనిచ్చిన వెంటనే దేహము స్వచ్ఛస్థితిజెందు. దీప్తినిచ్చును క్షయకూ అక్షయకూదారి తీయదు తెల్లవారి బ్రహ్మ చారికి దేహమున్నట్లుండును. డెబ్బైవిడులవరకు యౌవనము లోపింపక కాయము దృఢకాయమై ఉండును స్త్రీతన ఆశయము పండించుకొనవచ్చు అయితే ఈవస్తు వులలో శతావరి దొరుకుట కొందరికికష్టం ఆచెట్లు కొండలలో ఏటివడ్డుల ఉండును అది తీగెవలె ముండ్లుగలిగి పైనఉండును దానికి యాభైమొదలు నూటాయాభైవరకు బొటనవ్రేలిలావుతో మూడు జానలకుపైన పొడవుగల్గి గడ్డలుండును మధ్యలో గడ్డకు నరమువలె క్రిందివరకూ ఉండును. వట్టినీరుతో చేరిఉండును. గడ్డలనే ఎండబెట్టిన ఎండవు ముక్కలు ముక్కలుతరిగి ఎండబెట్టవలయును. లేదా రసము పిండి తగుమోతాదు. బాగాకాచి అందులో మిగులువస్తువలు చేర్చితయారు చేసు కొనవలయును. ఇదివైద్యులవల్ల తెప్పించుకొనవలయును. రసము కొంచెము చేదు గానుండును. (తాటిపత్రితాలూకు యల్లనూరు మల్లేమల్లె ప్రాంతముల యేటివడ్డున దొరుకును)

ఈ లేహ్యము స్త్రీలకుకూడా ఉపయుక్తమే ప్రదరవ్యాధిని పోగొట్టును రుతురక్తము చక్కచేయును బిడ్డలు లేనివారు అయిదారు మాసములుగా తిం

వచ్చిన ఋతురక్తము సక్రమమయి బిడ్డలు తప్పక కలుగుదురు. ఋతురక్తముచెడియే బిడ్డలులేనిది రక్తమునలుపయిగాని వాసనతోగాని తెలుపుతోగాని బొత్తిగా కాకపో వుటతోగాని మొదలగు దుర్గుణములతో సంతతి ఆగిపోవును. ఋతురక్తము రక్తము వలె ఉండవలయును. ఈమందు ఈరక్తము శుభ్రపరచి సంతతినివ్వగలదు అన్నది అవ్వ.

అంగడిలోదొరుకు సామానులతో మరొకటిచెప్పు అవ్వా. శతావరిదొరుకుట కష్టము అన్నదాపిల్ల.

సరే వ్రాసుకో పెన్నేరుగడ్డలు నేలతాటిగడ్డలు పల్లేరుకాయలు బూరుగబంక బాదాము పప్పు ఖర్జూరపుపండ్లు ద్రాక్ష అయిదుతులముల వంతున విడివిడిగా నున్నగనూరుకొని జాజికాయలు, యాలకులు చిల్లగింజలు సాలామిశ్రి రెండుతుల ముల చొప్పున విడివిడిగా నూరుకొని నీకువలనుపడితే పదితులముల ఎండబెట్టి చూర్ణించిన మేడిపండ్లు నాలుగు తులముల తీటగసింద విత్తులు కలిసిన మేలు గానుండు ప్రతిచోటా దొరుకును. యాభైతులముల చక్కెర లేతపాగుబట్టి అందు లో ఈచూర్ణములుచేర్చి కలియబెట్టి రోటిలోవేసి పదితులములతేనే ఇరవైతులముల నెయ్యిచేర్చి బాగాదంచి గాజుపాత్రలో భద్రపరచి తినిచూచుకో. భర్తకుయిచ్చి నన్నుతలచుకో ఓసేయ్ భామా ఇంకొకరి సీమంతంలో ఇంకాచెప్పుతారా అన్నదిఅవ్వ.

అంతలో వంటమేనేజరుగారు బైటికివచ్చి అయ్యా ఈవేళ గురువారం వక్కపొద్దులుండే వారెవరైనా ఉంటే కొంచెము చెవులోవేయండి లెక్కవేసు కుంటూ ననగా నలుగురైదుగురు ఔనండీఅన్నారు సరేనని వరేశిష్యా గుమ్మడి కాయలు దండిగా ఉన్నట్లున్నవి వకకాయకొట్టి తరుగరాదోసెవేస్తాము అన్నాడు.

అక్కడొకాయన వంటమేనేజరును ఎగాదిగాచూచి గుమ్మడికాయ దోసే మిటిదిరా కుంకా అన్నాడు.

నీకేమి తెలుసురా సుంఠా అన్నాడాయన.

ఓరీ నీతలపండు పగులా గుమ్మడికాయదోసె సొరకాయదోసె బీరకాయ దోసె బెండకాయదోసె వంకాయదోసె ఇట్లాంటివన్నీ చేసేదానా ఓరి నీఫాడుగాను మనుష్యుల చంపేవురా అన్నాడాయన.

ఛర్వీవారికి దబ్బవారికి ఏమితెలుసురా శుంఠా దర్జాగాకూర్చొని అదిచేయి ఇదిచేయి అనే వంట దొరగారికి తెలుసురా అన్నాడు.

ఓరి కళాయిలేని రాగెబోకి దర్వీవారు గరిటెత్రిప్పుతారు దబ్బవారు నీళ్లు మోస్తారు అదైనా నయం నీవుశవడోలీలు మోస్తావుగదురా అన్నాడు అందరూ నవ్వినారు.

ఓరే మంగలం ముఖమా ఇది యుద్ధసమయం ఏదికానీ వృధాచేయక ఆహా రంగామార్చి నాల్కకు రుచిగా మనసుకు ఇంపుగా చూడను సొంపుగా ఉండేటట్లు చేయవలసిన బాధ్యత స్త్రీలది వంటవాళ్లది నీకేమితెలుసురా వరేశిష్యా దబ్బా అర్ధసేరు బియ్యము అరపావు ఉద్ధిబేడలునీళ్లలోపోయి నానని వరేదర్వీ వక గుమ్మడికాయను చెక్కులుపైపైవి తీసివేసి సన్నగా తరిగి పచ్చికొబ్బెర వకగిన్నె అందులోవేసి రుబ్బి కొంచెము ఉప్పు జిలకర వడవేయి బియ్యము బేడలు రుబ్బి రెండూ మిశ్రమముచేయి వస్తాను వేస్తాను గురువారంపోయి శుక్రవారం పుట్టి నంతవరకూ తింటూఉండవలె గురువారం గురువారం కలవరంలో రావలె అన్నాడు.

ఏమి మాట్లాడుతాడు ఈయన అన్నదొకామె.

అయ్యోవెర్రిపాడుగాను ఈలాంటి కార్యక్రమాలు చేయువాళ్లు కాఫీహోటళ్ల లో కార్యములు చేయువారు బజారులలో చాకిరిపనులు చేయువారు జోబీదొంగ లు దోపిడీలుచేయు మహాశూరులు వడుగానులుదిను పాపిముండలు వకరననేల హీనకార్యములకు దిగినవారంతా ఈలాటిమాటలలో దక్షులుగాని అందరూ ఎట్లు న్నారు వారివలెనేనెన్నడయ్యేది వారివలె గౌరవమర్యాదలతో జీవించేదెన్నడు ఆర్జించినది ఎట్లో కొంతముగిలించుకొని ఇల్లూవాకిలీ తయారుచేసుకొని ఆలుపిల్లలు అటమటపడకుండా సాకిసంతరించేదెన్నడు అనే ఆలోచన బొత్తిగా ఉండదు. దారి ద్ర్యాన్ని ఎదిరించి దరిజేరేవిధమే ఆలోచించరు ముందుగతుల చూడరు ఇంకానడి నీళ్లలోకే చస్తారమ్మా వెర్రిబుద్ధి పాడుగాను అన్నదామె.

ఔను ‘‘బుద్ధిఃకర్మానుసారిణీ’’ అన్నారుగదా దారిద్రులను బుద్ధి మంచి కార్యములపై ఈడ్చదు దైవసేవపై అంతకూ బుద్ధిని పోనివ్వదు వారివారి కర్మ వారిని తప్పక బాధిస్తుంది సోమరుల చేస్తుంది అన్నదొకామె.

ఇంకొకాయమ సరోజనుచూచి సరూ నావంతునేను చెల్లించుకుంటానమ్మా వ్రాసుకో ఇది స్వానుభవము మాఇంట్లో ఈమాత్రలు తయారుచేసి బీదాసాదల కుఇస్తూఉంటాము. వీటెను బాలసంజీవి మాత్రలు అంటారు సొంటి మిరియాలు పిప్పళ్లు వామం లవంగాలు ఇంగిలీకం వెలిగారం ఈనేడుదినుసులలో ఇంగిలీకము వెలిగారము శుద్ధిచేయవలయును అనగా ఇంగిలీకము నిమ్మరసముతో పలుకులు లేకుండానూరి ఎండబెట్టిన శుద్ధియగును వెలిగారము నున్నగానూరి ఇనపబాణలి లోవేసి వేయించిన బొరుగులవలెఅవును పేలును ఈవిధముగా శుద్ధిచేయబడినవి చేర్చి నిమ్మరసముతో కాటుకవలెనూరి మినపగింజలంతమాత్రలు చేసుకొని నీడన ఆరనిచ్చి సీసాలో ఉంచుకొనవలయును దినుసులు సమతూకములుగా చేర్చ వలయును.

బిడ్డపుట్టిన పదహైదురోజులనుండీ వ్యాధిబలానుసారముగా **1,2,3** వరకు వాడవచ్చును చనుబాలతోగాని ఆవిరిలో ఉడికించిన తులసి ఆకురసముతోగాని కుక్కతులసి ఆకురసముతోగాని పొంగబోసినఅల్లపురసముతోగాని, వుడుకునీళ్లతో గాని, అల్లపురసము చనుబాలు తేనె మూడుకలిపిగాని దేహబలము వయసునెరింగి వేసినట్లయిన జ్వరము పడిసెము పోగొట్టును అజీర్ణభేదులనిల్పును జీర్ణముచేయును నాసుగావచ్చును జ్వరమునుపోగొట్టును. నలిగాఉన్నపిల్లలకు దినక్రమేణ వేయుచూ వచ్చిన జీర్ణశక్తిగలిగి దానితో దేహముభివృద్ధియగును జలుబుచేసినప్పుడు ప్రతి పిల్ల వానికి వాడుకొనవచ్చును జీర్ణముకానిపిల్లలకు అమృతమువంటివి. ప్రతియింటా ఉండతగినవి మోతాదు హెచ్చించి పెద్దవారికికూడా వాడుకొనవచ్చును మంచిపని చేయును వీటెను బాలసంజీవి మాత్రలు అంటారు.

ఇంకొకటి వ్రాసుకో దీనిని బాలామృతమంటారు. ఆరుతులాల వేపాకు చిగుళ్లు, వకటిన్నరతులం వంతున కరక్కాయవలుపు వామము కటుకరోహిణి మిరియాలు నల్లజిలకర, ఈదినుసులలో వేపఇగుళ్లను బాణలిలోవేసి కొంచెముగా వాడ్చి ఎత్తిపెట్టి కరక్కాయవలుపు, కటుకరోహిణీ, మిరియాలు ఈమూడు కొంచెము వెచ్చజేసి వారనుంచి వామం, నల్లజిలకర కొంచెమువేయించి అన్నీచేర్చి కాటుకవలె వేడినీళ్లతో మర్ధించి గురిగింజలంత మాత్రలుచేసి నీడన ఎండించుకొని సీసాలో ఎత్తిపెట్టుకొని వయసు దేహబలానుగుణ్యముగా అర్ధమాత్రనుంచి నాలుగైదు మాత్రలవరకు వాడుకొనవచ్చును. సంవత్సరము లోపలివారికి వాడరాదు వేపాకు ఉండుటవల్ల నోరుచేదె కొంత బాధపడుదురు అజీర్ణము పోగొటును భేదుల

కట్టును వాంతులనిల్పును. ఆకలిపుట్టించును. నుసిపురుగుల చంపును. భేది వాసన గానున్నప్పుడు వాడిన జీర్ణముచేసి దుర్వాసన పోగొట్టును. మాత్రము జారీ చేయును. పెద్దవారికి అజీర్ణ భేదులు పెట్టిన 7. 8. మాత్రలు నలియగొట్టి నోటిలో పోసుకొని వేడినీళ్లతో మ్రింగిన ఒక పూటలోనే నిల్చును. సమయానుకూలముగా వ్యాధి ననుసరించి యిరవై మాత్రలవరకూ పెద్దవారికి వాడవచ్చును. కలరా అతిసారము సమయముల ఇంకా యెక్కువగా కూడా ఇవ్వవచ్చును. ఇందులో రసగంధకాలు లోహాలు లేవు.

మరివక అనుభూత చికిత్స సన్నపిల్లలకు భేదులు ఎక్కువగా అవుతున్నప్పుడు వజకొమ్ముకు ఆమిదము చుట్టూపూసి దబ్బళమునకుచెక్కి పోయిలోగాని దీపములో గాని నల్లగా బొగ్గగునట్లుకాల్చి దానిని నున్నగనూరి వకగురిగింజ ప్రమాణమునుంచీ నాలుగైదు గురిగింజల ప్రమాణమువరకు ఆరునెలల పిల్లవానికి మొదలుకొని మూడే డులవరకు మోతాదు హెచ్చించి పోయవచ్చును. చనుబాలలో కలిపిగాని తేనేలో గాని ఇయ్యవచ్చును. (గమనిక) ఈవజకొమ్ముమధ్య కాలక తెల్లగనుండును. ఈకొమ్మును కత్తితో కాలినమాత్రము గోకుకొనవలెను. మధ్యలోనున్న తెలుపు కలిసిన మరీ భేదులు ఎక్కువగును తెలుపుకలియకుండా నల్లటి మసిమాత్రమే తీసు కొనవలయును. అంటూ నిర్మలాంబతట్టు చూచి ఒసేయ్ బసివి చూస్తూ ఉన్నావేమే రా అన్నది అవ్వ.

ఒసేయ్ వృద్ధనారీ నేనువస్తినీనోరు మూసుకోవలసినదేఅంటూ నిర్మలాదేవివచ్చి కూర్చొని సరోజా ముఖ్యముగా పిల్లలను చూచుకొనవలసిన విధము ఏమన భేది రోజూ అవుతూఉన్నదా లేదా అభేది దుర్వాసనతో చేరియున్నదా జీర్ణమయి భేది అవుతూఉన్నదాలేదా నుసిపురుగులేమయినా ఉన్నవా. అనిచూచుకొనవలయును ఎక్కువభేదులయిన తగ్గించుకొనవలయును కాకపోయిన అగునట్లు చేసుకొనవల యును ఎక్కువ తక్కువల ప్రవర్తిలో చూచుకొనుట ముఖ్యము మూత్రముకూడా అప్పుడప్పుడూ చూచుచుండవలయును. బండపైన పోసిన మట్టగుట తెల్లటిగుడ్డ

ములు ముందువేసుకొనక కథలు కారణాలు చెప్పుకొనక నీచకార్యముల ప్రేరే పించుకొనక కాలమువృథాచేయక మంచి సాధనాసంపత్తుల నేర్చుకొని వరులకు చెప్పి పుణ్యమార్జించుకొనవలయును. నేనట్లు గ్రంధశోధన చేయకుండిన జ్ఞాపక ముంచుకొనకఉండిన మీకేమి చెప్పగలను కుటుంబరక్షణకై వస్తుగుణతత్వము కొంతవరకు భర్తను పిల్లల రక్షించు వైద్యవిధానము స్త్రీ గడించుకొనియే ఉం డవలయును. భర్త ఉచ్చుచురుకుతో అల్లాడుతుంటే మునగకాయలపులుసు నూగు లడోరుబిండి ఉలవచారుచేసి పెట్టితే పెట్టినగంటలో డాక్టరు రావలసి వస్తుంది దేహతత్వం వస్తుగుణతత్వం తెలుసుకొని రథాన్నినడుపవలసినదిస్త్రీ ఈమె శల్యా సారధ్యంచేస్తే కర్ణునిరథం దిగబడినట్లు దిగబడుతుంది. సరోజా నీలోఅన్నినేర్పు లూఉన్నవిలే కృష్ణసారధ్యంచేసి అర్జునునికే కృష్ణుడుఖ్యాతినినిచ్చినట్లు భర్తకుపేరు గడించి ఇవ్వగలవులే అన్నది నిర్మలాంబ.

సరోజ చిరునవునవ్వుతూ పిన్నమ్మా చాలాకష్టపడి చదివినావు అందరికీ చెప్పి పుణ్యమార్జించుకుంటూ ఉన్నావు మేమంతటివాళ్లమయినప్పుడుగదా అన్నది.

ఔనుతల్లీ కష్టపడిన వాళ్లదే ముందుమజలీ కష్టపడక ఒరుల కష్టముతిని సోమరులైన వారిదే వెనుకమజిలీ తెలిసినట్లే ఉన్నది అన్నది నిర్మలాదేవి.

ఔనని సరోజలేచినది అందరూలేచి ముఖాలుకడిగి తిలకాలుతీర్చి వేషాలువేసి నారు ఇంతలో అయిదున్నరగంట అయినది ధ్యానసమయమని ఎవరిపనిమీదవారు పోయినారు.

నిర్మలాంబ పదహైదు నిమిషాలలో అనాడు తనపూజ ముగించుకొని వచ్చి ఇంకా జపమాలత్రిప్పుకుంటూవున్న సోమిదేవమ్మ ప్రక్కన కూర్చున్నది.

ముసలి ముసలితనం పండువంటి ముత్తైదువతనంతో ఉన్నసోమిదేవమ్మ నిర్మలాంబను చూచి ఏమే ఈనాడు తొందరగా దైవధ్యానము ముగించుకున్నావే అన్నది.

ఏమి ఈఅల్లరిలో బుద్ధినిలుస్తుందా యిచ్చపుట్టుతుందా చూడు సింగారించు కొని వయ్యారపు నడకలతో వలపు చూపులతో కాళ్లు ఈడ్చుకుంటూ కొందరు గుజ్జుంకదం త్రొక్కగా గిట్టలశబ్దం అయినట్లు భూమిఅదుర టపటపనడచువారు కొందరు పనిలేకున్నా తన అందాన్ని చందాన్ని పదుగురు చూడవలెనని పరవళ్లు

త్రొక్కుతూ మగవారి మధ్యదూరి బయటికి బయటనుంచీ ఇంటిలోకి పోవువారు కొందరు ఊరపురాణాలు బంధుమిత్రుల అల్లకల్లోలాలు ఆత్మస్తుతులు ముందు వేసుకొని ప్రతిధ్వనులుగలిగి చెవులు బ్రద్దలయ్యేటట్లు మాట్లాడువారు కొందరు పూజాసమయము ఏదో చేసుకొనుచున్నారు వారినెందుకు మాట్లాడించవలెననక ప్రక్కనకూర్చొని మాట్లాడించువారు కొందరు మేసేగాడిదను కూసేగాడిద అల్లరి లేపినట్లు వారుచెడిపోవునదిగాక ఇతరులచెడగొట్టువారు కొందరు ఇప్పుడే వైకుంఠానికో కైలాసానికో పోతారు గావలెనని హేళన చేయువారుకొందరు ఇక సంస్కారములేని పిల్లలన్ననో కిష్కింధాకాండ ఉండనే ఉన్నది. వీళ్లెక్కడిపిల్లలో అమ్మా ఈవయసు పిల్లలు సంస్కారములేక చేసేపనులు చూడు ఆపనులుచూస్తే మూడు కాళ్లు ముదుసలయినా తలప్రక్కకు త్రిప్పుకుంటాడా మనసును మార్చుకుంటాడా చూడు నాకూలోపల లంగాఉన్నదంద్రా అని చీరకన్నా రెండేళ్లు క్రిందికి కట్టుకొనడమో లేక ఏవయినముతోనో వకవైనముగా చూచునట్లు చేయడమో మామయ్యా కొంచెమిటు తలత్రిప్పండీ ఇంద్రలోకమెందుకు పోవలె అక్కడ అప్సరసలు స్త్రీలే వారిపై ఆశవిడచి ఇటుచూడండీ అని అవయవశోభనుచూపి అరెదరిని వ్యామోహారంగమున దించి చిత్తమునకు చిచ్చుపెట్టు చున్నారు. ఈపాపము మరుజన్మకు శ్వేతకుష్ఠరోగముతో పదుగురికి అగుపడక తిరుగునట్లు దాచుకొని బ్రతుకునట్లు అందరూ ఏవగించుకొని తలలు త్రిప్పుకొనచూచి దుఃఖించునట్లు చేయునని పెద్దలతో వినియుండిన ఇట్లచేయుదురా వేళావిశేషములు తెలియక ధ్యానసమయమనక తిరుగుజీవులు సంస్కారములేని జీవులు పాపపుణ్య విచక్షణలేని అజ్ఞానులు అన్నది నిర్మల.

వీళ్లు పాపపునదిగాక మంచి మార్గములో పోవు వారికి వీరు భూతములై దాపురిస్తారు. వరుల పోనివ్వరు వారుపోరు ఈపాపము వీరిని మానవత్వమునుండి పూర్తి పతనమౌనంతవరకు పోనివ్వదు. అప్పుడు పైకెగజూచి చింతించేది వారేమి చేయగలరు. వారివిధివారినట్లు చేయుచున్నది అన్నది సోమిదేవమ్మ.

కాదు అత్తా మంచిమార్గములో పోవువారినన్నా చూచి వారుపోకూడదా తప్పక పెద్దలు చేయుపనులు నేనుచేసి తీరవలెనని పట్టుదల ఉండకూడదా రెండూలేని భ్రష్టుల నేమనవలెనంటావు అన్నది నిర్మల.

కాదమ్మా దారిద్ర్యులకు జ్ఞానహీనులకు సోమరులకు పట్టుదల ఉండదు ప్రజ్ఞావంతులమై ప్రజలలో బ్రతుకవలె మంచిఅని పించుకొనవలె పుణ్యము ఆర్జించుకొనవలె మరుజన్మ మంచిదివచ్చునట్లు చేసుకొనవలెనను ఆశవుండదు ఒకప్పుడు కాలకృత్యములే వారికి బరువుగా ఉండగలవు, వారిజీవితమే అంత మనసు క్షణమొకచోట నిలువక పరుగిడుచుండును. అందరూ పోవుదారిన వారు పోవరు అవకతవకల దారుల ఎన్నో యోచించు చుందురు తప్పుదారులసృజించి వాటెను సమర్ధించి నిల్చుటకై ప్రాణములనైనావొడ్డి పరాభవింపబడి పాపభూయిష్టు లగుచుందురు. వకరిదారుల వకరివున్నతస్థితిని వకరికీర్తిని వారువప్పుకోరు వకరి నడకవారికి వెగటుగాగన్పడుతుంది. సాలెపురుగువలె వారివలలో వారుపడి నశింతురు వీరే రాజ్యముల కూల్చద్రోయువారు కొంపల నాశనము చేయువారు మతముల లేపువారు భాషలసృజించువారు అర్ధములకు అపార్థముల చెప్పువారు అన్యమతముల పుచ్చుకొనువారు అన్యమతముల అన్యభాషల అన్యదేశములపొగడి ప్రజల ప్రోత్సహించువారు వారుబట్టిన కుందేటికి మూడేకాళ్లంటారు వీరుప్రకృతికే బరువు నీకూ నాకూ బరువుకారేమేతల్లీ వారివిధి అది వారేమిచేయుగలరు వెనుకకు పోయి పశుపక్షాదులలో పడువరకు వారునిలువరు అన్నది సోమిదేవమ్మ.

అట్లుపుటకు కారణమేమంటావు అత్తాఅని ఏమిచెప్పుతుందో సమాధానము అని ముసి ముసినగులతో నిర్మల వారగంట చూచు చుండెను.

ఆమాటకు సోమిదేవమ్మ నవ్వుతూ ఏమే నన్నడుగుతావు చదువుకున్న దానివి గ్రంథశోధన ఎంతో ఉంటుంది లోకానుభవము ఎంతో వుంటుంది నీవు నన్నడుగుతావే వినికిడి వున్నదాననునేను అంతమాటకు చక్కగా జవాబుఇవ్వగలనా అయినా విను మీమామ చెప్పుచుండగా విన్నది. చెప్పుతాను పదహారువన్నె బంగారు దేవత్వం శుద్ధరాగె పశుత్వం దేవత్వం శుద్ధపుణ్యం పశుత్వం శుద్ధపాపం బంగారు రాగె మిశ్రమము మానవత్వం అనగా పాపపుణ్య మిశ్రమము మానవత్వం బంగారులో ఇంతో అంతో రాగెకలిసినవారుపూజ్యులు పుణ్యులు అగ్రగణ్యులు మాన్యులు రాగెలో ఇంతో అంలో బంగారుకలిసినవారు దరిద్రులు అంగహీనులు మతిభ్రష్టులు బంగార్నులో రాగెకలియుకొద్ది విలువతగ్గును రాగెలో బంగారుకలియుకొద్ది విలువహెచ్చును. బంగారు ఎక్కువున్నకొద్ది విలువహెచ్చుగానుండును, రాగెఎక్కువ వున్నకొద్ది విలువతగ్గిపోవును. పాపపుణ్యములు స్వర్ణతామ్రములు అందువల్లనే ఈప్రపంచములో ప్రతిమానవునికి ఏదోవక కొరతగలిగే వుండును.

దానితో దుఃఖించుచునే ఉండును. శుద్ధపుణ్యులు వకరుకూడా ఉండరు. శుద్ధపుణ్యులకు చోటుఇక్కడలేదు. నిల్తురు నిర్జరాస్థలిౕ అన్నారు. దేవలోకములో నుందురు. కష్టములేని సుఖాలు తనివితీరా పొందుదురు. ఈలోకము పాపపుణ్య మిశ్రముగాన కష్టసుఖములు మిశ్రమముగా నుండును. కష్టము పాపం సుఖం పుణ్యం కష్టము దుఃఖములేనివాడుండడు. కష్టాలులేని సుఖాలుకావలెనని అసుఖాలకొరకయ్యే యజ్ఞయాగాది క్రతువులుచేయుట ధర్మసంస్థాపనలుచేయుట పుణ్యములుచేయుట సర్వము త్యజించి తపస్సులుచేయుట జీవితాంతము వరకు భగవంతుడున్నాడని నమ్మి పూజించుట ధ్యానించుట సేవించుట తాను తినునదికూడా తన్నాశించిన నిర్బదలకు పెట్టుట ధర్మబద్ధులై గీచిన గీటులో నిలుచుట కష్టమనక ఈతిబాధలకు వెరువక ఆచరణకు లొంగినడచుటఆర్యధర్మమువేసినపల్లనుదాటకఅటుమటపడుతుఅవలదాటకయుండుట కష్టములే సుఖములుగాభావించి జిహ్వోపస్థలకట్టి, సంఘమర్యాదలకులోనై జీవధర్మమెరింగి జీవించుట నిర్మలా ఈరాగెబోకులు అట్టిగనపట్టగలవా పంచేంద్రియముల అలజడిని లెక్కపెట్టక సంచరించగలవా ఈఆర్యావర్తములోపుట్టి ఆర్యధర్మముల విని ఆచరించుటకష్టమని తలుగు త్రెంచుకొని విచ్చలవిడిగా వీరవిహారముసేయబోవు పశుబుద్ధిని పట్టుదల పగ్గాన్నిచుట్టి భల్లాకపట్టుపట్టి మోచేతపూది నిలేసిగర్జించి ముష్టికొద్దీ మూతిపైపొడిచి ఈడ్చి మెడకు తలుగుపెట్టి దుశ్చేష్టల దుర్వినయాల అన్యాయాల అసూయల అపకారాలు మొదలగు పశున్యాయముల జోలికిపోనివ్వక సాత్త్వికాహారాన్ని పెట్టి చాలుకు చక్కగా నిలబెట్టి నడుపవలెనన్న ఈరాగెఎక్కువ కలిసిన బోకులతో అవుతుందా చిలుమెక్కక ఉంటుందా చాలుకు బుద్ధిని నిలవేసుకున్నమొగోళ్లు అగుపడుతూనే ఉన్నారుచూడు వీరు అంతో ఇంతో పుణ్యముచేసి మానవత్వానికి వచ్చిన మొగోళ్లు వీళ్లుసాధించగలరా బుద్ధిమహాచంచలము దానిని బట్టి స్వాధినములో పెట్టుకొన అందరితో అవుతుందా ఎంతోపుణ్యముండవలె ఎంతో ఆశఉండవలె శాంతముతో సాధించవలెనన్నది సోమిదేవమ్మ.

సెబాష్ అత్తా నీలో పేరుకుతగ్గ జ్ఞానమున్నది. బాగాచెప్పినావు బుద్ధినినిలేసి వట్టుదలతో సాధిస్తేనే ఏదయినా అయ్యేది లేకుంటే అవుతుందా ధర్మార్థ కామ మోక్షములు సాధించనవుతుందా అన్నది నిర్మల.

అంతలో భోజనాలకు లెమ్మనారు పోయి భోంచేసి వచ్చి ఎక్కడివారక్కడ కూర్చున్నారు.

సరోజ నిర్మలదగ్గరకువచ్చి పిన్నీ ఇంకాకొన్ని విషయాలు తెలియచెప్పిన బాగుండును ఏవో కొన్నిచెప్పుఅని ప్రక్కనకూర్చున్నది.

నిర్మల చిరునవ్వునవ్వుతూ ఆలోచించుచుండగా అందరూ ఆడవారు ఏమో చెప్పుతుందని వచ్చిచుట్టూ గుంపుగా కూర్చున్నారు.

అందులోవకపిల్ల ముసలామెనుచూచి అవ్వా జోలపాట చెప్పుతానంటివే అది కానీ మళ్లీ మందులు చెప్పుదువన్నది.

సోమిదేవమ్మ నవ్వుతూ అట్లనేజ్ఞాపక ముంచుకున్నావుగదే నీకుపిల్లలుపుట్టి నప్పటికిగదా జోలపాట కావలసినది. ఇప్పుడేమి మించిపోయినదే అన్నది ముసలాయమ.

అట్లకాదవ్వా రాబోవు సంసారానికి కావలసిన సరుకులు ఎప్పుడు దొరికినవి అప్పుడు సాంపాదించుకొని పెట్టుకొన్న అప్పటికి పనికివస్తాయి అప్పుడు కావలెనంటే ఎక్కడొస్తాయి అట్లనుకొన్నవారే బూబ్రారాక. బూదేనులై భూమికి బరువుగా ఉండేది ఎప్పుడేవస్తువ దొరుకుతుందో ఎప్పుడేవిషయం వింటామో కంటామో అది కంఠస్థము చేసిపెట్టుకొని ఉంటే ఆ యా వేళకు పనికివస్తుంది. ఉపకరిస్తుంది అవ్వా చెప్పు అన్నది.

మంచిజ్ఞానమే ఉంచుకున్నావు అట్లయితే వ్రాసుకోవే నీయాశ ఎందుకు కాదనవలెనని అవ్వ వ్రాసుకొమ్మన్నది.

## దండకము.

జో జో సుపుత్రీ సుగాత్రీ సదానంద జో జో
మదంబొందగా దేహసౌభాగ్య మారోగ్యమా
యుష్యముల్ గూర్చి కాపాడు కాత్యాయనీ దుష్టవిధ్వంసినీ
జ్ఞానదీప్తిన్ ప్రసాదించి వ్యాప్తిన్ ప్రసాదించి
దేదీప్య మానంబుగా బ్రోచు శ్రీభారతీతల్లి భాషాసతీ,
సర్వభోగంబులన్ సర్వసౌఖ్యంబులన్ ప్రీతిచే
కూర్చు శ్రీమానినీ భాగ్యసంధాయినీ,
ముప్పురానంద ముప్పొంగ దీవింత్రు పోషింత్రు
సంతృప్తిగల్గింత్రు నీవాడుకో పాడుకో.

దృష్టిదోషంబులుజ దుష్టబాలగ్రహోపద్ర
వంబుల్ నివారించి రక్షింత్రు మాతల్లి సౌఖ్యంబుగా
నిద్రబో వండి నాతల్లి సౌఖ్యంబుగా నిద్రబో॥

అంధరు వ్రాసుకున్నారు.

పాపాలకు భైరవునినేను వ్రాసుకునేది అందరుచూడవ్వా అడిగిందినేను వ్రాసుకునేది అందరూ అన్నదా పిల.

అంతలో నిర్మలాంబ సరోజనుచూచి సరూ పిల్లలకు స్నానము చేయించడములో కొందరు బుద్ధిలేని పెద్దమ్మలు ఉడుకుడుకు నీళ్లుపోసి వండబెట్టితేబాగా నిద్రపోతారని వేడివేడి నీళ్లుపోయగా పిల్లలచర్మము సన్నగ మృదువుగా రక్తపు ముద్దగానుండును అట్టివారికి కాలేకాలే నీళ్ళుపోయగా ఆదేహము తాళలేక యమలోక బాధనను భవిస్తూ వళ్లంతాకాలి ఉరిపరి మంటలతో చెప్పుటకు నోరులేక చేయుటకు వీలులేక ఏడ్చి ఏడ్చి నీళ్ళుపోసిన తోడనే నీళ్లబాధతో ఏడ్పుఅలసటతో పడి దేవుడాయని నిద్రపోగా చూడమ్మా ఉడుకుడుకు నీళ్ళుపోస్తే పిల్లలు బాగా నిదర్పోతారని మరింతవేడిగా పోయును ఆసన్న పిల్లలు పాపము నీళ్లుచూడగనే ఏడ్పుకు మొదలుపెట్టుతారు ఉదయ సాయంత్రముల యమలోకబాధపడి బయటికివస్తారు బుద్ధిబలములేని తల్లికి మానవత్వముతో పుట్టుటకన్నా పశువుకు పుట్టుటనయమన్నారు సరోజా అట్లచేయనిచ్చేవు గోరెచ్చగా నీళ్లుండవలయును చర్మము గట్టిపడుకొద్ది ఉష్ణాన్ని కొంచెము కొంచెము ఎక్కించుకుంటూ పోవలయునేగాని మనచేయిపెట్టిచూచి పరవాలేదనకూడదు మనచర్మమునకూ వారికి భేదము అవంతముగా నుండును అదిగమనించవలయును పిల్లలు నీల్లుచూచినతోనే భయపడరాదు ఉత్సాహము గలుగునట్లు చూడవలయును చేయవలయును పూసిననూనె పోవుటకు సీకాయపొడి సబ్బు సున్నిపిండి మొదలగునవి రుద్దునప్పుడు జాగ్రత్త ఉండవలయును.

ఉంగరాలు పెట్టుకొని రుద్దువారు గోర్లుపెంచుకొని రుద్దువారు ఉన్నారు అట్లచేయకు గట్టిగావేసి రుద్దడము కండ్లలోకి చెవులలోకి పిండిపోయినా విడువక మెడలు తల నిలువక బాధపడుతూ సిద్చుటకువీలులేక ముక్కులలోకి నోటిలోకినీల్లు పోతుండగా యమలోకమగుపడుతుండగా నోటమాటకూడలేక సమదాయించక

మూదేవతలవలె పోయుతల్లులున్నారు వారివలెగాక పిల్లలకు సుఖముగా నుండునట్లు వకచేత తలనుపట్టుకొని వకచేత రుద్దవలయును తలా మెడలు ఇటూ అటూ ఆడరాదు ఆడుటతోటి మెడనుండీ మెదడుకు పోవునరములు దెబ్బతిని జ్ఞానశక్తినశింపగును నిచ్చెన గుంతలో గట్టిగాపట్టి రుద్దరాదు పెద్దనరము ముఖ్యమయినది ఉన్నది అది ఇటూ అటూ అల్లాడిన మెదడుకదలిగాని ఉష్ణాధిక్యమయిగాని దెబ్బతినును ఈనరముపై ఉష్ణాన్నిగల్పించు తైలములు రుద్దరాదు చక్కగా మెదడు పెరుగకనిలుచును బుద్ధిమాంద్యమువచ్చును కన్నులలో పిండిపడిన మంటగలిగి కన్నులు ఎఱ్ఱనయి కనుకట్లు మొదలగునవిఅయి దృష్టికి శక్తిని తగ్గించును జాగ్రత్తఅవశ్యకము ఎక్కువగా పిల్లలయిన కరుణ పాపభీతి ఉండవలయును స్నానానంతరం తడితుడుచునప్పుడు గట్టిగాపట్టి రుద్దరాదు నీరును పీల్చుసన్నిగుడ్డతో రుద్దవలయును మాసినగుడ్డ నీరునుపీల్చలేదు బుజ్జగించుచూ బాధగలుగకుండా తన వంటిపైనున్న పుండిని కడుగునప్పుడు తుడుచునప్పుడు ఎంతజాగ్రత్త వహింతుమో అంతజాగ్రత్త పిల్లలపై ఉండవలయును నీళ్లుఅనిన ఉత్సాహపడునట్లు చేయవలయునుగాని భయపడునట్లుచేయరాదు పైన కుంభిపాకనరకమున్నదని తలంచవలయును మాటలు వచ్చిన తదుపరి ఎన్నిచేసినా సమర్థించుకోగలరు మాటలురాని పిల్లలబాధ్యతలో తల్లి కల్పవల్లిగా నుండవలయును గరళవల్లికాకూడదు యిక దుష్టదము చూతమన్న దువ్వెనవేసి అనగబట్టి పెరుకుటతోటి పునికకు దువ్వెనపండ్లు దిగబడి వునికమంట ఎత్తుకొని అరుచుచుండ కాళ్లతో బిగియబట్టి వకనాడుదువ్వినరెండవనాడుచస్తే అంచుకు రారు దువ్వుకొనవలయునన్న ఏడ్పులు ఈడ్పులు తప్పవు ఇది తల్లులలో ఎక్కువఉన్నది నొప్పిగలుగకుండా దువ్విన మరునాడంత మోడిపెట్టరు అనుకున్నంత మాత్రముతో గుండెలపిసిపోతూఉంటే ఎక్కడ కూర్చుంటారు సరోజా తల్లిఅన్నంత మాత్రముతో తల్లిగాదు పిల్లల అల్లకల్లోలము చేసి ఏడ్పించి కొట్టి తిట్టి వారి సుఖదుఃఖముల గమనించక భవిష్యత్తును పరికించక పాడుచేసినది మాతగాదు మారి అన్నది నిర్మల.

మరొకాయమ సరోజనుచూచి సరోజా పిల్లల క్రిందవేయు చిన్నచిన్నగుడ్డలు చల్లనీళ్లలో పిండి ఆరవేయుచూవచ్చిన రోజులుగడచగా వాటిలో ఏదోవక దుర్వాసన జయలువేరును అవాసన పిల్లలు పీల్చడముతోటి రోగగ్రస్తులగుదురు తల్లికి కూడా మంచిదికాదు ఆగుడ్డలను కాలేనీళ్లలోవేసి కొంచెముసేపు ఉండనిచ్చి ఉతికి అరవేయుటగాని ఉండవలయును ఉయ్యాలలో నల్లులు చీమలు మొదలగునవి

వేకుండా చూచుచుండవలయును గుడ్డ ఉయ్యాల పనికిరాదు ఇటుఅటు పొర్లుటకు వేలులేకుండును నడుము వంగుటచే వెన్నెముఖకు శక్తితగ్గును వంగును ప్రక్కల గాలిరానివ్వదు శ్వాస నిశ్వాసలు తనవితానే పీల్చవలసి వచ్చును తల్లిఊచునప్పుడు కుదించినట్లయి దేహములో అస్వస్థత ఏర్పడును నెత్తురు చక్కగా ప్రవహించదు. ఆరోగ్యమునకు నిరోధకముగా నుండును, తొట్టినేకట్టించుమువుగాని ఈ నవీనపద్ధతినవలంభించవద్దు ఇల్లూ వాకిలిలేని మందభాగ్యులు అడవులలోచేయుపని ఊరునాశ్రయించి పిల్లల పాడుచేయుచున్నది అట్లచేయకుము గుడ్డలు పరుచునప్పుడు చక్కగా పరచవలయును మడతలుపడి వత్తుకొనుచుండినను ఏమయినాకరచుచుండినను చెప్పుటకు నోరులేక పొర్లనుచేతగాక ఏడ్చుచుందురు మాటలు వచ్చునందనుక పిల్లకష్టముల తల్లిగ్రహించి శాంతముతో శ్రద్ధతో చూడవలయును. లేకున్న ఆపాపము తల్లినాశ్రయించును వారిని కంటికి రెప్పగాచూచి కాపాడుట తల్లివంతు ఎత్తుతెలియని వారిచేతికి ఎత్తుకొననిచ్చుట ఏడ్చుచుండినను నిర్దయతో పరికించక ఉండుట రోగులై నిరంతరదుఃఖులైవుండ వైద్యులకుచూపక లోభులై కరుణాదూరులై ఆలస్యముచేసి ఆగంతుక మృత్యువువాతవేయుట మరింత పాపము ఆపాపము మరుజన్మకు పిల్లలులేని తల్లిగా మార్చు భర్తకు రెండవ వివాహము చేయించి సవతిపిల్లల తల్లియై భర్తప్రేమను చూరగొనుటచూచి నిరంతర దుఃఖముతో కుందచేయును ఊరకకాదు కన్నట్టుగాదు కన్నవారిని కన్నీటిలో ముంపక కరుణతో కాపాడవలె సరోజా జాగ్రత్త అన్నది నిర్మల.

మరోకాయమ సరోజనుచూచి అమ్మా పిల్లలఏడ్పును గమనించుట మహాకష్టము పాలకొరకయ్యో, కడుపునొప్పియో, కన్నునొప్పియో, నిద్రపట్టకనో దృష్టి దోషమో, జ్వరబాధో, బాలగ్రహదోషమో, పడిశమువల్ల తలనొప్పియో మల విసర్జన చక్కగాగాక కడుపునొప్పియో, కడుపులోబాధో, ఉన్నచోట గాలిమొదలగు వాతావరణము ఆవరణము బాగలేకనో గర్భవతులు అంటూముట్టూ అయినవారు వారిని తగిలినవారు తగులుటతోనో అంతలో.

సరోజ పిల్లల గర్భవతులు తగులరాద అన్నది.

కానుతల్లి మినహా వేరు గర్భవతులు సన్నపిల్లల తగులరాదు. దాన పిల్లలకు జబ్బుగలుగును తెలియక చేయువారు అనేకులు ఉన్నారు ఈవిషయాదులు చెప్ప వలసినవిధి జోస్యులపై నున్నది. ఆశాస్త్రం కొంతదెబ్బతినుటతోటి మరింత

అక్కా ఈపల్లుపొడి చేసుకొన వల్లుబరువయిన నల్లతుమ్మచెక్క బొగ్గుల దంచి కొంచెముగా ఉప్పుచేర్చి పెట్టుకొనుట చాలామంచిది. బొగ్గుపొడి పండ్లకు కీడుచేయదు. పండ్లు తెలుపుగాను అవును అయితే కట్టెభేదముండును నల్లతుమ్మకట్టె బొగ్గు శ్రేష్టము అనిమాయమ్మ అందరికీ చెప్పుతుంటుంది ఇదీ నాకు తెలిసినది అందరూ చెప్పుతుంటే నాకుతెలిసినది నేను చెప్పినాను ఇంతేఅక్కా అన్నది.

ఆవేళనుంచీ ఎక్కడుండినావే వకటిచెప్పినా మంచిదిగాచెప్పినావు ప్రతిఇంటా ఉండతగినది ప్రతిస్త్రీ చేసిపెట్టతగినది బజారులో నానాయిటిక పొల్లు వరిపొట్టు బూడిదెలు కొనేదానికన్నా వకతూరి తయారుచేసుకున్న సంవత్సరముండును పొట్లాలుకట్టివేసినాసరే డబ్బీలోపెట్టుకున్నాసరే కాగితాలు చిత్తులుచేసి పోసిపెట్టుకున్నాసరే మంచిపనిఅని అందరన్నారు.

ఔను మానవత్వ మెత్తినందుకు ఉపకరించునని నేర్చుకొని వుపకారము చేసినవారే మానవులు లోకానికి లోకులకు వుపకరించక పోయినవారు వుండి ప్రయోజనమేమి అన్నదొకాయమ.

అంతలో జ్ఞానాంబవచ్చి ఏమమ్మా పగలంతా తలవాల్చలేమ లేవండీరేపు చూతము అంటూ అందరికీ పండుకొన వసతులు కల్పించినది.

రాము మగవారికి వసతులు ఏర్పరచినాడు అందరూపోయి సుఖంగా నిద్రపోయినారు.

మరునాడు రెండు వివాహములు సంతోషముగాముగించి ఎవరెవరి నివాసములకు వారు పోయినారు.

రాగమ్మా అటుపై సరోజ గర్భమును ప్రాణమువలె నియమ బద్ధమై నవ మాసములు కాపాడి పున్నమ చంద్రుమించు కుమారుని కని అయిదవ మాసములో తల్లిగారి ఊరికివచ్చినది. అప్పుడు ఆమెనుచూచినేను ఏమమ్మా వంటచేసేది నేర్చుకున్నావా అన్నాను.

ఆమాటకు అతుక్కున్నట్లు శివప్రియ నవ్వుతూ వంటచేసేది నేర్చుకునే పండు వంటి కొడుకు చంకకువచ్చి వుండేది అన్నది.

సరోజ ఆమాటకునవ్వుతూ నా అంచుకువచ్చి చెడిపోయిన కాపురాన్ని యుక్తియుక్తముగా సవరించి సాగనంపినావు పంటపండింది. పండినఫలం ఇదుగో అని బిడ్డను నాచేతికియిచ్చి మోకరించి నమస్కరించి కూర్చొమ్మని చీరా రవిక

తెచ్చి విభవనొటచే చేతికిచ్చుటకు వీలులేక క్రింద పెట్టి తీసుకొమ్మని నమస్కరించినది.

ఎందుకమ్మా యింతపని అని నూరేండ్లు బహుకుటుంబినివై పుత్రపౌత్రులతో సిరిసంపదలతో సుమంగళివై బ్రతుకమని దీవించి నాను.

ఇంతపని ఎందుకంటావా జీవితమంతా చీకటిచేసుకొని అధోగతిపాలవు నన్ను మేలుకొల్పి తేజస్సునిచ్చి సాగనంపి సర్వసంపదలతో సర్వసౌఖ్యములతో సుఖపడచేసినందుకు నీవానాడు జ్యోతిని వెలిగించకున్న ఈవెలుగెక్కడిది అన్నది కుమారునిచూపి సరోజ.

నేనామెనుచూచి ప్రక్కన కూర్చుండబెట్టుకొని సరోజా ఆనాడు మేము మాట్లాడినమాటలు వెగటై ఈనాడు ఎంత రుచించినవోచూడు స్త్రీకి ఓర్పేముఖ్యము భర్తను సేవతో వలపుతో బంధించుకొని సుఖపడవలయును. భక్తిశ్రద్ధలతో భగవంతుని బంధించుకొని యిహపరములలో శ్రేయస్సును పొందవలయును. భర్తకడ వలపు పిలుపులు భక్తిశ్రద్దలు సేవావినయములు లేకున్న సుఖమడుగంటును. భగవంతునియెడ భయభక్తిశ్రద్ధలు ఆచరణ విధానము లేకున్న యిహపరములు రెండూ ధూళిదూసరితములై పోగలవు. తల్లీ భగవంతుడు తనభక్తవర్గములో తన్నుచేర్చుకొని తన ఇంటికి తానిచ్చు ఆతిథ్యము స్వీకరింప తప్పక నిత్యకృత్యముగ వచ్చుచు పోవుచుండునట్లు చేసుకున్న స్త్రీదే యిహమూ పరము మళ్లీవచ్చుజన్మము మూడం దాల ముల్లోకాల దియ్యవలె వెలుగుతుంది. చుక్కల్లో చందురుడౌతుంది. దేవ దానవమానవులలో దేదీప్యమానమై ప్రకాశిస్తుంది.

సీ॥ సంతతంబును కృష్ణ సంకీర్తనంబులు
వీనులకింపుగా వినగవలయు
హర్షంబు తోడుత హరినామ కథనంబు
పాటల నాటల బరగవలయు.
నారాయణుని దివ్యనామాక్షరంబులు
హృద్వీధి సతతంబు నెన్నవలయు.

కంజాక్షులీలలు కాంతారములనైన
భక్తియుక్తంబుగాబాడవలయు॥

తే॥ వెఱ్ఱిమాడ్కిని లీలతో విశ్వమయుని
నొడువుచును లోకబాహ్యత నొందవలయు
నింతయును విష్ణుమయమని యెరుగ వలయు
భేద మొనరింప వలవదు మేదినీశ॥

అన్నది భాగవతము దీనిననుసరించి షట్కర్మాచరణ ఉండిన ఏగురువు తోనూ పనిఉండదు. అంతకు కావలసి వచ్చిన దైవమే తోడుచేయును.

ఇక భర్తయన్ననో డొక్కలో చిన్నపిల్లలు సుఖనిద్ర చెందినట్లు ప్రక్కలో నిద్రపోవలయును. నాభార్య ఎక్కడపోయినా అపకీర్తి తేదనియు తన్నువలచిన దనియు ధర్మబద్ధయనియు తనయశస్సునుకోరునది యనియు పేరు ప్రతిష్ఠల నిల్పుననియు లోకవ్యవహారములు చక్కగా తెలియును లోకువేదీలేదనియు నమ్మి నిమరించునట్లు చేసుకొనిన దాంపత్య సౌఖ్యమే సౌఖ్యము ఆస్త్రీదే కాపురము సరోజా చూడు పండువంటి పిల్లవాడు పండినాడు మగని దూరముచేసుకొని ఉండిన ఎట్లు వచ్చును. కాదని వచ్చిరిపో తండ్రిలేని పిల్లలై వారుసంఘమర్యాదలోగల్గు పరా భవములకు దుఃఖితులై తల్లినేమనలేక వారిపుట్టుకకువారు చింతించిన పాపము తలి నిచేరి ఏడుజన్మలకు విధవత్వము వంధ్యత్వము సంప్రాప్తింపచేయును. మలమల మాడ్చును స్త్రీకి తనసంతతి తనంతటివారై తనకు అండగానిల్చుకున్నంతవరకు యింటా బైటా దుర్బలత్వమే నన్నారు. ప్రథమములోనే కొడుకునే కన్నావు అందులో రాము నోటినుండీ ఊడిపడినట్లున్నాడు, పుట్టినింటికీ కాలుపెట్టినింటికీ కీర్తిగడించనున్నావు. గడించినావు. స్థాయిగా చిరస్థాయిగా హాయిగా కాలము గడుపుతల్లీ అన్నాను సంతోషపడింది ఇంటివారందరికీ సంతోషమయినది. ఆడబిడ్డ బాగా కీర్తిగౌరవాలతో బ్రతుకుతున్నదంటే తల్లి ఇంటివారికి అంతసంతోషమమ్మా.

రాగమ్మా ఆ అమ్మాయి మంచిపేరు ప్రతిష్టలతో ఇద్దరు కొడుకుల ఒక ఆడబిడ్డను కన్నది మంచిస్థితిలోనున్నది కొంతవరకూ పెద్దవారు పిల్లలకు చెప్ప

డముతోటి స్నేహితులు మంచివారు దొరుకడముతోటి గురువు సహపాఠీలు బుద్ధిమంతులు బుద్ధిగరువు ధీమంతులు గావడముతోటి నడవడిక కొంతవరకుమారును ముందుజన్మ కర్మచెడ్డదయ్యే తలిదండ్రులు అన్నతమ్ములు అక్కచెల్లెండ్రు బంధుమిత్రులు సహపాఠీలు గురువులు చెడ్డవారుగా తడస్థింతురు ప్రతివాడు అభివృద్ధికిరాక పతనమగుటకు కారణము ఇదే. చూడు సరోజకు బాల్యమున తల్లి దండ్రి గురువు సహపాఠీలు మంచినడక నేర్పినందున కర్మ ఆవరించినను ఈ మంచి నడక వెంటనే మేలుకలిపినది. మొలుకున్నంతనే అది సహాజరిచిమేలుచేసి అధోలోకమునుండి ఊర్ధ్వలోక పర్యంతం నిరాఘాటముగా పంపినది రాగమ్మా పిల్లల తీర్చడములో నున్నది కొంతవరకు మేలువినక పాడైపోవువారంటావా వారిజన్మ కర్మ అట్టివారికికూడా కొంతతోడ్పడును అన్నది కరుణ.

రాగమ్మ కరుణ మాటలకు ఆశ్చర్యపడుతూ కరుణానీకు జ్ఞాపకశక్తి చెప్పగల వాక్చతురత భగవంతుడుబాగా పమకూర్చినాడు ధన్యజీవివన్నది.

ఎక్కడికితల్లీ సర్వము భగవల్లీల నాయట్టికష్టజీవి మరొక్కరుండ రనుకుంటాను సర్వకష్టములుపడి పేరినాశ్రయించి స్థిరప్రజ్ఞతో నిలుచుకొని ఉన్నాను. కడకా పరమేశ్వరుడేమి చేయగలడో సర్వము వానియిష్టమని గడ్డిని గంపకు పెట్టుచుండగా,

ఏమింకచాలునా అన్నది రాగమ్మ.

ఔనుతల్లి సంజవేళఅయినది పోదాము సంధ్యావిధి ఉన్నదికదా అన్నది కరుణ.

సరేనని రాగమ్మ యింటిలోకి పోయినది వింటూఉన్న పెండ్లివారు పెండ్లియింటికి పోయినారు కరుణగడ్డిగంప ఎత్తుకొని అవ్వల ఇంటిలోకి పోయినది.

రాగమ్మయింట ప్రవేశించి చూచుసరికి కమల త్రిదేవీ సహస్రనామములు రెండు అంచుననుంచుకొని లక్ష్మీసహస్రనామములు చెప్పుచుండెను. శాంతమ్మ సహస్రనామము చెప్పకుంటూ కార్యములు చేయుచుండెను.

అంతలో కరుణ కాళ్లూచేతులు కడుగుకొని వచ్చి దేవునికి నమస్కరించి కూర్చొని రాగతాళ యుక్తముగా దైవధ్యానముచేయ ప్రారంభించెను.

రాగమ్మవారి ఆచరణ విధులచూచి ఆనందపడుతూ రాత్రికి మరింతకదిపి వినతగినవి వినవలెనని యువ్విళ్లూరుతూ కరుణ గట్టిగ చెప్పు నాపాడుచెవులతో నేనూ వింటానన్నది.

కరుణా కములా కలిసి స్వరములుకలిపి చెప్పనారంభించినారు.




శ్రీ దుర్గా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.